పునర్ముద్రణాద్యధికారములు
గ్రంథకర్తవి.

ప్రథమ ముద్రణము
ఆగస్టు 1982
విజయ ఆర్ట్ ప్రెస్
తెనాలి - గుంటూరు జిల్లా.

ముఖ చిత్రము

మూల్యము- హాఫ్ కాలికో అట్టబైండు రు. 100-00
సాదా (లింపు) బైండు రు. 100-00

ఈ గ్రంథము తిరుమల-తిరుపతి దేవస్థానమువారి
ఆర్థికసహాయముతో ముద్రింపబడినది.

గ్రంథప్రాప్తిస్థానము :
M. V. సుబ్బరామశాస్త్రి లేక
M. V. సుబ్రహ్మణ్యం, B. Sc. B. Ed.
21 దయానందకాలనీ - లక్ష్మీపురం (P. O.)
వరంగలు - 13

# ప్రాస్తావికం కించిత్

శ్రీ భగవాన్ వాల్మీకి మహర్షి 6గి అరవై ఆరు వేల శ్లోకములు గల శ్రీ మ।దామాాయణమును రచించెను.

ఇందు 24 ఇరువదినాలుగు వేల శ్లోకములుగలది, శ్రీరాముని చరిత్రాత్మకమయిన రామాయణము. 42 నలభై రెండు వేల శ్లోకములు గలది, శ్రీరామచంద్రునకు వసిష్ఠ మహర్షి తత్త్వము నుపదేశించిన రామాయణము. ఈ రెండును కలసియే సంపూర్ణ రామాయణముగును. ఈ విషయమును వాల్మీకిమహర్షియే భారద్వాజమహర్షితో స్వయముగ జెప్పినటుల వాసిష్ఠ రామాయణ (యోగవాసిష్ఠ) మునందు కలదు-

ఇందు తత్త్వోపదేశాత్మకమగు 42 నలభై రెండు వేల శ్లోకములు గల రామాయణమునే "వాసిష్ఠ రామాయణమ"నియు, "యోగ వాసిష్ఠమ"నియును ప్రసిద్ధముగ వ్యవహరించుచున్నారు ప్రాచీనులు, నవీనులును-మహర్షి వాల్మీకి విశ్వామిత్రాగమన సందర్భమున సముచితముగ నీగ్రంథమును విభజించెను- గ్రంథ సరళినిబట్టి యిద్దానిని ఋజువుచేయుటకు తగిన ఆధారములుగలవు-

శ్రీకృష్ణ భగవానుని యుపదేశాత్మకమగు భగవద్గీత పదిునెనిమిది యధ్యాయములతో నలరారుచున్నట్లు ఈవాసిష్ఠ రామాయణము, శ్రీరామ, వసిష్ఠుల, పదునెనిమిదిరోజుల యుపదేశముతో నలరారు చున్నది-

భగవద్గీతయందు నిష్కామకర్మము అతివిస్తృతముగ ప్రతిపాదించబడినది-తమ రాజ్యసంపాదన కుద్యుక్తుడయిన అర్జునుడు యుద్ధమునకు అభిముఖుడైకూడ, భీష్మద్రోణాది బంధువర్గమునందలి ప్రేమాతిరేకమున పరాఙ్ముఖుడైనందున, శ్రీకృష్ణ భగవానుడు అతని (అర్జునిని) క్షత్రియజాతికి స్వధర్మమగు యుద్ధమునందు ప్రవేశపెట్టుట యావశ్యకమగుటచే అందు నిష్కామకర్మోపదేశము విస్తరించి ప్రతిపాదించుట ప్రసక్తమయినది- (అతిప్రసక్తము)

ఈ వాసిష్ఠ రామాయణమునందు అద్దానికి అంతటి ప్రసక్తి లేదు- పైగా శ్రీరామచంద్రుడు చిన్ననాటనే తన తండ్రి యనుమతితో తీర్థ

యాత్రనుసలిపి వివిధనదులందు, నదములందును, స్నానమాడుటవలనను, వివిధ దేవతాసందర్శనమువలనను, తీవ్రవైరాగ్యమును జెందియుండుటచే ఇతనికి తత్త్వోపదేశమే ఆవశ్యకమయినదికాని, నిష్కామకర్మోపదేశమంతగా ప్రసక్తము కాలేదు.

కనుకనే వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు తత్త్వమును (బ్రహ్మజ్ఞానమును) ఉపదేశింపదలచి అందుకు సాధనముగ అష్టాంగ యోగము నుపదేశించెను. ఇందు తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనా క్షయములు మూడును, ఒకదానికొకటి పరస్పర కారణములనియు, ఇందు ఏ యొకటి లేకున్నను రెండవది కలుగనేరదనియు నొక్కి వక్కాణించబడినది. ఈప్రక్రియ శ్రీ శంకరభగవత్పాదుల కంతగ సమ్మతము కాకున్నను పాతంజల యోగశాస్త్రమునందు ఈయది ముఖ్యముగ ప్రతిపాదింపబడి యుండుటచే నీవాసిష్ఠము అద్దాని ననుకరించినడచినది.

కాని పారమార్థికమగు తత్త్వమును నిరూపించుటలో మాత్రం శ్రీశంకర భగవత్పాదులు యుపనిషత్తుల నాధారపరచుకొని నిరూపించిన "అఖండాద్వితీయ సచ్చిదానంద పరబ్రహ్మమే" ఇందునుగూడ నిరూపింపబడినది. "జీవబ్రహ్మైక్యము" "ప్రపంచ మిథ్యాత్వము" ప్రపంచసృష్టినిగురించి బ్రహ్మకు వివర్తోపాదాన కారణత్వము మున్నగు విషయములు శ్రీశంకరుల సిద్ధాంతమునకు తు. చ. తప్పకుండ ఇందున గూడ ప్రతిపాదించబడినది.

ఈవిషయము సోదాహరణముగ ఆయాఘట్టము లందలి శ్లోకములతోసహా నేనిదివరకు వ్రాసి ముద్రించబడిన ప్రథమ భాగమున చదువరులకు తేటతెల్లముకాగలదు. అఘట్టస్థములను అందలి శ్లోకములను ఇపుడీ రెండవ భాగమునం దుదాహరించుట చర్వితచర్వణమనియు ముద్రణవ్యయము కాగితము అత్యధిక మూల్యములో నడచెడి యీకాలమున దుస్సాధ్యమనియును తలచి యుపేక్షించుచున్నాను.

మరియు లోగడ ముద్రితమై ప్రచారములోనున్న వైరాగ్య ముముక్షువ్యవహార ఉత్పత్తి ప్రకరణములతో నలరారుచున్న ప్రథమ భాగమున అతివిస్తృతమయిన ఉపోద్ఘాతమే కాక పలువుర ప్రముఖ

పండితుల యభిప్రాయములును జగద్గురు పీఠాధిపతుల ఆశీస్సులు పొందుపరచబడినవి-

ఈ రెండవభాగమున ఆ రెండంశములందుగూడ నేను కుంటు పడితిని- పీఠాధిపతులు బహుదూరదేశమున సంచారయాత్రలో నున్నారు- ప్రముఖులయిన పండితులు అంతరించిరి- ఒకరిద్దరు మిగిలి యున్నను అతివృద్ధుడయిన నేను వారియొద్దకు వెళ్ళజాలని స్థితిలో నుండుట పోస్టుద్వారా గ్రంథమునుపంపి అభిప్రాయమును సేకరించుట కూడ ఈరోజులలో బహు ప్రయప్రయాసలతో కూడియుండుటయు దానినికూడ నేను నెరవేర్చలేక పోవుటకు ముఖ్యకారణములయినవి-

ఈ గ్రంథము 42 వేల శ్లోకములను నేను చాలకాలము క్రిందటనే అనువదించి వ్యావహారికభాషలో వచనరూపముగ వ్రాసియుంటిని- వ్యావహారికభాష నుపయోగపరచుటకు తగినకారణముకూడ ప్రథమ భాగము యొక్క యుపోద్ఘాతములోనే వ్రాసికొనియున్నాను- ఇందు మరలవ్రాయుట అనవసరము-

1966 సం॥రములోనే మొత్తము గ్రంథమంతయు వ్రాతపూర్తి యయి ప్రథమభాగముకూడ ముద్రితమయినది- తరువాత కాలము గడచినకొలది కాగితముయొక్క ధర, ముద్రణవ్యయము మిన్నుముట్టు చుండుటచే నింక మిగిలిన భాగములను నేనచ్చొత్తింపజాలనని యుపే క్షించియుంటిని- ఇంతలో తిరుమల-తిరుపతి దేవస్థానమువారు ప్రాచీన గ్రంథ ముద్రణమునకు ద్రవ్యసహాయము చేయుచున్నారని విని తిరుపతి వెళ్ళి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారిని కలియగా వారు నావల్ల దరఖాస్తు తీసికొని ఒక్కొక భాగమునకు రు. 5000-00 అయిదువేల చొప్పున ద్రవ్యసహాయముచేయుట కంగీకరించి వ్రాతమూలకముగ అనుమతి నిచ్చిరి- వారి ద్రవ్యసహాయమే నేను మరల నీభాగముల నచ్చు వేయించ సంకల్పించుటకు దోహదమయినది- కాని నేను తిరుపతి దేవస్థానమువారి ద్రవ్యముతో నేభాగమున్ను ముద్రణము కానేరదని సంకటపడుచుండగా ఈ గ్రామమునందలి సుప్రసిద్ధ గణకులు (ఆడిట

మిత్రులగు కె. మాధవరావుగారు తాము కొంతవరకు సహాయపడియెదమని వాగ్దానమొసఁగిరి- వీరి వాగ్దానము నాకు మిక్కిలి ప్రోత్సాహ జనకమాయెను-

అంతట నేను గ్రంథ ముద్రాపణకార్యము నారంభింపదలచి, నా నివాసస్థలమగు ఓరుగల్లు (వరంగలు) నందు ముద్రణాలయములను విచారించగా ఏముద్రణాలయమునకూడ ఈగ్రంథముద్రణమున కనువయిన టైపు లభింపలేదు- ముద్రణాలయాధికారుల నెందరినో స్వయముగ కలిసి విచారించగా ఈగ్రంథము యీగ్రామమున ముద్రణము కానేరదనియు ఇప్పటి ముద్రణాలయములన్నియు జాబ్ వర్కులో నడచుచున్న వనియు, గ్రంథముద్రణమున కనువయిన టైపుకూడ ఇక్కడ లభించ దనియును చెప్పిరి-

తదుపరి "దేవుడు వరమిచ్చినా, పూజారి వరమీయలేదన్నట్లు" దేవస్థానమువారు ద్రవ్యసహాయము చేసినను, ముద్రణాలయము లభించ లేదని నిర్విణ్ణుడనై ఒక సంవత్సరకాలము ఉపేక్షించితిని-

ఇంతలో తిరుపతి దేవస్థానమువారు "మీకు గ్రంథముద్రణమున కై గ్రాంటిచ్చి యొక్క సంవత్సర మయినదనియు, అయినను ఇంతవరకు 16 పేజీలుకూడ (అనగా రెండుఫారములుకూడ) ముద్రించలేక పోయి నారనియు, కావున మీకు దేవస్థానవారిచ్చిన గ్రాంటును 10 పదిరోజుల లోగా గ్రంథముద్రణము నారంభించినట్లు మీరు మాకు తెలుపనిచో రద్దగునని యును" నాకు నోటీసు నిచ్చిరి-

అప్పుడు చేజిక్కిన యవకాశమును జారవిడచుకొనుచున్నామని విచారపడి గ్రామాంతరములందు ముద్రించుటకు సంకల్పించి విచారించగా తెనాలి గ్రామమున నొక ముద్రణాలయమున ముద్రించుట కవకాశము లభించి ముద్రణ మారంభమైనది- దానితో దేవస్థానము వారిచ్చిన గ్రాంటు నిలచినది- ఇప్పటికి అనగా 82వ సం॥రం ఆగస్టు నెలలో ముద్రణ మారంభమై డిసెంబరు ఆఖరునాటికి యొక భాగము ముద్రణము ముగిసినది-

అసలు వాసిష్ఠ రామాయణమను గ్రంథము 1. వైరాగ్య, 2. ముముక్షువ్యవహార, 3. ఉత్పత్తి, 4. స్థితి, 5. ఉపశమ, 6. నిర్వాణము, అను 6 ఆరు ప్రకరణములతో నలరారుచున్నది- ఇందు నారవది యగు నిర్వాణప్రకరణము పూర్వార్థము, ఉత్తరార్థము, అని రెండు భాగములుగనున్నది- మొదటి 5 అయిదు ప్రకరణములుకలసి యెంతటి గ్రంథమో ఈ నిర్వాణప్రకరణము రెండుభాగములుకలసి సర్గసంఖ్యలోను ప్రతిసంఖ్యలోను అంతకు ప్రవృతముగ నున్నది-

ఈ మొత్తము గ్రంథమును నేను 4 భాగములు చేసి అచ్చు వేయించ దలచితిని- ఇందు, 1. వైరాగ్య, 2. ముముక్షువ్యవహార, 3. ఉత్పత్తి ప్రకరణములు ప్రథమ భాగముగను, స్థితి, ఉపశమప్రకరణములు రెండును, రెండవభాగముగను, నిర్వాణప్రకరణము, పూర్వార్థ ఉత్తరార్థములు రెండునుకలిపి రెండుభాగములుగను, విభజించి అచ్చు వేయించదలచితిని. నాప్రాతప్రతులలోని ప్రతిసంఖ్యనుబట్టి చూడగా నీయది యుచితమని తోచినది-

ఇట్లు చేసినను ఒకొక్కభాగము సుమారు 600ల పేజీలకు తగ్గకుండ ముద్రితమగుచున్నది- ఇందు ప్రథమభాగము మూడుప్రకరణములును 1966కు లోగడనే ముద్రితము కావించి లోకమున కందించితిని- ఆప్రతులన్నియు ఖర్చయినందున ప్రస్తుతము దానినికూడ పునర్ముద్రణము గావింపదలచితిని- ఇప్పుడు స్థితి, ఉపశమప్రకరణములు రెండును రెండవభాగముగా ముద్రితమయినది- ప్రస్తుతమిప్పుడు నిర్వాణ ప్రకరణము పూర్వార్థము ముద్రణము జరుగుచున్నది- 5-6 మాసములలో సిద్ధమును ముద్రితము కాగలదు-

కాని, ముద్రణాలయము గుంటూరుజిల్లాలోనిది- నేను వరంగల్ జిల్లావాడను- అయిన కారణమున ప్రూఫ్ నేను స్వయముగ జూచు కొనెడి యవకాశము లభించలేదు- అప్పటికిని వరంగలునుండి మూడు మాసములు సీజన్ టికెట్టుతో తెనాలి తిరిగితిని- కాని యాపైన అట్లు తిరుగుట బహువ్యయసాధ్యము ప్రయాససాధ్యమునయినది- అట్టి స్థిరావాసము నిరవకాశమయినది- అప్పుడు అనన్యగతికముగ ప్రూఫ్ చూచెడి బాధ్యతకూడ ప్రెస్సువారికే వదిలితిని- ఆప్రెస్సువారును నా

యదృష్టవశమున అతిసుజనులు, శాంతియుతులు, పారమార్థిక స్వభావులు నయినందున ప్రూఫ్‌లను జాగ్రతగచూచి నిర్దుష్టముగనే ముద్రించిరి- కాని నొక్కడనో నూటికి, కోటికి నొక్క యక్షరము పొరపడుట యొంతటి వారికయినను తప్పదు-

అయ్యది నేను స్వయముగ ప్రూఫ్ చూచుకున్నను జరుగును- అది యనివార్యమేయగును నాకుకూడ- కాని నేను స్వయముగ ప్రూఫ్‌లు చూచుకొనుచో చాలకాలము క్రిందట వ్రాసిన గ్రంథమునందు ప్రకృతమున నవీనమయిన భావాంతరము పొడసూపి కొంతవరకు చేర్పులు, మార్పులుచేయుట కవకాశముండెడిది- ఇప్పుడయ్యది లేదు- ప్రెస్సువారు నేనువ్రాసినదానిని వ్రాసినట్లే ముద్రించగలరు కాని, యందు చేర్పులు, మార్పులును చేయ సాహసించరుకదా! అట్లు సాహసించుట యుచితముకూడ కాదుకదా!

కావున నేను వ్రాసినదానిలో నంతకంటె రమ్యమయిన భావాంతర మేమయిన గ్రంథానుగతముగ పాఠకులకు దోచినచో నాయెడల ఈర్ష్యాసూయలను వహించక నాకుగలిగిన యిబ్బందులను, ఇక్కట్టులను గమనించి సరిదిద్దుకొని గ్రహియింతురని నేను సవినయముగ ప్రార్థించుచున్నాను-

T. T. దేవస్థానమువారు ఈ గ్రంథ ముద్రణమునకు చేసిన ఆర్థిక సహాయము ప్రస్తుతకాల పరిస్థితినిబట్టి చాలనందున, వరంగల్ నగరమునందు, సుప్రసిద్ధ "ఆడిటరులు" "వదాన్యశేఖరులు" నగు శ్రీ జి. యస్. మాధవరావుగారు మిగిలిన ద్రవ్యమునొసగిరి- కాన ముద్రణము సమాప్తమయి ప్రచురితమయినది-

వరంగలు
దయానందకాలనీ నివాసి

ఇట్లు, సుధీజనవిధేయుడు
గ్రంథకర్త.

ఆంధ్రవాసిష్ఠ రామాయణము. రెండవ భాగము

# విషయసూచిక

## 1. స్థితిప్రకరణము

## 2. ఉపశమప్రకరణము

సంపదూపము నిరూపింపబడటం లేదు. సచ్చిదానంద రూప బ్రహ్మ జ్ఞానంవల్ల సంసారానర్థం నివర్తిస్తుంది కాని, మాయాశబలిత బ్రహ్మ జ్ఞానంవల్ల సంసారానర్థం నివర్తించదు. (తొలగదు)- అది తొలగని దే జీవునికి ముక్తి లేదు- అది లేని దే ఈ శాస్త్రమువల్ల ప్రయోజనం లేదు- కనుక ఏమిటి దీని తత్త్వం అని విచారించడం అవసరం-

ముముక్షువునకు నిష్ప్రపంచ బ్రహ్మను బోధించుట ఉచితమా ! లేక సచ్చిదానంద బ్రహ్మను బోధించుట ఉచితమా ! అనేది ఇక్కడ విచారణీయాంశము. ఏది నిష్ప్రపంచమో అది సచ్చిదానందరూపమే. ఏది సచ్చిదానందరూపమో అది నిష్ప్రపంచమే. ఇందులో సందేహం లేదు. కాని బోధనాపద్ధతిలో మాత్రం కొద్ది భేదం వుంది. కనుక ఏది ఉచితమనేది విచారించాలి. ప్రపంచము ప్రత్యక్షముగా కనిపించుచుండ తద్వాసనలు మనస్సులో పెనగొనియుండ, వానిని రూపుమాపుటకు నిష్ప్రపంచ బ్రహ్మమును బోధించుటయే ఉచితము- ఆవల సచ్చిదానందబ్రహ్మ సాక్షాత్కారము అతనికే కలుగుతుంది. అయ్యేది (నిష్ప్రపంచబ్రహ్మజ్ఞానము) అధ్యారోపాపవాద న్యాయముచేగాని సిద్ధించదు. స్వరూప లక్షణమువలన స్వరూప విశేషప్రతిపత్తి (జ్ఞానము) సిద్ధిస్తుంది కాని నిష్ప్రపంచత్వము సిద్ధించదు. అందువల్ల అధ్యారోప అపవాద న్యాయముచే బ్రహ్మయందు నిష్ప్రపంచత్వ సిద్ధికొరకు బ్రహ్మకు తటస్థ లక్షణమును చెప్పవలయును. అధ్యారోపాపవాద న్యాయముచే నిష్ప్రపంచత్వ సిద్ధికొరకు, తటస్థలక్షణమున్నూ, స్వరూపవిశేష ప్రతిపత్తి కొరకు స్వరూపలక్షణమున్నూ అని శాస్త్రకారుల సిద్ధాంతము- కనుకనే యిచట వసిష్ఠుడు శ్రీరామునకు నిష్ప్రపంచబ్రహ్మను బోధింప దలచాడు. అందుకొరకు బ్రహ్మయందు ప్రపంచాధ్యారోపమును ప్రతిపాదించవలసివచ్చినది- కనుక "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను సృష్టికర్తృత్వమును బోధించెడి శ్రుతియొక్క అర్థమును నిరూపించాడు ఉత్పత్తి ప్రకరణంలో- తదనంతర ప్రవృత్తమయిన ఈ స్థితి

ప్రకరణంలో "యేనజాతాని జీవంతి" ఇత్యాది ప్రపంచస్థితి ప్రతిపాదక శ్రుతులయొక్క అర్థమును నిరూపిస్తూ; సృష్టి స్థితిలయబోధక వాక్యములన్నిటికీ తటస్థలక్షణమును ప్రదర్శించుటద్వారా, సచ్చిదానందైకరసమగు బ్రహ్మయందు, పరమ తాత్పర్యమని నిరూపించు చున్నారు వసిష్ఠులు–

ఇలాగే సూత్రభాష్యమునందుకూడ వ్యాసులవారు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను మొదటి సూత్రమునందు సంసారానర్థనివర్తకమయిన నిర్గుణబ్రహ్మ విచారము కర్తవ్యమని ప్రతిజ్ఞ చేసి అబ్రహ్మకు లక్షణమేమి! అని శంకించుకొని, "జన్మాద్యస్యయతః" అను రెండవ సూత్రమునందు తటస్థలక్షణమునే ప్రతిపాదించారు. అక్కడకూడ వ్యాసులకు నిష్ప్రపంచబ్రహ్మమును బోధించుటయందే తాత్పర్యము. కనుకనే బ్రహ్మయందు ప్రపంచాధ్యారోపము తటస్థలక్షణముద్వారా నిరూపించారు. అదే విధానమును వసిష్ఠులవారుకూడ ఇక్కడ అవలంబించారు–

కనుక అధ్యారోపవాద న్యాయముచే సిద్ధించెడి నిష్ప్రపంచ బ్రహ్మజ్ఞానమువల్లగూడ సంసారానర్థము తొలగును. కనుక దీనివల్ల జీవులకు మోక్షము లేకపోలేదు. ఈశాస్త్రము వ్యర్థముకాదు.

వసి॥ రామచంద్రా! నీకు లోగడ ఉత్పత్తి ప్రకరణంలో ప్రపంచోత్పత్తిని చెప్పాను. ఇది స్థితిప్రకరణం. ఇందులో దాని ఉనికిని గురించి చెబుతాను. ఇదికూడ మోక్షప్రదమే సుమా!

"యేనజాతాని జీవంతి" "యేనద్యౌః పృథివీచదృఢా"
"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః"
"కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్"
"ఏష హ్యేవ ఆనందయాతి" "భీషాస్మాద్వాతః పవతే"
"ఏకోదాధారభువనానివిశ్వా" "యఏకోజాలవానీశత ఈశనీభిః పరమా

శ్రుతిః "అనుజ్ఞాతా హ్యయమాత్మా అప్యపర్యస్యాత్మానం దధాతి" ఈ మొదలగు వ్యవహారకాలీన ప్రపంచ స్థితినిర్వాహకత్వమును ప్రతిపాదించెడి శ్రుతులకును, "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" ఇత్యాది ప్రళయకాలీన జగత్సత్తా నిర్వాహకత్వమును బోధించెడి శ్రుతులకును, సచ్చిదానందాద్వితీయబ్రహ్మను బోధించుటయందే పరమ తాత్పర్యము సుమా!

పూర్వప్రకరణంలో బ్రహ్మవల్ల పుట్టిన ప్రపంచము మిథ్య అని నిరూపించుటకు నేను చెప్పిన యుక్తులన్నీ, బ్రహ్మవల్ల ప్రపంచము నిలచి యున్నదనుటలో కూడా అన్వయించుకోవాలి సుమా!

ఈ ప్రపంచమనేది ఒకానొక నిరాధారమయిన చిత్రం (బొమ్మ) ఈ బొమ్మను తయారుచేసే కర్త లేడు. తయారుచేయడానికి కావలసిన రంగులేదు. ప్రమాత (జీవుడు) అజ్ఞానమనే నిదలోపడిపోయాడు కనుక ఈ బొమ్మను చూచేద్రష్టకూడా లేడు. ఇది యొక నిద్రలేని కల నిద్రలో కలరావడం సహజం. ఇది అలాంటిది కాదు నిద్రలేనికల. ముందుకట్ట బోయే పట్టణనిర్మాణమువంటిది- మనస్సులో ఉన్నది బయటకు అగపడినట్లు.

కోతులు అడవులలో గురిగింజలను, గైరికాది ధాతువులను చూచి నిప్పు అని అనుకుంటాయి. అలా మాటిమాటికి అనుకోవడం వల్ల వాటికి ఉన్న చలిబాధ కాస్తా పోతుంది- ఇది కేవలం భావనా మాత్రమే- అక్కడ నిజంగా నిప్పులేదు- అలాగే మనకు ప్రపంచం కూడా లేనిదే- లేనిదానివల్లనే భావనచేత పనులు జరుగుచున్నాయి. నీటి రూపమయిన సుడిగుండము నీరుకంటె వేరుగా గోచరించినట్లు, బ్రహ్మ భిన్నముగున ప్రపంచము బ్రహ్మకంటె వేరుగా గోచరిస్తుంది- కాని దీనికి వేరే రూపం ఏమయినా ఉన్నదా! అంటే లేదు. సూర్యుని యొక్క వెలుతురు (ఆలోకము) ఆకాశమునందు సూర్యునికంటె వేరుగా కనపిస్తుంది. దానికి వేరే రూపము ఏమయినా ఉన్నదా? అనివిచారిస్తే

లేదు. సూర్యుని రూపమే దానిరూపము. అంతే ప్రపంచముకూడ- ఆకాశమునందు కనిపించెడి రత్నకాంతుల సమూహము వంటిది ఈ ప్రపంచం- గంధర్వుల పురమువంటిది- ఎండమావుల నీటివంటిది. సంకల్పపురమునంటిది- కవులు కల్పించిన కథలోని వస్తువులవంటిది. కేవలం నిస్సారము. అయినా అతి దృఢంగా కనిపిస్తుంది. కలలోగోచరించిన కొండవంటిది- జోర్లించియున్న ఇంద్రనీలమణి వికారమయిన పెద్దగంగాళమువలె మహాభాసురంగా కంటుంది- కాని లోపల ఏమీ లేదు- శరత్కాలమేఘంవంటిది. శరత్కాలమేఘం ఎండకు మాత్రం అవుతుంది- నీరుమాత్రం చుక్క క్రింద పడదు. అలాగే ఈప్రపంచం కూడ ఆకారంలో అందంగా ఉంటుంది- అందులో సారం మాత్రం ఏమీ ఉండదు- ఆకాశముయొక్క నలుపురంగు వంటిది- (రెండూ శూన్యమని యర్థము) కలలోని కాంతాసంగమము వంటిది- భోగమనే పనిని మాత్రం నెరవేరుస్తుంది కాని అనర్థమును కలుగజేస్తుంది-విచిత్రమయిన ఉద్యానవనమువలె వికసించినట్లు కళకళలాడుతూ ఉంటుంది- కాని యిందులో రసం (మకరందం) సున్న- చిత్రపులోని సూర్యుడివలె తేజస్సు లేనిది. మనోరాజ్యమువలె అనుభూతమగునది- స్వతహాగానూ ఫలంలోను అవాస్తవము- పటములోని కొలను వంటిది- అందులో మకరందం ఉండదు- పరాగం ఉండదు- పద్మాలు ఉండవు- పరిమళం ఉండదు- అలాగే ఈప్రపంచంలో కూడా ఏమీ సారంలేదు- ఆకాశంలో నానారంగులతో కనుపించే ఇంద్రధనుస్సువంటిది- ఆకారం లేనిది. పొత్తుగా శూన్యమయినది- అరటిచెట్టుయొక్క ఆకులు గాలి సోకినా, ఎండ సోకినా, వాడిపోతాయి- అలాగే పరమాత్మవిచారము ఏమాత్రం చేసినా, సారంలేకుండా పోయ్యేది యీభౌతిక ప్రపంచం- రేచీకటి కలవాడికి కనుపించే అంధకార పుంజమువంటిది- రూపము ఏ మాత్రము లేనిది. అయినా ప్రత్యక్షమవుతుంది. నీటిలో బుడగవంటిది- శూన్యము. కల్పితాకారం కలది- ఆపాతరమణీయము- పరిణామంలో

మహాసంగ్రామమునది– ఎన్నెన్నో లేని ప్రత్యక్షానుభవము కలది. మంచువలె జీకటంతా వ్యాపించి ఉంటుంది– ప్రళయకాలపు మాత్రం ఏమీలేదు– సాంఖ్యులకి కేవలము ప్రకృతిమాత్రము– వేదాంతులకు జడశూన్యము (అవిద్యాశక్తి వలన)– వాస్తవికులకు శూన్యము– యోగాచార్యులకు కాలతః నశ్వరము– దేశతః, కాలతః నిరోధము సౌత్రాంతిక వైభాషి కులకు– శైవపాశుపతులకు ప్రమాణములు కలిగిన కారణవ గోత్రములకు లకు– అనియమిత స్వభావము కలిగిన ఆహారోపాలు– ఇలా అనేకమందిచే అనేకరకములుగ విశ్వసించబడినది– అని భావించి గా ఉన్నా మాయా రాక్షసుడివలె లేదిది ఇది– దీని ఎంతమాత్రం ఉన్నదానిగా నమ్మ కూడదు అన్నారు వశిష్ఠులు–

విన్నాడు శ్రీరాముడు ఇది అంతా– చాలా ఆశ్చర్యం వేసింది– ఇలా అడిగాడు– మహాత్మా! మహాప్రళయంలో ప్రపంచం, విత్తులో మొలక ఉన్నట్లుగా పరమాత్మలో ఉంటుందని, మళ్ళీ సృష్ట్యారంభంలో అతని నుంచే పుడుతుందనీ వ్యాసాదులు చెప్తున్నారు– మీరు చెప్పిన దానినిబట్టి చూస్తే అదిఎలా సమంజసం అవుతుంది? కపిలుడు మొదలగు వారుకూడా ఇలాగే ప్రపంచం ప్రళయకాలంలో కారణపదార్థమునందు సూక్ష్మరూపంగా వుంటుందని అంటారు. వాళ్లు అజ్ఞులంటారా! విజ్ఞులంటారా మీరు– వివరించి స్పష్టంగా చెప్పండి– నాకీసంశయం పోయేటట్లులేదు అన్నాడు శ్రీరాముడు.

రామచంద్రా! మహాప్రళయంలో ప్రపంచం పరమాత్మయందు ఉంటుందని అనే కపిలాదులు విజ్ఞులని నేను అనను. వాళ్లు అజ్ఞులనే అంటాను. అసంగాత్మ వివేచన చేసినా, వాళ్లకు ఇంకా ప్రపంచం సత్యమనే దృఢవిశ్వాసం ఉన్నట్లే– కాబట్టి వాళ్లకు శైశవం (పిల్లతనం) వదలలేదన్నమాట. కనుక నేను చెప్పబోయ్యే యుక్తిజాలం విను. నీకే అర్థమవుతుంది వాళ్లు (కపిలాదులు) ఎంతటి తెలివితేటలు కలవాళ్లయి

నవి— అని యుక్తి చెప్పటం ప్రారంభించారు నైయాయికులు. ఏమనగా!
సత్కార్యవాదుల కారణమునందు కార్యము, సత్తాసామాన్యంతో ఉంటుందా? ఏకదేశత్వంతో ఉంటుందా? లేక అంకురసత్త్వంతో ఉంటుందా? అని అడగాలి. అనగా అసాధారణమయిన అంకురాదులు; కారణమునందు, సాధారణసత్త్వంతో ఉంటాయా! కారణసత్త్వంతో ఉంటాయా! కార్యసత్త్వంతో వుంటాయా? అని మూడు రకాలుగ విభజించి అడగాలి— ఈ మూడు పద్ధతులలో ఏదీ కుదరదు— ఇందు మొదటి పక్షంలో, సామాన్యసత్తా (సత్తాసామాన్యము) అన్ని వస్తువులయందును వుంటుంది కనుక సత్తాసామాన్యరూపంతో వుండగ అంకురాదులకు అన్ని వస్తువుల తోటి సంబంధం వుంటుంది సత్తాసామాన్యంతో సంబంధించని వస్తువు ఏదీవుండదు— ఇందులో వాళ్ళ ఇష్టాపత్తిని చూపే యత్నం. మొలకరించే నేలలో, మొలకెత్తే బీజములో మొలకరించటం నిజమైతే, మిగిలిన తావుల (కుశూలస్థ బీజమునందుగాని, శిలాశకలమునందుగాని మొలకరించుట (అంకురాదులుండుట) అవాస్తవమని అనుటకు వీలు లేదు— ఇక రెండవ పక్షంలో (అనగా బీజసత్త్వంతో బీజమునందు అంకురాదులు ఉంటవి అనే పక్షంలో) ఆ బీజసత్త్వను, అంకురాదులతోటి నెట్టి సంబంధమో, ఘటపటాదులతోటికూడ అట్టి సంబంధమే ఉంటుంది. ఆ రెంటిలో విశేషమేమీ (భేదమేమీ) ఉండదు. అలాంటి అప్పుడు బీజము వల్ల వృక్షం అంకురాదులు, బీజములతోటి అసంబద్ధములయి పుట్టుచున్నవని వలయును. అప్పుడు సంబంధము లేకుండుట సమానముగుచుండగా, బీజమువల్ల అంకురాదులే పుట్టునని నిర్ణయించుటకు ఏది గమకము? ఒక్క వ్రీహ్యాది బీజమునందు సర్వప్రపంచము ఉన్నదనవలసివచ్చును! ఇది కూడ సత్కార్యవాదులకు ఇష్టమయ్యే యెడల, అంకురితమయిన బీజాదులందు, అంకురాదులే వాస్తవములనిన్నీ, ఘటపటాదులు వాస్తవములు కావనిన్నీ అనుట పొసగదు. ఇక మూడవ పక్షము నవలంబించినచో, (అనగా అంకురాదుల స్వరూపసత్త్వతో

అంకురాదులు బీజమునందుండునని అనేపక్షంలో) అంకురాదులయొక్క స్వరూపసత్తతో, బీజసంబంధమునకు, ఘటాదిసంబంధమునకునూ తేడా లేనందువల్ల, అంతటా అంకురాదులు పుట్టుచుండవలసి వచ్చును. కేవల బీజమువల్లనే పుట్టునను-టకు వీలులేదు- ఇంకనూడ ఇష్టాపత్తిని అంగీకరించే యెడల, బీజమునందే అంకురముండుట వాస్తవమునిన్ని యితరత్రా ఉండుట అవాస్తవమునిన్ని అనుట కుదరదు- కనుక సత్తాసామాన్యంతోగాని, కారణసత్తతోగాని, కార్యసత్తతోగాని కార్యము కారణమునందుండునను మూడుపక్షములలోనూ, ఏపక్షమూ యుక్తికి నిలవదు- కాన సత్కార్యవాదము చెల్లదు- ఇట్టిదానిని చెప్పేవాడూ తెలివితక్కువవాడే. వినేవాడూ తెలివితక్కువవాడే- ప్రళయమునందు ప్రపంచమున్నదనుటకు దృష్టాంతముగా బీజాంకుర న్యాయమును జూపుచున్నారు కొందరు మూఢులు. కాని అదికుదరదు. దృష్టాంతదార్ష్టాంతికములకు తేడా ఉన్నది. ఎలాగంటే విను చెబుతాను. మనస్సుతో కూడ ఆరుఇంద్రియములకు గోచరమయ్యే యవలు వ్రీహులు మొదలగు ధాన్యములు బీజములు కావచ్చును. వాటియందు అంకురములు పుట్టవచ్చును. ప్రకృతంలో దార్ష్టాంతికమునందు, మనస్సు మొదలగు ఆరు యింద్రియములకు గోచరముకాని కూటస్థ అద్వితీయ చిదాత్మ బీజం ఎలా అవుతాడు ! ఆకాశంకంటె సూక్ష్మమయి, ఏశబ్దమునకూ వాచ్యము కాకుండుటచే, పరమాత్మ బీజమగుటయెట్లు పొసగును ; కనుక ! పరమాత్మ బీజమే కానపుడు అతని యందు ప్రపంచము అంకురప్రాయముగా ఉండుట అతి దుర్ఘటముకదా ? అతిసూక్ష్మమైన అద్వైతస్యము అదృశ్యమయినందున అజ్ఞుల దృష్టిలో లేనిదానితో సమానము. లేనిదే అని యర్థము. కాబట్టి బీజమే లేకపోతే యింక అంకురమెక్కడిది? ఆకాశముకంటె అతిస్వచ్ఛమై శూన్యమయిన పరమాత్మయందు, మేరు, సముద్ర గగనాదులతో గూడిన ప్రపంచం ఎలా ఉంటుంది? కాబట్టి ప్రపంచమనేది బొత్తుగాలేదు. అది ఉన్నదయితే

వం॥స) అవి లేవనియే అందుకు ప్రామాణికులు. అట్టిస్థితిలో ప్రళయమునందు ప్రపంచము సర్వలౌకిక ప్రమాణములకు ఉపలభ్యము కాక పోవుచుండగా, యోగ్యానుపలబ్ధి ప్రమాణమునుబట్టి లేదనియే అనవలయును. అట్లుగాక, ప్రళయమునందు ప్రపంచము ఉన్నదని కల్పించుట లౌకిక ప్రమాణ విరుద్ధము. ఇంక రెండవ పక్షము చూతము. “సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్” ఇత్యాది శ్రుతులయందు, కార్య కారణములకు 2 సత్తలు స్పష్టముగ తెలియబడుట లేదు. తద్వాక్యశేషమగు “ఏకమేవా ద్వితీయం” అను శ్రుతి ఏకసత్తనే బోధించుచున్నది. కనుక వాక్యశేషమునకు విరుద్ధముగ మొదటి శ్రుతియందు రెండు సత్తలను కల్పించుట విరుద్ధమగును. ఒకే సత్తనుపై శ్రుతిబోధించుచున్నదనుట వుచితము. ఇట్టి తత్రైపై శ్రుత్యర్థము కొంత విచారింతము. “సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ అను శ్రుతి” సత్ అను శబ్దమునకు కార్యము అర్థమని చెప్పి, కార్యమునందలి సత్త్వమే కారణత్వమును జెంది, కారణమునందు ఆరోపింపబడినట్లు చెప్పుచున్నదా ? “లేక” సచ్ఛబ్దమునకు కారణము అర్థమని చెప్పి కారణమునందలి సత్త్వమే కార్యమునందు ఆరోపింపబడుచున్నదని శ్రుతి చెప్పుచున్నదా?” ఈ రెంటిలో సాంఖ్యులు ఏ పక్షమును ఆశ్రయింతురు ? ఏ పక్షమును ఆశ్రయించినను వారికి బాధతప్పదు. మొదటి పక్షంలో, కార్యము అనృతమని చెప్పెడి “వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం” అను శ్రుతి విరోధము ఆపాదించును. ఈ శ్రుతి, కార్యము అసత్యమని చెప్పుచున్నది. వారు కారణమే అనృతమనునట్లు శ్రుత్యర్థమును వర్ణించారు. పైగా కారణము సత్యమను తమ సిద్ధాంతమునకు బాధకముకూడ నగును ఇట్టి యర్థమును వర్ణించుట. కనుక వారి జ్ఞానము భ్రమయనక తప్పదు. కనుక కారణములగు గుణములే అనృతములను నీపక్షమున కారణముల వలన మహదాది కార్యములు పుట్టుటెట్లు ?

ఇంక రెండవ పక్షములో, కార్యమే లేనప్పుడే (కారణమే కార్యరూపమయినప్పుడు వేరే కార్యము లేనప్పుడాట, కారణము మాత్ర మెట్లుండును ! కార్యము వలనగదా కారణము నిరూపితమగును. కనుక కార్యకారణములకు భేదము సత్యమని శ్రుతి సమ్మతముకాదు. సాంఖ్యాదులు పొరబడి కార్యకారణభావాన్ని (ఉపాదానోపాదేయ భావాన్ని) కల్పించారు. కనుక వారి మతాన్ని త్రోసిపుచ్చి, అనాది మధ్యాంతమయిన సన్మాత్రవస్తువే అఖండదళమువలె ప్రపంచముగా ఉన్నది కాని, ప్రపంచము వేరుకాదు. అను మతమునే పరిశేష న్యాయముచే అంగీకరించవలెను. అని అన్నారు వసిష్ఠులు.



## ౨. ప్రపంచస్థితివర్ణనము

వసి॥ రామచంద్రా ? ప్రపంచం ప్రళయకాలంలో బ్రహ్మకంటే వేరుగా ఉంటుందని అంగీకరిస్తే యింకా దోషాలు చెబుతాను. ప్రళయంలో ఉన్న ప్రపంచం సృష్ట్యారంభంలో మళ్ళీ బ్రహ్మవల్ల పుట్టుతుందనికదా వాళ్ళ (సత్కార్యవాదుల) సిద్ధాంతం - అది పొసగదు.

విన్నాడు శ్రీరాముడు ఇది అంతా ప్రళయంలో బొత్తిగా ప్రపంచంలేదని చెప్పినట్లు గ్రహించాడు-ఇలా సందేహించాడు. ప్రళయకాలంలో ప్రపంచం లేదంటారే వసిష్ఠులు-అది నిజమయితే ఇక సృష్టి యెక్కడిది ! సృష్టిఅంటే పుట్టుట అను క్రియకదా ! ఈ క్రియకు ఆశ్రయమయిన కర్త లేనిదే క్రియ నెరవేరదుకదా ! క్రియ యెప్పుడూ కర్తృ సాధ్యముకదా? పుట్టునదియే పుట్టుక అను క్రియకు కర్త యగును గాని మరొకటి కాదుకదా ? సృష్టికి పూర్వము బ్రహ్మయొక్కడే ఉండేయెడల అతడే సృష్టి క్రియకు కర్త కావలయునుకదా ! కూటస్థ చైతన్య రూపుడయిన బ్రహ్మకు ఉత్పత్త్యాది వికారములుండవుకదా ?

కాబట్టి సృష్టి అనేది ఎలా సాపగుతుంది? కాబట్టి సృష్టి అనే క్రియ సాసగుటకుగాను, తదాశ్రయమగు జగత్తు (ప్రపంచము) ప్రళయంలో ఉన్నదని తప్పక అంగీకరించితీరాలి అని నిశ్చయించుకున్నాడు. వసిష్ఠుని ప్రశ్నించవలచాడు.

ఇంతలో గ్రహించాడు వసిష్ఠుడు శ్రీరాముని అభిప్రాయాన్ని-ఇలా అన్నాడు - రామచంద్రా? ప్రపంచం ప్రళయకాలంలో బ్రహ్మకంటే వేరుగా ఉంటుందని అంగీకరిస్తే ఇంకా దోషాలుఉన్నవి, చెబుతావిను. ప్రళయకాలంలో వున్న ఈ ప్రపంచం సృష్ట్యారంభంలో పుటుతుందనికదా? సత్కార్యవాదుల సిద్ధాంతం. అది యెంత మాత్రం పొసగదు. ఒకవేళ సమస్త కలనాతీతమయిన మహాచిదాకాశమందు ప్రపంచం వున్నదని అంగీకరించినా అది పుట్టుటకు వీలులేదు. కార్యము ఎప్పుడు తనంతటతాను నిస్సహాయముగా పుట్టనేరదు. సాధనములుండాలి. ఉపకరణము (ఉపసాధనము) లుండాలి. ఆధారము వుండాలి. ఇతరములయిన సహకారి కారణములుకూడా వుండాలి. ఇవియేవి లేనిదే కార్యము పుట్టనేరదు. ప్రళయంలో సమస్త భేదరహితమయిన బ్రహ్మయందు, ప్రపంచోత్పత్తికి కారణమయిన ఈ సాధన జాలమంతా ఉన్నదా? ఉన్నట్లు శ్రుతి చెప్పుచున్నదా? లేదు. అట్టిస్థితిలో ప్రలయంలో ప్రపంచం ఉన్నదని అంగీకరించినా ఈ సహకారి కారణ సామగ్రి లేనిదే అది బీజాంకుర న్యాయంగా పుట్టుటఎట్లు? కార్యోత్పత్తికి (ప్రపంచోత్పత్తికి) అనుకూలమయిన ఈ కారణసామగ్రీ అంతా ప్రళయంలో ఉండేయెడల ఇంక అది ప్రళయం ఎట్లగును? కాబట్టి రజ్జుసర్పాదులవలె సహకారి కారణసామగ్రీ లేకపోయినా ప్రపంచం పుటుతుందని అంగీకరించే యెడల, అపుడు మూలకారణమయిన బ్రహ్మపదార్థమే భ్రాంతికల్పిత మయిన ప్రపంచ స్వరూపంగా కనిపించుచున్నది కాని, వస్తుతః ప్రపంచమూలేదు. ప్రపంచ సృష్టీలేదు. కనుక ప్రళయంలో ప్రపంచం వున్నదని కల్పించడం సాంఖ్యాదులకు వ్యర్థ ప్రయాసకాని మరొకటి కాదు.

ఒకవేళ సాంఖ్యులు ప్రళయంలో ప్రపంచం అంతా ఉన్నదని అంగీకరిస్తామనీ, అందువల్ల సర్వప్రపంచాంతర్గతమయిన పృథివ్యాదులు కూడా ప్రలయంలో ఉన్నవనీ, అవి ప్రపంచోత్పత్తికి సహకారి కారణ సామగ్రిగా ఉపకరిస్తాయి అనీ, అంటారేమో! అదికూడా కుదరదు. ముందు పృథివ్యాదులు పుట్టితేకాని అవి ప్రపంచోత్పత్తికి ఉపకరించ లేవు. తాను పుట్టకుండా యింకొకదానియొక్క పుట్టుకకు తాను సహకారి కానేరదు. కాబట్టి పృథివ్యాదులకుగాని, తదితరములకుగాని, ఉత్పత్తి సిద్ధిస్తే, కాని వాటికి సహకారిత్వం సిద్ధించదు. సహకారిత్వం సిద్ధిస్తేకాని తమ ఉత్పత్తి సిద్ధించదు. కనుక అన్యోన్యాశ్రయదోషమేర్పడుతుంది కాబట్టి సాంఖ్యుల కల్పన ఎట్లు విచారించినా మూఢ కల్పనగాని మరొకటికాదు- ప్రళయమునందు సహకారి కారణములతో కూడా ప్రపంచం ప్రకృతి విశిష్టరూపమునందు (మాయాశబలితబ్రహ్మ యందు) లీనమయియుండి మరల పుట్టుచున్నదనే వాదము సాంఖ్యులకు అజ్ఞాన విలసితము- కనుక రామచంద్రా! ప్రపంచం ప్రళయంలో లేదు. ఇప్పుడూ లేదు- ఇక ముందుండబోదు. రజ్జువు, సర్పాద్యాకారముగా గోచరించినట్లు చిదాకాశమే ఈరీతుగా గోచరించుచున్నది- కనుక బ్రహ్మయొక్కడే ఉన్నాడు. ప్రపంచం అనేది లేదు- "బ్రహ్మైవేదం అమృతం పురస్తాత్"- అను శ్రుతి ఇదే విషయమును చెప్పుచున్నది. ఇలాంటి శ్రుతి ప్రమాణములవల్లనే దృశ్యాత్యంతాభావమును దృఢపరచుకోవలెను. ఘటపటాది వస్తువులను ముద్గరప్రహారాదులచే (రోకలి దెబ్బ మున్నగు వానిచే) ఎంత నశింపజేసినా, అన్యోన్యాభావముచే (ఘటము పటముకాదు పటము ఘటముకాదు) అను జ్ఞానముచే వేరుపరచి తెలుసుకున్నా, ఒకచోట నుండునది మరొకచోట లేదనిఅత్యంతాభావజ్ఞానము కలిగినా, అది ప్రపంచోపశమము కానేరదు. ఘటపటాది ప్రపంచం బ్రహ్మజ్ఞానంవల్లనే బాధింపబడవలెను, మట్టిముద్దయందు కుండకనిపించనంత మాత్రమున కుండలేనిది కాదు- ఒకానొకచోట భా

లోకమునందు ఘటపటాదులు లేనంతమాత్రమున అవి లేనివికావు. మరొకచోట నుండవచ్చును- అందువల్లగూడ ఈతావున కనిపించక పోవచ్చును. కాబట్టి కామకర్మ వాసనలతోటి కూడా ఎప్పుడుదృశ్యము శాంతించునో అప్పుడే దృశ్యప్రపంచమునకు ఆత్యంతికోచ్ఛేదము సంభవించును అయ్యది జ్ఞానమువల్లనే కలుగునుగాని వేరే ఉపాయమువల్ల కలుగదు- సర్వదృశ్యానర్థనాశ రూపమయిన మోక్షమునందు, సమూల మనోనాశాంతమయిన వేదాంతవాక్య జన్యజ్ఞానమే ఉపాయము. ఆరోప్యముయొక్క నాశమునకు అధిష్ఠాన సాక్షాత్కారమే ఉపాయము. ఇందుకు మార్పులేదు-

ప్రపంచముయొక్క తత్త్వమును విమర్శించి తెలిసికొంటే బోధైకరసమగు చిదాకాశమే కాని, ప్రపంచంలో జడరూపము ఏమీలేదను జ్ఞానం కలుగుతుంది. అప్పుడు "నేను" "నీవు" "నాది" "నీది" అనే పామరవ్యవహారమంతా ఒకచిత్రకథ అవుతుంది. ఆస్థితిలో ఈకొండలూ కొంపలూ, పంచభూతములూ; వత్సరాదికాలవిభాగమూ, జన్మమరణములూ, కల్ప, అవాంతరకల్ప, మహాకల్పాదులూ, పదునాలుగు భువనములూ, కృతత్రేతాదియుగములూ, ఇవన్నీ మహాచిదాకాశరూపములే అని తనలో స్ఫురిస్తుంది. కిటికీకంటా లోపలకువచ్చేడి పరమాణువులందలి సూర్యునికాంతులు యెట్లు పరిచ్ఛిన్నములుగా గోచరించునో అట్లే మనస్సునుండి బయలుదేరిన బ్రహ్మాండకోటులయందు చైతన్యముయొక్క ప్రకాశలుకూడ పరిచ్ఛిన్నములుగా గోచరించుచున్నవి- నభోమండలమందు విస్తరించియున్న సూర్యప్రకాశమునందు భిన్నభిన్న పరమాణువులు యెట్లు పరిభ్రమించుచున్నవో, అలాగే మహాచిత్పరమాకాశమందుకూడా బ్రహ్మాండములు కోట్లకొలది పరిభ్రమించుచున్నవి- కాబట్టి మనోగతమయిన పరిచ్ఛేదముచే బాధనొందిన చైతన్యము తనయందున్న ప్రపంచమును బయల్పరచుచున్నది. కంటిదోషమువల్ల స్ఫటికపురాతిలో కొన్ని రేఖలు(గీతలు) గోచరించును. కాని అవి(ఆ రేఖలు)

అచ్చట నిజముగా లేవు. అలాగే ఈ ప్రపంచంలో కూడా అజ్ఞానమనే దోషంవల్ల పదార్థాలు భిన్నంగా గోచరించడమే కాని, నిజంగా పదార్థములు భిన్నంగా లేవు. ఇవి పుట్టనూ లేదు, చావనూ లేదు, రానూ లేదు, పోనూ లేదు. ఈ సృష్టిప్రళయాలు. శుద్ధచిన్మాత్రమునందు ఉన్నట్లు స్ఫురించుచున్నవి. నిరాకారమయిన నభస్సు (ఆకాశము) నందు, నభో భాగములు స్ఫురించినట్లు నీటియందు ద్రవత్వమువలెనూ వాయువు నందు స్పందము (చలనము) వలెనూ సముద్రమునందు సుడులువలెనూ గుణవంతుని యందు గుణములవలెనూ ఈ బ్రహ్మాండములు పృథక్సత్తా శూన్యములై (బ్రహ్మకంటె వేరుగ ఉనికి కలవివలె) నున్నవి. ఉపమూస్త్ర మయూరంభమయిన యీ ప్రపంచము, విజ్ఞానఘనమగు బ్రహ్మమే కాని వేరు కాదు. కనుక ప్రళయంలో పుట్టుకకు కర్తయగు ప్రపంచమున్ననూ, సహకారికారణ సామగ్రి లేనందున అది పుట్టుట కుదరదు. అందువల్ల సాంఖ్యాదుల సత్కార్యవాదకల్పన ఉన్మత్త చేష్టవంటిది కాని వేరొండు కాదు. అన్నారు వసిష్ఠులు -



## 3. జగదానంత్య వర్ణనము

విన్నాడు శ్రీరాముడు. మరల సాంఖ్యుల సత్కార్యవాదాన్ని, (ప్రళయకాలంలో ప్రపంచం ఉన్నదనే విషయాన్ని) నిలపెట్టదలచాడు, ఇలా అన్నాడు. మహర్షీ? ప్రపంచము హిరణ్యగర్భుని యొక్క మనస్సంకల్పము వల్ల పుట్టినని మీరు అన్నారు లోగడ- కనుక అది ఆయనగారి మనో రాజ్యం అన్నమాట. అలాగంటే ప్రపంచం పుట్టటానికి సహకారి కారణ సామగ్రి అవసరం లేదు. ప్రలయకాలంలో ప్రకృతియందు దాగి (లీనమై) ఉన్నాడు మనోరూపుడయిన ప్రజాపతి (హిరణ్యగర్భుడు) అతడు స్మృతి రూపుడు- అతనియందు ప్రపంచము సంస్కార రూపంతో ఉండే ఉన్నది.

ఆ ప్రజాపతి మహాప్రళయావసానమయిన సృష్ట్యాదియందు, స్మృతి రూపుడుగా పుట్టుచున్నాడు. ప్రపంచంకూడా అతనియందు సంస్కార రూపంతో ఉన్న స్మృతిరూపంతో పుట్టుతోంది. ఇందులో విరోధం ఏమిటి? అని అడిగాడు. శ్రీరాముడు - వసిష్ఠుడు జవాబు చెబుతాడు - రామా! సృష్ట్యాదియందు మొదటి ప్రజాపతి స్మృతి రూపుడుగా పుట్టాడని నీవు అన్నమాట యథార్థము. ప్రపంచము ఆయనగారి సంకల్పాత్మక మన్నమాటకూడ నిజమే. కాని అంతకుపూర్వమైన ప్రళయంలో ప్రపంచం ఉన్నదని నీవు నిరూపించలేవు. స్వప్న కాలంలో గోచరించే వస్తువు స్వప్నకాలంలోనే లేదు. సంకల్పములో గోచరించే వస్తువు సంకల్ప సమయములోనే లేదు. స్మృతిగోచరమగు వస్తువు స్మృతి సమయంలోనే ఉండదు. అలాంటి అప్పుడు, దీని ఆధారంగా చేసికొని ప్రళయ కాలంలో ప్రపంచం ఉన్నదని కల్పించడం కుదరదు. కాని సృష్ట్యాదియందు పరమాత్మకు (ప్రజాపతికి) ప్రపంచ విషయక స్మృతి కలుగదు. ఏలయన! ఈ సత్కార్యవాదాన్ని లేవదీసింది సాంఖ్యకులు. వారి మతంలో వారు అంగీకరించేది ప్రధానము. ప్రధానము స్మృతి సమర్థము (స్మరించుటకు సమర్థము) కాదు. అది మృత్పాషాణాదులవలె జడము కనుక ఇంక పురుషులు స్మరింతురని అనుకుందామంటే అదీ వారి సిద్ధాంతంలో కుదరదు - వారు వారి సిద్ధాంతంలో పురుషులు అసంగ ఉదాసీన నిర్వికారులని అంగీకరిస్తున్నారు. ఇలాంటి. పురుషులకు స్మృతియను మనోవికారము అసంభవము. పరస్పరవ్యావర్తక ధర్మములను (ఒండొరులకు భిన్నధర్మములను) అంగీకరించనందున ఇంక ఈ పురుషులు పరమాత్మాభిన్నులని అంగీకరించే యెడల సుతరాం పురుషులకు స్మృతి సంభవించదు స్మృత్యాది వికారము లుండుటకు పురుషులకు జన్మ అవసరము - పరమాత్మాభిన్నులయిన పురుషులకు జన్మలేదు. పైగా "అప్రాణోహ్యమనాః శుభ్రః" అను స్మృతి పరమాత్మకు మనస్సు లేదని చెబుతోంది. పరమాత్మకు మనస్సు లేకపోతే

పరమాత్మాభిన్నులయిన పురుషులకుగూడ మనస్సు ఉండదు. మనస్సు ఉంటేనే కాని స్మృతి కలుగదు. కనుక సాంఖ్యమతంలో మొదట ప్రజాపతికి ప్రపంచ స్మృతి కలగడం అసంభవం కనుక అది నభోవృక్షము వంటిది అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ మహర్షీ! "సృష్ట్యారంభంలో ప్రజాపతికి స్మృతి ఎందుకు సంభవించదు? మహాప్రళయంలో లీనమైనంత మాత్రమున ప్రాక్తన సంస్కారము ఎలా నశిస్తుంది ప్రజాపతికి? మహాప్రళయంకూడా దైనందిన ప్రళయమైన సుషుప్తి వంటిదే కదా! సుషుప్తిలో అజ్ఞానంలో ఉన్న జీవుల యొక్క సంస్కారం నశిస్తూ ఉన్నదా! లేదే జాగ్రదవస్థలో స్మృతి కలుగుతూనే ఉండే జీవులకు- అలాగే ప్రళయంలో ప్రజాపతి ప్రకృతిలో లీనమై ఉన్నా అతని సంస్కారం పోదు- కనుక సృష్ట్యారంభంలో స్మృతి కలుగవచ్చును." అని అన్నాడు శ్రీరాముడు.

వసి॥ రామచంద్రా! నీవు చెప్పిన దృష్టాంతం సరిపోదు. (సుషుప్తి దశలో) దైనందిన ప్రళయంలోని జీవులు ముక్తులు కాలేదు. కాబట్టి వాళ్ళకు జాగ్రత్తలో స్మృతి కలుగవచ్చును. మహాప్రళయంలో హిరణ్యగర్భాదులు ముక్తి పొందారు. మళ్ళీ క్రొత్తగా సృష్ట్యారంభంలో హిరణ్యగర్భుడు బయలు దేరుతున్నాడు. కాబట్టి యిక్కడ స్మృతికర్త ముక్తి పొందినందున లేడు. స్మృతికర్తయే లేకపోతే స్మృతి యెవడికి కలుగుతుంది? కనుక స్మృతి కర్తయే లేకపోతే స్మృతి రూపంగా ప్రపంచం పుట్టడం ఎలా! అసంభవం అది. కాబట్టి సత్కార్యవాదినులయిన శ్రుతులకు ప్రపంచం ప్రళయంలో బ్రహ్మరూపంగా ఉన్నది అనే అభిప్రాయం. బ్రహ్మ సదా ఉండేవాడు కనుక; సద్వాదంశ్రుతులకు చెల్లుతుంది- ప్రపంచం అన్నా, స్వాయంభువు (హిరణ్యగర్భుడు) అన్నా అనాద్యంతమయిన చిత్ప్రభయే కాని వేరు కాదు- బ్రహ్మాండ శరీరమునకు ఉపాదానకారణమయిన అతివాహిక (సూక్ష్మ) దేహముకూడ

పరమాత్మయే కాబట్టి బ్రహ్మయే సూక్ష్మస్థూలభావారోప క్రమంచేత ప్రపంచస్వరూపంతో భాసిస్తున్నాడు- నిలకడలేని స్వభావముగల యీ ప్రపంచమునకు ప్రపంచరూపముతో సత్తాలేదు. బ్రహ్మరూపముతోనే సత్తా. (ఉనికి)- కనుక ప్రపంచము యెప్పటికిని ఖరూపముతోనే (శూన్యరూపముతోనే) భాసిస్తోంది. కనుక, ప్రపంచం వాస్తవంకాదు. ఈ సద్దృష్టికి అంతములేదు. జ్ఞానికి ప్రపంచమునందు బ్రహ్మ దృష్టి. అజ్ఞానికి ప్రపంచమునందు ప్రపంచ దృష్టి నిజము. బ్రహ్మ అనే మహా మేరువునందు ముల్లోకములనే పరమాణువులు భాసిస్తున్నవి. సూర్య కిరణములందు ముద్రేణువులు భాసించుచున్నట్లు- ఇవి లెక్కించడానికి సాధ్యమయితే, చిదణువునందు ప్రవహించే త్రైలోక్యాణువులుకూడా లెక్కించడానికి వీలు అవును-

రూపములేని ఆకాశము నీలరూపముగలదిగ భాసించినట్లు;నిష్ప్రపంచమయిన కూటస్థ బ్రహ్మ సవికారమగు ప్రపంచరూపంగా భాసిస్తున్నాడు-ప్రపంచమును ప్రపంచంరూపంగాచూస్తే బంధంతప్పదు. దానిని బ్రహ్మరూపంగా భావిస్తే ముక్తితప్పదు- జీవుని కాని, ప్రపంచకారణమయిన ఈశ్వరుని కాని, పరమార్థదృష్టితో పరిశోధనచేస్తే చిదాకాశ రూపమయిన బ్రహ్మమే మిగులుతుంది- ఇట్లే బాహ్య అభ్యంతరములగు ఉపాధులుకూడ బ్రహ్మవల్లనే పుట్టినందున, తదనన్యత్వాధికరణ న్యాయప్రకారం బ్రహ్మస్వరూపములే- కనుక వేద్యమగు ప్రపంచం అంతా శుద్ధచిన్మాత్రముకాని వేరుకాదు.

## ౪. ప్రపంచస్థితి కారణమును నిరూపించుట.

రామా! ఇంద్రియ గ్రామమును (సమూహాన్ని) జయిస్తేకాని భవసాగరాన్ని దాటలేడు మానవుడు- ఇది కర్మచే దాటడానికి వీలయినదికాదు- సజ్జనసాంగత్యమూ, శాస్త్రాభ్యాసమూ ఉంటే వివేకం కలిగి దృశ్యబుద్ధిని నశింపజేసికుంటాడు. రామా ? ఇది అంతా లోగడనే

చెప్పాననీకు. వెచ్చుమాటలెందుకు ? సంసారవృక్షానికి మూలం మనస్సు అని నమ్ము- వివేకం అనే కత్తితో దాన్ని నరికితే సంసార మనే చెట్టు కొట్టబడుతుంది. ఈదృశ్యప్రపంచం అంతా మనస్సు తప్ప మరేమీలేదు. మనోరోగానికి మందువాడితే ప్రపంచరోగం పారి పోతుంది. మనస్సు దేహాకారాన్ని మననంచేస్తే దేహం తయారౌ తుంది. ఎన్నికల్పాలుయత్నించినా, దృశ్యమైన ప్రపంచంలేదనుకుంటే కాని మనస్సు అనే పిశాచం పారిపోదు. మనోరోగం లోపలిది కదా? దృశ్యం బయటిదికదా? బయటి ప్రపంచానికి మందువాడితే లోపలి మనోరోగం ఎలామానుతుంది ? అనే సందేహం నీకు అక్కరలేదు- దృశ్యాత్యంతా భావబుద్ధి మనోవ్యాధి చికిత్సకు మంచిమందు. దీనికంటె కంటే వేరేమందులేదు- కాక, మనస్సు లోపలదనీ, దృశ్యవస్తువులు బయటవనీ, నియమంలేదు- మనస్సే, ఈరెండురకములుగా కల్పించుకొని, భ్రాంతి పడుతోంది. బంధానికీ మోక్షానికీ అదే కారణం- మనస్సు మననంలో ఉంటే ప్రపంచం స్ఫురిస్తుంది. శూన్యమయిన ఆకాశంలో గంధర్వనగరం గోచరించినట్లు- పుష్పాలో పరిమళంఉన్నట్లు మనస్సులోనే ప్రపంచం అంతాఉంది. నువ్వుగింజలో నూనె, గుణవంతుని యందు గుణమూ, ధార్మికునియందు ధర్మగుణమూ, సూర్యబింబంలో కిరణసమూహమూ, తేజస్సులో వెలుతురూ, నిప్పులో వేడీ, మంచులో చల్లతనమూ, ఆకాశమునందు శూన్యత్వమూ, గాలియందు చలనమూ ఉన్నట్లు మనస్సునందు ప్రపంచం ఉన్నది. కాబట్టి రామచంద్రా ! మనస్సే జగత్తు, జగత్తే మనస్సు. ఈరెంటికీ అవినాభావ సంబంధం ఉంది. అయినా ఆ రెంటిలో మనస్సు నశిస్తే జగత్తు నశిస్తుంది. కాని జగత్తు నశిస్తే మనస్సు నశించదు సుమా! అని అన్నారు వసిష్ఠులు-

— ౫ నుంచి ౧౫ వరకు - భార్గవోపాఖ్యానము —

మహర్షి! "బయట ప్రకాశించే ఈవిశాలప్రపంచం అంతాలోపల మనస్సులో ఎలాఉంది? అది మనస్సులో ఎలా స్ఫురిస్తుంది? దృష్టాంతం

చెప్పండి ఇంకను" అని అడిగాడు శ్రీరాముడు. రామచంద్రా! "ఐందవులనే! బ్రాహ్మణకన్య మనస్సులో దృఢంగా ఈలోకాలన్నీ ఉన్నట్లూ, లవణుడనే రాజుకు చండాలజన్మ సంప్రాప్తమై, చండాలవ్యవహారము జరిగినట్లూ, భార్గవునకు, స్వర్గసుఖం అనుభవించాలనే కోరిక గలిగి, అప్సరఃస్త్రీలతో రమించాలనే ఆశపుట్టి, స్వర్గలోకానికి వెళ్లడమూ, అక్కడ మరొకజన్మను అనుభవించడమూ, ఆజన్మలో అప్సరఃస్త్రీలతో కామసుఖం అనుభవించడమూ, జరిగినట్లు మనస్సునందు ఈప్రపంచం ప్రకాశిస్తూంది." అని సమాధానమిచ్చారు వసిష్ఠులు. మహర్షీ! భృగుపుత్రునకు స్వర్గసుఖం అనుభవించాలనే కోరిక ఎలా కలిగింది? అప్సరస్త్రీలతో రమించాలనే ఆశ ఎలాపుట్టింది? అక్కడ క్రొత్తగా సంసారం ఎలా తయారయింది? ఇది కొంచెం వివరించి చెప్పండి ? అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! పూర్వం మందరపర్వతము చరియమీద భృగువునకు, కాలమునకు సంవాదం జరిగింది. చెబుతావినుదాన్ని. నీసందేహాలన్నీ తీరుతాయి. పూర్వం మలయ పర్వతముయొక్క చరియమీద మహాఘోరతపస్సుచేస్తూ ఉండేవాడు భృగువు- అతనికి చంద్రునివలె చక్కగా ప్రకాశించె శుక్రుడనే పిల్లవాడున్నాడు- ఆ తండ్రికి శుశ్రూష చేస్తూ ఉండేవాడు ఆపిల్లవాడు మహాతేజశ్శాలి ఆ భృగువు ఆచరియ మీద రాతిలో చెక్కిన బొమ్మవలె నిశ్చల సమాధిలో చాలాకాలం ఉన్నాడు.

ఈపిల్లవాడు, ఆపర్వతంమీద వెండిబంగారు తిన్నెలమీదపూల పాన్పులయందు తీవిగా రమించాలని కోరి, ఆత్మతత్త్వజ్ఞానము, ప్రపంచ సత్యతాజ్ఞానముల మధ్య చిక్కువడి, భూమ్యాకాశములమధ్య విశ్వామిత్రుడు నిర్మించిన స్వర్గంలోఉన్న త్రిశంకువలె, మహాపదలోమగ్నుడై ఉన్నాడు. తండ్రి (భృగువు) నిర్వికల్పసమాధిలో ఉన్నాడు. ఇలా ఉండగా ఒకానొకప్పుడు ఏకాంతంలో ప్రశాంతంగా ఉన్న సమయమున,

నభోమార్గాన వెళ్లుతున్న అప్సరసను చూచాడు ఆభృగు పుత్రుడు. ఆమె సముద్రమధ్య ఆవిర్భవించిన లక్ష్మివలె ఉన్నది. మెడ నిండా మందారపూలమాలలున్నాయి. మందమారుతంచేత ముంగురులు ఎగురుచున్నాయి. హారములయొక్క ఝూంకారధ్వనిచే నవక మహో అందంగా ఉంది- నభోమారుతములు పరిమళిస్తున్నాయి. లావణ్య వృక్షముయొక్క తీగవలెఉన్నది. ఆమె మదంచేత కళ్లుతిరుగుతున్నాయి. శరీర కాంతులచేత అచ్చోటు అంతా అమృతమయంగా ఉంది. అలాంటి అప్సరసను విష్ణుమూర్తి లక్ష్మిదేవిని చూచినట్లు చూచాడు. మనస్సు చలించింది శుక్రునకు. నిర్మలమయిన పూర్ణచంద్రునివలె ఉన్న ఆ శుక్రుని (భృగుపుత్రుని) ముఖం చూచింది ఆ అప్సరస. కామపరవశ అయింది. శుక్రునకు ఆమెను చూడటంతోడనే కామబాణాలుమనస్సు లోనాటుకున్నాయి. మనస్సు పరవశం అయింది. ఎలాగో బలాత్కారంగా తెలివి తెచ్చుకున్నాడు. ఆస్త్రీ వెంటపడి వెళ్లేపనులు మానుకున్నాడు. మనస్సును నిగ్రహించుకున్నాడు. ఏకాగ్ర పరచాడు. కాని మదిలో ఇతరవృత్తులేవీ లేనందువల్లనూ, ఆయప్సరసయందు ఏకాగ్రి మయిన చిత్తము కలవాడయినందువల్లనూ, "యచ్చిత్తస్తన్మయో భవతి" అనునట్లు ఆ వధూమయుడు అయిపోయాడు.

## ౭. భార్గవమనోరాజ్యము.

ఆమెను మనస్సులో ధ్యానిస్తూ ఉన్నాడు. కళ్లుమూసుకున్నాడు మనోరాజ్యాన్ని ప్రారంభించాడు ఇలా. "నాముందున్న ఈయప్సరస స్వర్గంలో నడుస్తూ ఉంది. నేను ఆమెతో కూడా పోతున్నాను. ఇది దేవతాబృందముతో నిండియున్న స్వర్గలోకం- వీరందరూ, మందార పూలమాలలు తలలో బెట్టుకొని, కరిగిన మేలిమిబంగారమువలె మెఱిసెడి మేనులుగల దేవతలు- వీరందరూ, నల్లకలువలనే నేత్రాలుకలిగి మనోహరంగా నవ్వుచూ, తిరిగే చంచలాక్షులయిన అప్సరసలు- వీరం

దరూ, పారిజాతాది పూలమాలలతో ప్రకాశిస్తూ, విశ్వరూపుడయిన విష్ణువవలెనున్న దేవతాపురుషులు- ఇవి గీర్వాణగణముయొక్క- గాన ధ్వనులు. ఈయది, హంసలు విహరించెడి బంగారు కమలములుగల మందాకినీ నది- వీరందరూ యమాది దిక్పాలకులు. ఇది ఐరావణమను ఇంద్రవాహనము- ఈయవిభూతలమునుంచి వచ్చెడి విమానముల కాంతులు- ఇవి సీటితుంపురులను విరజిల్లెడి మందాకినీ సలిలతరంగములు- ఈయవికుందమందార మకరంద సుగంధములుగల గాలులు- ఇది పువ్వులతోనుకింజల్కములతోనూ, మంచుబిందువులతోనూ పరిమళింపజేసెడి పరాగములతోనూ, లతాసదృశులయిన అంగనాగణములతోనూ, వ్యాప్తమయిన నందనవనము. మనోహరమయిన గానముచే, సురాంగనలను నాట్యమాడించెడి నారదతుంబురులు వీరు- వీరందరూ మణిభూషణాలంకృతులయి, విమానారూఢులై వచ్చుచున్న పుణ్యపురుషులు, వీరు దేవేంద్రుని సేవించెడి దేవతాంగనలు- ఇవి పండిన పండ్లగుత్తులతో నిండియున్న కల్పవృక్షములు- ఇక్కడ సింహాసనారూఢుడై రెండవ సృష్టికర్త వలెనున్న నేను నమస్కరిస్తున్నానుఅని అనుకొని, ఆభృగుపుత్రుడు (శుక్రుడు)మనస్సులోనే నమస్కరించాడు దేవేంద్రునిచే ఆదరముతో తానుకూడ పూజింపబడ్డాడు. చేయి కలిపి తీసికొనిపోయి తన సమీపమున కూర్చుండబెట్టుకొనబడినాడు శుక్రుడు. "ఓయిశుక్రా! నీరాకచే మాస్వర్గలోకం ధన్యమయింది- నీవిక్కడనే చిరకాలముండమని"అన్నాడు ఇంద్రుడు శుక్రునితో. అతడును ఆశచీపతిచెంత కూర్చుండి, సురగణముచే నమస్కరించబడినాడు- ఇంద్రునిచే లాలింపబడ్డాడు- మహానందాన్ని అనుభవించాడు-

## ౭. న వ సం గ మ ము.

ఇంద్రవలోకంచేరి, తన వెనుకటి భావాన్ని మరచాడు. క్షణకాలం ఇంద్రుని చెంతకూర్చున్నాడు- విశ్రాంతి తీసికొని, లేచి స్వర్గలోకంలో విహరించతలచాడు. స్వర్గలోక సౌభాగ్యాన్ని చూచాడు- తన సౌంద

ర్యాన్ని చూచుకున్నాడు. దేవతా స్త్రీ బృందమును చూడసాగాడు- అందులో తాను వెనుక చూచిన అప్సరసను చూచాడు. పరవశుడయి నాడు- ఆమె కూడా ఈ భార్గవుని చూచింది. పరవశురాలయింది. మన్మథవికారం చెందింది. తామరకొలనులో ప్రవేశించిన మదపుటేనుగు కొలనును కలవరపరచినట్లు మన్మథుడు ఈమెను క్షోభ పెట్టాడు. శుక్రుడు తలచినపని పూర్తి అయినట్లు యెంచి ఆమెను చూచి వెనుచీకట్లు క్రమ్మిన బాగుండునని తలచాడు- స్వర్గభూమి అంతా గాఢాంధకార బంధుర మయింది. స్ఫటిక శిలాగృహంలో పడకమీద పరున్నాడు శుక్రుడు- భార్గవుని యొద్దకువచ్చింది అప్సరస. ఆయనగారి రెండుచేతులూ పట్టు కుంది. మనోహరంగా మాట్లాడింది. నాధా! చూడు మన్మథుడు నన్ను ఇలా బాధిస్తున్నాడు. నేను అనాధను కదా! దీనురాలను కదా! మా బోటి అనాధలను రక్షించుట మీబోటివారలకు ఉచితమగుపని కదా! కాన నన్ను రక్షించుము" నీపాద స్పర్శచే కొంతనాకు ఊపిరివచ్చింది- నీచరణ కమలములందు తుమ్మెదవలెనున్న నన్ను నీకరపల్లవములచే కౌగలించుకొనుము. అమృతపూరితమయిన నీహృదయంలో నన్ను నిలుపుకొనుము అని ఆయనగారి వక్షస్థలముమీద పడింది.

౮ శుక్రుడు నానాజన్మలననుభవించుట.

మనోవిలాసంచేత కల్పించుకున్న ప్రణయోక్తులతో భార్గవుడు మహాఆనందపడ్డాడు- చాలా సరదాగా ఉన్నాడు- అమృతపానమత్త యగు అప్సరసతో భార్గవునకు చక్కని సమాగమము కుదిరింది. అంతట వారిరువురు మందాకినీ తటములందు విహరించారు కిన్నరగణంతో- అమృతపానం చేశారు దేవతలతో కూడా. చైత్రరథోద్యానవనముల యందు విద్యాధర స్త్రీలతో కూడా ఊయెలలూగారు. నందనవనము యొక్క ప్రాంతీయమంతా త్రొక్కి చూచారు. ప్రమథగణాలతో నదు లలో జలక్రీడలాడారు- కైలాసవన కుంజములందు అనేక రాత్రులు

గడిపారు- గంధమాదన పర్వతమందు విశ్రమించారు- లోకాలోక పర్వతప్రాంతములందు సరదాగా షికారు చేశారు. మందరపర్వతము యొక్క గుహాకచ్ఛ ప్రదేశములందు (శీతలమయిన చల్లని దేశము లందు) జింకపిల్లలతో ఆడుకున్నారు- ఇలా అమరావతీ పట్టణంలో అరవై సంవత్సరాలు ఉన్నారు సుఖంగా ఆ అప్సరసతో శుక్రుడు-అటు పైన పాలసముద్రముయొక్క తటములందు ఈ అప్సరసతో కూడి; శ్వేత ద్వీపవాసులతో కూడా విహరిస్తూ కృతయుగంలో సగభాగం గడిపాడు- తరువాత మనోరథ మాత్రంచేతనే ఆశుక్రుడు సర్వజగత్తుకు సృష్టికర్త అయినాడు. మళ్లీ పురందరపురం చేరాడు ఇలా సుఖంగా ఆమెతో నాలుగుయుగాలు విహరించాడు. పిదప పుణ్యమంతా నశించేటప్పటికి ఆదివ్యశరీరాన్ని పోగొట్టుకొని, ఆమెతో కూడా భూలోకంలో పడ్డాడు. అప్పుడాతడి శరీరం ద్రవీభూతమై అనేక ముక్కలు అయింది. స్థూల శరీరం ముక్కలయ్యేసరికి, వారల సూక్ష్మశరీరాలు రెండూ, ఆకాశంలో గూడు లేని పక్షులవలె తిరగటం ప్రారంభించాయి. తరువాత చంద్రుని కిరణజాలాన్ని చేరుకున్నారు. మంచుతుంపురులయినారు. గాలి ధాన్య రూపాన్ని చెందారు. ఇలావృతవర్షంలో ఒక బ్రాహ్మణుడు ఆ గాలి ధాన్యం భుజించాడు. ఆయనగారి రేతోరూపాన్ని ధరించాడు ఈశుక్రుడు. ఆయనగారి భార్యద్వారా అతనికి కొడుకై పుట్టాడు- క్రమంగా మునుల యొక్క సహవాసం అబ్బింది. ఒక్క మన్వంతరకాలం దాకా ఉగ్ర మయిన తపస్సులో ఉన్నాడు. ఆ శుక్రుడు మోహించిన అప్సరస శాప వశమున ఆడలేడి అయింది- ఆమెకు నరాకారంగల కొడుకు పుట్టాడు ఈశుక్రునివల్ల ఆపిల్లవానియందు స్నేహంచేత అఖండమయిన మోహం ఏర్పడింది శుక్రుడికి- ఆపిల్లవాడికి తన ధనం అంతా చెందాలనీ, శాశ్వత మయిన ఆయుస్సు కలగాలనీ, మంచి గుణాలు అబ్బాలనీ మనస్సులో ఆలోచనలు బయలుదేరాయి. ఈమనశ్చింతచే, తన తపోనిష్ఠ అంతా నాశమయింది- ధర్మచింత అడుగంటింది.

పుత్రుని గూర్చి భోగచింత పెరిగిపోయింది. ఇంతలో అల్పాయువగు ఆ శుక్రుని మృత్యుదేవత ఎత్తుకొని పోయింది. ఆయనగారి(శుక్రుని) భోగచింతనలన్నీ అంతరించాయి. పిదప ఆతను క్రమంగా మద్రదేశపు రాజుగారికి కొడుకై పుట్టి, మద్రరాజ్యం పాలించి తుదకు ముసలివాడై, అతి సుందరమయిన మద్రరాజదేహాన్ని విడిచిపెట్టాడు. వానప్రస్థధర్మచింతనంలోనుండి— అందుచేత (ఆసంస్కారముచేత) ఒక తాపసునికి కొడుకై పుట్టాడు. "సమంగా" అనే మహానదియొడ్డున తపస్సు చేశాడు. రామచంద్రా! ఇలా ఆ శుక్రుడు వివిధవాసనలతో వివిధజన్మలను పొంది దైవవశంచేత వైరాగ్యంకలిగి తుదకు సుఖంగా విక్షేపరహితంగా సమంగా నదీతటమున తపస్సు చేస్తూ ఉన్నాడు.

## ౮ భార్గవకళేబరవర్ణనము

ఇలా అంతులేని మనోరాజ్యాలలో తన తండ్రి ఎదుట ఆలోచిస్తూ ఉన్న ఈ శుక్రుడికి అనేక వేలసంవత్సరాలు గడిచాయి. కొంత కాలానికి ఎండగాలులకు వాడిన ఈతని శరీరం తెగగొట్టిన చెట్టువలె పడిపోయింది. మనస్సుమాత్రం లేడిపిల్లవలె తాను సంకల్పించుకున్న భోగదిశలలో తిరుగుతూనే ఉంది. తిరిగి తిరిగియున్న వాని మనస్సు సమంగా నదీతటంలో విశ్రాంతి చెందింది. ఈ కల్పనాశక్తిచేత శుక్రుడు శరీరంలేకుండానే సంసారావస్థను అనుభవించాడు. ఆతని స్థూలదేహంలో బయటి చర్మము, లోపల ఎముకలు మాత్రము మిగిలి ఉన్నాయి. ఈ శరీరం, తెల్లనిదంతపంక్తిచేత భోగాశలనే గోతులలో పడిన మనస్సును ఎగతాళిచేస్తూ ఉన్నట్లున్నది. ఇంద్రియగోళకాలచేత వివేకవంతులకు ప్రపంచ శూన్యత్వాన్ని వెల్లడిస్తూ ఉన్నట్లున్నది. ఎండకు ఎండి వానకు తడిసి, ఆవిరిమెత్తిన ఈ శరీరం, తాను పూర్వం అనుభవించిన దేహపరంపరలను స్మరిస్తూ ఆ దుఃఖం వల్లకాని, ఆనందంవల్ల

గాని బాష్పమును (కన్నీటిని) విడుచుచున్నట్లున్నది- చల్లగాలుల విలాసం చేత అడవిభూములలో పొరలుతూఉంది. ధారావర్షానికి వర్షాకాలంలో గిరితటములందు తడుస్తూ ఉంది. ఇలా ఉన్నా ఆశరీరం మృగపక్ష్యాదులచే భక్షింపబడలేదు- అది పుణ్యాశ్రమము. భృగువు రాగద్వేషములులేని మహాతపశ్శాలి. అందువల్ల అతని శరీరమును మృగపక్ష్యాదులు భక్షించలేదు. యమనియమాలలో కృశించినా స్థూలశరీరం, చిత్తము మాత్రం సమంగా నదీతటముమీద తపస్సు చేస్తూనే ఉంది-

## ౧౦ కా ల వ చ న ము

(కొడుకు శరీరమునుచూచి తండ్రి భృగువు కోపించి కాలముతో మాట్లాడుట)

ఇలా ఉండగా భృగువు (ఇతని తండ్రి) వేయి దివ్య సంవత్సరాలకు సమాధినుంచి లేచాడు. కుమారుని శవాకారమయిన శరీరాన్ని చూచాడు చూచిన వెంటనే వెనకాముందూ విచారణ లేక జరుగనున్న విషయాన్ని గమనించక, కుమారుడు మరణించాడని తలచి, కాలము అకాలంలో తనకొడుకును ఎత్తుకొనిపోయిందనే ఊహాలోపడ్డాడు కాలాన్ని గురించి తీవ్రకోపాన్ని దాల్చాడు. శపించుటకు ప్రారంభించాడు. ఈవిషయం గ్రహించింది కాలము. తనకు రూపంలేకపోయినా ఆదిభౌతికమయిన రూపాన్ని ధరించింది మునియొద్దకు వచ్చింది- ఖడ్గపాశాలు ధరించింది- కవచకుండలాలు ధరించింది. రెండుప్రక్కల ఆరేసి భుజాలు. ఆరు ఋతువులు ఆరుముఖాలు- మహత్తరమయిన సేనతోకూడా వచ్చింది కోపించియున్న ఆభృగుమునితో ఇలాఅన్నది. మంచిమాటలతో- (సాంత్వనవచనములతో) "స్వామీ లోకపరిస్థితులు తెలిసినవారూ, బ్రహ్మతత్త్వమును గుర్తించినవారూ, ఇతరులవల్ల తప్పులున్నా కోపించరు తప్పులేనప్పుడు కోపించరని నేననే పనిలేదు- మీరు గొప్ప తపశ్శాలులయిన విప్రోత్తములు. మేము నియతిని పరి

పాలించువారము. శాపాలకు భయపడి మేము మీబోటివారిని పూజించము.(గౌరవించము) మూర్ఖబుద్ధికి పాల్పడి మీతపస్సును నాశము చేసికొనవద్దు.

ప్రళయకాలాగ్నులవంటివి, నన్నేమీ చేయలేవు. మీక్రోధాగ్ని నన్నేమి చేయగలదు? అనేక బ్రహ్మాండాలు మ్రింగాను. అనేకమంది రుద్రులను పొట్టన బెట్టుకున్నాను. కొన్నివేల విష్ణువులను కాజేసినాను. మాశక్తి ఎక్కడ పారిలేదు? మమ్ములను ఎవరు శపించారు? మేము భోక్తలము. (తినువారము) మీబోటివారు మాకు ఆహారము. ఇది సృష్టిలో సహజమయిన నియతి (మర్యాద) మీమా ఇచ్ఛాద్వేషాలవల్ల జరిగేదికాదు- నిప్పు పైకి మండుతుంది. నీరు క్రిందికి పోతుంది. భోజన వస్తువులన్నీ భోక్తను చెందుతాయి. పుట్టినవస్తువులన్నీ వినాశకాలాన్ని పొందుతాయి. ఈమూర్తామూర్తి ప్రపంచం అంతా నాకు ఆహారంగా పరమాత్మ కల్పించాడు. పరమాత్మ తాను స్వయంగా ప్రపంచంలో ఉండే ఈ నాటకం నడుపుతున్నాడు- పరమార్థ దృష్టిలో (ప్రపంచ మిథ్యాత్వదృష్టిలో) ఎవడూ కర్తకాడు- ఎవడూ భోక్తకాడు- కర్మ తుల దృష్టిలో (ప్రపంచసత్యతాదృష్టిలో) అందరూ కర్తలే, అందరూ భోక్తలే. కర్తృత్వాకర్తృత్వములు కేవలం కల్పితములు తత్త్వజ్ఞానం లేకపోవడంచేత సమ్యగ్దర్శనం కలవాళ్ళకు ఈ బుద్ధులుండవు. చెట్ల యందు పూలూ, లోకాలయందు భూతాలూ, స్వయంగా వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి.

ఈవిషయంలో కాలమేకర్త్రాది శబ్దములతో కల్పింపబడుతోంది నీటిలో ప్రతిఫలించిన చంద్రుడికి చలనంలో కర్తృత్వాకర్తృత్వములు నిజముకాదు. అనృతములూ కావు. అంతే కాలరూపుడయిన పర మాత్మకు సృష్టులందుకూడా కర్తృత్వాకర్తృత్వములు- త్రాటిమీద పాముని భ్రాంతికలిగినట్లు, మనస్సు కర్తృత్వాకర్తృత్వరూపమయిన

భ్రాంతిని చెందుతోంది- కనుక మునిసత్తమా! ఇందులో మాతప్పేమీ లేదు. ఆపదలయొక్క క్రమం ఇలాంటిది. వృథాగా మనోవ్యాకులంతో కోపించకు. ఏది ఎలా జరుగవలెనో అది అలా జరిగితీరుతుంది. ఇది నిజము. మాకు భ్రాంతి కల్పితమయిన పూజాఖ్యాతులందు కోరికలేదు. మాకు ఎవరిమీదనూ అభిమానం ఉండదు. నేను నీకోపానికి భయపడి మీవద్దకు రాలేదు- తాపసులను సమ్మానించటం మాకు నియతి (మర్యాద) అనే భావంతో వచ్చాను- నియతిని అనుసరించి వ్యవహారించడం మాకు ఉచితము. నీకు క్రోధాభిమానంచేత అజ్ఞానాన్ని అనుసరించడం ఉచితంకాదు. ప్రపంచమర్యాదను పరిపాలించెడి పరమేశ్వరుని ఇచ్ఛ అనే మహానియతిని అనుసరించి, అవాంతర వ్యవహారేచ్ఛానియతులు జరుగుతూ ఉంటాయి. ఇందులో అభిమానం కూడదు- వ్యవహార చతురులు చేయతగిన పనిని తప్పక చేసితీరాలి. తమకు ఉచితమయిన మర్యాదను పాలించడం వారికి నియతం.

నీవు అజ్ఞానంలోపడి నీనియతిని (నీమర్యాదాపాలనమును) నశింపజేసికోవద్దు- నీజ్ఞానదృష్టి అంతా ఏమయింది? నీతపోమహిమ అంతా ఏమయింది ? నీధైర్యం ఏమయింది. అందరికి తెలిసిన విషయంలో కూడా మీరు ఇంత పొరపడుచున్నారేమి? ఇది జ్ఞానాంధుల లక్షణమే. మరణమనేది కర్మ పరిపాకంచేత జరుగుతుందని తెలియక మూర్ఖులవలె నన్ను శపించదలచారేమి ? ప్రతిజీవునకూ స్థూలమూ, సూక్ష్మమూ అని రెండు శరీరాలు ఉంటాయి. ఇది మీకు తెలియదా? ఈ రెంటిలో స్థూలదేహం జడము కొద్దిపాటి నిమిత్తంచేత కూడ నశించటానికి సిద్ధంగా ఉంటుంది- మనస్సు ప్రాతిభాసికం- ఇది మోక్షపర్యంతం స్థిరంగా ఉంటుంది- అలాంటి దానిని క్రోధాదులచే పాడుచేసికొంటున్నారు- చతురుడయిన సారథి రథాన్ని పడిపోకుండా నిలపెడతాడు- మానవులు అభిమానంతో కూడిన మనస్సుచేత స్థూలదేహాన్ని నిలపెడుతున్నారు. లేని స్థూలశరీరంమీద సంకల్పంచేత ఉన్న సూక్ష్మ

శరీరాన్ని నాశనం చేసికొంటున్నారు. చిత్తమే పురుషుడు. అది అస త్సంకల్పంచేత బద్ధం అవుతుంది. సత్సంకల్పముచేత ముక్తమవుతుంది- ఇది శరీరమనీ; ఇది తల అనీ, ఇవి కాలుచేతులనీ, మనస్సేవికారాన్ని చెందుతోంది- మనస్సే ఒక జీవునినుంచి మరొక జీవస్వరూపాన్ని చెందుతుంది- ఇది నిశ్చయాకార వృత్తితో బుద్ధి అనబడుతుంది- అభిమానంవల్ల అహంకార మనబడుతుంది ఇలా ఒక్క మనస్సే నానా రూపాలను చెందుతుంది. ఇదే దేహవాసనచేత అపభ్రంశములయిన పార్థివశరీరాలను చూస్తుంది పరమార్థ సత్యమయిన వస్తువును చూచి నట్లయితే శరీరభావనను విడిచి అఖండానందాన్ని పొందుతుంది. నీ కుమారునియొక్క అలాంటి మనస్సు నీవు సమాధిలో ఉండగా తన మనోరథమార్గంచేత (సంకల్పమార్గంచేత) చాలాదూరం వెళ్ళింది.

ఈభార్గవ దేహాన్ని విడిచింది. మందరపర్వత గుహాలో దివ్యమయిన దేవతా శరీరాన్ని పొందింది. అచ్చటి పారిజాత లతలలో, మందార పూగుత్తులలో నందనోద్యాన ఖండములలో లోకపాలపురములలో, నాలుగుయుగాలు అప్సరసను సేవించింది- తన తీవ్రసంకల్పంచేత కల్పితమయిన పుణ్యకర్మ నశించగానే మంచు విడిపోయినట్లు విడిపోయింది- కాలపక్వమయిన పండు పడినట్లు పడిపోయింది. ఆ దేవతా శరీరాన్ని విడిచింది. భూతాకాశాన్ని చేరి క్రమంగా భూమిమీదపడింది. నీకుమారుడు దశార్ణ దేశములలో ఒకబ్రాహ్మణుడయినాడు. కోసల దేశంలో ఒకానొకరాజయినాడు- పెద్ద అడవిలో పల్లెవాడయినాడు గంగానదీ తటమున హంస అయినాడు- సూర్యవంశమునందొక రాజు అయినాడు. సౌరశాల్వదేశములందు మంత్రోపదేష్టయగు గురువయినాడు. పిదప ఒకకల్పం విద్యాధరుడయినాడు- తరువాత నొకముని పుత్రుడయినాడు. తరువాత మద్రదేశములకు రాజయినాడు. పిదపవాసుదేవుడనే ఋషి పుత్రుడై సమంగానది యొడ్డున తపస్సు చేస్తున్నాడు- వాసనావశంచేతవిచిత్ర యోనులందుమరికొన్ని జన్మలనుకూడధరించాడు,

వింధ్యపర్వతంమీద కిరాతుడై పుట్టాడు. సౌవీరదేశములందు మండలేశ్వరుడయినాడు. త్రిగర్త దేశములందు గర్దభమయ్యాడు-కిరాత దేశములందు వెదురుగుబురుగ జన్మించాడు- జాంగల ప్రదేశమునందు లేడిగా పుట్టాడు. తాటిచెట్టుమీద పాముగా పుట్టాడు. తమాలవృక్షమందు అడవికోడిగా పుట్టాడు- ఆసీపుత్రుడు మంత్రవేత్తలలో గొప్పవాడై పూర్వం విద్యాధరపురంలో చెప్పిన విద్యను జపించాడు- అందుచేత నభోమండలంలో విద్యాధరుడయినాడు- హారకుండలకేయూరాదులతో భూషితుడై, అపరమన్మధాకారుడై విద్యాధరస్త్రీలకు గంధర్వపట్టణానికి అలంకారభూతుడై ఒక్క కల్పముండి, కల్పాంతంలో, ద్వాదశాదిత్యుల తేజస్సులో మిడతలాగ భస్మమయినాడు- జగన్నిర్మాణరహితమయిన ఆప్రళయకాలంలో ఆయనగారివాసన, గూడులేని పిట్టవలె నభోమండలంలో సంచరించింది- మరల సృష్టి ప్రారంభమయ్యేసరికి, ఆతని వాసన కదలి, బ్రాహ్మణజాతిని పొంది వాసుదేవుడనే బ్రాహ్మణబాలకుడుగా తయారయింది- బుద్ధిమంతుడయినాడు- వేద వేదాంగాలు చదువుకున్నాడు. ఇప్పుడు సమంగానది యొడ్డున తపస్సు చేయుచున్నాడు-

## ౧౧. కాలము ప్రపంచ పరిస్థితిని వర్ణించుట-

జటాధారియై ఉన్నాడు. రుద్రాక్షమాలలు ధరించాడు. ఇంద్రియ భ్రాంతులను చంపుకున్నాడు. ఇప్పటికి ఎనిమిదివందల యేండ్లుఅయింది. నీకు చూడాలని ఉంటే జ్ఞాననేత్రాన్ని తెరచిచూడండి. అని అన్నది కాలం భృగువుతో- రామచంద్రా! కాలస్వరూపుడయిన పరమేశ్వరుడు ఇలా అనేసరికి, భృగువు జ్ఞాననేత్రంతో ఆలోచించాడు- క్షణంలో వృత్తాంతం అంతా తెలుసుకున్నాడు- సూక్ష్మశరీరంతో (మనస్సుతో) కొడుకున్న తావుకు వెళ్ళాడు. మళ్ళీ సమంగానదీ తటంనుంచి తనశరీరాన్ని చేసుకున్నాడు భృగువు. ఆశ్చర్యపోయాడు. తాను వీతరాగుడయ్యాడు- వీతరాగుడయిన కాలరూపునితో ఇలా అన్నాడు- "భగవన్" మేము

అజ్ఞానులము- రాగద్వేషాలతో మలినమయిన చిత్తము కలవారము- మీలాంటివారల చిత్తమే త్రికాలజ్ఞము- ఎంతపండితునికయినా మనస్సు అనేది, అసత్యమయిన ప్రపంచాన్ని పరమార్థ సత్యమయిన దానిగా కనుపరుస్తుంది దేవా! "నీవే ఇంద్రజాలంతో సమానమయిన మనో వృత్తియొక్క స్వరూపాన్ని తెలుసుకోగలవు-

మాలాంటివాళ్లు వ్యామోహపడుతూనే ఉంటారు- నా కొడుకు నకు కల్పాంతంవరకూ, చావులేదుకదా! అయినా నేను చనిపోయినట్లు తెలిసికొని భ్రమించితిని కదా! అక్షీణ జీవితుడయిన నాకుమారుని, కాలము అపహరించినట్లు పొరపడితిని కదా! నియతియొక్క బలంవల్ల ఇంత తుచ్ఛమయిన ఇచ్ఛనాకు పుట్టింది- ప్రపంచముయొక్క పరిస్థితిని చూస్తూకూడా మాలాంటివాండ్లముసంపదవల్ల సంతోషానికీ, ఆపదలవల్ల దుఃఖాలకూ వశమై పోతున్నాము- చెడుచేయువానియందు క్రోధమూ మంచిచేయువానియందు అనుగ్రహమూ, (సంతోషమూ) ఉండాలని ప్రపంచంలో నియతి. "ఇది కార్యము" "ఇది అకార్యము" అనే జగ ద్భ్రాంతి ఉండేటంత వరకు ఈ నియతి తప్పరాదు- తత్త్వబోధ కలిగిన తరువాత ఈ నియతితో పనిలేదు- కనుక నియతి పరిపాలనారూప మయిన పరిస్థితిని ఆలోచించక మేము కోపించాము తప్పుచేశాము- అందుచే మేము శిక్షార్హులము- నాకొడుకు వృత్తాంతము తెలిపావు- నీవు చెప్పినట్లు సముంగానదీతటంలో నాకొమరుని చూచాను- లోకంలో భ్రాంతి శరీరాన్ని కూడా మనస్సే కల్పిస్తుంది. కాబట్టి మనస్సే రెండు శరీరాలుగా తయారవుతుంది. జగత్తు అంతా మనస్సుచేత భావింప బడుతోంది" అని అన్నాడు భృగువు కాలంతో- కాలం భృగువుతో ఇలా అంటుంది-

కాలము- మహర్షీ! మీరు చక్కగా మాట్లాడారు- మనస్సే సంకల్పంవల్ల దేహంగా తయారవుతోంది- లేని దానిని కల్పిస్తుంది.

ఉన్నదానిని నశింపచేస్తుంది- సంభ్రమము, స్వప్నము, మిథ్యాజ్ఞానము గంధర్వనగరాదులన్నీ మనస్సుయొక్క శక్తులు. స్థూలదృష్టితో మీరు పురుషునకు మనస్సూ, శరీరమూ అని రెండు శరీరాలన్నారు. ముల్లోకమంతా మనస్సుయొక్క మనన నిర్మాణము కాని వేరు కాదు- భేదవాసనచేత మనస్సే ఈభేదభావాన్ని చెందుతోంది- ఘటమూ, పటమూ, కుడ్యమూ, కుసూలమూ, సుఖీ, దుఃఖీ, మూఢుడనన్నా అనే భావనలన్నీ మనోవికల్పాలే. కృత్రిమమయిన మనన రూపాన్ని మనస్సు విడిస్తే శాంతమయిన చిత్తం బ్రహ్మరూపాన్ని చెందుతుంది- అతి స్వచ్ఛమైన జల సామాన్యరూపంతో నిండియుండి, మహావిశాలమయిన నిస్తరంగ సముద్రంలో బయలుదేరిన చిన్నతరంగము, తన స్వరూపం చిన్నదనే భావనచే, తాను చిన్నదానిననుకుంటుంది. దీర్ఘమైన తరంగము దీర్ఘమను భావనచే దీర్ఘమనుకుంటుంది- చిన్నతరంగము ఒడ్డున నేలమీదపడి, ప్రభ్రష్టమై (విడిపోయి) నేను విడిపోతిననుకుంటుంది-

కొంతకాలం తర్వాత మరొక తరంగం చాలయెత్తుగా బయలుదేరి కిరణసమూహంతో కూడుకొని, భోగయోగ్యమయిన జన్మనెత్తినాననేభావనచేత తానొకింసువలె ప్రకాశిస్తున్నానని అనుకుంటుంది- మరో తరంగం చంద్రబింబాన్ని ప్రతిబింబింపజేసికొని, నేను అతిచల్లగా ఉన్నానని అభిమానపడుతుంది- మరొకటి ఒడ్డున ఉన్న దవాగ్నిని ప్రతిబింబింపజేసికొని, తనశరీరము మండిపోవుచున్నట్లు భయపడి వణుకుతుంది- చలిమలికట్టలయొక్క ఈవలి భాగము అవలనున్న వనద్రుమములను (అడవిచెట్లను) ప్రతిబింబింపజేసికొని, తనకు రాజ్యపదవి యబ్బినట్లు పెద్ద ఆడంబరంతో తాను కృతార్థుడైనట్లు అభిమానపడుతుంది. మరొక తరంగం పెనుగాలికి అటుయిటూ కదులుతూ పెద్దధ్వనిగలదై ముక్కలుముక్కలుగా విడిపోతూ, తాను చితికిపోతూ ఉన్నట్లు అభిమానపడి, పెద్దపెట్టున ఏడుస్తున్నట్లుగా ధ్వనిచేస్తుంది- ఈతరంగాలన్నీ ఆ సముద్రము కంటె వేరుకావు.

వాటియందు పొడుగు పొట్టి అనే గుణాలు లేవు- ఆ గుణముల యందు తరంగాలూ లేవు- అపారమయిన నీటిలో పరిచ్ఛేదభేదంచేత కల్పితాలు కాని ఇవి మరొకటి కాదు- పోయిపోయి మళ్లీ పుటుతూ ఉంటాయి. పుట్టిపుట్టి మళ్ళీ చస్తూ ఉంటాయి. వాటన్నిటినీ కలిపి విచారిస్తే కేవలము నీటియొక్క సామాన్య స్వరూపం తప్ప వాటిలో మరొకటిలేదు- అలాగే, సర్వవ్యాపకమూ, సర్వశక్తియుక్తమూ, చిన్మాత్రమూ అయిన బ్రహ్మయందే ఈప్రపంచశక్తులన్నీ, అభిన్నములయినా భిన్నంగా గోచరిస్తూ ఉన్నవి. స్త్రీపుం భావంలో బ్రహ్మయే, పరివర్తన చెందుతున్నాడు. (మారుతున్నాడు) ప్రపంచం అనేది బ్రహ్మకంటె వేరుగలేదు- ఉండబోదు- ప్రపంచం అనేది పరిపూర్ణ బ్రహ్మ స్వరూపమే అని భావించు, ఇతర భావనలను విడిచిపెట్టు- అంతటా ఏకాకారంగా ఉండే నియతియే (సత్తాయే) విభిన్నాకారంగాఉండే పదార్థాల ఆకారంగా గోచరిస్తుంది. సముద్ర జలముకంటె తరంగములు వేరు కావు. బ్రహ్మసత్తకంటె ప్రపంచసత్త వేరుకాదు. చిత్తమే చైతన్య ధ్యాసకలదై ఆత్మ పదార్థమనీ (అజడమనీ) చైతన్య ధ్యాసలేనిదై జడమనీ భేదాన్ని చెందుతోంది. భేదవాసనా రూపమయిన ఈచిత్తము యొక్క శక్తి అధిష్ఠాన సన్మాత్రముకంటె వేరుకాదు. కనుక బ్రహ్మయే ఈ విశాలమయిన ప్రపంచాకారంగా విజృంభించింది. కొమ్మలూ, పుష్పములూ, తీగలూ, ఆకులూ, ఫలములూ, మొదలూ, అనునవి, నిజాలో విత్తనముయొక్క రూపములే కాని వేరుకాదు. అలాగే ఈ విచిత్ర ప్రపంచశక్తులన్నీ ఆ పరమేశ్వరునికంటె వేరుకాదు.

ఒకేవర్ణము గల మేఘమునుండి అనేక రంగులు గల ఇంద్రధనుస్సు బయలుదేరినట్లు అజడమయిన పరమేశ్వరునినుండి జడమయిన విచిత్ర ప్రపంచము బయలుదేరుతోంది. సాలెపురుగునుండి దారములూ, పరున్న పురుషునినుండి, స్వాప్నరథాదులూ, బయలుదేరినట్లు సదా

శివునినుండి ప్రపంచ పదార్థాలు బయలుదేరుతున్నాయి. చిత్తము ఏకరూపమయినా వాసనావైచిత్ర్యమువల్ల అచిత్పదార్థములందు వైచిత్ర్యము ఏర్పడుతోంది. సాలెపురుగునకు తాను సృష్టించుకున్న దారమే తనకు బంధమయింది. చిత్తమునకు తాను కల్పించుకున్న ప్రపంచమే తనకు బంధమయింది. తన పరిపూర్ణరూపాన్ని భావనచేసి మానవుడు సంసారమునుంచి విముక్తుడగుచున్నాడు. ఆత్మ (తాను) ఎలా భావనచేస్తే అలా తయారవుతాడు. ఋతువు ఏస్థితిలో ఉంటే చెట్టు ఆస్థితిలో ఉంటుంది. బంధమోక్ష కల్పన అనేది అజ్ఞ దృష్టిలోకాని. తత్త్వదృష్టిలో కాదు. తత్త్వదృష్టిలో దాని వాసన యేలేదు. అవిద్యాత్మకమయిన భోక్తృ భోగ్యాది భావంచేత ప్రపంచం అంతా ఆచ్ఛాదితమయింది. అదియే మాయామయమయిన ప్రపంచము – చంద్రుడినుంచి మరీచులూ, (కిరణములూ) సముద్రమునుంచి తరంగములూ బయలుదేరినట్లు పరమాత్మనుండి చిత్ర విచిత్రము లయిన మనశ్శక్తులు కోట్లకొలది బయలుదేరుతున్నాయి.

ఈ మనశ్శక్తులతో కూడినదే ప్రపంచము. ఇందులో కొన్ని శక్తులు. స్థిరములు అవియే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కొన్నిశక్తులు మనుష్యత్వమును చెందినవి కొన్ని శక్తులు దేవతలయినవి. మరికొన్ని శక్తులు, యమ, ఇంద్రి, సూర్య, అగ్ని, కుబేరాదులయినది. ఇంక కొన్ని కిన్నర గంధర్వ, విద్యాధర, సురాదులయినది. ఇందులో కొన్ని పుట్టి చాలాకాలం ఉండేవి. (బ్రహ్మ విష్ణ్వాదులు) మరికొన్ని పుట్టి కొంతకాలానికి చచ్చేవి (సురనరాదులు)– మరికొన్ని క్రిమి కీట కాదులు చీమలు, దోమలు, మున్నగునవి, నీటిలో బుడగలవలె పుట్టుచూ చస్తూఉండేవి – నరమృగాదులు కొంతకాలం ఉంటాయి, కొన్ని తుచ్ఛమయిన శరీరం కలవి – మరికొన్ని అతిస్వచ్ఛమయిన శరీరం కలవి. దృఢమయిన వికల్పాలతో వ్యామోహితులయిన కొందరు ప్రపంచం స్థిరం అని అనుకుంటారు – మరి కొందరు అల్పభావనచేత సుఖిని; దుఃఖిని, మూఢుడను, అని అనుకుంటారు–

## ౧౨. సంసారము వివర్త రూపమని నిరూపించుట

సుర, అసుర, నరాకారులయిన ఈ చేతనులందరు బ్రహ్మార్ణవముతో అభిన్నులుకాని భిన్నులుకారు - బ్రహ్మార్ణవము మాత్రము సత్యము మిగిలిన ప్రపంచ మంతయు మిథ్య - భ్రాంతిచే లేనిపోనివి కల్పనలను కల్పించుకొని. తాము బ్రహ్మ స్వరూపులు కామనే నిశ్చయంచేత అధోగతిని పొందారు. బ్రాహ్మణ వంశములో ఉన్నవారుకూడ బ్రహ్మ భిన్నులమనుకొని, పరిచ్ఛేద భావాన్ని కల్పించుకొని భయంకరమయిన భవభూములందు తిరుగుచున్నారు. 'శరీరమే ఆత్మ" అని పలుమారు అనుకొనడమే పుణ్యాపాపకర్మలకు కారణము - ఇలా అనుకొనే చేతనులుకూడా నిజంలో నిష్క్రియమయిన బ్రహ్మ స్వరూపులే. ఆయా కర్మ బీజములు, ఆయా విచిత్ర ఫలరూపంగా అంకురించడంలో కూడ మానవుల సంకల్పాలే కారణాలు - ఈ ప్రపంచంలో విస్తరించియున్న శరీరములనే రాళ్లు (జడవస్తువులు) కొన్ని ఊరకనే ఉంటున్నాయి. మరికొన్ని కదులుతూ ఉన్నాయి. ఇంక కొన్ని ఏడుస్తున్నవి మరికొన్ని నవ్వుచున్నవి. ఇందులో కొందరు చేతనులు (హరిహరాదులు) అతి స్వచ్ఛులు వీరికి జ్ఞానైశ్వర్యము మిక్కుటము. మరికొందరు దేవతలూ, మానవులూ, అల్పమయిన వ్యామోహంలో ఉంటారు - జ్ఞానాధికార యోగ్యత ఉన్నది కనుక - వీరి వ్యామోహం కొద్దిదనాలి - తరు తృణాదులు ఈ యధికారము లేనందున అత్యంత వ్యామోహంలో పడ్డాయి. క్రిమి కీటాదులు స్థావరపదార్థాలవలె అత్యంత వ్యామోహంలో లేవు. వాటికి ఇష్టానిష్టప్రవృత్తి నివృత్తులందు కొంత యోగ్యత ఉంది. కాబట్టి స్థావర పదార్థాల మోహంకంటె వీటి వ్యామోహం కొద్దిదనాలి.

ఈ జీవకోటిలో కొందరు శాస్త్రమునకు విరుద్ధంగా నడుస్తూ ముక్తి మార్గానికి చాలాదూరులు అవుతున్నారు - కొంతమంది ఈ సంసారంలోనుంచి విశ్రాంతి చెందే మార్గముందని శాస్త్రమువల్ల

విని; ఆమార్గానికి అభిముఖులై కూడ, దురదృష్టంవల్ల ఆమార్గమును పొందలేకపోతున్నారు- మరికొంతమంది విశుద్ధమగు జ్ఞానోపాధిని పొంది హరిహర బ్రహ్మాదులు జీవన్ముక్తులగుచున్నారు. అదే ఉపాధితో - కొద్దిపాటి అజ్ఞానంగలకొందరు సమాధి, ఉపాసన, మున్నగు వానిచే బ్రహ్మాది లోకములనుపొంది, అలా ఎంతవరకు అక్కడ ఉంటారు. మరి కొంతమంది, అనేక జన్మలను అనుభవించి, యింకా అనేక జన్మలను అనుభవించనుండి, అధికారంగల జన్మదొరకినా, దానిని సార్థక పరచుకోలేక, రాగాంధులై జన్మ మరణాలను పొందుతూ ఉంటారు - ఊర్ధ్వలోకంనుంచి అధోలోకానికి అధోలోకంనుంచి ఊర్ధ్వలోకానికి తిరుగుతూ ఉంటారు. తత్త్వజ్ఞానం లేని కారణంచేత జీవకోటికి రాగ ద్వేషాలతో కూడిన యీ జన్మలు తటస్థించుచున్నవి.

గురూ ? ఏమిటి ఇక్కడ రాముడు "ఏవసంసృతి ఖండోఘో మిథః సమ్మిలతి స్వయమ్ నోవామిలతి తన్మేత్వం యథా వద్వక్తు మర్హసి" అని సృష్టి ఖండాలు ఒకదానితో మరొకటి కలుస్తాయా, కలియవా ! అని అడుగుతాడు ? ఇదేమీ బోధపడటం లేదే కొంచెం వివరించి చెప్పండి ! అన్నాడు శిష్యుడు ! గురువు శిష్యా ! ఇదికొంచెం గందరగోళంగానేఉంది. ఇంతకుముందు గ్రంథంలో రాముడికి ఉపదేశించేటప్పుడు ప్రపంచం అంతా ఒక దీర్ఘకాల స్వప్నం అన్నాడు వసిష్ఠుడు. ఆమాటమీద రాముడు అంతా స్వప్నమయితే గురువూ స్వప్నమే (మిథ్య) శిష్యుడూ స్వప్నమే మిథ్య ఉపదేశమూ మిథ్యే కదా ! ఇక గురువువల్ల శిష్యుడికి కలిగిన ఉపకారమేమి ? ఆగురువుగారికి గురువులవల్ల కలిగిన ఉపకారం మాత్రం ఏమి ? తుదకు ముక్తికి ముప్పువాటిల్లినట్లేకదా ? అని విస్పష్టంగా అడగవలసింది. రాముడు - అలా అడగలేదు. భావగర్భితంగా డొంక తిరుగుడుగా అడిగాడు, సృష్టిఖండాలు రెండూ కలుస్తాయా ? కలియవా? అంటే గురువుగారి మనస్తత్త్వమూ, శిష్యుడి మనస్తత్త్వమూ కలుస్తుందా ? కలి

యదా ? అని రాముడి అభిప్రాయం. కలిస్తే వీరి ఉపదేశమునల్ల శిష్యుడికిముక్తి లభిస్తుందని లేకుంటే ముక్తి లేదనీ రాముని నిర్ణయం ఇది గ్రహించాడు. వసిష్ఠుడు - ఆయనగారుకూడా భావగర్భితంగానే సమాధానం చెప్పారు. శిష్యుని మనస్తత్వం నిర్మలమయితే గురువుగారి మనస్తత్వంతో కలుస్తుందన్నారు అంటే నిర్మల మనస్కుడైన శిష్యుడికి చేసిన ఉపదేశం ఫలిస్తుందని వసిష్ఠుల అభిప్రాయం మలిన మనస్సు గలవాడికి మాత్రం గురువుచేసే ఉపదేశం అంటరాదు. వాడికి ఉపదేశంవల్ల లాభం ఉండదు. దేవతలు పరుల (ఇతరుల) మనః కల్పితమయిన స్వప్నంలో ప్రవేశించి వరములనిచ్చి అనుగ్రహించినట్లు, శిష్యుల మనః కల్పితమయిన జగత్తులో ప్రవేశించి గురువులు కూడా ఆత్మతత్త్వాన్ని బోధించి కడతేర్చటానికి సమర్థులవుతారు - కనుక నే సృష్టి అందరికీ సమానమని, ఒక్కొకలి జ్ఞానలచేత దానిని బంధించుకొని (సంసారాన్ని తప్పించుకొని) ముక్తి చెందటానికి వీలులేదని, కూడా అనటానికి వీలులేదు. సృష్టి అందరికీ సాధారణంకాదు. ఎవరి మనోవాసనలచే వారు వేరు వేరుగా కల్పించుకున్నదే కనుక ఎవరి మనస్సు వాసనా రహితం మయితే వారికి సంసార నాశంకలగటం ముక్తిరావటం తథ్యంకనుక (మిథ్యా) స్వప్న ప్రపంచంలోకూడ పరస్పారాదుష్టంవల్లనూ, వాసనాబలంవల్లనూ ఒకరి మనస్సు ఒకరిమనస్సుతో కలుస్తుందని వసిష్ఠుల అభిప్రాయం.

## ౧౩. భృగువును ఓదార్చుట, భృగుకాలములు శుక్రుని యొద్దకు బయలుదేరుట.

సముద్రంవల్ల పుట్టిన తరంగాలవలె, వసంతఋతువులోని తీగలవలెను, ఉన్న జీవకోటిలో మనోమోహాన్ని పోగొట్టుకున్న వారేకృతార్థులు. వారే జీవన్ముక్తులు - వారే పరావరుడయిన పరమాత్మను సాక్షాత్కరించుకున్న వారు - వీరు మనుష్యులలోనూ ఉంటారు. యక్షుల

లోనూ ఉంటారు. గంధర్వులలోనూ ఉంటారు. కిన్నరులలోనూ ఉంటారు. మిగిలినవారు కాష్ఠకుడ్యాలవంటి (కొయ్య గోడలవంటి) వారు - మూఢులు సాధన చతుష్టయ సంపన్నులయిన అజ్ఞులే శాస్త్ర విచారమునందు అర్హులు - తత్త్వజ్ఞులకు శాస్త్రవిచారంతో పనిలేదు. అట్టివారు శాస్త్రాలను రచించి అజ్ఞులను ఉద్ధరించుట కొరకే దేహధారులై ఉంటారు. శాస్త్రములుకూడా శుద్ధచిత్తుల యెడలనే ఫలిస్తాయి. "జ్ఞానము త్పాద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః" అనునట్లు పాప క్షయం అయితేనే మానవులకు జ్ఞానం కలుగుతుంది. శాస్త్ర విచారం వల్లనే మనోమోహం నశిస్తుంది. సూర్యుడు నభోమండలంలో విహరిస్తేనే చీకటి నశిస్తుంది - వృత్తి క్షయం, (అజ్ఞాన నాశం) కాని మనస్సుమోహానికి దారితీస్తుంది కాని. ముక్తికి దారితీయదు.

అలాంటి మనస్సు మంచువలె ఆవరిస్తుంది. వేతాళునివలె (పిశాచమువలె) ఆడుతుంది. (నాట్యంచేస్తుంది.) దేహతాదాత్మ్యం చెందిన జీవులందరికీ సుఖదుఃఖముల నిచ్చేది మనోమయ శరీరమేకాని మాంసమయ శరీరం కాదు. మాంసాస్థుల సమూహమయిన పాంచభౌతిక దేహంకూడా మనోవికల్పమేకాని పరమార్థంకాదు - భృగుమహర్షి! నీకొడుకు మనశ్శరీరంతోడనే ఆయా జన్మలను సంకల్పించాడు - వాం డాడుకూడా అందులో మాతప్పేమీలేదు - మానవుడు తన వాసనా ( సంస్కార ) బలంచేత, దేనిని కోరుతాడో, దానిని పొందుతాడు - అందులో ఇతరులకు కర్తృత్వం ఉండదు. మనోవాసనచేత అను సంధాన మాత్రంచేత, క్షణంలో నెరవేరే పనిని, త్రిలోకాధిపతి కూడా, (బ్రహ్మదేవుడు) ఎంతకాలానికయినా, ఎంతప్రయత్నించినా చేయలేడు - విశాలమయిన నరలోకాలుకాని, జన్మమరణ, రోషణాలు కాని, మనస్సంకల్ప రూపాలుకాని అంతకంటే వేరుకాదు - మనస్సు యొక్క ఏకొద్దిపాటి చలనమయినా దుఃఖమును ఇస్తుంది కాని సుఖాన్ని

ఇయ్యాడు. (మనస్సుచలించిందంటే దుఃఖం తప్పదు.) కనుక ఎందుకు పెచ్చుమాటలు ? రెండు. మీకుమారుడున్న తావుకు పోదాము. మీ కొడుకు - స్వర్గభోగాన్ని మనః కల్పితమయిన శరీరంతో, అనుభవించాడు. ఆకాశాది క్రమంచేత భూలోకానికి చేరాడు - చంద్రకిరణ సంపర్కం వల్ల ఔషధులను ప్రవేశించాడు. అన్న రేతోరూపంతో జన్మ పరంపరలను పొందాడు— ఇపుడు సమాగానదియొడ్డున తాపసుడై ఉన్నాడు. ఇదంతా ఎలాజరిగిందో చెపుతా చూడండి— మీ కొడుకయిన శుక్రునియొక్క ప్రాణవాయువు మొదటచేత నాశక్తిని విడిచింది. తరువాత మంచురూపాన్ని చెందింది. చంద్రకిరణాలలో చేరింది. క్రమంగా నేలమీదపడి సస్యం అయింది. తరువాత వ్రీహ్యాది ధాన్యరూపాన్ని చెందింది. పురుష శరీరంలో ప్రవేశించి రేతస్సు అయింది. స్త్రీగర్భంలో చేరి పిండం అయింది. తరువాత పుట్టింది. ఇది ఉత్పత్తి క్రమం— ఇలా, కాలస్వరూపుడు, ప్రపంచపరిస్థితిని గూర్చి చెప్పి నవ్వుతూ, చేయిచాచి భృగువు చేయిపట్టుకున్నాడు. సూర్యుడు కిరణబృందంతో చంద్రుని గ్రహించినట్లు— భృగువుకూడా “అబ్బా ! నియతి యొక్క మర్యాద (వ్యవస్థ) ఎంతచిత్రం ? అని అంటూ మెల్లగా లేచి బయలుదేరాడు ఉదయాద్రి నుండి సూర్యుడు లేచినట్లు. ఇలా బయలుదేరిన కాలభృగువులు ఇద్దరూ నభోమండలంలో పూర్ణ చంద్ర, సూర్యులవలె ప్రవేశించారు. ఇలా వసిష్ఠ మహాముని శ్రీరామున కుపదేశించుచుండగా, ప్రొద్దు గ్రుంకినది. మునికి నమస్కరించి సాయం సంధ్యాద్యనుష్ఠానము కొరకు సభ లేచింది. మరల సూర్యోదయం కాగానే వసిష్ఠుని చేరుకున్నది.

— ఇట్లు ఎనిమిదవ రోజు ప్రసంగము ముగిసినది :—

వీరిద్దరు సమాధియందున్న శుక్రుని లేపుట, శుక్రుడు జన్మాంతరములను వర్ణించుట —

మందరాచల కందరమునుంచి కాలభృగువు లిద్దరూ బయలు దేరి, కొండదిగుచూ, సిద్ధసాధ్య, కిన్నరాదులను, గజయూథములను. చమర మృగములను, అనేకములను చూచారు – క్రమంగా సమంగా నదీతీరంచేరారు. ఆనదీ తటమున తపస్సుచేస్తూ నిర్వికల్ప సమాధిలో నున్న కొడుకునుచూచాడు భృగువు. కాలముకూడా భృగుపుత్రుని చూచింది. ఇతడే నీ కొడుకు అని బిగ్గరగా అరుస్తూ చెప్పింది భృగువుతో. భార్గవుడు ఆధ్వనికి, ఉరుముకు నెమలివలె, మెల్లగా కండ్లు తెరచి, కాలభృగువులను ఇద్దరనూచూచాడు, ప్రత్యక్ష సూర్యచంద్రులవలె ఉన్నారు. ఇద్దరూ – విప్రవేషమును దాల్చిన శివకేశవులవలె ఉన్నారు. నమస్కరించాడు వారిద్దరికీ భృగుపుత్రుడు కుశలప్రశ్నలను చేసికొని ఒక రాతిమీద కూర్చున్నారు ముగ్గురూ – మేరు శిఖరం మీద బ్రహ్మ విష్ణు మహేశ్వరులవలె ఉన్నారు. పిదప సమాధి చాలించి వారిద్దరతోను అమృతాయమయిన మాటమాట్లాడినాడు భృగుపుత్రుడు. స్వామీ! మీ యిరువురను చూచినందున నాకు అమందానందము కలిగింది. శాస్త్రాధ్యయనం చేత, తపస్సుచేత, ఉపాసన చేత, బ్రహ్మవిద్యచేత కూడా పోనటువంటి మనోమోహం మీదర్శనంచేత ఎగిరిపోయింది. మీ చూపుల వలన కలిగిన ఆనందం, అమృత వర్షధారల వల్ల కూడా నాకు కలుగునట్లు లేదు. ఇచ్చోటును పవిత్ర పరచిన మీయిరువురు ఎవ్వరు ? అని అన్నాడు భార్గవుడు.

రామా ! ఇలా అనేసరికి భార్గవుడు, అతని తండ్రి భృగువువిని, యీ మాటలను, "నాన్నా" "నీవు నాకు వెనుకటి జన్మలో కుమారుడవు" స్మరణకు తెచ్చుకో, నీవు అజ్ఞానివి కావు" అన్నాడు తండ్రి– (భృగువు) తండ్రి ఇలా జ్ఞాపకం చేసేసరికి క్షణకాలం ధ్యానించి తన జన్మాంతర దశను అంతా స్మరించుకున్నాడు భార్గవుడు. ఆశ్చర్యపోయాడు. సంతోషించాడు ఇలా అన్నాడు. స్వామీ! "పరమాత్మయొక్క మాయాశక్తి యొక్క విచిత్ర కార్యారంభ సామర్థ్యము మనకు అంతు

చిక్కడు. ఈ జగచ్చక్రము యావత్తూ దానివల్లనే తిరుగుతూ ఉన్నది నాకు అనేకజన్మలు గడచినవి. అన్నీ నాకు తెలియును కూడా-మరణ మూర్ఛాది దశలు కూడా అనేకం అనుభవించాను. క్రోధోద్రేకములు గల ద్రవ్యార్జన క్రియలు కూడా అనేకం గడచాయి నా జీవితా లలో-మేరుపర్వతంమీద చాలకాలం విహరించి నాను.

మందాకినీ తటములందు సంచరించాను- కల్పతరుచ్ఛాయలందు విశ్రమించాను. నేననుభవించనది లేదు. నేను చేయనిది లేదు. మంచి కాని చెడుకాని నేను చూడనిది లేదు. తెలియవలసిన దానిని తెలుసు కున్నాను. చూడవలసిన దానిని చూచాను. ఇపుడు విశ్రాంతి తీసి కున్నాను. నాకుగల భ్రమలన్నీ అంతరించాయి. నాయనా ! ఇంక లెమ్ము మందరపర్వతంమీదఉన్న ఆ శరీరంవద్దకు వెళ్లుదాము _ అది ఎండీ ఎండని వనలతవలె ఉండి ఉంటుంది. ఇప్పుడు నాకు కోరికగల వస్తువూ లేదు. కోరిక లేని వస్తువూ లేదు. కేవలము నియతియొక్క రచనను చూడటానికి మాత్రమే ప్రపంచంలో ఉన్నాను నేను - ప్రారబ్ధ శేషమును అనుభవించుట తప్ప వేరుపనిలేదు-" నాకు అని అన్నాడు-

భార్గవుడు వెనుకటి శరీరమును చూచి పరితపించుట - ఈ ముగ్గురూ ప్రపంచపరిస్థితిని విచారించు కుంటూ బయలుదేరారు. సమంగా నదీతటం నుంచి (వీరికి ప్రాణవాయు చలనమే కాని, బాహ్యశరీ రేంద్రి యాదుల పనిలేదు కనుక నేచంచలాసువులై బయలుదేరారని వ్రాశారు. వాల్మీకులు) క్షణకాలంలో నభోమార్గాన మందరపర్వత గుహను చేరారు - దానిపై భాగంమీద తడి ఆకులలో దాగిఉన్నట్టించి పోయిన వెనుకటి శరీరాన్ని చూచాడు. భార్గవుడు _ 'నాయనా" నీవు సుఖసంభోగాలతో కని పెంచిన నాప్రాక్తన శరీరంఇదే " అని తండ్రికిచూపాడు. ఈశరీరాన్ని ధాత్రి (నన్ను పెంచినదాసి,) కర్పూర, అగరు, చందనములతో పూతపూసినది. మేరూప వనభూములందు

మందార పూగుత్తులతో పడకను అమర్చిన శరీరము ఇది – మదించిన దేవతా స్త్రీగణము లాలించిన శరీరమిది. పాములు, తేళ్లు మొదలగు పురుగులచే కరవబడిన (చిద్రముచేయబడిన) శరీరమిది – మంచి గంధపుకోటలలో క్రీడించిన శరీరమిది – మితిమీరిన మన్మథ వికారంతో ఒళ్లు తెలియకుండా దేవతా స్త్రీలతో సంభోగించిన శరీరమిది ఇపుడు శుష్కించి పడిఉన్నది – హే దేహమా ! ఆయా చోటుల, ఆయాదశలలో, ఆయాభావనలతో సంసారబంధాన్ని అనుభవించిన నీవు ఇపుడు స్వస్థంగా పడియున్నావుకదా ! "హే శరీరమా ? శవాకారమైనావు ? అస్థిమాత్రావశేషమయినావు ? చూడ భయంకరంగా ఉన్నావు – నేను నీతో ఎన్నివిలాసాలుచేసినాను? ఎంత ఆనందం అనుభవించాను ! నక్షత్రాలవంటి ముత్యాలహారాలున్న నా రొమ్ము మీద చీమలు కాపురంచేస్తున్నాయి– మేలిమి బంగారమువంటి కాంతి గలిగి అనేకమంది అప్సరసలనుకూడ లోభపెట్టిన నీవు అస్థిపంజరమైతివి కదా ?

ఇప్పుడు తెరచియున్న నానోరుచూస్తే వనమృగములు బెదిరిపోతూఉన్నాయి ఈ ముఖవికారానికి చూడచూడ నీపరిస్థితి వివేకవంతులకు వైరాగ్యం పుట్టించేటట్లున్నదికదా ? ఇంతవరకు విషయవిముఖమై నిర్వికల్ప సమాధిచే, ఈ కొండమీద ఎండిపడియుంటివి కదా !" నేనిపుడు చిత్తమనే పిశాచాన్ని వదల్చుకొని, సుఖంగా ఉన్నాను – ఏభయమూ లేదు నాకిపుడు నాకు గలిగిన ఆనందం సార్వభౌమునికి కూడా ఉండదు. చూడు నాసందేహాలు అన్నీతీరాయి. సంతోషాలన్నీ అడుగంటాయి. సంకల్పాలన్ని రూపుమాశాయి. ఎలా సుఖంగా నిద్రిస్తూ ఉందో నా శరీరం ! పరమానందాన్ని పొందుతూ ఉంది. మనోనాశం అయితే కాని ఆశాపాశాలు అంతరించవు. హిరణ్యగర్భలోకానంద పర్యంతమూ, విషయ సుఖాన్ని అనుభవించినవారే, అపరిచ్ఛిన్న బ్రహ్మసాక్షాత్కారం కలిగి శాంత

మనస్కులై ఉంటారు. నేను కూడా సర్వగుణభావస్థలను విడిచి, సకల మనోజ్వరములను రూపుమాపి, అదృష్టవశాన, వనోనాశ స్థితిలో “ఉన్న ఈనాశరీరాన్ని చూస్తున్నాను.” అంటూ కొంతకాలం తన శరీరాన్ని చూచి పరితపించాడు. తుదకు జీవన్ముక్తుని శరీర సామ్యాన్ని పోల్చుకొని తనశరీరమును గూర్చి అభినందించాడు. (ఆనందించాడు) భార్గవుడు = అన్నారు వసిష్ఠులు = విన్నారు శ్రీరాముడు, ఇలా ప్రశ్నించాడు.

శ్రీరా—మహర్షీ ! ‘భార్గవుడు అనేక శరీరాలను అనుభవించాడు కదా’ భృగువువల్ల పుట్టిన శరీరంలో ఏమి విశేషం ఉంది ? ఎందువల్ల దీనిని గురించే ఇంతగా దుఃఖించాడు అన్నాడు రాముడు.

రామా ? – శుక్రుడు 9 గ్రహములలో ఒకానొక గ్రహము – ఇతడు ఈగ్రహాధికారాన్ని పొంది కొంతభోగం అనుభవించే కర్మలను వెనుకటి కల్పంలో చేశాడు. ఆకర్మలు ఆ కల్పంలో జీవుడు ఉత్క్రాంతిని చెందేటప్పుడు ఈ కల్పంలో భృగువువల్ల పుట్టబోయే శరీరాకారంగా పరిణమించాయి. అదే వాసన (సంస్కారం)తో ప్రళయంలో చాల కాలం ఉన్నాయి. ఈ కల్పంలో ఆకాశాది భూతసామ్యాన్ని పొంది అన్నంద్వారా ప్రాణాపానాది వాయుప్రవాహంతో ఆభృగువు యొక్క హృదయాన్ని ప్రవేశించాయి పిదప రేతోరూపాన్ని చెందాయి. శుక్రుని యొక్క శరీరాకారంగా తయారైనాయి. కనుక యీ దేహంలో అనుభవింప దగిన ప్రారబ్ధకర్మలు ఎక్కువగా ఉన్నందున యీ శరీరం మీద ఇంతటిప్రేమ శుక్రుడికి. మిగిలిన శరీరాలమీద ఇంతటి ప్రేమలేదు.

ఆశరీరాలతో అనుభవింపదగిన కర్మలు మిగిలిలేవు. అవి అన్నీ కేవల సంకల్పమయములు– కనుక భృగువువల్ల పుట్టిన శరీరాన్ని గూర్చియే ఇంతగా పరితపించాడు భార్గవుడు. వీతరాగులయినా, నిరీహులయినా– దేహధారులకిది సహజం. దేహం ఉన్నంతవరకు ప్రారబ్ధాన్ని

అతిక్రమించలేరు- ప్రారబ్ధం ఉన్నంతవరకు దేహధర్మాలను మానుకో లేరు. జ్ఞాని అజ్ఞానులకు యీ క్రమం (మర్యాదానియమము) తప్పదు- నిస్సంగంగాగాని, ససంగంగాని లోకవ్యవహారాన్ని అనుసరిస్తూ ఉండవల సిందే ఇద్దరూ- వ్యవహారానుసరణలో పండితుడికీ అపండితుడికి తేడా లేదు. అపండితుడికి లోకవ్యవహారానుసరణవల్ల వాసనలు అంటుతాయి. పండితుడికి అవి అంటవు. అందువల్ల పండితుడికి మోక్షం. అపండితుడికి అది లేదు. నిస్సంగులయిన ధీరులు దేహం ఉన్నంతవరకూ, సుఖనిమిత్తము నందు, సుఖాన్ని, దుఃఖనిమిత్తంలో దుఃఖాన్ని అనుకరిస్తూ ఉంటారు. ఇతరులకు మాత్రం అజ్ఞానులవలె ఉన్నట్లు కనిపిస్తారు - కాని నీటిలోని సూర్య ప్రతిబింబాలవలె చలిస్తారు అజ్ఞానులు. ఆకాశమునందలి సూర్య బింబమువలె చలించరు జ్ఞానులు-ఇదే లోక వ్యవహారంలో వీరిద్దరకూ గల తేడా-నభోమండలంలో స్థిరంగా ఉన్న బింబసూర్యుడు, ప్రతిబింబ లో చలిస్తూ ఉన్నట్లు గోచరించిన విధంగా, బుద్ధుడు (జ్ఞాని) లోకవ్యవహారంలో ఉండేసరికి అబుద్ధునివలె (మూఢునివలె) కనిపిస్తాడు- కర్మేంద్రియాలు పనిచేస్తున్నా, బుద్ధీంద్రియాలు నిస్సంగంగా ఉంటే వాడు ముక్తుడే - జ్ఞానేంద్రియాలు ససంగంగా ఉంటే కర్మేంద్రియాలతో పనిచేయక పోయినా వాడు బద్ధుడే- సుఖదుఃఖాలకూ, బంధ మోక్షాలకు కారణం జ్ఞానేంద్రియాలు కాని కర్మేంద్రియాలు కాదు. కాబట్టి రామా ! నీవు కూడ బయటికి లోకాచారాన్ని ఆచరిస్తూ లోపల (మనస్సు) మాత్రం లోకాచారాన్ని వదలి కూటస్థునివలె నిశ్చలంగా ఉండు - ఫలేచ్ఛ లేకుండా కర్మలనాచరించు - శరీరాలకు కర్మలు (పనులు) సహజములు మమత్వమనే అంధకూపంలో (పాడుబావిలో) పడమాకు దృశ్యము లయిన శరీరాలయందు నీవు లేవు. నీయందు అవీ లేవు. నీవు శుద్ధబుద్ధ ముక్తస్వభావుడవు- కనుక రామా ? నీవు ఇషణత్రయ రాహిత్యుడవై, అవిద్యా శూన్యమూ, పరిపూర్ణానంద రూపమూ అగు బ్రహ్మమును అనుభవిస్తూ మమతను పారద్రోలుకొని, చిత్తాన్ని జయించటంలో ని

సత్త్వాను చూపేయెడల, నీబుద్ధికి మెచ్చుకుని మాబోటివాండ్లము కూడా నీకు "దాసోఽహం" అంటాము - అన్నారు వసిష్ఠులు.

### ౧౬. శుక్రుడు మరల తనశరీరంలో ప్రవేశించుట.

వసి॥ రామా! కాలపురుషుడు భృగు తనయుని మాటలువిన్నాడు. గంభీరస్వరంతో ఇలా అన్నాడు. "భార్గవా! నీవు సమంగా నది యొడ్డున తపస్సుచేసే శరీరాన్ని విడిచి ఈశరీరాన్ని ప్రవేశించు - ఇది ముందు పుట్టినది. దీనితో తపస్సుచేసి, అసురులకు గురువై ఉండి మహా కల్పాంతం వరకూ, ఆపైన ఈశరీరాన్ని (నీతండ్రివల్ల పుట్టిన శరీరాన్ని) విడిచిపెట్టుదువు - అంతవరకు జీవన్ముక్తుని స్థానములో ఉండు- మీకు మంగళమగుగాక - మేము పోయివచ్చెదము మా కభిమతమయిన చోటుకు - పరమ ప్రేమాస్పదమయిన ఆత్మభావంలో ఉన్న మాకు అనభిమతమయిన తావేలేదు." కనుక ఆత్మభావమును చెందుచున్నా మని యర్థము.) అని చెప్పి కాలపురుషుడు అంతర్థానం చెందాడు. భృగు భార్గవు లిద్దరూ స్నేహంవల్ల కన్నీరు కార్చారు.

కాలపురుషుడు అంతర్థానం చెందగానే భార్గవుడు అవశ్యం భావి యగు కర్మగతిని ఆలోచించాడు. ఈశ్వరేచ్ఛ అనివార్యమని గమనించాడు - మొదట శరీరాన్ని ప్రవేశించాడు. వెంటనే తపస్సుచేసిన శరీరము వేరుతెగిన చెట్టువలె వివర్ణమై పడిపోయింది. భృగువు తన కమండలంలోని నీళ్ళతో. పుత్రుడి శరీరంమీద ప్రోక్షించాడు మంత్ర పురస్సరంగా - నాడులు అన్నీ మళ్ళీమామూలు స్థితికి వచ్చాయి. వెంటనే శుక్రుడు ఉఛ్ఛ్వాస నిశ్వాసాలతో పైకి లేచాడు. వెనుకటివలె యౌవనసౌందర్యాలతో మనోహరంగా ఉన్నాడు - తండ్రికి నమస్కరించాడు. తండ్రి తానుకన్న పుత్రశరీరాన్ని కౌగలించుకున్నాడు - ప్రాక్తన స్నేహంతో చాలకాలం చూచాడు - భృగువు అంతటివానిని కూడా పుత్రప్రేమ అనేది తారుమారు చేసింది-మమకారమనేది ఎంతటి

పోకయినా దేహం ఉన్నంతవరకూ తప్పదు- అతండ్రి కొడుకులిద్దరూ, చిరకాల వియోగం వల్ల ప్రేమ పెరిగి, దివాకర పద్మాకరములవలెనూ, చిరకాలమునకు కలసిన చక్రవాక దంపతులవలెనూ, నెమలి మేఘముల వలెనూ, మహా ఉత్సాహంతో ఉన్నారు - క్షణకాలం అలాఉండి, వెంటనే లేచి వెనుక, సముంగానదిఒడ్డున తపస్సు చేసిన ఆ బ్రాహ్మణ శరీరాన్ని దహనం చేశారు. లోకాచారాన్ని ఎవరు పాటించరు?

ఇలా వీరిద్దరూ ఆ అడవిలో ఉంటూ, తాపసులయినారు. తత్త్వ జ్ఞానులయినారు - జగద్గురువు లయినారు - జీవన్ముక్త లయినారు. తరువాత కొంతకాలానికి శుక్రుడు అసురులకు గురువయినాడు గ్రహాధి కారాన్నికూడా పొందాడు - భృగువుకూడా, బ్రహ్మ లోకం చేరాడు- అన్నారు వసిష్ఠులు.

౧౭. మనోరాజ్య సంమేలనము (శుద్ధచిత్తులయొక్క సత్యసంకల్ప త్వము) విన్నాడు శ్రీరాముడు భార్గవుని చరిత్ర అంతా - ఇలా అడిగాడు వసిష్ఠుని - మహర్షీ! భార్గవుడు అప్సరసతో కలియాలను కున్నాడు కలిసితీరాడు- స్వర్గసుఖం అనుభవించాలనుకున్నాడు. అనుభ వించి తీరాడు- రాజ్యం ఏలాలనుకున్నాడు. ఏలాడు రాజ్యం- తపస్సు చెయ్యాలనుకున్నాడు చేశాడు తపస్సు ఏది సంకల్పిస్తే అది అంతా అయితీరింది. అందరి సంకల్పాలు అలాఫలించవేమి? అని అన్నాడు - వసిష్ఠుడు జాబాబు చెప్తాడు. రామచంద్రా! సంకల్పాలు ఫలించ టానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి, సంకల్పము సత్యము కాదగిన చిత్తశుద్ధి - రెండు. ప్రాణోత్క్రాంతి సమయంలో ఉద్బుద్ధమయిన (పొంగిన) పరిపక్వ కర్మవాసన ఈ రెంటిలో శుక్రునకు సత్య సంకల్ప మునకు తగిన చిత్తశుద్ధిఉన్నది - ఎలాగంటే! శుక్రుడు, గతకల్పంలో చివరి జన్మలో తానుఆచరించిన కర్మోపాసనలచేత ఆ కల్పంలోని దోషాలు అన్నీపోయాయి. ఈకల్పములో ఈశరీరం మొట్టమొదట పుట్టి నందున, ఈ కల్పసంబంధమయిన దోషాలు లేవు. దీనికి బ్రహ్మగారి

సంకల్పంవల్ల అధికారానుభవం కొరకు పుట్టినందున సాంకల్పికదోషాలకు ప్రసక్తిలేదు. కనుక ఈయనగారి జన్మలో బీజదోషాలుకాని, గర్భదోషాలుకాని. జాతిదోషాలుకాని లేనందున, పవిత్రమయిన జన్మఇది. అందువల్ల ఈయనగారి సంకల్పాలు అసత్యము కావడమునకు వీలులేదు. సత్యములై తీరవలసిందే - ఇతరుల జన్మలు ఇలాంటివికావు. వారి జన్మలో పై చెప్పిన దోషాలలో ఏదోఒక దోషముండితీరుతుంది కనుక వారి సంకల్పాలు సత్యములుకావు బ్రహ్మవేత్తలుకూడా సత్యసంకల్పులు అగుటలో వారిచిత్తములందు రాగద్వేషాలు లేకపోవడమే కారణం శుద్ధచిత్తము సత్యము. అశుద్ధచిత్తము అసత్యము - నిర్మలమయిన మనస్సు దేనిని భావించునో అది అయితీరుతుంది.

కొందరికి చిత్తశుద్ధి లేకపోయినా, సత్య సంకల్పులు కాకపోయినావారు, మరణకాలంలో ఉద్బుద్ధమయిన కర్మవాసనలనుబట్టి, తదనుగుణమయిన సుఖదుఃఖభోగాలు అనుభవిస్తారు. అందుకుకూడ దృష్టాంతము శుక్రునకు కలిగిన ప్రపంచ ప్రతిభానమే. బీజములోని మొలకలూ ఆకులూ శాఖలూఎలాంటివో, అలాంటివే ఈజీవకోటియొక్క ద్వైత భ్రాంతులన్నీ - ప్రపంచం పుట్టిందీలేదు. చచ్చిందీలేదు. ఇదిఅంతా మాయయొక్క విజృంభణముకాని, మరొకటికాదు. మనకు ప్రపంచం ఎలా స్పష్టంగా భాసిస్తూఉందో, అలాగే ఇతర జీవులకుకూడా భాసిస్తూ ఉంది. స్వప్నసంకల్ప నగరవ్యవహారంవంటివి ఈ సంసారభ్రమలు - ఒకరిస్వప్నం మరొకరికి తెలియనట్లు ఒకరికి గోచరించిన బాహ్యభ్రాంతి కూడా మరొకరికి గోచరించదు. ఎవరికి వారికి వేరు వేరుగనే సంసార భ్రాంతులు గోచరిస్తూ ఉంటాయి- రామచంద్రా! మనమందరం కూడా ఇలాగే శుక్రుడివలెనే తయారయినాము. మనకేకాదు. మనకు పైవాడయిన హిరణ్యగర్భునియందు కూడా ఇదే చందం. ఈ అంధపరంపరా న్యాయం అందరికీ సమానం. కనుక రామా ? ప్రపంచం అంతా ప్రాతిభాసికం కాని యదార్థంకాదు. వస్తు తత్వాన్ని తెలిసికొంటే

ఇది నిలవదు. ఇది బాగావిచారిస్తే చిత్తమనే ఏనుగునకు ఒకదీర్ఘ స్వప్నం అనాలి. కనుక చిత్తసత్తయే జగత్సత్త జగత్సత్త,చిత్తసత్త - ఈ రెంటిలో ఒకటిపోతే రెండోది పోయినట్లే- చిత్తంపోతే జగత్తులేదు. జగత్తుపోతే చిత్తంలేదు. ఆ ఒకటి అయినా తత్త్వవిచారణవల్లకాని మరోదానివల్ల పోదు. మలినమయిన మణిని తుడిస్తే గాని దానికాంతి బయటపడదు. మలినమయిన చిత్తాన్ని ఉపాయములచేత శుద్ధిచేస్తే కాని నిజమయిన వస్తువు స్ఫురించదు. దృఢమయిన ఏకాగ్రతవల్ల కాని, చిత్తము శుద్ధముకాదు. వాసనా రహితమయిన చిత్తము స్వచ్ఛ మవుతుంది. మలిన వస్త్రమునకు రంగు అంటదు. మలిన చిత్తానికి తత్త్వంపట్టదు. అన్నారు. వసిష్ఠులు.

శ్రీరా॥ మహర్షీ ! ప్రపంచభ్రాంతులన్నీ మనోవాసనల ననుస రించి ఉంటవని అంటిరికదా ! మీరు శుక్రుడు స్వర్గసుఖాన్ని, అప్సరస జన్మను మొదలగు వానిని పూర్వం అనుభవించి ఉండలేదు కదా. అలాంటి అప్పుడు అతనికి కారణమయిన వాసనలు ఉండవుకదా ! లేనప్పుడు ఈ ఆరోపక్రమం అంతా ఎలాతయారయింది అతనికి. అని అడిగాడు - శ్రీరాముడు. వసిష్ఠులు సమాధానమిస్తారు. రామా! శుక్రుడికి, తండ్రిగారి మాటల వల్లనూ, శృతిస్మృత్యాదుల వల్లనూ, ఐహికాముష్మిక ప్రపంచము ఉత్పత్తి వినాశాలు కలదిగా చిత్తంలో పడింది, అలాగే వాసనారూపంతో చిత్తంలో నిలచిపోయింది. కనుక అతడు స్వయంగా అనుభవించం పోయినా తండ్రిగారి మాటవలవల్లనూ, శాస్త్రజన్య జ్ఞానంవల్లనూ, మనస్సులో పడినవి కూడా వాసనారూపాన్ని చెందుతాయి. ఆ వాసనవల్ల కూడా శుక్రుడికి యీ భోగాలు క్రమంగా సంభవించ వచ్చును.

విత్తనమువల్ల అంకురపత్రలతా పుష్ప ఫలములతో కూడిన వృక్షము పుడుతుంది. చైతన్యాధిష్ఠితమయిన అవిద్యవల్ల విచిత్ర కార్యజాతంతో కూడిన ఈప్రపంచం పుడుతుంది. ఇలాంటి ప్రపంచం

వ॥ రామా ? కాచిన ఇనుపముక్కలు రెండూ ఒక దానితో ఒకటి కలుస్తాయి – రెండూ కాచినవి కాకున్నా, ఒకటి కాచినదీ రెండవది కాచనదీ అయినా అపుడు ఒక దానితో ఒకటి కలియవు–అలాగే పరిశుద్ధమయిన చిత్తము ఐక్యమవుతుంది. కలుస్తుంది– పరిశుద్ధమయిన చిత్తంతో అపరిశుద్ధమయిన (మలినమయిన) చిత్తము, పరిశుద్ధమయిన చిత్తంతో కలియదు. కనుక చిత్తతత్త్వములు శుద్ధములయినపుడే పరస్పర సమ్మేళనం ఉంటుంది. నిర్మలమయిననీరే నిర్మలమయిన నీటితో కలుస్తుంది. (కలుషములయినవి) ఒకదానితో ఒకటి కలియవు – చిత్తము శుద్ధమగుట యనగా వాసనారహితమగుట. అనగా ఆత్యంతికవాసనాక్షయమే చిత్తమునకు అసలయిన శుద్ధి – అనగా భూతభౌతికముల జ్ఞానము లేకుండా ఏకరూపముగ నుండుట. అప్పుడే ఆచిత్తమునకు తత్త్వజ్ఞాన మబ్బుతుంది. ఆ స్థితియందే ముక్తి లభిస్తుంది.

౧ వ జీవనఖండకావతారము

మరిన్ని, సకల జీవులకూ, సృష్టి ఖండములందు స్థూల సూక్ష్మ కారణ శరీరములు వేరు వేరుగ భాసిస్తూ ఉంటాయి– అది స్వప్రకాశ చిదేకరసుడయిన ఆత్మయందు, (వారి వారి ప్రకృతికి అనుగుణంగా) కల్పించుకొనుటచేతనే. వాస్తవముగా కాదు – జీవులందరూ మొట్ట మొదట మాయాశబల బ్రహ్మయందు లీనమైఉంటారు. అదివారి కప్పుడు మహాసుషుప్తి – ఆపైని వాళ్ళకు స్వప్నజాగరాదులందు కలిగే ప్రవృత్తి నివృత్తులు, ఆచైతన్యముయొక్క వ్యాప్తివలననే జరుగుతూ ఉంటాయి. చైతన్య ప్రకాశంవల్లనే ప్రతి జీవుడూ ప్రాపంచిక పదార్థాలను తెలిసికుంటున్నాడు. ప్రయత్నిస్తున్నాడు ప్రవర్తిస్తున్నాడు. అందరికీ సాక్షిభూతమయిన చైతన్యమొక్కటేకాని వేరుకాదు. అదేభిన్న భిన్నోపాధులతో సంబంధించి ఉంటోంది – కనుక, అందరి మనస్సులతోటి సంబంధించియున్న చైతన్యము ఒక్కటే కనుక, ఒకరి మనో

రాజ్య ప్రపంచము మరొకనికి గోచరించవచ్చును. తన సూక్ష్మ సాక్షి చిన్మాత్రమును ఆయా ఉపాధులతో కలిపితే (వారి వారి మనస్సులతో కలిపితే) ఆయా ఉపాధులలో ఉండే మనోరాజ్య ప్రపంచాలు గోచరిస్తాయి. లేక బ్రహ్మాత్మైక్య నిశ్చయం చేతకూడా సర్వమూ తనకు గోచరించవచ్చు. ఈ రెండు ఉపాయాలవల్లనూ ఒకరి మనోరాజ్యమును మరొకరు గుర్తింతురు. మరో ఉపాయంలేదు - ఇదే ప్రణాళికతో (చిన్మాత్రైక్య ప్రణాళికతో) ఒకరి వ్యవహారాన్ని మరొకరు నిజమనుకొని తుదకు ప్రపంచం సత్యమనే దృఢనిశ్చయంలో పడ్డారు. కొందరు ఇతరుల ప్రపంచంతో సంబంధం పెట్టుకోకుండానే, వారు కల్పించుకున్న ప్రపంచంలోనే వారు అంతమొందుతారు. మరికొందరు ఇతరుల సృష్టితో (ఇతరులు కల్పించుకున్న వస్తువులతో) కలసి వ్యవహరిస్తారు.

ఇలాఎన్నో బ్రహ్మాండాలు అనే గురిగింజలు బ్రహ్మాకాశం (మాయాశబల బ్రహ్మస్వరూపమనే అడవిలో) పుట్టాయి- నశించాయి. ఈప్రపంచాలనే గురిజలు అన్నీ ఒకదానితో మరొకటి కలసి నిబిడీభావమును జెంది సర్వసాధారణమయిన వ్యవహారమునకు, యోగ్యమవుతాయి- ఏ ప్రాణికి ఏవస్తువు కర్మానుభవమునకు తగియుంటుందో దానినే ఆప్రాణి తెలిసికొంటాడు - లోకాంతరీయ వస్తువులనుగాని దేశాంతరీయ వస్తువులనుగాని చూడడు. ఒకరి మనస్సుకు మరొకరి మనస్సులో ఉండే మనోరాజ్యం అనుభవయోగ్యం కాదని ఊరకుండే సరికి వారికి వీరూ వీరికివారూ వేరయిపోతున్నారు - ఇలా విభిన్నమనోరాజ్యరూపములయిన సృష్టులు, తుల్యకర్మ వాసనాదులవల్ల ఏకకాలంలో ఘనోన్ముఖములవుతాయి. అపుడు ఒకరితో నొకరికి పరస్పర సంబంధ మేర్పడుతుంది. సమష్టివ్యష్టి స్థూలదేహములు ఏర్పడతాయి దేహభావన నిరూఢమయితే దేహం ఉంటుంది. దేహభావన మరచిపోతే మానవునికింక దేహమేలేదు - స్థూలదేహభావన నిరూఢమైతే స్వాభావికమయిన ఆత్మస్వరూప స్థితిమరపుకు వస్తుంది - కల్పితమయిన సంసార

పరిస్థితి అనుభవంలోకి వస్తుంది. ఇలా మలినాంతః కరణులుకూడా కర్మసంబంధంవల్ల ఒకానొకచోట ఒకరి మనోరాజ్యంతో మరొకరు కలిసి వ్యవహరిస్తూ ఉంటారు - ఇలాగే శుద్ధాంతః కరణులకుగూడ ఇతరుల మనోరాజ్య వృత్తాంతం తెలుస్తుంది- అందుకు దృష్టాంతం చెబుతా విను - హఠయోగాభ్యాసంచేత ప్రాణవాయువు, పరిశుద్ధం అవుతుంది. పరకాయ ప్రవేశం చేస్తుంది. పరుల ప్రాణాలూ, దేహేంద్రియాలూ తనవని అనుకుంటుంది- అందుచేత వాళ్లు తెలుసుకోదగిన శబ్దాది విషయాలను తెలిసికొంటుంది.

అలాగే పరిశుద్ధమయిన మనస్సుకూడా ఇతర సృష్టిలో ఉండే మనోరాజ్యాన్ని గ్రహిస్తుంది - ఇలా మలినాంతః కరణులు కాని శుద్ధాంతః కరణులుకాని పరస్పర సమ్మేళనం (ఒకరి మానసిక ప్రపంచంతో మరొకరి మానసిక ప్రపంచంకలిస్తేనే వాళ్ళకు స్థూలదేహసత్త (స్థూలదేహం ఉండుట) నిరూఢమవుతుంది - లేకుంటే లేదు - అయితే నేనింతవరకు "నేత్రస్థం జాగ్రతం విద్యాత్ కంఠే స్వప్నం సమావిశేత్ । సుషుప్తం హృదయస్థంతు తురీయం మూర్ధ్ని సంస్థితం" అనే శ్లోకంలో నేత్రములందు జాగ్రదవస్థ అనీ, కంఠమునందు స్వప్నావస్థ అనీ, హృదయమునందు సుషుప్తి అనీ శిరస్సునందు తురీయావస్థ అనీ శ్రుతిని ఆధారంగా చేసికొని చెప్పాను - దానివల్ల జాగ్రదాద్యవస్థలు దేహంలోని ప్రదేశభేదాన్ని పుచ్చుకొని ఏర్పడ్డాయి అని అర్థం అవుతుంది - ఇప్పుడు మానవులు పరస్పరం మనోరాజ్యంతో కలిస్తేనే కాని వాళ్ళకు స్థూలదేహముయొక్క సత్తనే (స్థూలశరీరముయొక్క ఉనికినే) లేదని చెప్పాను - కాబట్టి ఈ జాగ్రదాద్యవస్థలు జీవావస్థలు కాని, దేహావస్థలు కావు. జీవత్వస్వభావంవల్లనే అవస్థాత్రయం కల్పితం అవుతుందికాని, దేహాన్ని అపేక్షించికాదు. అవస్థాత్రయానికి దేహం కారణంకాదు - జాగ్రదవస్థా కల్పన ఉంటేకాని దేహం సిద్ధించదు- దేహం సిద్ధిస్తేనేకాని జాగ్రదాద్యవస్థ సిద్ధించదు - కనుక ఈ రెంటికీ

అన్యోన్యాశ్రయం ఏర్పడుతుంది - కాబట్టి అవస్థాత్రయము కల్పించు జీవత్వ స్వభావమే కారణం అనాలికాని, స్థూలదేహాదులుగా కారణాలని చెప్పటానికి వీలులేదు.

అందువల్ల శ్రుతికి ఇతరుల దృష్టిలో సిద్ధించియున్న దేహాన్ని అనువదించి, తదేకదేశమునందు కనిపించేటి జాగ్రదాది ప్రపంచాన్ని సత్యముకాదని చెప్పటంలో తాత్పర్యముకాని, జాగ్రదాది అవస్థా ప్రపంచమునకు స్థూలదేహాదులు కారణమని చెప్పటంలో తాత్పర్యం కాదు. ఇలా ఇచ్చట విషయ విభాగంచేత అభిప్రాయాన్ని గ్రహించాలి - కాబట్టి ఉదకమే తరంగాది రూపములలో కనిపించుచున్నదనే తత్త్వదర్శనం కలిగితే ఉదకముకంటె వేరుగా తరంగాది వస్తువులు లేనట్లు, జీవుడే అవస్థాత్రయాత్మ (అవస్థాత్రయ స్వరూపుడు) అను పర్యాలోచనఉంటే ఇంక జీవునికంటె వేరుగా దేహమనే వస్తువు మిగిలివుంటుందా - ఇలా తెలిసికొన్న తత్త్వవేత్త సుషుప్తికి అవసాన మయిన తురీయస్థితినిపొంది జ్ఞానంచేత జీవభావాన్ని విడిచిపెట్టుతున్నాడు. ముక్తుడవుతున్నాడు- తత్త్వమును తెలియని మూఢుడు అజ్ఞానంచేత దేహాద్యాకార కల్పనా రూపమయిన ప్రపంచంలో మునిగిపోతున్నాడు (ప్రవర్తిస్తున్నాడు) జ్ఞానికి అజ్ఞానికీ సుషుప్తిలో భేదంలేదు - ఇద్దరి సుషుప్తీ ఒకేరూపం- కనుకనే శ్రుతియందు అజ్ఞుడికికూడా, సుషుప్తి అవస్థదశ, నిరతిశయానందరూప మోక్షమునకు, దృష్టాంతంగా చెప్ప బడింది. అయితే వీరిద్దరిలో అజ్ఞుడు, వాస్తవమైన ఆత్మజ్ఞానం లేనందు వల్లనూ, దేహమే ఆత్మ అనే భ్రమవాసనలతో వాసితుడయి నందు ననూ, (అంటన వాడయినందుననూ) ఈవిశేషంవల్ల మళ్ళీ జాగ్రత లోకివచ్చి సృష్టిలో ప్రవర్తిస్తాడు- ఇతరుల సృష్టిలో ఆకర్షింపబడుతూ ఉంటాడు అజ్ఞుడు. అనగా ఇతరులు కల్పించుకున్న పదార్థాలలోకూడా తాను అభిమానం చెందుతాడు అరటిస్తంభానికి ఒకపట్టలోపల ఇంకో

8)

కమట్ట ఉంటూఉంది ఇలా అనేకమట్టలుఉంటాయి– అలాగే ఒక సృష్టిలో అవాంతర సృష్టులు అనేకం ఉంటాయి.

అన్ని మట్టలను వ్యాపించి వానిలోపల అరటిదుంప ఉన్నట్లు, స్వభావ శీతలమయిన పరిపూర్ణ బ్రహ్మము సర్వసృష్టులనూ వ్యాపించి అన్నిటికీ సన్నిహితంగా ఉంటుంది. అనేక ఆకులూ అనేక మట్టలూ చుట్టూ ఉన్ననూ, ఆదుంపను, ఆ మొత్తం అంతా అరటిచెట్టు అనేపేరే ఉన్నది. కొన్ని వేల సృష్టులు ఆవరించిఉన్ననూ, బ్రహ్మతత్త్వానికి అవి అన్నీ (బ్రహ్మతత్త్వముకంటె) భిన్నములుకావు– వటబీజమునీటితోను మట్టితోనుకలిసి వికసించి చెట్టుగాతయారయి, కొమ్మలు, రెబ్బలు ఆకులు, పూత, పిందె, కాయి, పండు, అనేరూపంతో మళ్ళీ వెనుకటి బీజభావాన్నే (గింజరూపమునే) చెందుతోంది. అలాగే బ్రహ్మకూడా కామకర్మ వాసనలనే నీటితో సంపర్కమును చెంది (తడిసి) మనస్సుగా తయారయి జన్మమరణాది కల్పనతో ఆధికారిక దేహాన్నిపొంది, క్రమంగా శ్రవణమననాదులను ఆచరించి, ఆత్మతత్త్వ జ్ఞానాన్ని సంపాదించుకొని, తిరిగి వెనుకటి బ్రహ్మభావమునే చెందుతున్నాడు. అయితే ఆ మర్రిగింజ మళ్ళీ నీటితో కలిస్తే క్రమంగా పండేకదా అవ్వాలి. అలాగే ముక్తుడయిన ఈజీవుడుకూడా, (బ్రహ్మకూడా) మరల జీవ భావాన్నేకదా చెందవలసింది ఈ దృష్టాంతంచేత, అనే సందేహం కలుగుతుంది– అందువల్ల ఆదృష్టాంతాన్ని ఇలా మార్చుకుంటే బాగుంటుంది. నీరు కారణముగాగల విత్తనము (గింజ) క్రమంగా పండు రూపముగా విజృంభించినట్లు పరిణమించినట్లు, బ్రహ్మ కారణముగా గల జీవుడు ప్రపంచరూపంతో, విజృంభిస్తున్నాడు. అంటే బాగుంటుంది–

ఇలాగయితే ఆనీటికి కారణం ఏమిటి అనేప్రశ్నలేదు కాన లోకంలో, ఆబ్రహ్మ ప్రపంచరూపంగా విజృంభించటానికి కారణం ఏమిటనే ప్రశ్నకూడా ఉండదు. అయితే పత్రకాండ, వృక్ష పుష్ప ఫలాదులందు తడికనిపిస్తూఉందికాన నీటికిది స్వభావమనిన్నీ, ఇలా

గంటి స్వభావముగల రసమే (నీరే) పత్ర వృక్ష పుష్పాలతాదులకు కారణమనిన్నీ, స్వభావవాదాన్ని ఆశ్రయించి, జగత్కారణమయిన బ్రహ్మనుకూడ జగద్ధర్మమును చెందునట్టి స్వభావవిశేషము కలదని అంగీకరించి స్వభావవాదంలోకి దిగవలసివస్తుందని అంటావు కొందరు కాని అదితగదు నిర్విశేషమయిన బ్రహ్మయందు జగద్ధర్మ స్వభావమనే (ప్రపంచధర్మమును చెందునట్టి స్వభావమే) విశేషమున్నదనుట యుక్తముగాదు- కార్యముతో కూడా పుట్టునటువంటి అసాధారణ ధర్మ విశేషమనిఅనాలి ఆస్వభావాన్ని- అలా కార్యము యొక్క పుట్టుకతో కూడా పుట్టేధర్మ విశేషమనేది నిర్విశేషబ్రహ్మయందుండుట విరుద్ధము కనుక చిదేకరసబ్రహ్మమాత్రమే ప్రపంచకారణమనే టట్లయితే, ప్రపంచము నందు, జడత్వ, దుఃఖత్వాది ధర్మాలు సంభవించవు అలాగంటి స్వభావంగల మరొక ప్రపంచానికి కారణమని చెప్పాలి- ప్రపంచమునందలి నైమిత్తికములకు కారణములయిన, నిమిత్తాంతరములనుకూడా ఆకారణ వస్తువు నందు అంగీకరించాలి. అని అనవలసివస్తుంది- అదెట్లనగా - నిర్వికార అద్వితీయ, అసంగ అకారణమయిన బ్రహ్మయందు కారణత్వ నిమిత్తత్వాది ధర్మములుకూడా సంభవింపవు- వస్తుస్వభావమునకు విరుద్ధంగా ఏధర్మమును అంగీకరింప వీలులేదు. కాబట్టి అకారణమయిన బ్రహ్మ యందు వివర్తమగు నీ ప్రపంచము అనృతమే (మిథ్య) అనాలి. పోని ఇలాగంటి బ్రహ్మకంటె మరొకటి ఏదైనా ప్రపంచానికి కారణము ఉన్నదని విచారిద్దామంటే, ఆవిచారణ నిస్సారమువును. పుణ్యమూ పురుషార్థమూ ఉండదు.

అలాంటి విచారణలతో బ్రహ్మ భిన్నమయిన వస్తువు ప్రపంచానికి కారణమని తేలదు. అసలు అలాంటిది లేనేలేదు - అందుచేత ఆవిచారము నిస్సారము. నిరర్థకము రామచంద్రా ? లోకంలో మర్రిగింజ తన రూపాన్ని విడిచి, (పోగొట్టుకొని) పత్రపుష్ప ఫలాదులతో గూడిన మర్రిచెట్టుగా తయారగుచున్నది. బ్రహ్మ అలా తనరూపాన్ని

పోగొట్టుకొని ప్రపంచంగా మారటం లేదు - అందువల్లనే బ్రహ్మ ప్రపంచానికి వివర్తోపాదానము అంటున్నారు. కనుక ఈ రెంటికీ యీ తేడా ఉన్నది. అసలు ఈ రెంటికీ (బ్రహ్మ బీజములకూ) పోలికే లేదు- బ్రహ్మ నిరాకారం నిరవయవము- బీజము (మద్రిగింజ) సాకారము సావయవము కనుక ఈ రెంటినీ పోల్చుటకే వీలు లేదు. అయితే మేము ఔపచారికంగా పోల్చి చెప్పాము. మద్రిగింజే మద్రిచెట్టు అయినట్లు, బ్రహ్మ అనాత్మ మయిన ప్రపంచాకారంగా భాసిస్తున్నాడు కాని ప్రపంచమనేది నిజంలో పుట్ట లేదు - చావనూ లేదు. అని చెప్పటానికే ఔపచారిక మయిన సామ్యం చెప్పాము ఆ రెంటికీ- అయితే శాస్త్రము అనర్థ పరిహారము కొరకుగదా ప్రవర్తిస్తోంది ? బ్రహ్మ ప్రపంచంగా అభాసము చెందిన తనను తానే చూచుకుంటూ ఉంటే, తనను తాను చూచుకొనుటలో అనర్థమే లేదు కాబట్టి యింక శాస్త్రముతో పని యేమి ? అనే ప్రశ్న వేస్తారు కొందరు. కాని అది సరి కాదు. తనను తాను యథాతథంగా (నిజమయిన రూపంతో ఉన్న దానినిగా) తెలిసికొనక పోవుటయే అనర్థము. ప్రపంచ రూపునిగా తెలిసికొనుటయే అనర్థము అట్టి అనర్థము యొక్క నివృత్తి కొరకే శాస్త్రము - ప్రపంచభ్రాంతి ఉంటే స్వతస్సిద్ధమయిన పరిపూర్ణానంద స్వప్రకాశత్వము ఆత్మకు గోచరించదు- ఇది గోచరిస్తే మృగతృష్ణికా రూపమయిన ప్రపంచ భ్రాంతి ఉండదు- ఆత్మ ఎల్లప్పుడూ నిర్మల స్వప్రకాశ స్వభావుడుగా, తెలిసికొనుటకు తగియున్ననూ, ఎవ్వరూ ఎప్పుడూ, ఆత్మను అలా తెలిసుకొనుట లేదు - అబ్బా ! బహిర్ముఖులయిన మానవుల భ్రాంతి ఎంత గొప్పది అనాలి తనకన్న తనను (ఆత్మను) తెలిసికొనలేనట్లు అయింది వీళ్ళపని. బాహ్యప్రవృత్తిగల వాళ్ళకు అంతరమయిన తన ఆత్మ కనిపించనట్లు బహిఃప్రవృత్తిగల యితరుల ఆత్మకూడా పారమార్థిక రూపంతో గోచరించదు భ్రాంతి రహితుడయిన ముక్తుడికి, దృశ్యమయినముక్తి కనిపించనట్లే- కాబట్టి వివేకవంతులు కనిపించెడి దృశ్యప్రపంచాన్ని

దృశ్యంగా గ్రహించకూడదు– దృగ్జ్ఞాత్మగాని గ్రహించాలి. దృశ్య ప్రపంచాన్ని దృశ్యంగా చూచేకొలది ఆకాశమువలె నిర్మలమయిన బ్రహ్మ మెన్నటికీ సిద్ధిలభించదు– దూరమైపోతాడు– ప్రపంచమే బ్రహ్మ– అనగా ప్రపంచంలో ఉండే నామరూపాలను తీసివేస్తే మిగిలిన చైతన్యం బ్రహ్మమే కాని వేరుకాదు– అయితే ప్రమాతలలో ఉన్న ఆత్మ ఆ ప్రమాతకు దృశ్యము కాకున్నదా, ఘటపటాది విషయములకు అధిష్ఠానమైన ఆత్మ బుద్ధి వృత్తియొక్క బాహ్యవ్యాప్తి చేత దృశ్యంగా కాక తప్పదు.

అచట ప్రత్యక్షత్వము నిరూపయోగము అని అంటారు కొందరు. అదెందుకంటే. అక్కడకూడ లోపలనున్న ఆత్మయే బుద్ధి వృత్తిద్వారా బయటకువచ్చి విషయాకారాన్ని (ఘటపటాద్యాకారాన్ని) చెందితేనే ఘటపటాదులు దృశ్యమావుచున్నాయి. (ప్రత్యక్షమావుచున్నాయి) ద్రష్ట (ఆత్మ చైతన్యము) దృశ్యభావాన్ని చెందకపోతే (ఘటపటాదరూపాన్ని చెందకపోతే) వాటిని చూడటానికి (తెలిసికొనటానికి) వీలులేదు– కనుక ద్రష్టకు దర్శనార్హత అనేది లేనేలేదు. కనుక దృశ్యమనేది లేనేలేదు. ద్రష్ట ఒక్కడేవున్నాడు. అయితే ఆ ద్రష్ట సర్వాత్మకుడై దృశ్యమానందుఉంటే ద్రష్టకంటే వేరుగా దృశ్యమే లేకపోతే ద్రష్టకు ద్రష్టృత్వముఎట్లాసిద్ధిస్తుంది. అనేప్రశ్న వేస్తారు– సర్వశక్తి సంపన్నుడయిన రాజు తనఆజ్ఞచే ఆయా అధికారిక పురుషులను, వారి వారి అధికారపదవులను కల్పించి వాటినే తాను అనుభవిస్తూఉంటాడు.

అలాగే ద్రష్టకూడా ఆయా దృశ్యవస్తువులను సంపాదించుకొని (కల్పించుకొని) వాటిని అనుభవిస్తూ ద్రష్టఅవుతున్నాడు. అనగా నిర్వికారుడయిన ఆత్మయే ఆయాదృశ్యరూపంలో ఉదయించుచున్నాడు కనుక ద్రష్టకంటె అతిరిక్తమయిన (వేరయిన) దృశ్యమనే వస్తువు

లేదని తాత్పర్యము మధురరసముగల ఖండశర్కర (కండచక్కెర) తన మాధుర్యాన్ని విడువకుండానే ఫలపుష్పలతాదులందలి మధుమక్షికలు (తేనెటీగలు) గ్రహించెడి రసములతో పెరుగుతోంది- అలాగే చిన్మాత్రుడయిన జీవుడుకూడా తనచైతన్యాన్ని విడువకుండగనే, దేహాది రూపాన్ని చెందుతున్నాడు. లోపల అనుభూతి రూపుడుగానుండియే బయటికి ప్రపంచాన్ని కలగాచూస్తూ ఉంటాడు. భూరసమయిన లవణా దులందు ఖండకత్వము (రాయివలెగడ్డకట్టుట) వలె చిద్రసుడయిన ఆత్మయందు అహంతా మమతాది వికారాలు ఏర్పడుచున్నవి. నానా రకములయిన భూఖండమునుంచి ప్రవహించే నదులన్నీ నానారస ములు కలవయినా, సముద్రములోకివచ్చి సముద్రముతో అభేదంచెందే సరికి ఆరసములుకూడా, సముద్రప్రదేశానికి సహజ రసమయిన లవణ రసంతో అభేదంచెంది లవణఖండంగానే మారుచున్నాయి.

అలాగే నానా, నామరూపాత్మకము లయిన బ్రహ్మాండాలన్నీ తుదకు అద్వితీయాత్మతత్త్వంతో ఐక్యం చెందేసరికి చిద్రూపంగానే తయా రవుతాయి- ఆత్మయందు చిద్రసంతో పెరిగి దృశ్యపదార్థాలనే శాఖోప శాఖలతో ఒప్పుచున్న బ్రహ్మాండాలనే వృక్షాలకు అంతులేదు- ఆయా వృక్షములలో రుచులు, (రసములు) వేరు వేరు అయినట్లు ఆయా బ్రహ్మాండాలలో భోగచమత్కారాలుకూడా అనంతములు. అడవిలోని చెట్లు వేరు వేరు రుచిగల పండ్లను ఫలించి వేరు వేరు రుచులను ఇస్తూ ఉంటాయి- బ్రహ్మాండాలలోకూడా వేరు వేరు చమత్కారాలు గోచ రిస్తూ ఉంటాయి. చిదాత్మ వాటి వాటిని అలాగే చూస్తూఉంటాడు. ఇలా భోగ చమత్కారాలు విచిత్రంగా ఉండటానికి కారణం ఆయా జీవుల విచిత్ర సంస్కారోద్భవములే, కాని మరొకటికాదు. అందు సమానాకారమయిన సంస్కారములు ఉద్భవించినపుడు, అజ్ఞానులయిన జీవులయొక్క సృష్టులుకూడా పరస్పరం కలిసిపోతాయి- చిరకాలం అలాకలిసి విహరించి సంసారంలో తుదకు శాంతిస్తాయి. నీకు పరుల

యొక్క సంసార ఖండాలను చూడాలని కోరికఉంటే సూక్ష్మదృష్టితో, (జ్ఞాననేత్రముతో) చూడు- నువ్వు గింజలో నూనెఉన్నట్లు ప్రతి పరమాణువునందునూ, లక్షలకొలది సంసారాలున్నవి- చిత్తం జ్ఞానసిద్ధిని పొందితే జీవుడు శుద్ధచిద్రూపుడు అవుతాడు- శుద్ధమయిన చైతన్యము సర్వవ్యాపకము. అందువల్ల అది పరస్పరసము మేలనమును చెందుతుంది- బ్రహ్మాదులు మాబోటివాళ్ళ సంసారాలను ప్రత్యక్షంచేసి కొన్నారంటే చిత్తశుద్ధివల్లనే కాని మరోఉపాయంవల్లకాదు.

బ్రహ్మాది దేవతలకుకూడ నేనుఉన్నాను "ఇదినాది" అనేజగత్తు ఒక పెద్ద స్వప్నం- జీవకోటి ఒక స్వప్నంలోనుంచి మరొక స్వప్నాన్ని చేరుతూఉంటారు. ఈస్వప్న పరంపరలో భ్రమించటం ఎంతటి వాడికీ తప్పదు. ఇది గట్టిపడి, తుదకు ఘటపటాది ప్రపంచం అంతా సత్యమనిపిస్తుంది- స్వప్నంలో చూచినవస్తువుకూడా స్వప్నకాలంలో సత్యంగానే తోస్తుంది- చైతన్యమునకు వాసనానుకూలంగా వివర్తమును చెందుట సహజం- ప్రపంచాకార వాసనలన్నీ చిదణువులోనే ఉన్నాయి, గింజలో చెట్టుయొక్క ఆకారం అంతా ఇమిడిఉన్నట్లే చిత్పరమాణువులో జగత్పరమాణువులు ఉన్నాయి. జగత్పరమాణువులలో చిత్పరమాణువులు ఉన్నాయి. ఇవి రెండూ ఇలా ఒకదానిలో ఒకటి కలసి ఉండటం చాలాఆశ్చర్యం- తప్పితే చిదంశమునే జగత్తు అనే భ్రాంతితో భిన్నంగాచూశాము ఆభ్రాంతిపోయింది. ఆజగత్తు చిదాకాశంలో లయించింది. ఇందులో ఆశ్చర్యమేమిటి ? ఒకానొకడు (భ్రాంతుడు) తన భుజాలమీాద తాను ఎక్కాలని అనుకుంటాడట-అలా కంది చిత్పరమాణువులయిన జీవులు సత్యమయిన ఆత్మస్వరూపాన్ని అసత్యమయిన ద్వైత ప్రపంచంగా భ్రాంతిపడి అనుభవించటం. కనుక చైతన్యమే సర్వవ్యాప్తమూ, నిత్యమూ అయినందువల్ల ఆయావస్త్వాకారంగా భాసిస్తుంది- ఈ భ్రాంతిచిరకాలాభ్యాసం అయ్యేసరికి అందాత్మాభిమానం ఏర్పడుతుంది. అందులో మునిగి తేలుతూఉంటారు జీవులు.

తన హృదయంలో (చిదాకాశంలో) దృశ్యప్రపంచాన్ని చూచే వాళ్ళకు బాహ్య ప్రపంచం మిథ్యగా తోస్తుంది. బాహ్యంలో చూచేవాళ్ళకు మాత్రం సత్యంగా తోస్తుంది.

జీవునిలో మరో జీవుడు వానిలో మరో జీవుడు, ఇలా, అరటి మట్టలు (అరటి ఆకులు) ఉన్నట్లు ఉన్నారు— దీనికంతకూ అజ్ఞానంతో కూడిన చైతన్యసత్తాయే కారణం జ్ఞానంకలిగితే ఈదృశ్యబుద్ధి అంతా నశిస్తుంది "నేను ఎవరు" "ఇదియేమిటి" అనే విచారం పట్టనివానికి ఎన్నటికీ ముక్తిలేదు. జీవజ్వర భ్రాంతి దీర్ఘంగా ఉండి పోవలసిందే వాడికి— ఈ భ్రాంతినిపోగొట్టే వివేకం కలగాలంటే ముందు ఇంద్రియజయం ఆ తరువాత వైరాగ్యం. ఇవి రెండూ వాఙ్మాత్రంలోఉండి లాభం లేదు నిజంగా మనస్సులో ఉండాలి క్రియలో కనుపించాలి. లేకపోతే వాడికి అవివేకం వదలలేదన్నమాటే— చిత్రములోఉన్న నిప్పు ఎంత పని చేస్తుందో పిడిమాటలలో ఉండే వైరాగ్యంకూడా అంతే పని చేస్తుంది.

మాట్లాడుకుంటే వెచ్చగా నున్నప్పుడే నిప్పుఉన్నట్లు అక్కడ— కోరికలు నశిస్తేనే మనస్సులో వైరాగ్యం ఉన్నట్లు— పటంలో ఉన్న అమృతం అమృతం కాదు— నీరు నీరు కాదు— నిప్పు నిప్పు కాదు— పటంలో ఉన్నస్త్రీకూడ స్త్రీ కాదు. అలాగే మాటలలో ఉండే వివేకంకూడా అవివేకమేకాని వివేకంకా నేరదు— కాబట్టి వివేకం ఉన్నందుకుగుర్తు రాగద్వేషాలు రూపుమాసిపోవడమే— అవి రెండూ రూపుమాసిన తరువాత, ఇష్టప్రాప్తి కొరకు ప్రవృత్తిగాని, అనిష్ట పరిహారం కొరకు నివృత్తిగాని ఉండదు. ఇలాంటి వివేకమే నిజమయిన నిప్పు అన్నారు వసిష్ఠులు.

## ౧౯. జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయ స్వరూప విచారము.

మరిన్ని రామా! ఈ జీవరాశికంతకూ అధిష్ఠానం బ్రహ్మమే! అది ఆకాశంవలె అంతటా నిండియున్నది— జీవుడిలో జగత్తు ఉంది.

జగత్తులో అనేక విధముల జీవులున్నారు- అరటి పట్టలు ఒక దానిలో ఒకటి ఉన్నట్లు ఒక జీవుడిలో మరోజీవుడు వాడిలో ఇంకో జీవుడు ఇలా అంతులేకుండా ఉన్నారు జీవులు పుట్టలో చదపురుగులవలె ఉంది వీళ్ళపరిస్థితి- వేసవిలో ఒంటిలోని చెమటవల్లగాని, మలంవల్ల గాని, శరీరంలోనే పురుగులు పుడతాయి. అలాగే శుద్ధ చిదాకాశం లోనే ఎక్కడెక్కడ దృశ్యంఉంటే అక్కడక్కడల్లాభోక్త అయిన జీవుడు తయారవుతాడు. వెనుకటి జన్మలోని పురుష ప్రయత్నమే కర్మ. జీవులు వారి వారి కర్మవాసనాబలం చేత ఆయా జీవజాతిని పొందు తారు. భృగుపుత్రుడయిన శుక్రుడుకూడా నిర్మలమయిన స్వసంవిత్తు (ఆత్మజ్ఞానం) చేతనే ముక్తుడయినాడు- మొదటచూచిన అప్సరస యను దృశ్యంతో బద్ధుడయ్యాడు- కనుక చిత్తము ఎంతవరకు పరిపక్వ మయితే అంతే జ్ఞానము సిద్ధిస్తుంది- వాడు అజ్ఞానానికి అనుకూలం గానే తగిన ఫలాన్ని పొందుతాడు. కనుక ఎప్పటికీ వాస్తవమయిన బ్రహ్మాత్మ భావవ్యుత్పత్తినే సంపాదించాలికాని, మిథ్యాభూతమయిన జీవభావబుద్ధిని సంపాదించకూడదు- అని అన్నారు వసిష్ఠులు.

విన్నాడు శ్రీరాముడు ఇది అంతా- ఇలా ప్రశ్నించాడు. మహర్షీ!! జాగ్రదవస్థలో వస్తువులు ఎలా ప్రత్యక్షంగా గోచరిస్తాయో, అలాగే కలలోకూడా కనిపిస్తూ ఉంటాయికదా? జాగ్రత్తులోని వ్యవ హారం సత్యమనీ, స్వప్నంలోని వ్యవహారం భ్రమ అనీ అనటానికి కార ణం ఏమిటి? ఈ రెండు అవస్థలకూ భేదం ఎలా చెప్తారు? అని అన్నాడు.

వసి॥ "రామచంద్రా! కొంతకాలం స్థిరంగా ఉండటానికి యోగ్యమయినవి జాగ్రద్వస్తువులు- పైగా జాగ్రత్తులోని వస్తువులందు సంవాది ప్రత్యభిజ్ఞ ఉంటుంది- (అనగా ఒకమారుచూచిన దానిని కొంత కాలానికి మళ్ళీగుర్తించటం ఉంటుంది) స్వాప్నిక వస్తువులు అలా

స్థిరంగా ఉండవు. వాటియందు ఇలాంటి ప్రత్యభిజ్ఞకూడా ఉండదు. ఇదే ఈ రెండు అవస్థలకూ భేదం. స్థిరప్రత్యయయోగ్యమయింది జాగ్రత్తు అనీ, అస్థిరప్రత్యయయోగ్యమయింది స్వప్నమని అంటారు శాస్త్రజ్ఞులు. జాగ్రత్తులోకూడా క్షణకాలంలో నశించినదానిని స్వప్నమనీ, కాలాంతరంలోకూడ ఉన్నస్వాప్నిక వస్తువును జాగ్రత్తు అనీ అంటారు లోకులు. వస్తువులయొక్క స్థైర్యాస్థైర్యములనుబట్టి జాగ్రత్తు స్వప్నంగానూ, స్వప్నం జాగ్రత్తుగానూ మారుతూఉంటుంది. ఇంతే ఈ రెంటికీ భేదము. స్థిరత్వాస్థిరత్వములుతప్ప మిగతా అనుభవం అంతా ఈ రెంటికీ సమానమే. స్థిరంగా ఉండేది జాగ్రద్దశ. క్షణభంగురమయింది స్వప్నదశ. ఈ రెండు దశలనూ అనుభవించేవాడు. జీవుడు. వాడిక్రమం చెపుతావిను. ప్రతివానికీ శరీరంలో జీవధాతువు (జీవుడు) ఉంటుంది. వానిశరీరం మనోవాక్కాయ కర్మలతో ప్రవృత్తిలోకి దిగేసరికి ఆజీవధాతువు ప్రాణవాయువుచే ప్రేరేపింపబడి సంచరిస్తుంది. అపుడు శరీరావయవాలలో ఉన్ననాడులయందు మాత్రమే ఆసంచారం వాసనావశంచేత అక్కడనే సంవిత్తు (వృత్తి జ్ఞానం) ఏర్పడుతుంది. ఇదే స్వప్నం జగద్భ్రాంతిని అంతా చిత్తంలోవలనే తెలుసుకుంటూ ఉంటుంది. ఆజీవధాతువు తరువాత ఆజీవధాతువు చక్షురాది ఇంద్రియ గోళకములద్వారా బయటికి ప్రసరించి నానా వికారాలుగల రూపాలనుచూస్తుంది. ఆరూపాలు కొంతకాలం స్థిరంగా ఉండటంచేత దీన్ని జాగ్రత్తు అని అంటున్నారు. ఇదీ జాగ్రదవస్థ యొక్క క్రమం ఇంక సుషుప్తి తురీయాదుల క్రమం చెపుతావిను. సుషుప్తిలో వాచిక, కాయిక, మానసిక విక్షేపాలు ఉండవు శరీరం మనోవాక్కాయ కర్మలతో క్షోభించదు. అపుడు జీవధాతువు అతిప్రశాంతంగా ఉంటుంది. ప్రాణాది వాయువులు సమత్వస్థితిలో ఉంటాయి. గాలిలేనిచోట దీపము ప్రకాశమాత్రమే ఆకారంగా కలదియై వెలుగుతుంది. ఈ జీవధాతువు సుషుప్తిలో చిన్మాత్రాకారంగానే ఉంటుంది. శరీరంలోని నాడులలో

సంచరించదు- బాహ్య వక్షురాది గోళకములలో తిరగదు. నువ్వుగింజలలో తైలసంవిత్తూ, మంచుగడ్డలో శీతసంవిత్తూ, నేతిలో స్నేహసంవిత్తూవలె జీవాకారమయిన చిత్కళ ఉపాధివిలయం చెంది స్వచ్ఛంగా ఉంటుంది. ప్రాణవాయువుయొక్క విక్షేపం యేమీ ఉండదు. ఇలాంటి దశను సుషుప్తి అంటారు.

ఇంక తురీయావస్థ క్రమంవిను- అన్ని వ్యవహారములు మానుకొన్న చైతన్యము సర్వసమమని శాస్త్రతః తెలుసుకొని, తత్త్వవిచారంవల్లకాని యోగశక్తివల్లకాని, ఆత్మసాక్షాత్కారమునుపొంది, జాగ్రదాద్యవస్థలలో వ్యవహరిస్తూఉన్ననూ లేక సమాధిలోఉన్ననూ, జ్ఞానబలంచేత, తురీయావస్థనుంచి (స్వరూపావస్థనుంచి) దిగజారక నిలచియుండుట, తురీయము. ఈ యవస్థలో ఉన్నవాడే ఉత్తముడు. ఇప్పుడు- సుషుప్తి నుంచి స్వప్నంలోకివచ్చే క్రమం చెబుతావిను. సుషుప్తిలో ప్రాణాది వాయువులు విక్షేపరహితంగా సర్వసమంగా ఉంటాయని చెప్పాను గదా అలాంటి ప్రాణాది వాయువులు సుఖదుఃఖములను అనుభవింపజేసే అదృష్టం (పుణ్యాపుణ్య సంస్కారము) పరిపక్వమయ్యేసరికి విషమస్థితిలోకి వస్తాయి. అనగా విక్షేపాన్ని చెందుతాయి. వానివల్ల జీవధాతువుకు సంచలనం ఏర్పడుతుంది. భోగానుకూలమయిన పురాతన కర్మసంస్కారం అభివ్యక్తమవుతుంది. వెంటనే ఆజీవధాతువు చిత్తరూపంగా తయారవుతుంది. విత్తులో చెట్టువలె తనలోనేఉన్న జగజ్జాలమునుచూస్తాడు. నిద్రించిన జీవుడికి ప్రాణవాయువు ప్రేరణచే సంచలనం ఏర్పడేసరికి "అహం" అనేభావం ఏర్పడుతుంది. (అహంకారం పుడుతుంది.) ఆ సంక్షోభం కొంచెం ముదిరేసరికి నభోవిహారం (ఆకాశగమనం) కలుగుతుంది. (అనగా ఆకాశవీధిలో ఏమొపోవాపటం ప్రారంభిస్తాడు. జీవుడు) శరీరనాడులలో ఉన్నశ్లేష్మద్రవాన్ని నీరనుకుంటాడు. పిత్తరసంతో కూడినవాడై గ్రీష్మతాపాన్ని అనుభవిస్తాడు. రక్తంతో నిండినవాడై గైరికాది ధాతువ్యాప్తములయిన ప్రదేశాలనూ, ఎర్రని

అలాఅయ్యే మొదట శుద్ధంగా మనస్సుతో అనేక జన్మలను ధరించేవాడు కాడు. ఆజన్మలన్నీ వానికి మనస్సువల్ల కలిగినవి కాని శరీరంవల్ల కలగలేదు కనుక చిత్తమే పురుషుడు. శరీరము చేసే కర్మము (చిత్తవిషయము) చిత్తము ఏవికారమును పొందితే దానిని పొందుతాడు. మానవుడు కనుక రామా! నీవు శుభ్రముగాని దానిని కోరకు. ప్రయోజనం లేని వస్తువును కోరకు. నిరుపాధికమయిన వస్తువును కోరు. సత్యమయిన వస్తువును కోరితే అలాంటి వస్తువు సిద్ధిస్తుంది. మనస్సు తనకోరికను నెరవేర్చుకొనుటకు శరీరేంద్రియాలను నియమించ (నిగ్రహించ) గలదు కాని, శరీరేంద్రియములు మనస్సును నియమింప జాలవు- కనుక రామా! నీమనస్సు పరమార్థ సత్యమయిన వస్తువు (ఆత్మతత్త్వము) కొరకు ప్రయత్నపడుగాక. అసత్యమయిన దేహేంద్రియాది ద్వైతభ్రాంతిని విడుచుగాక- అని అన్నారు వశిష్ఠులు.

## ౨౧. విజ్ఞానవాదము.

శ్రీరాముడు విన్నాడు మనస్సు యొక్క మహిమను- ఇలా అన్నాడు వసిష్ఠులతో- మహర్షీ! నామనస్సులో పెద్దసందేహం పడింది- సముద్రంలోని తరంగంవలె కలవరపరుస్తోంది. "దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమయిన పరిశుద్ధాత్మయందు" విషయాకారములతో కలుష (మలిన) మయిన మనస్సు ఎలాపుట్టింది? పరిశుద్ధమగు ఆత్మ తత్త్వంలో కాలత్రయానందమూ మరొకవస్తువు ఉండదంటారు కదా? ఈ మనస్సు అనే కలంకం ఆయనకు ఎలా తయారయింది.

వసి॥ రామా! మంచిప్రశ్న అడిగావు నీవు- మకరందము స్రవించెడి నందన వనంలోని పూలగుత్తివలె, ఆత్మానందాన్ని అనుభవించే చమత్కారంకల నీమనస్సు మోక్షానికి తయారయింది. నేను చెప్పెడి విషయాన్ని పూర్వాపర సందర్భాన్ని విచారించి నీ మనస్సు ఇంక శంక

జ్ఞానులు పొందిన ఉత్తమ స్థితిని పొందటంలో అభ్యంతరం లేదు- కాని రామా! నీవడిగిన ప్రశ్నకు ఇది కాలంకాదు- ( సమయంకాదు ) నిర్వాణ ప్రకరణంలో నీకు ఆత్మసాక్షాత్కార సమాధినిష్ఠ స్థిరపడిన తరువాత నీకు అనుభవంలోఉన్న యీ విషయాన్ని నాఅనుభవం సాక్ష్యంగాచూపి చెబుతానునీకు- అప్పుడు ఈప్రశ్నకు జబాబు వస్తుంది- ఒకవేళనీకునేను అప్పుడు చెబుతానో చెప్పనో అనే సందేహం ఉండేయెడల మళ్ళీ ఒకపర్యాయం అప్పుడు అడుగునప్పు- ఈప్రశ్న అప్పుడు శోభిస్తుంది కాని యిప్పుడు శోభించదు- వర్షకాలంలో నెమళ్ళు కూయుట అందం. శరత్కాలంలో హంసలు కూయుట అందం- వర్షకాలంపోయిన తరువాత ఆకాశముయొక్క సహజమయిన నలుపుతనం శోభిస్తుంది- వర్షకాలంలో మాత్రం ఉదగ్రమయిన మేఘపటలము యొక్క నలుపుతనం శోభిస్తుంది కాని యిప్పుడు నీప్రశ్న వర్షాకాలంలో ఆకాశముయొక్క సహజ నైల్యమును వర్ణించినట్లుఉన్నది- కనుక యిప్పుడు మనోనిర్వాణాన్ని గురించి నీవు ప్రశ్నించడంతగదు.

కాక శుద్ధచిదాత్మయందు అవిద్యాకలంకం తగదనే ప్రశ్న శుద్ధాత్మను అనుభవించేవాడు వేస్తేశోభిస్తుంది (అందంఉంది) అలాంటి వాడిని గురించి మేము మనస్సును నిరూపించడం లేదు- ఇక ఎవడయితే శుద్ధాత్మను సాక్షాత్కరించుకోనక, తాను విద్వాంసుడనని తలుస్తున్నాడో వాడు తన అనుభవానికి విరుద్ధంగా ఆత్మకు పరిశుద్ధి ఎక్కడిది ? అని అడగాలి- అంతేకాని తన అనుభవానికి విరుద్ధంగా ఆత్మకు పరిశుద్ధ స్వరూపాన్ని అంగీకరించి, అట్టిపరిశుద్ధాత్మయందు మనస్సు అనే మాలిన్యం ఎలాఏర్పడింది? అని అడగకూడదు- అజ్ఞులకు ఉపదేశంచేసే సమయంలో ఆఅజ్ఞానివిజ్ఞునివలె అడుగుట ఉచితంకాదు- కాబట్టి ప్రకృత విషయంవిను- మాలిన్యం అజ్ఞానులకు అనుభవంలో ఉన్నది కనుక, ఆమాలిన్యంతోకూడిన చైతన్యం వికారాన్ని చెంది ప్రకృతిరూపమయినది. అదే చైతన్యం మననధర్మముచే మనస్సు అయింది. దర్శనమును

మానస్పందనమనే కర్మ ప్రేరకంగా. ఆకర్మ ఫలాన్ని పుట్టిస్తుంది. ఆ ఫలాన్ని అనుభవించి బద్ధుడవుతాడు జీవుడు.

ఇలా ఉండగా శాస్త్రకర్తలంతా కూడా వారికికూడా తనమనోవాసనలకు అనుకూలమయిన వస్తువు సత్యమనీ, దానికంటె శ్రేయోదాయకం మరొకటిలేదనీ నిశ్చయం కలిగింది. పురుషార్థ చతుష్టయంలోకూడ వారు అలాంటి భావంలోనే ప్రవర్తించారు వారివారి మనస్తత్త్వాలు వారి వాసనలను బట్టినే పరస్పరంభిన్నంగా ఉండిపోయాయి కాపిలుల యొక్క మనస్సు వివేకముకలది కాని అసంగచిన్మాత్రమగు త్వం పదార్థమును మాత్రమే అంగీకరించి నిశ్చలమాయింది. అది తత్పదార్థ విషయంలో మాత్రం శ్రుతిని ఆధారపరచుకొనక వ్యామోహము జెందినది కనుకనే వారు స్వబుద్ధి మాత్రంచేత సుఖదుఃఖమోహాత్మకమగు జడ ప్రపంచమునకు, సుఖదుఃఖమోహాత్మకము జడమూ త్రిగుణాత్మకమూ అగు ప్రధానమే కారణము కాగలదని అంగీకరించి మాటలుగ అదే విషయాన్ని ఆస్వాదించుటచే, అదే శరీరాన్ని నిర్ణయించుకున్నారు. అదేమార్గంలో తమశాస్త్ర సిద్ధాంతాలను నడపుకున్నారు. మోక్షవిషయంలో తాము చెప్పినమార్గంకంటే వేరుమార్గం లేదని నిర్ణయించుకున్నారు వారు తమమతిభ్రమలతో గ్రంథములను ప్రకటించారు. తమదృష్టినే యితరుల మనస్సులలో కూడ ప్రవేశపెట్టారు. ఇంక వేదాంతవాదులు శ్రుతిని ప్రమాణంగా చేసికున్నారు. అధ్యారోపాపవాదన్యాయాన్ని అంగీకరించారు. పరిదృశ్యమానమగు ప్రపంచమంతా బ్రహ్మకాని, అంతకంటే వేరుగా అణుమాత్రంకూడా లేదని నిరూఢిజెందారు. సర్వానర్థనివృత్తియే ముక్తి అన్నారు. వాస్తవ నిరతిశయానంద అపరిచ్ఛిన్న బ్రహ్మాత్మభావముతో స్వస్వరూపమునందుండుటయే ముక్తికాని అర్చిరాది మార్గముతో దూరదేశానికి వెళ్లుట అసలయిన ముక్తి కాదన్నారు. దీనికి స్వస్వరూపజ్ఞానము కంటె వేరు ఉపాయము లేదన్నారు. ఇదే దృష్టిని వారు కొన్ని ప్రక్రియాభేదములతో ప్రకటించారు. వీరి

మతంలో కూడ ఉపేయమయిన ఆత్మతత్త్వం వాస్తవమయినా దానికి ఉపాయములగు ప్రక్రియా భేదములు మాత్రం కల్పితములే- ఇక విజ్ఞాన వాదులగు బౌద్ధులు ముక్తి అంతరింద్రియనిగ్రహ బహిరింద్రియనిగ్రహాది సాధనములచే ప్రాప్యమన్నారు. బుద్ధదేవుని బుద్ధిధారా అను ప్రవేశమే ముక్తికి లక్షణ మన్నారు- ముక్తి పొందుటకు వారు చెప్పిన సాధనములే కాని వేరొండు సాధనములు లేవనే భావనలో పడ్డారు. తప్తశిలారోహణాది సాధనములే ముక్తి నొందుటకు ఉపాయములనే భ్రాంతిలో మునిగిపోయారు. (తప్తశిలారోహణము అనగా కాచిన రాతిని కౌగలించుకొనుట) ఇంక అర్హతాదులు కూడ తమతమ కభిమతములయిన కల్పనలతో సిద్ధాంతములను ప్రకటించారు.

అర్హతులు 1. జీవ, 2. అజీవ, 3. ఆస్రవ. 4. సంవర. 5. నిర్జర 6. బంధ, 7. మోక్షములను, పదార్థములను ఏడింటిని కల్పించుకున్నారు. జీవుడనగా శరీరపరిమాణముగల జీవుడు 2. అజీవమనగా అశ్మాదులు (రాయి మొదలయినవి) 3. ఆస్రవమనగా ఇంద్రియవర్గము. 4. సంవరమనగా వివేకము యమనియమాదులని కొందరు. 5. నిర్జరమనగా కేశోల్లుంచనాది తపస్సు 6. బంధమనగా మాటిమాటికి జన్మమరణములు, 7. మోక్షమనగా అలోకాకాశమందు ఎల్లప్పుడూ ఊర్ధ్వగమనము- ఈ యేడు పదార్థములను సాధించెడి న్యాయమే సప్తభంగి నయము- ఇది వీరికి ముఖ్యము.

1. ఉండవచ్చును, 2. లేకపోవచ్చును, 3. ఉన్నది, లేనిది కావచ్చును,4. చెప్పదగనిది కావచ్చును, 5,ఉన్నది చెప్పదగనిదీకావచ్చును 6. లేనిదీ చెప్పదగనిదీ కావచ్చును. 7. ఉన్నదనీ లేనిదనీ చెప్పదగనిది కావచ్చును- అని సప్తభంగినయమును కల్పించుకున్నారు. లోకంలో 1. సద్వాదులనీ, 2 అసద్వాదులనీ, 3. సదసద్వాదులనీ, 4. అనిర్వచనీయవాదులనీ, నాలుగురకాలు వాదులు ఇందు అనిర్వచనీయ

వాదములను, సద్భావ, అసద్భావ, సదసద్భావ, మను భేదాలు మాటని. చెప్పగా, ఏడు రకాల వాదాలు కల్పించుకున్నారు. ఇందు సద్వాది అర్హతుని (దిగంబరుని) గూర్చి విమతంలో మోక్షము మొదలగునదిఉన్నదా ? అని యడుగగా "స్యాదస్తి" అనియును. ఇచట స్యాత్ అనునది కించిదర్థవచనముగా చెప్పుదురు. కనుక కొంచెము అని కాని, "కథంచిత్" అనిశబ్దము అని కాని అర్థము. ఇలాగే అసద్వాది మొదలగువారికి కూడ స్యాన్నాస్తి "స్యాదవక్తవ్య నకాస్తి చ" ఇత్యాది సమాధానములచే చెప్పగా— కావున వివిధములగు మతాలకీర్తనము ర్థ్యము. వీరందరికి ఈ కల్పనాలైన చిత్రమైన ప్రమాణ ప్రవేశములకు కారణం కాదు. జన్మాంతరాభ్యాసంతో చిరకాలం నుంచి స్థిరపడిన మనోవాసనలే కారణం— కనుకనే చంద్రమండలంలో కాని సూర్యమండలంలో కాని, అగ్నిమండలంలో కాని, ఉగ్ర దేవతలకు శీతోష్ణాది బాధ లేదు. వారికి అవి చాలకాలము అలవాటయిపోయింది.

తుచ్ఛమైన ప్రాపంచిక ఫలంలోనే మానవులకు ఇంతటి దృఢాపేక్ష అవసరం అయితే, ఆకృతిమానంద రూపమైన మోక్షఫలం విషయంలో దృఢాభ్యాసము అవసరమని వేరే చెప్పనేల ? కనుక మోక్షం పొందాలంటే దృశ్యమార్జనము కొరకు (కనిపించే ప్రపంచాన్ని రూపుమాపుట కొరకు గట్టి ప్రయత్నం చెయ్యాలి— ఇదే దీని దృఢాభ్యాసం— దృశ్యాన్ని అతిస్నేహంచేత పిల్లవానివలె గట్టిగా కౌగలించుకొని యున్న మనస్సు దానిని విడిచినచో ఇంక దానివల్ల కలిగే సుఖదుఃఖాలచే ఇది (మనస్సు) ఆకర్షించబడదు— కనుక రామా! దృశ్య ప్రపంచాన్ని లేశమాత్రమూ భావించకూడదు— అజ్ఞానం చేత సంవిత్తు (చైతన్యము) దృశ్యప్రాయమగుటయే (దృశ్యాకారాన్ని చెందడమే సంసారబంధాన్ని యిచ్చే కర్మ అవుతోంది—) అజ్ఞానం చేత చైతన్యం దృశ్యాకారం చెందేసరికి బంధప్రాపక మయిన కర్మ తయారవుతోంది— చైతన్యం విషయాకారాన్ని చెందడమే అవిద్య అని

అన్నారు పెద్దలు- అదే సంసార మన్నారు- అవిద్యోప హతులయిన మానవులు ఎన్నటికి శ్రేయస్సును పొందలేరు- ప్రకాశించెడి సూర్యుని వెలుగును గ్రుడ్డివాడు చూడలేడు కదా! ఈ అవిద్య అనేది సంకల్ప మాత్రంచేత స్వయంగా పుడుతుంది- పెద్దగా ప్రయత్నించ వలసిన పనిలేదు- సంకల్పరాహిత్యంచేత నశిస్తుంది- కాని యీ సంకల్పరాహిత్యానికి శ్రవణమననాదివిచారమూ, దృఢమైన సమాధ్యభ్యాసమూ అవసరము- ఇలాంటి సంకల్ప రాహిత్యంచేత పదార్థములందు అసంసక్తి (వైరాగ్యం) స్థిరపడుతుంది- దానివలన సమ్యగ్జ్ఞానం లభిస్తుంది- దీనివల్ల అయథార్థ జ్ఞానం భ్రాంతిజ్ఞానం నశిస్తుంది- అంతట ప్రత్యగాత్మ పరమార్థ సత్యస్వరూపు డవుతాడు- అప్పుడు వ్యక్తత్వావ్యక్తత్వములు కాని సుఖదుఃఖములు గాని గోచరించవు- కైవల్య భావము మాత్రమే తన హృదయమునందు స్ఫురించును- అనర్థ హేతువులగు దేహాది తాదాత్మ్యాధ్యాసలుండవు- విషయ వాసనలు కూడా ఉండవు.

ఎదుట నున్న త్రాడు సందిగ్ధమయితే అదిపాముగా గోచరిస్తుంది- ఆత్మతత్త్వము సందిగ్ధమయితే సంసారబంధమంతా ప్రత్యక్షమవుతుంది- సంసారబంధకల్పన నశించిందా ఇంకమిగిలేది పరమపురుషార్థమగు సుఖమే- రోలును చూచిసింహమని భయపడినట్లున్నది బ్రహ్మయందు ప్రపంచభ్రాంతి ఇదిఅంతా మనఃకల్పన వల్ల మొదట పుట్టుకున్నదే కాని యిందులో నిజమేమీ లేదు- తల్లిని భార్య అనే భావంతో చూచే మొదల భార్యయిచ్చే ఆనందాన్నే కలిగిస్తుంది- భార్యను మాతృభావంతో చూచేమొదల మన్మథవికారమును మరపుకు తెస్తుంది- చిత్తము దృఢమయిన భావనచేత దేనిని భావనచేస్తే దాని ఆకారం ధరిస్తుంది- అఫలాన్నే యిస్తుంది- ప్రపంచంలో సత్యం కానిదీలేదు- మిథ్యకానిదీ లేదు- ఎవడు ఎలా నిర్ణయించుకుంటే వాడికి అలాగే నిర్ణయమవుతుంది- ఎవడి మనస్సు అయినా ఆకాశం చూచి ఏనుగు అనుకుంటే, ఆభావనచేత కామాతురమై ఆ ఆకాశంలో

ఒకఅడవినీ అందులో ఒక ఆడపనుగునూ కల్పించుకొని దాని వెంట పడుతుంది వాడిమనస్సు-రామచంద్రా! ప్రపంచమంతా సంకల్పమయము కనుక నీవు సంకల్పరహితుడవై స్వాభావికమగు ఆత్మభావముతో నుండుము- రామా! లోకంలో మణి జడముకనుక తనలో ప్రతిబింబించే వస్తువులను నిషేధించు కొనలేకపోతుంది- నీవు అలా అసమర్థుడవు కావున చేతనుండవు- కనుక నీచిత్తంలో ప్రతిబింబించే ద్వైత వస్తువులన్నీ మిథ్యఅని అనుసంధానము చేసికో - అంతేకాని వాటి మీద అనురాగం చూపమాకు- తప్పితే అవిచ్ఛిన్నరూపుడగు బ్రహ్మతో అభిన్నములని అనుకో- ఇలా ఉంటే అవి నిన్ను చెడగొట్ట లేవు- శుద్ధస్ఫటికంలో ఎన్నిరంగులవస్తువులు ప్రతిబింబించినా వాటి రంగులు ఆస్ఫటికానికి అంటవు- అలాగే నిర్వికారాత్మ బోధలోనున్ననీకు ద్వైత ప్రతిభాస ఏమాత్రము అంటకుండు గాక. అని అన్నారు వసిష్ఠులు-

## ౨౨. అనుత్తమపద విశ్రాంతి వర్ణనము.

వసి॥ రామా! మానవుడు ఆత్మ విచారములో ఉండాలి-క్రమంగా చిత్తవృత్తులను తగ్గించుకోవాలి- బాహ్య సంకల్పములను మరవాలి. మనఃపరిణామాన్ని పొందాలి- అజ్ఞానభూమికలను విడవాలి- జ్ఞానభూమికలను చేరాలి- దృశ్య ప్రపంచం అంతా సాక్షీచిన్మాత్రమని తలచాలి- చైతన్యముకంటె భిన్నవస్తువు లేదని గ్రహించాలి- ఆత్మ తత్త్వ విషయంలో జాగరూకుడై ఉండాలి- (అజ్ఞాన) అవిద్యాకార్యమగు ప్రపంచంలో నిద్రించాలి- బ్రహ్మలోక పర్యంతము నుండు భోగములందు విరక్తి చెందాలి- అనాదిసిద్ధమూ జడమూయి యున్న అజ్ఞానాకాశం క్రమంగా నశించాలి- అప్పుడు ఆమానవుడు చిదాకాశంలో ఐక్యాన్ని చెందుతాడు ఎండలో మంచుగడ్డవలె నిశ్శేషంగా వర్షకాలం గడచినతరువాత తరంగపూరితమయిన ప్రవాహంగలనదులు క్రమంగా తగ్గినట్లు వాసనాజలం క్రమంగా తగ్గిపోవాలి- పిట్టలను పట్టే వలను ఎలుక కొరికినట్లు హృదయ గ్రంథులు తెగిపోవాలి. వైరాగ్యం

చేత ఇండుపగింజయొక్క గంధంచేత నీరు నిర్మలమయినట్లు విజ్ఞానవశంచేత మనస్సు నిర్మలమవుతుంది- కోరికలు లేనిమనస్సూ ప్రాపంచిక విషయాలు మంచివి అని అనుకోనని మనస్సూ భార్యా పుత్రాది జనసాహిత్యము లేని మనస్సూ భోగవస్తువులు లభించని మనస్సూ అజ్ఞానాన్ని విడిచిపెడుతుంది. రెక్కలు వచ్చినపిట్ట పంజరాన్ని విడిచిపారిపోయినట్లు జ్ఞానరూపుడగు ఆత్మతత్త్వమును అందుకుంటుంది- పూర్ణచంద్రునివలె ప్రకాశిస్తుంది- సర్వసమతాదృష్టిలో ఉంటుంది- సూర్యోదయం అయితే రాత్రినశించినట్లు క్షీణించినట్లు సంసారవాసన క్షీణిసుంది- సూర్యోదయం కాగానే పద్మిని (పద్మలత) వికసించినట్లు చిద్భాస్కరుడు ఉదయించగనే మనోహరమయిన ప్రజ్ఞాసంపదలు వృద్ధిచెందుతవి- వెక్కుమాటలేల ! రామా! తెలియదగిన ఆత్మతత్త్వాన్ని గ్రహించిన ఆ మహానుభావుడు పుట్టడు చావడు.

ఇట్టి జ్ఞానికి ఉత్పత్తిస్థితిలయములనే అధికారాలలోపడి కొట్టుకొనుచున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడా అనుకంప్యులు (జాలిపడతగినవారు) అగుదురు- వీడికి మరల సంసారవిక్షేపములు అంటవు. జన్మమరణములు ఉండవు- ఇవి మనోవాసనలను పట్టివచ్చెడివి. వాసనావశుడయిన అజ్ఞానికి ఇవి తప్పవు- జ్ఞానికి సంభవించవు. ఘటం పుట్టినా ఘటాకాశం పుట్టదు. ఘటం నశించినా అందులోని ఘటాకాశం నశించదు. అలాగే దేహంపుట్టినా చచ్చినా ఆత్మ పుట్టడు, చావడు. ఈజ్ఞానం తత్త్వవేత్తకుండును గాని, అతత్త్వవేత్తకు ఉండదు. చల్లని వివేకం కలిగిందంటే సంసారవాసన నశిస్తుంది- చంద్రోదయం కలుగునట్టిప్రదోషకాలం సమీపించినదంటే పశువులకు మృగతృష్ణాభ్రాంతి ఉండదు- నేనుఎవరు? ఈప్రపంచం ఏమిటి ? అనేవిచారం చేయనంతవరకే ఈసంసారముయొక్క ఆడంబరం అంతా- మిథ్యా భ్రమలనే మరుభూమివల్ల పుట్టిన ఈశరీరము ఆపదలకు నిలయము- ఆత్మభావనచే దీనిని (శరీరమును) ఎవడు బంధించుకుంటాడో వాడజ్ఞాని- ఆధిభౌతిక ఆధిదైవిక

ఆధ్యాత్మికము లయిన సుఖదుఃఖములు నావికావను కొనువాడే జ్ఞాని- ప్రపంచమంతా తానను కొనువాడే జ్ఞాని- తాను వ్యాపకుడగుచూ, పరికల్పితమయిన తోకచివరి వెంట్రుకలోని లక్ష భాగముకంటె కూడా సూక్ష్మమయిన వాడనని అనుకొనువాడే జ్ఞాని- ఆత్మానాత్మ పదార్థమంతయు చిజ్జ్యోతి స్వరూపమే అని అభేదదృష్టితో చూచువాడే జ్ఞాని. చిదాత్మ సర్వశక్తి రూపుడనియు సర్వాంతర్యామి యనియు, అద్వితీయుడనియు గుర్తించువాడే జ్ఞాని- ఆదివ్యాధులకు భయపడుచూ, జన్మమరణములకు లోనై దేహమే నేనను కొనువాడు, ఎంతటి పండితుడయినా ఏమీ తెలియనివాడే "పైనా, క్రిందా, మధ్యనూ నేనే విస్తరించియున్నాను" నాకంటె మరొకడు లేడు అని గుర్తించువాడే జ్ఞాని- దారమునందు మణులువలె నాయందు యీప్రపంచము కూర్చబడినది చిత్రము నాస్వరూపము కాదు అని గ్రహించువాడే జ్ఞాని- అతీతానాగత వర్తమానములలో కాని వ్యక్తావ్యక్తములలో కాని ప్రాపంచిక పదార్థములలో అహంకారముతో సహా ఏవీ పరమార్థములు కావు- చిదేకరసమగు బ్రహ్మమే పరమార్థము- సముద్రమునందు తరంగములవలె ముల్లోకములూ నాయందే కల్పితములు కనుక నారూపముతో కాని నాకంటె భిన్నములు కావు" అని తెలిసికొనువాడే జ్ఞాని- ఈత్రిలోకి అనుకన్య స్వయముగా ఉనికిలేనందున మృతప్రాయురాలు అందువలన దుఃఖింపదగినది. కనుక నేదానికి (ఆకన్యకు) కొంత సత్తాస్ఫూర్తినిచ్చి కాపాడాలి. ఆమె నాతర్వాత పుట్టినందున నాకంటె చిన్నది. తత్త్వదృష్టి మాత్రంచేతనే (నిజం తెలిసికొన్నంత మాత్రముచేతనే) బాధపొందునది అగుటవలన మహాపేలవమయినది అని తెలిసికొనువాడే జ్ఞాని- "నీవు, నేను" అనే భావమూ "నేను వాడు" అనేభావమూ వివేకంచేతనూ, నిషేధంచేతనూ ఎవనికి తొలగిపోవునో, వాడు జ్ఞాని- "నీవు నేను" నేను వాడు" అనే భేదభావాలను వివేక జ్ఞానంచేతను, అప[illegible]వచేతనూ తొలగించుకున్నవాడే జ్ఞాని - దృశ్యసంబంధమును [illegible]చి నిరాతంకమగు చిత్ప్రభతో వెలుగువాడే జ్ఞాని- అధికా

శరీరమూ అంహకలిగెడి గురుభక్తి దైవభక్తి శాస్త్రవిశ్వాసమూ నిత్యానిత్యాది వివేకమూ వీనిచే కలిగెడి ఆత్మపరిచయ తారతమ్య భేదములూ, ఇవి అన్నీ నేనే అని అనుకొను వాడే జ్ఞాని- "నిరతిశయానంద ఘనముగు ఆత్మసత్తతో నిండి, ఆనంద లేశమును ఉంచుటచే సృష్టి చెందే బ్రహ్మాది స్తంబపర్యంతమయిన యీ ప్రపంచంలో ఏకదేశంగా ఉండే ఐహికమైన వస్తువుతోగాని, ఆముష్మికమైన వస్తువుతోగాని, నాకు దుఃఖమేమున్నది పోగొట్టుకొనుటకు ? సుఖమేమున్నది ? స్వీకరించుటకు అని తెలిసికొనువాడే తత్త్వజ్ఞాని- ఉండుటకు అవనికి త్రికాలాబాధితమయినదీ, అగుస్వరూప బ్రహ్మమే ఈ ప్రపంచము అని తెలిసికొను వానికి హేయోపాదేయబుద్ధి ఉండదు- అలాంటి వాడే పురుషుడు- మిగిలిన వారు పురుషాకారమయిన స్త్రీలే- ఎవడు ఆకాశమువలె అద్వితీయుడో ఎవడు అంతటా నిండియున్నవాడా దేనితోనూ అంటడో వాడే నిరతిశయానందానుభవమునకు సమర్థుడు- వాడే సాక్షాత్ శివస్వరూపుడు- ఎవడు అవస్థాత్రయరహితుడో ఎవడు మృత్యువునుగూడ నిరతిశయ ప్రేమాస్పదుడగు ఆత్మరూపుడో, ఎవడు తురీయావస్థయందు స్థిరపడియున్నాడో అట్టి వానికి నేను నమస్కరింతును- రామా ! సమస్త ప్రపంచమును గూర్చి, అద్వితీయ బ్రహ్మదృష్టి ఎవనికి ఉండునో ఎవనికి విచిత్రములయిన సృష్టిస్థితిలయములందు బ్రహ్మాకార దృష్టి అవిచ్ఛిన్నముగా నుండునో, అట్టివాడే జీవన్ముక్తుడు వాడే శివస్వరూపుడు. వానికిదే నా నమస్కారము అని అన్నారు వసిష్ఠులు.

### ౨౩. శరీరనగర విభూతియోగవర్ణనము.

వసి॥ రామా ! కుమ్మరి కుండను తయారుచేయుటకు సారె చక్రమును త్రిప్పును కుండ తయారయినా ఆచక్రము మాత్రము దాని వేగం ఉన్నంతవరకు తిరుగుచునే యుండును- అలాగే జీవన్ముక్తుడికి ఎంతటి జ్ఞానము కలిగినా ప్రారబ్ధకర్మ నశించునంతవరకు దేహమును ధరించియుండుట (దేహధారణ వ్యవహారము) తప్పదు శరీరనగరంలో

రాజ్యమేలుచునే ఉంటాడువాడు. కాని అవ్యవహారము వానికి అంటదు. బంధమును ఇయ్యదు- అట్టివానికి అశరీరము ఉద్యానవనము వంటిది- క్రీడావినోదాన్ని యిచ్చును. అది సుఖము కొరకేగాని దుఃఖముకొరకు గాదు. మహర్షి ? జీవన్ముక్తుడికి వానిశరీరం నగరం ఎలా? ఆనగరంలో రాజ్యమేలుతూఉంటే, వానికి ఒక్క-సుఖమే ఎలాఉంటుంది ? దుఃఖం ఎందుకుడదు ? వివరించండి. అని అన్నాడు శ్రీరాముడు.

వసి॥ రామచంద్రా ? వినుచెబుతాను. జీవన్ముక్తుని దేహ నగరము అతిరమ్యము- సర్వగుణాలుకలది అది- జ్ఞానియొక్క- శరీరము అనంతములయిన విలాసాలతోకూడి ఉంటుంది- ఆత్మజ్యోతిస్సుచే ప్రకాశిస్తూ ఉంటుంది- దీనికి నేత్రగోళకాలు కిటికీలు- అందలి ఇంద్రియములు (ప్రకాశములు) దీపాలు- వీనిచే లోకాలన్నీ కనిపిస్తూ ఉంటాయి. జానుపర్యంతము వ్రేళ్ళాడెడి చేతులు ఆనగరమునందలి రచ్చవీధులు- చర్మమును అంటుకొనియున్న సన్నని నరములు కిటికీలకు పైనవేసెడి అల్లిక గవాక్షములు. అనగా యిప్పటివారు ఎలుకలు కాకులు వగయిరా రాకుండుటకు సన్నని ఇనుపతీగలతో అల్లినవల వంటి దానిని కిటికీలకు బయటనైపున వేసిబిగింతురు) రోమపంక్తిచుట్టు ఉండెడి తీగలకంచె- అరికాలు, మోకాలులు స్తంభములకు మూలాధారమయినశిలలు- పిక్కలూ, తొడలూ స్తంభాలు- ఇందులో అరికాలు మొదటిరాయి. ఆరాతిమీద పిక్కలనే స్తంభాలు నిలిచిఉన్నవి. మోకాలు అనేది రెండవ రాయి. దానిమీద తొడలుఅనే స్తంభాలు నిలిచుఉన్నది- బయటనుండు చర్మము పొలిమేర ఈనగరికి- లోపలి మర్మస్థలములు లోపలి హద్దులు- మధ్యమధ్య నరములసందులు అవాంతరసీమలు (హద్దులు) 2 తొడలకు మధ్యనున్న అధోఇంద్రియముగల పల్లపుప్రదేశము ఆనగరమునందలినది- కేశపంక్తినల్లనిదళములు(ఆకులు) శిరస్సు క్రీడాశైలము- శ్మశ్రువులు పొదలు రోమజాలము అడవులు- కాంతిగల ముఖము అరటితోట రెండు పెదవులును అరటిపువ్వులు-

లలాటము తెల్లని లేత అరటిఆకు– కనుబొమ్మలు నల్లని అరటి ఆకులు– (ఆకుపచ్చని కటాక్షములు) (క్రీగంటిచూపులు) ఉత్పలములు– గండస్థలములు విహారస్థలములు– వక్షస్థలము సరస్సు (కొలను) కుచములు అందలి పద్మపుమొగ్గలు– రోమపంక్తిచే కప్పబడిన భుజమూలములు పెద్దక్రీడా శిలలు– ఉదరము కోశాగారము (ధనపుకొట్టు) తినుటకు, పాకస్థవశంచేత అందుఉంచిన ఆహారములు ప్రియమయిన వస్త్రములును ధనములు– నాలుక, కన్ను, శ్రోత్రము మొదలగు ఇంద్రియములు అనిషిద్ధములయిన విషయములను అనుభవించెడి, శిరస్సుఅనే మేడమీది కిటికీలలోకూర్చున్న నాగరిక పురుషులు– (నాగరికులు) ముఖమునుంచివచ్చిన ప్రాణవాయువు (నిట్టూర్పు) కంఠమనే వాకిలితలుపు తెరచినంగాన కలిగిన చప్పుడు– హృదయమనునది ఆపణము (అంగడివీధి) అందున్న జీవులు రత్నాలుమున్నగు వస్తువులను పరీక్షించు జనులు– శబ్దస్పర్శాది విషయములు, వారలచే పరీక్షించబడి, నిర్ణయించబడి తీసికొనబడిన వస్తువులు– వాసనలు వాటిమూల్యములు (వెలలు) నోటిలోపలనుండు దంతములు అస్థిశకలములు– ముఖమునందలి నాలుక కాళికాదేవి– అందు భక్షించే నాలుగు రకముల ఆహారములు ఆకాళికాదేవికి బలులు– ఒంటిమీది రోమములు దీర్ఘతృణములు– కర్ణకోటరములు (చెవులనే శ్రోత్రలు) చిన్నబావులు– ఇలాంటి పరికరములతో కూడినది ఈనగరి– చిత్తమనే ఉద్యాన భూమిలో ఆటలాడుకొనుచున్న ఆత్మచింత అనే పట్టమహిషికలది యీపురము– (నగరి) ఈనగరిలో బుద్ధిఅనే తోలు త్రాటితో చపలేంద్రియములనే కోతులు కట్టివేయబడినవి– ముఖమనే ఉద్యానంలో నవ్వు అనేపూలుపూచి మహామనోహరంగాఉంది యీ నగరము– ఇలాంటి శరీరమనే నగరము తత్త్వవేత్తకు సుఖహేతువేకాని దుఃఖహేతువుకాదు– పైగా పరులకుకూడా తత్త్వమును ఉపదేశించి ఉద్ధరిస్తుంది.

ఇదే శరీరనగరము అజ్ఞానికి దుఃఖాలపెట్టె– కాని అంతులేని సుఖాలపుట్ట– ఈశరీరం నశిస్తే జ్ఞానికి ఒకచిన్నవస్తువు పోయినట్లే– ఇది

ఉన్నట్టయితే జ్ఞానికి అంతా ఉన్నట్టే- భోగమోక్షసుఖం అంతా దీనితో ఉన్నది కనుక- జ్ఞాని, శరీరమనే రథాన్ని అధిష్ఠించి భోగమోక్షముల కోసం సంసారంలో విహరిస్తూ ఉంటాడు కనుక "జ్ఞరథము" అనే పేరు వచ్చింది దీనికి- శబ్దస్పర్శరూపరస గంధములనే బంధుశోభలు అన్నీ దీనివల్లనే జ్ఞానికి లభించుచున్నవి కనుక జ్ఞానికి ఇదిలాభదాయకము- తత్త్వవేత్తకు ఇది భోగమోక్షప్రాయములయిన వస్తువులన్నిటినీ సంపాదించిపెడుతుంది కనుక ఇది సర్వసహాయకము- కనుక రామచంద్రా! జ్ఞాని శరీరమనే నగరంలో రాజ్యం చేస్తూ ఏవిధమయిన విక్షేపాలు లేకుండా; స్వస్థచిత్తుడై ఇంద్రుడు అమరావతిలోనున్నట్లు ఉంటాడు- మనస్సు అనే మదించిన గుర్రాన్ని, దోషాలు అనే గోతులలోకి తోలడు. ప్రజ్ఞ అనే స్త్రీకను అధార్మికునకు ఈయడు- అజ్ఞానమనే పరరాష్ట్రము [illegible]- వృత్తాంతం వీనికి ఏమాత్రం అవసరం లేదు. సంసారమనే శత్రువును కుంకుడు వ్రేళ్ళతో సహా ఛేదిస్తాడు. తృష్ణ అనే నదిలో కామ సంభోగాలు అనే మొసళ్లుగల పెద్దసుడిగుండములో మునగడు. లోపలా, వెలుపలా, పరమాత్మను చూచుచున్నందువలన, ఆధిభౌతిక ఆధ్యాత్మిక ములయిన నదీసంగము తీర్థములందు ఎల్లకాలమూ స్నానమాడుతో ఉంటాడు. ఇంద్రియాలనే జనులకు ఆపాతరమణీయములుగా ఉండే సంసార విషయాలు సుఖకరములనే జ్ఞానానికి పరాఙ్ముఖుడై ఉంటాడు వీడు (జ్ఞాని)- ఇలాంటి దేహనగరము నశించినా జ్ఞానికి నశించునదేమీ లేదు- ఘటాకాశము స్వాధీనములో ఉన్నవానికి ఘటము నశించినా లోటులేదు- ఉన్నప్పుడే అంటని శరీరం చచ్చేమాత్రం వీడికిచేటు ఏమిటి? ఈనగరమందున్న తత్త్వవేత్త ప్రారబ్ధభోగాలను అనుభవించి, సర్వవ్యాపకుడై, సుఖకర స్వాత్మరూపమయిన పరమపురుషార్థమును పొందుతాడు- ఇలాంటివాడు వ్యవహార దృష్టితో చేస్తూ ఉన్నట్లు ఉన్నా పరమార్థ దృష్టిలో చేయనివాడే-

ఇతనికి ఈ దేహనగరిలో కాంతాది భోగఫలములుకూడా అనేకం సంభవించును- ఒకానొకప్పుడు ఇతడు భోగకౌతుకమయిన మనస్సును

వినోదపరచదలచిన విమానతుల్యమయిన హృత్పుండరీకాన్ని అధిష్ఠిస్తారు అడ్డు లేకుండా — అక్కడే (ఆ హృదయమందే) త్రిలోక సుందరియగు మైత్రి యను స్త్రీతో రమిస్తారు — ఇతనికి ఇరువైపులా సత్యతా, ఏకతా అనే యిద్దరు స్త్రీలు ఆహ్లాదపరచేవారు ఉంటారు చంద్రుడికి రెండు వైపులా రెండు విశాఖలవలె — ఆ తత్త్వవేత్తయగు జీవన్ముక్తుడు దుఃఖాక్రాంతులగు జనులను ఆకాశమునందు సూర్యునివలె దూరంగా ఉండి చూస్తూ ఉంటాడు. (అనగా తత్త్వవేత్తకు సంసారమనే అడవిచాలమారమని ఉపమానంవల్ల తెలుస్తుంది.) అన్ని కోరికలను పూర్తి చేసికొని సర్వాత్మ భావంచేత సుందరుడై తిరిగి జన్మ మరణములు లేనివాడై వెలుగుతూ ఉంటాడు — ప్రక్చందనవనితాది భోగపుంజములను సేవించుచున్నను, వీడికి శ్రమ అనేది ఉండదు. కాలకూట విషమువల్ల ఈశ్వరునికి బాధ లేనట్లు — (అనగా ఆభోగములు పునర్జన్మను ఇయ్యవని భావము) పైగా ఆనందమునే కలిగిస్తూ ఉంటాయి. లేక తత్త్వవేత్తకుకూడా తపస్సు మొదలగు కష్టములు గొప్ప ఫలమును ఇస్తూ ప్రకాశిస్తూ ఉంటవి కాని బాధపెట్టవు. దీనివల్ల అజ్ఞానికూడా కొంతశిక్షణ ఏర్పడుతుంది. సంసార విషయములు తెలిసికొని అనుభవిస్తే సుఖకరములు అవి సంతోషమునే కలిగిస్తాయి — దుఃఖాలను ఈయవు. తెలుసుకొని సహవాసము చేసిన దొంగ శత్రువు కానేరడు. దూరప్రయాణం చేసే పురుషులు కాని, స్త్రీలుకాని గుంపులు గుంపులుగ చేరి మళ్ళీ విడిపోయినా, ఆ సమాజం అందముగానే ఉంటుంది. అలాగే జ్ఞాని పుత్రమిత్రకళత్ర క్షేత్రాదుల వియోగాన్ని కూడా అందంగానే చూస్తాడు — వానిని గూర్చి ఖేదపడడు —

మార్గస్థులకు (పాంథులకు) అనుకోకుండా మధ్యమధ్య తటస్థించే గ్రామయాత్రలు (ఊళ్ళ ప్రయాణాలు అనగా మధ్యనున్న ఊళ్ళ యొక్క సంబంధాలు) ఎలాంటివో జ్ఞానికి సాంసారిక క్రియలుకూడా అలాంటివే కన్ను పదార్థముల మీదికి అప్రయత్నంగా ఎలా వాలుతుందో (ప్రస

రిస్తుందో) అలాగే జ్ఞానియొక్క మనస్సుకూడా ప్రాపంచిక కార్యములందు నిష్కామంగా (కోరికలేకుండా) ప్రవర్తిస్తుంది- సంపూర్ణమయిన జ్ఞాని ప్రారబ్ధవశమున సంప్రాప్తమయిన విషయమును నివారించడు- అప్రాప్తమగు విషయాన్ని ప్రయత్న పూర్వకంగా సంపాదించడు- అప్రాప్త చింతలు (లేనివానిమీద ఆశలుగాని) ప్రాప్తోపేక్షలుగాని ఉన్నవానిమీద ఔదాసీన్యముగాని అజ్ఞానునివలె జ్ఞానినిచలింపచేయవు- నెమలిపింఛమువిప్పి యెంతకొట్టినా కొండకదలదు- జ్ఞానికి అజ్ఞాననాశంచేత సర్వసందేహాలు శాంతిస్తాయి. మిథ్యాత్వజ్ఞానంచేత సకలభోగములందునూ కోరికలు అడుగంటుతవి- స్థూలసూక్ష్మదేహముల మీద మమకారాది సంబంధములులేనివాడై స్వారాజ్యపదమును పొందినవానివలె వెలుగుతూ ఉంటాడు- తనలోతాను యిముడడు. తనలోతాను విజృంభిస్తుఉంటాడు- పరిపూర్ణుడు అపరిచ్ఛిన్నుడు- భోగేచ్ఛచే నీచులయిన మానవులగూర్చియు దీనులయినవారల ఇంద్రియములనుగూర్చియు తాను ప్రశాంతచిత్తుడై నవ్వుతూఉంటాడు- ఒకడు విడిచిపెట్టిన భార్యను మరొకడుకోరగా వానినిగూర్చి ఇంకొకడు ఎట్లుఎగతాళిచేయునో, అట్లు తత్త్వవేత్తవిడిచిన భోగాలను ఇంద్రియాలు కోరుతుంటె వానినిగూర్చి పరిహాసిస్తాడు. ఆత్మసుఖాన్నివిడిచి విషయాలమీదికి పరుగెత్తెడి మనస్సును మదించిన ఏనుగును అంకుశంచేతవలె తత్త్వవిచారంచేత వశపరచుకోవాలి. భోగములమీదకి పరుగెత్తెడి మనస్సుయొక్క ప్రసారాన్ని మొదటనే తుంచివేయాలి- విషవృక్షాన్ని మొలకెత్తనీయకూడదు- గ్రీష్మఋతువులో ఎండినపైరుకు ఏమాత్రపు వర్షపుజల్లు అయినా అమృతప్రాయమవుతుంది- పిల్లవాణ్ణి ఒకదెబ్బ ఒకమాటుకొట్టి మళ్ళీ వాణ్ణే బ్రతిమాలుతూ ఉంటేవాడు మనకులొంగడు. వాణ్ణి అలాఎన్నిసార్లుకొట్టినా లాభంలేదు- బ్రతిమాలుటలేకుండా, గట్టిగా రెండు మూడుసారులు కొట్టియెడల ఆపైన భయంతో చెప్పినమాట వింటాడు. అలాగే చిత్తమును చిరకాలం విషయాలతో లాలనచేసిచేసి, ఒక్కసారి పలచపలచగా నిగ్రహించి, ఆపైనమళ్ళీ విడిచిపెడితే, ఆచిత్తం మనకు

గమనిక :- గురూ ! ఇక్కడ, లోపలా, వెలుపలా పరమాత్మ భావనతో నుండువాడు సమస్త తీర్థములందు స్నానంచేసినవాడు అని వసిష్ఠులవారు సెలవిచ్చినారే ? ఇది ఎలాపొసగుతుంది ? చెప్పండి.

గు॥ శిష్యా! ఇది తాసు:కాదు. పెద్దలు ఇలా అంటున్నారు ?

శ్లో॥ స్నాతం తేన సమస్త తీర్థసలిలే సర్వా ? పిదత్తావని:
యజ్ఞానాంచకృతం సహస్రమయుతం దేవాశ్చ సంపూజితాః
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరః సర్వైస్యపూజ్యోహ్యసౌ
యస్యబ్రహ్మ విచారణేక్షణమపి ప్రాప్నోతిధైర్యం మనః॥

అని బ్రహ్మ విచారంలో క్షణకాలం మనస్సు స్థిరముగా ఉన్నట్లయితే వాడు అన్నితీర్థాలలో స్నానంచేసినట్లు- అన్నియజ్ఞాలుచేసినట్లే అందరు దేవతలను పూజించినట్లే- పితృదేవతలను సంసార సముద్రము నుంచి ఉద్ధరించినట్లే, అని అన్నారు పెద్దలు- ఈవృద్ధవాక్య ప్రమాణాన్ని పురస్కరించుకొని బ్రహ్మవిచారము యొక్క ప్రభావమును చాటిచెప్పారు వసిష్ఠులు- అందులో పొరపాటు ఏమీలేదు.

౨౮. ఇంద్రియ ప్రాబల్య వర్ణనము.

రామచంద్రా! మహానరకమనే సామ్రాజ్యంలో ప్రత్యేకం పట్టాభిషిక్తులయినారు ఇంద్రియాలు అనేశత్రువులు. వీళ్లను పాపాలు అనేవి మదపుటేనుగులు. వీళ్లు తృష్ణలు అనేశరశలాకలతో కూడి ఉంటారు- ఈ కృతఘ్నులుముందుగా తమకు ఆశ్రయమిచ్చిన దేహాన్ని నాశనంచేస్తారు వీళ్ళకు పాపములే మహాసంపదలు- వీళ్లను జయించుట సాధ్యంకాదు సుమా? ఇంద్రియాలనేవి గద్దలు. ఇవిశరీరమనేగూటిలోచేరాయి- శబ్ద స్పర్శ రూపరస గంధములనే విషయాలకు ఆశపడ్డాయి- విహిత, నిషిద్ధ, (పుణ్యపాప) కర్మలనే రెక్కలతో తిరుగుచున్నాయి- ఈవంచకులను వివేకమనేవలచే (తుతు సమూహముచే త్రాటిచే) నిగ్రహించేయెడల వాళ్ళను మాత్రం చెరకొట్టను. పైకి మనోహరంగాఉండే ప్రాపంచిక

విషయములందు రమించేవాడిని మాత్రం నాశనం చేస్తాయి. వీటిని జయించడానికి ముందుగా వివేకాన్ని సంపాదించుకోవాలి. మనస్సును ఇంద్రియాలను స్వాధీనం చేసికొన్నవారే పురీశ్వరులు- పట్టణాలను ఏలు వారు పురీశ్వరులు కాదు. ఇంద్రియ జయమును పొందినవారికి వివేక బుద్ధులు కలుగుతవి. భోగవాసనలు అడుగంటుతాయి. అద్వితీయమగున ఆత్మతత్త్వమును దృఢంగా అభ్యసిస్తూ మనస్సును జయించనంతవరకే రాత్రిపూట దయ్యాలు తిరిగినట్లు భోగవాసనలు తిరుగుతూ ఉంటాయి. శరీరనగరంలో పరిశుద్ధమగున మనస్సు ఒక్కటే భృత్య, మంత్రి సామంతరాజుల పనిని నిర్వహిస్తుంది- మనీషులకు మనస్సే భార్య- మనస్సే తండ్రి- మనస్సే స్నేహితుడు- లాలనచేయుటచే స్నేహముగల భార్య. పాలించుటవలన తండ్రి పూర్ణవిశ్వాస పాత్రమగుటచే స్నేహి తుడు- శాస్త్రదృష్టితో ఆలోచిస్తే వివేకబుద్ధితో అనుభవిస్తే, మనస్సు అనేతండ్రి పరాసిద్ధిని (తత్త్వజ్ఞానమును) ప్రసాదిస్తాడు, తనరూపాన్ని కూడా విడిచిపెట్టి- (మనోరూపాన్ని కూడా విడిచి అనిభావము)- శ్రవణ మనన నిదిధ్యాసనా సాక్షాత్కారములతో కూడిన మనస్సు అనే మణి హృదయంలో చక్కగా ప్రకాశిస్తుంది- చక్కని మంత్రి రాజ్యంలోని అనర్థాలను తొలగిస్తాడు- రాజ్యాభివృద్ధిని కలిగిస్తాడు- అలాగే శాస్త్రీయ మార్గమందు ప్రవేశపెట్టిన మనస్సు అనే మంత్రికూడా, జన్మమరణము లనే విషవృక్షాలను ఛేదిస్తాడు- నిరతిశయానందమనే ఫలాన్ని ప్రసాది స్తాడు- కనుక రామా ! దుష్కర్మ వాసనలనే బురదలోపడి కలుష మైయున్న యీ మనోమణిని వివేకమనే నిర్మలోదకంతో కడుగు- తత్త్వజ్ఞానసిద్ధికి తయారుకా, రాగద్వేషపూరితమై భయంకరములయిన, భవ (సంసార) భూములలోపడి, వివేకవికలుడవై ఉంటూ, ప్రాకృత ( అజ్ఞాని ) పురుషునివలె మనస్సుకు పరాధీనుడవు కాకుముసుమా ? సంసారమాయ (ప్రపంచమాయ) అనేకానర్థసంకులమయినది. మహా మోహమనే మంచుతో నిండిఉంటుంది దీన్ని ఉపేక్షించియుండకు సుమా ? ప్రబలమయిన రోగాన్ని ఉపేక్షించి ఊరకుంటే కొంపతీసినట్లు

కొంతసేపి తీరుగుండి ఇది— వివేకం తెచ్చుకొని, పరమార్థ సత్యమయిన పదార్థమును బుద్ధ్యా నిర్ణయించుకొని, ఇంద్రియాలనే శత్రువులను జయించి, సంసారసముద్రాన్ని దాటు— లేని ఈశరీరమునందు, లేని యీ సుఖదుఃఖములయందు, దామవ్యాలకటోపాఖ్యానముయొక్క— న్యాయం నీకు కలుగకుండుగాక ! భీమభాసోపాఖ్యానన్యాయాన్ని ఆశ్రయించే మొదల నీకు ఆత్యంతిక శోకనివృత్తి కలుగుతుంది.

రామచంద్రా! దృశ్యమైన దేహాదులు నేనను మిథ్యాభిమానాన్ని వదలి, చిదేకరసమగు ఆత్మతత్త్వాన్ని అవలంబించి, అదేభావనతో, అమనస్కుడవై ఉంటూ యెన్ని వ్యవహారాలు చేసినా నీవు బద్ధుడవు కావు తప్పక ముక్తుడవౌతావు— ఇది నిజము అన్నారు.

గమనిక :– గురూ ! వసిష్ఠులు ఉత్పత్తి ప్రకరణంలో దేహేంద్రియాదులు లేనేలేవని చెప్పి యీ ప్రకరణంలో మళ్ళీ దేహేంద్రియాలను జయించే ఉపాయం ఉపదేశిస్తారే ? ఇది పూర్వాపర విరుద్ధం కాదా ? దీన్ని ఎలా సమర్థిస్తారు ? చెప్పండి.

గు॥ శిష్యా ! ఇందులో విరోధమేమీ లేదు. అక్కడ వసిష్ఠుల తాత్పర్యం వేరు. ఇక్కడి తాత్పర్యం వేరు. ఉపదేశాలయొక్క తాత్పర్యాన్ని బట్టి విషయం గ్రహించాలి. లేకుంటే తత్త్వం తేలదు. వసిష్ఠులు ఉత్పత్తి ప్రకరణంలో తత్త్వదృష్టితో (పరమార్థసత్యతాదృష్టితో) దేహేంద్రియాదులు లేనేలేవన్నారు. ఇక్కడ అజ్ఞానదశలో వాటిని ఉన్నట్లు ఒప్పుకొని వానిని జయించుటకు ఉపాయమును ఉపదేశించారు కనుక వీటిలో పూర్వాపర విరోధం లేదు. అజ్ఞాన దృష్టితో దేహేంద్రియాదులు గూడ అందరకు అనుభవంలో ఉన్నవి కనుక వానికి చికిత్స చేయకపోతే అనర్థాలు సంభవిస్తాయి. ఇది దామవ్యాలకటోపాఖ్యాన చరితము. చికిత్స చేసేయెడల అనర్థ ప్రాప్తి యుండదు— ఇది భీమభాసోపాఖ్యాన చరితము.

## ౨౫. నుంచి ౩౮ వరకు దామవ్యాలకటోపాఖ్యానము.

వాసనా రహితునకుగూడ మెల్లగా బయలుదేరుతాయి వాసనలు- వానివల్ల దేహాదులందు అభిమానం ఏర్పడుతుంది- వాటి జన్మమరణ పరం పరసిద్ధం- కనుక ఆత్మతత్త్వ జ్ఞానంలో ఆరూఢులు గాని మందమధ్య మాధికారులగు వాసనోచ్ఛేద విషయంలో ఎక్కువ ప్రయత్నం అవసరం- ఇదే విషయాన్ని సూచిస్తుంది దామవ్యాలకటాఖ్యాయిక- కనుక మళ్ళీ ఒక్కమారు దాన్ని అనువదించిన వసిష్ఠులవారు- రామచంద్రా ! నీవు దామవ్యాలకటులవలె నుండవద్దు- భీమభాసుల వలె దృఢంగాఉండి శోకవిముక్తినిపొందుము- అనిఅన్నారు.

అంతట శ్రీ రాముడు స్వామీ ! "తమరు నాసంసార తాపాన్ని పోగొట్టుటకు, వర్షకాలంలో నెమలికి మేఘమువలె నాకౌను- ఆ రెండు కథలను కొంచెం వివరించి చెప్పండి" అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామచంద్రా ! దామవ్యాలకటోపాఖ్యానమునూ, భీమ భాసోపాఖ్యానమునూ భీమ భాసదృఢస్థితినీ చెబుతాను విను. అని ప్రారంభించారు వసిష్ఠులు-

వసి॥ పాతాళకుహరంలో శంబరుడనే దైత్యేంద్రుడు (రాక్షస శ్రేష్ఠుడు) ఉండేవాడు- మహామాయావి- అతడు ఆకాశంలో గొప్ప నగరాన్ని కల్పించుకున్నాడు మాయచేత. అందులో ఉద్యానవనములు, పద్మరాగాది మణులనిధులు, దివ్యాంగనలను మించిన గానశక్తిగల స్త్రీలు, వికసించిన నీలోత్పలములతో తులతూగెడి నీలోత్పలములు దేవేంద్రుని జయింపగల కర్తరీయంత్రతుల్యమయిన బాహువులుగల దైత్యులు. చల్లని వెలుతురుగల ఉద్యానమండపములు- సర్పసహితమయిన మలయాచల చందనాదులు, బంగారుచాయను మించిన అంతఃపురాంగనలు, నానారకములయిన పూలరాశితో తొడలోతుగ

నిండినగృహాంగణములు, మిణుకురు పురుగులవలెఎగిరి తిరుగుచున్న రత్నసమూహములచే ప్రకాశించెడి స్త్రీముఖ్య భాగములు, అహా వాస్త్రానకు అర్ధరాత్రికూడ ప్రకాశించే సూర్యచంద్రులు, ఇంద్రుని యేనుగునుకూడ భీతినిగొల్పునట్లుగా ఐరావతము- సామంత దైత్యులచే సిరసావహించెడి శాసనములు, నలువైపుల స్వర్గసంపదలను సర్వైశ్వర్యములను కల్పించుకున్నాడు మాయచేత- కొన్ని లక్షలమంది దైత్యులను అండగాచేర్చాడు- సురలను నాశనంచేసే సైన్యం అంతులేకుండా సంపాదించుకున్నాడు- ఈస్థితిలో వాడు ఒకప్పుడు నిద్రపోయాడు. దేశాంతరం వెళ్ళాడు- (నిద్రలో దేశాంతరం వెళ్ళాడు.) ఆసమయం కనిపెట్టి దేవతలు వెంటనే సైన్యాని పూర్తిగా రూపుమాపారు- అతడు సేనలను రక్షించడానికి సేనాపతులను నియమించాడు. వాళ్ళనుకూడా సందుకనిపెట్టి దేవతలు చంపివేశారు- మళ్ళీ ఆ శంబరుడు కొంతమంది సేనాపతులను తయారుచేశాడు. దేవతలు వాండ్లనుకూడా నశింప చేశారు. అంతట వీనికి విపరీతమయిన కోపంవచ్చింది. దేవతలను నశింపచేయుటకు స్వర్గానికి వెళ్ళాడు- వీనిమాయకు భయపడి దేవతలంతా అంతర్ధానమయినారు- ప్రళయకాలంలోని ప్రపంచంవలె స్వర్గం అంతా శూన్యముగా ఉండిపోయింది. తిరిగి తిరిగి స్వర్గం అంతా ఈ శంబరుడు యెవ్వరూ కానరాక, ఉన్నరత్నాది శ్రేష్ఠవస్తువులను తీసికొని, లోకపాలురపట్టణాల్ని తగలబెట్టి యిల్లుచేరాడు-

ఇలా దేవదానవులకు ద్వేషం పెరిగేసరికి దేవతలు స్వర్గాన్ని విడిచి కనిపించకుండా దిగంతములనంటారు. ఈ శంబరాసురుడు యెవరెవరిని సేనాధిపతులనుచేశాడో, వారి వారినల్లా ప్రయత్న పూర్వకంగా దేవతలు చంపుతూ వచ్చారు. ఆశంబరాసురునికి కోపంబాగా పెరిగి మండిపడేటంతవరకు ఇలాచేస్తూనేవచ్చారు. అంతట అతడుమండిపడి బుస్సలుకొట్టుకొంటూ గట్టిప్రయత్నంతో మూడులోకాలూ వెదికాడు దేవతలకోరకు. ఎక్కడాకనిపించ లేదు దేవతలు- పిదప ఆరాక్షసుడు మహాభయంకరమయిన రాక్షసులను ముగ్గురను సృష్టించాడు తనసైన్య

సంరక్షణకొరకు- ఆముగ్గురు మూడు కాలములు ఈరూపాన్ని ధరించి వచ్చిరా ? నేమి అన్నట్లు ఉన్నారు. మాయచేత అట్లుగుంసాగు. మహామాయావులు. 1. దాముడు 2. వ్యాలుడు 3. కటుడు అని యీ ముగ్గురిపేర్లు ఇవి సార్థకనామాలు మొదటివాడు శత్రువులను శిక్షింప శక్తికలవాడు- రెండవవాడు శత్రువులను ముట్టడింప శక్తిగలవాడు- తివవాడు పరాస్త్రములనుండి తమవారిని దాచుకొనుశక్తిగలవాడు- దమయతి వ్యాలఇవ వేష్టయతి, కటతి ( అమృణాతి ) అనియథా క్రమంగా ఈపేర్లకువ్యుత్పత్తులు వెనకటి సేనాధిపతులుకు వీరికి తేడాఉంది. వీళ్లుఇంతకు ముందులేరు ఇప్పుడు మాయచేపుట్టారు. కనుక వీళ్ళకు కర్మలులేవు. కర్మవాసనలులేవు. అంతర్యామి చైతన్యముయొక్క ప్రేరణచే కర్మజీవుడయిన శంబరాసురునియొక్క మాయాకల్పనా కౌశలాన్ని ఆధారంగాచేసికొని పుట్టారు. ఇంద్రజాలికులు పుట్టించిన పురుషులవంటివారు వీరు. ఇలాంటివాళ్ళకు స్వతంత్రకర్మ లేకపోయినా జన్మ ఉండవచ్చును. వీండ్లకు కర్మవాసనలు లేకున్ననూ; అంధపరం పరా న్యాయమున కాకతాలీయముగాప్రస్తుత పనిని అనువర్తిస్తారు. సగం నిద్రించిన పిల్లలు తమ అవయవాలతో కదలుట మొదలయిన పనులు చేసినట్లు- దేహాభిమానమూ, కర్మవాసనాలేని వీరుకూడా వారి వారి పనిని చేయవచ్చును. యుద్ధమునందు శత్రువులకు ఎదురుగా వెళ్ళుట కాని, హఠాత్తుగా శత్రువుల మీదపడుటకాని, పరుగెత్తుటకాని, ఎరుగరు వీరు- చావుపుటుకలంటే ఏమిటో తెలియదు వీళ్ళకు. యుద్ధమనేది అడవిగోడు- జయాపజయములనేమాటే అగమ్యాగోచరము భయశంకా పలాయనాది వికల్పములులేని దేహపరిస్పందమే వీరధర్మము- కాని శంబరాసునియొక్క సంకల్పవాసనా మాత్రమే వీర్లకు శరీరమగుటచేత, ఎదురుగా శత్రువు కనుపించితే మాత్రం వానిని ఎదుర్కొనేవారు. అతని సంకల్ప వశంచేత ఆమాత్రపు సంస్కారము ఉద్బుద్ధమయ్యేది వీరికి- మాయాకల్పితులయిన ఈరాక్షసులచే రక్షింపబడిన ఆసేన దేవతలను జయించగలదని సంతోషించాడు శంబరాసురుడు-

గమనిక :- గురూ ? లోకంలో కామకర్మవాసనలు జన్మకు కారణంకదా ! అవి లేనప్పుడు జన్మకలుగుట అసంభవంకదా ! దామ, వ్యాల, కటులకు కామకర్మ వాసనలు లేవంటారే వసిష్ఠులు, జన్మ బీజములయిన కర్మవాసనలు లేకపోతే వీళ్ళకుజన్మ ఎలావచ్చింద? జన్మబీజములు లేకున్నా జన్మవచ్చేయెడల కర్మవాసనలు నశించిన ముక్తులకు జన్మవలరాదు ! ముందు వసిష్ఠులే చెప్పబోతారే "విద్యతే వాసనా యత్ర తత్రైనాయాతి పీనతాం" ఎక్కడ వాసన ఉంటుందో అక్కడ అది బలిసి (స్థూలమై) జన్మరూపంగా తయారవుతుంది." అని- కనుక ఇది పూర్వాపరాసంగతంగాఉంది. ఎలా కుదురుస్తారుదీనిని ?

గురు॥ శిష్యా ? వీళ్లు స్వతంత్ర జీవులుకాదు- అనగా కర్మజీవులు కాదు. అంతర్యామి చైతన్యముయొక్క ప్రేరణచే కర్మజీవుడయిన శంబరాసురుని యొక్క కౌశలరూపమయినట్టియు, అత్యల్పమయినట్టియు, కర్మవాసనలచే తయారుకానట్టియు, నిస్సారమయిన, మానసిక సర్గసంకల్పవృత్తిని ఆధారంగా జేసికొని బయలుదేరారు- ఇంద్రజాలికుడు సృష్టించిన పురుషులువంటివారు వీరు. కనుక వీళ్లకు స్వతంత్రమయిన కర్మ లేకపోయినా అవిద్యాభవరూపమయిన జన్మ కుదురుతుంది-

లేకపోతే, విపశ్చిదుపాఖ్యానంలో చెప్పబోయే న్యాయం ప్రకారం శంబర జీవునియొక్క అంశభూతులువీరు. అగ్నికి విస్ఫులింగముల వంటివారు. విస్ఫులింగాలు నిప్పులోనూ ఇమిడిఉంటాయి. నిప్పు బయట ఉంటాయి. అలాగే కర్మజీవులు ఒకఅంశలో లోపలా ఉంటారు. ఒక అంశముతో బయటాఉంటారు విభాగం చెంది. కనుక కర్మజీవుడయిన శంబరాసురునియొక్క అంశభూతమై, కర్మవాసనలు అత్యల్పముగుటచే పుష్టిచెందక, మనః ప్రాయమయిన భేదంచేత శరీరమనే ఉపాధితయారై పుట్టారువీరు కనుక యోగియోగశక్తిచే భిన్నభిన్నంగా అనేకశరీరాలు ధరించినట్లు, శంబరాసురునికామకర్మ వాసనా బీజములను నిమిత్తంగా జేసికొని జన్మసిద్ధించినది వీళ్లకు- కనుక వీరలజన్మకు వేరేకర్మ వాసనా

బీజములు అక్కరలేదు- కాని యోగులు ధరించిన దేహభేదాలు తత్త్వజ్ఞానంచేత బాధితము లయినందువల్ల, వార్లకు ఆశరీరాలలో జన్మ బీజములయిన కర్మవాసనలు వృద్ధిచెందవు- దామవ్యాల కటాదులు అజ్ఞానులగుటచే, వార్లకు ఆదేహములలో కర్మవాసనలు వృద్ధిచెందుతవి. వానివల్ల జన్మ పరంపరాప్రాప్తికూడ కలుగుతుంది ఈభేదంచేత నిది వీళ్లకూ, యోగులకూ కనుక ఇందులో అనుపపత్తి ఏమీలేదు.

౨౬. దేవదానవుల సంగ్రామము :- ఆదేనిశ్చయంతో గనా తలంనుంచి యీ ముగ్గురు సేనాధిపతులను, సేననూ పంపాడు దేవతల నాశనంకొరకు శంబరాసురుడు. ఈదైత్యులు సముద్రప్రాంతములో వన కుంజముల (అడవిగుబురుల) నుండీ, కొండగుహలనుండీ భూలోకానికి వచ్చారు- భూమ్యాకాశముల మధ్యభాగం అంతానిండిపోయారు దేవతలుకూడా, మేరుగుహలనుండీ, వనకుంజములనుండీ, బయలుదేరారు యుద్ధానికి- అకాలప్రళయమువలె అతిభయంకరమయిన యుద్ధం జరిగింది ఉభయులకు- రామా ! ఏమిచెప్పేది వర్ణింపనలవికాని అంతటి యుద్ధం జరిగింది.

౨౭. పరాజితులయిన దేవతలకు బ్రహ్మదేవుడు రాక్షస వధోపాయమును జెప్పుట.

ఆ ఘోరసమర సంభ్రమంలో దేవదానవుల శరీరాలనుండి రక్త ప్రవాహాలు గంగాప్రవాహాలవలె బయలుదేరాయి. దాముడు దేవతా బృందాన్ని చుట్టుముట్టి సింహనాదంచేశాడు- వ్యాలుడు సర్వాసురాలయమును లాగివిసిరి పిండిచేశాడు- కటుడు అతికఠినమయిన యుద్ధంలో అమరుల నందరిని నాశనంచేశాడు. ఐరావతం పలాయనం చెప్పింది. దానవానీకం చండభాస్కరునివలెమండి పడుతోంది. దేవతా సైన్యాలు వ్యర్థాస్త్రములై నెత్తురుకారుకుంటూ హద్దుమీరి పరుగెత్తినవి- అంతర్ధానంచెందాయి- దామవ్యాలకటులు వారివెంటపడ్డారు అరచుకుంటూ ఎంతో ప్రయత్నంచేశారు- కాని లభించలేదు వీరికి దేవతలు. అంతట

నిరాశ చెంది దామవ్యాలకటులు సంతోషిస్తూ- పాతాళలోకంలో ప్రభువు వద్దకు వెళ్ళారు ఘనకార్యం చేశామని చెప్పటానికి. ఆపైన దేవతలు దుఃఖితులై కొంతకాలం విశ్రాంతి తీసికొని, రాక్షసుల జయించే ఉపాయం తెలిసికోటానికి బ్రహ్మగారి వద్దకు వెళ్ళారు. దేవతలకు బ్రహ్మగారు ప్రత్యక్షమయ్యాడు- ఆయనకు నమస్కరించి సురలు రాక్షసులవల్ల కలిగిన అనర్థం అంతా విన్నవించుకున్నారు బ్రహ్మగారికి. ఆయనగారు విషయం అంతావిని, బాగా ఆలోచించి, ఆ దేవతా బృందానికి చక్కని ఉపాయం చెప్పారు.

బ్రహ్మ :- "దేవతలారా ! నూరువేల సంవత్సరాలకు పైన విష్ణుమూర్తి చేతిలో శంబరాసురుడు చావవలసియున్నాడు- అంతవరకు ఓపికపట్టి మీరు కాలాన్ని వీక్షించాలి- కనుక మీరు అంతవరకు ఆరాక్షసులతో మాయాయుద్ధం చేస్తూ పారిపోతూ ఉండండి- ఈయుద్ధాభ్యాసం వల్ల వాళ్లకు అంతఃకరణలో అహంకారం ఏర్పడుతుంది, అద్దంలో ప్రతిబింబం ఏర్పడినట్లు- దానిచే క్రమంగా వాళ్లకు వాసనలు పెరుగుతవి- అప్పుడు ఆ దామవ్యాలకటులు వలలోపడ్డ పిట్టలవలె మీకు జయించటానికి సాధ్యపడతారు- ఇప్పుడు వాళ్లకు వాసనలు లేవు కనుక సుఖదుఃఖాలు లేకుండా శత్రువులతో పోరాడుతూ, మీకు దుర్జయులయినారు. వాసనాతంతుబద్ధులూ, ఆశాపాశములకు వివశులయినవారునూ, లోకంలో వశ్యులవుతారు త్రాటితో కట్టివేసిన పిట్టలవలె- వాసనాత్యాగం చేసినవారునూ (వాసనారహితులునూ) సర్వసమమయిన బుద్ధి కలవారునూ, హర్షవిషాదములు లేనివారునూ, జయింపసాధ్యపడరు. వాసనారజ్జుబద్ధుడగువాడు ఎంతటి సర్వజ్ఞుడయినా తుదకు పిల్లవానికి కూడా లొంగిపోతాడు- "వీడు" వాడు, "నేను" "నీవు" "నాది" "నీది" అనేకల్పనలు కలవాడు ఆపదలకు నిలయం- ఇలాంటి పరిచ్ఛిన్న బుద్ధికలవాడు ఎంతటి సర్వజ్ఞుడయినా వాడునీచుడే- అన్ని వాసనలలోనూ, దేహాది తాదాత్మ్యభ్రాంతి వాసన మహాగొప్పది- దానియం

లటి అనర్థకారి మరొకటిలేదు- ఆత్మకంటె భిన్నంగా వస్తువు ఏదయినా ఉన్నట్లయితే దానిమీద వాసన ఉచితమయ్యేది. అదేలేదు. కాక లేనివస్తువుమీద ఆశపనికిరాదు- అది అనంతములయిన అనర్థాలకునిలయము కనుక దానవ్యాలకటులకు సంసారంలో ఆసక్తికలిగేటంతవరకు వాళ్లుమీకు జేయులుకారు దోమలకు మేరుపర్వతము కదలనట్లు- వాసనలున్నచో సులభంగా జయింపతగుదురు- వాసనలు ఉంటేనే అవికలిసి బలిసి వృద్ధి చెందుతాయి. లోకంలో ఏవస్తువూ వృద్ధిచెందితే కాని బలియదు. రెండవ అవయవముంటేకాని ఉపచయము (వృద్ధి) కలగదు- అద్వితీయావయము ఉన్న ద్రవ్యానికి సంభవిస్తుందికాని లేని ద్రవ్యానికి సంభవించదు- కాబట్టి "దేవేంద్రా ! నేను, నీవు, నాది, నీది, అనేవాసనలు దానవులకు కలిగేటట్లు చేయండి- వాసనలు పెరిగినకొద్దీ దుఃఖం పెరుగుతుంది. అవితగ్గినకొద్దీ సుఖంపెరుగుతుంది. ధీరుడుకానీ, బహుజ్ఞుడు (అనేకం తెలిసినవాడు) కాని, కులీనుడుకాని, మహానుభావుడుకాని, తృష్ణాపాశంలో బద్ధుడవుతాడు. సింహం ఇనుపగొలుసులచే బద్ధమవుతుంది. చిత్తమనే పక్షి దేహమనే చెట్టుయొక్క హృదయమనే తొర్రలో ఉంటుంది- దానికి వాసన అనేదివలగా కల్పింపబడినది- వాసనా బద్ధమయిన లోకం యమునికి వశమవుతుంది- త్రాటితో కట్టినపిట్ట పిల్లవాడికి స్వాధీనం అవుతుంది- కనుక మీరు ఆయుధాలు సంపాదించి లాభం లేదు- రణసంరంభము చూపించి లాభంలేదు- ఎలాగయినా వార్ని యుక్తిగా వాసనాబద్ధులనుగా చెయ్యండి- శత్రువుయొక్క మనస్సులో ధైర్యం చెడకపోతే శస్త్రాలుకాని, అస్త్రాలుకాని, శాస్త్రాలుకాని, వాడిని జయించలేవు. కనుక దానవ్యాలకటులు యుద్ధాభ్యాసంచేత అహంకారమయిన వాసనలను గ్రహిస్తారు అప్పుడు మీకు వారు స్వాధీనమవుతారు. అంతవరకు యుక్తిపూర్వకమయిన యుద్ధంతో వాళ్లను లోకవ్యవహారంలో జాగరూకులనుగా చెయ్యండి- అప్పుడుబద్ధ వాసనులై మీకు వశ్యులవుతారు" అని అన్నాడు బ్రహ్మదేవుడు-

౨౮. దేవదానవుల పునర్యుద్ధ వర్ణనము.

వసి॥ రామచంద్రా! ఈమాటలుచెప్పి బ్రహ్మదేవుడు వెంటనే అంతర్ధానమయినాడు. దేవతలు బ్రహ్మగారి ఉపదేశంవిని వారిచ్చ వచ్చిన తావుచేరి కొంతకాలం సుమ్మెదలు పద్మాలయమందు విశ్రమించి నెమ్మది విశ్రాంతి పొందారు- తర్వాత కొంతకాలముండి తమకు మంచి రోజులుచూచుకొని ప్రళయకాల మేఘములవలె యుద్ధసూచకంగా దుందుభి వాయించారు- ఆదుందుభి ధ్వనినివిని పాతాళలోకంనుంచి రాక్షసులుకూడా తయారయి యుద్ధానికివచ్చారు- ఉభయులకు నానారకములయిన ఆయుధములతో ఘోరసంగ్రామం (యుద్ధం) జరిగింది- ఆయుద్ధమునందు బ్రహ్మాండమువారమంతా ఘుంఘుమధ్వనులతో నిండినది- రక్తప్రవాహాలచే భూధరములూ, భూమీ, కడగబడినట్లయింది- అనేకము భువనములనే విశాలమయిన గుహాలయందు ఏరులై ప్రవహించినవి.

౨౯. అసుర పరిభ్రంశము (అసురుల ఓటమి) :- మహాసంరంభంతో జరిగిన ఆయుద్ధములో, దేవతలు, కొంతకాలం మాయతోను కొంతకాలం వాగ్వివాదంతోను, మరికొంతకాలం సంధి (రాజీ) తోను కొంతకాలం పోట్లాటతోను, కొంతకాలం పారిపోవుటతోనూ కొంతకాలం ధైర్యంతోను, కొంతకాలం ప్రచ్ఛన్నంగా దాగుటలోను కొంతకాలం శరణాగతిని పొందుటతోను, మరికొంతకాలం అస్త్రయుద్ధంతోను, ఇంక కొంతకాలం అంతర్ధానంతోను కాలంగడిపారు ఇలా మొదటి యుద్ధము పది సంవత్సరాలు జరిగింది. రెండవయుద్ధం అయిదు సంవత్సరముల యెనిమిది మాసముల పది రోజులు జరిగింది. మూడవ యుద్ధం పన్నెండు రోజులు గడచింది- ఇంతకాలం రెండు సేనలయందును చెట్లూ, అగ్నులూ, ముఖ్యమయిన ఆయుధాలూ, పిడుగులూ, పర్వతాలూ, వర్షించాయి- అప్పటికి యీమాయారాక్షసులకు యుద్ధాభ్యాసంగట్టిపడింది. అహంకారంముదిరింది. మరీదగ్గరగాఉన్న అద్దంలో ప్రతిబింబం ఏర్పడినట్లు అహంభావం స్పష్టపడింది. ఇలాగే అద్దం

దూరంగాఉంటే ప్రతిబింబం ఏర్పడనట్లు అభ్యాసము ఎక్కువయితే వాసనకూడ నశిస్తుంది. ఇలాదామవ్యాలకటులకు అహంకారం ఏర్పడగానే, నాజీవితము, నాధనము, అనేఆశాదైన్యంకూడాకలిగింది. సంసారవాసన మోహవాసనలుగలిగి ఆశాపాశబద్ధులైఅతిదైన్యంలో పడ్డారు. ఆపాదమస్తకము నాదేహంస్థిరంగా ఉండేఉపాయంఏమిటూ అనేభావం ఏర్పడింది ఆముగ్గురికీ "నాదేహంనాకు స్థిరంగా ఉండాలి." "నాధనం నాకు సుఖంఇవ్వాలి" అనేభావం ఏర్పడేసరికి వాళ్లకి లోపలి ధైర్యం అడుగంటింది. దేహవాసనలు ముదిరినందునను, బలము తక్కువయాగట వలనను, వాళ్లకు దెబ్బలాటలో శక్తితగ్గింది. దేవతలకు జయంకలిగింది. మనం దేవతలమయ్యే విధానం ఏమిటా అనేదిగులుపుట్టించి రాక్షసులు— స్త్రీ అన్నపానాది సేవచే, రతిపెరిగి, భీషణమయిన మనోవికారం ఏర్పడినది. మదపుటేనుగుల గుంపులో లేడిపిల్లలు బెదరిపోయినట్లు, దేవతలతోటి యుద్ధానికి బెదరిపోయారు. చస్తాము "చస్తాము" అనుకుంటూ మెల్లమెల్లగా జారుకోనుట మొదలుపెట్టారు. వీళ్లకు మరణభీతికలిగేసరికి దేవతలు అసురులతలలెక్కారు. చావమోదుట మొదలుపెట్టారు వీళ్లను. తుదకు గాలికి దోమలవలె సులువుగా లొంగిపోయారు. దామవ్యాలకటులు— దిక్కులనంటి పలాయితులయినారు. పేరుమోగిన ఈముగ్గురికి ఈదశపట్టేసరికి, దైత్యసైన్యం అంతాచెల్లాచెదరై ఇటూ, అటూ, కొందరు మేరుపర్వతకుంజములందూ మరికొందరుపర్వతాగ్రములందూ; సముద్రప్రాంతములందూ, మేఘబృందములందూ, సముద్రంలోని సుడిగుండాలలోనూ. కార్చిచ్చుగల అడవులలోనూ, క్రూరమృగములుగల జాంగములందునూ, పోయిపడి శస్త్రాస్త్రపాతములచేత వెంటనే నశించారు.

## 30. దామవ్యాలకటుల జన్మాంతర చిత్రవర్ణనము.

వసి॥ ఇలా దానవులంతా నశించారు. దేవతలు సంతోషించారు దామవ్యాలకటులు ముగ్గురు కడుదీనులై భయభ్రాంతులై పారి

ఉంటివా నీకు నిరతిశయానందం కరతలామలకం- పరమార్థమనే చంద్ర మండలాన్ని అహంకారమనే మేఘాలు ఆచ్ఛాదిస్తే ఆనందైకరసమయిన ఆ చంద్రబింబం అదృశ్యమవుతుంది. దామవ్యాలకటులనే రాక్షసులు ముగ్గురూ. అహంకారమనే దయ్యంపట్టి జన్మమరణ ప్రవాహంలో మునిగిపోయారు. రామా! వాళ్లు కాశ్మీర దేశములలో అడవులందు ఇప్పటికీ మత్స్యజన్మమెత్తియున్నారు. నీటిమడుగులలోని నాచుర సంగ్రోలుతూఉన్నారు. అన్నారు వసిష్ఠులు.

శ్రీ॥ మహాత్మా! 'మీరు గతాస్సత్తామసంతోఒపి మాయా మాహాత్మ్యదానవాః' (మాయయొక్క ప్రభావంచేత ఆదానవులు లేని వారయినను ఉన్నవారయినారు) అని అంటిరే 'నాసతో విద్యతేభావః నాభావో విద్యతే సతః' లేనిదానికిఉనికీ, ఉన్నదానికి లేకపోవుట' ఉండదనికదా! న్యాయము. పేరుమాత్రంలేని వారయితే ఉనికినిఎట్లు పొందారు! చెప్పండి? అన్నారు శ్రీరాముడు.

వసి॥ రామచంద్రా! నిజము. లేనిదానికి ఉనికిఉండదు. ఉన్నదానికిలేకపోవుటయు, ఉండదు. కాని సూక్ష్మంగాఉన్నదే ఆవిర్భావం చేత స్థూలమవుతుంది. అదేదానికిఉత్పత్తి. స్థూలంగాఉన్నది తిరోభావం చేత సూక్ష్మమవుతుంది. ఇదే దీనికి నాశం- కనుక ఉండుటా, లేకపోవుటా ఉన్నదానికేకాని, లేనిదానికికాదు_ కాక రామా! లేనిది ఏది యున్నదో నిరూపించిచెప్పు ఉన్నటువంటి సత్పదార్థము ఏదిలేకపోయి నదో నిరూపించు. నీకుదృష్టాంత పూర్వకంగా బోధిస్తాను. అనిఅన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ! మీరే అనుచున్నారుకదా! "మనమంతా" ఉన్నవారమనీ, దామవ్యాలాది రాక్షసులు లేనివారనీ_ వారులేని వారయియే ఉన్నవారయినారని ఇప్పుడేచెప్పితిరికదా? మనయొక్క ఉనికి ప్రత్యక్ష ప్రమాణ సిద్ధము. దామాదులయొక్క ఉనికి మాయా మాత్రము, కనుక వారు అసద్రూపులువారికి ఉనికిచెప్పుటలో మీఅభి ప్రాయమేమి?

వసి॥ రామా! దాహవ్యాలకటాదులు మాయామయములు- కనుక అసత్యాలు సత్యాలుగా భాసిస్తున్నవి ఎండమావుల నీరువలె- మానవమందరము కూడా అంతే సురాసుర దానవులందరూ కూడా అంతే- అసత్యాలయినా వస్తూపోతూ ఉన్నారు. (యాతాయాతములను పొందుతున్నారు)- నీశరీరమూ మిథ్యే- నాశరీరమూ మిథ్యే- అనుభవంలో ఉన్నా అసత్యమే ఇది. కలలో తనచావు తనకు అనుభవగోచరమవుతూ ఉంటుంది అంతే ఉజ్జ్వగద్దెకూడా- చచ్చిన చోట్లం కలలో జను భూతుడయినా (కనిపించినా) లేనివాడేవాడు- అలాగే ఈప్రపంచం ఎంత కనిపించినా లేనిదే- కాని ప్రపంచం సత్యమని అనుకునేవానికి (మూఢునికి) ఈమాట నచ్చదు- నచ్చచెప్పలేముకూడా- తత్త్వవిచారాభ్యాసము లేనిదే జగత్సత్యత్వాభావాన్ని పోగొట్టలేదు- శాస్త్రార్థ విచారం లేనిదే సంస్కారంకూడా నశించదు. లోపలబాగా గట్టిపడిన (స్థిరపడిన) సంస్కారము, వ్యతిరేకాభ్యాసబలం లేనిదే తొలగదు- కనుకనే అధికారం లేనివానికి తత్త్వోపదేశ వాక్యాలు ఉన్మత్త ప్రలాపాలు అవుతాయి-

బ్రహ్మసత్యం జగన్మిథ్య అనిఅంటే మూఢులు ఎగతాళి కూడాచేస్తారు- మద్యపానము త్రాగువాడూ అదిలేనివాడూ ఒకటవుతారా? చీకటి వెలుగులకు ఐక్యంకుదురుతుందా? ఎండనీడలకు అభేదం పొసగుతుందా? జ్ఞానికీ అజ్ఞానికీ ఏకత్వం సంభవమా? అజ్ఞానికి ఎంత ప్రయత్నించి బోధచేసినా ద్వైత ప్రపంచం అసత్యమని ఒప్పించలేము. శవాన్ని కాళ్లతో నడిపించటం ఎంతకష్టమో, విడిచేత అవిషయం ఒప్పించటంకూడా అంతకష్టం- యజ్ఞ దాన, తప ఆది సాధనములు లేకపోతే ప్రపంచంఅంతా బ్రహ్మస్వరూపమనేబోధ రుచించదు- కనుక అజ్ఞానికి తత్త్వోపదేశము నిరర్థకము పూర్ణజ్ఞానికికూడా ఉపదేశము వ్యర్థము. అల్పజ్ఞానము కలవాడి యెడల ఉపదేశము ఉపయోగపడుతుంది. కనుకనే ప్రారంభంలో మేము "నాత్యంతమజ్ఞో నోతజ్ఞః సోఽస్మిన్

సత్యరూపులా ? అసత్యరూపులా ? అనే విచారణ వాళ్లనే గురించి యెందుకు ? నీవు రాముడవూ నేను వసిష్ఠుడనూ మనమిద్దరమూ సత్యస్వరూపము కలవారము కనుక వాళ్లను గురించి విచారిద్దామూ ! ప్రతివాడూ "నేనుసత్యం" "వాడుఅసత్యం" "నాడునిజం" "వాడిదిఅబద్ధం" అని అనుకొను వాళ్లే కాని, నిజంకనిపెట్టినవాడు ఒక్కడూ లేడు దాని వ్యాలాదరూపంతో భాసించిన చైతన్యం, ఆ ఆకారాన్ని పొందినది, మనరూపంతో భాసించిన చైతన్యం మన ఆకారాన్ని పొందినది గాన స్వప్నజ్ఞానమునకు ప్రపంచమని పేరు పెట్టారు. చిదాకాశమునకే యీ పేరు. వేసవిలోని ఎండకు మృగతృష్ణాలు (ఎండమావులనీరు) అని పేరు పెట్టినట్లు బాహ్యపదార్థరూపంగా చిదాకాశం కనిపిస్తూ ఉంటే దానికి ప్రపంచమని పేరుపెట్టారు. బాహ్యప్రపంచంలేని చిదాకాశము మోక్షమన్నారు. ఈబంధ మోక్షకల్పనల రెండింటికి అధిష్ఠానము చిదాత్మయే ఆత్మను ఇలా రెండువస్తువులున్నవని నీకు ఆత్మబోధకొరకు చెప్పినేకాని పరమార్థంలో పరబ్రహ్మమునకు ప్రబుద్ధావస్థ ప్రసుప్తావస్థ అనేవి లేవు కేవలం చిదాకాశమే, దృశ్యప్రపంచమని గుర్తించుట మంచిది ఇదియే సమంజసముగు పద్ధతి.

ఈ జ్ఞానము కలవాడిదృష్టిలో బంధమోక్షములకు రెంటికీ భేదముండదు. పరమార్థసత్యమయిన పరబ్రహ్మమునే ప్రపంచమని అనుకుంటున్నారు లోపలు నల్లగానున్న ఆకాశఖండమును చూచి రేచీకటిగలవాడు వెంట్రుకలకొప్పు అని అనుకుంటాడు. అలాగే ఇదికూడా అదివీడి భ్రాంతియేకాని, నిజంలో ఆకాశం వెంట్రుకల కొప్పుకాదు. ఇక్కడ కూడా వీడిభ్రాంతియే కాని, నిజంలో ఇది ప్రపంచం కాదు. బ్రహ్మమే.

కనుక రామచంద్రా ! అధ్యారోపదృష్టిలో సర్వవ్యాపకమగు చిదాకాశమునియందు అన్నీఉన్నట్లు అపవాదదృష్టిలో ఎక్కడా, ఏమీ లేదు. ఈ రెండు పద్ధతులలోను ప్రపంచం ఆత్మభిన్నం కాదు. సద్రూ

వసిష్ఠుడు ఈకథ అంతా యథాక్రమంగా చెబుతాడు.

వసి॥ రామచంద్రా! కాశ్మీరదేశంలో ఒకపెద్ద పద్మసరస్సీరాన నీటిమడుగులలో చేపలయి పుట్టి చాలకాలం దుఃఖం అనుభవించారువీళ్లు, కొంతకాలానికి గ్రీష్మకాలంలో ఆనీటిమడుగులు దున్నలూ, అడవిపందులూ, కలవరపరచాయి. ఆతొక్కుడిచే వీళ్లునలిగినశించి అదే పద్మ సరస్సునందు సారసములై పుట్టారు. చాలాకాలం ఆసరస్సులోని ఎర్రకలువలందూ, పద్మపటలములందూ, నాచుతీగలందూ, నీలోత్పల లతలయందూ, వారిచ్చవచ్చినట్లు ఆనందంగా విహరించి క్రమేపు తత్త్వవిచారబుద్ధి కలిగి ముక్తిపొందుతారు. వివేకదృష్టితో ఆలోచించబడిన గుణత్రయము ముక్తికొరకు భేదాన్ని పొందినట్లు—

కాశ్మీరదేశంలో చెట్లూ కొండలూ గలపట్టణం ఒకటి ఉంటుంది. దానిపేరు అధిష్ఠాననగరం అంటారు. చాలాశోభగా ఉంటుంది అది. అక్కడ ఒకకొండ మీద ఎక్కడానికి సులువయిన ప్రద్యుమ్నమనే శిఖరం ఒకటి ఉంటుంది. ఆకొండశిఖరం మీద మంచి యిల్లుఉంటుంది. ఆయింటికి ఈశాన్యమున పైగోడ తొర్రలో వ్యాలుడనే దానవుడు కలవింక (పిచ్చుక) గా పుట్టుతాడు— అర్థంలేని పిట్టకూతలు కలవాడుగా ఉంటాడు. అక్కడ వాడు యశస్కరదేవుడనే పేరుగల రాజవుతాడు; స్వర్గంలో దేవేంద్రుడువలె ఉంటాడు. దాముడనే రాక్షసుడు వ్యాలుని యింటిలో పెద్దస్తంభానికి వెనుకఉన్న రంధ్రంలో దోమఅయి పుడతాడు. వాడికి అధిష్ఠాననగరంలో రత్నావళీ విహారమనే పేరుగల క్రీడాగృహం కూడా ఉంటుంది. ఆయశస్కరదేవుడనే రాజుకు (వ్యాలుడనే రాక్షసుడే యీరాజు) నరసింహుడను పేరుగల మంత్రి ఉంటాడు. ఆమంత్రికి బంధమోక్షములు రెండూ అరచేతిలోని ఉసిరికపండువలె కనిపిస్తూ ఉంటాయి శ్రుతి యుక్తి గురూపదేశ స్వానుభవములచే నిశ్చితములై ఆమంత్రిగారింటిలో ఆడుకొనుటకు తగినశారిక (గోరువంక) అనే పిట్టగా పుట్టుతాడు కటుడనే మాయాసురుడు. చక్కని పంజరంలో ఉంటాడు.

నరసింహుడనే మంత్రి దామవ్యాలకటాదుల సత్కథను (యథార్థస్థితిని) శ్లోకరూపంగా తయారుచేసి చెప్తాడు. క్రకర (కొక్కెరపిల్ల) మనే (యనే) పిట్టగా పుట్టిన కటుడనే రాక్షసుడు ఆకథను విని తనయొక్క అపరిచ్ఛిన్నాత్మభావాన్ని స్మరించుకొని ప్రశాంతస్థితిరూపమగు మోక్షము పొందుతాడు ప్రద్యుమ్నమనే పర్వతశిఖర ప్రాంతాన నివసించే కలవింకమనే (పిచ్చుకయనే) పక్షి (అనగా పిచ్చుక జన్మమెత్తిన వ్యాలుడనే రాక్షసుడు) అక్కడనున్న వాళ్ల ద్వారా తమ పూర్వవృత్తాంతంతో కూడిన బ్రహ్మకథను విని ముక్తిపొందాడు. రాజమందిరమునందలి స్తంభం వెనుక, పగులు (రంధ్రంలో నున్న మశకము) అనగా దాముడనె రాక్షసుడు, ప్రసంగవశాత్తు ఈకథను విని ముక్తి పొందాడు. రామా ! ఇలా ప్రద్యుమ్నశిఖరమునుండి చటకమూ (పిచ్చుకా) రాజమందిరమునుండి మశకమూ (దోమా) క్రీడాగృహమునుండి క్రకరమూ (కొక్కెరా) అనగా దామ, వ్యాల, కటులు, ముగ్గురూ ముక్తిపొందారు. ఇదీ దామవ్యాలకటాదుల వృత్తాంతం. దీనిని యథాక్రమంగా చెప్పాను నీకు. కనుక మాయఅనేది ఇలాగే లేని ప్రపంచాన్ని ఉన్నట్లు చూపిస్తుంది. ఎండమావులు ఎలా నీరుఅనే భ్రాంతిని పుట్టిస్తాయో, అలాగే యీమాయకూడా ఈదామవ్యాలకటాదులవలె అజ్ఞానమోహితులయిన మూఢులు ఎంతటి ఉచ్చస్థితిలో నున్నా అజ్ఞానవశంచేత అధఃపతనాన్ని పొందుతారు. కనుబొమ్మలను చిట్లించినంతమాత్రాన మేరుమందరాది పర్వతాలను పొడిచేసే సత్తాఎక్కడ ? రాజగృహంలోని స్తంభముయొక్క చిల్లిలో దోమగా పుట్టుటెక్కడ? అరచేతితో చెంపదెబ్బకొట్టి సూర్యచంద్రులను పడగొట్టె సత్తాయెక్కడ? ప్రద్యుమ్న పర్వతంమీది యింటిగోడయొక్క తొర్రలో పక్షిగాపుట్టుటెక్కడ ? పుష్పమునువలె అరచేతిలో మేరుపర్వతాన్ని నిలుపుకొని తూకంతూచే సామర్థ్యంయెక్కడ? కొండశిఖరంమీద నరసింహుడనే మంత్రిగారింటిలో కొక్కెరపిల్లగా పుట్టుటెక్కడ ? రజోగుణంచేత చిదాకాశమునందు

నేనుఅనే అభిమానం (అనగా అహంభావం) ఏర్పడి స్వస్వరూపాన్ని విడిచి పెట్టుకుంటగనే అజ్ఞానంచేత అహంకార, ప్రాణ దేహేంద్రియాది రూపాన్ని చెందుతాడు మానవుడు. ఇదంతా తమతమ వాసనాభ్యాసములతో జరిగేపని ఎండమావులను చూచి నీరనుకొనినట్లు చిద్రూపుడగు పరమాత్మకంటె తాను వేరని అనుకుంటాడు మానవుడు. ప్రత్యక్ప్రవణమయిన (చైతన్యాభిముఖమయిన) బుద్ధిగల మహానుభావులు భవసాగరమును తరిస్తారు.

మహావాక్యార్థజ్ఞానంచేత వాళ్లకు దృశ్యబుద్ధి నశిస్తుంది. శుష్కతర్కమతాలన్నీ దుఃఖవికారములను కలిగించేవి కాని బాగుపరచేవి కావు. ఆమతాలను నమ్మేవాళ్లు స్వలాభాన్ని పాడుచేసుకుంటారు. నాశనంచేసికుంటారు. కనుక రామా! అనుభవసిద్ధమయిన జ్ఞానాన్ని అనుసరించాలి. అది ఆగమానుసారి మార్గంగాఉండాలి. వేదాన్ని అనుసరించి ఉండాలి. ఆత్రోవను పోయ్యే వాళ్లు చెడిపోరు. పరమపదమును పొందుతారు– అన్నిటికంటె కోరిక గొప్పఅనర్థకారిసుమా! నాకు 'ఇదికావలె' 'ఇదకావలె' అని అనుకొనే దౌర్భాగ్యానికి ఈదైన్యంచేత చివరకు పురుషార్థముయొక్క బూడిదకూడా మిగలదు? ముల్లోకాలను గడ్డిపోచమాదిరిగా చూచేవాణ్ణి విడిచిపెడతాయి అన్నిఆపదలూ. సర్వదానిరాశతో నుండుట చాలాగొప్ప విషయం విరక్తచిత్తుడై శుద్ధసత్త్వప్రధానమయినవాణ్ణి ఇంద్రాది దేవతలు బ్రహ్మగారిని కొలిచినట్లు కొలుస్తారు– ఎంతటి తీరని ఆపదవచ్చినా అక్రమమయినమార్గాన పడకూడదు. రాహువు అంతటి వాడుకూడా అక్రమంగా అమృతాన్ని త్రాగినా, తుదకు మరణించనే మరణించాడు. సచ్ఛాస్త్రము, సజ్జనసహవాసము, ఈ రెంటిని ఆశ్రయించినవాళ్లు మోహాంధకారంలో పడరు– వైరాగ్యాది గుణములుగల వాళ్లకి అవశ్యాలు వశ్యాలవుతాయి– ఆపదలన్నీ అంతరిస్తాయి– తరగనిశ్రేయస్సు లభిస్తుంది. ఎవరికి వైరాగ్యశమదమాది గుణములందు "ఇంకచాలును"ను బుద్ధిఉండదో, అధ్యాత్మ

శాస్త్రశ్రవణోత్సాహాలందు ఎల్లప్పుడూ కోరిక ఉంటుందో పరమార్థ సత్యమయిన పదార్థమందు వ్యసనం ఉంటుందో, వాళ్లే మనుష్యులు. మిగిలినవాళ్లు పశువులే. ఏమానవుని యొక్క హృదయమనే సరస్సు కీర్తి అనే వెన్నెలలో ప్రకాశిస్తూ ఉంటుందో, ఆమానవులు పాలసముద్రాలు; వారి శరీరంలో శ్రీమహావిష్ణువు నిత్యసన్నిహితుడై ఉంటాడు.

రామా! మానవులు జన్మమెత్తి అనుభవించ తగినవాటినన్నిటినీ అనుభవించారు. చూడదగినవాటిని చూచారు— ఇంకాముందు జన్మలలోకూడా ఆత్మవినాశం చేసికోటానికి భోగబుద్ధత యుక్తమేనా? ఎంతమాత్రం పనికిరాదు సుమా. ఎన్నాళ్ళు అనుభవించ దలచినా యీ అనుభవించిన వాటినేగా? ఎన్నాళ్ళు చూడ దలచినా! వెనుక చూచిన వాటినేగా ఇందులో క్రొత్త ఏమున్నది? కనుక ఇంకా పోయిన పాటుగూడా భోగేచ్ఛలలో ప్రొద్దు పుచ్చుకోవడము మంచిది కాదు. కాబట్టి తమతమ అధికారానికి అనుకూలంగా వర్తించాలి. శాస్త్రాన్ని అనుసరించాలి. సంప్రదాయాన్ని అనుసరించాలి. ఆయా భూమికలలో నిలకడ చెందాలి. ముక్తిని పొందాలి మిథ్యాభూతమయిన భోగజాలాన్ని కాలదన్నాలి. దిగంతవ్యాప్తమయిన కీర్తిని సంపాదించాలి. పెద్దలలో సాధువనిపించుకోవాలి. ఎప్పటికయినా ఈరెండే (కీర్తిప్రతిష్ఠలు) రక్షించాలికాని తుచ్ఛభోగాలు ఎన్నటికీ రక్షించలేవు— చంద్రికాధవళితామయిన (తెల్లని) ఏమానవులకీర్తిని సిద్ధాంగనలు గానం చేస్తూ ఉంటారో వాళ్లే జీవించినవాళ్ళు— మిగిలినవాళ్ళు చచ్చినవాళ్లే బ్రతికి ఉన్నా— గట్టి పురుషప్రయత్నాన్ని అవలంబించి శాస్త్రప్రకారంగా సరియయిన ఉద్యమంలో ఉంటే ఏదిసిద్ధించదు? ఎవడు ఫలసిద్ధిని పొందడు చిరకాలం పరిపక్వమయితేకాని ఆసిద్ధికూడా పరిపుష్టమయిన ఫలాన్ని ఇయ్యదు. కనుక రామా! శోకభయాలు లేకుండా, ఆయాసగర్వాలు లేకుండా, తొందరపడకుండా, యథాశాస్త్రంగా వ్యవహరించినవాళ్ళు చెడిపోరు— మీలాంటివారల జీవుడు, ఇంద్రియాలనే పాశములచే బద్ధుడై,

యమధర్మరాజును చేరి ట్టు సంసారగములనే పాడుబావులలో పడకుండు గాక. ఇకముందు ఇంతకంటె అధమస్థితికి పోకుండుగాక- సర్వాపన్ని వారకమయిన అధ్యాత్మశాస్త్రాన్ని విచారించండి- సంసారమనే బురద గుంటలో జీవితాశను విడవండి. భోగవాసనలను చంపుకొండి. ఆర్యు లారా ? అర్థలేశంతో (ధనలేశంతో) మీకేమి ఫలము ? సర్వమూ విడచి మోక్షశాస్త్రాని విచారించండి- విషయాకారాంత కరణ, వృత్తి, ప్రతిఫలిత, చిదాభాసలకు అంతః కరణా, వచ్ఛిన్నచైతన్యము బింబము. అంతః కరణోపహిత చిదాభాసునకు శుద్ధబ్రహ్మ చైతన్యమే బింబము- ఇచట ప్రతిబింబమూ, దాని ఉపాధీ యీ రెండూ అసత్యా ములు. బింబము మాత్రమే సత్యము. ఇట్లు అంతఃకరణమనే ఉపాధి అసత్యమయితే దానితో కూడిన బింబచైతన్యానికీ దానితో సమనియత మయిన (అనగా) అంతఃకరణవచ్ఛిన బింబచైతన్యము ఉన్నచోట నల్లా ఉండే చిదాభాసునకూ బింబభూతమయిన బ్రహ్మచైతన్యానికీ భేదం మిథ్యయే కాని వాస్తవంకాదు- కనుక ఇంక అఖండమూ, సత్యమూ, ప్రత్యగభిన్నమూ, అయిన బ్రహ్మచైతన్యమే మిగులు తుందని విచారించుకొండి. ఈవిషయంలో సాంఖ్య, పాతంజల, గౌతమ, కణాద, బుద్ధ, అహన్ తాదుల ప్రేరణతో మీకుపనిలేదు. ఈబింబ ప్రతి బింబ వాదాన్ని వాళ్ళు అంగీకరించరు. వాళ్ళ సిద్ధాంతాలు వేరువేరుగా నడపుకున్నారు వాళ్ళతో మీకు పనిలేదు. ఒకరుచెప్పినట్లు పోవువాళ్ళు పశువులు- జీవన, ధన, పశు, పుత్రాది సాంసారిక విచారణలను విడిచి పెట్టండి. ఇతరదర్శనకారుల విచారణలను తుడిచిపెట్టండి- ఇకనయినా మేలుకొండి. నీటిమడుగులలో ముసలితాబేలువలె నిద్రించమాకండి. జరా, మరణ, శాంతి, కొరకులెండి. అర్థసంపత్తి అనర్థాన్ని యిస్తుంది. భోగపుంజము భవరోగాన్ని యిస్తుంది. సంపదలన్నీ ఆపదలను ఇస్తాయి. వీటన్నిటియందూ ఆదరము లేకపోవుటయే జయము, లోకతంత్రానికి విరోధం లేకుండా, శాస్త్రాచారాలను అనుసరిస్తూ చేసే కర్మ సత్ఫలాన్ని ఇస్తుంది సుమా ? అన్నారు వసిష్ఠులు.

21)

33. అహంకార విచారము :— మిగులయిన సాధనాలను అనుష్ఠించే వాళ్లకు ఫలం తప్పక కలుగుతుంది— శాస్త్రము చెప్పినట్లు ఉపాయములను ఆచరించు వారు వ్యర్థపోరు. చేసిన కృషి నిరర్థకము కాదు. సేవించిన ప్రభువు సేవను గుర్తించక పోడు. శాస్త్రీయమగు మోక్ష సాధనమున్నూ మంచి ప్రయత్నమున్నూ తగినఫలాన్ని ఇస్తూనే ఉన్నవి. కనుక రామా! మోక్షఫలమును గోరిన నీవుకూడా శుభోద్యోగమును ఎప్పుడూ విడవకుము— శాస్త్రీయమగు సత్ప్రయత్నానికి సాధ్యంకాని ఫలంలేదు— ఇందుకు దృష్టాంతంగా నందీశ్వరోపాఖ్యానం చెబుతాను విను— పూర్వం శిలాదుడను పేరుగల ఒకఋషి సర్వజ్ఞుడయిన కుమారుడు కావలెనని కోరి రుద్రుని గూర్చి తపస్సు చేశాడు చాలకాలం. అనుగ్రహించాడు అతని తపస్సునకు రుద్రుడు— వరమును ఇయ్యదలచాడు. కోరుకోమన్నాడు— సర్వజ్ఞుడయిన పుత్రుడు కావలెనని కోరాడు ఋషి— నాకంటె ఇతరుడు సర్వజ్ఞుడు లేడు కనుక నేనే నాఅంశతో నీకు కుమారుడనై పుటతాను, కాని నాయంశవల్ల పుట్టిన నీకొడుకు పదియారు సంవత్సరాలకు మించి బ్రతుకడని చెప్పాడు రుద్రుడు. విన్నాడు శిలాదుడు, రుద్రుని మాట తప్పించటానికి సాధ్యం కాదని నిర్ణయించుకున్నాడు— అతనినే (రుద్రునే) శరణు జొచ్చాడు— అలాగే కానిమ్మని అన్నాడు— తర్వాత కొంతకాలానికి ఆఋషికి నందిఅనే పేరుగలకొడుకు పుట్టాడు— సర్వజ్ఞుడు అతడు— కనుకనే చిన్నతనంలోనే అతడు తండ్రి నుంచి తనకు ముందుకలుగబొయ్యే మృత్యుపాశబంధనమును విని తపస్సుచేసి ఆరుద్రునే ఆరాధించాడు— కొంతకాలానికి పదియారవ సంవత్సరం వచ్చింది. వెంటనే ఒకనదీతీరాన ఆపిల్లవాడు లింగార్చన చేసేకాలంలోవచ్చి మృత్యువు పాశములతో బంధించాడు. మృత్యు లోకానికి గొనిపోవ సిద్ధంగా ఉన్నాడు— వెంటనే అచ్చట శివుడు ఆవిర్భవించి మృత్యువును ఎడమకాలితో తన్ని వానిపాశాలను తెంచి వేసి ఆపిల్లవాణ్ణి తన అనుచరుణ్ణిగా చేసికొన్నాడు— ఇది లింగపురా

ణంలో ఉన్నకథ. కనుక భగవంతుని గురించిచేసిన ప్రయత్నం తప్పక ఫలిస్తుంది- బలిచక్రవర్తి మున్నగు రాక్షసులు భగవదారాధనవల్లనే శక్తిసంపన్నులై కొమ్ములుతిరిగిన దేవతలను కూడా మర్దించారు. మరుత్తు అనే మహారాజు యొక్క యజ్ఞంలో సంవర్తుడనే మహర్షి భగవంతుని అనుగ్రహంవల్లనే బ్రహ్మదేవునివలె మరొక సురాసుర ప్రపంచాన్ని తయారుచేశాడు- విశ్వామిత్రుడు కూడా మాటిమాటికీ తపస్సుచేసి తపశ్శక్తివల్లనే అసాధ్యమయిన విప్రత్వాన్ని (బ్రాహ్మణత్వమును) సంపాదించాడు. ఉపమన్యువు అను బాలుడు పిండిపాలుకూడా దొరకని దురదృష్టవంతుడయినా తపస్సుచేసి శివప్రసాదంవల్లనే పాల సముద్రానికి అధిపతి అయినాడు. ముల్లోకవీరులయిన విష్ణు బ్రహ్మ మున్నగువారిని కూడా మ్రింగే యముణ్ణి శ్వేతుడనే మహర్షి దృఢమయిన భగవద్భక్త్యతిశయంచేత జయించాడు. సావిత్రియను రాచ కన్యకకూడా భర్తతో సహమరణమును చేసేదృఢసంకల్పముచే స్తుతించి యముణ్ణి వశపరచుకొని సత్యవంతుడను తనభర్తను పరలోకం నుంచి తెచ్చుకొన్నది- ఇలా శాస్త్రీయములయిన ప్రయత్నములెన్నో ఉన్నవి. ఎందరో వీనిని ఆచరించి ఫలంపొందారు- అన్ని ప్రయత్నములలోనూ నీచఫలమును గురించిచేసే ప్రయత్నంకంటె ఉత్తమమయిన మోక్షఫలాన్ని గురించి చేసేప్రయత్నం చాలాగొప్పది. కనుక మనస్సులో ఫలతారతమ్యాన్ని విచారించుకోవాలి. సర్వాతిశయమయిన సాధనాన్ని అవలంబించాలి. ఆత్మజ్ఞానంకంటె గొప్పసాధనం మరొకటి లేదు. జన్మమరణదిపరంపరలను పారద్రోలే శక్తిదీనికి మాత్రమే ఉంది. కనుక మానవుడు ఆత్మజ్ఞానం కొరకే ప్రయత్నించాలి. కాని మొట్టమొదట భోగ్యవస్తువులందు అనురాగం చావటానికి వాటియందున్న దోషాలను కనిపెట్టాలి. వైరాగ్యాభ్యాసాది దుఃఖం లేకుండా భూమానందం పొందసాధ్యంకాదు. కాబట్టి ముందు ఈదుఃఖాన్ని సహించాలి కనుక శాంతి (శమమనేగుణము) అవసరము. ఇది లేనిదే బ్రహ్మప్రాప్తి (బ్రహ్మత్వము) సిద్ధించదు. సచ్చిత్సుఖైకరూపుడగు

బ్రహ్మయందు శమమనే గుణంలేదు- ఇయ్యది అంతఃకరణధర్మము. సాత్వికచిత్తవృత్తి విశేషము. కనుక దృశ్యకోటిలో చేరింది. కాబట్టి ద్రష్టయొక్క ధర్మం కానేరదు. అతని స్వరూపమున్ను కాదు. నిజంలో శమరహితుడయిన చిదాత్మయే పరబ్రహ్మ అయినను శమముకూడా సనిదాన సంసారానర్థనివృత్తిరూపమగు పరమపురుషార్థమగును. (అనగా సంసారమనే అనర్థాన్ని మొదలంట నాశనంచేయటానికి కారణం అవును.) ఈ రెంటినూ (శమాశమములు రెండునూ) సమానములే కాని భూమానందమనే బ్రహ్మసుఖమును ఇచ్చుటకు మొట్టమొదటి ఉపాయము శమమని గ్రహించు- ఇది జీవన్ముక్తిదశను ఇచ్చి సుఖమును అభివ్యక్తము చేస్తుంది. అభివ్యక్తమగు సుఖమే పురుషార్థము. అనభివ్యక్తమగు సుఖము పురుషార్థముకాదు కనుక అభిమానాన్ని విడవాలి శాశ్వతసుఖమునిచ్చేది శమమని గ్రహించాలి అది అలవరచుకోటానికి ప్రజ్ఞావిశేషముచే సజ్జనసాంగత్యంచేయాలి. సజ్జనసాంగత్యం లేనిదే తపస్సులుకాని, తీర్థయాత్రలుకాని శాస్త్రములుకాని సంసారసాగరాన్ని తరింపచేయలేవు. ఆత్మజ్ఞానాన్ని పుట్టించలేవు. ఎవనికి లోభమోహరోషములు అనుదినమూ క్రమంగా తగ్గుతూ ఉంటాయో ఎవడు తన విహితకర్మలందు యథాశాస్త్రంగా నడుచుకుంటాడో అట్టివాడే సజ్జనుడు ఇలాంటి సజ్జనులతో ఎల్లప్పుడూ సహవాసంచేస్తూ ఉండగా ఒకానొకప్పుడు ఆత్మవేత్తల సాంగత్యంకూడా తప్పక లభిస్తుంది- వారి సహవాసంచేత ఆత్మజ్ఞానం లభిస్తుంది దృశ్యప్రపంచం లేదనే భావం కలుగుతుంది- పురుషార్థం సిద్ధిస్తుంది. జీవుడు పరబ్రహ్మలోలీనమయిపోతాడు- దీనికంతకూ దృశ్యాత్యంతాభావజ్ఞానమే (ప్రపంచం లేదనే జ్ఞానమే కారణం) దృశ్యమగు ప్రపంచం లేదనే భావం విద్యదనుభవసిద్ధమై ఉంది. ఈవిషయం నీకు ఉత్పత్తి ప్రకరణలో అనేకయుక్తులతో నిరూపించాను. ఇప్పుడు కూడా నిరూపింప బోతున్నాను చూడు- చిదాకాశమనేది పరమార్థతత్త్వము అతత్త్వముమాయ- మాయకారణంగా కలది ఆకాశాదిప్రపంచం- ఇదిఎలా ఉంటుందో చెప్పుడి. . సత్పదార్థంవల్ల

పుట్టినదందామా ? అసత్పదార్థమువల్ల పుట్టినదందామా ? మాయవల్ల పుట్టినదందామా ? ప్రపంచాన్ని సతసత్పదార్థములు రెండూ నిర్వికార ములు కనుక వీటివల్ల ప్రపంచం పుట్టడానికి వీలులేదు. ఇంక మాయ వల్ల పుట్టినదంటే మిథ్య అవుతుంది ప్రపంచం. కనుక పుట్టించి మిథ్య చేయడం కంటె పరిశేషన్యాయంచేత పుట్టలేదంటేనే బాగుంటుంది. అచ్ఛిద్ర స్వభావుడయిన కూటస్థనిత్యచిదాత్మయందు ఛిద్రస్వభావము గల ఆకాశాన్ని మయబ్రహ్మ వెయ్యిడక్క ఉలులచేత ప్రమ్ముకొని వచ్చినా తయారుచెయ్యలేడు- అయితే ప్రపంచం పుట్టకపోతే అందరూ లోకంలో "ప్రపంచం ప్రపంచం" అని ఘోషిస్తూ ఉంటారే కారణమేమిటి? అని నీకు సందేహం కలుగుతుంది. కాని ఇది అంతా చైతన్యముయొక్క చమత్కారం తప్ప మరేమీ లేదు. మాయాప్రతిబింబితమయిన చైత న్యము ఈచమత్కారాన్ని కలిగిస్తోంది- అయితే ప్రపంచం లేదని నిషే ధించడానికి బయలుదేరిన మీరు సంకల్పచైతన్యమనీ నిర్వికల్ప చైతన్య మనీ చైతన్యానికి భేదం తెచ్చిపెట్టారుకదా? అని అనవచ్చునీవు- కాని యీభేదంసూర్యునకూ, అతని కిరణమండలానికి ఎలాంటిభేదమో అలాం టిదేకాని నిజమయిన భేదంకాదు- అంశుమండలమునకూ అంశుమాంశు నకూ నిజమయిన భేదం లేదు. వికల్పాలన్నీ మిథ్యఅయితే ముల్లోకాను భవమంతా నిర్వికల్పక బ్రహ్మస్వరూపమే- చిదాభాసుని ఉన్మేషమే ప్రపంచావిర్భావము అతని నిమేషమే ప్రపంచాస్తమయము- అపరిజ్ఞాత మయిన అహంకారము చిదాకాశంలో అవిద్యామాలిన్యాన్ని సంపా దిస్తుంది. పరిజ్ఞాతమయిన అహంకారము బ్రహ్మస్వరూపాన్ని చెందు తుంది. (బ్రహ్మస్వరూపమవుతుంది.) అహంపదార్థము యొక్క నిజ రూపాన్ని గుర్తిస్తే అహంభావమే ఉండదు నీరు నీరులో కలిసినట్లు చిదాకాశంలో చేరిపోతుంది ఆఅహంపదార్థము అహంకారాది దృశ్య ప్రపంచం నిజస్థితిలో లేదు. కనుక తత్త్వవిచారణ చేసినచో చిదాకాశమే మిగిలిపోవును. నిర్మలాంతఃకరణులకు అపిశాచమునందు పిశాచమను బుద్ధిపుట్టదు. పుట్టినను నిలిచియుండదు. అజ్ఞానావిష్ట చిత్తులకు "ఇది

పిశాచము" కాదని యెన్ని పర్యాయములు చెప్పినను పిశాచమేమో నను సంశయమే కలుగుచుండును కాని పిశాచముకాదను నిర్ణయము కలుగదు. చైతన్యమను చంద్రికను (వెన్నెలను) అహంకారమనే మేఘముచే కప్పియున్నంతవరకు పరమార్థమనే కుముద్యతి (కలువలకొలను) వికసించదు (వికసించిన కలువలతో శోభించదు) అనగా వెన్నెలసోకిన గాని కలువలు వికసించవు. కలువలు వికసించియున్న కాని కొలను ప్రకాశించదు- అహం "నేను" అను అభిమానము పోయిందా నరకముమీద ద్వేషముండదు- స్వర్గముమీద అనురాగముండదు. మోక్షముమీద ఆశయుండదు. అహంకారమనే మేఘుడు చిత్తమును ఆక్రమించి యున్నంతవరకూ, వాడిచిత్తంలో జాడ్యమే కాని వివేకము కలుగదు. లేనిపోని యీ అహంకారం మిథ్యాకల్పితం- దీనివల్ల అందరూ దుఃఖపడినవారే కాని, సుఖపడినవారు లేరు. దేహమువందు నేననుభ్రాంతి సర్వానర్థములకు మూలము. అహంకారమనే పిచ్చిమొక్కను ఆత్మ అనే క్షేత్రమునుండి తత్త్వవిచార సహితమయిన మనస్సు అనేనాగలిచే దున్ని వ్రేళ్లతో సహా పీకిపారవేసినచో. ఆ క్షేత్రంలో జ్ఞానమనే పైరుచక్కగా దుబ్బుకట్టి బాగాఫలిస్తుంది, మోక్షమనే చక్కని ఫలమును ఇస్తుంది. జన్మమరణములనే వృక్షములకు అహంకారమనేవి మొలకలు- ఇదంతా మమతలు వానికి కొమ్మలు తుదకు సులువుగా కాకివాలితే పడిపోయి నట్లు జ్ఞానమాత్రంచేత తెగిపోతాయి ఈకొమ్మలు. నిజస్థితిలో ఆత్మ అహంభావరహితుడు. అట్టివాణ్ణి అహంభావన అనేది ఆవరించి సంసారచక్రంలో త్రిప్పుతోంది అహంకారమనే దయ్యంపట్టిన నరాధముడికి దాన్ని వదలుకోటానికి శాస్త్రాలూ మంత్రాలూ సమర్థములు కానేరవు అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ! అహంకారం నశించె ఉపాయం శెలవివ్వండి. అప్పుడు కాని నాకు సంసారభయం శాంతించదు. అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామచంద్రా ! ఎల్లప్పుడూ ఆత్మానుసంధానం చేయు వార్లకు అహంకారం పెరగదు. క్రమంగా తగ్గిపోతుంది. ప్రపంచం మిథ్య ఇంద్రజాలసంపద వంటిది. ఇందులో నాకురాగ ద్వేషాలెందుకు ? అని నిరంతరానుసంధానం చేయువార్లకు అహంకారం పెరుగదు. అంతఃకరణమందు అహంభావము లేనివాడికీ, దృశ్యబుద్ధిలేనివాడికీ, ప్రశాంత మయిన చిత్తవృత్తి కలవాడికీ అహంకారం పెరుగదు- అంతఃకరణ మందు నేననీ, బయట ప్రపంచమనీ హేయోపాదేయ బుద్ధిలేని సర్వ సముడికి కూడా అహంకారం పెరుగదు ద్రిష్ట దర్శనము దృశ్యము అను త్రిపుటి నశించి సర్వసమత్వము కలిగినవానికి కూడా అహంకారము పెరుగదు.

శ్రీరా॥ అయితే స్వామీ ! అహంకారానికి ఆకారమేమిటి ? ఇది ఎలావిడిచి పోతుంది ? సాధారణంగా అహంకారం అశరీరాహం కారమనీ సశరీరాహంకారమనీ అంటారు స్థూలదేహంమీద అహం భావం సశరీరాహంకారమట స్థూలదేహవ్యతిరిక్తమయిన బుద్ధిమాత్రము నందలి అహంభావం అశరీరాహంకారమట- ఈ రెండూపొయ్యే ఉపాయం ఎలా ? ఒకవేళ ఇవిపొయ్యే యెడల ఆపైనఉండే స్థితియేమిటి ?

వసి॥ రామచంద్రా! అహంకారం మూడు విధములు. ఇందులో రెండు విధముల అహంకారములు శ్రేష్ఠములు. మూడవ యహం కారము పనికిరానిది- విను చెబుతా వీటిపరిస్థితి.

ఈప్రపంచమంతా నేనే "నేనేపరమాత్మను" "నేనుకాని వస్తువు ఈప్రపంచంలో ఏదీలేదు" అనేది ఉత్తమాహంకారము ఇది మోక్ష మిస్తుందికాని, సంసారబంధాన్ని ఇయ్యదు ఇది జీవన్ముక్తునకు ఉంటుంది. "నేను అన్నిటికంటె భిన్నుడను" తోక వెంట్రుకయొక్క చివరిభాగంలో నూరవవంతువాడను (అనగా నిరవయవుడను) అనేజ్ఞానం రెండవఅహం కారం. ఇదికూడా ఆరవ భూమికలోనున్న జీవన్ముక్తులయందేఉంటుంది. ఇదికూడా మోక్షముకొరకేకాని బంధముకొరకు గాదు- ఏడవ

భూమిక యందున్న వారలకు అహంకారమనునది కల్పనామాత్రంకాని, వాస్తవం కాదు- వారు జీవించి ఉండటం ఇతరవిధంగా కుదరదు కనుక అహంకారాన్ని కల్పించి పేరుపెట్టారు- ఇంక పాణిపాదాది అవయవ ములతో గూడిన స్థూలదేహంమీద నేనను మిథ్యాభిమానము మూడవఅహంకారము ఇదిలౌకికము- తుచ్ఛము. కేవలబంధప్రాపకం కాని, మోక్షానికి ఏమాత్రం ఉపకరించదు- ఇది ఈఅహంకారము మానవులకు పరమశత్రువు. ఇదికలవాడు వృద్ధిలోకిరాడు- కనుక ఇది సర్వథా త్యాజ్యము- ఇది ప్రబలశత్రువు- లేనిపోని మనశ్చింతలను ఎన్ని టినో తెచ్చిపెడుతుంది ఇది. ఈఅహంకారానికి లొంగినవాడు సంకటా లలో మునిగిపోవలసిందేకాని ఏమాత్రం పైకి తేలడు. మొదట చెప్పిన శిష్టాహంకారములు రెండును దృఢపడిన మానవుడు తప్పక ముక్తిని పొందుతాడు- చివరి దేహాత్మభావాహంకారమువలె మొదటి రెండు అహంకారములను నిరూఢపరచుకొనియే తుచ్ఛమయిన మూడవ అహం కారాన్ని పోగొట్టుకోవాలి. ఈవిధానము బ్రహ్మనిష్ఠులందరకు సంమ తము. మూడవదయిన ఈదురహంకారము చేతనేకదా దామవ్యాలకటు లను రాక్షసులు చెప్పుకుంటే దుఃఖంకలిగే దుర్దశను పొందారు. అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ అయితే మహర్షి ! మూడవ అహంకారాన్ని చంపు కున్నవాడి స్వరూపం ఎలాఉంటుంది ? వాడు పొందే ఫలమేమి ! సెల వివ్వండి అని అడిగాడు రాముడు.

వసి॥ రామచంద్రా ! దుఃఖప్రదమయిన దేహాత్మభావమనే (దేహమేనేనని యనుకొనుట రూపమయిన) మూడవ అహంకారాన్ని తప్పక వదల్చుకోవలసిందే. ఎంతగా వదల్చుకుంటూ ఉంటాడో అంతంతగా పరమపదమునకు దాపు చేరుతాడు- శ్రవణాదులయందా సక్తుడై గురుశుశ్రూషాతత్పరుడై సాప్తభూమికలను అవలంబించి, శుద్ధాహంభావాన్ని అలవరచుకొన్న కొద్దీ స్వరూపసుఖము అభివ్యక్త

మవుతుంది— పరమపదమును పొందుతారు. అహంకారం— కనుక ఎంత ప్రయత్నించి అయినా లౌకికమయిన ఈ దుష్టాహంకారాన్ని రూపుమాపుకోవాలి— "శతకృత్వోఽపి సత్యం వక్తవ్యం" అంటున్నారు. అయినా పథ్యమయిన విషయం చెప్పాలి అనే న్యాయం అవలంబించి నేను ఇదే విషయం మాటిమాటికి చెప్తున్నాను. నా దేహమును గూర్చి అహంకారము వంటబట్టిన ఒక మహాపాపిష్ఠివ్యాధి దానిని పోగొట్టుకోవటం వలన శ్రేయస్సు, అదేమి? తత్త్వవిచారంవల్ల ఈ దురహంకారాన్ని వదల్చుకొని లోకంలో వ్యవహరించే వాడు అధఃపతనాన్ని చెందడు— రామా! ఈ దురహంకారము తొలగించినవానికి ప్రాపంచిక భోగములు రోగములు సుమా! ఇవి యేమాత్రం రుచింపవు సుమా వానికి— కడుపు నిండిన వాడికి విషసంపృక్తములయిన పదార్థములు రుచించనట్లు— ప్రాపంచిక భోగములు రుచించని వానికి శ్రేయస్సు ఎదురుగా నిలబడి ఉంటుంది. మానసికమయిన చీకటి అనగా అజ్ఞానాంధకారము తొలిగితే శ్రేయః ప్రాప్తికి ఇంక అడ్డేమి? రామా! వైరాగ్యం చేతనూ, శ్రవణమనననాది ప్రయత్నం చేతనూ, దేహాత్మభావనాహంకారాన్ని పోగొట్టుకున్నపుడే భవసాగరము దాటుటకు సాధ్యపడుతుంది. మొట్టమొదట "అంతా నేనే, అంతయు నాదే" అనిపించి, దాని నే దేహం నేనుకాగా— దేహసంబంధమయినవి నావి కావు అని తెలిసి, ఆ మీదట శుద్ధాత్మజ్ఞానమును మనస్సులో నిరూపం చేసికొని క్రమంగా ఏకత్వభావనను అభ్యసించి, సర్వవ్యాపకుడై విదేహకైవల్యాన్ని పొందుతాడు మానవుడు.

గమనిక :— గురూ! మహాభారతంలో మరుత్తు అనే మహారాజు గారి యజ్ఞంలో దేవేంద్రుడు విఘ్నం చేయదలచాడని సంవర్తుడనే మహర్షి తనసంకల్పమాత్రం చేత ఇంద్రుణ్ణి అతనిసైన్యాన్ని స్వాధీన పరచుకొని యజ్ఞంలో ఒక పరిచారకుణ్ణిగా చేసినట్లున్నదే ఇక్కడ "బ్రహ్మణో వాపరః సర్గః భావితః ససురాసురః" సురాసుర ప్రపంచాన్ని సృష్టించాడని చెప్పడం విరుద్ధం కదా! ఇది ఎలా పొసగుతుంది.

23)

వారు—ప్రభువుగారి పనినెరవేర్చాలనే భావంతో మాత్రమే యుద్ధం చేసే వాళ్లు అంతేకాని వీళ్లకేమాత్రం ఫలాభిలాష లేదు- ఇలాంటి గుణములు గల భీమ, భాస, దృఢ, లను రాక్షసులచే దేవతాసేన హతమయింది. భుక్తమయింది. అపహృతమయింది. దగ్ధమయింది- భోక్త తాను భుజించిన ఆహారమువలె అయింది వీళ్ల పరిస్థితి. అంతట దేవతాసైన్యం ఈ ముగ్గురు రాక్షసులచే వెళ్లగొట్టబడినదై నిలువజాలక హిమవత్పర్వతము నుండి పుట్టిన గంగానదివలె అతివేగంగా పారిపోయింది. గాలికి ఎగిరి పోయిన మేఘపంక్తి పర్వతాన్ని శరణుజొచ్చినట్లు ఈ దేవతా సైన్యం క్షీరసముద్రమందు శయనించిన భగవంతుని శరణు పొందినది. బలాత్కారంగా సంభోగించుటకు పదిమంది విటులు ముట్టడించి ఉంటే మిక్కిలి భయపడుతూ ఉండే స్త్రీని హఠాత్తుగా ఆమెభర్త వచ్చి ఓదార్చినట్లు విష్ణుమూర్తి ఆ దేవతా సైన్యాన్ని ఓదార్చాడు. ఆ సేన పాలసముద్రము యొక్క గుహాంలో (శ్వేతద్వీపంలో) శంబరాసురుడు నశించేటంతవరకు దాగిఉంది- అంతట శ్రీమహావిష్ణువు శంబరాసురుని వధ కొరకు ప్రయత్నించాడు. శౌరి, శంబరులకు, దారుణమయిన యుద్ధం జరిగింది. ప్రళయకాలంలో కులపర్వతాలు ఢీకొన్నట్లు ఉంది. వీరిద్దరి పోట్లాట తుదకు ఆయుద్ధంలో శంబరాసురుడు సైన్యవాహనాలతో కూడా సమసిపోయాడు నారాయణునిచే హతుడయినందున విష్ణులోకం చేరాడు. భీముడూ భాసుడూ దృఢుడూ, ఈ ముగ్గురుకూడా ఆవిషమ సంగరంలో విష్ణుమూర్తిచే హతులై విదేహకైవల్యాన్ని పొందారు. దీపాలు గాలికి ఆరిపోయినట్లయింది వీరిపని. అయితే క్రోధంతో యుద్ధంచేస్తే వీళ్ళకు ముక్తి ఎలావచ్చిందని సందేహం కలుగుతుంది. కాని భగవంతుని క్రోధంకూడా వరంతో సమానం అలా ప్రమాణంఉంది- చూడుడు.

శ్లో॥ యేవై హతాశ్చక్రధరేణ దైత్యాః
త్రైలోక్య నాథేన జనార్దనేన

తే నేగతా విష్ణుపురం నరేంద్ర
క్రోధోపి దేవస్య వరేణ తుల్యః॥

అని- భగవంతుడగు విష్ణుమూర్తి చేతులో చచ్చినవారంతా విష్ణుపురం చేరుతారు. భగవంతుని క్రోధం వరంతో సమానము. అని- దీనియర్థము.

ఇందులో శంబరాసురుడు వాసనాసహితుడయినందున విష్ణు లోకానికి వెళ్ళాడు. భీమ, భాస, దృఢులనే, రాక్షసులు వాసనారహితు లయినందున ఇచ్చటనే విదేహాకైవల్యాన్ని పొందారు. వీళ్లకు వైకుంఠ లోకగమనంతో ప్రసక్తి లేక పోయింది. కాబట్టి రామచంద్రా ! వాసనాసహితమగు మనస్సు బద్ధమవుతుంది. (అనగా సంసారబంధంలో పడుతుంది.) వాసనా రహితమయిన మనస్సు ముక్తిని పొందుతుంది. కనుక నీవు కూడ వివేకముచే నీమనస్సును వాసనా రహితము చేసికో చిరవిచార జనితమయిన ఆత్మసాక్షాత్కారము వలన వాసనలు నశి స్తాయి. వాసనాలయమయితే చిత్తం శాంతిని పొందుతుంది- దృశ్యో మయిన ప్రపంచము అసత్యమనీ, స్వప్రకాశచిన్మాత్రము సత్యమనీ ఆలో చించుటయే సమ్యగవేక్షణము (తత్త్వవిచారము) ప్రపంచం అంతా ఆత్మే అయితే ఇంక ఎవడు దేనిని ఎలాభావన చేస్తాడు- త్రిపుటి అనేది ఎక్కడిది ? భావనా అనే సంస్కారం ఎక్కడిది ? వాసనా, చిత్తం, అనేపదాలు రెండూ సమానార్థకాలు. ఈ రెంటికీ అర్థభేదంలేదు. కల్పిత భేదాన్ని పుచ్చుకొని భిన్నశబ్దాలు అయినవి. సత్యవస్తువును సాక్షాత్కారం చేసుకుంటే ఈ రెండూ నశిస్తాయి- వాసనా సహిత మయిన చిత్తము ఐహికభోగ స్థితిని ఇస్తుంది. వాసనా రహితమయిన చిత్తం జీవన్ముక్తదశను ప్రసాదిస్తుంది- ఘట పటా ద్యాకారాన్ని పొందినటువంటి చిత్తాన్ని క్రమంగా శాంతపరచాలి. పిల్లవాడికి పట్టిన దయ్యాన్ని క్రమంగా వదల్చినట్లు రామా ! దామ, వ్యాల కటుల యొక్క చిత్తం దేహాత్మభావనతో తయారయింది ! భీమ, భాస

దృఢుల యొక్క చిత్తం బ్రహ్మభావనతో తయారయింది- కనుక రామా ! భీమ భాస దృఢుల యొక్క న్యాయమే (చందమే) స్థిరమయింది. దామ వ్యాల కటుల యొక్క చందము (న్యాయము) నీకు వద్దు. ఈవిషయం పూర్వం నాతండ్రి బ్రహ్మదేవుడు నాకు చెప్పాడు. అదే నేను నీకు చెప్పితిని. నీవు శిష్యుడవు బుద్ధిమంతుడవు గదా! అని కనుక నీకు దామ వ్యాల కటన్యాయము సర్వథావద్దు భీమ, భాస, దృఢ, న్యాయమే ఎల్లప్పుడు ఉండ గ క.

గమనిక :- గురూ ! దామ వ్యాల కటో పాఖ్యానమనేది 5, 6 సర్గలు జరిగిందే అందులో చాలసారులు వసిష్ఠులు శ్రీరాములకు దామవ్యాలకట న్యాయంవద్దనీ, భీమ, భాస, దృఢ, న్యాయం అవసరమనీ చెప్పారు. ఏమిటి దానిసారాంశం- అని అడిగాడు శిష్యుడు.

గురూ॥ అర్థమేమీ లేదు- అహంకారంతో ఏపని చేయరాదనీ నిరహంకారంతో మెలగుటయే ముఖ్యమనీ అహంకారంతో యుద్ధమాడినందువల్ల దామవ్యాలకటులు నశించారనీ, నిరహంకారులై యుద్ధమాడినా భీమ, భాసదృఢులు విదేహకైవల్యం పొందారనీ కనుక లోకంలో నిరహంకార పూర్వక ప్రవృత్తి ముక్తినీ ఇస్తుందని దీని సారాంశం అన్నారు గురుగ,లు.

## 38. చిత్తశమోపాయవర్ణనము.

రామా ! అవిద్యా విలాసాలతో విషయాభిముఖమయిన మనస్సును నిగ్రహించుకున్నవాళే శూరులు వారే, సజ్జనులు వారే. దేనినయినా జయించ గలిగేవాళ్లు సర్వోపద్రవకరమయిన యీ సంసారం నశించటానికి మనోనిగ్రహమే మంచిమందు. జ్ఞాన సర్వస్వం నూరిపోస్తాను విను. మనస్సుకు పట్టించుకో భోగేచ్ఛయే బంధం- భోగత్యాగమే మోక్షం. ఈ రెండు ముక్కలూ (మాటలూ) మరచిపోకు. నీకు ఇతర శాస్త్రాలతో ఏంప్రయోజనం ? లోకంలో నీకు ఏదిరుచిగా

(ఇష్టంగా) ఉంటుందో, అది అంతా (అల్లా) విషంగాచూడాలి- నిష్ఠగా భావించు ప్రాపంచిక విషయాలయందు దోష దృష్టే వైరాగ్యానికి ముఖ్యోపాయం- తత్త్వవిచారంలేనిదే భోగేచ్ఛలను వదలడం దుర్లభం మాటిమాటికి విచారణ చేస్తూ భోగేచ్ఛను వదిలి ప్రారబ్ధవశాత్ వాటిని (విషయాలను) సేవిస్తే అవిసుఖాన్నే కలిగిస్తాయి. మతిలో భోగవాసనలు ఉండకూడదు- భోగవాసనలతో కూడిన మనస్సు రాగ ద్వేషాది దోషాలనే కలిగిస్తుంది. ముళ్ళవిత్తనాలుచల్లిన నేలలో ముళ్ళ చెట్లే మొలుస్తాయి- వాసనాజాలంలేని మనస్సు, చాంచల్యంలేని మనస్సు రాగ ద్వేషాలులేని మనస్సు మెల్లగా ప్రశాంతిని పొందుతుంది. అటువంటి మనస్సు దుఃఖరహితమయిన శమదమాది గుణసంపదనే కలిగిస్తుంది. మంచివిత్తనములు చల్లిన నేలలో ఫలించెడి మంచిమొక్కలే మొలుస్తాయి. మనస్సులో దయాదాక్షిణ్య శమ, దమాది శుభవాసనలు అనుసంధానం కావాలి. మనస్సు నిర్మలం కావాలి. క్రమంగా మిథ్యా జ్ఞానమనే వర్ష కాలపు మేఘం ఎగిరి పోవాలి. శుక్లపక్షంలో చంద్రుడు వృద్ధిపొందినట్లు సౌజన్యం క్రమంగా వృద్ధిపొందాలి- నభోమండలంలో సూర్యకాంతి లాగ (వలె) వివేకసంపద ప్రసరించాలి. వెదురుబొంగులో ముత్యాలు పుట్టి వృద్ధిచెందినట్లు ఇంద్రియనిగ్రహం గల ధైర్యం వృద్ధి చెందాలి. చైత్రమాసమున చంద్రుడు, కృతకృత్యుడైనట్లు మనస్సు యొక్కపరిస్థితి సఫలంకావాలి. సత్యాగత్య మనే ఫలవృక్షం చల్లని నీడను ఇస్తూ ఫలించాలి. సమాధిఅనే దేవదారువృక్షం ఆనందమనే రసాన్ని స్రవించాలి. అప్పుడు మనస్సు ద్వంద్వరహితమవుతుంది. దేని మీదా కామన (కోరిక) ఉండదు. ఏవిధములయిన ఉపద్రవములుండవు, చాపల్యముండదు. శోక, మోహ, భయాదులుండవు. శాస్త్రార్థము నందు సందేహాలుండవు. దేనిమీదను ఆశ ఉండదు.

మిథ్యాకల్పనలన్నీ అంతరించును, (నశించును) అజ్ఞానం ఉండదు. లేపము ఉండదు. అనగా దేనితోను అంటియుండుట యుండదు.

మనశ్చింతలుండవు. దుఃఖాలుండవు. ఆసక్తి యుండదు. ఇలాగంటి మనస్సునకు "ఆత్మ అంటే ఎవరు? "ఆత్మ ఏయే సాధనాలచే లభిస్తాడు? కర్మల చేతనా ? లేక జ్ఞానము చేతనా ? జ్ఞానమనగా నేమి ?, జ్ఞానమునకు సాధనము లెవ్వి? అని వారు వారు వారి యిష్టానుసారం కల్పించుకున్న సందేహాలు లేవి యుండవు. వివిధ మనోరథములతోను, వివిధ కర్మలతోను నిండిన తృష్ణలుండవు సందేహములకు ఆశలకు పంజరమయిన స్థూలశరీరాన్ని నశింపచేస్తుంది ఇలాంటి మనస్సు. తుదకు తాను కూడా నశిస్తుంది. జీవన్ముక్తి సుఖాన్ని ప్రసాదిస్తుంది. ఇది మొట్టమొదట తనకు పుట్టినిమ్మనట్టి అరి, మిత్ర, సాధు, అసాధ్వాది, వికల్పాలను విడచి పెట్టుతుంది. ఈవికల్పాలను నిగ్రహించుకొనుటలో కూడా తనకు సామర్థ్యం కలదని గుర్తిస్తుంది. పిదప తనకల్పిత రూపాన్ని గడ్డిపోచనువలె విడిచి పెడుతుంది. దేహమునందు అహంభావ వాసన ఉన్నంత వరకూ మనస్సు దేహాకారాన్ని చెందుతుంది. అంతవరకూ దేహానుకూలములయిన విషయాలయందు అనురాగమూ, ప్రతికూలములయిన విషయాలయందు ద్వేషమూ తప్పదు. అంతవరకూ వికల్ప సహస్రములతో పెరుగుతూనే ఉంటుంది. మనస్సు దేహమునందు అహంభావవాసన క్షీణించిందా క్రమంగా మనస్సు క్షీణిస్తుంది. మనస్సు వృద్ధిపొందటం మనస్సునకు నాశమే. మనస్సు నశించటం దానికి అభ్యుదయమే. మనస్సు స్వతంత్రంగా అభ్యుదయాన్ని కోరదు. ఆత్మస్వరూపాన్ని పొందే అభ్యుదయాన్ని కోరుతుంది. అప్పుడు దానికి సంకల్ప వికల్పాత్మకమయిన మనోభావం అనర్థమే. ఇలాంటి మనోభావనాశము సర్వానర్థ ప్రహాణ రూపము కనుకనూ నిరతిశయాత్మానందస్వరూపం కనుకనూ, ఈదశలో ఇది దీనికి (మనస్సునకు) అభ్యుదయమే అయితే దేహమునందు అహంభావత్యాగమే చాలుకదా! ఇంక బ్రహ్మాత్మజ్ఞానమెందుకు! అనిఅంటారు కాని బ్రహ్మాత్మజ్ఞానం కలిగితే కాని అజ్ఞానం నశించదు- అజ్ఞానం నశిస్తే కాని, దేహాత్మభావం నశించినా మళ్లీ పుట్టకుండా ఉండదు- మళ్లీ ఈభావం పుట్టిందా సంసారమనే అనర్థం

తప్పదు- మనస్సే జగచ్చక్రం మనస్సే పర్వతమండలం మనస్సే ఆకాశం మనస్సే దేవుడు మనస్సే మిత్రుడు. మనస్సే శత్రువు-(చిన్మాత్రుడయిన ఆత్మతనస్వరూపాన్ని మరచి ప్రాపంచిక వికల్ప వాసనలతో వాటి వశగుడయే మనస్సు) ఆత్మ స్వరూపాను సంధానము లేకపోవుటవలన కారణమయిన ప్రాపంచిక వికల్ప వాసనలే మనస్సు. ఈ వాసనలే బంధ ప్రాపకములు మనస్సునందు ప్రవేశించిన విషయముల యొక్క వాసనలతో కూడిన చైతన్యమే జీవుడు. (వికల్పవాసనా కలుషమయిన బ్రహ్మమే జీవుడు.) చైతన్యము విషయాకారాన్ని చెంది, చిరాభ్యాసమువలన అతత్త్వాభిమానము దానియందు రూఢమయి, తన నిజరూపమును మరచి వికల్ప సహస్రములతో (అనేక ప్రాపంచిక వికల్పాలతో) మిక్కిలి వ్యామోహమును జెంది యెప్పుడు మిక్కిలి నిస్సారమగునో, అప్పుడు ఆది జీవోపకరణ మగుమనస్సు అని కల్పింపబడుతోంది. పరిశుద్ధాత్మ, జీవుడు కాదు, మాంస శోణితమయ మయిన శరీరమూ కాదు. శరీరాంగాలు జడములు. ఆత్మ ఆకాశమువలె నిర్లిప్తుడు శరీరాన్ని ఛేదిస్తే మాంస శోణితాకులకంటె మరొకవస్తువు లేదు- అరటిస్తంభాన్ని పగలతీస్తే పల్లవాకారంగా ఉండే (ఆకులవలె ఉండే) మట్టలు తప్ప మరొకటి యేమీలేదు అందులో- మనస్సే జీవుడు మనస్సే మానవాకారాన్ని జెందిన నరుడు. తన వికల్పాలతో తాను ఆలా కల్పించుకొన్నది. సాలెపురుగు తనపొట్టలోని దారములను బయటికి ప్రసరింపజేసి తానందు చిక్కుపడినట్లు; మనస్సు తనవికల్ప వాసనలను ప్రసరింపజేసి బయటికి అందులో చిక్కుపడి బద్ధమవుతుంది. వర్తమాన దేహంమీద భ్రాంతిని వదలి దేశకాలాంతరమందు మరల మరొక దేహభావాన్ని చెందుతుంది యీమనస్సు. (మనస్సులో ఏవిధమయిన వాసనలు (సంస్కారాలు) ఉండునో స్వప్నంలో రాత్రి అదే ఆకారాన్ని ధరిస్తుంది ఆమనస్సు.) మనస్సులో ఏవిధమయిన ఆకారం ఉంటే రాత్రిస్వప్నంలో ఆఆకారమే తయారవుతుంది దానికి లోకంలో పులుపు రసం గల చింతగింజను

నుత్తను అది. కనుక రామచంద్రా! ఆత్మస్వరూపానికి బంధమూ లేదు. మోక్షమూ లేదు- బంధము లేకుండుటయూ లేదు మోక్షము కలిగియుండుటయూ లేదు- ఇది అంతా మిథ్యా మాయ ఇంద్రజాలంతో గంధర్వనగరాకారం. మృగతృష్ణాజలము. ద్విచంద్ర భ్రాంతివంటిది ద్వైతమూ బ్రహ్మసత్తయే ఇదే పరమార్థము- నిస్సారమయిన ఈ లేనిపోని సంసారం ఇలా గోచరిస్తూ ఉంది- ప్రతివానికి నేను పరిచ్ఛిన్నుడనూ నేను నీచుడనూ అనే దుర్నిశ్చయం ఒకటి కలిగింది. నేను అపరిచ్ఛిన్నుడనూ, ఈశ్వరుడనూ అనే నిశ్చయంచేత అది నశిస్తుంది. సర్వవ్యాపకమూ, అవిచ్ఛిన్నమూ అయిన ఆత్మయందు- "సోఽహం" 'ఈ నేను' అను పరిచ్ఛిన్నాత్మభావమే బంధము. ఇట్టి బంధమోక్షాది ద్వంద్వరాహిత్యమే పరమార్థము- నిర్మలమై తనస్వరూపమును దర్శింపజేసికొని దేనియందు ఆసక్తి లేక పోవుటే అమనస్త్వము. ఇలాంటి అమనస్త్వమును పొందిన మనస్సే ఈ అధికారి శరీరంలో బ్రహ్మను సాక్షాత్కారం చేసికొంటుంది. సమాధ్యభ్యాసము వల్ల కలిగి సంన్యాసం స్కారములచే నిర్మలమయిన మనస్సు సర్వత్ర బ్రహ్మదృష్టిని పొందుతుంది. రామా! సర్వమూ ఆత్మస్వరూపమను భావన గలవానికి హేయోపాదేయములుండవు. బంధమోక్షములతో పనిలేదు- నిర్మలమయిన స్ఫటికము ఉపాధి సంపర్కముచేత అనేక విధముల ప్రతిభాసించినట్లు పరిశుద్ధమయిన ఉపాధి బుద్ధిచే వివిధ ప్రతిభాసలను పొందుటయే సంసారము- ఏకరూపములయిన పదార్థములను భిన్నభిన్నముగా చూచుచుండుటయే బంధప్రాప్తి మనస్సు బాహ్యాభ్యంతరములందు దృశ్య పదార్థముల యొక్క చూపును విడిచి ఆత్మైకాకారంగా ఉండుటయే మోక్షం. మనస్సునకు దృశ్యపదార్థదర్శనము (దృశ్యదృష్టి) స్వప్నము. అది అసత్యమయము. ఈ పరిస్థితి దీనికి (మనస్సుకు) సహజము. (దృశ్యదృష్టి ప్రచురంగా ఉండుట దీనికి సహజము) ఇది సహజంగా గుర్తించే పదార్థాలన్నీ, మొదట లేనివి తుదకు ఉండనివీ కాబట్టి అవి మధ్యలో కూడా ఉండనివే- ఇవి అసద్రూపములని దీనికి తెలియక పోవుటచేతనే

గినికి సుఖం హస్తగతం అయింది. ప్రపంచం అంతా ఆత్మయే అనే జ్ఞానం లేకపోతే దృశ్యశోభ దుఃఖాన్ని ఇస్తుంది. అజ్ఞానం ఉండే యెడల యీ దృశ్యప్రపంచం ప్రారబ్ధభోగాన్ని మోహాన్ని ఇస్తుంది. జ్ఞానాజ్ఞానాల స్వరూపానికి లోకంలోనూ శాస్త్రంలోనూ తేడాలేదు. నీరు వేరు తరంగం వేరు అని అనుకొనుటే అజ్ఞానం. నీరు తరంగము భావమే జ్ఞానం. భేదబుద్ధివల్ల జన్మమరణాది దుఃఖాలు తటస్థించును కనుక అవి హేయమన్నారు. ఏకత్వజ్ఞానము వల్ల నిరతిశయానందాత్మరూపం మిగిలి ఉంటుంది. కనుక అభేదజ్ఞానం ఉపాదేయం. రాఘవా? సంకల్ప కల్పితములయిన మనోబుద్ధ్యాది ద్వైతం నశిస్తే దుఃఖం అవసరం లేదు. లేనివిపోతే దుఃఖమెందుకు ! రాగద్వేషాలు కలవాళ్లకు ఇష్టవస్తువు పోయినందువల్ల కాని అనిష్టవస్తువు ప్రాప్తించినందువల్ల కాని దుఃఖం ఉంటుంది. ఉదాసీనదృష్టితో దేహాత్రియపంజరాన్ని చూచేవాడికి శోకముండదు ! వాత్సల్యము (స్నేహము) లేనితావున బంధువులకు సుఖదుఃఖ లేపముండదు. అలాగే భూతపంచక వికారమయిన దేహాత్రియాన్ని భూతపంచకరూపంగా తెలుసుకుంటే దుఃఖప్రసక్తి యుండదు. కనుక [illegible]పుడగు ఆత్మ తత్త్వమునందు మనస్సు ప్రశాంతమవును. మనస్సు అనే గాలితగ్గితే దేహమనే దుమ్ము లేవదు. ఇంక ప్రత్యగాత్మను మంచువంటి అవిద్య ఆవరించదు. రామచంద్రా ? వాసనా పుంజమనే వర్షకాలం శాంతిస్తే మనస్సనబడే ఆత్మస్వరూపస్థితి యందు విహారము సంభవిస్తే భయ, శోకములను పుట్టించే బాహ్యమనే (గ్రాహ్యమనే) బురద తగ్గిపోతే, తృష్ణ అనే నొరువు ఎండితే హృదయమనే అడవి శిథిలమయితే ఇంద్రియ కదంబమనే కడిమిచెట్లు క్షీణిస్తే మిథ్యాజ్ఞానమనే మేఘాలు నశిస్తే మోహమనే (అవిద్యయనే) మంచు నశిస్తుంది. మంత్రహతమయిన విషమువలె ఆశాసర్పం ఎక్కడికి పోతుందో తెలియదు. దేహమనే కొండలో భయములనే శెలవల్లి ప్రసరించవు సంకల్పాలనే నెమళ్లు నాట్యమాడవు మనస్సు మహానిర్మల మవుతుంది. జీవుడనే సూర్యుడు మహాస్వచ్ఛంగా ప్రకాశిస్తాడు. సూర్యోదయ చంద్రోదయ

## 3౯. చిత్ప్రకాశమును వర్ణించుట.

శ్రీరా॥ స్వామీ ? ఇలాంటి ప్రపంచము, ప్రపంచాతీతుడయిన చిదాత్మయందు ఎలా ఉన్నది ? చెప్పండి ?

వసి॥ రామచంద్రా ! నీటిలో ముందు పుట్టబోయే తరంగాలు నభివ్యక్తంగా (తెలియకుండగా) ఎలా ఉన్నవో, అలాగే చిద్వస్తువులో కూడా అనభివ్యక్తంగా చిద్వస్తువుతో అభిన్నంగా ఉన్నవి ప్రపంచసృష్టులు- ఆకాశం సర్వవ్యాపకమయినా అతిసూక్ష్మమగుటచే కనిపించుటలేదు. అలాగే చిద్వస్తువు కూడా సూక్ష్మమయినందున సర్వవ్యాపకమయినా కనిపించడం లేదు ? స్ఫటికాది మణులందు ప్రతిబింబమనేది, ఉన్నట్లుగానూ లేనట్లుగానూ, ఎలా ఉన్నదో, అలాగే ఈ ప్రపంచం కూడా ఆత్మయందు సత్యం కాకుండానూ అసత్యం కాకుండాను ఉంది- ఈచిదాత్మ ప్రపంచంలో పూర్తిగా అసంగుడు చూడు దృష్టాంతం- మేఘాలకు ఆకాశం ఆధారం అయినా ఆకాశం మేఘాలతో అంటలేదు- నిస్సంగంగానేఉంది మేఘసంబంధంతో, అలాగే చిదాత్మ ప్రపంచం సృష్టులకు ఆధారుడయినా వాటితో (ఆప్రపంచ సృష్టులతో) అంటకుండనే ఉన్నాడు. అన్యోన్యాధ్యాసవల్ల ఈప్రపంచ సృష్టులుకూడా చిదాత్మకు ఆధారాలు అగుచున్నాయి. అయిననూ ఆతని నిస్సంగత్వానికి భంగంలేదు. అలాంటిది ఆపరాచిత్తు- నీటిలో కలిసిన సూర్యకిరణములు నీటిలో కలిసి ఉన్నట్లు స్పష్టంగా కనిపించవు. ప్రతిబింబరూపంలో మాత్రం స్పష్టంగా కనిపిస్తాయి- అలాగే ఈచిదాత్మ యావత్ప్రపంచానికి ఆధారమయినా, యావత్ప్రపంచమునందు తాను ఉన్నా తాను ఆధారమయినట్లుకాని తాను ఉన్నట్లుకాని అంతటా (ఘటపటాదులందు) గోచరించదు. పుర్యష్టకములయందు (దేహములయందు) మాత్రం ఉన్నట్లునూ దేహములకు తాను ఆధారమయినట్లునూ గోచరిస్తాడు. చిదాత్మసంకల్పరహితుడు, సర్వసంబంధరహితుడు, నాశరహితుడు. ఇలాంటి వానికి ప్రతిబింబత్వమనేది వాస్తవంకాదు. విషయ

సంబంధంచేత ఆభాసగా ఏర్పడిన చైతన్యము ఆకాశముకంటె నూరురెట్లు స్వచ్ఛము నూరురెట్లు సూక్ష్మము దీనిద్వారా ఆకాశము నూరురెట్లు స్థూలము నూరురెట్లు అస్వచ్ఛము (మలినము) ఇత్యాది విద్వదనుభవ సిద్ధము కనుక సముద్రంలో ఫేన బుద్బుద తరంగాది వికారాలు సముద్రం కంటె భిన్నములు కావు. అలాగే ఈచిదాత్మలో నానాభావవికారాలు (ఘటపటాది వికారాలు) భ్రాంతిసిద్ధములు-చైతన్యభిన్నములు కాని, వాస్తవములు కావు చిద్భిన్నములూ కావు ఒకవేళ నీవు చైతన్యము ఘటపటాది విషయాలను తయారు చేస్తూఉన్నదని అనుకొనే యెడల, అప్పుడు చైతన్యము చైతన్యముచే తయారుచేస్తూ ఉన్నదని భావించు (అనుకో) చైతన్యము కంటె వేరువస్తువు నిజస్థితిలో లేనందున లేనిదానిని తయారు చేస్తూఉన్నదని అనుకొనుట అంతమంచిది కాదు. కనుక నేను చెప్పినట్లు చైతన్యం చైతన్యాన్నే తయారుచేస్తూ- ఉన్నదని అనుకొనే యెడల చైతన్యమునకు చైతన్యమునందు వ్యాపారము (క్రియ) సంభవించదు కనుక చైతన్యము చిత్స్వరూపమందే ఉన్నదనీ అది దేనినీ తయారు చేయుటలేదనీ (సంపాదించుటలేదనీ) వస్తుంది(సిద్ధిస్తుంది) ఇదే పరమార్థమగు దృష్టి (అనగా యథార్థంజ్ఞానము) ఎవడు అజ్ఞానియై తాను అజ్ఞానినని అభిమానము కలవాడగునో వానికే చిద్వ్యతిరిక్తంగా మరొకవస్తువు తయారవుతుంది. అలాంటివాడే ఆత్మకంటే వేరుగా ఇంకొకవస్తువును కల్పించుకుంటాడు ఉన్నట్లు- ఈచైతన్యము రెండురకాలుగా ఉంటూఉంది, అజ్ఞానులయందొకరకంగానూ, జ్ఞానులందు మరొకరకంగానూ, అజ్ఞాను లందున్న చైతన్యము మిథ్యాభూతమయిన (అసత్స్వభావమయిన) ఘోరసంసారపుంజమును కల్పిస్తుంది. జ్ఞానుల యందున్న చైతన్యము ప్రకాశరూపంగా ఉంటుంది. అంతా బ్రహ్మమే నను జ్ఞానమునే కలిగిస్తుంది. ఇదే చైతన్యం సర్వప్రపంచమునూ ప్రకాశింపచేస్తోంది సూర్యచంద్రాగ్నులకుకూడా ప్రకాశమును (వెలుగును) ఇస్తుంది. ప్రాపంచిక

భోగాలను కలిగిస్తుంది (అనగా జీవులయొక్క సుఖదుఃఖానుభవములకు నిమిత్త మవుతుంది.) జన్మమరణాలకుకూడా కారణమవుతుంది– అజ్ఞానుల దృష్టిలో "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" అను శ్రుతి యింకా కాధారము. కాగా! జ్ఞానులదృష్టిలో ఈచిదాత్మ నశించు వాడు కాడు. పుట్టువాడు కాడు చేయువాడు కాడు. ఉండువాడు కాడు పోయేవాడు కాడు– వచ్చువాడుకాడు. ఇక్కడి వాడుకాడు– ఎక్కడివో వాడుకాడు– అనిర్వచ్యుడు సదా చిత్స్వరూపము నందుండువాడు– ఇతడే ప్రపంచమనే పేరుతో మాయవల్ల విజృంభిస్తున్నాడు– అగ్ని కాంతి సమూహాలతో విజృంభిస్తోంది. ఉదకం ప్రవాహ రూపములతో విజృంభిస్తోంది. గాలి స్పంద (చలన) సమూహంతో విజృంభిస్తోంది– చిదాత్మ సృష్టివిలాసాలతో విజృంభిస్తున్నాడు. స్వతః సదా స్వప్రకాశుడయి నవాడు. అవిద్యచే (మాయచే) ప్రపంచసృష్టి విభవాలతో ప్రకాశించడంవల్ల ఇతనికి సృష్టికర్తృత్వము. ఆ తేజంతో మరొక విధంగా సృష్టికర్తృత్వము లేదు కాబట్టి ఇతనికి– ఇతడు స్వతస్సిద్ధంగా చిద్రూపుడు. ప్రకాశరూపుడైన ఇతడు స్వాపహారకంగా (స్వాపహారమువల్ల) సర్వ వ్యాపకుడు, అప్రకాశుడు, అంగుష్ఠాత్ర ఇతడు అవిద్యాపరిచ్ఛిన్నమవటచే వేటగాడై తన అపరిచ్ఛిన్న రూపాన్ని మరచి "అహమస్మి" అనే భావంతో జీవత్వాన్ని పొందాడు మొట్టమొదట జీవుడయ్యాడు క్రమంగా. ఈ పరిచ్ఛిన్న భేదదృష్టిని రూఢ మొందడానికి (ముదిరేసరికి) సంసారంలో పడి ఇది ఉన్నది కదా అని. ఇవి గ్రాహ్యములు ఇవి త్యాజ్యములు ఇది గ్రాహ్యము. ఇటి అనిత్యమైన అనేకభావాలను నిలయమైన దేహాత్మభావంతో మునిగి జన్మమరణ పరంపరలో అనేకవిధాల శరీరాలతో విహిత నిషిద్ధ కర్మలను చేస్తున్నాడు కాని నిజానికి ఇతడు చేయువాడు కాడు– ఈ చిదాత్మ ప్రతివస్తువులోను అంతర్యామి రూపంగా ఉండి ఆయా వస్తువులచే ఆయాపనులను చేయిస్తూ తాను ప్రకాశిస్తునే ఉన్నాడు– చూడు– నేల లోపల నున్న మొక్క పైకి రావడానికి ప్రయత్నిస్తుంది.

ఛిద్రాత్మక మయిన ఆకాశము దానికి బయటికి రావడానికి అవకాశం ఇస్తుంది- స్పందాత్మకమయిన గాలి దాన్ని ఆకర్షిస్తుంది- (దాన్ని పైకి లాగుతుంది.) జలము ఆమొలకను తడుపుతుంది. గట్టిగా ఉన్న పృథివి (నేల) ఆమొక్క పడిపోకుండా వ్రేళ్ళతో గట్టిపరుస్తుంది. (అనగా తనలో ఉన్న దార్ఢ్యమును (గట్టితనాన్ని) ఆమొక్కకు ప్రసాదిస్తుంది. అగ్నిభూతము ఆమొక్కకు రూపమునిచ్చి "ఇదిఫలానామొక్క" అని ప్రకటింప చేస్తుంది. ఇలా ప్రపంచంలో సమస్త భూతములూ తమ తమ కార్యములకు స్థిత్యాదిభూతములతో అనుగ్రాహకములుగానే ఉన్నాయి. ఇలాగే హేమంతాది కాలంకూడా ఒకప్పుడు యవాంకురాది సస్యములకు ప్రతిబంధకమయిన తృణాదులను మొలపిస్తుంది. మరొకప్పుడు యవాంకురాది సస్యములనే మొలపిస్తుంది. కనుక కాలంకూడా అనుగ్రాహకమే అవుతుంది కొన్ని కార్యాలకు పుష్పములు క్రమంగా రెక్కలతో కూడుకొని పరిమళాన్ని ధరిస్తున్నాయి. మట్టిలోనున్న రసోల్లాసము (తడియొక్క మహిమ) క్రమంగా చెట్టుఅవుతోంది. వ్రేళ్ళయందున్న రసోల్లాసము ఫలభావాన్ని చెందుతుంది. చిగురాకులయందున్న రసలేశములు క్రమంగా ముదురాకులగుచున్నాయి- ఇలా ఇంద్రధనస్సు వలె చిత్రవిచిత్రమయిన నూతనత్వాన్ని ప్రసాదిస్తోంది. చైతన్యము వృత్తానికి- ఇదే చైతన్యము ఋతుస్వరూపంతో కూడా కార్యములను (వస్తువులను) అనుగ్రహిస్తోంది. పూత పిందె చిగురు అనేవి అన్నీ వసంతఋతువు మీద ఆధారపడి ఉన్నాయి- ఎండ వేడిమి మున్నగునవి గ్రీష్మఋతువును ఆశ్రయించి ఉన్నాయి. ధాన్యాది ఫలరాసులన్నీ శరదృతువును అనుసరించి ఉన్నాయి. పది దిక్కులా నిండి నిభిడీకృతమయియున్న మంచుయొక్క విలాసమంతా హేమంత ఋతువు మీద ఆధారపడి ఉంది. శిశిర ఋతువులో చల్ల గాలులు నీటిని రాతినిగా తయారుచేస్తాయి. ఎన్నియుగాలు గడచినా కాలము తనమర్యాదను విడిచి పెట్టదు. నదులలో తరంగాలు పుంఖాను పుంఖములుగ బయలు దేరినట్లు చిదాత్మయందు సృష్టులు బయలుదేరుతూ

ఉంటాయి. కాలము యొక్క నియతి చాలా స్థిరమయినది. అతి చతుర మయినదికూడా ప్రళయ పర్యంతమూ ధరాదేవి (భూదేవి) సర్వజీవు లకు ఆధారంగానే ఉంటుంది. పదునాలుగు లోకము లందుండు పదు నాలుగు రకములు ప్రాణులూ వివిధాచారములతో వివిధవిహారము లతో నీటిలో బుడగవలె మాటిమాటికి సృష్టించూ చస్తూ ఉంటారు. భూతములకు ఈజన్మ మరణ ప్రవాహ పరంపర తత్త్వజ్ఞానం కలుగనిదే తొలగదు. (సోదా) తత్త్వజ్ఞానం కలిగినదా నీరు యింకిపోయిన మడు గులో బుడగలు అంతరించినట్లు జన్మమరణ పరంపరలు పూర్తిగా నశి స్తాయి. రామచంద్రా! బ్రహ్మాండంలోని ప్రాణిసమూహము ప్రాక్తన సంకల్ప వాసనా వశంచేత రాగద్వేషాలు ఉద్రిక్తములై స్వరూప విచారమనే మాట పూర్తిగా అసంగంటి, మూఢులై పిచ్చివారు వలె జన్మలతో ఇహలోకాసక్తమౌతోంది. మరణంతో పరలోకానికి పోతోంది. కొంతకాలం స్థావరాది జన్మలతో ఇక్కడనే తిరుగుతూ ఉంటుంది. భోగాభిలాషతో ధనధాన్యాలను ఆర్జిస్తుంది. ధర్మాధర్మాలను ఆచ రిస్తుంది. జన్మనాశాలతో సంసారంలో పరిభ్రమిస్తుంది.

## 38. 39. ఉపశమవర్ణనము.

ఇలా చిత్స్వభావుడయిన పరబ్రహ్మనుండి సృష్టిశ్రేణులు మాటి మాటికి రాకపోకలు కలవియై సుమా! పరస్పర సంభూతమగు నీ ప్రపంచము అధిష్ఠాన చైతన్యమునుండియే పుట్టుచున్నది- అధిష్ఠానియందే లయించుచున్నది- అగాధ జలోదర మందు నీటియొక్క స్పందాస్పంద ముల వలె ప్రపంచమందలి సదసద్విభాగములన్నీ చిద్రూపములే కాని వేరుకావు- నిరాకారమగు ఆకాశమునందు మృగతృష్ణలు (ఎండ మావుల) వలె చిత్తత్త్వమునందు సృష్టిసృష్టులు కనిపిస్తూఉన్నవి- మదో న్మత్తునకు తాను అన్యునిగా గోచరించినట్లు చిద్ఘనుడగు పరబ్రహ్మమే అచిత్తువలె (జడవస్తువువలె) ప్రకాశించుచున్నది- ప్రపంచము ఆకా రము కలదిగా నున్నందున స్వరూపము- దీనిని అసత్తునుటకు వీలుకని

పించగా. తత్త్వజ్ఞానముచే బాధింపబడుచున్నందున అసత్తనవలెనా గ్రాహ్యమనుటకు వీలులేదు. కాగా ఎట్టిమాటలకూ వీలులేనందున దీనిని అనిర్వాచనీయమన్నారు శాస్త్రజ్ఞులు. కటకాదులందు హేమమునువలె, ఇది చిద్భిన్నమనుటకూ వీలులేదు. చిదభిన్నమనుటకూ వీలులేదు— సువర్ణముకంటె మురుగు వేరా? కాదు- కాదనుటకూ కటకమను కొరకయీ కారము కనిపించుచున్నది. కాన నీప్రపంచము బ్రహ్మవివర్తము. బ్రహ్మమునకు ప్రత్యగాత్మ, ప్రపంచాత్మలకు భేదము మిథ్యకాని వాస్తవము కాదు- కనుక బ్రహ్మ అద్వితీయము.

రామా! ఆత్మభిన్నమగు వస్తువు ఉన్నచో దానియందు కోరిక పుండవచ్చును. అదే లేనప్పుడు ఇంక ఆత్మ దేనిని కోరుతాడు? దేనిని స్మరిస్తాడు? దేనిని సృష్టించుటకు ప్రవర్తిస్తాడు? ప్రవర్తించి మరింక ఏమిఫలం పొందుతాడు? కనుక హితాఽహితవికల్పములేవియు ఆత్మకు అంటవు. నిరిచ్ఛుడగు ఆత్మ యేమియు చేయజాలదు నిరిచ్ఛునకు నైష్కర్మ్యసిద్ధి ఫలముకానేరదు. అద్వితీయునకు ద్వితీయము ఫలమగుట విరుద్ధము.

కనుక రామచంద్రా! నీకు ఇతరము గోచరించే యెడల సర్వద్వంద్వవినిర్ముక్తుడ గతవ్యథుడవగుచూ పనిని చేయుము. నేను నిన్ను నివారించను కాని ఒక్కమాట చెబుతా విను. రామా! నీవు మాటిమాటికి కర్తృత్వాభినివేశంతోటి ఎన్నికర్మలు ఆచరించినా పాంచభౌతికమగు దేహమును అభివృద్ధి పరచుటకంటె వేరే నిత్య నిరతిశయానందరూపమవగు నీకు తగిన ఫలమేమయినా కలదా? ఏమీ లేదు- ఇంకెందుకు ఈకర్తృత్వాభినివేశము కనుక సర్వకర్తృత్వాభినివేశమును విడిచి నీస్వస్వరూపమునకు తగిన అకర్తృత్వమునందు ఉదాసించుము. శ్రుతి గురు వాక్యములచే ఆత్మజ్ఞానము కలిగి మోక్షాధికారివగు నీవు స్వస్థుడవగుము. దిగంతములవరకు ఎంతదూరము పోగినా ఎంత ప్రయత్నించినా అపరిచ్ఛిన్న సుఖము నొసంగెడి సాధనము

(మురికి గోతులలోపడి దుఃఖించుచున్నట్లు) అనుభవిస్తాడు. జ్ఞాని నిజంగా గోతిలోపడియున్నా మనస్సు ఉపశాంతంగా ఉన్నందున పడక మీద పరుండియున్నట్లు సుఖంగా ఉంటాడు. ఇలా వీళ్ళయిద్దరిలో ఒకడు స్వప్నభవనానికి కర్త కాకున్నా కర్త అయినాడు. మరొకడు నిజంలో కర్త అయినా ఫలానుభవంలో అకర్త అయినాడు. చిత్తవశం చేత కాబట్టి "యో యచ్చిత్తః స తన్మయః" అనేది సిద్ధాంతం.

కనుక రామా! నీ చిత్తం ఎల్లప్పుడూ అసంసక్తముగా నుండుగాక. ఆత్మ వ్యతిరిక్తమయిన వస్తువే ఏదీ లేదు. సంసక్తి చెందటానికి పరిదృశ్యమాన ప్రపంచం అంతా శుద్ధచిదాత్మ యొక్క ఆభాస మాత్రమని గుర్తించు.

ఈవిధముగ జ్ఞాతజ్ఞేయుడగు ఆత్మవేత్తకు "నేను సుఖదుఃఖములు పొందదగినవాడను కాను" అను నిశ్చయము కలిగితే, "ఆత్మకంటె వేరుగ ఆధారాధేయములనునవి లేవు" అను మనో నిశ్చయము కలిగితే, ఆత్మ "దేహాతిరిక్తుడనీ, అకర్తయనీ, అభోక్తయనీ, తోక చివరి వెంట్రుక యొక్క సహస్రభాగ మంతటి సూక్ష్మ రూపుడనీ" నిశ్చయం కలిగితే "ఈ పరిదృశ్యమాన ప్రపంచం అంతా నేనే" అను నిశ్చయం కలిగితే, "సర్వవస్తువులకు సత్తను (ఉనికిని) కలిగిస్తూ సర్వవ్యాపకుడనై ఉన్నాను." అను నిశ్చయముకలిగితే, నేను సుఖదుఃఖములు పొందదగినవాడను కాను. వెనుక చెప్పిన నిశ్చయముకలిగి, ఇష్టానిష్టప్రాప్తి పరిహార చింతా జ్వరములు లేనివాడై, చిత్తవృత్తులను ఆత్మయందే ప్రారబ్ధ భోగంకొరకు లీలచే ప్రవేశపెట్టుచూ, వ్యవహారములయందుంటాడు అతడు.

జ్ఞాని అతిసంకటములందు గూడ ఆనందరూపుడే. దుఃఖముల ననుభవించడు. కేవలము చంద్రికవలె ప్రపంచమును అలంకరిస్తాడు. సంకల్ప వికల్పాత్మక మగు మనస్సును విడచి నందున, (వాసనా రహితుడై నందున) జ్ఞాని కర్మల నాచరించుచున్నను, ఆచరించనివాడే-

మనస్సునందు లేపము లేకుండుటయే ఇందుకు కారణము. ఇలాంటి జ్ఞాని ప్రయత్నపూర్వకముగ కాలు చేతులు కదల్చుటయును కర్మచేయు చున్ననూ దానిఫలమును పొందడు తాను.

ఇలా మనస్సు సర్వకర్మలకు కారణము- సర్వేప్సితములకు హేతువు. సర్వభావములకు నిదానము- సర్వలోకములకు ప్రకృతి- సర్వ గతులకు మూలకందము- (బీజము) దీనిని నాశము చేసికొన్నచో (అనగా మనోనాశమయినచో) పుణ్యపాపములు లంఘించగలవు. సర్వచేష్టలు రూపుమాయగలవు- సర్వదుఃఖములు అంతరించగలవు- జ్ఞాని మానసిక కర్మకు కూడ స్వాధీనుడు కాడు. ఫలమునందనురక్తుడు కాకుండుటయే ఇందుకు కారణము. ఫలానురక్తి మనస్సునకు లొంగక తప్పదు- పరమార్థతః జ్ఞాని దృష్టిలో తనకంటె భిన్నముగ ఏదియు లేనందున వానికి దేనియందును కోరిక ఉండదు.

లోకంలో పిల్లవాడు మనస్సుతో ఒక నగరాన్ని నిర్మిస్తాడు. దాన్ని తానే కూలగొడతాడు- చూడండి సహజంగా పిల్లలు చెక్క ముక్కలు పుచ్చుకొని గుడికట్టినట్లు పేరుస్తారు- తామే మరల దానిని చెడగొట్టుతారు. ఈ రెండు పనులంతా వాళ్లు చేసినా చేయనివాళ్లుగానే ఉంటారు. లీలామాత్రంగానే (అది ఒక ఆటగానే) చూచుకుంటారు కాని, అక్కడ సుఖదుఃఖములు సహజంగా ఉపాదేయములని భావించరు- కట్టిన నగరాన్ని కూలద్రోసినా లీలామాత్రంగా దుఃఖం అనుభవించినా అది దుఃఖమని తలచరు. అలాగే జ్ఞానికూడా కర్మలు చేసినా వాటిఫలాన్ని అనుభవించడు- నిర్లిప్తుడుగనే ఉంటాడు.

రామచంద్రా! లోకంలో ఉన్న వస్తువులలో హేయములు కొన్ని, ఉపాదేయములు కొన్నికదా! హేయములనగా విడిచిపెట్ట తగినవి- ఉపాదేయములనగా స్వీకరించ దగినవి- ఈ రెంటిలో దుఃఖ హేతువులేవో చెప్పు- హేయవస్తువు దుఃఖహేతువు కానేరదు-హానము

దృష్టిలో భిన్నమయినట్లున్న, ద్విత్వ ఏకత్వాదులను తాత్కాలికంగా కల్పిస్తుంది — సర్వశక్తులనూ ప్రకాశిస్తుంది.

కనుక రామా! బంధమోక్షాది వ్యవస్థ అంతా అజ్ఞానావస్థలోనే. జ్ఞానావస్థలో ఇది అంతా ఏమీ లేదు. మోక్షమనే బుద్ధి, బంధమనే బుద్ధి వ్యర్థంగా కల్పింపబడినవని నమ్మి — ఈ భావములను విడిచి నిరహంకారివై ఆత్మనిష్ఠలో నుండుము. నిరహంకారభావంతో భూలోకంలో వ్యవహరించు — అని ఉపదేశించాడు వసిష్ఠులు.

## 39. సర్వప్రపంచము అద్వితీయాత్మస్వరూపమని ప్రతిపాదించుట.

శ్రీరాముడు సాకల్యంగా దీనిని విన్నాడు. కాని యింకా అజ్ఞానదశలోనే ఉన్నాడు. గురువచనమందు విశ్వాసం మాత్రం ఉంది. విషయములందలి విరోధభావం మాత్రం వదలలేదు. కనుక ఇలా అడిగాడు — స్వామీ! "పరమాత్మ పరిపూర్ణుడై అంతటా నిండిఉంటే, మీరు చెప్పినట్లు బంధమోక్షాదులు సంభవమైతే అన్యోన్యములైన అభిత్తిచిత్రరూపంగా (గోడ లేని చిత్తరువు వలె) ఈ సృష్టి ఎక్కడనుంచి వచ్చినది?" అని.

వసిష్ఠుడు రాముని ప్రశ్న విని — "ఇతడు ఇంకా అజ్ఞదృష్టిలో ఉన్నాడా! లేక కొంత వివేకాన్ని పొంది మధ్యస్థితిలోకి వచ్చాడా! అనే విషయం పరీక్షించదలచాడు. కనుక బ్రహ్మాన్ని సర్వశక్తియుక్తుడను సగుణవాదాన్నే అంగీకరించి మాట్లాడాడు — "రాజపుత్రా! బ్రహ్మతత్త్వమే ఈ ప్రపంచాకారంగా పరిణమించింది — బ్రహ్మ సర్వశక్తియుతుడు. కనుక సర్వశక్తులు ఇతనియందు కలవు. కాన సత్త్వాసత్త్వములు, ద్విత్వ ఏకత్వ అనేకత్వములు ఆద్యత్వ అంతత్వములు మున్నగు ధర్మములు అతనియందు విరుద్ధములు కావు. పొసగనివి కావు. అన్నియు పొసగును — సముద్రముయొక్క నీటి ప్రవాహము చంద్రో

దయము వల్ల మిక్కిలి వృద్ధి చెంది, ఉప్పొంగుచూ, తరంగరూపముగు స్వాత్మలో అనేక ఆకారాలను చూపి ప్రకట మవుతుంది- అలాగే చిద్ఘనమైన పరమాత్మ కూడ చిత్తోపాధికుడగు జీవుని, అతనికి కర్మ రూపములుగా, వాసనారూపములుగా, మనోరూపములూ అయిన శక్తులను సంపాదిస్తాడు అనేకింటిని చూపిస్తాడు. పుట్టిస్తాడు. తిరోభావంచేత నశింపచేస్తాడు వాటిని. ఇలా సర్వజీవులూ, సర్వపదార్థములూ, చిద్రూపుడైన పరమాత్మవల్ల పుట్టినవని, సముద్రమునుండిపుట్టిన తరంగములు ఎల్లప్పుడూ సముద్రమయము లయినట్లు చిన్మయములని గ్రహించ మన్నారు వసిష్ఠులు.

సృష్టి పరమాత్మయొక్క అనంత విచిత్రశక్తివల్ల తయారయిన దని యింత చెప్పినా విని శ్రీరాముడు "నిప్పునందు శైత్యశక్తీ, నీటి యందు దహనశక్తీ, విరుద్ధమయినట్లు చిద్రూపునియందు జాడ్యశక్తీ, ద్రష్టయందు దృశ్యశక్తీ, నిత్యునియందు అనిత్యతాశక్తీ కూడా విరుద్ధ మని" తెలిపాడు.

ఇలా అడిగాడు వసిష్ఠుని- మహర్షీ! మాట అతి గహనంగా ఉన్నది. ఏమీ వాక్యార్థము బోధపడుటలేదు- మనస్సుతో కూడ ఆరు ఇంద్రియాలకు గోచరముకాని బ్రహ్మతత్త్వ మెక్కడ? క్షణ భంగుర ప్రాపంచిక పదార్థజాలమెక్కడ? నిజంలో ఈ ప్రపంచము బ్రహ్మతత్త్వంవల్లనే పుట్టినట్లయితే అతని ధర్మములన్నీ యీ ప్రపంచమునందుకూడ ఉండితీరవలెను- ఏది దేనివలనపుట్టునో అది దానివలె నుండునను న్యాయము లోకంలో కద్దు- దీపంవల్ల పుట్టినదీపం దీపాకారంగా ఉండును- పురుషునివల్ల పుట్టిన పురుషుడు పురుషాకారంగా నుండును. సస్యమువలె పుట్టిన సస్యము సస్యమువలె నుండును- అలాగే నిర్వికారమగు బ్రహ్మతత్త్వంవల్ల ఈప్రపంచం పుట్టియున్నట్లయితే ఇది కూడ నిర్వికారంగానే ఉండవలెను- అలాలేక ఈప్రపంచం చిదాత్మకంటె భిన్నంగా (విలక్షణంగా) ఉన్నచో నిష్కలంకుడగు చిదాత్మకు

(పరమేశ్వరునకు) ఒక కళంకాన్ని ఏర్పరచినట్లయింది మీకు''– అని అన్నాడు శ్రీరాముడు.

ఇదంతా విని వసిష్ఠుడు ప్రపంచానికి చిద్భావమునూ, అవికారత్వమునూ (వికారము లేకుండుటనూ) తెలిచి తత్త్వదృష్టితో సమాధానమిస్తున్నాడు–

వసి॥ రామా! ఈప్రపంచం అంతా నిర్మల శుద్ధ చిద్రూప బ్రహ్మమే! మరొక మలిన పదార్థములేదు. సముద్రంలో తరంగసమూహంతో నీరు ప్రకాశిస్తోంది కాని రజము (పరాగము) (మట్టి) ప్రకాశించుటలేదు. అగ్నియందు వేడికంటె (జౌష్ణ్యముకంటె) వేరు వస్తువు లేదు. ప్రపంచమునందు బ్రహ్మకంటె వేరువస్తువులేదు.

శ్రీరా॥ అయితే స్వామీ! బ్రహ్మము దుఃఖరహితమయినది. ద్వంద్వరహితమయినది. అతనివల్ల పుట్టిన ప్రపంచం దుఃఖమయమయినది. ద్వంద్వసహితమయినది. మీమాట అస్పష్టార్థంగాఉంది. నాకేమీ బోధపడుటలేదు. అని అడిగాడు శ్రీరాముడు మళ్ళీ–

వాల్మీకి– భరద్వాజమహర్షి శ్రీరాముడు ఇలా మాటిమాటికి అడ్డుపడుతూ వసిష్ఠుని నిరుత్తరుని చేసేసరికి వసిష్ఠుడు– ఇతనికి ఈ విషయం ఉపదేశించడం ఎలాగా అని సుదీర్ఘంగా ఆలోచించాడు. శ్రీరామునకు మనస్సు ఇంకా పూర్తిగా నిర్మలంకాలేదు. అందువల్ల ఎంతచెప్పినా తత్త్వాన్ని గ్రహించలేక పోతున్నాడు. పూర్ణమయిన వివేకికాని ప్రపంచం జడమను భావమును విడచి చిదేకరసమని గ్రహించలేడు. వివేకియొక్క దృష్టిలో వస్తువిరోధముండదు. జ్ఞానికి ప్రపంచం విరుద్ధంగా గోచరించదు. కనుక మనం వస్తుయాథాత్మ్యమును చెప్పేవరకు రాముని మనస్సు విశ్రాంతి చెందదు. సగం జ్ఞానికి (కొద్దిజ్ఞానం గలవానికి) నేను వెనుకచెప్పిన ''సర్వం బ్రహ్మ'' అను ఉపదేశము శోభించదు. సగముజ్ఞాని దృశ్యవస్తువులను చేకూర్చుకునే భోగదృష్టి

ఉంటాయి. అందుకు ఈ ఆకాశము కర్తా కాదు- హర్తా కాదు- అలాగే ఆత్మకూడా-

ఆత్మస్వరూపముకాని వస్తువు నశిస్తుంది. ఆత్మస్వరూపమయిన వస్తువు ఎలానశిస్తుంది? ఆత్మస్వరూపముకాని వస్తువు ఏదయినా ఉంటే అది పుట్టుతుంది. ఆత్మస్వరూపమయిన వస్తువు ఎలాపుడుతుంది? పారమార్థ సత్యచిత్స్వరూప బలమువల్లనే ప్రపంచము యొక్క ఉత్పత్తి (పుట్టుక) ప్రాపంచిక పదార్థములు పుట్టగానే వాటిమీద గట్టి అభిమానం ఏర్పడుతుంది. అదే అవిద్య- ఇంక అద్భుతమైన చిత్రవిచిత్రములయిన శుభాశుభఫలములతో నిండి వేలకొలది శాఖోపశాఖలతో ప్రకాశిస్తూ పెద్దగా మారాకెత్తిన సంసార మహావృక్షం తయారవుతుంది. కనుక రామా! సంసారవృక్షానికి ఆశలు పువ్వులు- దారుణమయిన దుఃఖాలు వివిధఫలములు, భోగములు, చిగురుటాకులు, జరకుసుమము, తృష్ణలతి- దీన్ని వివేకమనే కత్తితో నరికి ముక్తిపొందుమనీవు- అన్నారు వసిష్ఠులు-

౪౦. సర్వప్రపంచము బ్రహ్మస్వరూపమని ప్రతిపాదించుట.

విన్నాక శ్రీరాముడు. ఈ జీవులు బ్రహ్మనుంచి ఎలా పుట్టుతున్నారు! ఏగానుంది పుట్టుతున్నారు? వివరంగా చెప్పండి అని అడిగాడు. వసిష్ఠులు ఇలా జవాబు చెబుతారు- రామా! చిత్రవిచిత్రములయిన ఈభూతజాతులు (ఈప్రాణికోటి) బ్రహ్మనుండి ఎలా పుట్టినదీ ఎలా పెరిగేదీ, ఎలానశించేదీ, ఎలాప్రళయంలో దాగిఉండేదీ సంక్షేపంగా చెబుతాను. పరిశుద్ధమయిన చిచ్ఛక్తి యదృచ్ఛగా (స్వేచ్ఛగా) ప్రపంచకల్పనకు సమకట్టి స్వయంగా విషయాకారాన్ని చెందటం ప్రారంభించి, క్రమంగా అహంభావంతో గట్టిపడి జీవోపాధి అయిన మనస్సుయొక్క ఆకారాన్ని చెందుతుంది. మనస్సంకల్పమాత్రం చేత క్షణకాలంలో గంధర్వపురంవలె ఈదృశ్య ప్రపంచాన్ని అంతా

కల్పిస్తుంది- తన దృశ్యరూపస్థితిని విడిచిపెట్టినట్లు నటిస్తుంది. ఇవన స్వయంప్రకాశమానమయిన ఆచైతన్యము శూన్యాకారంగా భావించి ఆకాశమనబడుతోంది. తరువాత చతుర్ముఖబ్రహ్మ సంకల్పంచేత చతుర్ముఖబ్రహ్మఅయి, దక్షప్రజాపతి మున్నగువారితో సహా జగత్తును కల్పిస్తుంది- ఇలాగే చతుర్దశభువనాలు కల్పించబడ్డాయి. కనుక ప్రపంచం అంతా మనోమాత్రం- కనుక మిథ్యాసంకల్ప నగరతుల్యం- కేవల భ్రాంతి మాత్రం.

ఈజీవులు మూడురకాలు. 1. కొందరు మహామోహులు(అనగా పూర్తి అజ్ఞానులు) 2. మరికొందరు పుట్టుకతోడనే వివేకసంపద కలవారు- (సనకాదులు) 3. మరికొందరు జ్ఞానాజ్ఞానములయొక్క మధ్య దశలోనుండి మోక్షంకొరకు పాటుబడుతూ ఉన్నారు. దృఢమయిన వైరాగ్యం లేకపోవడంచేత తొట్రుపడుతూ ఉండేవారు. ఈ భూలోకంలో ఉండే భూతకోటిలో భరతఖండంలోఉండే మానవులే శాస్త్రోపదేశానికి అర్హులు. వీరికి వైరాగ్యం కలుగటానికి హేతువులుగా దుఃఖమయములయిన ఆధివ్యాధులున్నాయి- అందువల్ల ప్రపంచం అంతా రోతపుటుతుందివీరికి- ఇందులో తామసులగు మానవులు శాస్త్రము నందు అధికారులు కారు. రాజససాత్త్వికులు మాత్రమే శాస్త్రోపదేశానికి యోగ్యులు- వీరిని 42వ సర్గలో జీవావతరణక్రమమును వర్ణించి చెప్పినపుడు చెప్పగలను. అమృతమూ, సర్వవ్యాపకమూ, నిరామయమూ, అయిన బ్రహ్మతత్త్వము జీవరూపాన్ని చెందిన విధం కూడా అక్కడే చెబుతాను- నిశ్చలమయిన సముద్రంలో తరంగముల యొక్క చాంచల్యము ఏర్పడినట్లు సద్రూపమయిన బ్రహ్మతత్త్వంలో సత్తా ఏకదేశంచేత జీవభావంతో చలనమనేది ఏర్పడి అది ఘనీభావాన్ని చెందుతోంది. ఈవిషయం అంతా నీకు ఆసర్గలో స్పష్టమవుతుంది. అన్నారు వసిష్ఠులు-

విన్నాడు రాముడు- అఖండ పరిపూర్ణ సద్రూపుడగు పరమాత్మయందు సత్తా ఏకదేశమనే స్పందము అసంభవం అనుకున్నాడు. ఇలా

నశించి సంశయాలు విడిపోతే కాని యథార్థమయిన వస్తువును గ్రహించలేను— మిథ్యాజ్ఞానం నశిస్తేకాని యథార్థజ్ఞానం ఆరూఢం కాదు. మిథ్యాభూతమయిన ప్రపంచవైరాగ్యము కలిగితేకాని పరమార్థ వస్తుజ్ఞానం కలుగదు. రాత్రియందలి చీకటిపోతేకాని దృశ్యమయినవస్తువు గోచరించదు. అన్నాడు వసిష్ఠులు—

## ౪౧. అవిద్యాస్వరూపమును చెప్పుట.

శ్రీరాముడు విని మళ్ళీ ఇలా అడిగాడు వసిష్ఠుని— మహర్షీ! మీమాటలు చంద్రకిరణాలవలె చల్లగా ఉన్నాయి— నిర్మలంగా ఉన్నాయి— అతివిచిత్రంగా ఉన్నాయి— మహాగంభీరంగా ఉన్నాయి— కాని నేను మాత్రం వచ్చేపోయే మేఘాలతో వర్షకాలంలోని పగటి వలె కొంతకాలం వ్యామోహంతోనూ, కొంతకాలం వివేకంతోనూ ఉంటున్నాను— అద్వితీయ పరిపూర్ణ చిత్స్వభావుడయిన పరమాత్మ నుంచి పరిచ్ఛిన్నమయిన ప్రపంచమునేది ఎలాపుట్టిందనే సందేహం నాకు అలాగే ఉంది. అది తీరలేదు అన్నాడు రాముడు—

వసి॥ రామా! నామాటలు నానాటికి మాటిమాట్లూ యథార్థములు అసమర్థములు కావు విరుద్ధార్థములు కావు. వీటిలో పూర్వాపర విరోధం లేదు. నీకు నిర్మలమయిన జ్ఞానదృష్టి కలిగి వివేకసంపద వృద్ధి పొందితే అప్పుడు నామాటలలో ఉండే గుణాలన్నీ తెలిసికొంటావు నీవు. శబ్దార్థవాక్యరచనలుఅన్నీ ఉపదేశంకోసం శాస్త్రార్థం తెలుసుకోవడముకొరకూ పుట్టాయి. ఆ మాత్రంచేత నీవు ఆ భ్రాంతిలో పడవాకు. “తత్త్వమసి” ఇత్యాది మహావాక్యార్థసాక్షాత్కారం కలిగేటంత వరకు వాచ్యమూ, వాచకమూ, శబ్దమూ, అర్థమూ, అనేభేదం ఉంటుంది. ఆపైన యీభేదబుద్ధులు యేమీ ఉండవు. శబ్దమూ, అర్థము, అనే కార్యప్రపంచము, అజ్ఞానుల విషయంలో కల్పింపబడినది కాని, విజ్ఞులవిషయంలో కాదు. చైతన్యము విషయాభిముఖమగుట

కాని, దానికి నిమిత్తమయిన పూర్వసంస్కారకర్మలు కాని, అవిద్య కాని ఆత్మతత్త్వంలో లేవు. బ్రహ్మతత్త్వం రాగద్వేషరహితం- అదే జగత్ప్రమాణంగా గోచరిస్తోంది. ఈ ఆత్మతత్త్వాన్ని చిత్రవిచిత్రములయిన యుక్తులతో విజ్ఞానప్రక్రియలతో చెబుతాను సిద్ధాంతం చెప్పేటప్పుడు- నా ప్రపంచములోపడే ప్రగాఢమయిన మూలాజ్ఞానాన్ని మూలాజ్ఞానాన్ని పోగొట్టడానికి యువ్వనికి సాధ్యంకాదు. బహుజన్మార్జితమయిన పుణ్యాలచేతనే పరిశుద్ధమయిన అంతఃకరణాకారంగా ప్రకాశించిన అవిద్య ఉత్పన్నమయిన అవిద్య- ఇది తనను నశింపచేసే విద్యను ప్రార్థిస్తుంది- శస్త్రం శస్త్రంచేతనే శాంతిస్తుంది- మలం మలంచేతనే పోతుంది. (గుడ్డయొక్క మకిల చవిటిమట్టితోనే వదలుతుంది.) విషం విషంతోనే శాంతిస్తుంది. శత్రువు శత్రువుచేతనే నశిస్తాడు. కాబట్టి అజ్ఞానం తనను తానే నశింపచేసి కొంటుంది. ఇందులో కర్మకర్తృత్వవిరోధంలేదు. ఈ విరోధం క్రియయందుకాని జ్ఞానంచేత అజ్ఞానాన్ని బాధించటంలో ఉండదు. రామా! మాయ ఇలాంటిది- తన నాశంలో తానే హర్షిస్తుంది. దాని స్వభావాన్ని గుర్తించలేము. చూస్తూ ఉండగా నశిస్తుంది. ప్రదేశాన్ని కప్పిపుచ్చుతుంది. అజ్ఞాన ప్రపంచాన్ని సృష్టిస్తుంది. కనిపించకుండా దానిపనిని అదిచేస్తుంది- చూస్తూఉండగా నశిస్తుంది. చాల చిత్రమయినది దాని నడక. ఎంతటి వాళ్ళకయినా సంసారబంధాన్ని కట్టిపెట్టడంలో జంకులేదు దానికి. అసత్యంగానూ ఉంటుంది అది. అది సత్యంగానూ ఉంటుంది. అభిన్నమయిన వస్తువులో భేదాన్ని పుట్టిస్తుంది- అక్షరమను పేరుగల మాయ అభిన్నమయిన ఆత్మతత్త్వంలో క్షరమయిన (నశించెడి) భేదాన్ని పుట్టించింది- కనుకనే క్షరాక్షరములకు అతీతుడయిన ఆత్మ పురుషోత్తముడయినాడు. ఈమాయ పరమార్థంలో లేదు. ఈవిషయం నీవు గురూక్తి అనుభవములచే భావనచేసి తత్త్వవేత్తవై ఆత్మతత్త్వసాక్షాత్కారంచేత తెలిసికుంటావు. అప్పటికి నామాటలయొక్క తాత్పర్యం నీకు అర్థం అవుతుంది. ఇప్పుడుమాత్రం నామాటలయందు

విశ్వాసముంచి నేను చెప్పిన విషయం పరోక్షంగానే గ్రహించు. అవిద్య అనేది లేదనే నమ్మకలోనే ఉండు. నీకు కనిపించే ఈప్రపంచం మహో విజృంభితమూ అసద్రూపమూ అనీ, బ్రహ్మమాత్రం సద్రూపమనీ నిశ్చయంకలవాడు ముక్తిని పొందుతాడు. బాహ్యవస్తువులందుంచెడి మననములు జీవులనే పక్షులను పట్టడానికి వలలు- ఈప్రపంచము స్వప్న ప్రపంచమువలె మిథ్య అని తలచేవాడు. మాత్రం సంసారదుఃఖంలో మునగడు. మిథ్యాభూతములయిన దేహేంద్రియాది ద్వైతములందు "నేను"- అని ఆత్మభావన చేయువాడు సంసారదుఃఖంలో మునిగి పోతాడు- పరమాత్మయందు భావవికారాలు ఏవీ ఉండవు. నీటిలో పరాగములుండవు. అయితే తత్త్వవేత్తలకు దేహేంద్రియాదులందు తాత్త్వికంగా అహంభావన లేకున్నా లోకవ్యవహారం కొరకు తాత్కాలికంగా కలుగుతూ ఉంటుంది- ఇలాంటి వ్యావహారిక దృష్టులు లేనిదే శాస్త్రములు నిలవనేరవు. దారములు లేనిదే పటములు(గుడ్డలు) ఉండవు. అవిద్యాప్రవాహంలో కొట్టుకునిపోయ్యే ఆత్మకు ఆత్మజ్ఞానం లేనిదే స్వస్వరూపానుభవం కలగదు. అట్టి ఆత్మజ్ఞానం శాస్త్రార్థము వల్లకాని కలుగదు. అందుకొరకు శాస్త్రములు అవసరము- రామా! అవిద్యఅనే నదిని తరించడానికి పరమాత్మప్రాప్తి ముఖ్యసాధనం. అదే అక్షయమగు స్థానము. రామా! ఈఅవిద్య ఎక్కడనుంచివచ్చిందో- కాని పరమాత్మయందు పీఠము పెట్టుకుని కూర్చుంది. ఇది ఎక్కడనుంచి పుట్టిందా! అనే విచారణనీకు పనిలేదు. దీనిని (ఈ అవిద్యను) నేను ఎలాపోగొట్టుకుంటానా! అనే విచారణయే నీకవసరము. ఇది నశించిన తరువాత నీకు తెలుస్తుంది ఎక్కడనుంచి వచ్చిందీ? ఎలావచ్చిందీ? ఎలాచచ్చిందీ? వస్తుతః ఇదిలేదు. కనిపించకుండా ప్రకాశిస్తోంది- కలలో కనిపించిన పురుషుడి గోత్రం ఏమిటా? అని విచారణ చేసినట్లు లేని యీఅవిద్య ఎక్కడనుంచి వచ్చిందా అనే విచారణ నీకెందుకు? పుట్టింది ఎక్కడనుంచో! పెరిగింది. దోషాలు కలిగిస్తోంది. ముందు

యొక్క శిఖా(జ్వాలా)స్పందంతో నిశ్చలంగా ఉన్నతంగా వెలుగుతూ ఉంటుంది. (గాలికి కొట్టుకొనకుండా నిడివిగాపోతూ ఉంటుంది.)అలాగే అస్పందుడయిన ఆత్మకూడ తనస్వరూపమునందు తాను స్పందశక్తితో సుదీర్ఘంగా ప్రకాశిస్తూ ఉండవచ్చును. శారదరాకానిశాకరుని కిరణ సంపర్కమువలన సముద్రము ఇతర నీటి ప్రదేశమునందు చంచలమయి నదిగ ప్రకాశించినట్లు, సర్వశక్తియు, సర్వత్ర పరిపూర్ణుడయిన పరమాత్మ కల్పితైకదేశమగు శరీరమునందే స్పందవిలాసము గలవాడుగ గోచరించుచున్నాడు. అనగా అతిగంభీరమయిన సముద్రము పోటు వచ్చినపుడు (చంద్రోదయమయినపుడు) పొంగుతుంది. సముద్రము అంతా పొంగుతూఉన్నదా? లేదు. ఏకదేశమయిన నీరు మాత్రమే తరంగరూపముతో ఎత్తుగా లేచి ఒడ్డునకువచ్చి దానివలన స్వభావమును చూపుచున్నది. అంతమాత్రమున సముద్రమునకు గల సహజ గాంభీర్యమునకు (నిశ్చలత్వమునకు) లోపములేదు. అట్లే ఆత్మకూడ సర్వత్రనిండియున్ననూ, కల్పితములయిన శరీరాదులందు మాత్రము చలనము గలవాడువలె గోచరించును. అంతమాత్రమున అతని పరిపూర్ణత్వమునకు భంగములేదు. శరదాతపసమూహములతో సముద్రుడు ప్రకాశించినట్లు ఇంద్రియప్రకాశములతో ఆత్మ ప్రకాశించుచున్నాడు- అతీంద్రియమయిన ఆకారమునందు మౌక్తికములయొక్క ప్రకాశము ఇంద్రియగోచరమయినట్లు అదృశ్యమయిన చిదాకాశమునందు చిచ్ఛక్తి ప్రకాశిస్తూ దృగ్గోచరమగుచూ ఉంటుంది ఇంద్రియగోచరమగు ఈ చిచ్ఛక్తి పరమార్థచైతన్యమే పుట్టినదని అనుకొనుట కేవలము ఉపాధిని పుచ్చుకొనికాని నిజరూపమునుబట్టి కాదు. ఈయది పరమార్థమున పరమాత్మాభిన్నమే. కాని భిన్నముగ గోచరిస్తూ ఉంటుంది. సూర్యచంద్రాగ్నుల యొక్క ప్రకాశ ఒకానొక చిన్నికోటరములో (తొర్రలో) ఉపాధిపరవశమై చిన్నదిగా గోచరించినట్లు- పరమాత్మవల్ల ఈచిచ్ఛక్తి (జీవశక్తి) ఉదయించిన తరువాత నే, తనకు చెలికత్తియ

[illegible] నేక కాలత్రయాతీతమైన [illegible]ంటుంది. ఈచిచ్ఛక్తి తననిజ రూపాన్ని విస్మరించినంతకాలం జడస్థితి పడుతుంటుంది, (ముక్తిస్థానము నందు) ఉంటుంది. అవిస్మరించక, భ్రాంతిచేత కల్పితరూపమే తనదని గ్రహించి, వాసిష్ఠ స్వభావాలతో ఉండేయెడల, అట్టిగా సంసార వాసనా ప్రవాహంలో ఈచిచ్ఛక్తి తను ఏరూపమును భావిస్తే ఆరూపం గానే కనిపిస్తుంది. ఈ కల్పితమయిన సర్వ ప్రపంచమూ పరమార్థంలో చిన్మాత్రమే. తరంగములన్నీ సముద్రానికే, కటక కేయూరాదులన్నీ బంగారానికి ఎలా అభేదమో, ప్రపంచానికీ చిదాత్మకూ కూడా అలాగే అభేదము. ఒక దీపంవల్ల అనేక దీపాలను తయారుచేస్తాం. ఈ అన్ని దీపాలలోనూ ఉండే అగ్నియొక్క స్వరూపం ఒక్కటే. వత్తి బుద్ధి మొదలయిన ఉపాధులే వేరు. అలాగే ఒక చిదాత్మవల్ల అనేకమంది చిదాత్మలు బయలుదేరుతున్నారు. వారందరిలోనూ ఉండే చైతన్యం ఒక్కటే. వారివారి దేహేంద్రియాది ఉపాధులుమాత్రం వేరువేరు. కనుకనే కల్పితమయిన క్షేత్రమునందు (శరీరమునందు) అభిమానం కలవాడగుటచే క్షేత్రజ్ఞుడనబడుచున్నాడు చిదాభాసుడు (జీవుడు).

రామా! ఈ క్షేత్రము యొక్క కల్పనాక్రమం చెబుతాను విను. జ్ఞానేంద్రియములకు వాసనలు గట్టిపడిన భావనచే అహంకారము అగుచున్నది. అహంకారము అధ్యవసాయవృత్తితో (నిశ్చయాత్మక వృత్తితో) బుద్ధి అవుతోంది. ఈబుద్ధి సంకల్పవికల్పములను పొంది మనస్సు అవుతోంది. అమితఘనమైన వికల్పములు కలదై మెల్లగా బాహ్యేంద్రియాకారాన్ని చెందుతోంది. ఈ ఇంద్రియము క్రమంగా పాణిపాదమయమయిన దేహమవుతున్నది. ఈ దేహము పుట్టుచున్నది. పెరుగుచున్నది నశించుచున్నది. ఇలా జీవుడు సంకల్పములనే త్రాళ్ళతో చుట్టుకొని, దుఃఖసమూహంతో నిండినవాడై క్రమంగా బాహ్య వస్తువులను తెలిసికొనుట సమర్థుడగుచున్నాడు. కాచినకాయ పాక

వశంచేత (తేజస్సంయోగంచేత) రూపరస పరిణామాది గుణసంపత్తిచే (రూపరసాదులు మారుటచే) వైలక్షణ్యాన్ని చెంది ఎలా మారుచున్నదో అలాగే జీవుడుకూడా అవిద్యామలము యొక్క పరిపాకవశం చేత, విలక్షణుడగుచున్నాడు కాని, పరిణామరహితమయిన చిత్స్వభావంతో విలక్షణుడగుట లేదు. కాబట్టి పండునకు అవస్థయొక్క మార్పుయే కాని ఆకారము యొక్క మార్పు లేదు. జీవునకు కూడా అవస్థా వినిమయమే కాని ఆకారమునకు వినిమయము (మార్పు) లేదు. ఇంక జీవునకు అహంకారాది క్షేత్రము మీద తాదాత్మ్యాధ్యాసలక్షణమయిన బంధం చెబుతాను విను. జీవుడు (చిదాభాసుడు) తాదాత్మ్యాధ్యాసచే అహంకారమవుతాడు. అహంకారం బుద్ధి అవుతుంది. ఈ బుద్ధి సంకల్పజాలకలితమయిన మనస్సు అవుతుంది. సంకల్పమయమయిన ఈమనస్సు స్త్రీపుత్ర క్షేత్రాకారములను గ్రహిస్తూ, వాసనావృత్తి ద్వారా సంసారరూపంతో ఆయా ఆకారాలను ధరించడంలో ఆసక్తి కలదై, నిజమయిన కోరికలతోనూ, వ్యర్థమయిన కోరికలతోనూ, బాహ్యవిషయములందు ఆసక్త మవుతుంది. ఆ ఆసక్తితో మాటిమాటికీ ఆవిషయములను స్మరిస్తూ చిత్తమవుతుంది. అప్పుడు దానిని (ఆచిత్తమును) రాగద్వేషాది దోషాలు వెంటబడతాయి. గోవులు మదించి ఎద్దువెంట బడినట్లు- నదులు సముద్రము వెంటబడినట్లు- ఇలా రాగద్వేషాది దోషభూయిష్ఠమయిన చిత్తము శాఖోపశాఖలతో అభిమానాన్ని పెంచుకొని అహంకారాన్ని చెంది కోశకారక్రిమివలె (పట్టుపాలెపురుగువలె) బుద్ధిపూర్వకంగా బంధంలో పడుతుంది. ఇలా వలలో పడ్డ మత్స్యములు నాశమునకు సంసిద్ధమయినట్లు సంకల్పపాశములనే వలలో పడ్డ ఈచిత్తము (మనస్సు) కిరాడ చావుసిద్ధమై బంధంలోపడి పరితపిస్తుంది. పారమార్థికమయిన ఆత్మరూపాన్ని విడిచిపెడుతుంది. జన్మమరణాది భ్రాంతి పరంపరారూపమయిన అవిద్యను పెంచుకుంటుంది. బోనులోఉన్న సింహంవలె బాహ్యవిషయాలనే అగ్నిజ్వాలలో

చిక్కుకున్న ఈమనస్సు పరాధీనమవుతుంది. విచిత్రములయిన విహిత నిషిద్ధాదికర్మలను అనేకం చేస్తుంది. నానా యోనులందు పుట్టుచూ నరకదుఃఖాలను అనుభవిస్తుంది. ఇదే ఒకప్పుడు మనస్సుఅనీ, ఒకప్పుడు బుద్ధిఅనీ, ఒకప్పుడు జ్ఞానమనీ, మరొకప్పుడు అహంకారమనీ, ఇంకొకప్పుడు పుర్యష్టకమనీ, ప్రకృతిఅనీ, మాయాఅనీ, మలమనీ, కర్మఅనీ, బంధమనీ, చిత్తమనీ, అవిద్యఅనీ, ఇచ్ఛఅనీ కల్పింపబడుతుంది. రామా! ఈమనస్సే సంసారబద్ధమగుచున్నది కాని, ఆత్మబద్ధుడగుట లేదు. చూడు— ఈమనస్సే సంకల్పవికల్పాలచే కట్టబడుతోంది— దుఃఖాలలో మునుగుతోంది [illegible] సమావేశం చెందుతోంది. రాగద్వేషాలను అనుభవిస్తోంది. జరామరణమోహాలతో కొట్టబడుతోంది. ఈహితానీహితాలచే భక్షింపబడుతోంది. అవిద్యారాగములచే రంజితమవుతోంది— తన ఉత్పత్తికి నిమిత్తమయిన పరమాత్మపదమును మరచిపోతోంది. అనేకానర్థములను కల్పించుకొంటోంది. శోకమోహాలకు గని అవుతోంది.

పంచతన్మాత్రలు దీనికి ఆలయాలు— అనంతములయిన నరకములు అసిపత్రములు కొండవలె దుర్భరము ఇది. జరామరణములతో ఒప్పెడి సంసార విషవృక్షము ఇది. అనేక ఆశాపాశములను కలిగిస్తుంది. పురుషార్థహీనము విషయచింతనలనే అగ్నిజ్వాలలచే దగ్ధమయింది. కోపమనే అజగరంచే కాటువేయబడింది— కామాబ్ధిలోని కల్లోలములతో కొట్టబడింది. తనతాను మరచిపోయింది. (అనగా మూలకారణమయిన ఆత్మస్వరూపాన్ని మరచిపోయిందని అర్థము) గుంపునుంచి విడిపోయిన లేడివలె దుఃఖిస్తోంది— అగ్నిలోపడ్డ మిడతవలె దగ్ధమాయింది— వేరు తెగిన పద్మినివలె వాడిపోయింది. మరణకాలంలో మృత్యువుచేత తాను ఉన్నచోట అభిమానం తెంచివేయబడగా, క్రొత్తదయిన యాతనాశరీర సంబంధం కలిగే సరికి దుఃఖిస్తోంది. శత్రువుల మధ్య ఉన్నట్లు శబ్దస్పర్శాది విషయాలమధ్య ఉంది— ఇలా అనేక

సంకటాలలో పొర్లుతూ ఉంది- పక్షి సముద్రంలో పడినట్లు ఘోరదుఃఖంలో పడింది. తనను కట్టివేసే (బంధించే) దేహాదులందు ఆదరాన్ని పెంచుకుంటోంది. తత్త్వజ్ఞానమూలంగు తత్సాధనములందు కాని అనాస్థ (అనాదరము) అనే సముద్రంలో మునిగి తేలుతోంది. ఎప్పుడూ విషయాలవంకకు పరుగెత్తుతోంది రామా! ఇలాంటి మనస్సును బురదలోనుంచి ఏనుగును లేవదీసినట్లు ఉద్ధరించు బలాత్కారంగా- రామా! విహితనిషిద్ధకర్మలతో మలినమై జరామరణవిషాదములతో మూర్ఛితమయిన మనస్సునంతా ఎవరికీ శాంతి కలుగదో రామా! వారు నరాకారుడగు రాక్షసుడు సుమా? అన్నారు వసిష్ఠులు.

## ౪౩. జీవులయొక్క కర్మగతి నిరూపణము.

వసి॥ రామా! ఉపాధిసంబంధముచే ఏర్పడిన ఈజీవులు సంసారవాసనా ప్రవాహంలో పడి పూర్వపూర్వవాసనలను అనుసరించి, కల్పితాకారుడగు బ్రహ్మనుండి పుట్టుచున్నారు. వీరి సంఖ్యకు లెక్క లేదు. వెనుక పుట్టారు. ఇప్పుడు పుట్టుచున్నారు ముందు పుట్టనున్నారు. ప్రవాహోదకంలో నీటికణాలవలె ఉన్నారు వీరు- తమ తమ కర్మ వాసనలకు పరవశులు. నీటిలో బుడగలవలె ఎల్లప్పుడు ప్రతి దేశంలోనూ, జలంలోనూ, స్థలంలోనూ పుట్టుచూ, చస్తూ ఉంటారు. కొందరు ఈకల్పంలో ఒకేజన్మను పొందుతారు. కొందరు లెక్కలేని జన్మలను ధరిస్తారు. మరికొందరు ఇకముందు పుట్టనున్నారు- కొందరు జీవన్ముక్తులు- మరికొందరు విదేహముక్తులు. కొందరు కొన్ని వేల కల్పములలో పుట్టుచున్నారు. కొందరు ఒకేయోనిలో పుడతారు- మరికొందరు భిన్నభిన్న యోనులందు పుడుతున్నారు. కొందరు నారకులు. (నరకవాసులు) కొందరు మర్త్యులు- కొందరు ఎప్పుడూ ఆనందంతో ఉండే దేవతలు- కొందరు స్వర్గలోకవాసులు- కొందరు కిన్నరులు- కొందరు గంధర్వులు- కొందరు విద్యాధరులు- కొందరు పన్నగులు- కొందరు సూర్యసారూప్యాన్ని పొందినవారు- మరికొందరు

ఇంద్రసారూప్యాన్ని- కొందరు వరుణసారూప్యాన్ని- కొందరు వసు
సారూప్యాన్ని- కొందరు విష్ణుసారూప్యాన్ని- కొందరు బ్రహ్మస్వరూ
పాన్ని పొందిఉంటారు. కొందరు కూశ్మాండ, వేతాళ, యక్ష, రక్షః,
పిశాచకులు- కొందరు బ్రాహ్మణులు- కొందరు క్షత్రియులు-కొందరు
వైశ్యులు- కొందరు శూద్రులు- కొందరు శ్వపచాలు- (కుక్క
మాంసము తినువారు) కొందరు చండాలురు- కొందరు కిరాతయోని
ప్రవిష్టులు- కొందరు పుల్కసులు- కొందరు తృణములు- కొందరు
ఓషధులు- కొందరు ఫలమూలములుగాని బీజములు- కొందరు పతంగ
ములు- కొందరు లతలు- కొందరు తీగలు- కొందరు తృణవిశేషములు-
కొందరు వృక్షాదులు- కొందరు కదంబజంబీరాదితరువులు- కొందరు
విద్యాధరులు- కొందరు సామంతరాజులు- కొందరు మంత్రులు-
కొందరు దిగంబరులైన మునులు- కొందరు సర్ప, అజగర, కృమి, కీట,
పిపీలికాదులు. కొందరు సింహాలు- కొందరు మహిషములు- కొం
దరు లేళ్ళు- కొందరు సారసచక్రవాకాది పక్షివిశేషములు- కొందరు
ఏనుగుగున్నలు- కొందరు వరాహములు- కొందరు వృషభములు-
కొందరు గర్దభములు- కొందరు తుమ్మెదలు- కొందరు పక్షివిశేష
ములు- కొందరు గొప్పఅడవిలో ఉండువారు- కొందరు గొప్ప సంప
దలో మునిగినవారు- కొందరు స్వర్గవాసులు- కొందరు నరకవాసులు-
కొందరు నక్షత్రమండలవాసులు- కొందరు చెట్లతొర్రలోని పురుగులు-
కొందరు వాయురూపులు- కొందరు ఆకాశాంధకారంలో ఉండువారు-
కొందరు సూర్యకిరణములలో ఉండువారు- కొందరు చంద్రకిరణములలో
ఉండువారు- కొందరు తృణాదులయొక్క రసాస్వాదలంపటులు-
కొందరు జీవన్ముక్తులు- కొందరు పుణ్యలోకనివాసులు- కొందరు
విదేహముక్తులు- కొందరు ముందుచాలకాలానికి ముక్తినిపొందబోవు
వారు- కొందరు భోగలంపటులై ముక్తిని ద్వేషించేవారు. కొందరు
దిగ్రూపులు- కొందరు నదీరూపులు- కొందరు మనోహారిణులయిన
స్త్రీలు- కొందరు షండులు- కొందరు వివేకవంతులు- కొందరు అతి

జనులు- కొందరు జ్ఞానోపదేష్టలు- కొందరు సమాధినిష్ఠులు- వీరందరూ వారివారి జన్మాంతరవాసనలవల్లనే సంసారబంధంలో పడ్డారు- కొందరు భూలోకంలో తిరుగుచున్నారు- కొందరు నరకంలో పడుచున్నారు- కొందరు స్వర్గాన్ని అధిష్ఠించుచున్నారు- కొందరు యమధర్మరాజుచే చేతిలో బంతిని ఎగరగొట్టినట్లు కొట్టబడుచున్నారు- కొందరు ఆశాపాశశతములచే బద్ధులైవాసనానుగుణమయిన భావిదేహములను ధరించుచున్నారు- ఇలా అనంతములయిన విషయములందు, అంతులేని సంకల్పాలను కల్పిస్తూ మాయ అనేది ప్రపంచరూపమయిన ఇంద్రజాలాన్ని విస్తరింపచేస్తోంది. ఆత్మజ్ఞానంకలిగేటంతవరకు మూఢులగు జీవులు ఈసంసారంలో నీటిలో సుడిగుండాలవలె తిరుగుచునే ఉంటారు. ఆత్మజ్ఞానంకలిగిన తరువాత అసద్రూపమయిన ప్రపంచాన్ని విడిచి సత్యమయిన చైతన్యాన్నిపొంది. కాలక్రమంచేతముక్తులై మళ్ళీపుట్టరు. కొందరు వివేకవంతులై కూడా అనేకవేలజన్మలను ఎత్తికూడా మళ్ళీసంసారసంకటములో పడుతూఉంటారు- కొందరు నహుషాదులవలె దేవేంద్రపదవిని పొందకూడా తుచ్ఛబుద్ధితో అధఃపతనాన్ని చెందుతారు- కొందరు సనకాదులు మహానుభావులు ఒకేజన్మతో ముక్తిని పొందుతారు- కొందరు జీవులు ఇతరబ్రహ్మాండములలో ఐందవులవలె బ్రహ్మలు అవుతారు- మరికొందరు శివులవుతారు- కొందరు విష్ణువులవుతారు- కొందరు తిర్యగాదిజన్మలను పొందుతారు- కొందరు ఇంద్రత్వాన్ని పొందుతారు- కొందరు సర్పములవుతారు- కొందరు ఏనుగులవుతారు- రామా! ఈబ్రహ్మాండంలో జీవరాసులెట్లో ఇతర బ్రహ్మాండాలలో కూడా అలాగే నానారకాలుగా ఉంటారు. ప్రతిబ్రహ్మాండంలోనూ జీవులయొక్క గతి కర్మవైచిత్ర్యంవల్ల విచిత్రంగా ఉంటుంది. ప్రతి బ్రహ్మాండంలోనూ సన్నివేశంలో మార్పేతప్ప వ్యవహారంలో ఏమాత్రం మార్పు ఉండదు. తమతమ సాత్త్విక రాజస తామసాది స్వభావ విశేషంచేతనే సృష్టులు మారుతూ ఉంటాయి- రజోగుణము ఆవిర్భ

మగు మిథ్యాభూతమయిన బీజభావము ఉన్నది. దానివల్లనే వారు సృష్టి సృష్టిలో జన్మమెత్తుతున్నారు. ఈవిషయం నేను విశేషించి చెప్పకున్నా నీవు ఊహించుకోవచ్చు. నన్నడుగ తగినంతపనిలేదు ఈ విషయంలో-

రామా! ఇది నేనిదివరకే చెప్పియుంటినికదా! ఏల గ్రహించలేకున్నావు? నీబుద్ధిప్రతిభ అంతా ఏమయింది? పూర్వాపర సంబంధమును విచారించగలవాడవే- ఈ కనిపించే స్థావరజంగమ ప్రపంచం అంతా ఆభాసమాత్రము. (వివర్తమాత్రము) స్వప్నతుల్యము. చిరకాలం ఉంటుందికదా! అని అంటావేమో! ఇది దీర్ఘస్వప్నం. మిథ్యా-ద్విచంద్రాదిభ్రాంతివంటిది. ఇది అజ్ఞానులకు గోచరిస్తుందికాని, జ్ఞానులకు గోచరించదు. అజ్ఞాననిద్ర తీరినవాడు సంసార స్వప్నాన్ని చూడడు. ఆ నిద్రలో ఉన్నంతవరకే యీ స్వప్నం వస్తుంది. అజ్ఞానావృతులయిన జీవులందు మోక్షపదము ప్రాప్తించునవరకు సంసారము సూక్ష్మరూపంలో ఉంటుంది- నీటిలో ఆవర్తము (సుడి), బీజమునందు అంకురమూ, (విత్తులో మొక్క) మొక్కలో చిగురూ, చిగురులో పువ్వూ, పువ్వులో పండూ, ఉన్నట్లుగానే, అజ్ఞానావృతులయిన జీవులలో సంసారం ఉంది. మనస్సు బహురూపమయినది. (నానారూపములుగలది.) అందులో దేహముయొక్క రూపముకూడ వాసనారూపంలో ఉండుట సంభవము. అయితే అనేక దేహవాసనలు మనస్సులో ఉండునుకదా! అన్ని దేహములూ ఒకేమారు ఎందుకు పుట్టుటలేదు? అని నీకు సందేహం కలుగవచ్చును. విను సమాధానం. అనేక దేహవాసనలు మనస్సులో ఉన్నా ఏదో ఒక దేహవాసనే పరిపక్వమయిన కర్మలలో అభివ్యక్తమవుతుంది. ఆదేహమే క్రమంగా సమయంవచ్చినప్పుడు పుట్టుతుంది- అన్ని దేహవాసనలూ ఒకేమారు అభివ్యక్తంకావు. అన్నీ ఒకేసారి పుట్టవు. మట్టికుండఅయినట్లు మనస్సే దేహం అవుతుంది. ఉత్తమకర్మ పరిపక్వమయితే ఉత్తమదేహం తయారవుతుంది. సృష్టి ప్రారంభంలో ఒకా

నోగి జీవుడికి ఉత్తమకర్మ పరిపక్వం అయ్యేసరికి విష్ణునాభికమలంనుంచి పుట్టిన చతుర్ముఖ బ్రహ్మగారి శరీరం తయారయింది- అక్కడనుంచి ఆయనగారి సంకల్పంచేత ఈసృష్టి అంతా అంతులేకుండా పెరిగి పోయింది. ఘనమయిన మాయచే చిల్లరమాయా ప్రపంచమువలె, అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరాముడు ఈసమాధాన వచనములు విని, స్వామీ! జీవుడు మనోరూపుడై, (సూక్ష్మశరీరాభిమానియై) హిరణ్యగర్భుడు ఎలా అయ్యాడో వివరంగా చెప్పమన్నాడు.

వసిష్ఠులు జవాబు చెపుతారు- రామా! చతుర్ముఖబ్రహ్మగారి శరీరం ఎలావచ్చిందో క్రమంగా చెబుతావిను- దీనివల్లనే నీకుజగత్తు యొక్క పరిస్థితి అంతా తెలుస్తుంది- దేశకాలాది పరిచ్ఛేదరహిత మయిన ఆత్మతత్త్వము తన శక్తివలన (మాయవలన) లీలామాత్రంచేత దిక్కాలకలితమయిన శరీరాన్ని ధరిస్తుంది. (గ్రహిస్తుంది) వెంటనే వాసనావిశిష్టమయిన జీవపర్యాయముగు మనస్సుగా తయారవుతుంది అది. దీనికి చాంచల్యము స్వతస్సిద్ధము- ఎన్నిటినయినా లేనివాటిని కల్పించగలదు. అందుచేత ఇది ఆపనికితయారై (కల్పనకు తయారై) క్షణంలో ఆకాశభావనచే అతినిర్మలమయిన శబ్దతన్మాత్రకు బీజమయిన శ్రోత్రేంద్రియమునకు అభిముఖమయిన ఆకాశభూతాన్ని కలిపి తరువాత ఆ ఆకాశభావనతో గట్టిపడిన మనస్సు స్పర్శతన్మాత్రకు బీజమయి, త్వగింద్రియమునకు ఉన్ముఖమయిన గాలిని కల్పిస్తుంది- పిదప శబ్ద స్పర్శతన్మాత్రరూపములయిన ఆకాశవాయువులచే సంఘాతము చెందిన (ఘనీభవించిన) ఆమనస్సువల్ల అగ్నిభూతము పుట్టించింది. ఈమూటి వల్ల దృఢపడి రసతన్మాత్రనుపొంది జలమనబడుతుంది. ఈనాల్గింటివల్ల దృఢపడి గంధతన్మాత్రను పొంది పృధివిఅనబడుతుంది. ఇట్లు భూత తన్మాత్రల అయిదింటితో మిళితమై సూక్ష్మ స్వరూపాన్ని విడిచి (అనగా తన్మాత్రరూపాన్ని విడిచి) లింగశరీరమనే పుర్యష్టకం అవుతుంది. పుర్యష్టక మనగా,

శ్లో॥ కర్మజ్ఞానేంద్రియగణౌ భూతప్రాణమనోగణాః ।
అవిద్యాకామకర్మాణి లింగైః పుర్యష్టకం విదుః ॥

అని అన్నారు. అనగా,

1) కర్మేంద్రియాలు
2) జ్ఞానేంద్రియాలు
3) పంచమహాభూతములు
4) ప్రాణాదిపంచవాయువులు
5) మనోబుద్ధిచిత్తాహంకారములు
6) అవిద్య
7) కామము
8) కర్మ

ఈ ఎనిమిది పుర్యష్టకమని చెప్పబడుతోంది- ఈ లింగదేహమే పంచీకరణముచేత ఘనీభవించి స్థూలదేహం అవుతోంది-ఇలా ఆ మనోరూపుడగు పురుషుడే ఊర్ధ్వాధో మధ్యభాగములను బ్రహ్మాండమును వ్యాపించి బ్రహ్మ (హిరణ్యగర్భు)డగుచున్నాడు- పూర్వసృష్టిలో ఆకాశాదిక్రమంగా ఆవిర్భవించిన హిరణ్యగర్భుని, అహంగ్రహోపాసన చేసి ఆసంస్కారంగల మనస్సే ప్రళయకాలంలో అవ్యాకృతమందు లీనమయియుండి, మరల అదేక్రమంలో తనయొక్క ఆవిర్భావాన్ని (పుట్టుకను) కల్పించుకొంటూ ఉంది. ఇలా హిరణ్యగర్భుడు వాసనా వశంచేత వ్యాపించిన అవయవములుకలవాడై బ్రహ్మాండభరితమయిన శరీరాన్ని పొందుతున్నాడు- ఇతడికి నాలుగు విషయములు స్వతస్సిద్ధములు- 1. నిరుపమానమయినజ్ఞానము, 2. నిరుపమానమయిన వైరాగ్యము, 3. నిరుపమానమయిన ఐశ్వర్యము, 4. నిరుపమానమయిన ధర్మము (పుణ్యము) ఈనాలుగూ ఇతనికి వంటబుట్టినవి. ఇతడు కరిగిన మేలిమి బంగారమువలె మెరయువాడు- పరమాకాశమందు బ్రహ్మయందు అపరరూపంతో (మారురూపంతో) ఉంటాడు- ఇతడెంతవరకు

బ్రహ్మతత్త్వంలో వ్యావహారికసత్తలో ఉంటాడో, అంతవరకు ఆత్మ శక్తి వల్ల అజ్ఞానమే వ్యావహారికసత్తలో పంచీకృతస్థూలాకాశ రూపంలో ప్రపంచాన్ని సృష్టిస్తుంది. ఒకానొకప్పుడు అంతులేని కేవల ఆకాశమాత్రమునే కల్పించును. మరొకప్పుడు దైనందిన ప్రళయకాల మందు అనాదియైన నిర్మలోదకమును మాత్రమే కల్పించును. ఇంకొ కప్పుడు కల్పాంతదాహకాలమందు కాలాగ్నిజ్వాలాభాస్వరమండలాన్ని సృష్టిస్తుంది. మరొకప్పుడు పృథివీసృష్టి జరిగిన తరువాత నేలఅంతా వృక్షవ్యాప్తమునయినదానినిగ కల్పిస్తుంది. ఇంకొకప్పుడు పాద్మకల్పము నందు ప్రపంచంఅంతా శ్యామవర్ణముగల విష్ణుమూర్తియొక్క నాభి కమలమునందు పుట్టిన కమలకుట్మలముగ (పద్మపుమొగ్గగ) కల్పిస్తుంది. ఇంకా ఇతరములయిన అనేకరకముల లోకాలను, అనేకరకముల సము ద్రాలనూ అనేకరకముల రూపములుగల జనులనూ, కల్పిస్తూ విష్ణ్వాది రూపంతో పరిపాలనాకృత్యం కూడా ఇతడే (హిరణ్యగర్భుడే) చేస్తూ ఉంటాడు. అన్ని బ్రహ్మాండములూ, ఆ బ్రహ్మాండములందభిమానము గల బ్రహ్మలూ (హిరణ్యగర్భులూ) దేశకాలానవచ్ఛిన్నమయిన బ్రహ్మపదమునుంచిగదా పుట్టినందున ఆ బ్రహ్మతత్త్వము యొక్క దృష్టిలో చూస్తే ఈ హిరణ్యగర్భులు ఒకరుముందు ఇంకొకరు వారి తరువాత అనే పౌర్వాపర్యములేదు. కనుక ఎక్కడో ఒకచోటనుంచి మొదటగా సృష్టికర్త బ్రహ్మ మొదటివాడని చెప్పవచ్చును. అలాగే వసిష్ఠులు యిచట ఉపదేశించారు.

ఈ హిరణ్యగర్భుడు ఎప్పుడు బ్రహ్మపదమునుండి మొదట పుట్టాడో అదిమొదలుకొని ఇతడు అజ్ఞానంచేత ఈ బ్రహ్మాండగర్భంలో పడి ప్రాకృతమయిన వాస్తవరూపమును, దేహవ్యవహారాదులనూ మరచిపోతాడు. ఇదే ఇతనికి సుషుప్తము. ఈ బ్రహ్మాండగర్భంలో నిద్రపోయిందా తనశుద్ధచిద్రూపాన్ని తెలిసికొంటాడు. ఇలాంటి జాగ్ర త్స్వప్నాలు ఇతనికి ప్రతిదినమూ జరుగుతూ ఉంటాయి. ఇలాగే

ఎప్పటికప్పుడు గర్భనిద్రనుండి మేలుకోగానే ప్రాణాపానాది ప్రవాహ ములతో కూడుకొని పంచభూతములయొక్క స్వచ్ఛభాగములతో తయారయి రోమకోటులతో నిండి, ముప్పదిరెండు దంతములు గలిగి మూడుప్రధానమయిన ఎముకలుకలిగి, పంచప్రాణములుకలిగి, క్రింది భాగమున పాదములుకలిగి, పాణి, పాద, శిరో, వక్షః, కుక్షులనే, అయిదు భాగములుకలిగి, తొమ్మిది ద్వారములు కలిగి, చర్మముతో గట్టిపడి, ఇరువది వ్రేళ్లుకలిగి, ఇరువదిగోళ్ళతో లాంఛితమై, రెండుబాహు వులూ, రెండు నేత్రములూ, ఒక్కొకప్పుడు, అనేకనేత్రములూ, అనేక భుజములూకలిగి, చిత్తమనే పక్షికి గూడయి, మన్మథుడనేభోగికి ఆధారమై తృష్ణఅనే పిశాచికి నిలయమై, జీవుడనే సింహానికి గుహయై అభిమానమనే ఏనుగునకు ఆలానమై (కట్టుకొయ్యయై) మానసమనే పద్మముతో శోభిస్తూ మనోహరమయిన తన శరీరాన్ని చూచుకొని, ఇలా ఆలోచిస్తాడు, ఆహిరణ్యగర్భుడు— "నేను పుట్టకపూర్వం అపార మయిన ఈఆకాశమహారంలో మొట్టమొదట ఏముండేది ?" అని— ఆలోచించి, ఆత్మదృష్టికలవాడై గడచిన ప్రపంచసృష్టులను తెలిసి కొంటాడు. సకల ధర్మాధర్మములనూ స్మరిస్తాడు. వేదములను అర్థ జ్ఞానంతోసహా చేపట్టుకొంటాడు. అతిసులువుగా ప్రజాసృష్టి ప్రారం భిస్తాడు. వీరికి స్వర్గాపవర్గములూ, ధర్మకామార్థములూ సిద్ధించడానికి అనంతములయిన శాస్త్రములను కల్పిస్తాడు. రామా ! ఈ ప్రపంచ సృష్టి అంతా ఇలా విరించి రూపమయిన మనస్సునుంచి తయారయింది. పుష్పముల శోభ వసంతఋతువువల్ల తయారయినట్లు— అని అన్నారు వసిష్ఠులు.

### ౮౨. ప్రపంచము అసత్తని (మిథ్యఅని) నిరూపించుట.

మరియు— శ్రీరామా ! ఈ ప్రపంచం ఎంతస్థిరంగా కనిపించు చున్నా ఏమాత్రము స్థైర్యములేనిదే ఇది. కేవలము మనోవిలాస

లేకపోతే లేనివస్తువునందు కోరికఉండరాదు. ఉన్నవస్తువును విడిచి, లేనివస్తువును ఆశ్రయించువాడు పురుషార్థభ్రష్టుడవుతాడు–

కనుక రామా! ఈ ప్రపంచం రజ్జుసర్పభ్రాంతివంటిది. నీటిలో కదలాడే చంద్రప్రతిబింబముల వంటిది. దీనికి మూఢులు మోసపోతారు. కాని నీబోటి తత్త్వజ్ఞులు మోసపోరు– శబ్దస్పర్శాది గుణసంఘాతమయిన దేహము తానని భావించి సుఖించదలచువాడు వహ్నిభావనతో శీతబాధను తొలగించుకోదలచువాడే అగును. కాబట్టి రామా! ఈ ప్రపంచం నశిస్తే నశించేది ఏదీలేదు– ఇది ఉంటే ఉండేది ఏదీలేదు– మనఃకల్పితమయిన పట్టణము నశించిపోతే పోయిననేమి అదివృద్ధిగా ఉంటే ఉన్నదేమి? ఇది ఒక మహానాటకం. ఇంద్రజాలకల్పితమయిన జలంనశిస్తే నశించిందేమీలేదు. అలాగే ఈసంసారంలో ఏది భ్రష్టమయినా, ఏదనష్టమయినా చెడినదేమీలేదు. కనుక రామా! ఈ సంసారంలో హర్షవిషాదాలకు తావు యేమాత్రంలేదు. బొత్తిగా లేనిదానికి నాశమేమిటి? నాశంలేకపోతే దుఃఖానికి ప్రసక్తియేది! ఏది ఎల్లప్పుడు ఉంటుందో దానికి నాశమెక్కడిది? కాబట్టి పరిదృశ్యమాన ప్రపంచమంతా బ్రహ్మమే. ఇంక సుఖదుఃఖములకు తావేది? బొత్తిగాలేనిదానికి వృద్ధియెక్కడిది? వృద్ధిలేనప్పుడు సంతోషానికి ప్రసక్తియేది? అసత్యమయిన ఈప్రపంచంలో ఉపాదేయం గ్రహింపతగినదేది? అంతట పరమార్థసత్యబ్రహ్మమయముగు నీ త్రిభువనమునందు హేయమేది? ఇంక ప్రాజ్ఞులు దేనినిగ్రహించాలి? దేనినిత్యజించాలి? ఆద్యంతములలో ఏదిలేదో అది వర్తమానంలో కూడా లేనిదే. ఆద్యంతములలో ఏది సత్యంగాఉన్నదో అది వర్తమానంలో సత్యంగా ఉన్నదే. పసిపిల్లలు (మూఢులు) నీటిలోని చంద్రబింబాన్ని చూచి చంద్రుడనుకుంటారు వివేకవంతులు అలాఅనుకోరు. బాలుడే ప్రయోజనంలేని వస్తువులతో సంతోషించతలుస్తాడు. తుదకు అంతులేని దుఃఖాన్ని పొందుతాడు కనుక రామా! నీవు బాలుడవు కావు. ప్రపంచం అస్థిరమని గ్రహించి నిత్యము స్థిరము అయిన ఆత్మతత్త్వాన్ని

ఆశ్రయించు. రామా! అహంకారయుక్తము బున ఈ ప్రపంచమంతా అసత్తని తలంచి పుత్రమిత్ర ధనాదులు నశిస్తే నీవు దుఃఖింపకు. ప్రపంచమంతా సద్రూపపరమాత్మతత్త్వంతో సద్రూపము నిశ్చయము కలిగిన నీకు జన్మజరామరణాది దుఃఖములు లేకుండుగాక.

ఇట్లు వసిష్ఠుడు చెప్పుచుండగా పగటికాలము గడచింది. సూర్యుడస్తమించాడు. సాయంకృత్యా మనుష్ఠించుటకు సమయమాసన్నమయింది. మునికి నమస్కరించి సభ స్నానాదికృత్యములకు వెళ్ళింది. మరల ప్రాతఃకాలంలో సూర్యోదయంతో సహా మరల సభ సమావేశమయింది.

ఇట్లు తొమ్మిదవరోజు ప్రసంగము ముగిసినది.

## ౭౮. జీవన్ముక్తుల గుణవర్ణనము.

మరీ, రామా! ఈ పరిస్థితిలో ధనద్రవ్యాలూ, దారాపుత్రాదులూ, ఎంత రమ్యంగా ఉన్నా సంతోషించడానికి ప్రసక్తి యేది? క్షణకాలం ఇంద్రజాలంలో చూచింది నశిస్తే దుఃఖమెందుకు? గంధర్వనగరం దుమ్ముకొట్టుకుంటేనేమి? అలంకరిస్తేనేమి? అవిద్యాకల్పితములయిన సుతాదులందు సుఖదుఃఖాదుల ప్రసక్తి యేది? ధనదారాదులు సమృద్ధంగా ఉన్నారని ఆనందించటానికి తావేది? ఎండమావుల నీరు ఎంతసమృద్ధంగా ఉన్నా దాహంగలవారికి ఆనందం లేదుకదా! ధనదారాదులు వృద్ధిలో ఉన్నకొద్దీ దుఃఖం తగును కాని సంతోషం తగదు. అవివేకం పెరిగి బాగుపడ్డవాడెవడు లోకంలో? సాంసారికభోగాలు పెరిగినకొద్దీ అనురాగం పెరుగుతుంది మూఢులకు- విరాగం పెరుగుతుంది ప్రాజ్ఞులకు- నాశస్వభావముగల ధనదారాదులను చూచి సంతోషించతగిన ప్రసక్తి యేది? వాని చివరిస్థితిని చూచి సజ్జనులు వైరాగ్యాన్నే పొందారు. కనుక రామచంద్రా! పోయినదానిని గురించి ఉపేక్షవహించు. వచ్చినదానినే ఉపయోగించుకో. సంసారము పార

ఉన్నా వ్యక్తిత్వంలో దేహభావంతో ఉన్నాసరే— రామా! నీచిత్తము ను వివేకపడవే ముక్తి పదవికోరకు వాసనాబృందమునుంచి వేరుపాగు. అనగా వాసనారహితం చేయుము. సంసారమనేది సముద్రం. వాసనలు అందులో నీరు. ప్రజ్ఞ అనే నావను అధిష్ఠించిన వారే దీనిని తరిస్తారు. ప్రజ్ఞారహితులు తరంగాలలో మునిగిపోవలసిందే. వివేకవైరాగ్యాలచే నీబుద్ధిని తీక్ష్ణంచేసికొని, ఆత్మతత్త్వం విచారించుకొని, స్వస్వరూపాన్ని పొందు. ఆత్మజ్ఞానులగు తత్త్వవేత్తలు మాదిరి వ్యవహరించు మూర్ఖులవలె విహరించవద్దు. నిత్యతృప్తులూ, జీవన్ముక్తులూ అగు మహాత్ములను ఆదర్శపురుషులనుగా చూచుకో. ఆచరణలో— భోగలాలసులయిన మూర్ఖుల నడవడిని అనుసరించకు. బ్రహ్మతత్త్వాన్ని జగత్తత్త్వాన్ని తెలిసినవారు లోకవ్యవహారాన్ని విడువరు— కావలెననుకోరరు— వ్యవహారకాండను ఆచరిస్తూనే ఉంటారు— లోకంలో విద్యాతపఃపరాక్రమాదుల గొప్పతనంలో కార్పణ్యంకద్దు— దయాదాక్షిణ్యాదులశీలాదులలో కార్పణ్యంకద్దు— ఐశ్వర్యంలో కార్పణ్యంకద్దు— తత్త్వవేత్తలకు ఇలాంటి వాటిలో కార్పణ్యంలేదు— ఇవన్ని మిథ్యఅని వాళ్ళకు స్పష్టంగా తెలుసు— ఇలాంటి మహాత్ములు సర్వమూ నశించినా శోకపడరు. స్వర్గాదిసమృద్ధమయిన నందనవనాదులందు ఆసక్తులు కారు శాస్త్రమర్యాదను విడిచిపెట్టరు— సాధనసన్నద్ధులై శరీరమనే రథమందు స్వచ్ఛంగా విహరిస్తూ ఉంటారు. కాబట్టి రామా! నీవు కూడా వివేకాన్ని పొందదలచినావు కనుక, ఈ ప్రజ్ఞాబలంతో స్వధర్మపరుడవై అభిమానరహితుడవై మాత్సర్యమునువదలి భూలోకంలో విహరించు— మోక్షసిద్ధిని పొందగలవు— అన్నారు వసిష్ఠులు. వాల్మీకి భరద్వాజా! ఇలా నిర్మలాంతఃకరణుడగు వసిష్ఠుని యొక్క ఉపదేశం చేత శ్రీరాముడు జ్ఞానామృతపూరితాంతఃకరణుడై పూర్ణచంద్రునివలె చల్లబడ్డాడు.

## ४२. గడచిన బ్రహ్మాండములను వర్ణించుట.

వాల్మీకి - భరద్వాజా - శ్రీరాముడు జీవన్ముక్తుల గుణవర్ణన విని ఇలాఅడిగాడు.

శ్రీరా॥ మహాత్మా ! వేదవేదాంతపారగా ! అతిమృదులములూ, అతిపేశలములూ, అయిన మీమాటలు వినుచుంటే నాకు తనివితీరటం లేదు- మీరు లోగడ రజోగుణప్రధానమయిన జీవజాతినీ సత్వగుణ ప్రధానమయిన జీవజాతినీ వర్ణించి చెప్పేటప్పుడు కమలజన్ముని(హిరణ్యగర్భుని) పుట్టుకనుగూర్చి ప్రస్తావించారు. దానిని కొంచెం వివరించండి అన్నాడు.

వసి॥ రామచంద్రా ! ఇంతకుముందు లక్షమంది బ్రహ్మలు గడచారు కొన్నివేల నారాయణులూ, కొన్నివేల శంకరులూ, గడచారు. కొన్నివందల ఇంద్రాదిదేవతలు గడచారు. ఇతర బ్రహ్మాండాలలోనూ, ఈ బ్రహ్మాండంలోనూ, నానాచారవిహారములుగల సురాసురమానవాదిశరీరాలు వేలకొలది తిరుగుచున్నాయి. ఇకముందు కూడా ఎందరో బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులు పుట్టనున్నారు. ఎన్నో జీవరాసులు పుట్టనున్నవి. వీరలపుటకలు ఇంద్రజాలంలో పుట్టిన వసువుల పుటకలవలె ఉన్నవి. ఒకప్పుడు ఈశ్వరసృష్టులు మరొకప్పుడు బ్రహ్మసృష్టులు- ఇంకొకప్పుడు విష్ణుసృష్టులు- వేరొకప్పుడు మునుల సృష్టులు-ఒకప్పుడు బ్రహ్మ పద్మంనుంచి పుట్టాడు. మరొకప్పుడు నీటిలో పుట్టాడు ఇంకొకప్పుడు అండమునుండి పుట్టాడు వేరొకప్పుడు ఆకాశము నుంచి పుట్టాడు. పాద్మకల్పంలో పద్మజుడని పేరు ఇతనికి. నీటిలో పుట్టినపుడు ఆపముడని పేరు- అండమునందు పుట్టినపుడు అండోద్భవుడనీ, ఆకాసమునందు పుట్టినపుడు ఆకాశసంభవుడని పేర్లు- ఒకానొక బ్రహ్మాండంలో ఈశ్వరుడే సర్వాధికారి. మరొక బ్రహ్మాండంలో పుండరీకాక్షుడు- (విష్ణువు) ఇంకొక బ్రహ్మాండంలో ఇంద్రుడు. ఒకానొక

ఈశ్వరునినుంచి కలుగుచున్నవను జ్ఞానము కలుగును. పరమార్థంలో తత్త్వవేత్తలకూ, అజ్ఞానులకూకూడ ఇవి భిన్నములుగావు.

ఒకానొకపుడు ఒక కల్పంలో ఆకాశము మొదట స్థిరపడి (పంచీకృతమయి గట్టిపడినదిగా) ఉంటుంది. అట్టి ఆకాశంవల్ల పుట్టిన బ్రహ్మ (ప్రజాపతి) వ్యోమజుడగుచున్నాడు. అలాగే మరొకకల్పంలో వాయువు స్థూలమై స్థిరపడి ఉంటుంది. దానివల్లపుట్టిన బ్రహ్మ వాయుజుడు. ఇలాగే ఇంకొకపుడు తేజస్సు (అగ్ని) దానివల్ల బుట్టిన బ్రహ్మ తైజసుడు— ఇలాగే నీరు. దీనివల్ల బుట్టిన బ్రహ్మ వారిజుడు— ఇలాగే ఒకకల్పంలో మొదట పృథివి స్థూలమై ఉంటుంది, దీనివల్ల బుట్టిన బ్రహ్మ పార్థివుడు. ఈపార్థివభాగము మిగిలిన నాలుగు భూతముల భాగములతో కలసి తాను తిరోభూతముగ నుండి యెప్పుడు వృద్ధి నొందునో అప్పుడు దానివల్ల (ఆపృథివివల్ల) బుట్టిన బ్రహ్మ తదుత్తర కాలంలోని సృష్ట్యాదిక్రియను చేస్తాడు.

అయితే అన్నివస్తువులూ పంచభూతకార్యములేకనుక పంచాత్మకములగుచుండ ఈపంచభూతముల వలన పుట్టిన ప్రజాపతి ఒక్కొక భూతమువల్ల పుట్టినవాడుగా చెప్పుట ఎలా పొసగుననని సందేహం కలుగుతుంది. కాని ప్రజాపతి ఒక్కొక కల్పంలో తాను వెనుక చేసిన ఉపాసనాస్వభావంచేత అకస్మాత్తుగా ఒక్కొక్కభూతము యొక్క భాగము అధికముగా కలదానియందు పుడతాడు. అందువల్ల ఆఉపాధి లోని భూతముయొక్క విశేషభాగమునుబట్టి ఆపవుడనీ, తైజసుడనీ, వాయుజుడనీ, పేర్లు వచ్చినవని.

ఒకానొకపుడు ఈ ప్రజాపతియొక్క నోటినుండి శబ్దము (నామరూపాత్మకమగు జగత్తు) పుడుతుంది. మరొకపుడు అతని కాలినుండి ఇంకొకపుడు అతని పురోభాగమునుండి, వేరొకపుడు అతని నేత్రము నుండి ఇంకొకపుడు చేతులనుండియు సృష్టి ప్రారంభం అవుతుంది.

ఒకానొకపుడు ఈపురుషుని నాభియందు పద్మం పుటుతుంది. ఈపద్మం లో బ్రహ్మ పుటతాడు. ఇతనికే పద్మజుడనిపేరు.

అయితే- ఆనారాయణుడనే పురుషుడు సద్రూపుడై ఉండగా అతని నాభిలో పద్మం పుట్టటంకాని, అందులో బ్రహ్మపుట్టటంగాని విరుద్ధంకదా అని అడుగుతావేమో ? ఇదంతా మాయ- స్వప్నం (కల) భ్రాంతి- మిధ్య- మనోరాజ్యం- సద్రూపుడయిన పురుషునియొక్క- నాభికమలంలో బ్రహ్మపుట్టడమే నీకు అసంభవంగాతోస్తే, అసంగా ద్వితీయచిన్మాత్ర బ్రహ్మయందు జగద్రూపమయిన ద్వితీయవస్తువు పుట్టటం ఎలాసంభవిస్తుంది ? చెప్పు ? కాబట్టి నీప్రశ్న పిల్లవాళ్ళ ప్రశ్న వలె ఉన్నది. ఎక్కడనయినా పిల్లవాళ్లు మనోరాజ్యాన్ని గురించి ప్రశ్నించడం సంభవమేనా !

ఒకానొకపుడు స్వచ్ఛమయిన ఆకాశంలో శ్రీమన్నారాయణ మూర్తియొక్క- మనస్సంకల్పం చేత సువర్ణమయమయిన అండం తయా రవుతుంది. దానిలోనుంచి హిరణ్యగర్భుడు పుటతాడు. ఇంకొకపుడు ఈపురుషుడు నీటిలో వీర్యమును విడిచిపెడతాడు. దానినుంచి బ్రహ్మాండం పుట్టుతుంది. ఆ అండంనుంచి బ్రహ్మపుడతాడు. పూర్వకల్పంలోని సూర్యుడే బ్రహ్మ అవుతాడు మరొకపుడు. ఇంకొకపుడు వరుణుడు బ్రహ్మ అవుతాడు. కాబట్టి రామా ! ఈహిరణ్యగర్భుని ఉత్పత్తులు చాలా చిత్రవిచిత్రములు- నీకు నిదర్శనార్థమై ఒక్క- ప్రజాపతియొక్క- ఉత్పత్తిమాత్రమే చెప్పాను. స్థాలీపులాకన్యాయంగా ఇందులో ఒక క్రమంగాని, నియమంకాని లేదు. కనుక ఈప్రపంచం మనోవిలాసమని సిద్ధాంతం- నీకీవిషయం బోధపడుటకే సృష్టిక్రమం చెప్పాను- లోగడ సాత్విక రాజస జీవజాతుల సృష్టిక్రమంకూడా నీకు నిదర్శనం కొరకే చెప్పాను. అవికూడా ఇలా బ్రహ్మగారివలె వచ్చినవని తెలుపుటయే నా తాత్పర్యము.

ఇలా మాటిమాటికి సృష్టి మాటిమాటికి నాశము, మాటిమాటికి సుఖము, మాటిమాటికి దుఃఖము, అజ్ఞానులు, జ్ఞానులు, బంధమోక్ష

దృష్టులు, వర్తమాన ఇష్టవస్తువులందు, భావి ఇష్టవస్తువులంగా, గడచిన ఇష్టవస్తువులందును స్నేహము, ఇవన్నీ మాటిమాటికి జరుగుతూనే ఉంటాయి.

లోకంలో వెలుతురుకొరకు దీపాలను వెలిగిస్తారు. అవి కొంత కాలం వెలిగి చమురు అయిపోగానే ఆరిపోతాయి. మళ్ళీ చమురుపోసి వెలిగిస్తారు అక్కరపడ్డప్పుడు వెలుగుతాయి కొంతసేపు. మళ్ళీ ఆరిపోతాయి- ఇలాగే బ్రహ్మాండాధిపతులయిన బ్రహ్మలబండారం కూడా- వీరు ఎక్కువ కాలం (అనగా ద్విపరార్థావసానకాలం) ఉంటారు- దీపాలు కొద్దికాలం ఉంటాయి- ఈ రెంటికి ఇంతే కాలభేదమే తేడా తప్ప చావటం,పుట్టడంలో తేడాసమి ఉంది? చెప్పరామా!ఎన్నిసార్లుచూచినా కృత త్రేతా ద్వాపర కలియుగాలు చక్రం తిరిగినట్లు తిరుగుతూ ఉండటమే తప్ప కట్టుపడటంలేదు ఎన్నటికీ. మన్వంతరాలు మళ్ళీ తిరుగుతున్నాయి- కల్పాలు తిరుగుతున్నాయి. కార్యదశలన్నీ మాటిమాటికీ దొర్లుతూనే ఉన్నాయి- ప్రాతర్మధ్యందిన సాయంతనాలు, రాత్రింబవళ్లు, మాసాలు, సంవత్సరాలు, ఘడియలు, విఘడియలు, ఇవన్నీ మాటిమాటికి వస్తూఉండేవే- పోతూఉండేవే- బాగా కాచిన అయఃపిండంలో (ఇనుపముద్దలో) అగ్నికణాలు ఉన్నట్లు ఈపదార్థాలన్నీ మాయాశక్తి స్వభావంవల్ల చిదాకాశంలో ఉన్నవే- ఆ యా చెట్లలో ఆ యా ఋతు సంబంధమయిన ఫలపుష్పాదులు కొంతకాలం అనభివ్యక్తంగా ఉంటాయి ఆ యా ఋతువు వచ్చేసరికి అభివ్యక్తం అవుతాయి. అలాగే ఈ ప్రపంచం కూడా పరతత్త్వంలో కొంతకాలం (ప్రళయంలో) అనభివ్యక్తంగా ఉండి, సృష్టి ప్రారంభం అయ్యేసరికి అభివ్యక్తం అవుతూ ఉంటుంది- జగత్తు అంతా చిత్ప్రాదము. (చిద్వివర్తము) ద్విచంద్రభ్రాంతి వంటిది- సర్వశక్తుడగు పరమాత్మయందు అసంసారస్వభావము (అనగా అసంగాద్వితీయ స్వభావము) పరమార్థమని చెప్పుచున్నవి శ్రుతులు. దీనినిబట్టి ప్రపంచం

మిథ్య అని తేలుతోంది- ఇది అధిష్ఠానచైతన్యాధ్యస్తమయిన కాలంతో కూడుకొని మోక్షంవచ్చేవరకు ఉంటుంది. ఆపైన ఉండదు. జ్ఞానుల దృష్టిలో ఈ ప్రపంచం బ్రహ్మమే- సంసారమనేది లేదు- అజ్ఞానులదృష్టిలోమాత్రం ఇది ఎల్లప్పుడూ నిత్యంగా భాసిస్తుంది మిథ్య అయినా- కనుకనే కర్మమీమాంసకులు- "నకదాచినీదృశం జగత్" అని ప్రపంచానికి ప్రవాహనిత్యత్వాన్ని చెప్పారు. కర్మకాండకు ప్రామాణ్యం చెప్పదలచిన కర్మమీమాంసకుల దృష్టిలో ఇది తగును కూడా. కనుక మీమాంసకులదృష్టిలో ప్రపంచం మిథ్యకాదు- అజ్ఞానులందరూ ఒకేరకంగా ఉండరు. అనేకరకములు ఇందులో- కనుకనే బౌద్ధుడు మొదలగువారు తమతమమతప్రక్రియను నిలుపుకొనుటకు వారువారు కల్పించుకున్న క్షణికవాదమూ, పరమాణువాదమూ, సప్తభంగీవాదమూ, మున్నగువాదములు కూడా వారి దృష్టిలో ఉపపన్నములే. (కుదురునట్టివే) దిక్కులందు అప్పుడప్పుడు మెరసిపోతూ ఉండే మెరుపులు క్షణకాలముండునవని చెప్పబడుచున్నాయి. మళ్ళీ ఇవి మాటిమాటికి వస్తూఉండేవే- అయినా అచిరకాలంలో నశించడంవల్ల క్షణికములని పేరుపొందాయి- అట్టిస్థితిలో మాటిమాటికి పుట్టినశించే జగత్తుఅంతా మిథ్య (క్షణికం) అంటేమాత్రం కుదరదా ఏమిటి?- ఇలాగే సూర్యచంద్రాదులు ఎల్లప్పుడూ దిక్కులను ప్రకాశింపచేస్తూ ఉండగా, పర్వతాలూ, భూమీ, సముద్రాలూ, స్థిరంగా కనిపిస్తూ ఉండగా ప్రపంచం సత్యమే అనుసాంఖ్యాదుల మతంమాత్రం ఎందుకు కుదరదు? కాబట్టి బ్రహ్మయందు వారువారు సంకల్పించినవన్నీ కుదురుతూనే ఉంటాయి- ఇందులో కుదరనివి యేవీలేవు- కాని నిస్సంకల్పమూ, నిస్సంగుడూ అగు బ్రహ్మయందు సంకల్పకలనాజాలమే. (సంకల్పములను కల్పించుటయే కుదరదు.

కాబట్టి రామచంద్రా! జన్మమరణాలు, సుఖదుఃఖాలు, కరణకర్మలు, పంచభూతాలు, సప్తసముద్రాలు, సప్తకులపర్వతాలు, ఇవన్నీ

ప్రతికల్పంలోనూ వస్తూ ఉండేవే- మళ్ళీ దైత్యులూ, మళ్ళీ దేవతలూ, మళ్ళీలోకాలూ, మళ్ళీస్వర్గాపవర్గేచ్ఛలూ, మళ్ళీఇంద్రుడూ, మళ్ళీ చంద్రుడూ, మళ్ళీవిష్ణువూ, మళ్ళీ సూర్యచంద్రులూ, మళ్ళీవరుణుడూ, మళ్ళీవాయువూ, ఇవన్నీమామూలే- ఏకల్పంలోనూ వీటికి మార్పు లేదు. ప్రతికల్పంలోనూ సూర్యుడు చీకటిని పోగొట్టుతూనే ఉంటాడు. చంద్రుడు వెన్నెలను ఇస్తూనే ఉంటాడు- అమృతమును స్రవిస్తూనే ఉంటాడు. ప్రతికల్పంలోనూ పుణ్యక్షయమయినవాళ్లు స్వర్గమనే ఘట్టం నుంచి క్రిందకుపడుతూనే ఉంటారు. కాబట్టి రామా! ప్రతికల్పంలోనూ సృష్టిప్రళయాలు అనేవి మామూలుగా చక్రమువలె తిరుగుతూనే ఉంటాయి- ఇది మహామాయాడంబరము. ఇందులో సత్యాసత్య నిర్ణయాలు తేలవు. అలా నిర్ణయింపతగినవీ లేవు- ఈ విషయంలో నీకు దాశూరాఖ్యాయిక అనేది ఉదాహరణంగా చెబుతాను- అని అన్నారు వసిష్ఠులు.

## ४८. దాశూరవరప్రదానవర్ణనము.

మరీ- రామా! కర్మజడులు నిజమును కానరు. భోగలంపటులు సత్యమునపేక్షించరు- వీరు భయులూ స్వపరవంచకులు- ప్రపంచ మాయను గుర్తించలేరు. జితేంద్రియులూ, ఆరూఢజ్ఞానులూ, అర చేతిలో ఉసిరిగపండువలె ప్రపంచమాయను గుర్తిస్తారు. ప్రపంచ మాయను గుర్తించిన జీవుడు అహంకారమను మాయను విడిచివేస్తాడు. పాము కుబుసమును విడిచినట్లు- అహంకారరహితుడు నిస్సంగుడే- వీడికి మళ్ళీజన్మ ఉండదు- కాలిన విత్తనానికి మొక్కపుట్టదు- ఆధివ్యాధులలో మునిగి ఇప్పుడో ఇంకకొంతసేపటికో చావనున్న శరీరానికి ఏమేమో పోషణ చేస్తారు. అజ్ఞానులు- స్థిరమయిన ఆత్మను పోషించేవాడు ఒక్కడూ లేడు. కాబట్టి నీవుకూడా అజ్ఞానివలె శరీరాన్ని పోషించకు. దీన్ని ఎంతపోషించిన నీకుదుఃఖం తప్పదు. ఆత్మ హితవును కోరు. అందుకు ప్రయత్నపడు. నీకెంతయినా సుఖముంది.

శ్రీ రా॥ అయితే స్వామీ! మీరు వెనకటిసర్గంలో వస్తుశూన్య మాయావ ఈ సంసారచక్రం దాశూరాఖ్యాయిక వంటిదని అంటిరే? ఏమిటి దాని వివరం చెప్పండి.

వశి॥ రామచంద్రా! ప్రపంచమాయను వర్ణించి చెప్పాలనే ముఖంలో నీకు దాశూరుని చరితను చెబుతున్నాను విను.

ఈ భూమండలంలో విచిత్రమయిన పూలచెట్లుగల మాగధమనే దేశము ఒకటున్నది– అది చాలా ప్రసిద్ధమయినది. ఇందులో కదంబ వనములు ఎక్కువగా ఉన్నాయి. విచిత్రమయిన పక్షులూ, నానా రకాలసస్యాలూ, వివిధమయిన పూలతోటలు. వెండు ఆ దేశంలో–

అందులో ఒకానొక కొండ చరియమీద కడిమి చెట్టు వెనక దాశూరుడను పేరుగల ఒకమహాముని తపస్సు చేసుకొంటున్నాడు.

శ్రీ రా॥ అయితే మహర్షీ! ఇంతటి మహాతపస్వి అడవిలో కడిమిచెట్టుక్రింద తపస్సు చేయుటానికి కారణం ఏమిటి?

వసి॥ రామా! "శరలోమ" అనే అతని తండ్రి కూడా ఆకొండ మీదనే ఉన్నాడు. ఇతడు చతుర్ముఖబ్రహ్మ అంతటివాడు. ఆతనికి ఈ దాశూరుడనేవాడు ఒక్కడే కొడుకు. బృహస్పతికి కచుడు ఒక్కడే కొడుకు అయినట్లు. ఈ ఒక్క కొడుకుతోనూ ఆ తండ్రి తన జీవితం అంతా ఆ అడవిలోనే గడిపాడు– ఆ "శరలోమ" అను నతడు అదే అడవిలో కొన్ని సంవత్సరాలు గడిపి తుదకు శరీరం విడచి స్వర్గలోకం చేరాడు– ఇతనితోపాటు ఈతని భార్యకూడ సహగమనం చేసింది. దాశూరుడనే కొడుకు ఒక్కడుమాత్రం మిగిలాడు. ఇతడొక్కడూ ఒంటరిగా అతిదీనంగా ఆ అడవిలో ఏడుస్తూ ఉన్నాడు– అచ్చటి వన దేవత ఇతని ఏడ్పు విని ఇతనికి కనిపించకుండా ఓదార్చటం ప్రారంభించింది ఇతన్ని ఇలా–"ఋషిపుత్ర! ఎందుకూ అజ్ఞానివి వలె ఏడ్చెదవు! ఈ ప్రపంచం అస్థిరమని తెలియదూనీకు. ఇందులో ప్రతివస్తువూ

చచ్చేదే పుట్టేదే' ఈదృశ్య ప్రపంచంలో వ్యవహారదృష్టిలో ఎవరెవ రున్నారో వారందరూ నశించవలసిందే తుదకు సృష్టికర్త అయిన బ్రహ్మకైనా నాశం తప్పదు— సూర్యుడికి అస్తమించడం ఎలా తప్పదో, పుట్టినవాడికి మరణించటంకూడా అలాగే తప్పదు (అవశ్యం భావి) కాబట్టి మీతండ్రి మరణించాడని ఏడవవద్దు" అని—

ఇలా అశరీరవాణిని విని దాశూరుడు, ధైర్యం తెచ్చుకొని, ఏడ్వడమాని లేచి తండ్రికి చేయవలసిన ఉత్తరక్రియలు చేశాడు. మళ్ళీ తపస్సు చేయుటం ప్రారంభించాడు. ఆ అడవిలో వైదిక కర్మలతో తపస్సుచేయుటం ప్రారంభించాడు. అతనికి వేదాధ్యయనమునందూ, తదర్థవిచారమునందూ, నిష్ఠ ఏర్పడింది. ఇంతేకాని ఆత్మతత్త్వం తెలియలేదు. అందువల్ల ఎంత శ్రోత్రియుడయినా, ఎంతటి పవిత్ర స్థలమయినా మనశ్శాంతి కలగలేదు అతనికి— పరిశుద్ధమయిన ప్రదేశంలో తపస్సుచేస్తూ అది అపరిశుద్ధంగా తలచాడు. ఎక్కడా అతని బుద్ధి రమించలేదు, తుదకు చెట్టుచివర పరిశుద్ధంగా ఉంటుందని సంకల్పించాడు స్వయంగా. అక్కడ తపస్సుచేయుటం ఉచితమనుకున్నాడు. అక్కడ (చెట్టుచివర) తపస్సు చేయుటం నిర్ణయించుకున్నాడు. పక్షులవలె ఉంటాననీ అనుకున్నాడు— ఇలా ఆలోచించి అగ్నిహోత్రం ప్రజ్వలింపజేసి అందులో తన మాంసంకోసి హోమం చేశాడు. (అనగా కొంతకాలం వ్రతోగ్రమయిన తపస్సు చేయగా తపస్సు వెంటనే సిద్ధించని కారణంచేత ఈహోమసాహసానికి ప్రారంభించినట్లు తోస్తుంది.)

అగ్నిహోత్రుడు దేవతలకు ఆహారం అందించే బంటుకనుక ఈ బ్రాహ్మణమాంసం దేవతలకు ఆహుతిచేయుటవల్ల వారల కుత్తుకలు మాడి పోతాయి అని భయపడి, అలా జరగకుండా చేయదలచి, ఈ దాశూరుని యెదుట చక్కగా ప్రకాశిస్తూ ప్రత్యక్షమయినాడు. ఇలా అన్నాడు అతనితో— "కుమారా! నీయిష్టమయిన వరం కోరుకో—

అది నీకు సిద్ధమయి ఉన్నట్లే భావించు. ధనికుడు తన పెట్టెలో సొమ్మును దాచుకున్నట్లే" అని చెప్పాడు అగ్ని—

ఇలా అనుచున్న ఆ అగ్నిహోత్రుని చక్క నిపూలతో పూజించి, స్తుతించుచూ, మునికుమారుడు (దాశూరుడు) ఇలా అన్నాడు— "భగవన్" చండాల శ్వమార్జారాది భూతాలతో నిండిఉన్న ఈ ధరాతలం (భూప్రదేశం) పవిత్రమయినదని నే తలచను. నాకు చెట్లచివర ఉనికి కలుగుగాక" అని— ఈమాటవిని నిఖిలదేవతలకు ముఖమయిన అగ్నిహోత్రుడు "అలాగే అగుగాక" అనిచెప్పి అంతర్థానం అయ్యాడు. ఈ మునికుమారుడు పూర్ణకాముడై సంతోషించాడు.

## ౪౯—౫౦. కదంబవర్ణనము.

పిదప ఆ అడవిలో నానాశాఖోపశాఖలతో విలసిల్లి పల్లవపుష్ప ఫలసమూహంతో విలసిల్లి వివిధపక్షిజాలంతో శోభిల్లియున్న కదంబ వృక్షాన్ని అధిష్ఠించాడు దాశూరుడు । ప్రళయకాలంలో ప్రపంచమంతా ఏకార్ణవమయినపుడు శౌరి (విష్ణుమూర్తి) ఎత్తయిన వటవృక్షాన్ని అధిష్ఠించినట్లు— దానిమీద ఆకాశం అంటిన ఒకానొక కొమ్మయొక్క చివరనున్న చిగురుటాకుమీద కూర్చుని ఏకాగ్రంగా తపస్సు చేయటం ప్రారంభించాడు. మెత్తని చిగురాకుమీద కూర్చొని క్షణకాలం వనితాకారమయిన పదిదిక్కులూ ఉత్సాహంగా చూశాడు.

## ౫౧. దాశూరుడు పుత్రునకు ఆత్మోపదేశ మొనర్చుట.

అదిమొదలుకొని అతనికి కదంబదాశూరుడను పేరువచ్చింది. ఆచిగురాకుమీదనే పద్మాసనంవేసి కూర్చొని పరమార్థమయిన ఆత్మ తత్త్వాన్ని తెలిసికొనలేక కర్మమార్గమందే మనస్సునిలిపి మానసికంగా యజ్ఞం ఒకదానినిచేశాడు. మానసికంగానే దేవతలందరిని పూజించాడు. ఇలా పదిసంవత్సరాలు గవాశ్వనరమేధాది యజ్ఞాలన్నీ చేశాడు.

కొంతకాలానికి అతనిచిత్తం నిర్మలమయింది. జన్మాంతర కృతశ్రవణ సంస్కారోద్బోధం చేత అతనిచిత్తంలో జ్ఞానం అవతరించింది. దానిచే అజ్ఞానావరణం తొలిగింది. మనస్సులోని మలినవాసనలు మరణించాయి (నశించాయి) అతడు ఒకానొకప్పుడు ఆచెట్టుమీద అతిమనోహరమైన త్రిలోకసుందరియగు వనదేవిని చూచాడు. ముఖం వంచుకొని ఉన్న ఆస్త్రీతో ఇలా అన్నాడు ఆముని— "ఉత్పలపత్రాక్షీ! నీ వెవరు? శరీరకాంతిలో మన్మథుని మించిఉన్నావు. చెలికత్తెవలెనున్న పూచిన తీగను ఆధారపరచుకొని వహిస్తున్నావు" అని— ఆచిన్నది ఇలా జవాబు చెప్పింది మునికి ! "మునిసత్తమా! లోకంలో అసాధ్యములయిన కోరికలన్నీ మహాత్ములను ప్రార్థిస్తేనే నెరవేరుతాయి. నేను ఈ అడవిలో వనదేవతను. నీవు తపస్సుచేసే కడిమిచెట్టుయొక్క తీగ నాకు నివాసము. చైత్రశుద్ధ త్రయోదశిరోజున దేవేంద్రలోకంలో నందనవనమందు మన్మథోత్సవం జరిగింది. ఆనాడు మూడులోకాలలోని వనదేవతలందరూ సమావేశమయినారు. అక్కడికి నేనుకూడా వెళ్ళాను. అక్కడికి వచ్చిన నా చెలికత్తెలందరికీ పుత్రసంతానం ఉంది. నాకొక్కతెకు మాత్రం పుత్రసంతానం లేదు. వాళ్ళను చూచేసరికి నాకు మితిలేని దుఃఖం వచ్చింది. పురుషార్థములన్నిటికీ కల్పవృక్షంవంటి నీవుండగా నేను అనాథను సంతానంలేకుండా ఏమిటీ ఈసడింపట ! నాకు పుత్రసంతానాన్ని ప్రసాదించు. లేకుంటే నాశరీరాన్ని అగ్నిహోత్రునకు ఆహుతిచేస్తాను" అని.

ఇలా అంటూఉండగా ఆమెనుచూచి నవ్వాడు ముని. తన చేతితో పుష్పం ఆమెకిచ్చాడు. ఇలా అన్నాడు— "కృశాంగీ ఇక వెళ్లు ఒక్కమాసంరోజులకు జగత్పూజ్యుడగు చక్కనికొడుకు కలుగుతాడు నీకు. కాని నీవు మదనావేశంతో వచ్చి నన్ను యాచించావు కనుక నీకు పుట్టేకొడుకు తత్త్వజ్ఞుడవుతాడు కాని, యతులవలె భోగలంపటుడు కాడు" అని చెప్పి తనకు పరిచర్య చేస్తానని ఊరట్లూరుచుండే

ఆమెను పంపివేశాడు. ఆమె తనస్థానం చేరింది. ఆముని ఒంటరిగా నిస్సహాయుడుగా నుండగా చాలాకాలం గడచింది. అంతట చాలకాలానికి ఆ ఉత్పలపత్రాక్షి పదిరెండు వత్సరముల పిల్లవానిని తీసికొని వచ్చింది ఆముని చెంతకు. నమస్కరించింది అతనికి. ఆయన ముందట కూర్చుంది. చంద్రబింబమువలె సుందరమయిన ముఖముగల ఆమునితో ఇట్లన్నది.

మహాత్మా! "ఈపిల్లవాడు మన ఉభయులకు కుమారుడు. వీనికి వేదము మొదలగు సర్వవిద్యలను నేర్పించినాను. అన్ని విద్యలలోను నిష్ణాతుడయినాడు. కాని యేజ్ఞానం కలిగితే మరల ఈ సంసారమనే చక్రంలో పడి నలిగిపోడో (బాధనొందడో) ఆ జ్ఞానము మాత్రం (అనగా బ్రహ్మవిద్యమాత్రం) ఇతనికి అబ్బలేదు (కలగలేదు)– ఆ బ్రహ్మవిద్యను మాత్రం మీరు దయుంచి ఇతనికి ఉపదేశించాలి ఇపుడు. మంచికులమువందు కన్నకొడుకుని ఏతండ్రిఅయినా మూర్ఖునిగా ఉంచుతాడా?" అని అన్నది అతన్ని.

అయితే శ్రీ, అబలా! పచ్ఛిష్యుడగు ఆ పిల్లవానిని ఇక్కడ ఉంచి నీవు వెళ్ళిపొమ్మని అనిఅన్నాడు ఆముని ఆమెతో. ఆమె ఆపిల్లవాడిని ఆమునియొద్ద ఉంచి వెళ్ళిపోయింది. ఆపిల్లవాడు ఆతండ్రిని గురువుగా భావించి శుశ్రూషచేయుచూ గట్టి నియమముతో నున్నాడు కొంతకాలం. అరుణుడు సూర్యునియొద్ద నున్నట్లు. ఆ పిల్లవాడు గురుశుశ్రూషావ్రతచర్యలతో కొంతకాలం బాధపడును బ్రహ్మజ్ఞానమునకు సాధనమయిన శ్రోత్రజన్య పరోక్షజ్ఞానమునుపొంది ఉన్నాడు కొంతకాలం. పిదప ఆతండ్రి అతనికి కొన్నివందల ఆఖ్యాయికలను కొన్నివందల ఆఖ్యానములను దృష్టాంతభూతములయిన వాటిని చూపి (బోధించి) బ్రహ్మవిద్యను బోధించెను. భారతాది ఇతిహాసములందలి కథలను (వృత్తాంతములను) కూడ చెప్పెను. ఆ పిల్లవాని మనస్సు ప్రత్యగాత్మయందు నిరూఢమై దృఢమైన వ్యుత్పత్తి కలిగేటంతవరకు దృష్టాంతరూపమయిన ఇతిహాసములతో బోధించాడు ఆముని.

## ౫౭వ సర్గ

వసి॥ రామా! నేను ఒకానొకప్పుడు దాశూర కదంబమున్న మార్గాన కైలాసలోకమందున్న మందాకినీ నదికి వెళ్ళాను స్నానమాడుటకు త్రోవలో నభఃకోటరమందున్న సప్తర్షి మండలం దాటాను. రాత్రిసమయానికి ఎత్తయిన దాశూర తరువును (వృక్షమును) చేరాను. ఆరాత్రి ఆచెట్టుయొక్క తొర్రలోనుంచి తుమ్మెదధ్వనివలె ఒక ఆఖ్యాయిక వినపడింది నాకు. ఆ ఆఖ్యాయికలోని కథ ఈసంసారానికి ఉపమానంగా ఉంది చెపుతాను విను. మహాఆశ్చర్యంగా ఉంటుంది అదినీకు.

ముల్లోకములందు ప్రసిద్ధిచెందిన పరాక్రమశాలియగు రాజు ఒకడుండేవాడట. వాని పేరు స్వోత్థుడట. అనగా "స్వాత్ = ఉత్థః" అని అతని నామధేయమునకు వ్యుత్పత్తి అంటే, అవ్యాకృతాకాశమునుండికాని, జగన్మూలస్వరూపమయిన బ్రహ్మాకాశమునుండికాని పుట్టిన వాడని అర్థము.

ఈపేరునకు ఉత్తరసర్గలోని మూలమే వ్యాఖ్యానమూ చేసి చెపుతుంది విస్పష్టమవుతుంది అప్పుడు నీకు. ఇప్పుడు ఆగొడవ అనవసరం. ఆరాజు ప్రపంచమంతటిని ఆక్రమించే సామర్థ్యం కలవాడట అతని ఆజ్ఞను బ్రహ్మేంద్రాది దేవతలు కూడా శిరసావహించేవారు. ధనికులు కిరీటమును ధరించినట్లు మహాసాహసుడట ఆరాజు మహా ఆశ్చర్యములయిన గొప్పగొప్ప పనులు చేశాడట. అతని స్వాధీనపరచుకొన్నవాడు ఎవ్వడూ లేడట. సముద్రంలో తరంగాలనయినా లెక్కించవచ్చుకాని అతనుచేసిన పనులనుమాత్రం ఎవ్వరూ లెక్కించలేడట— అతడి పరాక్రమాన్ని ఎవ్వరూ శస్త్రములచేకూడ తిరస్కరించలేకపోయారట— అగ్నిహోత్రుడు అతడి వీర్యమును తిరస్కరించ లేకపోయాడట— పిడికిలితో ఆకాశాన్ని పట్టుకోటం ఎంతటి అసాధ్యమో— అతణ్ణి ఎదిరించటం అంతటి అసాధ్యమట— అతను చేసేపనిని

హారిహరాదులూ, ఇంద్ర వరుణాదులుకూడా చేయలేరట- అతడికి ఉత్తమ మధ్యమ అధమ భేదంతో మూడు దేహాలున్నవట- ఈమూడు శరీరాలతో జగత్తుఅంతా ఆక్రమించి ఉన్నాడట. ఈ మూడు శరీరాలతో అతివిశాలమయిన ఆకాశంలోనే పుట్టాడట- అక్కడే పెరిగాడట- పక్షివలె అక్కడే తిరిగేవాడట- అదే ఆకాశంలో పెద్ద నగరం నిర్మించాడట- అందులో పదునాల్గు బాజారులు ఉన్నాయట- అందులో వనములూ, ఉపవనములూ, క్రీడాశిఖరములూ, సదనములూ, నదులూ, సముద్రాలూ మొదలయినవి అనేకం ఉన్నవట- అందులో ఆయనగారు విషయవ్యామోహులయిన సంసారులను కొందరను తయారుచేశాడట- ఇందులో కొందరను పైన ఉంచాడట- మరికొంద రను మధ్య ఉంచాడట- ఇంక కొందరను దిగువలో ఉంచాడట- ఇందులో కొందరు చాలాకాలానికి నశించేవారూ, మరికొందరు తొం దరలో నశించేవారూనట- వీర్లను కాపాడటానికి ఆరాజు మాయచే కొంతమంది రక్షకులను తయారు చేశాడట- ఆ సంసారులందరకూ అపవరకులని పేరట (అపవరకం అంటే గది- అది ఆకాశాన్ని అచ్ఛా దిస్తుంది. వీళ్లు ఆత్మాకాశాన్ని పరిచ్ఛేదపరుస్తారు కనుక వీళ్ళకు అపవరకులని పేరు). ఈ అపవరకగణాలు వ్యవహరిస్తూ ఉండగా ఆరాజు (సంకల్పరూపుడగు జీవుడు) అనేకరకాల ఆడుతూ ఉండేవాడట- ఆయనగారు అనేకవందల త్రిశరీరాలలో (మూడు శరీరాలలో) ఆ రక్ష కులతోకూడ లీలావశుడై కొంతకాలం ఉండి మళ్ళీ లేచి వెళ్లుతూ ఉండేవా డట- రామా! ఆరాజు చలచిత్తుడు అతనికి ఒకానొకపుడు నేను కట్ట బోయే పట్టణంలో ప్రవేశిస్తానని స్థిరమయిన కోరిక కలిగిందట- ఆ ఆవే గంతో వెంటనే లేచి వెళ్ళాడట- గంధర్వ నగరమువలె మిథ్యాభూత మయిన ఒకపట్టణం చేరేవాడట- అందులో లయిస్తానని కోరి లయించే వాడట- మళ్ళీపుట్టి కొంతకాలం వ్యవహరించేవాడట- ఇలా వ్యవహ రిస్తూ కొంతకాలానికి శత్రు, రోగ, దారిద్ర్యాదులచే పరిభవింపబడే వాడట- వట్టిమూఢుణ్ణి ఏంచేసేది ? దుఃఖాలన్నీ నాపాలబడ్డాయి. అని

దుఃఖించేవాడట- ఇంకొకప్పుడు బాగా ఆనందించేవాడట- మరొకప్పుడు స్వయంగా దైన్యాన్ని పొందేవాడట- రామా! మహానుభావుడు ఆరాజు పగలను తిరస్కరింపసత్తా ఉన్నప్పుడు పగలమీదకు వెళ్ళేవాడు- జయించేవాడువార్లను. సంపదలను పొందేవాడు- జాగ్రత్స్వప్నములందు ప్రకాశించేవాడు- సుషుప్తి ప్రళయ సమాధి మొదలైనందు ప్రకాశించకుండా ఉండేవాడు. అంతర్గతమయిన ఆత్మజ్యోతిస్సుచే సముద్రుని వలె మహామహిమాశాలిగా ఉండేవాడు- అని ఇలా ఒక కథ చెప్పటం ప్రారంభించాడు తండ్రి కొడుక్కి.

౫౩వ సర్గ-

ఈకథ సాంతంవిని కుమారుడు కడిమిచెట్టు చివరను ఉన్న తండ్రిని అడిగాడు ఇలా-

పు॥ నాన్నా! మీరు స్వోత్థుడనే ఒకరాజు మహాప్రసిద్ధుడున్నాడని కథ ఒకటి చెప్పడం ప్రారంభించి చెప్పారు. ఈ కథకు తాత్పర్యమేమిటి? యథాశ్రుతార్థంలో తాత్పర్యంలేదని తెలుస్తోందినాకు. మీరు వెనుక చెప్పడంలో ఆరాజు కట్టబోయే పట్టణంలో ప్రవేశిస్తానని బయలుదేరాడన్నారు- కట్టబోయే పట్టణం భవిష్యత్తు బయలుదేరడం వర్తమానం. ఈరెండూ విరుద్ధాలు ఏకకాలంలో కుదరవు- దీన్నిబట్టి యీకథకు ఏదోవేరే తాత్పర్యం ఉందని ఊహిస్తున్నాను- కాబట్టి అదేదో బయటపెట్టండి- అని అడిగాడు కొడుకు- తండ్రి (దాశూరుడు) జవాబు చెపుతాడు-

దాశూ॥ బిడ్డా! విను ఈకథకు పరమ తాత్పర్యం చెబుతాను. దీనివల్ల సంసారచక్రము యొక్కగుట్టు అంతా బయటపడుతుంది నీకు-

ఈ సంసారం పరమార్థసత్తా శూన్యమయిన (నిజస్థితిలోలేని) మాయ (అజ్ఞానం) వల్ల తయారయింది- కాబట్టి మాయామయం- ఈవిషయం నీకు బోధించడానికే చాటుగా విషయం మాటుపరచి

చెప్పానునీకు- స్వోద్భుడనగా అవ్యాకృతాకాశమునుంచి పుట్టిన సంకల్ప ప్రధానమయిన మనస్సు- ఆరాజు స్వయంగానే పుట్టి స్వయంగానే లయిస్తాడు. ఈ ప్రపంచం అంతా ఆమనోమయం- సంకల్పం ఉన్నపుడు ఉంటుంది. సంకల్పంపోతే నశిస్తుంది. బ్రహ్మ విష్ణ్వాదు లందరూ ఆ సంకల్ప పురుషునకు అవయవాలు చెట్టుకు కొమ్మలవలె పర్వతానికి శిఖరములవలె. అధిష్ఠానచైతన్యము యొక్క- అనుగ్రహంచేత ఈమనస్సు శూన్యమయిన ఆకాశంలో (అనగా బ్రహ్మయందు) ప్రపంచమనే పట్టణాన్ని కట్టింది- అదే త్రిజగత్పురం అని నేను వెనక చెప్పాను- ఈపట్టణాన్నే నేను వెనుక వర్ణించాను.

ఇందులో సూర్యచంద్రాదుల కాంతితో ప్రకాశించే లోకాలు పదునాల్గు ఉన్నాయి అన్నాను- ప్రసిద్ధ వనోపవనాలు ఉద్యానపరం పరలుగా వర్ణించాను- ప్రకాశరూపులయిన సూర్యచంద్రులు దీపాలు అన్నాను. సూర్యకిరణములచే ప్రకాశించెడి ఉత్తుంగ తరంగాలు ముత్యాలుఅనీ అవిగల నదులు ముత్యాలహారాలనీ వర్ణించాను. ఏడు దిగుడుబావులంటే ఇక్షుక్షీరాది సప్తసముద్రాలు. ఇందులో పద్మాలు అంటే బడబానలాలు. నరులంటే కర్మోపాసనాధికారులగు మానవులు. అమరులంటే దేవతలు- కిరాతులంటే కర్మాధికారబహిష్కృతులు- స్థావరతిర్యగాదులు- వీర్లలో నరులు భూమిమీద దేవతలు ఊర్ధ్వ లోకంలో కర్మబహిష్కృతులు ఆకాశంలో ఉంటారు- ఇందులో ఆర్యులకూ (నరులకూ) అమరులకూ (దేవతలకూ) ఒకరికొకరకు ఉపకారం చేసికొనుట అనే క్రయవిక్రయాల వ్యవహారం ఉంటుంది. ఆ పట్టణంలో సంకల్పమహారాజు ఆడుకోటానికి దేహోపవరకగణాలను సృష్టించాడు అంటే, కొంతమంది దేవతలను ఊర్ధ్వలోకంలో సృష్టిం చాడని మరికొంతమందిని అధోలోకంలో సృష్టించాడనీ అర్థం- ఇందులో దేవతలు చాలకాలం బ్రతుకుతారు- నరాదులు చాలాస్వల్ప కాలంలో నశిస్తారు- వీళ్ళ నెత్తిమీద వెంట్రుకలు కెల్లుగడ్డిగా వర్ణిం

చాను- వీళ్ళకు చెప్పులు, కళ్లూ, ముక్కూ మొదలయినవి తొమ్మిది ద్వారాలు అన్నాను- వెళ్లిపోతూ వీచే ప్రాణవాయువు వెచ్చనిగాలీ, అపానవాయువు చల్లనిగాలీ అని అన్నాను- చెవులు ముక్కు ముఖము తాలువులు మున్నగునవి గవాక్షా లన్నాను- వీరల భుజాలు పాము గాటి గడియ లన్నాను- పంచేంద్రియాలు చిన్నదీపాలు అన్నాను- ఆ సంకల్పం రాజునాయుచే ఆ లోకాలలో అహంకారమనే మహా యక్షులను నిర్మించాడన్నాను- ఈ అహంకారియక్షులు పరమాత్మ జ్ఞానంచేత నశిస్తాయికనుక పరమాత్మలోక భీరువులని అన్నాను- ఈ మనోరాజు అహంకారములనే మహాయక్షులతో కూడా దేహములనే అపవరికములందు (గదులందు) ఎప్పుడూ యథేచ్ఛగా క్రీడిస్తూ ఉం టాడు. గాదెలో పిల్లి, కొలిమితిత్తిలో పాము, వెదురుబొంగులో ముత్యాలూ ఉన్నట్లు శరీరంలో అహంకారం ఉంటుంది. దేహమనే గేహములో సంకల్పములనే తరంగాలు సముద్రంలోవలె క్షణకాలం పెరుగుతూ ఉండుట, క్షణకాలం శాంతించుటయే, ఈరాజుగారి సంక్రీ డనము- తాను సంకల్పించిన వస్తువును క్షణకాలంలో తాను చూచు టయే తనూతన కాబోవు పట్టణమును తాను చేయుట-

జాగ్రత్స్వప్నావస్థలందు మిక్కిలి ఆయాసము చెంది, విశ్రాంతి సుఖమును అనుభవించుటకు సంకల్పరాహిత్య స్థితితో సుషుప్తి దశ యందు అజ్ఞానావరణమాత్రముతో నుండుటయే ఈసంకల్పరాజునకు శీఘ్రపినాశము- అథవా నానాజన్మకోటులందు ప్రయాసచెంది తుదకు అదృష్టవశంచేత నిర్విణ్ణుడై విరాగియై, శాస్త్ర, ఆచార్య, సమాధి, అభ్యాసాది బలంవల్ల ఆత్మతత్త్వ సాక్షాత్కారం కలుగగా, వాసనా రహితుడై మోక్షసుఖముకొరకు సంసిద్ధుడగుటయే ఈసంకల్ప మహా రాజునకు నాశము. ఆత్మ దుఃఖముకొరకు సంకల్పములు పుట్టుటే ఈ రాజుకు పునర్జన్మ- ఈసంకల్పమే జగద్దుఃఖాన్ని అంతులేకుండా కలిగి స్తుంది. కీలోత్పాటితవానరమువలె తాను సంకల్పించి దానిచే తానే

దుఃఖం అనుభవిస్తాడు ఈరాజు- హఠాత్తుగా జారిపడిన తేనెబిందువు నాకుటకు గాడిదకు దొరకినట్లు ఈరాజుకు విషయానుభవంలో కూడ సుఖం లభించదు- ఇట్టివాడికి ఇంక మోక్షసుఖం ఎంతదుర్లభం అనాలి. ఈసంకల్పాలతో ఇతడికి క్షణకాలం విరతి, క్షణకాలం రతి. క్షణ కాలం వికారం కలుగుతూ ఉంటుంది. కాబట్టి కుమారా! నీమనస్సును కూడ సకల బాహ్యవస్తువులనుండి మరల్చి సమాధి అభ్యాసంచేతనూ, తత్త్వజ్ఞానంచేతనూ, నిర్మూలం చేసి అనగా వాసనారహితం చేసికొని, ప్రత్యగ్భూతమయిన బ్రహ్మతత్త్వాన్ని అవలంబించి విశ్రమించునట్లు చేసికొను-

సంకల్పాత్మకమగు మనస్సు అనే మహారాజుకు తామస, రాజస, సాత్త్వికములని మూడుశరీరాలు. ఇవి యథాక్రమముగ అధమ, మధ్యమ, ఉత్తమములు- ప్రపంచస్థితికి కారణములు. తమోరూప మయిన (తమోగుణప్రధానమయిన) సంకల్పము స్వాభావికప్రవృత్తి చే (నాడి యిచ్చవచ్చినట్లు నడిపించుటచే) నీచాతినీచములయిన క్రిమి, కీటాది, జన్మలను తెస్తుంది సత్త్వరూపమయిన సంకల్పము ధర్మజ్ఞాన ములం దాసక్తిని పురికొల్పి కైవల్యమును ప్రసాదిస్తుంది. రజోరూప మగు సంకల్పము లోకవ్యవహారమును కలిగించి సంసారమందును, దారాపుత్రాదులందును అనురాగమును కలిగిస్తుంది- ఈమూడువిధము లను విడచి, గుణత్రయాతీతమగు సంకల్పము ఆత్యంతిక సంకల్పో చ్ఛేదమును (పూర్తిగా సంకల్పనాశమును) చేసి ముక్తిపదమును ప్రసా దిస్తుంది. కాబట్టి పుత్రకా! బాహ్యవృత్తులను విడచి మనస్సును నిరోధించుకొని, సంకల్పనాశమును చేసికో- "సంకల్పనాశము నాకు దుష్కరము కనుక మోక్షమునకు వేరే ఉపాయం చెప్పమంటావేమో?" విను- వెయ్యి సంవత్సరాలు నీవు దారుణమయిన తపస్సు చేసినా, నీ శరీరం రాతికివేసి కొట్టుకొని పొడిచేసుకున్నా, అగ్నిలోకాని సముద్రం లో బడబాగ్నిలోకాని దూకి నశించినా ? గోతులోపడినా ! పదునైన

కత్తితో ప్రాణహత్యచేసికొన్నా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వచ్చి నీకు ఉపదేశించినా! పరమదయాళురైన దత్తాత్రేయాది యతివర్యులు ఉపదేశించినా నీవు పాతాళలోకానికి వెళ్ళినా, భూలోకం అంతా తిరిగినా! స్వర్గలోకానికి వెళ్ళినా! ఏమయినా సంకల్పనాశం కంటె వేరుఉపాయం నీకు చిక్కదు మోక్షానికి- ఇది గట్టిమాట- కనుక సంకల్పనాశం కొరకు పౌరుషం అవలంబించి ప్రయత్నించు నీవు. ప్రాపంచిక పదార్థాలన్నీ సంకల్పమనే దారముతో కూర్చబడ్డాయి- ఆదారం తెంచితే ఈపదార్థాలు ఎక్కడికి పోతాయో తెలియదు- సత్తు, అసత్తు, సదసత్తు, అనేవికల్పాలు అన్నీ సంకల్పంవల్లనే పుట తాయి- అవి సంకల్పాన్ని వికల్పించటానికి చాలవు- సమర్థములు కావు. అలాంటిపి పరమార్థ సత్యసంకల్పుడగు బ్రహ్మను ఎలా స్పృ శించగలవు? దేనిని ఎలా సంకల్పం చేస్తే అది అలాగే ఒకక్షణంలో తయారవుతుంది. కాబట్టి నీవు తత్త్వజ్ఞుడవై ఎప్పుడూ ఏమీ సంక ల్పించకు. నిస్సంకల్పుడవై దొరికినదానితో కాలంగడుపుకొంటూ ఉండు- సంకల్పాలు నశిస్తే చిత్తు (చైతన్యం) విషయాలకు అభిముఖం కాదు. సత్యైకస్వభావుడగు బ్రహ్మ అసత్యమగు మాయావశంచేత సుర, నర, తిర్యగాది యోనిద్వారమున ఆయాప్రాణి భేదరూపంతో బయలుదేరి వ్యర్థంగా ప్రాపంచిక దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ఇది ఆత్మకు నీకు తగిందికాదు. కాబట్టి పుత్రకా! నానాయోనులందు జన్మించి, మాటిమాటికి మరణిస్తూ దుఃఖమనుభవిస్తూ ఉంటే నీకేమి ఫలము. కనుకనే ప్రాజ్ఞులు దుఃఖరహితమయిన దానిని ఆశ్రయిస్తారు కాని, దుఃఖరూపమయిన దానిని ఆశ్రయించరు- కనుక నీవు తత్త్వ జ్ఞానాన్ని పొంది బలాత్కారంగా సంకల్పవికల్పాలను తుంచివేసికొని నిరతిశయానందము కొరకు ముక్తిని ప్రయత్నపూర్వకంగా సాధించు- అని అన్నాడు తండ్రి-

౫౮. సంకల్పోచ్ఛేదమునకు ఉపాయమును వర్ణించుట.

కొడుకు ఆ రాజుగారి చరిత్ర అంతా విన్నాడు. అసంకల్పం ఎలా పుడుతుంది? ఎలా పెరుగుతుంది? ఎలా నశిస్తుంది? చెప్పమన్నాడు. దాశూరుడు (తండ్రి) జవాబు చెబుతాడు ఇలా–

నాయనా! చిత్తు విషయాభిముఖం అగుటయే సంకల్పానికి మొదటి అంకురము. ఇది సూక్ష్మంగా పుట్టి, కొంచెం పాదుకొని, తరువాత లావుపారుతుంది ఈ సంకల్పాలు ఒకదానివల్ల ఒకటి పుడుతూ క్రమంగా పెరుగుతవి. వీటివల్ల దుఃఖమే కాని సుఖం లేదు– జగజ్జాలం అంతా సంకల్పమాత్రం. అంతకంటె వేరేమీ లేదు. నిర్వికారా ద్వితీయ వస్తువునందు మృగతృష్ణా ద్విచంద్రాది భ్రాంతులవలె వివర్తరూపంతో జగత్తు పుట్టింది. మాతులుంగ ఫలం తింటే కళ్ళకు పైత్యం ఎక్కి– తెల్లని వస్తువు పచ్చగా కనిపిస్తుంది. అలాగే నీహృదయంలో అసత్యమాయిన సంకల్పం బయలుదేరుతుంది. నేను, వీడు, వాడు, అనే భావాలు అన్నీ నిరర్థకాలు. వీనిచే పరితాపమే కాని సుఖం లేదు ఎవడికీ. నా ఉపదేశం నీకు మనసుకు పడితే అసత్యమయిన సంకల్పం నశిస్తుంది. నీవు దేనిని సంకల్పించకు– పూర్వమనుభవించిన సుఖ దుఃఖాలను స్మరించకు– దీనివల్ల నీకు సంకల్పక్షయం కలుగుతుంది.

భావనా రాహిత్యం చేత సంకల్పనాశం చాలా సుకరం–కుమారా! పుష్పంకోయటానికి చెయ్యి కదలించే ప్రయత్నమయినా అవసరం– సంకల్పనాశానికి ఆమాత్రపు ప్రయత్నంకూడా అవసరం లేదు. సుఖ దుఃఖాలను స్మరించకుండా ఉండే యెడల సంకల్పం క్షణకాలంలో ఎగిరి పోతుంది. సంకల్పాలు క్షీణిస్తే నశిస్తే దుఃఖక్షయం కలుగుతుంది. పిదప నిరంతరాత్మచింతనవల్ల నిరతిశయానందం ప్రాప్తిస్తుంది. అసంకల్పన సంకల్పంతో సర్వ సంకల్పాలను నశింపచేసికో– ఆత్మతత్త్వ మననరూపమగు మననంతో మనస్సును ఛేదించు– ఆత్మస్వరూపంలో

నిలచిఉంటు. ఇంతమాత్రం చేయలేకపోతే ఎలా? సంకల్పం శాంతిస్తే సంసారదుఃఖం అంతా శాంతించి నట్లే- సంకల్పమే మనస్సు- సంకల్పమే జీవుడు- సంకల్పమే చిత్తము సంకల్పమే వాసనావిశిష్టమయిన బుద్ధి- వీటన్నిటికి పేరు భేదముకాని, అర్థభేదములేదు. ఈప్రపంచంలో సంకల్పంకంటే వేరువస్తువేదీ లేదు. దానిని హృదయమునుండి తీసివేసికో. ఎందుకు బాధపడతావు. ఆకాశం ఎలాశూన్యమో, ప్రపంచం కూడా అలాగే శూన్యము. ఈ రెండూ స్వరూపములో లేనివీ- వికల్పమువల్ల పుట్టినవీ- ప్రపంచం ఉన్నదని సంకల్పించావు. ఉన్నట్లు తయారయింది. నీ వెంటపడింది. బాధిస్తోంది. లేదనుకున్నావు. తొలగిపోయింది, బాధతప్పింది. ఇంక మళ్ళీ లేనిదానిని గురించి భావనమేమిటి? మళ్ళీ తిరిగి అదిరావడం ఏమిటి? కనుక సంకల్పక్షయం కొరకు మొదట జగన్మిథ్యాత్వ దర్శనం అవసరం. దీనిచే భార్యాపుత్రమిత్రాదులందు అనురాగాభినివేశాలు ఉండవు. ఇవి లేకుంటే హర్షామర్షములు (సుఖదుఃఖములు) ఉండవు. కనుక ప్రపంచం పూర్తిగా అసత్తు అని గ్రహించు. మనస్సే చిత్ప్రతిబింబంవల్ల జీవుడగుచున్నాడు. ప్రపంచమనే మానస నగరాన్ని నిర్మిస్తున్నాడు- నశింపచేస్తున్నాడు-

ఈ మనస్సునకు శబ్దస్పర్శాదివిషయములతో సంబంధంవల్ల వాసనలు ఏర్పడ్డాయి. అధిష్ఠాన చిత్సంబంధంవల్ల స్ఫురణశక్తి ఏర్పడింది. అందువల్ల యీమనస్సు మొదటిదానివల్ల మలినమూ, రెండవ దానివల్ల చంచలమూ, అయింది. ఇలా అయి కోరికతో ప్రపంచ రచనాదివ్యవస్థను చేస్తోంది. అయితే ఈ మనస్సు ఇష్టమయినదానిని ఎందుకుచేసుకోదు- అనిష్టమయినదానిని చేసికొని ఎందుకు బాధపడు తోంది? విను. మనస్సే జీవుడు కనుక వీడు హృదయమనే అడవిలో కోతికనక తనకనుకూలమయిన రచననే కోతిచేష్టలనే చేస్తూ ఉంటాడు- కోతి చపలచిత్తమై ఇష్టానిష్టములను కనిపెట్టలేనట్లు ఈ జీవుడు కూడా కనిపెట్టలేడు. వీడు (ఈజీవుడు) దీర్ఘమయిన ఆకారాన్ని ధరించి

క్షణంలో హ్రస్వం అవుతాడు. వీడి సంకల్పాలు నియమించటానికి సాధ్యంకావు. విషయాలను చూస్తూ ఉంటే పెరుగుతాయి. వాటివంక చూడకపోయినా వాటిని (విషయాలను) స్మరించకపోయినా అణిగి పోతాయి. గడ్డిపరకతో సమానమయిన చిన్నవస్తువుతో కూడా సంక ల్పం పెరుగుతుంది. అగ్నికణం ఎంతచిన్నదయినా గడ్డిపరకతో కూడా ప్రజ్వరిల్లుతుంది. ఈ సంకల్పాలకు స్పష్టమయిన ఆకారం కనపడదు. కాని ప్రకాశిస్తూ ఉంటాయి. క్షణభంగురాలు. జడపదార్థాలయందు స్థాణ్వాదులందు చోరాది భ్రాంతిని కలిగిస్తూ ఉంటాయి కాబట్టి ఇవి మెరపులవంటివి. కుమారా! ఈ సంకల్పం అసత్యమూ, అజ్ఞానవికా రమూ, కనుక జ్ఞానంచేత సులభంగా చికిత్స పొందటానికి వీలవుతుంది. ఇందులో సందేహంలేదు. ఈ సంకల్పం పరమార్థమే అయ్యేయెడల దీనికి చికిత్సే ఉండేదికాదు. సంసారం సత్యమే అగుచో, నల్లటి మసి బొగ్గును ఎంతగా కడిగినా చివరకు మిగిలేది నలుపే(మలినమే)పూర్తిగా క్షాళనచేస్తే శూన్యం (ఏమీఉండదు)- అలాగే సత్యమయిన ప్రపం చాన్ని ఎంతక్షాళనం చేసినా తుదకు మలినమయిన ప్రపంచమే మిగులు తుంది, పూర్తిగా క్షాళన చేస్తే శూన్యమే అవసానమై అపురుషార్థం సంప్రాప్తం అవుతుంది. ఇలాంటి ప్రపంచాన్ని క్షాళన చేయటానికి ఎవడు ప్రవర్తిస్తాడు. ప్రవర్తిస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి? సత్య ప్రపంచాన్ని క్షాళన చేయుటకు ప్రవర్తించువాడు దుర్మతి కాని సుమతి కాడు. కాబట్టి యీ ప్రపంచం బియ్యపు గింజమీద ఊకపొట్టుఉన్నట్లు ఉన్నది. కనుక ఇది పురుష ప్రయత్నంచేత నశిస్తుంది. నాయనా ఈ ప్రపంచం అనాదిసిద్ధమయినా వచ్చిందికాని సహజంగా ఉన్నదకాదు. అందువల్ల తత్త్వవేత్తకు అనాయాసంగా ఛేదించుకొనుటకు సాధ్యం అవుతుంది. బియ్యపుగింజమీది పొట్టు అవహనన క్రియచే (దంప కముచే) పోగొట్టుకొనవచ్చును. రాగిపాత్రమీది మకిలమును శోధన క్రియచే (తోముటచే) పోగొట్టవచ్చును. అలాగే అంతఃకరణగత మయిన అసంభావనా విపరీతభావనాది మాలిన్యాన్ని జ్ఞానభూమికలను

అభ్యసించే పురుషప్రయత్నంచేత నయినా పోగొట్టుకొనవచ్చును. కాబట్టి సంసారము పురుషప్రయత్నంచేత తప్పక నశిస్తుంది. కనుక నీవు ప్రయత్నించు. లేనిపోని సంకల్పవికల్పాలతో కూడిన ఈ సంసారాన్ని జయించడానికి నీవు ఇంతవరకూ ప్రయత్నించలేదు. నీకు ఉపాయం తెలియక కాలాన్ని వృథాచేశావు. కొద్ది ప్రయత్నంతో శీఘ్రంగా నశిస్తుంది అసద్వస్తువు (లేనివస్తువు) (కల్పితవస్తువు) ఏది చిరకాలం ఉన్నది ? చెప్పు. కంటిలో దోషంపోతే ద్విచంద్రభ్రాంతి పోతుంది. దీపపు వెలుతురు వస్తే చీకటి పోతుంది. తత్త్వవిచారం చేస్తే ప్రపంచమునందలి సత్యత్వభ్రాంతి (ప్రపంచం నిజమనేబుద్ధి పోతుంది) కుమారా! నీకు ఆసంసారంలేదు. దానికి (ఆసంసారానికి) నీవూలేవు. మీ యిద్దరికి సంబంధము మిథ్య. (భ్రాంతి) కాబట్టి యీభ్రాంతి విడు. ఈ ఐశ్వర్య సంబంధములయిన భోగవిలాసాలు శాశ్వతములనే భ్రాంతి వదలుకో. సంసారిని అనుకొనే నీవు ఈభోగవిలాసాలు, జననమరణాది దృశ్య ప్రపంచం, ఇది అంతా ఆత్మతత్త్వమే. అదే (ఆ ఆత్మతత్త్వమే) యీ దృశ్యరూపంగా ప్రకాశిస్తోంది. ఇంతేకాని సద్రూపమయిన దృశ్యం వేరే ఏమీలేదు. అని ఇలా సంకల్పమనే వ్యాధికి చికిత్సను వర్ణించి చెప్పాడు తండ్రి—

## ౫౫. వసిష్ఠదాశూరులమేళనము.

వసి॥ రామచంద్రా ! ఇలా ఆరాత్రి ఆతండ్రికొడుకుల సంభాషణ అంతా విన్నాను నేను పత్రపుష్పఫలాదులతో నిండియున్న కదంబ వృక్షంమీద ఉండి— ఇంద్రియనిగ్రహంలో అతిశూరుడయిన దాశూరుని, తపోనిష్ఠాగరిష్ఠుడయిన దాశూరుని. అగ్నిహోత్రునివలె ప్రకాశించెడి దాశూరుని శరీరంనుంచి బయలుదేరే కాంతులతో భూతలాన్ని బంగార వికారముగ చేయుచున్న దాశూరుని, సూర్యునివలె లోకాలు అన్నింటిని ప్రకాశింపచేసెడి దాశూరుని చూచాను నేను. నన్నుకూడా అతడుచూచాడు. అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు. ఆసనం ఇచ్చి

కూర్చుండబెట్టాడు. అర్ఘ్యపూజ చేశాడు. తర్వాత మళ్ళీ వెనుక ప్రారంభించిన బ్రహ్మవిచారకథలను, సంసారనాశకములయిన వాటిని చెప్పడం ప్రారంభించాడు.

నేను అప్పుడు ఆకదంబవృక్షాన్ని చూచాను తనివితీర. క్రొత్త పెండ్లికూతురుతో కూడుకున్న పెండ్లికొడుకువలె ఉంది ఆచెట్టు. దాని అలంకారం వర్ణనాతీతం. రామా! ఏమిచెప్పేది? ఆచెట్టున ప్రాణులకు ఉపయోగించని వస్తువేలేదు తుదకు ఆకుకూడ రిక్తపోవుటలేదు. ప్రతి ఆకు క్రిందనూ మృగములు నిద్రిస్తున్నాయి పక్షులు విశ్రాంతి చెందుతున్నాయి. ఇలాంటి గుణగణవిశిష్టమయిన ఆచెట్టును దివ్యదృష్టితో చూస్తూ ఉండగా నాకారాత్రి మహోత్సవంగా గడచిపోయింది- తర్వాత అతిరమ్యమయిన తత్త్వకథలతో కొంత విజ్ఞానాన్ని నేను బోధించాను. ఆయనగారి కుమారునకు. చిత్రవిచిత్రములయిన ఆకథలతో మాకారాత్రి ఒక్క-క్షణంలాగ గడచిపోయింది.

అంతట తెల్లవారనుండగనే దాశూరుని విడిచాను. ఆకాశగంగ (మందాకిని) నదియొద్దకు చేరాను. అందులో స్నానసంధ్యాదికృత్యాలు నెరవేర్చుకున్నాను. ఆకాశంలో సప్తర్షి మండలంచేరి సుఖంగా ఉన్నాను. రామా! ఇదీ దాశూరుని ఆఖ్యాయిక. ఇది జగత్ప్రతిబింబ రూపము. (అనగా జగత్తు ఎంత నిజమయినదో అంత నిజమయినది.) రామా! నీకు ప్రపంచం యొక్క- స్వరూపం నిరూపించడానికి చెప్పాను ఈ కథను నీకు. కనుక దాశూరుడు కొడుకునకు చెప్పిన సిద్ధాంతాన్ని మనస్సులో పెట్టుకొని వాస్తవంగా కనిపిస్తూఉన్నా అవాస్తవమయిన ఈ ప్రపంచాన్ని విడిచి, ఆత్మజ్ఞానంతో ఉదారుడవై ఉండు. అని అన్నాడు వసిష్ఠుడు.

దాశూరోపాఖ్యానము సమాప్తము.

## ౫౫. కర్తృత్వాకర్తృత్వవిచారము.

రామా! జడమయిన ఈప్రపంచం లేదనుకొని విరాగంగా ఉండు- ఇది (ఈ దృశ్యప్రపంచం) సత్తుఅయినా, సదసత్తుఅయినా, లేక అసత్తే అయినా ఈమూడు పక్షములలోనూ, నీకు దీనిమీద అనురాగం తగదు- ఎలాగంటే ఈ దేహాది ప్రపంచం నీయొక్క ఉనికితో నిమిత్తం లేకుండా తాను ఉనికిని పొంది ఉన్నదని నీఅభిప్రాయమైనచో అపుడు నీవుకూడా దానియొక్క ఉనికితో నిమిత్తంలేని అసంగోదాసీన చిద్రూపాత్మతత్త్వమునందుండు- అంతేకాని నిరపేక్షమయిన (నీతో అపేక్షలేని) దేహాదులందు భ్రాంతిచేత "నేను" అనే భావం ఎందుకు ముడిపెట్టుకుంటావు? ఇది నీకు తగినపని కాదు- ఇంక ఇది సదసత్ అని అంటావా! అప్పుడుమాత్రం దానికే ఒక నికరమయిన స్వభావం లేకపోతే దానిమీద నీకనురాగం ఎందుకు? ఇంక ఈ దేహాది ప్రపంచం లేదనుకుంటావు- అప్పుడు నీకు బంధమే లేదు. స్వచ్ఛమయిన ఆత్మ తత్త్వమే ఈరూపంగా విస్తీర్ణమై ప్రకాశిస్తోంది. కనుక ఇంకొక పదార్థాన్ని కోరవలసిన ప్రసక్తే లేదు-

మరియు ఈప్రపంచం సకర్తృకమా! అకర్తృకమా! కర్త్రకర్తృసాధారణమై ఉదాసీన ఆత్మసన్నిధి మాత్రంచేత స్వరూపమును పొంది ఉన్నదా? ఈమూడు పక్షములలోనూ నీకు దీనిమీద అనురాగం తగదు. ఈ జగజ్జాలము అకర్తృకము (కర్త లేనిది) అగుగాక, లేక సకర్తృకము (కర్తకలది) అగుగాక. ఏమయినా దీనిమీద అనురాగం కూడదు- ఇది (దృశ్యప్రపంచం)అన్యోన్యాధ్యాసమును పొంది ఉన్నట్లు భావించి పరిచ్ఛేదభావాన్ని విడిచిపెట్టు- అయితే "యతోవా ఇమాని భూతాని జాయంతే" "విశ్వస్యకర్తా భువనస్యగోప్తా"ఇత్యాది శ్రుతులు ప్రపంచానికి పరమేశ్వరుడు కర్త అని చెప్పుచుండగా, ప్రపంచానికి ఎవ్వరూ కర్త లేరని నేనుచెప్పుట పొసగదని నీకు సందేహం కలగవచ్చు- ఆశ్రుతులు నిజంగా పరమాత్మ జగత్కర్త అని చెప్పుటకు రాలేదు-

"యత్తదద్రేశ్య మగ్రాహ్య మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" ఇత్యాది శ్రుతులు పరమాత్మ అసంగుడూ, ఉదాసీనుడూ అని చెప్పుచున్నాయి- ఇట్టి పరమాత్మ జగత్తును పుట్టించుచున్నాడనునది "మేరుపర్వతము సూర్యుని త్రిప్పుచున్నదని" అన్నట్లుగును- కనుక ప్రపంచ మిథ్యాత్వమును బోధించుటకొరకు పరమాత్మ జగత్తుకు కర్త అని ఔపచారికముగ చెప్పినవి- సృష్టి శ్రుతులన్నిటికీ ఇదే తాత్పర్యము- దీనిని గ్రహించిన వారలకు ప్రపంచము అకర్తృకమే- కాక తాళీయమే- అని నా అభిప్రాయము. ఇలాంటి ప్రపంచం మీద అహంతాది అభిమానమును ఉంచువాడు బాలిశుడు (మూఢుడు) కాని వివేకికాడు- కనుక రామా! ప్రపంచం అత్యంతా భావాత్మకము కాదు. ప్రధ్వంసప్రయుక్తా శూన్యస్వభావమూ కాదు. (నశించునదీ కాదు) ఎల్లప్పుడూ కనిపించుచున్నందున అత్యంతాభావాత్మకము కాదు. మాటిమాటికి పుట్టుచున్నందున ప్రధ్వంసాత్మకము కాదు. అలాగే ప్రతి క్షణమూ పరిణామ భేదం చేత నశించుచున్నందున నిత్యసత్తా స్వభావము కలది కాదు. (అనగా ఎల్లప్పుడూ ఉండేది కాదు.) పూర్వోత్తర కాలములందు లేకుండుటనుబట్టి వర్తమాన క్షణకాలమందు కూడ లేకపోవుట ఊహింపవలసి యున్నందున క్షణికస్వభావమయినదీ కాదు- ఇలాంటి మిథ్యాప్రపంచానికి సర్వేంద్రియాగోచరుడగు పరమాత్మ సన్నిధిమాత్రమున కర్త- ఇతడు ఇంద్రియాతీతుడు- విగతజ్వరుడు కనుక సృష్టించిన వస్తువులందు అభిమానముంచడు- ఖేదపడడు- కనుక ప్రపంచం భావాభావ దశామయమయిన నియతివల్ల ఏర్పడుతోంది. ఇది మిథ్య- అంతులేని కాలానికి ఒక్క-అంశమాత్రం నూరుసంవత్సరములునది. ఇది మనుష్యాయుర్దాయపరిమితి- ఈమాత్రపు కాలమందు మనుష్యాది శరీరములమీద ఆత్మాభిమానం ఉంచి ఆశ్చర్యపడడు కాలపరిచ్ఛేదము లేని పరమాత్మ కనుక నీవుకూడ పరమాత్మస్వరూపుడవే కనుక నీకు కూడా తగదు దేహేంద్రియాదులందు ఆత్మాభిమానము. ఒకవేళ

నీవు ప్రపంచం స్థిరమని అనుకున్నా నీవు అసంగచిద్రూపుడవు కనుక నీకు జడవస్తువుతో సంబంధమే కుదరదు- కనుక కూడా నీకు ప్రపంచం మీద ఆస్థ (ఆదరము, అభిమానము) తగదు- ఇంక ప్రాపంచిక పదార్థాలు అస్థిరాలు అనుకుంటావా! అస్థిరమయిన నీటిమీదనురుగు నశిస్తే నీవు దుఃఖించవలెంగాదు. కనుక అస్థిరమయిన దేహేంద్రియాదులందు ఆస్థగల నీకు అవి నశిస్తే దుఃఖం కూడదు- ఆత్మకు జగద్భావము అన్యోన్యతాదాత్మ్య సంస్పర్శాధ్యాస లక్షణమయిన మిథ్యాభిమానమే- కాని అంతకంటే వేరు కాదు. వెలుతురుకు దీపం నిమిత్తమాత్రము. ప్రపంచానికి ఆత్మ నిమిత్తమాత్రుడు. సృష్టించుచున్నా సృష్టించినవాడు కాదు. సూర్యుడు పగటి కాలకృత్యములను నిర్వహింపచేస్తున్నా, అందుకు కర్తగాడు- అట్లాగా నదీతీరమునందలి ఉదకప్రవాహంలో సుడిగుండములు బయలు దేరడము ఈ ప్రపంచము ఎవరియందునూ కర్తృత్వభారము లేకుండా ఆకస్మికముగనే బయలుదేరినది. (అనగా ఆనది స్వభావతః రాళ్ళతో నిండినది. ఉదకప్రవాహము పల్లపు ప్రదేశాన్ని అనుసరించి వెళ్ళుస్వభావము కలది కాని ఎదురు వెళునది కాదు ఎత్తు ప్రదేశానికి- హెచ్చుతగ్గులుగల రాళ్లు ప్రవాహము ఈ రెండూ కలిసేటప్పటికి ఆవర్తము (సుడి) ఆకస్మికముగనే పుట్టును. ఇందులో కర్తృత్వభారము దేనిమీదను లేదు. ఇలా ప్రమాణపరిశుద్ధమయిన చిత్తముతో ప్రపంచపరిస్థితిని నిపుణంగా విచారించు- నీకింక ప్రపంచం మీద అభిమానం ఉండదు. అయినా, అలాతచక్రాన్ని (గుండ్రమయినకొరివి) ప్రతిరోజూ భావన చేస్తున్నావా? (స్మరిస్తున్నావా?) స్వప్నాన్ని భావనచేస్తున్నావా? రజ్జుసర్పభ్రాంతిని స్మరిస్తున్నావా? ఈ ప్రపంచభావనమాత్రం ఎందుకు నీకు? హఠాత్తుగా కలసిన జంతువు ప్రేమపాత్రమగునా? భ్రాంతిసిద్ధమయిన ప్రపంచం మాత్రం ప్రేమభాజనమగుట ఎట్లు? శీతార్తుడు చంద్రునియందు వేడిమి ఉన్నదనుకొని భ్రాంతిచే, ఆస్థను ఉంచడు- తాపార్తుడు సూర్యుడియందు చల్ల

దన మున్నదనుకొని భ్రమించి, ఆర్తముంచను. దాహముగలవాడు మృగతృష్ణాజలమందు ఆస్థఉంచడు- నీవుకూడ ప్రపంచస్థితియందు ఆస్థను ఉంచకుము. స్వప్నజనము, సంకల్పపురుషుడు, ద్విచంద్రభ్రాంతి ఎలాంటిదో సాంసారికపదార్థజాలం కూడా అలాంటిదే- కాబట్టి మనస్సులో అభిమానం వదిలి లీలామాత్రంతో వ్యవహరించు, కర్తృత్వాకర్తృత్వాదులను దిగమ్రింగు. పరమాత్మయొక్క సాన్నిధ్యాన్ని నిమిత్తంగా చేసికొని నియతియే ఇలా విజృంభించింది. దీప సాన్నిధ్యంచేత వస్తువు ప్రకాశించుచున్నట్లు- ఏకోరిక లేని సూర్యుడూ, ఏకోరిక లేని రత్నమూ, ఎలాంటివో, పరమాత్మకూడా అలాంటివాడే- రామా! ఆత్మయందు కర్తృత్వాకర్తృత్వములు రెండే ఉన్నట్లు గోచరించేవి. ఈ రెంటిలో దేనివల్ల నీకు శ్రేయస్సు కలుగుతుందో దానిని ఆశ్రయించి సుఖించు. అకర్త అను భావనతో ఎవరు ఏపనిని చేసినా లిప్తుడు కాడు. అకర్తృత్వ నిశ్చయం గలవాడు విరాగుడవు తాడు- వాడు కర్మనుచేయనీ, మాననీ- అకర్తృత్వనిశ్చయం కలవానికి సన్న్యాసమత్వం కరతలామలకం-

ఒకవేళ నీవు కర్తృత్వపక్షమునే అవలంబించే యెడల అదికూడా మంచిదే అని అంటారు పెద్దలు. అకర్తృత్వనిశ్చయం కలవానికి రాగ ద్వేషాల ప్రసక్తి లేదు. ఇంక రెండవపక్షంలో ప్రపంచంయొక్క ఉత్పత్తి ఉదయక్షయములకు తానుకర్త అని తలచేయెడల నీవు చేసి కొన్న దానిలో నీకు సుఖదుఃఖాలకు ప్రసక్తి ఎందుకు? ఇతరులు చేస్తేగా నీవు హర్షవిషాదాలు అనుభవించడానికి- ఈ పక్షంలో సమ త్వంకూడా కలగవచ్చు. నీవే లయంచెందితే నీకు సమత్వమే మిగులు నుంది సర్వభూతములందూ సమత్వ యుక్తమయిన చిత్తం పునర్జన్మను పొందదు.

రామా! మూడవపక్షంలో ఈ కర్తృత్వాకర్తృత్వాలను రెంటినీ దిగమ్రింగి నీ నిజరూపంలో నీ వుండు- ఈ దేహంలో ఉన్న

నేను సర్వదేహసమష్టిరూపుణ్ణి కాను ఈ దేహేంద్రియాదులు నేను కాను- కనుక నేనేమియు చేయుటలేదు- అనే భావంతో కూడిన దృష్టులు రెండూ సుఖకరములు కావు- ఎందువల్లనంటే, ఈభావంలో త్వంపదార్థశోధన ఉన్నా, తత్పదార్థశోధనకాని, వాక్యార్థనిష్ఠకాని లేవంగున వీనివల్ల సుఖంలేదు- దేహమునందు అహంభావము సర్వానర్థములకు మూలము. దానిని తొలగించుకొనుటకు ఉపాయంగా నేను ఈభావం నీకు వ్యక్తపరచాను. కాబట్టి సర్వాత్మనా ప్రయత్నపూర్వకంగా దేహేంద్రియాదులందు ఆత్మభావం తొలగించుకొనుము- శ్రేయస్కాముడు ఆభావాన్ని మనసా స్పృశించకూడదు- కుక్కమాంసంతో కూడిన మాలదాన్నివలె- దానిని దేహాత్మభావాన్ని దూరంగా త్రోసివేస్తే పండువెన్నెలవంటి పరమాత్మదృష్టి ఉదయిస్తుంది- దీనితో సంసారసాగరం తరించగలుగుతావునీవు-

కాబట్టి రామా! కర్తృత్వప్రయోజకములయిన దేహేంద్రియాదులు నేనుకాను. నేను సర్వమునుగూర్చి కర్తను- సర్వసమష్టిభూతమయిన బ్రహ్మాండమునునేనే- (1) నేను ఈ పరిదృశ్యమాన ప్రపంచంలో దేనిని కాను- (2) నేను లోకప్రసిద్ధ జడదుఃఖపదార్థముల కంటె విలక్షణుడను- (3) పూర్ణానందచిదాత్మను. అని ఈమూడు దృష్టులను నిర్ణయించుకొని, ఉత్తములయిన సాధువులు ఇందులో ఏదృష్టిని అవలంబించి మోక్షమును పొందిరో నీవుకూడా అదే దృష్టిలో ఉండు. అని అన్నారు వసిష్ఠులు-

౩౭౭వ సర్గ-

శ్రీరా॥ మహర్షీ! కర్తృత్వభోక్తృత్వాదులు లేనివాడును, సర్వేశ్వరుడును, సర్వవ్యాపకుడును, చిదేకరసుడునగు పరమాత్మ కర్తృత్వభోక్తృత్వాదులు కలవాడువలె కనిపించుచున్నాడని మీరు చెప్పినవిషయం నాకు బోధపడింది. "సర్వభూతేచాత్మానం సర్వభూతా

నిచాత్మని" అను శ్రుత్యర్థము కూడ నాకవగతమైంది- మీ మాటలకు నా హృదయం చల్లపడింది. ఉదాసీనుడూ, నిరీహుడూ కనుక పరమాత్మ చేయునదీలేదు- తినునదీలేదు- ప్రకాశరూపంతో సాక్షిమాత్రుడుగ నుండుటే అతడికి కర్తృత్వభోక్తృత్వములు- కాని ఒక్కసందేహం మాత్రం నాకు ఉన్నది. దానిని మీరు తీర్చక తప్పదు. అదేమంటే ఈ ప్రపంచం సద్రూపమా? అసద్రూపమా? ప్రసిద్ధుడయిన జీవుడు ప్రపంచసమష్టిరూపుడేనా? వ్యష్టియగు దేహమాత్రుడు కాడా? ఈ ప్రపంచము సమష్టిదృష్టిలో అభిన్నమూ, వ్యష్టిదృష్టిలో భిన్నమూ అగునా? ఇలాంటి పరస్పరవిరుద్ధములయిన కల్పనలన్నీ ప్రకాశైక రూపుడగు పరమాత్మయందు. నియతిస్వభావుడయిన పరమాత్మయందు ఎలా కలిగాయి. ఉష్ణప్రకాశరూపుడగు సూర్యుడియందు మంచు ఉండుట విరుద్ధము కదా! ఇది ఎలా పొసగును?

ఒకవేళ తమరు ఈ నానాకల్పనాకల్పితమయిన ఈ ప్రపంచం అంతా మొట్టమొదట మాయాశబలబ్రహ్మయందుండి యిప్పుడు అభివ్యక్తమైనదని అంటారేమో ఈ విరోధము అప్పుడు కూడా ఉన్నది కదా! అప్పుడు మాత్రం (మొదట మాత్రం) ఇది ఎలా కమరుతుంది? చెప్పండి. అని అడిగాడు శ్రీరాముడు-

వసిష్ఠుడు విన్నాడు- శ్రీరాముని అభిప్రాయం గుర్తించాడు. ఇతడికి ప్రపంచం అనిర్వచనీయమనీ, అన్ని శరీరములందునూ ఉన్న ఆత్మ ఒక్కడేననీ, అతడు స్వప్రకాశచిద్రూపుడనీ, గ్రహించాడనుకున్నాడు. ఇంకనూ వాసనాక్షయం కానందున సర్వసంశయాలకు మూలమయిన అవిద్యమాత్రం ఉన్నదనీ, దానిని పోగొట్టతగిన ప్రత్యగ్బహ్మైక్యలక్షణమయిన అఖండబ్రహ్మసాక్షాత్కారం కలగలేదనీ నిశ్చయించాడు- వాసనాక్షయం అమోఘ ఉపాయమే యిప్పుడు ఉపదేశించవలసిన అవసరమని తలచాడు. అయినా అందుకు తగినసమయం ఇది కాదనుకున్నాడు. ఆమాటే చెబుతున్నాడు శ్రీరామునికి.

వసి॥ రామచంద్రా! నిర్వాణప్రకరణముయొక్క ఉత్తరార్థంలో పాషాణోపాఖ్యాయికాదులందు ఈ ప్రశ్నకు సమాధానం చెబుతాను. అప్పుడు నీకు స్పష్టంగా తెలుస్తుంది- ఇప్పుడు నేను చెప్పినా నీబుద్ధికి ఎక్కదు యువకులకు కాంతల (కామినీస్త్రీల) మాటలు హృదయంగమములగును. అట్లే ఉత్తమములయిన మాటలకు పరినిష్ఠితమయిన ఆత్మజ్ఞానం కలవాడే అర్హుడగును. బాలులయెడ శృంగారరసపూరితములయిన మాటలు వ్యర్థము- అల్పజ్ఞులయెడ మోక్షసంబంధమయిన పనులుకూడ అంతే- నారంగ, పూగ, జంబీరాది వృక్షములు శరదృతువులోనే ఫలిస్తాయి- వసంత ఋతువులో ఫలించవు- ప్రశ్నకూడా ఒకానొకసమయంలో ప్రకాశిస్తుంది. వైరాగ్యోపదేశాలు జ్ఞానవృద్ధునియందే ఫలిస్తాయి- నిర్మలమైనగుడ్డకే రంగు అంటుతుంది. మురికిగుడ్డకు అంటదు. ఈప్రశ్నకు టూకీగా సమాధానం నేను చెప్పాను. వెనుక భార్గవోపాఖ్యానంలో విస్తరించిచెప్పలేదు- అందుచేత నీకు స్పష్టంగా బోధపడలేదు- నీకు ఆత్మతత్త్వ వివేకం కలిగినట్లయితే దీనికి జవాబు నీవు స్వయంగా తెలిసికోగలవాడవు. కనుక నీకు పూర్ణబోధకలిగిన తరువాత సిద్ధాంతసమయంలో ఈ ప్రశ్నోత్తరక్రమం వివరించి చెబుతాను. నీఅంతట నీవే నీచిత్తప్రణిధానంతో తెలుసుకుంటావు నా ఉపదేశం అపుడు నిమిత్తమాత్రమే అవుతుంది.

ఇపుడు నేను కర్మాకర్మ ఆత్మవిచారణకూడా అఖండ బ్రహ్మబోధను గురించే చెప్పాను. కాని నీకు యింకా జ్ఞానం నిరూఢం కానందున అఖండాత్మజ్ఞానం కలగలేదు, కనుక నీకు వాసనాక్షయం కలుగలేదని నేననుకొంటాను- ఇపుడు బంధమోక్షములయొక్క రహస్యం చెబుతావిను- వాసనాబంధమే బంధము. వాసనాక్షయమే మోక్షము.

కనుక తమోగుణ ప్రధానమయిన వాసనలను విడిచిపెట్టు మొదట. తర్వాత చిత్తప్రసాదకరములగు మైత్రీ, కరుణా, ముదితో, పేక్షారూపములగు వాసనలను అలవరచుకో. సమాధినిష్ఠ కుదిరిన

తరువాత వీటినికూడా విడచి, అసంప్రజ్ఞాత సమాధియందు విశ్రాంతి చెందు. అప్పుడు నీ పరమార్థస్వరూపము నీకేబోధపడుతుంది. సమాధిని ఆచరించినా? ఆచరించకున్నా? కర్మలనుచేసినా? చేయకున్నా? హృదయంలో రాగద్వేషాలు లేకుండా ఉండేయెడల వాడుముక్తుడే- వాసనా క్షయముయినవానికి సమాధి, జప, తపః, కర్మాకర్మలతో పనిలేదు. శాస్త్రం అంతా విచారణచేయుగాక. విద్వత్సభలయందు శాస్త్రార్థం చేయుటకు తగినట్లుగా విషయం గట్టిపరచుకొనుగాక- ఎంతఉన్నా వాసనారహితమయిన మౌనముకంటె ఉత్తమమయినది మరొకటిలేదు- కనుకనే పదిదిక్కులూ తిరిగి తిరిగి ఎవరోకొందరు మహానుభావులే తెలియదగినదానిని తెలుసుకుంటారు. మనము చూచేవి అన్నీ ఈప్సితములో, అనీప్సితములో, అయి ఉంటున్నాయి. యీ రెంటినిగురించే మానవుడు ప్రయత్నిస్తూ ఉంటాడు. ఈ రెంటికీ అవిషయమయినది ఆత్మతత్త్వము. దానినిగూర్చి ప్రయత్నించు మానవుడెవ్వడూ లేడు. మానవులుచేసే ప్రయత్నాలు, మానవులుచేసే పనులు (కర్మలు) వైదికములగు యజ్ఞాదులు దేహేంద్రియాదులకొరకే కాని ఆత్మకొరకు కాదు. అనగా మాటిమాటికి జన్మమరణప్రాప్తి కొరకేకాని, ఆత్మ తరించటానికి కాదు. పాతాళలోకమందుగాని, బ్రహ్మలోకమందుగాని, స్వర్గమందుగాని, భూలోకమునగాని, అంతరిక్షలోకమునగాని, ఎవరో కొందరే చిదేకరసమయిన బ్రహ్మను కనిపెట్టినవారున్నారు- హేయోపాదేయబుద్ధులు ఆత్మజ్ఞానం లేనందువల్ల పుట్టుతున్నాయి- ఈ రెండుబుద్ధులు లేనివాడు జ్ఞాని. ఇలాంటిజ్ఞాని అతిదుర్లభుడు- భూలోకమున రాజ్యమేలుగాక- స్వర్గలోకమున వర్షాధిపతియై మేఘమండలమును చేరుగాక. వరుణలోకమున వరుణుడై జలమునుపొందుగాక- యోగసిద్ధులచేత ప్రపంచమంతటా సంచరించుగాక, ఆత్మసాక్షాత్కారం లేనిదే విశ్రాంతిలేదు. ఇలాంటి విశ్రాంతిని కోరేవాడు జన్మమరణములను నశింపచేసికోవాలి- అందుకు జితేంద్రియులయిన మహానుభావులను ఉపాసించాలి- ప్రతిలోకంలోనూ ఉండేవి పంచభూతాలే-

భౌతికాలు భూతమాత్రములనీ, భూతములు తన్మాత్రమాత్రములనీ, తన్మాత్రలు అవ్యక్తమాత్రములనీ, అవ్యక్తం అధిష్ఠానబ్రహ్మమాత్ర మనీ, విచారణచేస్తే ప్రపంచం మిథ్య అనే బోధకలుగుతుంది. ఆపైన దేనియందూ రతి కోరిక ఉండదు-

పైనచెప్పిన యుక్తితో సంచరించేవాడికి ప్రపంచం గోష్పదం అంతటిది. యుక్తిరహితుడికి ప్రపంచం ప్రళయకాలసముద్రం అంతటిది- అపరిచ్ఛిన్న ఆత్మానంద దృష్టిలో ఈబ్రహ్మాండం అత్యల్పం- అందులో ధనదారాపుత్రాదులు మరీ అల్పం- ఆదృష్టిలో ఉన్నవాడికి ఇలాంటి వాటిమీద కోరిక ఉండదు- వీడు దానంచేసేదీ లేదు. అనుభవించేదీ లేదు- ఆత్మజ్ఞానంలేని మూఢులు రాజ్యాదిసుఖం కోరి యుద్ధాలు చేస్తారు. రామా! అది నేను మెచ్చను. అందులో వాళ్ళకు ఏమాత్రం విశ్రాంతీ సుఖమూ ఉండదు- బ్రహ్మలోకసుఖంమీద కోరికకూడా అతత్త్వవేత్తలకేకాని తత్త్వవేత్తలకుండదు- ఆలోకంకూడా ద్విపరార్ధా వధికాలంతో నశించేదే. నశించేవాటిమీద కోరిక అవినాశమయిన ఆత్మను తెలుసుకున్నవాళ్ళకు ఉండదు- తత్త్వవేత్తయొక్కదృష్టిలో ఈజగత్రయానికి ఉత్పత్తి లేదు- అందుకు "ననిరోధోనచోత్పత్తిః" అను నది ప్రమాణము- గొడ్డురాలి బిడ్డతో సమానమయిన ఈప్రపంచంలో చిదాత్మకుపడేది ఏమీ ఉండదు- కనుక జ్ఞానికి తుచ్ఛమయిన ప్రపంచంమీద కోరిక ఉండదు. రాజ్యం అంటే కొండలూ, గుట్టలూ, సముద్రాలతో కూడిన ఈభూమిని ఏలుటయేకదా! ఇందులో సారం చాలాతక్కువ. అసారమయినభాగం చాలాఎక్కువ. ఉదారాశయం గలవాడిని ఇది (సార్వభౌమాధికారము) ఏమీ తృప్తిపరచ లేదు- ఆత్మజ్ఞానికి ఈ ముల్లోకములలో అవశ్యకర్తవ్యమయిన అంశం ఏమీ లేదు- మృగతృష్ణ సూర్యునియొక్క ప్రకాశను అనుసరించే బయలు దేరుతుంది. అందుచేత దానికి సూర్యుడితో అపేక్షఉంది- సూర్యుడు ఆ మృగతృష్ణకు నిమిత్తమయినా ఆ మృగతృష్ణను అపేక్షించడు-

అలాగే తత్త్వవేత్తయొక్క చిత్ప్రకాశను అపేక్షించే జగత్తు సిద్ధిస్తుంది. అందుచేత జగత్తుకు (ప్రపంచానికి) తత్త్వవేత్తతో అపేక్ష ఉంటుందిగాక. తత్త్వవేత్తకుమాత్రం అవాప్త సర్వకాముడయినందున ప్రపంచంతో అపేక్షలేదు. పైగా తత్త్వవేత్త ప్రపంచాన్ని కడగంటితోకూడా చూడడు. పిల్లగాలులకు కొండలు కదలవు. ఈ చవటభోగాలకు తత్త్వజ్ఞాని చలించడు. రామా! జ్ఞాని మహోత్తమమయిన ప్రకాశస్థితిలో ఉంటాడు. అతని ప్రకాశంక్రింద సూర్యచంద్రగోళకములు పాతాళము వంటివికూడాకావు. అనగా అంధకారబంధురమయిన పాతాళలోకం వంటివికూడాకావు. ఇంక ప్రకాశాత్మకము కాదని వేరే చెప్పనేల? తత్త్వవేత్తయొక్క చిత్ప్రకాశంవల్ల బ్రహ్మాదిలోకపాలురుకూడా సర్వసాధారణమయిన చిత్ప్రకాశముకలవారై వారివారిపనులు నెరవేర్చుకొనుటకు తగినజ్ఞానం కలవారై అజ్ఞానంలో మునిగి అజ్ఞానులవలె వారి శరీరాన్ని వారు రక్షించుకుంటున్నారు ఆధికారిక ప్రారబ్ధకర్మ ప్రాబల్యంచేత. దృఢమయిన వైరాగ్యంగల తత్త్వజ్ఞానిని లోకపాలురు అనుభవించే త్రైలోక్యరాజ్యాది భోగాలు ఏమాత్రం లోభపెట్టలేవు. ఎంతగా జ్ఞానికి కట్టెదుట కనిపించుచున్నా కాని మహాతాండవనాట్యంలో ఉన్న ఈశ్వరుని పార్వతీదేవి మోహింపచేయలేదు. కోతివలె అతి చంచలమయిన ప్రాపంచికపదార్థాలు తత్త్వజ్ఞునిని ఆశపెట్టలేవు. రత్నమును బయటఉంచినపుడు దానిలో బయటనున్న స్తంభకుడ్యాదులు ప్రతిఫలిస్తాయి. అదే రత్నమును ఒకకుండలో ఉంచితే అంతకు లోగడ ఆరత్నంలో కనిపించిన స్తంభకుడ్యాదప్రతిబింబశోభ అప్పుడు(కడవలో ఉంచినపుడు) ఉండదు. రామచంద్రా! తత్త్వవేత్త ఈ జగద్వైభవం అంతా అనిర్వచనీయమనీ, తుచ్ఛమనీ తెలిసి దానిమీద రుచిచూపడు. రాజహంస ఎండిన తామరకాడల మీద రుచిచూపదు. అన్నారు వసిష్ఠులు.

## ౫౮. కచగాథ

వసి॥ రాఘవా! ఈ విషయంలో (ఆరూఢజ్ఞాని సర్వాత్మ భావంలో ఉంటాడనే విషయంలో) పూర్వం జరిగినదీ, బృహస్పతి కుమారుడయిన కచుడు చెప్పినదీ, ఒకగాథ ఉన్నది. దానిని చెబుతా విను. పరమ పవిత్రమయినది అది. ఒకానొకప్పుడు మేరుపర్వతము యొక్క గుహలోఉండి బృహస్పతి కుమారుడు కచుడనేవాడు తాను విన్నటువంటి బ్రహ్మవిద్యచే మననినిదిధ్యాసన పరిపాకమును పొంది ఆత్మస్వరూపంలో విశ్రాంతి పొందిఉన్నాడు. తత్త్వజ్ఞానామృతంతో పరిపూర్ణమయిన అతడి మతి, అతి పేలవమయిన ఈ పాంచభౌతిక ప్రపంచంలో రమించలేదు. అందుచేత అతడికి ఆత్మాతిరిక్తమయిన వస్తువేదీ గోచరించక ఒంటరిగాఉండి నిర్విణ్ణుడివలె హర్షగద్గదమయిన మాటతో ఇలా అన్నాడు— "నేనేమిచేసేది? ఎక్కడకువెళ్ళేది? దేనిని స్వీకరించేది? దేనిని విడిచిపెట్టేది! ప్రపంచంఅంతా ఆత్మస్వరూపంతో వ్యాప్తమైఉంది. మహాప్రళయంలో ప్రపంచమంతా ఏకజలార్ణవమయినట్లు— దుఃఖమూ, దుఃఖమునసుభవించే జీవుడూ, జీవుడు అభిలషించే సుఖమూ, వీటిసాధనాలూ, ఇవన్నీ నాకు ఆత్మమయము లయినాయి. అనగా ఆత్మే అని తెలుస్తోంది- ఆనందైకరసుడయిన ఆత్మస్వరూపంతో సర్వదుఃఖాలూ నశించాయినాకు. సర్వసుఖాలు లభించాయి. కాబట్టి యింక హానోపాదానాలతో ప్రయోజనంలేదు. "ఆత్మైవాధస్తాత్, ఆత్మోపరిష్టాత్, ఆత్మాపశ్చాత్, ఆత్మాపురస్తాత్, ఆత్మాదక్షిణతః, ఆత్మోత్తరతః, ఆత్మైవేదం సర్వం" అనే శ్రుత్యర్థము నాకు అనుభవమయింది. వివర్తరూపములయిన ప్రాపంచిక వికారాలను చూస్తే వీటన్నిటికీ అధిష్ఠానంగా ఆత్మ సర్వత్ర ఉన్నట్లు గోచరిస్తోంది. ఈ వికారదృష్టి లేనపుడు మొత్తమంతా ఆత్మరూపంగానే భాసిస్తోంది ప్రపంచం. ఈదృష్టిలో నేను సర్వదా పరమార్థాత్మస్వరూపంలో ఉన్నాను. చేతనాచేతన ప్రపంచమంతా సద్రూపాత్మస్వరూపం

గానే భాసిస్తోంది. అందుచేత నేను పరిపూర్ణానందరూపుడనై ఉండి పోయాను ఇది నాకు ప్రణవోపాసనా బలంచేత లభించింది అకార, ఉకార, మకార, ములనే మాత్రార్థములను తురీయునియందు లయింప చేసికొని తురీయాత్మస్వరూపాన్ని భావిస్తూ నేను కారణస్వరూపం లోనూ లేను, కార్యరూపంలోనూ లేను, నా నిరతిశయానందరూపంలో ఉన్నాను" అని అన్నాడు. ఇది ఆ శుకమునిగాథ. అన్నారు వసిష్ఠులు.

## ౫౯. బ్రహ్మదేవుని వ్యవహారవర్ణనము

రామా! ఈసంసారంలో అన్నమూ, పానమూ, అంగన, మున్నగు విషయాలతో జిహ్వోపస్థాది యింద్రియములకు సంబంధం తప్ప వేరే పురుషార్థం ఏమివున్నది. మోక్షమువలె కామముకూడా పురుషార్థచతుష్టయంలో చేరినందున పురుషార్థమేయని వాంఛించిన భోగలోలురు నరగర్దభములనుటలో తప్పులేదు. తిర్యగ్జంతువులూ, పశువులూ, అతిమూఢులూ ఏపనిచేస్తున్నవో ఈమానవులు కూడా అదేపనిచేస్తున్నారు. వాటికీ వీళ్ళకు తేడాఏమి? ఒక పక్క వెంట్రుకలు. ఒకప్రక్క రక్తమాంసాలు. ఏమిటి ఈస్త్రీ శరీరంలో వుండే సొంపు. ఇంతగా వీళ్లు మురిసిపోవటానికి. ఇలాంటి మానవులు సారమేయములు. (కుక్కలు) భూమి అంతామట్టే. చెట్లుఅన్నీ కొయ్యలే. శరీరాలన్నీ మాంసమయములే. ఏమిటి యిందులో సంతోషించదగిన వస్తువు? అన్నిటికీ క్రింది నేలపైన ఆకాశం ఇందులో సుఖించడానికి అపూర్వమయినవస్తువు ఎందులో ఉన్నది? విషయేంద్రియ సంబంధము వల్ల కలిగే భోగములన్నీ వివేకానంతరం భంగురములే. అవిచార రమణీయములే లోకవ్యవహారాలన్నీ, సుఖాశయొక్క పర్యవసానంలో దుఃఖంతప్పకుండాఉంది. పాపవిషయాలతో కాలుష్యంకాని, విషయ వియోగంతో దుఃఖంకాని, సుఖాశలో తప్పదు. విషయభోగములు అనిత్యములు. సంపదలు ఏనుగుతొక్కిన తీగలవలె బ్రతుకవు. ఆడది రక్తమాంసాలతో కూడినబొమ్మ. ఎముకలగూడునకు "కాంత" అని

పేరు పెట్టుకొని ఎంతో ఆదరంతో కౌగలించుకుంటున్నారు పురుషులు. ఇది ఆ మగవాళ్ళయొక్క కామానికిగల వెర్రితల. (కామముయొక్క క్రమము) కనుక ఈసంసారం రామా! అజ్ఞానికే సంతోష కరంకాని జ్ఞానికి సంతోషకరం కాదు. విషం తింటేనే మూర్ఛవస్తుంది. కాంతను తాకితేచాలు, లేకచూస్తేచాలు. మూర్ఛపోతారు మానవులు. ఇలాగే కనకంకూడా. ఈ రెండే సంసారంలో ప్రధానం. కనుక రామా! నీవు భోగాస్థను వదలి సర్వమూ ఆత్మేఅనే భావంలో ఉండు- చిత్తం అనాత్మభావంలో ఉన్నపుడే ఈజగజ్జాలం వెంటబడుతుంది. మానవుల మనోవాసనలను అనుసరించే చతుర్ముఖబ్రహ్మ యీ ప్రపంచాన్ని సృష్టించాడు. సూర్యుడి వెలుగు తెల్లగాఉన్నా అది ఇంద్రనీల రాతి గోడమీదగాని, బంగారురాతిగోడమీదగాని, సోకేయడల, దానిని అనుసరంచే ప్రకాశిస్తూ ఉంటుంది. అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ! పూర్వజన్మలో వ్యష్ట్యభిమానంలో ఉన్న మనస్సు కార్యబ్రహ్మరూపాన్ని పొంది, భూతగ్రామంతో నిబిడమయిన ఈ ప్రపంచాన్ని ఎలాసృష్టిస్తోంది? అని అడిగాడు.

వసి॥ రామా! పద్మకోశమునుండి బయులుదేరి బ్రహ్మదేవుడు "బ్రహ్మ" అను శబ్దంచేశాడు- అందువల్ల బ్రహ్మఅయినాడు. ఆపైన అతనికి ఉత్తరసృష్టిని గురించిన సంకల్పం ఉదయించింది- పిదప తేజస్సు సృష్టించాడు- తాను అందులో ప్రవేశించాడు. తేజోమయమయిన ఆకారాన్ని ధరించాడు. అతడే ఇప్పటికిని సూర్యుడై ప్రత్యక్షంగా ఉదయిస్తున్నాడు- భూనభోంతరాళాలు వెలిగిస్తున్నాడు. ఇలా సూర్యుణ్ణి సృష్టించగా మిగిలిన తేజఃకళలను విభజించి మరీచ్యాది ప్రజాపతులను సృష్టించాడు. ఆపైన దేవదానవ యక్షరాక్షస మానవ వాదులను తయారుచేశాడు. వేదాలు క్షుణ్ణంగా ఆలోచించి అనేక యజ్ఞములను సృష్టించాడు- ఇలా మనోరూపుడయిన బ్రహ్మదేవుడు, భూతసంతతి సంకులమయి, సముద్రాలతో కొండలతోనూ, చెట్లతోనూ

నిండిఉన్న ప్రపంచాన్ని సృష్టించాడు. మేరుభూపీఠాదికుంజములతో కూడినదాన్ని సృష్టించాడు- సుఖదుఃఖజన్మజరామరణాలతో కూడిన ప్రపంచాన్ని సృష్టించాడు. రాగద్వేషమయమయిన ప్రపంచాన్ని సృష్టించాడు గుణత్రయాత్మకమయిన ప్రపంచాన్ని సృష్టించాడు- వెనుకటిసృష్టిలో ఏదిఎలాఉన్నదో ఈ సృష్టిలోకూడా దానిని అలాగే పుట్టించాడు. అనగా వెనుకటి కల్పంలో కర్మలు కాయికములయితే ఈ కల్పంలోకూడా అంతే. వెనుకటికల్పంలో ఉపాసనాదులు మానసికములయితే అవి యీకల్పంలో కూడా అంతే- ఇలాగంటి మానసికమగు మిథ్యాసృష్టి స్థిరంగా గోచరిస్తోంది. లోకంలో జరిగేపనులన్నీ సంకల్పవశంచేతనే జరుగుచున్నాయి. దేవతలందరూ సంకల్పవశంచేత వారివారిపనులందు నియతంగా ఉన్నారు. ఇలా సృష్టి నడచిన తరువాత చాలాకాలానికి ఇంద్రవిరోచనాదులూ, దేవాసురప్రజానాథులూ, ధర్మాధర్మాభివృద్ధికొరకు ప్రయత్నించి, సాత్త్విక, రాజస, తామసాది వృత్తులకు లోనై, పరస్పరవధ, బంధ, జన్మ, జరా, మయాది క్లేశసహస్రాలను అనుభవిస్తూ ఉండేసరికి సృష్టికర్త అయిన హిరణ్యగర్భుని యొక్క సృష్టికి అతిబాధ కలిగింది- హిరణ్యగర్భుడు జగత్ సృష్టినుండి నిర్విణ్ణుడయినాడు- ఇలాఆలోచించాడు. "నేను నాసంకల్పమాత్రం చేత ఈ మహాప్రపంచం సృష్టించాను- సమస్త భూతాలకు ఇంతభోగం ప్రసాదించాను. ఇకముందు ఈపనినుంచి నేను విరమిస్తాను. ఈకల్పనానర్థసంకటంలో నాకేమిపని ? నేను అనాద్యంతమయిన బ్రహ్మపదమునందు సుఖంగా ఉంటాను." అని నిశ్చయించుకొని పరమాత్మను స్మరించుకుంటూ రహస్యప్రదేశమున అహంకార మమకారాలు లేకుండా నిశ్చలంగా ఉండి సంసారంలో ఉండే గుణదోషాలను విచారించి కరుణాక్రాంతచిత్తుడై సమస్త జీవులయొక్క ముక్తికొరకు పురాణాదులను, అధ్యాత్మశాస్త్రాలను చేస్తాడు. మరల సప్తభూమికా లక్షణమయిన పరమపదంలో ఉంటాడు. ఇతడు సమాధిలోఉన్నా, ప్రళయ

వ్యాపారంలో ఉన్నా. సృష్టిక్రియలో ఉన్నా, ముక్తశేషుడుగా ఉంటూనుకాని, ఒకప్పుడు ఆర్జవమనీ, మరొకపుడు దేహధారణయనీ, ఇంకొకపుడు నానాత్వమనీ, ఒకపుడు పద్మమునందు ఉనికీ, మరొకపుడు అందు లేకుండుట, అనే చిత్తవృత్తులు యేవీ ఉండవు.

ఇతని సృష్టిమూడువిధాలు. 1) విధ్యనీకము. 2) సురానీకము. 3) నరానీకము. అని ఇందు మొదటితెగ సంకల్పసిద్ధులు స్వయంగా సంప్రాప్తమయిన జ్ఞానైశ్వర్యములుకలవారు. వీరు ఉత్తములు. రెండవ తెగవారు దేవగంధర్వయక్షాదులు- వీరు సకృదుపదేశమాత్రంచేత సంప్రాప్తమయిన జ్ఞానైశ్వర్యములు గలవారు- వీరు మధ్యములు. సాత్త్వికులు- 3 మూడవ తెగవారు. రజస్తమోగ్రస్తులయిన మనుష్యాదులు ప్రయత్నసహస్రములచే (అనేకవేల ప్రయత్నాలచే) జ్ఞానైశ్వర్యములను సంపాదించుకో తగినవారు. వీళ్లు అధములు.

ఇందు మొదటి తెగవారు. (విధ్యనీకము) అనగా సనకసనందనాదులూ, మరీచ్యాదులూ, సర్వప్రపంచమూ ఉపరతి చెందేసరికి స్వయంగానే బ్రహ్మాకాశంలో చేరిపోతారు. వీరికి ఉపదేశాదిప్రయత్నములు అవసరంలేదు- రెండవతెగవారికి (సురానీకానికి) అనగా దేవగంధర్వయక్షాదులకు ఉపదేశమాత్రం అవసరం. వార్లకు అంతమాత్రంచేతనే బ్రహ్మజ్ఞానం కలిగి బ్రహ్మప్రాప్తి కలుగుతుంది. మూడవవారు (నరానీకము) పురుషప్రయత్నంచేత సజ్జనసహవాసము, సచ్ఛాస్త్రశ్రవణము, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము మున్నగు ఉపాయములను ఫలపర్యంతము అభ్యసించాలి. అప్పుడుకాని వీరికి ముక్తి లభించదు, రామభద్రా! సృష్టి ఇలా మూడువిధాలుగా ఉన్నది. ఇది అంతా సంకల్పమాత్రంచేత తయారైనదేకాని వేరువిధంగా రాలేదు.

## ౭౦. తత్త్వవిచార పురుష నిర్ణయము.

వసి॥ రామచంద్రా! సృష్టివ్యవస్థయందు నిమగ్నుడయిన పితామహుడు ప్రళయకాలసమాధినుండి లేస్తాడు. కొంతకాలానికి సంసార

మనే ఘటీయంత్రం మరణించిన జీవరాశిని, మరల శరీరమును ధరించి జీవద్దామనే ఆశ అనే త్రాటితో కట్టి క్రిందకూ మీదికీ త్రిప్పుతూ ఉంటుంది. ఇందులో కొన్ని జీవోపాధులు (మనస్సులు) మాయాశబల బ్రహ్మకు మొదటి కొడుకయిన ఆకాశంలో సుడిగుండము తిరుగుచున్నట్లు తిరుగుతూ ఉంటాయి. ఇందులో కొన్ని ఎల్లప్పుడూ అగ్ని నుండి విస్ఫులింగములవలె బయటికి బయలుదేరుతాయి. మరికొన్ని ఉపాధిలయం చెంది నిద్రయందువలె విశ్రమించి ఉంటాయి. రామచంద్రా! ఉత్పత్తికి తయారయిన జీవరాశులు మాత్రం పంచభూతములు పుట్టినతరువాత శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, లక్షణమయిన తాన్మాత్రలతో కూడుకొని లింగశరీరాన్ని పొంది క్రమంగా చతుర్విధ భూతసంఘములయొక్క శరీరములలో ప్రవేశిస్తారు. తరువాత ఆశరీరములలో రేతాభావాన్ని చెంది, క్రమంగా ప్రపంచంలో అనభివ్యక్తములయిన జ్ఞానైశ్వర్యములు కలవారై వెనుకటిసర్గలో చెప్పిన నరానీకంగా పుట్టుతారు.

మరికొంతమంది మాత్రం, (దేవగంధర్వాదియోనులు) లింగశరీర ప్రాప్తిపర్యంతం వెనుకటివిధంగానేవచ్చి ఆపైన ఓషధులందునో వనస్పతులందునో (వృక్షములందునో) ప్రవేశించి, పాలరూపంగానూ, ఆజ్యరూపంగానూ పరిణామం చెంది, అగ్నిహోత్రమై ధూమముద్వారా సూర్యమండలం చేరి ధూమాదిమార్గం చేరక చంద్రకలాస్వరూపంతో కల్పవృక్షములయొక్క ఫలములందు రసరూపంతో ప్రవేశించి, ఆకల్పవృక్షఫలములను అనుభవించెడి దేవతలయొక్క రేతోరూపాన్ని చెంది దేవతాగర్భములందు దేవతలుగా పుడతారు. వీరు ఈజన్మలో అత్యుదారమయిన సాత్వికభావంతో ఉండేయెడల అదేజన్మలో జ్ఞానాన్ని పొంది జీవన్ముక్తుల వ్యవహారంలో ఉంటారు.

ఇంక ఇందులోకూడా (అనగా ఈ దేవతాజాతిలోకూడ) దేవలోకంలో ఒకానొక పదవీ అధికారం పొందటానికి కర్మలనుగాని ఉపా

సనలనుగాని అనుష్ఠించి ఉన్నవాళ్లు భోగలంపటులై భోగములకొరకే జన్మించిఉంటారు కనుక వీరు తమోగుణయుక్తులయిన రాజససాత్వికు లనబడెదరు.

ఇకముందు మొదటి తెగవారియొక్క సాత్వికత్వమును గురించి వారికి పునర్జన్మరాహిత్యమును గూర్చి చెబుతావిను. రామా! వీరు (మొదటి తెగవారు) అనగా విధ్యనీకము. కడసారిజన్మతో సంసారం లోకి వచ్చారు. ప్రాజాపత్యాధికారాన్ని పొందారు. నరానీకంద్వారా సురానీకంద్వారా ప్రధానులు, కేవలసాత్వికులు. స్వాతస్సిద్ధమయిన జ్ఞానోదయం కలవారు. కాబట్టి పునర్జన్మలేదు వీళ్లకు- రాజససాత్వికు లయిన రెండవతెగవారు (సురానీకముమాత్రమే) పునర్జన్మను పొందు తారు. కేవల సాత్వికులకు అలా పునర్జన్మలేదు- వీరు పూర్వజన్మలో కూడ ఆత్మవిచారంచేశారు. శ్రవణాదిసాధనాలచేత కొద్దిపాటి ప్రతి బంధం ఉండటంచేత, దాన్ని నశింపచేసికొనుటకు తగిన సాత్వికజన్మను ధరించారు. అంచేత ఈజన్మలోకూడా వీరు సదా ఆత్మతత్వాన్ని మననంచేస్తూనే ఉంటారు. రామచంద్రా! ఇలాంటి మహానుభావులు వెదకినా దొరకరు. నూటికి కోటికి ఒక్కరుమాత్రమే ఉంటారు- ఇంక ఈమూడు తెగలవారికంటె, (విధి, సుర, నరా, నీకములకంటె నాలుగవ తెగవారు కొందరున్నారు- రాక్షసులూ, పిశాచములూ, తిర్యగ్జంతు వులూ వీళ్లు స్థావరములతో సమానులు. చెట్లూ పుట్ట మొదలయినవి యెంతో వీరూ అంతే- వీరలకు జ్ఞానాధికారం ఉంటుందా? ఉండదా? అని విచారించవలసిన పనియేలేదు. కనుక వారి ముచ్చట నేను ప్రస్తా వించలేదు- రామచంద్రా! ఉత్తమజన్మ సంప్రాప్తమయినా నరులూ, సురలూ కొందరుమాత్రమే సంసారవాసనలో పడలేదు- అనగా వైరా గ్యాన్ని పొందారు. కాబట్టి వైరాగ్యమే ఇంతదుర్లభం- ఇంక తత్త్వ జ్ఞానం ఏమిచెప్పవలెను? వాళ్లలోకూడా నావలె కొంచెం రజోగుణం తో కూడిన సాత్వికులేకాని, శుద్ధసాత్వికులు' అత్యంతదుర్లభులు.

నేను జన్మప్రభృతి శమదమాదిగుణసంపత్తి కలవాడనే. పూర్తిగా ఆత్మవిచారణకు యోగ్యతకలవాడనే. అయినా నిరంతరం సమాధి సుఖం అనుభవించటానికి వీలులేకుండా మీబోటి రాజవంశానికి పౌరోహిత్యాధికారమనేది నా వెంట పడింది విఘ్నంగా. అంచేత నేను రాజససాత్త్వికుడను అయినాను కాని, శుద్ధసాత్త్వికుడను కాలేదు.

రామా ! నావలె నీకుకూడా వైరాగ్యశమదమాది సంపత్తి పరిపూర్ణంగా ఉంది. కాని ఆ పరమాత్మపదమును విచారించకుండుట చేత ఈ సంసారభ్రాంతి విస్తరించి ఉంది నీలో. కనుక ఆత్మస్థానమును గురించి యిప్పుడే నాయెదుటనే శీఘ్రంగా విచారణచేయి. విచార మాత్రంచేత నీవే అద్వితీయబ్రహ్మతత్త్వం అవుదువు. అని అన్నారు వసిష్ఠులు.

## ౫౧ వ సర్గ

రామా ! కించిద్రజోగుణ యుక్తమయిన సత్త్వసంపత్తితో బుట్టిన మహానుభావులు ఎప్పుడూ ఆనందంగానే ఉంటారు. ఆకాశంలో చంద్రకిరణాలు ప్రకాశిస్తూ ఉన్నట్లు మానసికముగు దుఃఖం పొందరు. ఆకాశము మాలిన్యమును పొందదు. అనగా వాడిపోరు. అనగా శారీరకముగు దుఃఖం పొందరు. రాత్రిపూట బంగారుపద్మం వాడదు. జ్ఞానమును, తత్సాధనసంపదను కంటె వేరుదానిని కోరరు. వృక్షాదులు (స్థావరములు) ప్రారబ్ధభోగంకంటే వేరుదానిని కోరనట్లు తమతమ సదాచారములతోడనే తాము రమిస్తూ ఉంటారు. చెట్లు తమ పత్ర పుష్ప ఫలాదులతో రమిస్తూ ఉంటాయి. రాజస సాత్త్వికుల బుద్ధి శుక్లపక్ష చంద్రుడివలె, శిరాత్యాదిగుణామృతపూరితమై వృద్ధిచెం దుతూ ఉంటుంది. ఆపదయందుగూడ సౌమ్యతను విడువదు. చంద్రుడు చల్లదనమును విడువడు. మైత్ర్యాది గుణములతో సహజంగా ప్రకా శిస్తూ ఉంటుంది. అడవిచెట్లు క్రొత్తక్రొత్త పూగుత్తులుగల తీగలతో

శోభిల్లి ఉంటాయి. వీరు సర్వసములు- మహాసామ్యములు- సాధువుల కంటె, సాధువులు- సముద్రములవలె హద్దుమీరనివారు. కాబట్టి వార్లకు దుఃఖరహితస్థానమే గమ్యము. అలాగే ప్రతివానునూ భేద రహితంగా ప్రవర్తించాలి- రజోగుణరహితులయిన సాత్వికులవలె ఆనందగాంభీర్యంతో వృద్ధిపొందుతూ ఉండాలి. సచ్ఛాస్త్రవిచారణ చేస్తారు వారు. అత్యాదరంచేత ప్రపంచంయొక్క- అనిత్యత్వాన్ని విచారిస్తూఉంటారు. ఐహికాముష్మికసుఖములు అన్నీ ఆపదలే కాని సంపదలుకావని విచారిస్తూ ఉంటారు. ఇదీ ఉదార స్వభావుల పరిస్థితి-

కాబట్టి రామా! వివేకంగలవాడు ప్రాపంచికపదార్థాలు అనిత్యములనే భావించాలికాని, నిత్యములని, అనుకోకూడదు. ఎప్పుడూకూడా. అజ్ఞానం రూపుమాపుకోవాలి. ఇది మిథ్యాజ్ఞాన సంతతిని కలిగిస్తుంది- సమ్యగ్ జ్ఞానమునే సంపాదించుకోవాలి- దీనినే నిత్యము స్మరించుకోవాలి- "నేనెవరు ? ఈ సంసారాడంబరం ఎలా కలిగింది నాకు" అని పెద్దలతో విచారణచెయ్యాలి. సత్సాంగత్యం అవసరం. సజ్జనుల సేవ ముఖ్యం. కర్మజాలంలో మునగికూడదు- అనర్థాలను ఆశ్రయించకూడదు- సర్వసంగపరిత్యాగం అవసరం- సంసారంలోఉన్నా నెమలి మేఘమును అనుసరించి యున్నట్లు సజ్జనులనే అనుసరించాలి- ఆంతరము అహంకారం ఒకరకమయిన సంసారం- అంతకంటె బాహ్యమయిన దేహం మరొకసంసారం- అంతకంటె బాహ్యమయిన పుత్రమిత్రాది సంసర్గం ఇంకొకసంసారం- ఈమూడూ మూడుసముద్రాలే- వీటిని దాటడానికి వేరే తెప్పలేదు- ఆత్మవిచారమే తెప్ప- కాబట్టి ఆత్మవిచారం పూర్తిగా చెయ్యాలి- నిత్యం (నిజం) గుర్తించాలి. ఎంత యింపుగాఉన్నా శరీరాహంకారాలను అస్థిరాలని విడిచిపెట్టాలి.సర్వానుస్యూతమయిన సాక్షిచైతన్యాన్నే పట్టుకోవాలి- దారమునందు మణులుకూర్చినట్లు ఈప్రపంచం అంతా సాక్షిచైతన్యమునందే కూర్చబడిఉంది-విశాలమయిన భూలోకంలోనూ సూర్యుడియందూ,భూవివరం

లోనూ, కీటకములపొట్టలోనూ, ఉన్న చైతన్యం ఒక్కటే- ఘటాకాశ మహాకాశాలకు భేదంలేదు. అలాగే జీవబ్రహ్మాలకు భేదంలేదు. పరమార్థంలో- లోకంలో ఒకడికి తీపిరుచి. ఒకడికి పులుపురుచి. ఒకడికి చేదురుచి. ఒకడికి మరొకటిరుచి- ఈరీ రుచులలో వస్తువులు మారుతున్నాయికాని, రుచిమాత్రం అందరిలోను సమానాకారంగానే ఉన్నది. అలాగే దేహాలు వేరువేరుగా ఉన్నాయికాని దేహాలలోఉండే చైతన్యం మాత్రం అంతటా సమానమే. సద్రూపమయిన ఆత్మవస్తువు ఒక్కటే ప్రపంచమంతా నిండిఉన్నా, "వాడుపుట్టాడు" "వీడుచచ్చాడు" అనే బుద్ధిమాత్రం మూఢజనప్రసిద్ధమయి ఉంది. ఇది శాస్త్రానికి ఒప్పదు- రాఘవా! లోకంలో ఉండి నశించే వస్తువే లేదు- ఉన్నవస్తువయితే (సద్రూపమయితే) దానికి నాశంలేదు- నశించేయెడల అది ఉన్నదే కాదు- "ఉన్నది" "పోయింది" అనే బుద్ధులన్నీ ఆభాసమాత్రం. ఈ సంసారం సత్తూకాదు- అసత్తూకాదు- ఎందువల్లనంటే, ఏది మోక్షం కలుగునంతవరకు అభివ్యక్తమయిన చిత్తంలో స్పష్టంగా గ్రహింపబడుతూ ఉంటుందో అది అంతవరకు తన కాలంలో ఉన్నందున అసత్తు కాదు- మోహనివృత్తి కలిగిన తరువాత లేదుకనుక సత్తుకూడాకాదు- మోహజాలం బొత్తుగా లేకపోతే జ్ఞానం దేనిని పోగొట్టుతుంది- జ్ఞానంవల్ల పోగొట్టవస్తువే లేకపోతే ఇంక జ్ఞానం ఎందుకు? ఇంక మోహజాలం అత్యంత స్థిరమయితే అప్పుడుమాత్రం జ్ఞానంచేసేపని ఏమిఉన్నది- సత్యమయిన దానిని పోగొట్టుశక్తి జ్ఞానమునకుండదుకదా! అందువల్ల పరిశేష న్యాయంచేత మోహజాలమయిన ఈసంసారం సదసద్విలక్షణమనీ, అనిర్వచనీయమనీ, తేలింది- రజ్జుసర్పాదులవలె- అని అన్నారు వసిష్ఠులు-

## ౩౨వ సర్గ-

శీతోష్ణములు, బాహ్యద్వంద్వాదులు, సుఖదుఃఖములు, ఆంతర ద్వంద్వాలు ఈరెంటినీ సహించి, ఊహాపోహాకుశలుడై, స్వయముగా

గురువుయొద్దకు వెళ్ళి తత్త్వశాస్త్రమును విచారించాలి. సత్కులమందు బుట్టి విరాగిఅయిన మహావిద్వాంసునితో విచారించినవాడు సంప్రజ్ఞాత సమాధికి ఆవలిస్థానమును చేరుతాడు. శాస్త్రవిచారణ, సజ్జనసాంగత్యము, వైరాగ్యము, మొదలగువాటిని నిరంతరము అభ్యసించి, చక్కని సంస్కారముగల పురుషుడు నీవలె తత్త్వవిచారమునకు అర్హుడవుతాడు. రామా! నీవు సదాచార సంపత్తి కలవాడవు. ధీశాలివి. గుణాకరుడవు. సంసారమలమును వీడి, నిర్దుఃఖంగా ఉన్నావు- మేఘాలు తొలగిపోయిన శరత్కాల నభమువలె ఉన్నావు. సంసారవాసన లేదు నీకు- ఉత్తమజ్ఞానం అబ్బింది నీకు- నీ మనస్సు బాహ్యవస్తుచింతలను వదలింది- బ్రహ్మాకారవృత్తిని పొందింది. ముక్తుల అనుభవాన్ని ఆశ్రయించింది- ఇందుకు సందేహంలేదు- ముక్తిని కోరువారందరు రాగద్వేషరహితులై నీచేష్టలనే అనుసరించుచున్నారు- ధీమంతులగుచున్నారు- భవార్ణవం తరిస్తున్నారు- తత్త్వజ్ఞానమనే నౌకను అధిష్ఠిస్తున్నారు- నీవంటి బుద్ధిశాలి ఎంతేని సుజనుడు- సమదర్శనుడు- నేను చెప్పిన జ్ఞానదృష్టులలోకెల్ల యోగ్యుడు- ఇకముందునుంచి నీవు శరీరం ఉన్నంతవరకూ రాగద్వేషాలు లేకుండా వ్యవహరించు- లోకోచితమయిన బాహ్యపనులు చేస్తూ ఉండు. మనసులో ఏషణాత్రయం త్యజించు- పరమశాంతంగాఉండు గుణవంతులవలె. లోకంలో కొందరు నక్కలవలె యుక్తిగా నటిస్తూ పరులను మోసపుచ్చేవారు ఉంటారు- కొందరు అతిమూఢులై యథేచ్ఛగా సంచరించేవారుంటారు. ఇలాగంటి వారిపోలిక నీకువద్దు- జీవన్ముక్తుల శమదమాదిగుణములను సేవించే మానవుడు సామాన్యుడయినను క్రమంగా జ్ఞానంపొంది చరమ జీవన్ముక్త శరీరం పొందుతాడు- గొప్పజాతివార్ల గుణాలను సేవించేవాడు గొప్పజాతిలో పుట్టుతాడు- తక్కువజాతి వాళ్ళను సేవించేవాడు తక్కువజాతిలో పుట్టుతాడు- ఈనియమం తప్పదు- కనుక ఎంతటి నికృష్టుడయినా మోక్షంకోరకే ప్రయత్నించాలి. పురుషప్రయత్నం విడువనివాడికి, ఫలసిద్ధి ఎన్నటికయినా కద్దు- దానిని విడిచినవాడికి

ఎప్పటికీ ఫలసిద్ధిలేదు- రాజులయొక్క సేనలు నీతిశాస్త్రమును అనుసరించిన పురుషప్రయత్నంచేతనే జయింపబడుచున్నాయి. కొండలమీది అడవులుకూడా ఛేదనరూపమగు పురుషప్రయత్నంచేతనే నశింపచేయబడుచున్నాయి- తామసజాతిలో పుట్టినవాడయినా, రాజసజాతిలో పుట్టినవాడయినా సత్త్వతమోమిశ్రమయిన సర్పాదిజాతియందు పుట్టినవాడయినా వాడిబుద్ధిని ఉద్ధరించుకోవలెను- అనగా విషయములనుండి మరల్చుకోవలెను- తమ తమ వివేకంచేతనే ఉత్తమజన్మ లభిస్తుంది. కనుకనే రామచంద్రా! చిత్తమనే స్ఫటికమును నిర్మలపరచుకొనుమని నిన్ను నేను నియోగించుచున్నాను. పురుషప్రయత్నంచేతనే విలువలేని గుణములు అబ్బుచున్నాయి-ముముక్షువులగుచున్నారు.కడపటి సాత్త్విక జన్మను పొందుచున్నారు- గుణశాలి పురుషప్రయత్నంచేత పొందరానిది భూర్భువస్సువర్లోకములలో ఏదీలేదు - కనుక బ్రహ్మచర్యమూ, వైరాగ్యమూ, మనోనిరోధములతో గూడిన పురుషప్రయత్నం లేనిదే వాంఛితము నెరవేరదు.

కాబట్టి రామా! సత్త్వగుణోపేతమయిన చిత్తముతో, నిరతిశయానందరూపమగు ఆత్మతత్త్వమును ఆత్మభావముతో స్థిరపరచుకో. శీతశోకరహితవగుదువు- నిన్ను ఆదర్శునిగా జేసికొని మరియొకడు గూడ నీవలె ముక్తిని పొందుగాక-

రామభద్రా! నీవు వివేక మహిమ కలవాడవు- శమదమాది గుణములతో అభిరాముడవు. చరమజన్మయందు జీవన్ముక్తుల యొక్క ఏడవ భూమికయందున్న వాడవు. నేను వైరాగప్రకరణంలో చెప్పిన భవసంగవిమోహచింత, (సంసారసంబంధమునుంచి కలిగెడి యవివేక స్థితి నీనుండి తొలగిపోగాక- అని అన్నారు వసిష్ఠులు.

స్థితి ప్రకరణము సమాప్తము.

ఓమ్

# ఉపశమ ప్రకరణము

## ౧. వసిష్ఠుని ఆహ్నికవర్ణనము

ఉత్పత్తి ప్రకరణంలో ప్రపంచసృష్టి యావత్తూ మనోధీనమని చెప్పబడినది- దానిచే సృష్టిశ్రుతులయొక్క తాత్పర్యం స్పష్టపడింది. స్థితిప్రకరణంలో ప్రపంచస్థితికూడా మనోధీనమనే నిరూపించారు. దానిచే ప్రపంచస్థితిని ప్రతిపాదించెడి శ్రుతుల తాత్పర్యంకూడ వ్యక్తమయినది. ఇంక ప్రపంచ లయశ్రుతుల తాత్పర్యం వర్ణించాలి. ప్రపంచోపశమము కూడా మనస్సుయొక్క ఉపశమం మీదనే ఆధారపడి ఉంది. ఈ విషయమును నిరూపించుటకే ఈ ప్రకరణము ఆరంభింపబడుచున్నది.

వాల్మీ॥ భరద్వాజా! వసిష్ఠమహర్షి ఇలా ఉపదేశిస్తూ ఉపదేశిస్తూ ఉండగా మధ్యాహ్నకాలపు శంఖధ్వని ప్రళయకాలపు మేఘగర్జితమువలె బయలుదేరింది. వసిష్ఠునిమాటలు ఆధ్వనిలో చేరిపోయినాయి- అంతట తన ప్రసంగం చాలించాడు. ముహూర్తమాత్రం విశ్రాంతి తీసికొన్నాడు శంఖారావం విని- ఇలా అన్నాడు రామునితో- రామా! "ఇంతవరకు ప్రసంగించాను. ఇపుడు మాధ్యాహ్నికకృత్యము ఆసన్నమయింది. అవశ్యం ఆహ్నికమును నెరవేర్చుకోవలెను. మిగిలిన విషయం రేపుప్రొద్దున చెబుతాను- నీవుకూడా లే- స్నానదానార్చనాదిక్రియలు ఆచరించు" అని వసిష్ఠుడు సభనుండి లేచాడు- కూడా దశరథమహారాజు లేచాడు. సభ్యులందరూ లేచారు. వారిద్దరు లేచేసరికి సభ అంతా లేవనారంభించింది- అంతా లేచిపోయింది. రాజులు దశరథునకు మ్రొక్కి- రాజమందిరమునుండి లేచిపోయినారు- సుమంత్రుడూ, మంత్రులూ, వసిష్ఠునకూ, దశరథునకూ, మ్రొక్కి- స్నానానికి లేచారు. వామదేవాదిమునులూ, విశ్వామిత్రాదులున్నూ వసిష్ఠుని

ముందుపెట్టుకుని ఆయనగారి ఆజ్ఞను నిరీక్షిస్తూ బయలుదేరారు. దశరథ మహారాజు మునిబృందాన్ని పూజించి వార్ల ఆజ్ఞ తీసికొని తన పనులు నెరవేర్చుకోటానికి వెళ్ళాడు యింటికి- వనవాసులు అడవిచేరారు- వ్యోమవాసులు ఆకాశంచేరారు. నాగరికులు నగరం ప్రవేశించారు. అందరూ మళ్ళీ ప్రాతఃకాలంలో సభకు రాదలచారు- దశరథ వసిష్ఠుల ప్రార్థనచేత విశ్వామిత్రుడు ఆరాత్రి వసిష్ఠునియింటగడపాడు- బ్రాహ్మణోత్తములు, రాజపుంగవులు, మునిసత్తములు, రామాది దశరథాత్మజులు సేవిస్తూఉండగా వసిష్ఠులు తమ ఆశ్రమం చేరారు- ఆశ్రమం వద్ద వెంటవచ్చిన రామాదులను, రాజులనూ విడిచి ఆశ్రమంచేరి మధ్యాహ్నకాలోచితమయిన పంచయజ్ఞ (బ్రహ్మయజ్ఞ) క్రియను నెరవేర్చాడు-

## ౨. ఉపదేశవర్ణనము

రాజపుత్రులుకూడా యిల్లుచేరి తమతమ యిండ్లలో ఆహ్నికము నెరవేర్చుకొన్నారు. స్నానమాడారు. గో, భూ, తిల, హిరణ్య, శయ్యా, ఆసనాదులను దానం చేశారు. బ్రాహ్మణులకు- భోజనం పెట్టారు. నూతన వస్త్రములను ఇచ్చారు- దేవాలయాలలో దేవతలను పూజించారు- తమ యింటిలో కుల (నిత్య) దేవతలను అర్చించారు- బంధుమిత్ర పరివారంతో సహా భోజనం చేశారు- ఇంతలో సాయంకాలం అయింది- సూర్యుడు అస్తమించాడు- రామాదులు సంధ్యావందనం ప్రారంభించారు. అఘమర్షణసూక్తాలు జపించారు- పుణ్యస్తోత్రాలు పఠించారు- ఇంతలో పండువెన్నెలతో రాత్రికాలం ప్రారంభమయింది- రాజపుత్రులు, (రామాదులు) పూలపాన్పులు, కర్పూరపుపొడితో నిండిన పాన్పులు, శరత్కాలచంద్రబింబమువలె తెల్లగా చల్లగా ఉన్న పాన్పులుమీద పడున్నారు- ఒక్క రాముడికి మినహా మిగిలినవారందరికీ రాత్రి ఒక్కక్షణంలో గడచిపోయింది- రాముడు మాత్రం వసిష్ఠుని మాటలను స్మరిస్తూనే ఉన్నాడు. నిద్ర

పట్టలేదు రాముడికి- పిల్ల ఏనుగు తల్లిని తలచుకున్నట్లు తలచుకుంటూనే ఉన్నాడు మహర్షి మాటలను ఇలా- "ఏమిటి ఈ సంసారచక్రం? ఏమిటీ ఈజనులూ? ఏమిటి యీ చిత్రవిచిత్రములయిన భూతాలు? ఎక్కడి నుంచి వస్తున్నాయి? ఎక్కడికి పోతున్నాయి? మనస్సుకు రూపం ఏమిటి? ఇది ఎలా శాంతిస్తుంది? మాయ ఎలాపుట్టింది? ఎలాపోతుంది ఇది? మాయ మాయమైపోతే కలిగేగుణం ఏమిటి? పోకపోతే ఉండే దోషం ఏమిటి? సర్వవ్యాపకుడయిన పరమాత్మయందు సంకోచము (పరిచ్ఛేదము) ఎలా ఏర్పడింది? మనోనాశం విషయమై వసిష్ఠమహాముని ఉపాయం ఏమి చెప్పారు? దానివల్ల ఫలం ఏమి చెప్పారు? ఇంద్రియ జయానికి ఉపాయమేమిటి? ఫలమేమిటి? ఆత్మను తెలుసుకుంటే ఫలమేమిటి? జీవుడూ, చిత్తమూ, మనస్సూ, మాయా మొదలగు వాటితో ఆత్మే ఈ మిథ్యా ప్రపంచాన్ని తయారు చేస్తున్నాడు- ఇవి అన్నీ మనస్సు అనే దారంమీద ఆధారపడిఉన్నాయి. మనస్సునశిస్తే యివిఅన్నీ నశిస్తాయి- అప్పుడు దుఃఖశాంతి కలుగుతుంది. కాబట్టి దీనికి గట్టిగా చికిత్స చెయ్యాలి. విషయాలనుండి బుద్ధిని (మనస్సును) మరల్చే ఉపాయం ఏమిటి? భోగములను విడువలేము- వాటిని విడువకుండా మనసు ఎంతమాత్రమూ సమస్థితము కాలేదు. ఆధ్యాత్మమార్గంలో- అబ్బా! అప్రతీకారం మహాసంకటం అయింది కదా! మరియు విషయములకు స్వాధీనమయి తయారగునది మనస్సు. కాబట్టి వానినుంచి దానిని మరల్ప సాధ్యం కాదు. మనస్సును విషయములనుండి మరల్చితే కాని తత్త్వసాక్షాత్కారం కలగదు. కాబట్టి ఇది మరొకసంకటం- మానవులకు అవశ్యం సంపాదించతగిన పురుషార్థం ఆత్మతత్త్వం. అనగా మోక్షం- అందుకుకూడా తగినసాధనం (ప్రమాణము) మనస్సే- అది బాహ్యవిషయజాతము గూర్చియే బయలుదేరుతుంది- అందుచేత పురుషార్థమయిన ఆత్మతత్త్వము కదల్చటానికి కూడా సాధ్యం కాకుండా కొండకంటె కూడా బరువయింది మానవులకు- తన క్లిష్టమయిన

భర్తను పొందిన కాంత మరొకనిని పొందదు- బ్రహ్మాకారమును చెందిన మనస్సుకూడా మరొకవస్తువును స్మరించదు- (తలచదు) నా మనస్సులో రాగద్వేషాలు ఎప్పుడుపోతాయి? పుణ్యాపాపాలు ఎప్పుడు పుసుగుపడతాయి? (నశిస్తాయి) ఆత్మయందు ఎప్పుడు విశ్రాంతి చెందు తుంది నామనస్సు? సంపూర్ణ రాకాశశాంకబింబముకంటె శీతలమయిన ఆత్మతత్త్వమునందు మనస్సు ఎప్పుడు విశ్రమిస్తుంది? నేను జీవన్ముక్తి సుఖం ఎప్పుడు అనుభవిస్తాను? నీటిలో తరంగాలు లీనమయినట్లు ఆత్మ తత్త్వంలో నామనస్సు ఎప్పుడు లీనమవుతుంది? తృష్ణ అనే తరంగా లతో పొంగిపోతూ ఆశలనే మొసళ్ళతో నిండిఉన్న సంసారసముద్రాన్ని దాటి నేనెపుడు సుఖంగా ఉంటాను? వ్యాధిరూపమయిన జ్వరము వంటిలోని ధాతువులను మాత్రమే బాధిస్తుంది- ఈ సంసారమనే మహా జ్వరం (సంసారజ్వరం) కళత్రపుత్రమిత్రాదులవల్లనూ, హస్తపాదాద్యవ యవములవల్లనూ, సువర్ణ రజతకాంస్యతామ్రాది వస్తుజాతమువల్లనూ, త్వగసృఙ్మాంసాది ధాతువులవల్లనూ బాధపెటుతోంది- వీనిలో ఏది పోయినా ఈ సంసారజ్వరంతో బాధయే- ఈ పాపిష్ఠిజ్వరం ఎప్పుడు నశిస్తుందో తెలియటంలేదే? అబ్బా! గాలిలేనిచోట దీపంవలె నా చిత్తం ఎప్పుడు నిర్బాధంగా ప్రశాంతంగా ఉంటుంది? దురీహలచే (చెడుకోరికలచే) శరీరాన్ని తగలపెట్టిన (పాడుచేసిన)నాయింద్రియాలు ఎప్పుడు ఈ దుఃఖాలను తరిస్తాయి- 'వాడు' 'వీడు' 'నీవు' 'నేను' అనే భ్రమ ఆత్మబోధవల్ల శరత్కాలమేఘమువలె ఎప్పుడు నశిస్తుంది? మోక్షేచ్ఛ ఉత్కటమయితే స్వర్గసుఖం కూడా గడ్డిపరకవంటిది అవు తుంది. ఆస్థితి పొందాలని నాకుంది. అది ఎప్పుడు కలుగుతుందోకదా! ఓ మనమా! వీతరాగులు చెప్పెడి జ్ఞానదృష్టులు నీలో ఎప్పుడు కలుగుతాయి? చెప్పనాకు? ఓ చిత్తమా! నేనుతాత, తండ్రికొడుకు, అనే మాటలకు భాజనుణ్ణి కాకూడదనిఉంది. ఇలాంటిమాటలు దుఃఖ రూపములయిన అజగరాలు. ఈ పాములకు నేను భక్ష్యం (భోజ్యం) కాకూడదు- ఓ బుద్ధీ! నీవు నాకు చెల్లెలివి. మనమిద్దరం అవిద్యఅనే

ఒక్కతల్లి బిడ్డలము. కనుక నీకు నేను అన్నను. అన్నగారి కోరిక తీర్చు. వసిష్ఠమహర్షి చెప్పినమాటలను విచారించు- మన ఉభయులకు దుఃఖ మోక్షం (దుఃఖనాశం) కలుగుతుంది. ఓ సాధ్వీ! నీకాలికి మ్రొక్కి ప్రతిమాలుతున్నా- నాకు భవోచ్ఛేదమయ్యే (సంసారనాశమయ్యే) భాగ్యం ప్రసాదించు. వసిష్ఠమహాముని మొట్టమొదట (వైరాగ్య ప్రకరణలో) వీతరాగులమాటలు చెప్పారు- రెండవ ప్రకరణంలో ముముక్షువుల ఆచారాన్ని వెల్లడించారు. ఉత్పత్తి ప్రకరణంలో ప్రపంచోత్పత్తిని చెప్పారు. నాల్గవప్రకరణంలో అతిసులభంగా మహా సరళంగా దృష్టాంతాలతో అతిసుందరంగా ప్రపంచస్థితిని వర్ణించారు చక్కని ఆఖ్యానాలతో- ఓమతీ! ఆ విషయం అంతా ఒక్కమారు స్మరించు" అని ఆలోచించాడు రాముడు.

భరద్వాజా! నూరుసార్లు విషయం శ్రవణంచేసినా, దానిని మతిలో మననం చేయకపోతే అదినిలవదు- ఫలించదు. కనుకనే శ్రీరాముడు మొదట మతిని ప్రార్థించినా, మళ్ళీ వెనుకవిన్న విష యాన్ని మననం చేయమని మళ్ళీ చెప్పుకున్నాడు మతితో.

### 3. సభాసంస్థాన వర్ణనము.

మరిన్నీ- ఈ రూపమయిన విచారంతో రాత్రిఅంతా గడచింది రామునికి. తెల్లవారింది. లేచాడురాముడు పడకనుండి ప్రాతఃకాలపు తూర్యధ్వనితో స్నానసంధ్యాద్యనుష్ఠానాలు తీర్చుకున్నాడు- తమ్ముల తోను, కొద్దిపరివారంతోను, వసిష్ఠునియింటికి వచ్చాడు. సమాధిలో ఆత్మపరాయణుడై ఉన్న వసిష్ఠుని దూరంగాఉండి తలవంచి నమస్క రించాడు శ్రీరాముడు. తరువాత ముంగిటలో నిలబడ్డారు అన్నదమ్ము లందరూ- ఇంతలో బాగా తెల్లవారింది. వెలుతురువచ్చింది. మిగత రాజులూ, రాజపుత్రులూ, ఋషులూ, బ్రాహ్మణులూ, అందరూ వచ్చారు. జనసంకులంగా ఉంది వసిష్ఠునియిల్లు ఇంతలో ఒక్క

క్షణంలో లేచాడు సమాధినుంచి వసిష్ఠుడు- వచ్చినవారల నమస్కా తులు అందుకున్నాడు. మునులతోనూ, విశ్వామిత్రునితోనూ కూడుకొని రథమెక్కి- దశరథుని యింటికి వచ్చాడు బ్రహ్మగారు. శక్రనగరం (ఇంద్రపట్టణం) చేరినట్లు- రాజసభను ప్రవేశించాడు- దశరథుడు సింహాసనమునుంచిలేచి రెండుమూడడుగులు ముందుకువచ్చి ఎదుర్కొన్నాడు- అంతట మునులూ, ఋషులూ, బ్రాహ్మణులూ, సుమంత్రాది మంత్రులూ, సామ్యాదివిద్వాంసులూ, రామాది రాజపుత్రులూ యావన్మందీ ప్రవేశించారు రాజసభను. వసిష్ఠునివెంట అందరూ వారి వారి ఆసనములమీద కూర్చున్నారు- వసిష్ఠునిమీద దృష్టిపెట్టుకుని ఉన్నారు. సభ నిశ్శబ్దంగా ఉంది- స్తుతిపాఠకులు మౌనంగా ఉన్నారు. రాత్రి సుఖావస్థితిని గురించిన ప్రశ్న ప్రతివచనాలు పరస్పరం జరిగిపోయాయి- పద్మకోటరములనుండి చల్లని సుగంధవాయువులు బయలుదేరుతున్నాయి- చక్కని పరిమళంగాఉంది సభ అంతా- ఇలాఉండగా మేఘగంభీరమయిన ధ్వనితో దశరథుడు ఇలా అన్నాడు వసిష్ఠునితో-

మూడవసర్గ సమాప్తము.

## ౪. రాఘవప్రశ్న దశరథుడు వసిష్ఠవాక్యములను ప్రశంసించుట.

దశ॥ మహర్షీ! నిన్నటిరోజు ప్రసంగంవల్లనయిన అలసట తీరినదా! అమృతవర్షంతో మమ్ముల ఆనందపరచారు. చంద్రకిరణములు చీకట్లను పోగొట్టును. మహనీయుల మాటలు అజ్ఞానాంధకారములను పోగొట్టును. పై పెచ్చు ఇవి అంతఃకరణములను చల్లపరచును. అపూర్వంగా ఆనందపరచును. ఉత్తమస్థితిని పొందించును. ఎవనినుండి ఆత్మరత్నమును ప్రకాశింపజేసెడి జ్ఞానజ్యోతి యుదయించునో వాడు సుజనుడు- లోకవంద్యుడు- సజ్జనుల మాటలు శారీరదోషాలనూ, మానసికదోషాలనూ, సమస్తేంద్రియదోషాలనూ పోగొట్టును. మహర్షీ! మీ మాటలచేత సంసారంలో సంకెళ్లుగాఉండే ఆశాపాశాలన్నీ అంతరిం

చాయి- ఆత్మతత్త్వం దర్శనం చేసికొనుటకు అర్హులమైనాము. రస విద్ధమయిన అంజనం (కాటుక) చేత చూపుగలిగి జాత్యంధులు బంగారమును చూచినట్లుంది మాపని. సంసారవాసన అనే మంచు చల్లగా జారిపోతుంది మా హృదయాకాశమునుండి మీమాటలచేత.

స్వామీ! మందార పూగుత్తులు ఇలా ఆనందపరచవు. అమృత ప్రవాహతరంగాలు ఇలా తృప్తిపరచవు. అలా తృప్తిపరుస్తున్నాయి మీమాటలు- రామచంద్రుడు మీబోటి బ్రహ్మవేత్తల సపర్యచేత ఏయేరోజు కాలం గడుపుతున్నాడో ఆరోజే వెలుతురుగల పగటికాలం. మిగిలినవి చీకటిరాత్రులక్రిందే లెక్క. నాయనా! రామా! రాజీవ పత్రాక్షా! ప్రకృతవిషయాన్ని అడుగు. మహర్షి అనుగ్రహించడానికి సిద్ధంగా ఉన్నారు. అని అన్నాడు తండ్రి (దశరథుడు) కొడుకుతో (రామునితో)-

ఇంతలో రాముడికి యెదురుగా ఉన్న వసిష్ఠుడు ఇలా అన్నాడు రామునితో. "రామా! రఘుకుల చంద్రమా! నేను చెప్పిన మాటలు ఏమయినా స్మరిస్తున్నావా! పూర్వాపరం విచారిస్తున్నావా! నేను వెనుక జీవరాసులన్నీ సత్త్వరజస్తమోగుణభేదంచేత చిత్రవిచిత్రంగా పుటుతూ ఉంటారని చెప్పాను. జ్ఞాపకం ఉన్నదా? నీకు- ఈస్థూల సూక్ష్మప్రపంచం అంతా బ్రహ్మస్వరూపమనీ బ్రహ్మ దృశ్యములకంటె వేరనీ గ్రహిస్తున్నావా? సర్వసంపన్నుడగున బ్రహ్మనుండి (పరమేశ్వరునినుండి) అవిద్యాబలంచేత ఈ క్షణభంగురమయిన ప్రపంచం ఇంతగా విస్తరించిందని జ్ఞాపకమున్నదా! చిత్తమే నరుడు కాని నరుడంటే వేరు కాదని చెప్పాను జ్ఞాపకమేనా! నిన్నటిరోజు విచారము రాత్రి మనసుకు పట్టించుకున్నావా? పూర్వాపరసందర్భాన్ని పరామర్శించుకొని మనస్సులో నిలుపుకున్నావా? ఆదరాభిమానాలతో విమర్శించుకొని మదిలో నిలుపుకున్న విషయమే ఫలిస్తుంది. అనాదరంతో విన్నది ఫలించదుసుమా! నీవు పరిశుద్ధములయిన మాటలకు తగినవాడవు" అని-

వాల్మీ॥ భరద్వాజా! బ్రహ్మపుత్రుడు (వసిష్ఠుడు) ఈ ప్రసంగం తో కొంత అవకాశం ఇచ్చేసరికి దానిని పురస్కరించుకొని రాముడు ఇలా అన్నాడు-

శ్రీరా॥ స్వామీ! మీమాటలు ఏమాత్రమయినా నామన స్సుకు పట్టినవంటే అది మీమహిమేకాని నాసత్తాకాదు- మీరు లోగడచెప్పిన విషయం అంతా యథార్థమే. గతరాత్రి నిద్రలేకుండా విషయం అంతా హృదయంలో ఆలోచించుకున్నాను- మాబోంట్ల సంసారాంధకారాన్ని పోగొట్టడానికి మీమాటలు సూర్యులై వెలసినవి- నిన్నటి విషయమంతా మనస్సులో నిల్పుకున్నా- రమ్యమూ, పవిత్ర మూ, హృద్యమూ, ఆనందదాయకమూ, అయిన మీఉపదేశాన్ని ఎవరు శిరసా నమస్కరించి గ్రహించరు- మీ అనుగ్రహంచేత సంసార మనే మంచు ఆవరణమును తొలగించుకున్నాము. మీ ఉపదేశము మొదటలో ఆపాతమధురంగా ఉంటుంది. మధ్యలో శమాదిసంపద అనే సౌభాగ్యాన్ని వృద్ధిచేస్తుంది. చిట్టచివరకు అనుత్తమమయిన మోక్ష ఫలాన్ని ప్రసాదిస్తుంది. నీవబోకుసుమములు మాయెడ చక్కగా ఫలించుగాక. అని అన్నాడు రాముడు.

## ౫. ప్రశమోపదేశము.

వసి॥ రామా! ఇపుడు ఉపశమప్రకరణం చెబుతున్నా సావ ధానంగా విను- రాజస, తామస, జీవులు, సుదీర్ఘమయిన ఈసంసార మాయను శిరసాధరిస్తారు. నీబోటి సాత్వికజీవులు దీనిని సులువుగా విడిచిపెటతారు. పాము కుబుసమును విడచినట్లే. కేవల సాత్వికజీవు లూ, రజోగుణమిశ్రితసాత్వికజీవులునూ ప్రపంచముయొక్క పూర్వా పర సందర్భమును విచారిస్తారు. శాస్త్రాభ్యాసంచేతనూ, సజ్జనసహవాసం చేతనూ, సత్కార్యానుష్ఠానంచేతనూ, పాపపరిహారం కలుగుతుంది. సారమును గ్రహించెడి బుద్ధి దివిటీలాగ పుడుతుంది- స్వయంగా విచా

రణచెయ్యాలి. ఎవరిమనస్సు వారి యాత్మను గ్రహించాలి. ఆత్మ తత్త్వజ్ఞానం కలుగునంతవరకు ఆత్మస్వరూపప్రాప్తి కలుగదు- నీవు ప్రజ్ఞావంతులలో మొనగాడవు- ప్రమాణకుశలురలో గొప్పవాడవు- ధీరులలో శ్రేష్ఠుడవు. కులశీలురలో ఉత్తముడవు- జన్మచే రాజస సాత్త్వికులలో ముఖ్యుడవు- కనుక రామా! నీవు స్వయంగా విచారించి తెలుసుకో ప్రపంచ కార్యాలలో ఏది సత్యమో? ఏది అసత్యమో గ్రహించు. సత్యాన్ని నమ్ము. మొదటా, చివరా, లేనిదానికి మధ్య కాలంలో సత్యం ఏమిటి? మొదట, చివర, ఏది ఉంటుందో అదే సత్య మయిన వస్తువు. మరొకటి సత్యంకాదు- ఆద్యంతములయందు లేని వస్తువునందు మనస్సు లగ్నమయిన మూఢపశువుకు ఇంక వివేకం కలిగేదెలా? పుట్టేది మనస్సు. పెరిగేది మనస్సు. చచ్చేది మనస్సు. సమ్యగ్ జ్ఞానంచేత తుదకుముక్తి పొందేది మనస్సు-

శ్రీరా॥ స్వామీ! ఈవిషయం నేనిదివరకే తెలుసుకున్నాను- మన సంసారులకు జరామరణభాజనము. దానిని తరించటానికి తగు ఉపాయం మీరు నిశ్చయించి చెప్పాలి. రఘువంశరాజుల హృదయంలో అజ్ఞానాంధకారానికి మీరే సూర్యులు. అన్నాడు రాముడు.

వసి॥ రామచంద్రా! విను చెబుతాను. మొట్టమొదట శాస్త్రా భ్యాస, సజ్జనసాంగత్యాలచే సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించాలి. మనసును పరిశుద్ధపరచాలి. వైరాగ్యం కలిగినతరువాత నిరభిమానులై విజ్ఞానగురువులయిన గురువుల నాశ్రయించాలి. వారుపదేశించిన మార్గ మును అనుసరించి సగుణేశ్వరుని అర్చించాలి. ధ్యానించాలి. తదను గ్రహం పొందాలి. క్రమంగా పరమపదమును పొందాలి. తత్త్వవిచారం చేతకాని ఆత్మసాక్షాత్కారం కలగదు. ఆకాశము చంద్రతేజస్సుచే పూర్ణమయినట్లు ప్రపంచంఅంతా ఆత్మజ్యోతిస్సుచే నిండిఉన్నది. చిత్తము (బుద్ధి) అనే తెప్పచే విచారమనే దరిజేరి ఎంతవరకు విశ్రాంతి చెందదో అంతవరకు మానవుడు సంసారసాగరంలో గడ్డిపోచవలె తిరు

గుతూ ఉంటాడు- విచారనిరూఢమయిన చిత్తము మానసిక బాధలను తొలగించుకుంటుంది. మట్టిలో దాగియున్న బంగారును (బంగారురజము) సామాన్యమానవులు కనిపెట్టలేరు. నిధిశాస్త్రజ్ఞులుమాత్రం పరిశోధనచేసి ఇది బంగారము "ఇది భస్మము" అని గుర్తింతురు స్పష్టంగా- వీరలకు మోహప్రసక్తి లేదు. ఆ విషయంలో అలాగే ఈ జీవుడుకూడా ఆత్మవిచారంచేసి ఆత్మసాక్షాత్కారం చేసికొంటే స్వతస్సిద్ధంగా కాలాదిపరిచ్ఛేదరహితుడవుతాడు. సారం గ్రహించనివాడికే మోహం- గ్రహించినవాడికి మోక్షమే. ఇంకా మోహమెక్కడిది ? చూడు శ్రుతులు ఏమి చెప్పుచున్నవో-

"యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే అథ తస్యభయం భవతి" తత్త్వేవభయం విదుషోఽమన్వానస్య॥ రసగ్ం హ్యేవాఽయం లబ్ధ్వానందీ భవతి। సర్వాన్ కామానాప్త్వా అమృతస్సముభవత్। జ్ఞాత్వా తంమృత్యుముఖ్యేతి। ఆనందం బ్రహ్మణోవిద్వాన్ నబిభేతి కుతశ్చనేతి॥ అని ఆత్మను తెలిసికోనివాడికి సంసారభయమనీ తెలిసికొన్నవాడికి నిరతిశయానందమనీ చెప్పుచున్నాయి-

కాబట్టి మానవులారా! ఆత్మను తెలిసికోనకపోవుట దుఃఖానికి హేతువు. తెలిసికోనుట సుఖానికి హేతువు- కనుక మీరు ఆలసించవద్దు- పంచకోశవివేకంచేత దేహాదులకంటె ఆత్మనువేరుపరచి గ్రహించండి- సుఖపడతారు- బంగారం బురదలోఉన్నా బురదతోటి దానికి సంబంధంలేదు. ఆత్మ దేహంలోఉన్నా దేహంతో దానికి సంబంధం లేదు. బ్రహ్మకూ జీవునకూ భేదము ఔపాధికమే- తాత్త్వికము కాదు. తామరాకుమీది నీటికీ, మడుగులోని నీటికీ ఉపాధివల్లనే భేదం. ఈమాట నేను "నెత్తి" నోరు" కొట్టుకొని చెబుతున్నాను. ఎవ్వడూ వినడంలేదు. సంసారవాసన అనే గోతులోపడి, ఇంద్రియాలకు పరవశులై ఉన్నంతవరకూ మనస్సు ఎంతమంది సూర్యచంద్రాగ్నులయినా దాని అజ్ఞానాంధకారాన్ని పోగొట్టలేదు- మనస్సుకు వివేకం కలిగిందా,

సూర్యోదయంకాగానే రాత్రికాలపుచీకట్లి ఎగిరిపోయినట్లు ఎగిరిపో తుంది. మనస్సుకనుక దేహాది తాదాత్మ్యాధ్యాసనిద్రలో ఉన్న మనస్సును మేలుకొలపాలి. ఉత్తమబోధ కలిగించాలి. భవబంధమును తొలగించాలి. దుమ్ము ఆకాశానికి అంటదు- నీరు నీటిలోబుట్టిన కమలానికి అంటదు. దేహేంద్రియాదులతో ఆత్మకూడా అంటదు. మట్టికి హేమతాదాత్మ్యపత్తివల్ల బంగారంతో కలిసిఉన్నందువల్ల) వచ్చిన పరిణామంలేదు. ఆత్మతాదాత్మ్యపత్తివల్ల కలిగినపరిణామం దేహానికీలేదు. ఆత్మ సుఖదుఃఖములు అనుభవిస్తున్నానని అనుకొనుట మిథ్య- సుఖదుఃఖాలు జడమయిన దేహానికిలేవు- సర్వాతీతుడయిన ఆత్మకూలేవు- అజ్ఞానికి మాత్రమే ఇవి- అది (అజ్ఞానం) పోతే సుఖదుఃఖాలు ఎవరికీలేనట్లే- రామా! దేనికీ దుఃఖంలేదు- దేనికీ సుఖం లేదు. సర్వం ఆత్మమయమని భావించు. ఈకనిపించే సృష్టిదృష్టులు నీటిలో తరంగాలవంటివి- మణి నిష్కారణంగా తనకాంతిని ప్రసరింపజేసినట్లు ఆత్మకూడా తన తేజస్సుచేత సృష్టులను ప్రసాదిస్తున్నాడు- జగద్బ్రహ్మాలు ఏకమూ (అభిన్నమూ) కాదు- భిన్నమూ కాదు- ఇది అంతా ఆభాసమాత్రము- నేనువేరు నీవువేరు అనేభ్రాంతిని విడిచిపెట్టు. శ్రుతి, "బ్రహ్మైవేదం సర్వం" "ఆత్మైవేదం సర్వం" అని చెబుతోంది- కనుక ఈభేదకల్పనను మాని సర్వమూ చిన్మయమని గ్రహించు- నీకు శోకమూ, మోహమూలేదు- జన్మమూలేదు- నాశమూ లేదు- ఉన్నదేమో ఉన్నది. కాబట్టి స్వస్థంగా ఉండు- నిర్ద్వంద్వుడవుగా ఉండు. స్వాధీనచిత్తుడవుగా ఉండు- శాంతసంకల్పుడవై ఉండు- వీతరాగుడవై ఉండు. నిరాయాసుడవై ఉండు. యదృచ్ఛాప్రాప్త వస్తువుతో తృప్తి చెందుతూ ఉండు. ప్రపంచాతీతుడవై ఉండు. ఈ వికల్పజాలాన్ని విడచి ఉండు. మేరుశిఖరంవలె ధీరుడవై ఉండు. యథాప్రాప్తమును అనుభవిస్తూ దేనినీ కోరకుండా త్యాగమునూ ఆదానమునూ (స్వీకారమునూ) విడచి ప్రశాంతంగా ఉండు. రామా! ఈ ప్రపంచ రచన

వట్టిమాయ. తెలిసినవాడు దీనిని అనుసరించడు. నీవు తెలిసినవాడవు. కల్పనాజాలం విడచినవాడవు. నిరామయుడవు. కనుక శాంతశోకుడవై ఉండు. నీతండ్రి ఆజ్ఞాపించిన ఏకాతపత్రరాజ్యమును చక్కగా పరిపాలించు- ప్రజలనూ, సామంతరాజులనూ, నీ గుణగణంచేత మెప్పించు- అందరినీ సమత్వదృష్టితో చూచుకో. ఈజన్మ (క్షత్రియజన్మ) నీకు ప్రారబ్ధమయింది. కనుక అవశ్యకర్తవ్యములగు కర్మలనుకాని, తత్ఫలములనుగాని విడిచిపెట్టటం ఉచితంకాదు. వాటిమీద అత్యంతానురాగంతో ఉండుటకూడా ఉచితంకాదుసుమా. ఈమాటలు మరువకు. ఇదేవ్యవహారమార్గంలో ఉండేనేర్పు రామా! అన్నారు వసిష్ఠులు-

## ౬. వసిష్ఠుని ప్రథమోపదేశము.

వసి॥ రామా! మరిన్నీ ఈ ప్రపంచవ్యవహారాన్ని వాసనారహితుడై నెరవేర్చుకొనేవాడే ముక్తుడని నా అభిప్రాయము- మనుషజన్మమెత్తికూడా కొందరుమూఢులు నిష్కామకర్మానుష్ఠానమునందు ఆసక్తిలేక కేవలం కామాత్ములై కామ్యకర్మలు ఆచరిస్తారు. వాటివల్ల స్వర్గం చేరుతారు. అక్కడ కొంతసుఖం అనుభవిస్తారు. అదిపోను కొన్నిపాపకర్మలఫలం అనుభవించడానికి నరకంచేరుతారు. మరికొందరు ఎప్పుడూ నిషిద్ధకర్మలే ఆచరిస్తారు- సత్కర్మలంటే బొత్తుగా గిట్టవు వాళ్ళకు- అంచేత యెప్పుడూ నరకమే వాళ్ళకు- ఎప్పుడూ దుఃఖమే- మరికొందరు కేవల దుష్కర్మవాసనాబద్ధులై క్రమంగా మొదట స్థావర పదార్థములై పుటతారు. తరువాత తిర్యగ్జంతువులై పుటతారు- మరి కొంతమంది శుద్ధసాత్వికులు తత్త్వవిచారంచేత ఆశాపాశములను త్రెంచి వేసికొని కైవల్యమును పొందెదరు- రాజససాత్త్వికులు మొదట కొన్ని జన్మలననుభవించి తరువాత ఉత్తమ మానుషజన్మ మెత్తి అందులో సత్త్వగుణసంపత్తిచేత ముక్తులవుతారు- వీరు పార్వణ చంద్రునివలె వృద్ధినొందుతారు- వర్షకాలపు కుటజపుష్పమువలె (గిరిమల్లికా పుష్ప

ములవలె) సౌభాగ్యమును అనుసరిస్తారు. వీరికి చివరజన్మలో పరిశుద్ధమగు ఆత్మవిద్య సులువుగా లభిస్తుంది. అమానిత్వ అదంబిత్వాది గుణములన్నీ వచ్చిచేరుతాయి వారిని. ఆడవారు అంతఃపురం చేసినట్లే. ఏ మహానుభావుడు అన్నికర్మలనూ ఆచరించి వాటిఫలం పెరిగినా, తరిగినా, సుఖదుఃఖాలు లేకుండా ఉంటారో వార్ని ద్వంద్వపదార్థాలు అంటవు. వచ్చిచేరుకుంటాయి. పగటికాలంలో చీకట్లు నశించినట్లే. శరత్కాలంలోని మేఘాలవలె గుణములు పరిశుద్ధములు అవుతాయి. ఇలాంటివారిని అందరూ వాంఛిస్తారు. అడవిలో మధురంగా ధ్వనించే వెదురుబొంగులను వనమృగాలు వాంఛించినట్లు. గుణసంపదలన్నీ వీళ్లుపుట్టగానే గుంపులు గుంపులుగా వచ్చిచేరుతాయి. బెసుదు పక్షులు మేఘములను అనుసరించినట్లు. ఇట్టి సద్గుణపూర్ణునకే గురుముఖతః శ్రవణాధికారము. అతడు వీనిని పరమపావనమయిన వివేకంలో నియోగిస్తాడు. విచారంచేత వైరాగ్యం కలుగుతుంది. ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. క్రమంగా ఇలాంటివారు మననం చేసికొంటారు వీరు. ఇంతవరకు నిద్రించియున్న మనోమృగాన్ని మేలుకొలుపుతారు. నిర్గుణబ్రహ్మతత్త్వాన్ని బోధిస్తారు. గుణసంపన్నులయిన మానవులు ప్రఖ్యాత జీవన్ముక్తులయిన గురువులను ప్రయత్నపూర్వకంగా ఆశ్రయిస్తారు. నిర్మలమయిన బుద్ధితో ప్రత్యక్తత్త్వాన్ని పరీక్షిస్తారు. ప్రత్యగభిన్నమయిన బ్రహ్మను సాక్షాత్కరించుకొంటారు. మరి వారు తత్కార్యనివృత్తిరూపమగు పరమపురుషార్థలక్షణ ముక్తిని పొందుతారు.

## ౭. హఠాత్ జ్ఞానప్రాప్తి సూచనము.

ఇది జీవులందరకు సర్వసాధారణమయిన క్రమం. ఇందులో మరొకవిశేషం చెబుతావిను. ఈ సంసారసంరంభంలో పుట్టిన మానవులకు మోక్షానికి ఉచితమయిన ఉత్తమమార్గాలు రెండే. ఒకటి గురువు

చెప్పిన ప్రకారం నడచుకుంటూ ఉండగా ఒక్క-జన్మలోగాని, అనేక జన్మలతోగాని మోక్షం లభించేది. రెండవది తనకు స్వయంగానే జన్మాంతరాదృష్టంచేత వివేకంలభించి, ఆకాశంనుంచి పండుపడినట్లు జ్ఞానసంప్రాప్తమై మోక్షం ప్రసాదించేది- హఠాత్తుగా ఆకాశఫల పాతమువలె జ్ఞానంప్రాప్తించడంలో పూర్వవృత్తాంతం (వెనుకటికథ) ఒకటిచెబుతాను విను-

## ౮. సిద్ధగీత.

పూర్వం విదేహదేశములను పరిపాలిస్తూ జనకుడనే రాజొక్క డుండేవాడు- అతడు అన్ని ఆపదలను తీరినవాడు. అన్ని సంపదలతో నిండినవాడు- యాచకులకు కల్పవృక్షం-మిత్రులనే పద్మాలకు సూర్యుడు. బంధువులనే పుష్పాలకు వసంతఋతువు. స్త్రీలకు మన్మథుడు. భూసురు లనే కైరవములకు చంద్రుడు- శత్రువులనే చీకట్లకు సూర్యుడు- సౌజన్య మనే రత్నాలకు సముద్రుడు- నీవలె పరిపాలనకొరకు భూలోకంచేరాడు.

అతడు ఒకానొకపుడు వసంతఋతువులో కోకిలలు ముదించి కూయుచుండగా విలాసగా పూలు పూచియున్న ఉద్యానవనానికి వెళ్ళాడు- అనుచరుల అందరనీ దూరంగా ఉంచి అచట క్రీడాశైలచ ఖి ములమాది లతాకుంజములలో విహరించాడు- అప్పుడు విన్నాడు కనిపించకుండా దాగిఉండి పరస్పరం ప్రసంగించే సిద్ధులగీతాలను ఆత్మా నుభవంచాటి చెప్పేవాటిని-

౧. సిద్ధ- ద్రష్టయొక్క- చక్షురాదీంద్రియములకు దృశ్యము లయిన స్రక్చందనవనితా విషయములతో సంబంధంకలుగగా, పుట్టునట్టి విషయాకారబుద్ధివృత్తిలో స్వయముగా ప్రకాశించే ఆనందరూప నిశ్చ యమే ఆత్మతత్వమని మేము అనుభవించుచున్నాము. అని కొంద రన్నారు.

౨. ద్రష్టృదర్శనదృశ్యములు- (చూచువాడు చూచుట చూడ తగినవి) అను త్రిపుటిని విడిచి ఈ త్రిపుటికికూడ కారణమయిన అవి

ద్యనువిడిచి చాక్షుషాది జ్ఞానములకు, మానసిక జ్ఞానములకుకూడ పూర్వమే వీటి ఉత్పత్తికి సాక్షిగా ప్రకాశించే సాక్షిచైతన్యమే తురీయమగు ఆత్మతత్త్వమని మేము ఉపాసించుచున్నాము. అని మరికొందరన్నారు.

౩. "ఈసాక్షిచైతన్యం విషయంపై ఉన్నాడని కొందరూ, లేదని కొందరూ, తగాదాపడునంతలో ఈ రెండు పక్షములకు విరోధం లేకుండా ఉండుటకు లేకుండుటకు సాక్షిగా మధ్య ఉండువానిని ఆత్మయని మేము ఉపాసించుచున్నామని" మరికొందరన్నారు.

౪. ఎవనియందు ప్రపంచం ఆధారపడి ఉన్నదో, ఎవడే ప్రపంచానికి స్వామియో (అధిపతియో)– ఎవనినుంచి యీ ప్రపంచం పుట్టినదో, ఎవని కొరకు ఈ ప్రపంచం పరార్థమైఉన్నదో, ఎవడీ ప్రపంచమునకు కర్తగాను, కరణము (సాధనము)గాను ఉన్నాడో– ఎవడు మాయచే సర్వ ప్రపంచ వ్యవహారాన్ని నిర్వహించుచున్నాడో, ఎవడు సర్వాత్మకుడో, అట్టి సర్వాధిష్ఠానమయిన పరమార్థ సత్యతత్త్వముగాను మేము ఉపాసించుచున్నామని మరికొందరన్నారు.

౫. "అహం" అను పదంలో అకారము మొదటిది హకారము చివరిది. ఈ రెంటియొక్క సంపుటిలో అకారాది హకారాంత అక్షర సముదాయమంతయు ఇమిడియున్నది. ఈ అక్షర సముదాయమువల్లనే వేద శాస్త్రాది శబ్దజాలమంతా తయారయినది– దీనివల్ల "అహం" అనగా వేదశబ్దప్రతిపాద్యమయిన సమస్త ప్రపంచాకారమగు సప్రపంచ బ్రహ్మము అర్థమగును– అని కొందరన్నారు.

౬. మరియు "న హాన్యత ఇతి అహం" "నహీయత ఇతి వా అహం" అను వ్యుత్పత్తి చేతనూ, "అహ వ్యాప్తౌ" అను ధాతునిష్పత్తి చేతనూ, "నశిష్యతే ఆకారః యస్మిన్" అను వ్యుత్పత్తి చేతనూ, అశేషాకారమూ, నిర్గుణమూ అగు బ్రహ్మము అహం శబ్దమునకు అర్థము.

కనుక మేముచేసెడి దైనందిన వ్యవహారములందు ఉచ్చరించెడి అహం పదమునందలి అహమును ఉపాధిని తీసివేసి వెనుక వర్ణించిన

విధముగా శ్రుతిప్రసిద్ధమయిన ఆత్మతత్త్వమును మేము ఉపాసించు చున్నామని మరికొందరన్నారు.

౭. మరికొందరు బుద్ధిగుహలో ఉన్న దేవుని విడిచిపెట్టుకొని ఇతర దేవుని వెతకువారు చేతులో ఉన్న కౌస్తుభమణిని విడిచిపెట్టుకొని (పారవేసి) ఇంకొకరత్నమును వెతకువారలు— అని అన్నారు.

౮. అన్ని ఆశలను విడిచిననే కాని ఈహృదయాకాశంలో ఉండే బ్రహ్మఫలం దొరకదు—ఆశలనే విషతీగలయొక్క వేరు ఈ బ్రహ్మజ్ఞానం చేత తుంచివేయబడుతుంది— అని కొందరన్నారు.

౯. సంసారంలో అన్ని వస్తువులూ విరసములని తెలిసిఉండి కూడా వానియందు ఎవడు ఆశాపాశములను ముడిపెట్టుకుంటాడో వాడు దుర్మతి. వాడు నరుడు కాడు. గర్దభము (గాడిద) అని కొందరన్నారు.

౧౦. దేవేంద్రుడు వజ్రాయుధంతో కొండలను కొట్టినట్లు మానవుడు తలయెత్తిన ఇంద్రియములనే సర్పములను వివేకమనె కర్రతో కొట్టవలెనని మరికొందరన్నారు.

౧౧. అంతర్బాహ్యేంద్రియ వ్యాపారోపరతియే పరమపవిత్రము. అదికలవానికి మనశ్శాంతి యేర్పడును— మనశ్శాంతిగల వానిక స్వరూప సుఖమునందు చిరస్థితి యేర్పడును. అని మరికొందరన్నారు.

## ౯. జనకవితర్కము.

జనకుడు సిద్ధగీతాలను విన్నాడు— వెంటనే దుఃఖించాడు— పరివారాన్ని మరల్చుకొని యిల్లుచేరాడు. పరివారాన్ని పూర్తిగా అందరినీ విడిచి తానొక్కడూ మేడ ఎక్కాడు సూర్యుడు ఉదయాద్రి యెక్కినట్లు— జీవులయొక్క జన్మ జరామరణాది చంచలావస్థలను గూర్చి ఆలోచించాడు. పరితపించాడు. ఇలా అన్నాడు! "ఎంతకష్టం? రాతి కంటె అతి మూర్ఖుణ్ణి నేను" చంచలమయిన జరామరణాది అవస్థలలో

తిరుగుచుంటినికదా! మితిలేని కాలంలో ఒకకోటి అంశల నాజీవిత కాలం- అలాంటి క్షణభంగుర జీవితం మీదకూడా నాకు ఆశవదల లేదు. ఇంకా గట్టిగా ముడివేసుకుంటున్నాను ఆశాపాశాన్ని- ఛీ నా జీవితం- నాజీవితం వరకూ ఉండే ఈరాజ్యం ఎంతటిదినాకు? ఇంత మాత్రంతో సంతోషిస్తూ భావిదుఃఖానికి ప్రతిక్రియ లేకుండా ఉంటు న్నానే- (లేక) ఇంతమాత్రంచేత బుద్ధ్యాది ఉపాధిసంబంధంలేని జీవ న్ముక్తునివలె నిర్దుఃఖంగా ఉంటున్నానా? నేను, అనాద్యనంతుడను. నశ్వరమయిన దేహమాత్రుడనుకాను. మధ్యలో వచ్చింది యీపేలవ మయిన జీవితంనాకు. పటంలో చంద్రుణ్ణిచూచి పిల్లవాడు సంతోషించి నట్లు, మధ్యవచ్చిన దేహమే ఆత్మ అనుకొని మురుసుకుంటున్నా నేను. ప్రపంచరహితుడయిన ఇంద్రజాలికుడెవడో నన్ను ఇలా మోసపుచ్చా డు- ప్రపంచంలో సత్యమయిన వస్తువు లేదు. అపరిచ్ఛిన్నమయిన వస్తువు లేదు. అజన్యమయిన వస్తువు లేదు. ఇంక నాబుద్ధికి విశ్రాంతి కలిగేది ఎలా? ఒకవేళ అలాంటి వస్తువు ఎక్కడో దూరంగా ఉన్నదేమో అనుకుంటే అదీ కుదరటంలేదు. ఎంతటి దూరపువస్తువయినా నామన సుకు అది దగ్గరదే. మనస్సు ఎప్పుడూ దేహమునుండి బయటికి వెళ్ళదు. బాహ్యవస్తువుల బోధ (జ్ఞానం) అంతా హృదయంలోనే కలుగుతూ ఉంటుంది. కాబట్టి అలాంటివస్తువు ఎక్కడనయినా దూరంగా ఉన్నట్లయితే దానిజ్ఞానం నాకు హృదయంలో కలిగేదే. కనుక దూరము దగ్గర అనే భావంకూడా కల్పనామాత్రంకాని వాస్తవంకాదు. ఆభావన పరిగ్రహింపతగినది కాదు. మానవులు సుఖం అనుభవించాలనీ, డబ్బు సంపాదించాలనీ బహుచురుకుగా ప్రవర్తిస్తారు- తుదకు వాళ్ళప్రవృత్తి నీటిలోని సుడిగుండమువలె ఫలావస్థలో నశిస్తుంది- పైగా జన్మమరణాది దుఃఖాలకు కూడా కారణం అవుతుంది- ఇంక విషయసుఖాలను గురించి ఎందుకూ వీళ్ళకింత ఆశ? ప్రతి సంవత్సరమూ, ప్రతి మాసమూ, ప్రతి రోజూ, ప్రతిక్షణమూ కూడా సుఖాలు దుఃఖాలతో నిండి నిబిడీకృతము లయియే ఉన్నాయి. ఇంక కేవల దుఃఖాలు మాటిమాటికి సంభవిస్తూనే

ఉంటాయి. ఈ ప్రపంచంలో ఉండే వస్తువులన్నీ కొంతకాలం కనిపిస్తూ వెంటనే నశిస్తూ ఉంటాయి– స్వారాజ్యమనే (పదము) స్థానము ఎవ్వనికీ ఈలోకంలో అసంభవము. (తుచ్ఛము) కాబట్టి అది అందరికీ అచింతితమే– ఇంక అన్నిటికంటె గొప్పవని పేరుచెందిన ఐంద్ర ప్రాజాపత్యాది పదవులు విచారిస్తే వాటిలో యెవరికయినా వివేకవంతులయిన సత్పురుషులకు విశ్రాంతి కలుగవచ్చునేమో కాని అలాంటిస్థానము ఈ ప్రపంచంలో యేదీలేదు. ఓ ! హతచిత్తమా ! మహాత్ములయొక్క నెత్తిమీదనున్నవాళ్లు కొద్దిరోజులలో క్రిందపడుచున్నారు. ఇంక నీకు గొప్పతనంమీద (రాజ్యాదివైభవోత్కర్షమీద) ఎందుకింత ఆశ? అబ్బా? ఎంతకష్టము? త్రాడు లేకుండా కట్టివేయబడినాను. బురద లేకుండా కళంకంచెందాను. పైనఉండియే క్రిందపడినవాడనయినాను. స్వస్వభావంలో నాస్థితి ఎంత చెడిపోయింది? వివేకవంతుడనయిన నాకు కూడా హఠాత్తుగా ఇంతటి మోహం కలిగిందేం? సూర్యుడికి ఎదురుగా నల్లనిమేఘం కమ్మినట్లయింది. (ఆవరించినట్లయింది) నాగతి. నాకు ఈభోగాలు ఏమిటి? ఈబంధువు లెవరు? దయ్యంపట్టిన పిల్లవాడివలె వీటిమీద మమత(నావి అనేభావం)ఏర్పరచుకొని సంకటపడుతున్నాను. ఈ భోగాలయందూ, ఈ జరామరణములయందూ, అనురాగంగల ఆస్థను (ఆదరమును) ప్రియసఖినివలె నేను పెంచుకుంటున్నానా ఏమి? ఉండనీ పోనీ నాకు ఈ భోగబాంధవాది సంపదను గురించి యింత పట్టుదలయేమిటి? నీటిలో బుడగలవలె ఇది మిథ్యగా పుట్టింది– పృథు చక్రవర్తి మొదలగువారలయొక్క మహావిభవములూ, అత్యంత స్నేహంగల బంధువులూ, ఇపుడు స్మృతిపథంలో పడ్డారు. (అనగా నశించారు)ఉన్నవాటిమీదమాత్రం నాకు ఆస్థఎందుకు? రాజులయొక్క ఆధనములు ఇపుడు ఎక్కడకు పోయాయి. ప్రాక్తన హిరణ్యగర్భుని యొక్క లోకాలన్నీ యెక్కడకు పోయాయి? కాలక్రమంచేత లక్షమంది యింద్రులు గడచిపోయారు నీటిలో బుడగలవలె. జీవితంమీద

ఇంతటి ఆశపెట్టుకుంటే వివేకులు పరిహసిస్తారు. అనంతములయిన బ్రహ్మలు గడచిపోయారు. అనేకసృష్టులు గడచాయి. భూరేణువుల వలె అనేకమంది రాజులు గడచిపోయారు. నాకెందుకు? జీవితంమీద ఈ ఆశ? సంసారమనేది రాత్రి. అందులో దేహేంద్రియాదులమీద అహంతామమతా వ్యవహారభ్రమ అనేది ఒక దుస్స్వప్నం. దీనిమీద నేను ఆశను ముడిపెట్టుకునే యెడల ఇంక నా అవివేకిత్వం ఏమి చెప్పాలి! ఛీ! హద్దులేని అవివేకినయి పోతాను. 'వీడూ, వాడూ నేనూ' అనే భావాలు వ్యర్థంగా కల్పించబడ్డాయి. అహంకారమనే పిశాచంచేత నేను మోస పోయినాను. ఇంతవరకూ అజ్ఞానివలె ఎందుకు నిర్విచారంగా ఉన్నానో నాకు తెలియలేదు. ఎందుకు నేను విమర్శించుకోలేదో నాకు తోచడం లేదు. సూక్ష్మాతిసూక్ష్మమయిన కాలరేఖచేత ప్రతిక్షణమూ ఆయుస్సు అనేది ఛేదింపబడుతూనే ఉంది. నేను చూస్తూనే ఉన్నాను. అయినా నాకీ విమర్శయే కలగలేదు. కారణమేమిటో బోధపడకుండా ఉంది. ఓ! జీవితాశా! ఎందుకు నామీద ఇంతనాట్యం చేస్తావు? బ్రహ్మ విష్ణు రుద్రాదుల దేహాలు ఆటబంతులవలె కాలమనే కాపాలికునిచేత కాలితో తన్ని ఆకాశానికి ఎగరకొట్టబడ్డాయి. ఇంక నేనెంతవాడను? రోజులు అనేకం వస్తున్నాయి పోతున్నాయి వృథాగా. ఆనందైక రసమయి నిత్యవస్తువును కనిపెట్టే రోజు ఒక్కటీ యింతవరకు రాలేదు. నేను చూడలేదు. సరస్సులందు సారసములవలె సర్వజనచిత్తములందును విషయవాంఛలే (విషయభోగములే) స్ఫురిస్తున్నాయి కాని ఆత్మస్వరూప సాక్షాత్కారంమాత్రం ఎవరిచిత్తంలోనూ స్ఫురించటంలేదు. కష్టము నుంచి కష్టదశకు వచ్చాను. దుఃఖమునుంచి దుఃఖదశకు వచ్చాను. అయినా యిప్పటికీ నాకు విరక్తి కలగలేదు. ఛీ! ఇంతటి అధమాశయుడను. రమణీయములయిన యేయే వస్తువులమీద నాకు గట్టికోరిక ఉన్నదో అవి అన్నీ చూస్తూ ఉండగా అంతరించాయి. (నశించాయి). మొదట మనోహరంగా ఉండేవి విషయాలు. మధ్యకాలంలో మనోహారంగా ఉండేది వయస్సు. తుదకు (పరిణామంలో) మనోహారంగా

ఉండేది ధర్మం. ఈమూడూ అపవిత్రములే- వినాశామేధ్యములతో దూషితములే- ఆశగల వాటికన్నిటికీ చావు తప్పకఉంది. అనగా మానవు ఆశపడే వస్తువులన్నీ నశించేవే అజ్ఞానికి ఎన్నటికీ విశ్రాంతికి అవకాశం కనిపించటంలేదు. రాగలోభాదులు అభివృద్ధి చెందటంచేత ఎప్పుడూ పాపీయమగు దశయే, హింసాదులందు ప్రవృత్తి అనివార్యమగుటచే క్రూరతరావస్థగో-బాల్యంలో అజ్ఞానం యౌవనంలో మదనాహతుడను. అనగా ఫలానుభవకాలంలో దుఃఖానుభవము అనివార్యమగుటచే క్రూరతరావస్థయే. మన్మథునిచే దెబ్బతిన్నవాడను. మిగిలిన వయసులో కుటుంబపోషణచింత ఇంక అజ్ఞాని యెప్పుడు? ఏమి చేయగలడు? ఈసంసారం ఆద్యంతములందు లేనిది. భోగకాలంలోకూడ విరసమయినది. దారిద్ర్యంతోను రోగాలు పెరిగే వైషమ్యాలతోనూ దూషితమై ఉంది. ఇలాంటి అపారమయినదాన్ని సారబుద్ధితో గ్రహిస్తున్నాడు దుర్మతి. రాజసూయ, అశ్వమేధాదులు చేసి అనేక యజ్ఞాలను ఆచరించి స్వర్గానికిచేరి మహాకల్ప పర్యంతమూ ఇంద్రభోగమనుభవించినా ఆభోగమంతా మహాకాలప్రవాహంలో లేశమాత్రమే. అపరిచ్ఛిన్నంకాదు. స్వర్గంలోకాని, భూలోకంలోకాని, పాతాళంలోకాని ఆపదలు లేనితావులేదు- చిత్తమనే బిలంలో సర్పాలవలె ఉండే ఆధులూ శరీరమందు చిగిర్చేవ్యాధులూ అజ్ఞానులచే ఎలా నివారించుకొనబడగలవు? ప్రతి దృశ్యవస్తువుకూ నెత్తిమీద లేకపోవుట (నాశ) అ(మా)నేది ఉంది. అనగా వర్తమానకాలంలో ఉన్న దృశ్యపదార్థం అంతా కొంతకాలానికి తప్పక నశిస్తుందని అర్థము). రమ్యములయిన వాటిమీద అరమ్యత్వము ఉన్నది. సుఖాలకు నెత్తిమీద దుఃఖాలున్నవి. ఇంక నేను దేనిని నమ్మేది? దేనిని ఆశ్రయించేది? అజ్ఞానమోహితములయిన క్షుద్రజంతువులు మాటిమాటికీ పుటుతూ ఉంటాయి- చస్తూఉంటాయి- ఇలాంటి జంతువులతోటియే భూలోకమంతా నిండి నిబిడీకృతమై ఉంది. అత్యంతసాధువులు లోకంలో చాలాదుర్లభులు- నల్లకలువలవంటి నేత్రాలుగలిగి వంటినిండా వస్తువులు ఆభరణ

ములు గల స్త్రీలుకూడా చూచి నవ్వటానికి యోగ్యులే- వీళ్లూ క్షణ భంగురులే- ఒక్కమాటు కన్నుమూసేసరికి ప్రపంచ ప్రళయమూ, ఒక్కమాటు కన్ను తెరచేసరికి ప్రపంచోదయమూ జరిగించే మహానుభావులున్నారు! బహ్మాదులు. మాబోటివాళ్ళ లెక్క ఏమిటి? లోకంలో ఒకవస్తువు రమ్యమనుకుంటే దానికంటె రమ్యమయినది మరొకటి ఉంటూనే ఉంటుంది. ఒకటి స్థిరమనుకుంటే అంతకంటె స్థిరమయినదీ తప్పదు. పదార్థముల సంపద (శోభ) తుదకు చింత (దిగులు) పర్యవసానంగా కలదేకాని సుఖావసానం కాదు- అనగా ఏ వస్తువును ఆశ్రయించినా ముందో వెనకో కొంతదిగులును తెచ్చిపెటుతుందికాని సుఖాన్నిమాత్రం స్థిరంగా ప్రసాదించదు-కనుక ఎందుకు ఇలాంటివాటిని కోరడం? పోనీ చిత్రవిచిత్రములయిన రాజసంపదలు చిత్తమునకు (మనస్సునకు) సంమతిములనుకుంటే అవీ బహు ప్రయత్నలభ్యాలు. అతి కష్టముచే కాపాడుకోదగినవి- ఇంతచేసినా నశించకతప్పనివి- ఇవి విచారిస్తే ఆపదలుకాని సంపదలుకావు- ఇంక లోకంలో కొన్ని ఆపదలున్నాయి- దారిద్యమూ, బంధునాశమూ, రాజ్యాదినాశమూ, కళత్రనాశమూ మొదలయినవి. ఇవికూడా ఒకప్పుడు సజ్జనసహవాసమునో, తీర్థయాత్రలనో, తపోనుష్ఠానమునో, జ్ఞానసంపదనో, కలిగించి విచిత్రంగా శ్రేయోదాయకములవుతాయి- కనుక ఇవి మనస్సుకు సమ్మతములనుకుంటే ఇవికూడా వివేక వైరాగ్యాది బహుప్రయత్న సాధ్యములుకనుక సంపదలనే అనుకుంటాను నేను- కాబట్టి అసత్యమయిన ప్రపంచమునందు మమతను పెంచుకోవడమే విపత్తు- వివేకంచేత అహంకారాన్ని చంపుకోవడమే సంపద- ప్రపంచం మనోమాత్రవివర్తం- సముద్రంలో ప్రతిఫలించిన రెండవ చంద్రునివలె మిథ్యాభూతం- ఇలాంటి దానిమీద "మమేదం" ఇదినాది అనేమాట నిరర్థకం. అవిచారమాత్రంచేత కల్పితమయిన ఈ ప్రపంచంలో భోగలంపటమయిన మనస్సు వ్యర్థంగా హేయోపాదేయభావనను (ఇది చెడ్డది ఇది మంచిది) అను భావనను కల్పించుకున్నది- పరిచ్ఛిన్నములై తాపత్రయగ్రస్తములయిన సుఖమని

పేరుగల ప్రాపంచిక వస్తువులలో కొన్నిటిమీద నేను అనురాగం చెంది పడిపోయినాను. మిడత అగ్నిజ్వాలలోపడినట్లు- నిరంతరదుఃఖ భోగము నయినా అభ్యాసంచేత సహించవచ్చు. (అనగా ఎల్లప్పుడూ దుఃఖం గల రౌరవాది నరకాలలో నయినా ఉండవచ్చు) కాని సుఖానుభవా నికి విచ్ఛిత్తి కలిగితే దానిని అభ్యాసం చేసికొని నడుమవచ్చిన దుఃఖ భోగాన్ని సహించటం మహాకష్టం- (అనగా అప్పుడప్పుడు సుఖభోగాలు విచ్ఛిన్నమయి పోతూఉండే సంసారవృత్తులలో ఉండటం మాత్రం మహాకష్టం- సంసారమే దుఃఖములకు సీమాంతము (పొలిమేర) అని చెప్పబడుతోంది. అందులో చేరిన దేహానికి (దేహమందు) సుఖమెక్క డిది ? ఖడ్గాఘాతానుభవముకంటె కశాఘాతానుభవమే సుఖమనుకున్న ట్లున్నది మనసంసారపరిస్థితి- (కత్తిదెబ్బకంటె కొరడాదెబ్బ మెరుగన్నట్లు న్నది.) సహజదుఃఖరూపమయిన సంసారంలో మునిగిన వారందరూ దుఃఖాలనే మధురమయిన సుఖములనుగా భావిస్తున్నారు- నేనుకూడా శ్రుతిస్మృత్యాది ప్రమాణములందు నేర్పరినయినా, మేధావినయినా, విచారకుశలుడనయినా, వస్తుతత్త్వమును విచారించక మూఢులతో సమానుడనయినాను యిదివరలో- ఇప్పుడు నాకునిజస్థితి విదిత మయింది- సంసారమనే మహావృక్షానికి మనస్సు అనేది మూలము- దానియొక్క రహస్యంకూడా గుర్తించాను. సంకల్పమే దానిరూపం. కనుక సంకల్పనాశంచేత దాన్ని ఎండగటతాను. దానితోటి సంసార మనేచెట్టు ఎండిపోతుంది, ఆకారమాత్రంచేత రమ్యములయిన మనస్సు అనే కోతియొక్క చేష్టలు అర్థమయినాయి నాకు. ఇంక ఇప్పటినుంచి నేను వాటిని ప్రేమించను. విశ్వసించను. రమించను. సంసారవృత్తులు ఆశాపాశ శతప్రోతములు- ఊర్ధ్వాధోలోక దుఃఖదాయకములు- వీటిని నేను అనుభవించాను. ఇంక విశ్రాంతి తీసికుంటాను- ఇంతకు లోగడ నేను అనేకవిధాల దుఃఖించాను. ఇంక నేను దుఃఖించను. ఇంక తెలివి వచ్చింది. సంతోషం కలిగింది- నాకు ఆత్మను దొంగలించే దొంగ దొరికాడు మనస్సు అనేవాడు. వీడు నాకుచిరకాలశత్రువు. వీడిచేత

నేను చాలాబాధలు పడ్డాను. ఇంతవరకు ఈమనస్సు అనే ముక్తాఫలము (ముత్యము) కొట్టబడలేదు- ఇప్పుడు కొట్టబడింది. ఇంక శమదమాది గుణసంపదకలుగుతుందనాకు. (ముత్యానికి బొక్కపొడిస్తే దారంఎక్కు-తుంది అనే అర్థంకూడా ముత్యమునేపక్షంలో లభిస్తుంది) మనస్సు అనే మంచుబిందువు వివేకం అనే సూర్యాతపంచేత కొద్దిలోగానే లయం పొందుతుంది నాకు తప్పక బ్రహ్మభావం లభిస్తుంది- నేను అనేక మంది సిద్ధులవల్ల ఉపదేశం పొందాను- పరమానందసాధనమయిన ఆత్మనిష్ఠను అనుసరిస్తాను- ఆత్మఅనే మణి నాకు రహస్యంగా దొరికింది. దీనివల్ల నేను సుఖంగా ఉంటున్నాను. ఇతర కోరికలు విడిచినాను- శరత్కాలంలో హిమనదాది పర్వతములమీది మేఘాలవలె నిర్మలంగా ఉంటున్నాను- ఓ వివేకమా! నాకు దేహమందు అహంభావము తొలగింది. ధనరాజ్యాదులందు మమకారము అంతరించింది. బలవంతుడయిన మనోరిపువును హతమొనర్చినాను. అతి ప్రశాంతమయిన సప్తమభూమికను చేరాను.

## ౧౦ జనకమహారాజు నిర్ణయము.

అని మనస్సులో ఆలోచించుకుంటూ ఉండగా జనకుడు: ద్వారపాలకుడు వచ్చాడు అతని వద్దకు. ఇలా అన్నాడు జనకునితో-

ప్రతీ॥ భుజస్తంభములందు రాజ్యభారమును నిల్పుకున్న ఓ దేవా! రాజులకుచితమయిన దినకృత్యమును నెరవేర్చుకొండు- ఇదిగో స్నానాల గదిలోపుష్పాడీ,కర్పూరచూర్ణమూ,కుంకుమచూర్ణమూ,కలిసిననీటితో కడవలను నింపుకొని సిద్ధంగా ఉన్నారు ఆడవారు. రక్తోత్పలవనములందు తిరిగెడి తుమ్మెదలు పద్మాలుగల తామరతూడుదారాలతో, బంగారు పూలుగల గుడ్డడేరాలను తయారుచేశాయి- సరస్వారప్రదేశాలు ఛత్రములతోనూ, చామరములతోనూ, రథఇభ, అశ్వములతోనూ నిండిఉన్నాయి. దేవతార్చనగృహాలు చక్కని పుష్పాలతో

నిండిఉన్నాయి- సుపక్వములయిన ఆహారపదార్థాలతో భరితములయి ఉన్నాయి- బ్రాహ్మణబృందం స్నానంచేసి సిద్ధంగాఉన్నారు నీకు స్నానకాలంలో అఘమర్షణమంత్రాలు చెప్పటానికి నీవల్ల దక్షిణలు పుచ్చుకోనటానికి పవిత్రహస్తాలను చాచుకుని ఉన్నారు- ఎదురుచూస్తు న్నారు నిన్ను- భోజనశాలలో నీకు చల్లగా వీచటానికి వింజామరలు చేతబూని సిద్ధంగాఉన్నారు. "శీఘ్రంగా లేవండి- మీకు మంగళమగు గాక- మీనియతికర్మను మీరు నెరవేర్చుకోండి. గొప్పవారు (మహా నీయులు) నిత్యకర్మలయెడల కాలాతిక్రమణమును సహించరు" అని-

ప్రతీహారి ఇలాచెప్పగా విని జనకుడు సంసారస్థితి అంతా చిత్ర మయినదని అనుకున్నాడు. వెనుకటివలెనే ఆలోచించాడు- "రాజ్య సుఖంఅంతా క్షణికం- దీనివల్ల నాకేమి ప్రయోజనంలేదు. ఇది ఎండ మావులవంటిది-(మృగతృష్ణాజలసదృశము.) చాలు ఇంకనాకీభోగాలు- వీటన్నిటినీ విడచి నేను ఏకాంతంలో ప్రశాంతంగా ఉంటాను. అన్ని కర్మలూ విడిచి సుఖంగా ఉంటాను- ఓ చిత్తమా! నీకు సుఖలవాలను ఆస్వాదించే చాతుర్యం చాలాఉంది. ఇంకదానిని కట్టిపెట్టు- ఏదశలలో నీవుచాలా ఉత్సాహపడుతూ ఉత్సాహపడుతూ ఉంటావో, ఆదశల లోనే నిండుదుఃఖం అనుభవిస్తున్నావు- భోగభూములందు భోగాశతో మాటిమాటికి ప్రవర్తిస్తావు. లోకభీతివల్లనూ, శాస్త్రభీతివల్లనూ, నివర్తిస్తున్నావు- ఎక్కడా తృప్తికలగడంలేదు-

కాబట్టి ఓయి పాపిష్ఠిచిత్తమా! తుచ్ఛమయిన ఈ భోగచింతను చాలించు. అకృత్రిమప్రేమకు హేతువయిన దానిని ఆశ్రయించు"అని ఆలోచించి జనకుడు ఊరకున్నాడు చిత్రపటంలోని బొమ్మవలె- ప్రతీహారి కూడా కొంత భయంచేతనూ, కొంత గౌరవంచేతనూ మళ్ళీ ఏమీ చెప్పలేదు. క్షణకాలం ఊరకుండి జనకుడు శాంతవృత్తితో మళ్ళీ ఆలోచించాడు- "లోకంలో పరిగ్రహింపతగినవస్తువు ఏమిఉంది- నేను ప్రయత్నపూర్వకంగా సాధించటానికి. నాశరహితమయిన వస్తువు ఏమి

ఉన్నది నేను ఆశపడటానికి. నాకు కర్తృత్వంతోటీ పనిలేదు- అకర్తృత్వంతోటీ పనిలేదు- లోకంలో పుట్టినవస్తువేదీ నశించకుండా ఉండేది లేదు- సక్రియమగు దేహముకాని అక్రియమగు దేహముకాని మిథ్యయే కాని సత్యముకాదు. నేను పరిశుద్ధమయిన చిద్రూపుడను- నాకు క్షితి లేదు. దొరకని దానిని కోరను- దొరికిన దానిని విడువను- స్వస్థంగా నా స్వరూపంలో నేను ఉంటాను- ఏమి జరగవలసిఉంటే అది జరుగుతుంది- నాకు కర్మానుష్ఠానంతో ప్రయోజనం లేదు- కర్మానుష్ఠానాన్ని ఉపేక్షించినందువల్ల అనర్థమూ లేదు. క్రియాక్రియలతో ప్రాప్తించేది అంతా మాయామయమే. నేను చేసినా చేయకున్నా నాకు శాస్త్రవిహితమయిన పనులూ లేవు- లోకప్రాప్తమయిన పనులూ లేవు-కాబట్టి నేను కోరతగినదేమీ లేదు- పూర్వాపూర్వవ్యవహారక్రియవల్ల ప్రాప్తమయినపనిని నా దేహము చేయుగాక- అవయవస్పందం (చలనం) లేకుండా ఉంటే శరీరం ఊరకనే శుష్కిస్తుంది- అదిమాత్రం ఆవశ్యకమా! మనస్సు నిష్కామంగా ఉంటే, దేనిమీదా రాగద్వేషాలు లేకుండాఉంటే, శరీరావయవములందు ప్రారబ్ధకర్మాధీనంగా బుట్టిన స్పందాస్పదములు (చలనాచలములు) పుణ్యాపాపములు పుట్టకపోవుట అనే ఫలముతో సమానములు- కర్మాధీనమయిన ఫలభోగములందు కర్తృత్వ భోక్తృత్వములు మనఃకల్పితములు. అలాంటి మనస్సు ప్రశాంతమయితే చేసినకర్మ అయినా చెయ్యనిది అవుతుంది మానవులకు. మానవునకు మనస్సులో ఏది నిరూఢమయిన నిశ్చయం ఉంటుందో, వాడు కర్మలయందు తన్మయుడవుతాడు- ఇప్పుడు నామనస్సు కర్తృత్వభోక్తృత్వ రహితమయిన ఆత్మతత్త్వమును ఆశ్రయించి నిరూఢమయింది- కనుక నేను నాచిత్తంలో అధైర్యాన్ని విడిచాను. ఇప్పుడు నాకు ఏవిధమయిన భీతిలేదు-

## ౧౧. చిత్తానుశాసనము.

అని ఆలోచించుకొని జనకుడు కర్తృత్వభోక్తృత్వాభిమానం లేకుండా యథాప్రాప్తమయిన కర్మను ఆచరించదలచాడు- "ఇది నాకిష్టము" "ఇదినాకు అనిష్టము" అనే వాసనలేకుండా కర్మలను ఆచరించాడు. స్థూల సూక్ష్మదేహాభిమానాన్ని మరచాడు- దేవబ్రాహ్మణులను పూజించి ఆనాటి ఆహ్నికమును నెరవేర్చుకున్నాడు- ఏకాంత ధ్యానంతో ఆరాత్రి గడిపాడు. మనస్సును సమాహితము చేసికొన్నాడు. విషయభ్రమలను రూపుమాపుకున్నాడు- ఆరాత్రి గడుపుకున్నాడు- రాత్రి గడచిపోతూ ఉండగా తనచిత్తమును (మనస్సును) ఇలా శాసించాడు. "ఓ చంచలమగు చిత్తమా! ఈసంసారము నీకు సుఖానికి రాలేదు. నీవు శమమును అలవరచుకో. దానివల్ల నీకు సుఖంకద్దు- నీవు సంకల్పవికల్పాలనూ పెంచుకున్నకొలదీ సంసారం పెరుగుతుందినీకు- మనశ్చింతలు అనంతములవుతాయి. నీటితోతడిపినకొద్దీ చెట్టుకుకొమ్మలు విరివిగా పెరుగుతవి. జన్మజరామరణాది సంసారసృష్టులన్నీ విషయచింతాజాలవికల్పములవల్లనే పెరుగుచున్నవి- కనుక విషయచింతలను విడచి శాంతినొందుము. సంసారసృష్టినీ, శమసుఖమునూ తూచుకో ఈరెంటిలో ఏదిసారమయినదిగా తోచితే దానిని ఆశ్రయించు అప్పుడు సంసారమే సారమయినదనితోస్తే దానినే ఆశ్రయించు- ఇది (సంసారము) నిస్సారమయినదికనుక దీనిమీద అభిమానాన్ని వదలు. దీనిని అనురాగంతో గ్రహించవద్దు- ద్వేషంతో విడువనూవద్దు- ఉభయ సాక్షివిగాఉండి ఆత్మకాముడవై యథేచ్ఛగా విహరించు- వెనుకలేని సుఖదుఃఖసాధనములు వచ్చుగాక- ప్రస్తుతం ఉన్న సుఖసాధనములు నశించుగాక- వీటి రాకపోకలతో నీవు విషాదమును పొందకు- కలవరపడకు- నీకు దృశ్యవస్తువుతో ఏలాటి సంబంధమూలేదు- ఉన్నవానికి లేనిదానితో సంబంధమనేది పొసగదు- ఓ మనమా! నీవు లేనిదానివి. ఈదృశ్యమూలేనిదే. వంధ్యాపుత్ర ఆకాశపుష్పములవలె స్వరూపరహి

తములయిన మీరాయిద్దరకు సంబంధమున్నదనేమాట చాలా ఆశ్చర్యము- ఒకవేళ నీవు సత్యమనీ, దృశ్యముమాత్రమే అసత్యమనీ అనుకున్నా అప్పుడూ మీరాయిద్దరకు సంబంధము కుదరదు. బ్రతికినవాడికి చచ్చిన వానితో సంబంధం ఎలా కుదురుతుందో చెప్పు? లేక చిత్తమా! నీవూ, ఈదృశ్యమూ, మీరాయిద్దరూ సద్రూపములే అన్యోన్యయడల, మీరిద్దరు ఎల్లకాలం ఉండేవారలే కనుక ఇష్టవస్తువియోగమే లేదు. ఇంకహర్ష విషాదములకు ప్రసక్తియేది? కనుక చిత్తమా! నీవు విషాదమునువిడు- ముూకీభావము నవలంబించు- సదా ఆత్మస్వరూపస్థితి యందు ఉనికిని సమాధ్యభ్యాసముచే సంపాదించు. విక్షేపాంబుధిలో మునిగియున్న నీపరిస్థితిని మెల్లగా తొలగించుకో. కందుకాలాతమువలె (బంతివలె గుండ్రముగాఉండె కొరివియంత్రమువలె) మాటిమాటికి మండిపోవుచూ మోహానలంలో పడబోకు- ఈ దృశ్యజాలంలో నీవు దేనిని ఆశ్రయిం చినా నీకు పరిపూర్తి లేదు. కనుక ఓమూఢచిత్తమా! అభ్యాసవైరా గ్యాలచేత ధైర్యం తెచ్చుకొని, నీచాపల్యమును విడువుము." అని చిత్తాన్ని శాసించాడు.

## ౧౨. ప్రజ్ఞామాహాత్మ్యము.

ఇలా విచారిసూ జనకుడు రాజ్యంలోని పనులన్నీ చూచుకున్నా డు. (చేసికొన్నాడు) కాని అహంకార మమకారాలచేత మోహం పొందలేదు- మనస్సు సంతోషసమయములందు ఏమాత్రము వికారం చెందలేదు. సుషుప్తిలోవలె విక్షేపరహితంగా ఉంది. అదిమొదలు జనకుడు దృశ్యవస్తువులను గ్రహించిందీలేదు, విడిచిపెట్టిందీలేదు.తత్కా లానికి సంప్రాప్తమయినవానితో తృప్తిపడుతూ ఉండేవాడు. మనస్సు లో ఏవిధమయిన విక్షేపాలు ఉండేవికావు. ఎప్పుడూ బ్రహ్మవిచారం చేస్తూఉండేవాడు. అందుచేత అతనికి సహజమయిన అహంమమాభి మానమూ అన్యమూ అంటలేదు. ఆకాశానికి ధూళి అంటనట్లు- తన

వివేకానుసంధానంవల్ల అపరిచ్ఛిన్న బ్రహ్మాకారమయిన సమ్యగ్జ్ఞానం కలిగింది. మనస్సు అతినిర్మలమయింది- హృదయాకాశంలో చిదాత్మ సాక్షాత్కారం కలిగింది- దృశ్యవస్తువులన్నీ (కనిపించే వస్తువులన్నీ) చిదాత్మయందు అధ్యస్తములనీ, పరమార్థంలో ఆత్మరూపములనీ గ్రహించాడు. హర్షశోకములను అరికట్టుకున్నాడు. ప్రపంచవ్యవహారం అంతా మాయికమని నిర్ణయించుకున్నాడు. సర్వసముడైనాడు- జీవన్ముక్తుడయినాడు. జ్ఞానవృద్ధుడై రాజ్యంచేశాడు- రాజ్యంలోని అర్థానర్థాలతో తాను ఏమాత్రమూ వికారంచెందలేదు- ఇంతరాజ్యం ఏలుచున్నా తాను ఏమీచేయనివాడివలెనే ఉన్నాడు- దేనియందు రాగాదివాసనలులేవు- వాసనాక్షయమయింది- నిద్రించినవానికి ఏవస్తువుమీద కోరికలేనట్లు జాగ్రత్తులోకూడ జనకుని మనస్సు అలా వాసనారహితమయింది- నిరంతరం ఆత్మవిచారంలో నిమగ్నమయింది మనస్సు. అంచేత బ్రహ్మపదార్థం లబ్ధమయింది అతనికి. కనుక రామా! ఫలపర్యంతం విచారణచేయవలెను. మధ్యలో విసుకు చెందకూడదు. విచారము కడముట్టినచో ఫలప్రాప్తి అతిసులభము. బ్రహ్మపదము గురువువల్లకాని, శాస్త్రార్థమువలనకాని, పుణ్యకర్మలవలనకాని లభ్యపడదు. సజ్జనసాంగత్యమువల్ల కలిగిన ఆత్మవిచారంచేతనే లభ్యపడును. అతి రమణీయమయిన తన బుద్ధిబలంచేతనే తానీపదమును పొందాడు- అజ్ఞానమనే అంధకారం అతని ప్రజ్ఞాదీపాన్ని ఏమాత్రమూ బాధించలేకపోయింది. ఇలాగంటి వివేకసంపద (ప్రజ్ఞ) కలిగితే ఎంతటి విపన్నదివయినా దాటవచ్చు- ప్రజ్ఞారహితుడయిన మూఢుని యెంతటి కొద్ది ఆపదఅయినా బాధించగలదు- ఊలవము అను తృణవిశేషమును యెంతటి పేలవమయిన గాలిఅయినా కదల్చగలదు. రామా! గురువు మొదలగువారి సహాయములేకున్ననూ,శాస్త్రశ్రవణములేకున్ననూ ప్రజ్ఞావంతుడు సంసారసాగరమును తరించగలడు. లోకంలోకూడా ప్రజ్ఞాశాలి నిస్సహాయుడయినా తన పనిని నెరవేర్చుకొనగలడు- ప్రజ్ఞారహితుడు యెక్కువ సేనాబలముచే ముఖ్యుడయినా కార్యమును ఆరంభించి తుద

ముట్టలేక నశిస్తాడు- లేక ప్రజ్ఞ అనగా చరమసాక్షాత్కారము. అది కలవాడు సకలకార్య ప్రపంచమును నశింపచేసికుంటాడు- లేక అన్ని పురుషార్థములకు అవధియయిన పరమపురుషార్థాన్ని పొందుతాడు. దుష్ప్రజ్ఞ మనగా మోహము. ఇది సకలకార్య ప్రపంచమునూ తయారు చేసి ప్రధానమయినదయిననూ జ్ఞానమాత్రంచేత నశిస్తుంది- శాస్త్రాభ్యాసము సజ్జనసాంగత్యములచే ఇలాగంటి ప్రజ్ఞను వృద్ధిపరచుకోనవలెను- ఒక చెట్టువల్ల పండ్లను కాయించవలెనంటే, ఆ చెట్టుకు నీరు పోయుట, దానిని కాపాడుట మొదలగు పనులు ఎన్నో చేయాలి. అలాగే ఆత్మజ్ఞానం సంపాదించుకొని ముక్తిఫలం పొందాలంటే దానికి పూర్వ ప్రయత్నం ఎంతో కావాలి. బాహ్యమగు అర్థమును సంపాదించడానికి మానవులకు ఎంతటి ప్రయత్నం అవసరమో ప్రజ్ఞను వృద్ధిపరచుకొనుటకు కూడ అంతటి ప్రయత్నం అవసరము. ముందుగా దానిని సంపాదించుకొనవలెను. సర్వదుఃఖములకు పరమావధి ప్రజ్ఞామాంద్యము- సకల ఆపదలకు పెద్ద గోడవును. (కొట్టు) ప్రజ్ఞామాంద్యము సంసారవృక్షములకు విత్తనము ప్రజ్ఞామాంద్యము. దీనిని నశింపచేసికొనవలెను- స్వర్గలోకంలో ఏసుఖం లభిస్తుందో, పాతాళలోకంలో ఏసుఖంలభిస్తుందో, రాజ్యాధికారంవల్ల ఏసుఖంలభిస్తుందో, ఆసుఖమంతా ప్రజ్ఞాబలంగల మహనీయులు పొందెదరు. రామచంద్రా! ఎంతభయంకరమయిన సంసారసాగరమును అయినా ప్రజ్ఞచే దాటవచ్చు- దానాలచే దాటలేము. తీర్థయాత్రలచే దాటలేము. తపస్సుచే దాటలేము. భూమిచరులయిన నరులు దైవీసంపదను పొందారంటే అదిప్రజ్ఞ అనే పుణ్యాలత యొక్క పండుకాని వేరుకాదు. తమకాలిగోళ్ళచే మదపుటేనుగుల కుంభస్థలములను చీల్చివేయునట్టి సింహాలుకూడ ప్రజ్ఞాబలంచేతనే నక్కలచే జయించబడుచున్నాయి- ప్రజ్ఞాబలంచేతనే సామాన్య మానవులు రాజులవుతున్నారు- స్వర్గానికి దారితీసినా ముక్తికి మూట కట్టినా మానవుడు అది ప్రజ్ఞయొక్క సత్తయేకాని వేరుకాదు. ప్రజ్ఞా

బలంచేతనే లోకంలో వాదశూరులను జయిస్తున్నారు వాదులు. వివేకికి ప్రజ్ఞ అనేది హృత్కోశంలో ఉండే చింతామణి. కల్పలతవలె కోరిన ఫలాన్ని యిస్తుంది. ఎంతటి అధముడయినా ప్రజ్ఞచే ఉత్తముడై సంసారాన్ని తరిస్తాడు. పడవనడుపుట నేర్చిన పల్లెవాడే నదిదాటి ఆవలయొడ్డు చేరగలడు. అట్టిశిక్షనొందని పల్లెకారి దరిజేరలేడు. సముద్రంలోని నౌకను నేర్పరి సరిగానడిపితే ఒకదరి జేరుతాడు. అలాగే మానవుడు తనబుద్ధిని వివేకవైరాగ్యాది సన్మార్గంలో పెట్టేయడల సంసారాన్ని దాటగలుగుతాడు. అలాంటిసన్మార్గంలో పెట్టలేక అపమార్గాన్ని పట్టించేయడల ఆపదలను పొందుతాడు. వివేకిని అసమ్మూఢుని(ప్రాజ్ఞుని) ఆశాగణంలోని దోషాలు (అనగా లోభ మోహ క్రోధ చింతాదులు) వీటివల్ల కలిగేదోషాలు ద్వేషచింతావిషాదాదులు ఏమాత్రం బాధించలేవు- ప్రజ్ఞాశాలియే ప్రపంచాన్ని గుణతత్త్వవివేకంతో చూడగలడు- సమ్యగ్జ్ఞానముగల పురుషుని ఆపదలు అంటవు. సంపదలూ అంటవు- అహంకారమనే మేఘుడు పరమాత్మఅనే సూర్యుణ్ణి ఆవరిస్తాడు. వీడు ప్రజ్ఞఅనే గాలిచే ఎగిరిపోతాడు.

గమనిక :- గురూ !

తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ ।
ఆచార్యాద్ధైవ విదితా విద్యా సాధిష్ఠం ప్రాపత్ ॥

అని ఉపనిషద్వాక్యాలు బ్రహ్మవిద్యను గురువునొద్దనే అభ్యసించవలెనని చెప్పుచుండగా యిచట వసిష్ఠులు-

న తద్గురోర్నశాస్త్రార్థా న్నపుణ్యాత్ప్రాప్యతేపదం ।
యత్సాధుసంగాభ్యుదితా ద్విచారధి శదాద్హృదః ॥ అనీ-
ప్రజ్ఞావా నసహాయోపి విశాస్త్రో ప్యరిమద్దవ ।
ఉత్తరత్యేవ సంసారసాగరాద్రామ పేలవాత్ ॥

అనీ, గురుశాస్త్రాదులతో పనిలేకుండగనే తరిస్తారని చెప్తారేమిటి? ఇది శ్రుతి విరుద్ధంకదా ?

గు॥ శిష్యా వినుసమాధానం- ఇక్కడ సజ్జనసాంగత్యం ఆత్మ విచారములయొక్క ప్రాశస్త్యం చెప్పుటలోనే వసిష్ఠులకు తాత్పర్యంకాని, గురుశాస్త్రాదులను త్రోసిపుచ్చడంలో తాత్పర్యంలేదు. ఇలాంటి వాక్యాలు వేదంలోకూడ కొన్నికలవు.

చూ॥ "అపశవోవా అన్యే గో అశ్వేభ్యః పశవో గో అశ్వాః" అని ఒక వాక్యంఉంది- ఈవాక్యం గుర్రాలు ఆవులు కంటె మిగిలినవి పశువులుకావని చెబుతోంది. దీనికి మిగిలినవి పశువులే కావని చెప్పుటలో తాత్పర్యంకాదు. గోవులు అశ్వములూ పశుజాతిలో ప్రశస్తము లనుటలోనే తాత్పర్యం. అలాగే ఇక్కడకూడ వసిష్ఠులకు సజ్జనసాంగత్యాదుల ప్రాశస్త్యంలో తాత్పర్యంకాని గురుశాస్త్రాదుల నిషేధంలో తాత్పర్యంకాదు.

గురూ ! ఇందులో "స్వర్గాద్యత్ యచ్చపాతాళాత్ రాజ్యాద్యత్సమవాప్యతే" అని పాతాళంలోకూడ స్వర్గలోకంతోపాటు సుఖం ఉందని అంటారే వసిష్ఠులు. ఇది ఎలా పొసగుతుంది.

గు॥ శిష్యా ! ఇందులో విరోధంలేదు. చూడు- నారదుడు ఒకప్పుడు ఇలా అన్నాడు.

స్వర్లోకాదపి రమ్యాణి పాతాళానీతి నారదః ।
జగాద ద్యుసదాం మధ్యే పాతాలేభ్యః సమాగతః ॥

అని అనగా స్వర్గలోకంలోకంటె రమ్యమయిన వస్తువులు పాతాళలోకంలో ఉన్నట్లు నారదుడు చెప్పాడని దీనియర్థము. ఇలాంటి పౌరాణికవచనములవల్ల పాతాళలోకంలోకూడ సుఖాతిశయము ప్రసిద్ధమే- కాబట్టి దీనిలో పొసగనివిషయమేమీలేదు-

## ౧౩. చిత్తప్రశమనోపాయవర్ణనము.

రామా ! జనకునివలె తన మనస్సుతో తాను (తననుగూర్చి) విచారణ చేసికొంటే ప్రతివాడూ బ్రహ్మాత్మమును పొందగలడు. నీవు

కూడ విచారణవల్లనే అసంభావనాది ప్రతిబంధకాలను పోగొట్టుకుంటావు. బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందుతావు- జనకుని తీరువంటివారగు రాజసులు సాత్వికులుకూడ బ్రహ్మపదమును పొందుటకు అర్హులే. రజస్సువల్ల పురుషప్రయత్నం సంభవిస్తుంది. సత్త్వంచేత చిత్తప్రసాదం అభివృద్ధిచెందుతుంది. చిత్తమునందు సత్త్వగుణము అభివృద్ధి చెందునంతవరకు ఇంద్రియములనే శత్రువులను అణచివేయవలెను. (అణచి ఉంచవలెను.) చిత్తము నిర్మలమయితే సర్వవ్యాపకుడగు పరమాత్మ సాక్షాత్కరిస్తే, దోషదృష్టులన్నీ నశిస్తాయి- కృదృష్టులు మోహబీజములకు పిడికెళ్లు. (ముష్టులు) వివిధాపదలకు వృష్టులు. పరమాత్మ సాక్షాత్కారంవల్ల యివి పూర్తిగా నశిస్తాయి. అనగా అహం మమాభిమానములనే హృదయగ్రంథులే కుదృష్టులు. దుర్వాసనలే మోహబీజాలు. ఈ దుర్వాసనలకు అహంమమాభిమానాలు పిడికెళ్లు. అనగా గట్టిగా పట్టుకొనునట్టివి. అలాగే సమస్తాపదలను కురిపించే వర్షాలు- ఇట్టి కుదృష్టులు ఆపరావరుడయిన పరమాత్మను తెలుసుకుంటే నశిస్తాయి. అని యర్థము. కనుక రామా! నీవుకూడా జనకునివలె వివేకబుద్ధితో ఆత్మనుగురించి పురుషార్థమనే లక్ష్మిగలవాడవగుము- అనిత్యమయిన ప్రపంచాన్ని చూస్తూ ఉండేవాడికి విచారమే చిత్తప్రశాంతిని కలిగిస్తుంది- కనుక ఆత్మప్రసాదోపాయములలో విచారమే ముఖ్యమయినది- ఆత్మవిచారానికి పురుషప్రయత్నం మూలం- దైవం కారణం కాదు- కర్మలు కారణంకావు. ధనములు కారణంకావు- బంధువులు కారణంకారు. పురుషప్రయత్నమే భవభీతిగల మానవులకు శరణ్యము- ఎవరు తమ ప్రయత్నం మానుకొని "దైవం దైవం" అనుకొంటూ దైవం అంతా నెరవేరుస్తుందనీ, మనమెంత ప్రయత్నించినా దైవం అనుకూలంగా లేకపోతే ప్రయత్నం ఫలించదనీ అనుకుంటారో అలతటి మందమతులు లేరులోకంలో. అలాంటి బుద్ధిమాంద్యం వినాశానికి హేతువు- కనుక గట్టివివేకాన్ని పొంది మనస్సుతో ఆత్మతత్త్వమును తెలిసికొని వైరాగ్యపూర్వకమగు బుద్ధితో సంసారసాగరాన్ని తరిం

చాలి- ఇది జనకాఖ్యాయిక. నీకు ఉదాహరణకోరకు చెప్పాను. ఈ ఆఖ్యాయిక అజ్ఞానాన్ని పోగొట్టుతుంది. జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. జనకునివంటి సద్బుద్ధిగలవానికి హృదయమునందలి పరమాత్మ చక్కగా వికసిస్తాడు- ఎండకు మంచు విరిగినట్లు ఆత్మవిచారంచేత సంసారమననం విలీనమవుతుంది- దేహంమీాద అహంభావం తొలగడమే పరిపూర్ణాత్మ దర్శనానికి ముఖ్యసాధనము. జనకుడు అహంమమాభిమానమును విడిచి నట్లు నీవుకూడ విచారణచేత దేహాభిమానాన్ని విడు- అహంకారమనే మేఘము విడిపోతే చిదాకాశము అతినిర్మలమయితే ప్రకాశాత్మకు డయిన పరమాత్మ అనే సూర్యుడు శరత్కాలంలోవలె స్ఫుటంగా వెలుగుతాడు- అహంభావమే గాఢతమస్సు. అది శాంతిస్తే కాని వివేకమనే ప్రకాశ ఉదయించదు. అహంతలేదు. మమతలేదు. అని భావించిన మనస్సే ప్రశాంతిని పొందుతుంది. అట్టి మనస్సే విషయము లందు ఆసక్తముకాదు. రామా! విషయాలయందు అనురాగమూ, హేయవస్తువులందు ద్వేషమూ, ఈరెండే మనస్సునకు బంధములు. వేరే బంధమనేది లేదు మనస్సుకు. హేయములయందు ద్వేషమును ఉపా దేయములం దనురాగమును చెందకు. ఈరెంటిని విడిచి యీారెంటికి సాక్షిగా నుండుచూ, మనోనైర్మల్యమును పొందుము. ఇది హేయము (పనికిరానిది). ఇది ఉపాదేయము, (గ్రహింపదగినది) అను వ్యవస్థగల మానవులు అహేయానుపాదేయ ఆత్మదర్శనమునకు మరుగు పడుదురు. హేయోపాదేయబుద్ధులు (మంచి చెడు అను బుద్ధులు) నశించునంత వరకు చిత్తమునందు సర్వసమమయిన బ్రహ్మపదార్థము భాసించదు. మేఘముకమ్మిన ఆకసమున వెన్నెల ప్రకాశించదు. "ఇది ప్రశస్తము" "ఇది అప్రశస్తము" అని యెవరిమనస్సులోపల లోలమయియుండునో వానిమతియందు సర్వసమమగు బ్రహ్మము నిలువనేరదు. ముళ్ళచెట్టుకు పూలగుత్తి ఉండదు- "ఇదియుక్తము" కాన నాకుకావలెను. "ఇది అయుక్తము" కాన నాకు అక్కరలేదు" అను భావంగల వాని చిత్తంలో స్వచ్ఛతకాని, సమతకాని యుండనేరదు- అద్వితీయ బ్రహ్మ

భావనగల చిత్తమునందు యుక్తాయుక్త వికల్పములుకాని భేదాభేద వికల్పములుకాని ఉండుట కవకాశములేదు. చిత్తమనే చెట్టుమీద "ఈప్సితము" "అనీప్సితము" (ఇష్టము, అనిష్టము) అనేకోతులు రెండు ఆడుతూఉండునంతవరకు ఆచిత్తపాదపమునకు నిశ్చలతయేది? రామా! 1. ఆశలేకుండుట, 2. భయములేకుండుట, 3. నిత్యతాబుద్ధి, 4. సమత్వము, 5. జ్ఞానము, 6. మనశ్చాంచల్యము లేకుండుట, 7. శారీరకమయిన కర్తృత్వాభినివేశము లేకపోవుట, 8. సదా ప్రసన్నత, 9. వికల్పరాహిత్యము, 10. ధైర్యము, 11. సర్వభూతములందు సుహృద్భావము, 12. మననశీలము, 13. సంతోషము, 14. మార్దవము, 15. మృదుభాషణము. అను పదునైదును జీవన్ముక్తుని లక్షణములు- ఇవి జ్ఞానియందు వాసనారహితములై యుండను- నికృష్ట విషయములమీదికి ప్రసరించెడి యింద్రియములను మరల్పవలెను. దిగువకుబోవు నీటికి సేతువు (కట్ట) కట్టినట్లు- బాహ్యవస్తువులను పరిత్యజించి సర్వకాల సర్వావస్థలందును ఆంతరవిషయములనుగూర్చి విచారించుచుండవలెను- విచారహితమయిన చిత్తముగలవాడు మృతునిక్రింద లెక్క-. వాసనలనునవి వలలు. ఇవి విషయచింతలనే తంతువులచే అల్లబడినవి- సంసారమనే నీటిలో వేయబడినవి. తృష్ణలనే చేపలను పట్టునట్టివి- వీటిని (ఈవలలను) నేనుపదేశించిన జ్ఞానమనే కత్తెరతో ఛేదించుము. (కత్తిరించుము) రామా! చిదాభ్యాసముచే దృఢీకృతమయిన మనోధైర్యము నవలంబించి అపరోక్షాత్మసాక్షాత్కారమొనర్చుకొని సంసార వృక్షమునకు మూలమగు అజ్ఞానమును నరకుము- విక్షేపహేతువగు మనస్సు ఉండగా మూలచ్ఛేదము అసాధ్యమని నీకు శంక కలుగవచ్చును- కాని కట్టెతో కట్టెను కొట్టినట్లు మనస్సుచేతనే మనస్సును కొట్టవలయును- (అనగా కత్తికి పిడి కఱ్ఱ గొడ్డలికి కూడ మొదట కఱ్ఱయుండును. ఈకఱ్ఱను పట్టుకునే గొడ్డలితోకాని, కత్తితోకాని, చెట్లును కొట్టుదురు. కావ కట్టెతో కట్టెను కొట్టినట్లేయగును. అలాగే మనస్సుయొక్క- చివర ప్రకాశించెడి బ్రహ్మచైతన్యముగల మనస్సు

చేతనే మనస్సును ఛేదించాలి- దీనిచే వాసనారాహిత్యమయినందున రాబోవు మనోవృత్తులు సంభవించవు. వర్తమానమగు బ్రహ్మాకార మనోవృత్తిమాత్రం కతకరేణున్యాయముచే దానియంతట అదే నశించును- వాసనాక్షయమయిన తరువాత అవిద్యలో బీజశక్తి (మొలకరించుశక్తి) నశించినందున మరల సంసారకారణమయిన మోహము పుట్టదు- చిత్తమునందు సంస్కారములు నశించి నందున మరల చైత్యములు (విషయములు) మొలకరించవు. కాబట్టి చిత్తచైత్యముల రెంటినీ పూర్తిగా మరచి వానియందు ఏమాత్రము ఆదరము ఉంచకుము. సర్వసముడగు బ్రహ్మను ఆశ్రయించి, దొరకినదానితో తృప్తి జెందుతూ దొరకనిదాని కాశపడక విహరించుము. మహేశ్వరునుకూడ పృథివ్యాది అష్టమూర్తి లక్షణములయిన లింగములను (చిహ్నములను) శుద్ధచిన్మాత్రుడనను దృష్టితో ధరించుటలేదు. జగదాకార వివర్త మాయాధిష్ఠానమగుట వలన సన్నిధిమాత్రంచేత ధరించుచున్నాడు. అలాగే నీవుకూడ రాజ్యాదికార్యములను ఆదరాభిమానములు లేకుండా సన్నిధిమాత్రంతో చేస్తూఉండు. ఆదరముతో చేయకుము. రామా! సర్వశరీరములందూ నీవే ద్రష్టవు- నీవే జన్మాదివికార శూన్యుడవు- సర్వప్రపంచమునకు చేతనరూపుడవగు ఆత్మవు నీవే- నీవే పరమేశ్వరుడవు. ఇట్టి నీచేతనే యీ ప్రపంచము ఇలా విస్తరింపచేయబడినది- మరొకరెవరు దీనిని తయారుచేయలేదు. దృశ్యప్రపంచం అంతా ఆత్మస్వరూపమని భావించి యితరభావన లేనివానికి దీనియందు హర్షామర్షములు (రాగద్వేషములు) ఉండవు- తత్త్వవేత్తలు యిట్టి భావనతో నుందురు. నీవుకూడ అదే భావనతో నుండి రాగద్వేషాలను సంసారం మీద విడువుము. మట్టీ, బంగారమూ ఒకటిగా చూచుకునే రాగద్వేషరహితుని యోగియందురు. వానికి సుఖదుఃఖములు సమానములు. అట్టివాడు ఎన్నిపనులు చేసినను ఆపనులలో నిమగ్నుడుకాడు. రామా! భోగచింతనువిడచి ప్రపంచంఅంతా చిత్సత్తామాత్రమను నిశ్చయముగల మనస్సు శాంతినొందును. సహజముగా జడమయిన యీ మనస్సు

చిత్తత్వమును అనుసరించి ఉంటుంది. మాంసముమీది ఆశతో మార్జారము అడవిలో సింహాన్ని అనుసరించి తిరిగినట్లు. అది సింహముయొక్క పరాక్రమంచేత దొరకిన మాంసముతో తనను తన పిల్లలను పోషించుకుంటుంది. అలాగే మనస్సుకూడ చిత్తత్త్వముయొక్క శక్తివల్ల ప్రాప్తించిన దృశ్యాన్ని ఆశ్రయించి బ్రతుకుతుంది. మిథ్యాభూతమయిన యీమనస్సు చిత్తుయొక్క అనుగ్రహంచేత బ్రతుకుతుంది. ఎలాగంటె అద్వితీయమయిన పరమాత్మను మరచి జగదాకారమును మాత్రమే భావనచేయుచూ, బ్రతుకుతూ ఉంటుంది. ఎప్పటికయినా ఆత్మస్మృతి కలిగిందా ఇంక తన స్వరూపాన్ని విడిచి చిత్తే అయిపోతుంది. చైతన్యముయొక్క సహాయం లేకపోతే మనస్సు శవాకారము, కదలలేదు. కనుక దీనికి ప్రకాశస్పందశక్తులు రెండూ చైతన్యాధీనములే. కనుకనే విద్వాంసులు చైతన్యముయొక్క స్పందశక్తియే మనస్సుఅని అంటారు. స్పందశక్తియొక్క విలాసమే చిత్తమూ దాని వృత్తులునూ ఇదే త్రిపుటికూడ. చేత్యరహితమయిన చిత్తుయే (చైతన్యమే) సనాతనమయిన బ్రహ్మము. చేత్యముతో కూడుకున్న చిత్తుయే ప్రపంచము. అద్వితీయమగు బ్రహ్మయే ఒకానొకరూపమును దాల్చి మనస్సు అగుచున్నాడు. అదియే హృదయమునందు సంకల్పవికల్పములను కల్పించుకొని స్థిరమయిన మనస్సుగా ప్రసిద్ధమయింది. అదియే తన చైతన్యస్వరూపమును మరచి జడత్వమును చెందుచున్నది. ఇదే గడచిన విషయాకారమును కల్పించుకొని చిత్తమనీ, అనాగతమయిన (రాబోవు) విషయములయొక్క ఆకారమును కల్పించుకొని సంకల్పవికల్పాలను పెంచుకున్నందున మనస్సు అవుతోంది. ఇలా రెండువిభాగాలుగా పరిచ్ఛిన్నమయి గడచిన యిష్టానిష్టసాధనత్వమును నిర్ణయించుకొని రాబోవు ఇష్టానిష్టసాధనత్వాన్ని సంకల్పించి హేయోపాదేయ ధర్మములుకలదిగా యీచైతన్యమే (చిత్తుయే) అయినది. కనుక మాయాశక్తి వశంచేత చిత్తుయే మనస్సుగా అవతరించింది లోకంలో. గురుశాస్త్రవిచారములచేత తన స్వరూపాన్ని తెలుపునంత

వరకు తన వాస్తవమయిన పరిపూర్ణానందాద్వయరూపమును తాను తెలిసికొనలేదు. కనుక శాస్త్రవిచారణచేతను, పరవైరాగ్యముచేతను, ఇంద్రియనిగ్రహముచేతను, ఈకల్పనాక్రమమును తెలుపవలెను. శాస్త్రజన్యజ్ఞానంచేతనూ, మనననిదిధ్యాసలచేతనూ, బోధింపబడినదై మనస్సు బ్రహ్మత్వమును చెందును. అలాబోధింపనిచో యీ సంసారములోనే తిరుగుచుండును. రాగమనే మద్యములో మునిగి, విషయములనే గోతులలో పొరలుచూ, అజ్ఞానమనే నిద్రలో పడుండియున్న మనస్సును మేలుకొలుపుట అవసరము- (ఆవశ్యకము) మనస్సు అజ్ఞానమనే నిద్రలో ఉంటే ప్రపంచమును మాత్రం ఎలా తెలుసుకుంటోంది? లేక మెలకువతోనే ఉందంటారా? అప్పుడు అది తెలివితోనే ఉన్నదికనుక దానికి తెలుపవలసినదేమున్నది? అని నీకు శంకకలుగవచ్చును? అదిసరికాదు. ఇది యెప్పుడూ అజ్ఞానమనే నిద్రలోనే ఉంది. కనుక దేనిని తెలిసికొనుట లేదు. ప్రపంచాన్ని తెలుసుకుంటోందికదా? అని అనుకొనుచున్నారు లోకులు- ప్రపంచమే అజ్ఞానవిలసితము. దానిని ఇది (మనస్సు) తెలుసుకొనుట యేమిటి? ప్రపంచము సంకల్పములోనున్న ప్రాసాదనిర్మాణము వంటిది. (అనగా స్వప్నముతో సమానమయినది) కనుక లేనిది. ఇక దానిని మనస్సు తెలిసికొనుటయేమిటి? ఒకవేళ ప్రపంచస్థితి దృశ్యమానమయినా అది స్వప్నవృత్తాంతమువలె అసన్మయమాసియే [illegible] యము- చిత్తవృత్తిరూపమయిన యీకలన (ఆభాసచైతన్యము) లోపలనున్న సాక్షిచైతన్యముతో వ్యాప్తమై విషయములను ప్రకాశింపచేయుటకు సమర్థమవుతోంది. స్వయముగా విషయాలను ప్రకాశింపచేయలేదు- నిత్య బోధ స్వభావముకల యీసాక్షిచైతన్యము పరిచ్ఛిన్నమయిన అంతఃకరణమనే ఉపాధివల్ల తానుకూడ పరిచ్ఛిన్నమై(అల్పమై) పరిచ్ఛిన్నమయిన (అల్పమయిన) అంతఃకరణాదులనే ప్రకాశింపచేస్తోంది. సూర్యుడు పద్మాకరమును ప్రకాశింపచేస్తున్నట్లు వృత్తిరూపమయిన కలన (జ్ఞానము) వివేకానంతరము పాషాణమువలె కేవల జడమే. కనుకనే ఇది సాక్షిచైతన్యముచే బోధింపబడుతోంది. కాని

యిచట తార్కికులు మున్నగువారు నిత్యమగు సాక్షి చైతన్యమును గుర్తించక అనిత్యమయిన వృత్తిజ్ఞానమే విషయములను ప్రకాశింప చేస్తోందని తలుస్తున్నారు- అది చాల పొరపాటు- రాతిబొమ్మను యెంతతోసినా అది నృత్యం చేయలేదు. అలాగే యీవృత్తిజ్ఞానం (కలన) కూడా శరీరంలో దేనినీ ప్రకాశింపచేయలేదు. అచేతనములయిన అంతఃకరణ వృత్త్యాదులకు నిత్యచైతన్యముయొక్క సాన్నిధ్యము లేనిదే విషయాభిముఖమయిన ప్రవృత్తియే కలుగదు. ఇంకవిషయాలను ప్రకాశింపచేయుట అనేది అసలేసున్న- పటములో చిత్రించిన రాజులు యుద్ధమాడగా మనమెరుగము. చంద్రకిరణములు ఓషధులను తృప్తిపరచుట మనమెరుగనిది కాదు- శవశరీరాలకు నెత్తురువెక్కిస్తే మాత్రం అవి పరుగెత్తగలవా? అడవిలోని రాతిముక్కలు మధురంగా గానంచేయటం ఎక్కడనయినా కద్దా? ఎక్కడనయినా రాతితో మానవులు తయారుచేసిన సూర్యులు రాత్రియందలి చీకటిని పోగొట్టుట చూచితిమా? సంకల్పసిద్ధమయిన గగనకాననములచే (ఆకాశమునందలి అడవులచే) నీడ యియ్యబడుచున్నదా? అలాగే మిథ్యా భ్రాంతులవల్ల తయారయి, రాతివలె జడములై మృగతృష్ణామయములయిన యీమనస్సులు యేమిచేయగలవు? సూర్యాతపం తగ్గితే ఎండమావుల నదియొక్క గతియేమవునో అంతే నిత్యచిదాత్మను అంగీకరించకపోతే అనిత్యములయిన మనోవృత్తుల గతికూడా నిత్యచిదాత్మయొక్క సత్తావల్లమాత్రం యిది ప్రకాశిస్తుంది- కనుక చైతన్యముయొక్క పరిచ్ఛిన్నమయిన స్పందమే మనస్సు అని అన్నారు అజ్ఞులు- ఈస్పందశక్తియే శరీరములోపలి ప్రాణముకూడా. ఈప్రాణశక్తి సంకల్పరహితమయిన యోగులకు చిదాత్మరూపమే. ఈస్పందమే "అహంమమ" అనే వృత్తి కలది అయ్యేసరికి చిజ్జడములతో మిళితమై జీవుడనే సంజ్ఞకలది అయింది. "జీవప్రాణధారణే" అనే ధాత్వర్థమునుబట్టి జీవించియున్నదికనుక జీవుడు అనేపేరు దానికి సార్థకమయింది. ప్రాణాత్మతత్త్వములకు రెంటికీ కలిపి యీపేరు పెట్టారు. రామా! "బుద్ధి, చిత్తం, జీవః" అనేవి అసద్రూపమయిన సంకల్పమునకు పేరులు- పరమార్థంలో యీపేర్లులేవు.

పరమార్థంలో ఆత్మఒక్కటే ఉన్నదికాని, మనోబుద్ధిచిత్తములనేవి లేవు. ప్రపంచమంతా ఆత్మయే. అతడు ఆకాశముకంటెకూడా అతి నిర్మలుడు. అతడు ఉన్నాడనీ లేడనికూడ ప్రతీతికలదు- చక్షురాది యింద్రియములకు గోచరమయ్యే స్థూలత్వ నీలత్వాదులు లేనివాడుకనుక లేడని ప్రతీతి, చిద్రూపుడై స్వపర ప్రథా నిర్వాహకుడు (తనను ఇతరములను ప్రకాశింపజేయువాడు కనుక) ఉన్నాడనే ప్రతీతికలదు. ఇట్టి ఆత్మ అనుభవమాత్రైకగోచరుడు కాని యింద్రియాదులకు గోచరుడు కాడు. సూక్ష్మగ్రహములను గ్రహించెడి మనస్సుకూడా అతనిని గ్రహించలేదు. ఎక్కడ వెలుతురు ఉంటుందో అక్కడ చీకటి నశిస్తుంది- ఈ నియమం లోకంలో కద్దు. దీనినిబట్టి మనస్సు అవిద్యాకార్యముకనుక చిద్రూపమయిన ఆత్మాకారవృత్తి కలిగేసరికి అవిద్యాకార్యమయిన మనస్సుకాస్తా నశించి ఊరకుంటుంది- విద్యావిద్యలకు తమఃప్రకాశాలకు వలె విరోధమున్నందున అందువల్ల చిద్రూపుడయిన ఆత్మను దర్శించే శక్తి దానికిలేదు. కనుక మనస్సుకు ఇంక యెక్కడశక్తి ఉందంటే యేదశలో స్వచ్ఛమయిన ఆత్మసంవిత్తుకు సంకల్పవశంచేత బాహ్యార్థములు ప్రకాశింపతగినవిగా అభిమతములగునో, అపుడు పరమార్థమయిన ఆత్మను మరచి మిథ్యార్థమయిన (సంకల్పసిద్ధములయిన) బాహ్యవస్తువులను ప్రకాశింపజేసెడిశక్తి మనస్సుకు ఉంది. ఇంతేకాని ఆత్మను ప్రకాశింపజేయుటయందు దీనికిశక్తిలేదు. కాక సంకల్పమయత్వాధీనమై పుట్టేది మనస్సు- సర్వ సంకల్పక్షయంలో ఉపలక్షితమగువాడు మోక్షాత్మకనుక తనపుట్టుకకు విరుద్ధమయినందున ఆత్మయందు తాను ప్రవర్తించలేదు మనస్సు- కనుకనే చిత్తమనగా సంకల్పాభిముఖమయిన ఆత్మ తనచిత్స్వభావమునుండి కొంచెము అన్యథాభావమును (మారుటను) చెందుట యని పలుమారు నీకు చెప్పియుంటిని- చైతన్యము నిర్వికల్పస్వరూపమునుండి దిగజారి సంకల్పమనే చిహ్నముతో కలంకితమయ్యేసరికి మనస్సనేది ప్రపంచసృష్టికొరకు తయారవుతోంది. రామా! ప్రాణశక్తిని నిరోధిస్తే మనస్సు విలీనమైపోతుంది. బింబభూతమయిన

ద్రవ్యము విలీనమయ్యేసరికి అద్దములోని ప్రతిబింబము దానివెంటనే విలీనమవుతోంది. కనుక ప్రాణమే మనస్సు- జీవించియున్న పురుషుడు తన హృదయమునందు దూరదేశముయొక్క మానసికానుభవాన్ని "నాకు దూరదేశముయొక్క అనుభవం కలదని" తెలుసుకొనుచున్నాడు. అందు మనస్సుకు దూరదేశసంబంధము స్పందములేనిదే కుదురదు. వేదనాంశము (తెలిసికొనుట యను అంశము) చిత్స్పందము (చైతన్యముయొక్క చలనము) లేనిదే కుదురదు- కనుక స్పందవేదనోభయశక్తికల (జ్ఞానక్రియాశక్తులుగల) ప్రాణమే మనస్సు అని చెప్పబడుతోంది- ఇక ప్రాణవాయు నిరోధము వైరాగ్యమువలనను ప్రాణాయామాభ్యాసము వలననూ, సమాధియోగమువలననూ, బాహ్యవిషయములనుండి చిత్తముయొక్క నివృత్తి వలననూ, తత్త్వజ్ఞానమువలనను కలుగుతుంది. రాతికయినా ఒకానొకపుడు చలనశక్తి జ్వలనశక్తి (ప్రకాశశక్తి) సంభవింపవచ్చునుగాని మనస్సుకుమాత్రం స్పందశక్తి అవబోధశక్తి (తెలిసికొనుశక్తి) లేవు- ఈస్పందశక్తి ప్రాణానిది- ప్రాణవాయువు చలనరూపము అది జడము. జ్ఞానశక్తి (చిచ్ఛక్తి) ఆత్మది. ఇది అతిస్వచ్ఛము, సర్వవ్యాపకము, నిత్యము. ఈరెండు శక్తులయొక్క సంబంధమే మనస్సు- కాబట్టి అదిమిథ్య. దానివల్ల కలిగే జ్ఞానంకూడా అంతే- (మిథ్య) ఇదే కార్యావిద్య- ఇదే విక్షేపశక్తిరూపమగు మాయ- ఈమనస్సే సంసారసంబంధం మొదలగు విషమును ప్రసాదించెడి అవిద్య- ఈచిచ్ఛక్తి స్పందశక్తులయొక్క సంబంధదశలో సంకల్పాలే కల్పించుకొనకపోతే యెవరికీ సంసారభీతులు ఉండేవే కావు. వాయువుయొక్క స్పందశక్తి చైతన్యముతో ఎపుడు కలియునో అపుడే లోపలసంకల్పములు ఉదయించి చిత్తమనిపించుకొంటోంది. అఖండ మండలాకార స్పందరూపములుగల చైతన్యమే పరమార్థము. ఇది దీనివల్లఏర్పడి మరియొకదానిచే బాధనొందదు- అఖండశక్తిగల దేవరాజును (ఇంద్రునకు) లేక (పరమేశ్వరునకు) ఇతరునితో వివాదమెట్లు? చిత్సంబంధములేనిదే మనస్సనేది సిద్ధించడంలేదు- చిత్స్పంద

ములు రెండూ ఒకటే వాటికి భేదములేదనే పక్షంలో అసలు మనస్సు అనేదానికి స్వరూపమే లేదు- హస్తి అశ్వ రథ పదాతులను విడిచి సేన అనేదిలేదు. అలాగే చిత్తునువిడిచి చిత్తమనేదిలేదు- కనుక తత్త్వజ్ఞానంవల్ల మనస్సు లేదనే నిశ్చయమే మనోనాశము- కనుక రామా! నీవు వ్యర్థంగా దేనిని సంకల్పించకుము- సంకల్పాత్మకము మనస్సనీ, అది లేదనీ శాస్త్రములు నిర్ణయించాయి- కనుక అది మృగతృష్ణిక వంటిది- మనస్సుకు స్వరూపంలేదు- కనుక అది యెప్పుడూ చచ్చినదే- కాని లోకం చచ్చినదానిచేతులో చస్తోంది. ఈమూర్ఖ్యంమాత్రం నాకు చాలా విచిత్రంగా ఉంది- మనస్సుకు స్వరూపంలేదు- దేహం లేదు- ఆధారంలేదు- ఆకారంలేదు- ఇటువంటిది ప్రపంచాన్ని అంతా మింగేస్తోంది- చాలా చిత్రంగా ఉంది- మూర్ఖ్యమనే వలలో పడింది జగత్తుఅంతా. శస్త్రఅస్త్రాదిసామగ్రి యేమీలేని మనస్సుచేత ఎవడు చంపబడుతున్నాడో వాడు నల్లకలువల రేకులచే తలకాయ తెగినవాడని తలుస్తానునేను- జడమూ, మూకమూ, అంధమూ, (గుడ్డిది) అయిన మనస్సుచేత చంపబడినమానవుడు పూర్ణచంద్రుని కిరణములచే తగల బెట్టబడినవానినిగా తలుస్తాను- లేని మనస్సుచేత శత్రుజయసామగ్రి సంపన్నుడయినన్నూ, మూఢమానవుడు తిరస్కరింపబడుట కాని వివేకవంతులు వైరాగ్యాది మహాప్రయత్నాలచేతను, యోగ ధ్యాన సమాధ్య భ్యాసాలచేతనూ, అవిద్యమానమయిన (లేని) మనస్సును నశింపజేయుట కాని, యిది అంతా మూఢత్వముకాని యిందులో పరమార్థం ఏమీలేదు. ఇది మిథ్యాభూతమయిన సంకల్పాలతో బయలు దేరింది. మిథ్యాస్థితిలో ఉంటూఉంది. ఇందులో ఎంత వెతికినా నిజమేమీ కనిపించదు. ఇంక దీనికి ఇతరులను తిరస్కరించే శక్తియెక్కడిది? అబ్బా! మహామాయావి అని ప్రసిద్ధికెక్కిన మయునికూడ తయారుచేసేటంతటి విచిత్రమయింది ఇది- దీనితో లోకం గడగడ వణకుతోంది. ఎంత విచిత్రం? మూర్ఖ్యంఉన్నవాడికి యేఆపదరాదు? అజ్ఞానమనేది అన్ని ఆపదలకు నిలయంకదా! అజ్ఞానమే మూర్ఖ్యం- దానిచేతనే అన్ని

ఆపదలకు నిధి అయిన యీసృష్టి- అబ్బా! ఈసృష్టి మనోదేహాదుల వల్ల మూఢత్వంలోపడి బాధపడుతూకూడ అసన్మార్గమును అనుసరించి యున్న జీవునిచే ఇంకా ఉత్తరోత్తరా దుఃఖంకోరకు పెంచబడుతోంది- అసలే మనస్సు జడమూ, అంధమూ, దాని స్వాభావికమూర్ఖత్వం తోటే అది బాధపడుతోంది- పైపెచ్చు దాని దుఃఖాన్ని తెలిసియున్న జీవునిచేతకూడ బాధింపబడుట కష్టాత్కష్టతరము- అతి పేలవమయిన యీసృష్టి నీరు తనంతటతాను కల్పించుకున్న తరంగప్రవాహంతో తాను కలతచెందినట్లున్నది- అదే ఉదకము సుడిగుండముగా తిరుగు నపుడు ఒకానోక పేషణయంత్రమువలెనే మూర్ణమవును- అదే ఉదకము గాలి కదలునపుడుచంద్రకిరణస్పర్శచే వ్యామోహము చెంది పరవశమై ఊగుతోంది- (ఊగుచున్నట్లుంది. శత్రుదర్శనమయిన మాన వుడు కట్టివేసినట్లు నిలబడి యుండును. ఇవన్నీ భ్రాంతులు. ఈసృష్టి కూడా భ్రాంతియే, అవిచారసిద్ధము. విచారబాధ్యము. లేక ఈసృష్టి మృగతృషికా నీటితరంగప్రవాహాదులచేగూడనశింపచేయవీలగును. ఇంక శాస్త్రీయోపాయములచే నశింపచేయవీలగుననుటలో వింతఏమి? కనుక రామా! మూర్ఖలోకభూయిష్ఠమయిన యీసృష్టి స్వరూపరహితమై కల్పితమై అతినీచమైన మనస్సుచే వృథాగా హింసింపబడుతోంది. దీనిని వశపరచుకోలేని వాడికి అధ్యాత్మశాస్త్రంలో అధికారంలేదు. వానికి ఆత్మతత్త్వం ఉపదేశించినా లాభంలేదు. కారణం ఏమంటే అలాంటివారలబుద్ధి బాహ్యవిషయాలలోనే నిరూఢమై ఉంటుంది లోప లికిపోదు. అనగా, ఆత్మతత్త్వానికి అభిముఖంకాదు. కనుకనే సూక్ష్మా ర్థములను గ్రహించలేదు. విచారించనూలేదు. కనుక వార్లకు తత్త్వ ముపదేశించి లాభంలేదు. ఇలాంటివాళ్ళబుద్ధి మోసగాండ్రమాటలకు, మోసపోతుంది. ఒకానోకపుడు తనకుతానే భీతిచెందుతుంది. వీణాతంత్రి (దారము) అనగా లోహమయమయినదారము యొక్క ధ్వనికిగూడ బెదురుతుంది. నిద్రించినవాని ముఖం చూచి అదిరిపోతుంది. ఇది విషయ లవమునకు పరవశమయింది. వివేకములేనిది. నిజమును గుర్తె

రుగలేనిది. ఇలాంటి మనస్సునకు వృథాగా లొంగి పోతోంది లోకం. మాయలోపడిపోయింది.

## ౧౮. చిత్తనిరూపణము.

వసి॥ రామా! సంసారసాగరంలో నిస్సారములయిన విషయాల మీద సుఖాభిలాష అనే తరంగాలచే కొట్టుకుపోతూ ఉంటారు మాన వులు కొందరు! వారికి మనోనిగ్రహము, వివేకము, వైరాగ్యములందు కోరిక ఉండదు. ఆత్మజ్ఞానంగల విద్వాంసులు దొరకినా ఆత్మతత్త్వ మునుగూర్చి ప్రశ్నించరువారు. తమను కడ తేర్చమని కోరరు. (ప్రార్థిం చరు) కేవల మూకీభావము నవలంబింతురు. అలాంటి వారిని గూర్చి నేను ఆత్మలాభోపాయప్రచురములయిన యుక్తుల నుపదేశింప దలచ లేదు ఇందు. పుట్టంధునకుకాని, లేక కళ్లున్నను, దురదృష్టంచేతనో, ద్వేషంచేతనో, "నేను చూడను" అని నిత్యవ్రతమును పూనినవానికి గాని చిత్రవిచిత్రములయిన పూగుత్తులతో నిండియున్న ఉద్యానవన మును చూపిన లాభమేమి? కుష్ఠురోగంచేత ముక్కు-కోణములు చెడి పోయిన వానిని వివిధములయిన పరిమళములను పరీక్షించుమని ఎవడు కోరుతాడు? కళ్లులేనివానినికాని, పిచ్చివానినికాని, కల్లుత్రాగి మదిం చినవానినిగాని ధర్మనిర్ణయం చెప్పుమని సాక్షిగా నెవ్వడయిన కోరునా? శ్మశానములో నున్నవానిని సామాజిక కథలు చెప్పుమని యెవ్వడయినా అడుగుతాడా? పుట్టుమూర్ఖుని శాసించిన ప్రయోజనముండునా? హృద యమనే జలంలో ఉన్న మనస్సు అనే సర్పాన్ని కొట్టలేని మూఢుడికి తత్త్వోపదేశంచేసి లాభమేమి? వివేకవంతునిచేమాత్రం ఈమనస్సు జయింపబడుతుంది. స్వరూపంలేని మనస్సును జయించడం వివేకికి అసాధ్యంకాదు. అసద్రూపమయిన మనస్సునుకూడా జయించలేనివాడు విషం తినకుండాకూడ మూర్ఛిల్లి మరణించినవాడిక్రిందజమ- మనస్సు అసద్రూపమని (లేనిదని) నిరూపిస్తానుచూడు. విషయములను ప్రకా శింపచేయుటకు మనస్సు అక్కరలేదు. విషయములను సాక్షిచైతన్యమే

ప్రకాశింపచేస్తుంది. ఇంక స్పందము (చలనము) కొరకు మనస్సు అవసరమంటావా ? అదీకుదరదు. ఆ స్పందనమును (చలనమును) ప్రాణవాయువే కలుగచేస్తుంది. కనుక అందుకూ మనస్సు అక్కరలేదు. ఇక జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క పనులకొరకు మనస్సు అవసరమంటావా ? అదీ కుదరదు. ఆ పనులను ఆ ఇంద్రియాలే నెరవేరుస్తాయి. కనుక అందుకూ మనస్సు అక్కరలేదు. ఇంక మనస్సు అనేది యెక్కడ అవసరమో చెప్పు ? ఇంక వీటన్నిటియొక్క సముదాయ శక్త్యాత్మకము మనస్సు అని నీయభిప్రాయమైనచో అదీ పొసగదు. ఎందుకంటే సర్వశక్తియుక్తుడయిన పరమేశ్వరు డొకడు ప్రపంచమున కవసరము. అతడే జగత్సంఘాతాన్ని నడపేవాడు. ఈ ఇంద్రియసంఘాతం కూడా జగత్సంఘాతంలో చేరిందే. కాబట్టి యీ సంఘాతాన్ని నడిపేశక్తి కూడా ఆయనకే ఉంది. కనుక అందుకొరకు వేరే మనస్సు అక్కరలేదు. ఇక మనస్సు అనేది యేదో ? యెక్కడున్నదో చెప్పుమన్నాడు వసిష్ఠుడు.

శ్రీరా॥ మహర్షీ ! ఇంద్రియాలన్నిటికీ జీవుడే అధిష్ఠాత. అతడు మనస్సు అనే కళ్లెము లేనిదే ఇంద్రియములనే గుర్రాలను నడపలేడు. కాబట్టి మనస్సు అనేది అనివార్యంగా ఉండితీరాలి. అని అన్నాడు శ్రీరాముడు.

వసి॥ రామా ! నీవు జీవుడనీ చిత్తమనీ అంటున్నావే ? ఆ రెండూ ఆత్మకంటె వేరయిన చేతనపదార్థాలా? లేక అచేతనములా? మొదటిది కుదురదు. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా" ఇత్యాది శ్రుతి బ్రహ్మకంటె వేరు చేతనపదార్థము లేదని చెబుతోంది. ఇంక అచేతనమంటే అచేతనము చేతనుల కొరకను నియమం ఉండుటచే ఇవి రెండూ యింకొక చేతనుని కొరకు అయి యుండవలెగాని, వీటికి ఇంద్రియాలను నడిపేశక్తి లేదు. ఇంద్రియాలు జడములే. ఇవీ జడములే. ఇంక ఈ రెంటికీ తేడావేమి ? కాబట్టి యీ రెండూ (మనోజీవులు) లేవనే గ్రహించు. కనుక రామా ! స్వకపోల కల్పితమయిన మనస్సును నమ్మి పరమార్థదృష్టిని పాడుచేసికొన్న మానవులకు సంభవించే దుఃఖపరంపరను

చూస్తే నాకు చాలా జాలివేస్తోంది. వాళ్ళ దుఃఖాన్ని పోగొట్టడానికి కోటి సంవత్సరాలు వెదకినా ఉపాయం చిక్కేటట్లులేదు. కాక నిమిత్తంవల్ల వచ్చిన దుఃఖమయితే ఆనిమిత్తాన్ని నివారిస్తే అదిపోతుంది. కాని మూర్ఖులకే దుఃఖం నిర్నిమిత్తం. కాబట్టి ఇదిపోదు. దీన్ని తీసివేయడం సాధ్యంకాదు. అయినా మూర్ఖులకీదుఃఖం పోవడంలేదే అని పరితపింప పనిలేదు. గాడిదలవలె వీళ్లు దుఃఖంకొరకే పుట్టారు. దేహాత్మబుద్ధిగల యీజనులు పాపులై, నీటిలో బుడగలవలె వినాశంకొరకే పుట్టారు. నశిస్తున్నారు- ప్రతిరోజూ ప్రతిదేశంలోనూ, కటికవాళ్లు యెన్నిపశువులను చంపుతున్నారు ? వాటియెడ యెవరికి జాలి ? భూమి మీద పుట్టిన జంతువులలో దోమలను అనేకవేలను గాలి చంపుతోంది. ప్రతిదిక్కునా కొండలమీద అడవులలోనూ లక్షల మృగాలను చంపుతున్నారు పులిందులు. నీటిలో జలచరజంతువులను చిన్నవాటిని పెద్దవి తింటున్నాయి. కృశించియున్న వస్త్రయూకను (గుడ్డనుకొట్టెడి పురుగును) ఆకలిచే దోమలు (మక్షికలు) ఈగలు తింటున్నాయి. ఈ యీగలను షట్పుపురుగులు తింటున్నాయి. వీటిని అడవియీగలు తింటున్నాయి. అడవియీగలను కప్పలు తింటున్నాయి. కప్పలను పాములు తింటున్నాయి. పాములను గరుత్మంతుడు తింటున్నాడు. ముంగిసకూడ తింటోంది. ముంగిసను పిల్లితింటుంది. పిల్లిని కుక్కతింటుంది. కుక్కను భల్లూకం భక్షిస్తుంది. భల్లూకాన్ని పెద్దపులి భక్షిస్తుంది. పెద్దపులిని సింహంచంపుతుంది. సింహాన్ని శరభమృగం చంపుతోంది. ఆ శరభమృగము ఉరుముచున్న మేఘాన్నిచూచి సహించలేక యెగిరిపడి నశిస్తోంది. అలాంటి మేఘాలు గాలికి యెగిరిపోతున్నాయి. ఆ గాలులను కొండలు జయిస్తున్నాయి. కొండలను దేవేంద్రుని వజ్రాయుధము మదమణచి వేస్తోంది. ఆ వజ్రాయుధము దేవేంద్రునకు స్వాధీనమైపోయింది. ఆ యింద్రుడు విష్ణువుకు వశమై పోయాడు. ఆ విష్ణువు మత్స్యకూర్మవరాహాది జంతురూపాన్ని చెందాడు- ఆ జంతువులు కూడా యెంతపెద్దవయినా జరామరణములచే పాలింపబడిన సుఖదుఃఖా

వస్థను పొందుతూనే ఉన్నాయి. ప్రతిశరీరి మశకమత్కుణమక్షికాదులచే భక్షింపబడుతూనే ఉన్నారు. ప్రాణిసమూహానికి ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికదుఃఖాలు సహజమై పోయాయి. భూతజాతులన్నీ యెల్లప్పుడూ నశిస్తూనే ఉన్నాయి. మశక మత్కుణ మక్షికాదులు యెప్పుడూ పుటుతూనే ఉంటాయి. మత్స్య కీమి తిమింగలాదులు నీటిలో పుట్టుచున్నాయి. కీట వృశ్చికాదులు భూమిమీద పుట్టు చున్నాయి. అంతరిక్షంలో క్షుద్రమగు పక్షివిశేషములు పుట్టుచున్నవి. భూత వేతాళ పిశాచాదులుకూడ అక్కడే పుటుతున్నాయి. సింహ వ్యాఘ్ర మృగాదులు వనవీథులందు పుట్టుచున్నాయి. పత్ర పుష్ప ఫలాదులనుండి పుట్టు క్రిమి మశకాదులు (పురుగులు దోమలుమున్నగునవి) ప్రాణియొక్క అవయవములనుండి పుట్టుచున్నవి. కట్టెను తొట్టి వేయునట్టి కాష్ఠకలుములు స్థావరపదార్థముల నుండి పుట్టుచున్నాయి. రాతిలో కప్పలు మొదలగునవి పుట్టుచున్నాయి. పేడలో అనేకరకాల పురుగులు పుట్టుచున్నాయి. ఇలా అసంఖ్యాకములయిన జీవరాసులకు జన్మవినాశాలు జరుగుతూ ఉన్నాయి. ఇందులో దయాశీలురు సంతోషించనీ దుఃఖించనీ అనవరతము జన్మవినాశములుగల యీ సంసార చక్రంలో సంతోషమూ తగదు. దుఃఖమూ తగదు. భూతసమూహాలు మాత్రం చెట్లఆకులవలె మాటిమాటికి పుట్టుతూ రాలిపోతూనే ఉంటు న్నాయి. ఈ స్థితిలో దుబుద్ధులయొక్క (నీచులయొక్క దుఃఖాన్ని పోగొట్టాలని ప్రయత్నించే దయాశీలుడు తనచేతిలోని గొడుగుతో ఆకాశాన ఎక్కడా సూర్యకిరణాలు లేకుండా (ఎండలేకుండా) చెయ్యాలనుకొని శ్రమపడే మూఢునితో సమానుడు. పశు పక్ష్యాదులతో సమానమయిన మానవులకు తత్త్వోపదేశంచేసి లాభంలేదు. కొండ మీద అడవిలో తత్త్వకథలు చెపితే యెంతప్రయోజనమో అంతే ప్రయోజనం. విషయజాలంతో విస్తృతమయిన మనస్సుగల మానవులకూ, పశువులకూ, ఏమిటి తేడా? పశువులు త్రాటితో లాగబడతాయి. మూఢమానవులు మనసుచే లాగబడతారు. తన చిత్తమనే

బురదలో మునిగి తనచావుకు ఆచరించెడి కర్మలుగల మూర్ఖులకు సంభవించే ఆపదలనుజూచి అచేతనములయిన రాళ్లుకూడా దుఃఖిస్తున్నాయి. మనోనిగ్రహం లేనివార్లకు సర్వదా దుఃఖాన్ని ప్రసాదించే అవస్థలే పరిపూర్ణంగా లభిస్తూ ఉంటాయి- ఎప్పుడూ సుఖం ఉండదు- భూమి మీద పరాగంలేకుండా చేయటంఎంతకష్టమో వాళ్ళదుఃఖాలు పోగొట్టడం అంతకష్టం- కనుక బుద్ధిమంతుడు అందుకు ప్రయత్నించ కూడదు. చిత్తజయమును చేసికొన్న మానవుల దుఃఖాలు మాత్రం సులభంగా నిరస్యములగును. అందుకొరకు ప్రయత్నించుట వివేకులకు అవసరము. కాబట్టి రామా! మనస్సు అనేది లేదు. లేనిదానిని వృథాగా కల్పించుకోమాకు. కల్పించుకున్నావా దయ్యంలాగ పట్టుకుంటుంది అదినిన్ను. ఆత్మతత్త్వాన్ని మరచి ఉన్నంతవరకు మానవుడికి మనస్సు అనే సర్పం తయారవుతుంది- రామా! ఇప్పుడు నీకు తెలిసిందికదా? మనస్సు అనేది నీసంకల్పంవల్ల తయారవుతుందని ఇంకసంకల్పం మానుకో. అది ఎగిరి చక్కాపోతుంది. ఈదృశ్యప్రపంచాన్ని ఆశ్రయించి ఉన్నట్లయితే నీకు చిత్తమూ ఉంటుంది. బంధమూ ఉంటుంది- దృశ్యాన్ని విడిచిపెట్టావా! అదేచిత్తంతో ఉండి మోక్షాన్ని పొందుతావు- త్రిగుణాత్మకమయిన యీ ప్రపంచం మానవులకు బంధంకొరకే తయారై ఉంది, కనుక దీన్నివిడు మోక్షంకొరకు. ఇందులో నీకు ఏదియిష్టంగా ఉంటే అది ఆచరించుకో. ప్రపంచంలో "అహం" అనేది అంతరమయిన (లోపలి) దృశ్యము- ఇదమనేది బయటిదృశ్యం. ఈరెండూ లేవని ధ్యానంచేస్తూనే ఉండాలి పర్వతంలాగ స్థిరంగా. రామా! "నేను" "ఇది" అనే ద్వైతాన్ని పూర్తిగా మరవాలోయి- ఆరెండూ విడిస్తే ప్రపంచంలో మరొకటి యేమీలేదుగా అని అనుకోవద్దు. ఆ రెంటిలో అనుస్యూతమై ఉండే సాక్షిస్వభావుడయిన ఆత్మఉన్నాడు, అతణ్ణి భావించు- చాక్షుషత్రిపుటిలో దర్శనంమొలా ఆత్మస్వరూపంగా ప్రధానమో రాసనప్రత్యక్షంలో స్వాద్య స్వాదకముల కంటె స్వాదనంకూడ

అలాగే ప్రధానం. దాన్నే ధ్యానించాలి. రామా! అవస్థాత్రయమునకు సాక్షీభూతుడయిన వానిని భావిస్తూ ఆత్మసంస్థుడవై ఉండు–

రామా! ఆత్మసత్తను విడిచి చైత్యమును (విషయమును) భావిస్తూ ఉంటే, నిఖిలదుఃఖాలుయిచ్చే చిత్తం నీకు నిముషంలో తయారవుతుంది. రామా! చిత్తమనే గొలుసును స్వరూపజ్ఞానమనే యుక్తితో నరకి హృదయమనే బిలంలోఉన్న ఆత్మఅనే సింహాన్ని విడిపించు–

రామా! పూర్వానుభవజన్యమయిన దృశ్యసంస్కారం ఉద్బుద్ధమయ్యేసరికి చిత్తే (చైతన్యమే) కొంచెం స్థౌల్యాన్ని చెందినదానివలె ఆత్మకంటె వ్యతిరిక్తమగుచూ చిత్తంలాగ తయారవుతుంది. అదే మాటిమాటికి మననంచేసేసరికి దృఢమై సంకల్పమునకు సమర్థమై మనస్సు అవుతుంది. ఇదే దుఃఖ– ఈమనస్సు ఆత్మకంటె వేరుగ లేదనే జ్ఞానంకలిగేసరికి నశిస్తుంది. ప్రపంచం అంతా ఆత్మస్వరూపమే అనే జ్ఞానంకలిగితే చేతితుడు– (అనగా ఉపహితచైతన్యము) ఎక్కడ? చిత్తమెక్కడ! చైత్యమెక్కడ? చేతనమెక్కడ(వృత్తి)ఈనాల్గింటిలో ఏదీఉండదు."నేను ఆత్మను" "నేను జీవుడను"అనే భావనయే చిత్తం–దీనివల్లనే యీ దుఃఖాలన్నీ సంభవిస్తున్నాయి– "ఆత్మబ్రహ్మయే" "బ్రహ్మేతరులయిన జీవులు పరమార్థ సత్యరూపులుకారు" అనేభావన ఉంటె చిత్తము ఉపశమిస్తుంది. పరమసుఖం లభిస్తుంది. కాబట్టి మనోనాశానికి సత్యావబోధయే కారణం. చీకటి పోవడానికి సూర్యుని ప్రకాశయే తగినమందు– మనస్సు అనే సర్పం శరీరంలో ఉన్నంతవరకే యీసంసారభీతి– అది పోయిందంటే ఇంక సంసారంలో భీతికి అవసరమేది? కాబట్టి భ్రాంతిమాత్రంచేత పుట్టిన చిత్తమనే వేతాళుని సమ్యగ్జ్ఞానమనే మంత్రంచేత పోగొట్టు. దేహమనే గేహంలోనుంచి చిత్తమనే యక్షుని తొలగించుకొని రామా! నిశ్చింతగా ఉండు. ఇంతకంటె మోక్షోపాయం మరొకటిలేదు.

## ౧౫. తృష్ణావర్ణనము.

వసి॥ రామా! చిత్తనాశమువలన పరమపురుషార్థప్రాప్తిని చెప్పాను- ఇపుడు చిత్తమును అనుసరించినదిస్తే తృష్ణపెరిగి కలిగే అనర్థపరంపరను చెబుతానువిను- జీవుడు చిత్తముయొక్క- సామర్థ్యమును అనుసరించి, తన బ్రహ్మాత్మ భావమును విడిచి, మలినమయిన దేహేంద్రియాదులందు ఆత్మభావమును పొందును- చిత్తముచే సంపాదించబడిన విషయజాతమునందు రాగద్వేషవాసనా మలమునుగూడ పొందును. ఈ రెంటివలనను విషలతారూపమయిన తృష్ణపెరిగి వీనికి సంసారమందు సుఖలేశముకూడ నుండదు. వ్యామోహమే యెప్పటికిని పెరుగుచుండును. వర్షాకాలపు రాత్రియందలి చీకటివలె అంతులేని వికారాలనుగూడ కలిగిస్తూ ఉంటుంది అది- ప్రళయకాలమందలి అగ్నిమంటలను సహించారు- హరిహరాదులు తృష్ణావల శిఖాదాహమును మాత్రం సహింపలేరు యెంతటి ధీరులుగూడ- తీక్ష్ణమయిన నల్లని పొడవాటి కత్తి తన శరీరాన్ని తెగకోస్తుంది. తృష్ణ అనే కత్తిమాత్రం చల్లగా ఉంటూనే దుఃఖోదర్కంగా (ఉత్తరకాలమందు దుఃఖాన్నియిస్తూ) ఉంటుంది- తృష్ణఅనే విషలతయొక్క- పండ్లలో ఒక్కటికూడా సుఖమిచ్చేదిలేదు- తృష్ణఅనేది, అడవి ఆడకుక్క- ఇది కనిపించకుండా మానవుల మాంసాస్థిరక్తాదులను భక్షిస్తూ ఉంటుంది- ఎప్పుడూ మనస్సుఅనే బిలంలో దాగి ఉంటుంది- ఇది వర్షాకాలంలో పొంగిన నదివలె ఒకక్షణంలో ఉల్లాసంగా (వృద్ధిగా) ఉంటుంది- ఇంకొక క్షణంలో శూన్యంగా తయారవుతుంది- చల్లగా ఉంటుంది- దానివలె మురికిగా కూడా ఉంటుంది- నది రాళ్లూ ముళ్లూ గల అడవిప్రదేశానికి తీసికొనిపోయి ఖండిస్తుంది- ఇది (తృష్ణ) కూడ సంసారారణ్యంలో మధ్యకు తీసికొనిపోయి చీల్చి పారవేస్తుంది మానవుని- తృష్ణావిష్టుడయిన జనుడు దైన్యాన్ని పొందుతాడు- మతిచెడగొట్టు కుంటాడు- తేజస్సు నాశమవుతుంది. అతినైచ్యాన్ని పొందుతాడు. మోహం

పెరుగుతుంది- సంసారం యీదలేక వగుస్తాడు- తుదకు బావిలో నది లోనో పడతాడు.

తృష్ణాక్షయమైన వానికి ఏవిధమయిన దుఃఖము ఉండదు- ప్రాణాలు స్వస్థంగా (సుఖంగా) ఉంటాయి- పుణ్యము అభివృద్ధి చెందు తుంది- పుణ్యసంపదలలో తులతూగుచు ఉంటాడు మానవుడు- తృష్ణాం ధులయిన నరులకు మతిలో అనేక విక్షేపాలు సుడిగుండాలవలె బయలు దేరుతూ ఉంటాయి- తృష్ణగిల మానవులు దారంకట్టి ఆడించే పక్షివలె తిరుగుతూ ఉంటారు సంసారంలో- మొదట డబ్బు సంపాదించడానికి తిరుగుతూ ఉంటారు- తరువాత రక్షించలేక బాధపడుతూ ఉంటారు- పిదప ఖర్చు అన్యోన్యసరికి ఏడుస్తూ ఉంటారు- ఏదయినా కారణంచేత నశించిందా సంపాదించింది మరణిస్తారు- లేక సంపాదించింది అంతా ఉన్నదా యితరులయినా వీనిని చంపుతారు ధనంకోరకు- తృష్ణ అనేది గంద్రగొడ్డలి వంటిది- దయా వివేకాది గుణములచే వ్రేళ్ళను నరకిపార వేస్తుంది- పాడుబావిలో మొలచిన పచ్చగడ్డికి ఆశపడి లేడిపిల్ల బావిలో పడ్డట్టు తృష్ణకు (ఆశకు) లోంగిన మానవుడు నరకకూపంలో పడతాడు. హృదయంలో ఉన్న తృష్ణ పిశాచము మానవుని అంధునిగా జేసినంతగా ముదిరిన ముసలితనముకూడ కంటిని అంతగా గ్రుడ్డి చేయలేదు. హృద యమును గూడుగా చేసికొన్న తృష్ణఅనే అమంగళకరమయిన గుడ్లగూబ చేతనే భగవంతుడయిన విష్ణుమూర్తికూడ వామనావతారమెత్తి బలి చక్రవర్తిని యాచరించాడు- తృష్ణఅనే త్రాటిచే కట్టబడి మానవుడు అనవరతము ఆకాశమున సూర్యునివలె సంసారంలో తిరుగుతూ ఉం టాడు- కనుక సర్వదుఃఖమయమయిన యీతృష్ణను అందరూ తొల గించుకోవాలి- తృష్ణచే వాయువులు వీచుచున్నాయి- తృష్ణచే కొం డలు నిలచిఉన్నాయి- తృష్ణచే ధరాదేవి మోయుచున్నది- ముల్లో కములు తృష్ణచేతనే ధరింపబడి యున్నవి- జరిగే లోకయాత్ర యావత్తు తృష్ణఅనే చర్మమయమయిన త్రాటితో కట్టబడియే జరుగుతోంది- ఎవరయినా రజ్జుబంధాన్ని వదల్చుకోగలరుగాని తృష్ణాబంధాన్నిమాత్రం

వదల్చుకోలేరు. కాబట్టి రామా! తృష్ణను విడు- సంకల్పం మాను తుంటె తృష్ణ చస్తుంది- సంకల్పం లేకపోతే మనస్సులేదు- మనస్సు లేకుంటే యింక తృష్ణకు ప్రసక్తియేది? ఇదే దీనిని వదల్చుకొనుటకు తగినయుక్తి- కాబట్టి ముందుగా నీవు ఈదేహమే నేనను దురాశను (దురభిమానమును) విడు- అనాత్మయందు ఆత్మభావన అనే దురాశను విడిస్తే నీవు జ్ఞానులలోకి లెక్కకు వస్తావు- రామా! అహంభావమయు మయిన దురాశను అనహంభావమనే కత్తెరతో ఛేదించి బ్రహ్మ భావంలో ఉండు- అన్నారు వసిష్ఠులు-

## ౧౬. తృష్ణాచికిత్స.

విన్నాడు శ్రీరాముడు తృష్ణావర్ణనం చివరవరకు సందేహం కలిగింది వసిష్ఠుడు చెప్పిన దానిలో- ఇలా అడిగాడు-

శ్రీరా॥ స్వామీ! మీమాట స్వభావగంభీరంగా ఉన్నది- అహంకారాత్మకమయిన తృష్ణను విడువమన్నారు మీరు- ఇదిచాలా అసంభవంగా తోస్తోందినాకు- అహంకారమే ప్రాణా ప్రాణమే అహం కారం. ఈరెంటికీ భేదం లేదన్నారు మీరు లోగడ నాతో- ఈస్థితి లో నేను అహంకారాన్ని విడిస్తే ప్రాణంవిడిచినట్లే. ప్రాణం విడిస్తే శరీరం పూర్తిగా పడిపోయిన దన్నమాటయే. చెట్టు స్కంధంమీద (మొదలుమీద) ఆధారపడినట్లు దేహం అహంకారంమీదనే ఆధార పడిఉంది- అహంకారం నశిస్తే దేహం పూర్తిగా నశిస్తుంది. రంపంతో మొదట (లేకవేరు) కోసివేస్తే చెట్టుపడి పోతుంది- కాబట్టి దేహాధార ణకు ఆధారమయిన అహంకారాన్ని నేను ఎలావిడిచేది- విడిచి నేను ఎలా జీవించేది- ఈవిషయం నిర్ణయించి చెప్పండి మీరు అనిఅన్నారు-

వసి॥ రామా! వాసనాత్యాగము రెండువిధములు 1) జ్ఞేయము (జ్ఞానబాధితము) ఇది విద్వాంసులకు సమాధికాలమందును విదేహ

కైవల్యమునందును ఉండును- రెండవది ధ్యేయము- ఈయది వ్యుత్థాన కాలమందు జీవన్ముక్తులయెడ నుండునది- ఇది ధ్యేయమువంటిది కావున ధ్యేయమనబడుచున్నది-

అహంప్రత్యయమనునది రెండువిధములు- "దేహేంద్రియాది సంఘాతాపేక్షము- అఖండ చిదేకరస స్వభావము" అని ఇందు మొదటి దాని స్వరూపము యిట్లుండును-

"నేను ఈదేహేంద్రియాదుల యొక్కయు, ఉపభుక్తములయిన అన్నపానాది పదార్థముల యొక్కయు సంఘాతరూపుడను. ఈ దేహేంద్రియాదులు అన్నపానాదులును నాయొక్క జీవితం (అనగా నాస్వరూప సిద్ధికి నిమిత్తములు) వీటిని విడచి నేనేమియు చేయజాలను. నన్ను విడిచి యివియు నుండజాలవు" అని మొదటి అహంపదార్థముయొక్క నిర్ణయమును చేసికొని తరువాత నేను ఈదేహేంద్రియ మనఃపదార్థ స్వరూపడను కాను, ఆ పదార్థములు నావికావు- (వాటితో నాకు సంబంధములేదు) అని వీటిని మనస్సుతోసహా అన్నిటిని అసద్రూపములుగా నిర్ణయించి పిదప రెండవరకమయిన అహంపదార్థమును (పరిశిష్ట చిద్రూపాత్మకమగు అహంపదార్థమును) నాకీ పదార్థములతో సంబంధము లేదనే నిష్కృష్టబోధతో చేసెడి భావనయే ధ్యేయమగు వాసనాత్యాగమని నాచే జెప్పబడినది ఈయది రెండవది.

ఇంక మొదటి దానిని జెప్పెద వినుము- ప్రపంచమంతయు బ్రహ్మస్వరూపముగా సాక్షాత్కారమొనర్చుకొని అభ్యాసక్రమంచేత వాసనాక్షయం చేసికొని అహంకార మమకారములను విడిచి, నిర్వికల్పక సమాధిస్థుడై ప్రారబ్ధక్షయంచేత దేహమును పూర్తిగావిడచుట జ్ఞేయమగు వాసనాక్షయము- లోకసంగ్రహోచితమయిన వ్యవహారము చేయుచుండువాడు ధ్యేయ వాసనా త్యాగము కలవాడు- ఇతడు జీవన్ముక్తుడు- మూలజ్ఞానముతో సహా కల్పనను విడిచి ప్రశాంతుడయిన ముక్తుడు జ్ఞేయవాసనాత్యాగము కలవాడు- ఈతడు విదేహముక్తుడు.

ధ్యేయవాసనాత్యాగమును చేసికొని లీలామాత్రంచేత వ్యవహరించిన జనకాదులు జీవన్ముక్తులు. జ్ఞేయ వాసనాత్యాగం చేసికొని ప్రశాంతు లగు వారు విదేహముక్తులు. వీరు ఎల్లప్పుడు పరావరబ్రహ్మయందే యుందురు. రామా! మోక్షమొందుటకు ఈ రెండుత్యాగములు సమానములు. వీరిద్దరు బ్రహ్మత్వము నొందువారే. ఇద్దరూ విగతజ్వరులే- కాని వీరిద్దరిలో ఒకడు వ్యుత్థితుడు. మరొకడు సమాహితుడు. ఒకడు సదేహుడై నిర్ముక్తుడగుచు సంసారబాధలు లేకుండా ఉంటాడు. మరొకడు విదేహుడై, విముక్తుడై జ్ఞేయ వాసనారహితుడవుతాడు- (అనగా జ్ఞేయవాసనా త్యాగము కలవాడవుతాడు.) ఆ యా కాలంలో సుఖదుఃఖాలు యెంతగా వచ్చిపడినా సంతోషించకుండాను, దుఃఖించకుండాను ఉండేవాడే ముక్తుడని అంటారు పెద్దలు- ఇష్టమయిన వస్తువులు కావాలి అనికాని, అనిష్టవస్తువులు అక్కర లేదనికాని, రాగ ద్వేషాలు లేనివాడే ముక్తుడు. ప్రియాప్రియములందు సుషుప్తునివలె (నిద్రించువానివలె) ఆసక్తి లేనివాడే ముక్తుడు- ఎవనికి అంతఃకరణలో "ఇది హేయము, ఇది త్యాజ్యము" అను భావముండదో ఎవనికి దేహమునందు అహంభావమున్ను, దేహసంబంధము కలవాటియందు మమ (నావి) అను భావమున్ను ఉండదో వాడు జీవన్ముక్తుడు. ఎవని మదిలో హర్ష అమర్ష భయ క్రోధ కామ కార్పణ్య బుద్ధులుండవో వాడు జీవన్ముక్తుడంటారు- సుషుప్తిలో యేపదార్థమునందునూ కోరిక లేనట్లు జాగ్రదవస్థలోకూడ దేనియందు కోరిక లేనివాడును, సదా సంతుష్టాంతరంగుడును అగువాడు జీవన్ముక్తుడంటారు- అన్నారు వసిష్ఠులు-

ఇలా వసిష్ఠులు ఉపదేశించుచుండగా ప్రొద్దుక్రుంకినది. సాయంకాల కృత్యమును అనుష్ఠించుటకు సభవారు లేచారు- తెల్లవారగానే సభ్యులందరూ మరల సభను అలంకరించారు.

ఇట్లు పదునొకండవరోజు ప్రసంగము ముగిసింది.

## ౧౭. తృష్ణావిచ్ఛేదోపదేశము.

వసిష్ఠుడు ఈనాడు ఉదయాన శ్రీరాముని ఆకారం కనిపెట్టాడు. విదేహముక్తుల లక్షణం తెలిసికోవాలని ఉన్నట్లు గ్రహించాడు. ఇలా అన్నాడు.

వసి॥ రామా! విదేహముక్తులు మాటలకందరు. వారి లక్షణాలు మనకు గోచరించవు. జీవన్ముక్తుని లక్షణాలలో ముఖ్యమయిన వానిని చెబుతావిను.

జీవన్ముక్తులుకూడా ఆ యా వర్ణాశ్రమోచితకర్మలను చేస్తూ ఉంటారు– కాని వాళ్ళకు ఫలానుభవేచ్ఛ ఉండదు– విషయవాంఛ లేకపోవటమే జీవన్ముక్తిలక్షణం. బాహ్యార్థమునందు బద్ధోత్సాహంతో తృష్ణగలిగి ఉండుటయే సంసారబంధమని అంటారు పెద్దలు. భోగ్యవస్తువులు అనృతములను నిశ్చయంతో భోగసంకల్పాలను విడిచి బాహ్యార్థములందు లోకసంగ్రహం మాత్రముకొరకు విహరించే తృష్ణ జీవన్ముక్తుల శరీరాన్ని మాత్రమే ఆశ్రయించి ఉంటుంది. బాహ్యావస్తువు లందలి వ్యసనంతో బలిసిన తృష్ణాబంధప్రాపకము. సర్వవస్తువు లందును వ్యసనంవిడిచియున్న తృష్ణ ముక్తిప్రాపకము. విషయప్రాప్తికి పూర్వమూ, విషయనాశానంతరమూ ఉండే రాగరాహిత్యము (అనురాగము లేకుండుట) విషయములు ఉన్నకాలంలోకూడ ఉండేయెడల అదే జీవన్ముక్తి అంటారు. "ఇది నాకు కావాలి" "అదినాకు కావాలి" అను భావనయే తృష్ణ. అదే సంసారబంధము. దానిని పూర్తిగా వదలుకోవలెను. అప్పుడే జీవన్ముక్తిస్థానము లభిస్తుంది. రామా! దేహాదులమీద ఆశవిడవాలి. దేహేంద్రియాదులు నశించాలి అనే ఆశకూడా పోవాలి. సుఖదుఃఖావస్థలను విడవాలి. కార్యాకార్యము లందు ఆశనుకూడ విడవాలి. అపుడు ప్రశాంతమయిన సముద్రంవలె స్థిరంగా ఉండాలి. వీటిఅన్నిటియందు మిథ్యాత్వనిశ్చయమే ఆశాత్యాగము.

రామా! జరామరణములులేని ఆత్మను బంధించిఉంచి నీకికి జరామరణాలు సంభవించుచనను సందేహంతో నీమనస్సును వృథాగా కలుషపరచుకోనకు.

రామా! దృశ్యమగు పదార్థము నీకులేదు. నీవును లేవు. పరమార్థసత్యమగు ఆత్మవస్తువుకంటె ఈదృశ్యము భిన్నమయినది. తుచ్ఛము. రామా! దృశ్యమగు ప్రపంచం లేనిదే పుట్టిఉంటే లేనిదే ఉన్నట్లు కనపడుతూఉంటే నీవు దాన్ని అతిక్రమించిఉంటే ఇంక నీకు దానిమీాద కోరిక పుట్టడంఎలా? ఇదీకాక విచారశీలుడగు పురుషునకు నాలురకాల నిశ్చయం కలుగుతుంది. మతిలో చెబుతావినుదాన్ని.

(1) నేను ఆపాదమస్తకం తలితండ్రులచే తయారుచేయబడిన వాడను అనేది- ఇది బంధంకొరకు కారణం అవుతుంది.

(2) దేహేంద్రియాదు లన్నిటికంటె భిన్నమై వాలాగ్రముకంటె (తోక తుదివెంట్రుకకంటె) సూక్ష్మమయిన శరీరము నేను అనునది రెండవ నిశ్చయము- ఇది త్వంపదార్థ శోధనారూపంతో మోక్ష హేతువు అవుతుంది.

(3) సకల ప్రపంచ స్వరూపుడనయిన నేను అక్షయుడను (నాశ రహితుడను) అనునది మూడవ నిశ్చయము. ఇదికూడా ఆత్మయందలి పరిచ్ఛేదభ్రాంతిని తీసివేసికొని తత్పదార్థశోధనకు ఉపయోగపడుటచే మోక్షహేతువు అగుచున్నది.

(4) నేనుకాని యీ ప్రపంచముకాని యిదంతా శూన్యం. ఆకాశంతో సమానం. అనేది నాల్గవ నిశ్చయము- ఇది నేరుగా మోక్షసిద్ధికి హేతువు.

ఈ నాల్గింటిలో మొదటి నిశ్చయము బంధహేతువు. మిగిలిన మూడును శుద్ధభావనతో పుట్టినందున మోక్షహేతువులు. ఇందులో మొదటి నిశ్చయము బంధయోగ్యమయిన తృష్ణకలది- మిగిలిన మూడు

నిశ్చయములను నిర్దోషమయిన తృష్ణలు గలవి. ఇవి జీవన్ముక్తులందు విలసించుచుండును. ఇందులో మూడవనిశ్చయం. (సర్వ ప్రపంచము నేనే అనునిశ్చయం) కలవాడు సంసార దుఃఖాన్ని పొందడని నాయభిప్రాయం. సర్వవ్యాపకమయిన ఆత్మయే తాను నిశ్చయం గలవాడు బద్ధుడుగాడు. శూన్యవాదులుకూడా పరిశిష్టమయిన ఆత్మనే శూన్యాది శబ్దములతో చెబుతున్నారు కాని వస్తువుయొక్క రాహిత్యమును చెప్పుట లేదు. ప్రపంచం అంతా సద్రూపపరమాత్మయే. ఇందులో ద్వైతాద్వైత్వములు (రెండు అనే భేదము లేవు- భ్రాంతిదృష్టిలో ప్రపంచం వేరు. పరమార్థదృష్టిలో బ్రహ్మవ్యాప్తము. సముద్రము పాతాళపర్యంతము నీటితో వ్యాప్తమై ఉన్నది. బ్రహ్మాది స్తంబపర్యంతము ప్రపంచం ఆత్మతో వ్యాప్తమైఉంది. కనుక ప్రమాణబోధితమయిన బ్రహ్మైక్యమే నిత్యము. సత్యము. తద్భిన్నముగ ప్రపంచమనేది లేదు. వట్టి మిథ్య అది- సముద్రం అంతా నీరే అందులో తరంగబుద్బుదాలు మిథ్య- కటక కేయూర నూపురాదులు బంగారముకంటె వేరుకాదు. తరుతృణాదులన్ని పృథివ్యాత్మకంటె వేరుకావు. అద్వైతమయిన బ్రహ్మసత్తయే అజ్ఞానులనుగూర్చి ద్వైతాద్వైతభేదములతో ప్రకాశిస్తోంది. కాబట్టి రామా! ఆత్మీయులుకాని, పరకీయులుకాని, పుత్ర మిత్రాదులు వృద్ధిలోనున్నా నశించినా, సుఖదుఃఖములనుగ్రహించకు. భావంలో అద్వైతాన్ని ఆశ్రయించు. ఉనికిలో అద్వైతంగా ఉండు. కర్మాచరణలో మాత్రం అద్వైతాన్ని ఆశ్రయించకు. దీనియందు అనాదరం ఉంచి మెలగుము. ఇలా ద్వైతాద్వైతమయుడవై ఉండు. భయంకరములయిన సంసారభూములలో పడిపోతారు ద్వైతభావన గలవారు- కాబట్టి భావంలో ద్వైతాశ్రయణం పనికిరాదు.

రామా! ద్వైతము పరమార్థసత్యముకాదు. అది మనఃకల్పితము. ఇట్లే ఆత్మయందు ఐక్యం. (ఏకత్వసంఖ్య అనే గుణముకూడ) సంభవించదు- అదీ కల్పితమే. కనుక అదిఉన్నను ఆత్మను ద్వైతమే

సంభవించును. కాబట్టి అద్వైతమనగా ఐక్యముకూడలేని సన్మాత్ర బ్రహ్మమని గ్రహించు.

లోకంలో నేను అనే పదార్థములేదు. యుష్మచ్ఛబ్దార్థమయిన ప్రపంచమును లేదు. ఇది యంతయు నిర్వికారమగు విజ్ఞానమాత్రమే. తత్సాక్షాత్కారమాత్రంచేత శాంతించే యీప్రపంచం ఎప్పుడూ సత్తు కాదు- అసత్తునుకాదు- ఇదినిజం. ఈ ఆత్మతత్త్వము అమృతము. అనాద్యము. సర్వావభాసకము జన్మజరాదివికారరహితము. అనింద్రియము. ప్రాణనవ్యవహారమునకు నిమిత్తము. (అనగా బ్రతికియుండుటకు నిమిత్తము) సకలకల్పనా విహీనము. కారణములకుగూడ కారణము. చిత్ప్రకాశాత్మకము. చక్షురాదులకు మూలభూతము. స్వాత్మభావముచే ఉపదేశింప తగినది. "ఇట్టి సర్వవ్యాపకబ్రహ్మమే నేను" అను నిశ్చయము నీమదిలో కలుగుగాక.

## ౧౮. జీవన్ముక్త వర్ణనము.

రామా! కామక్రోధాది కుదృష్టులులేని సమాహితచిత్తులు జీవన్ముక్తులు. వీరు సంసారంలో లీలగా సంచరిస్తూ ఉంటారు. వీరికి జన్మజరాది దుఃఖములుండవు. మధ్యలో అధ్యాత్మిక దుఃఖములుండవు. అంత్యకాలమున మృత్యునరకాది దుఃఖములుకూడా ఉండవు. ప్రపంచ పరిస్థితులను చూచి పరిహసిస్తూ ఉంటారు. తుచ్ఛమనుకుంటారు-అయినా కాలములందు ప్రసక్తములయిన ఉచితకార్యములను ఆచరించెదరు. శత్రుమిత్రాది దృష్టులందు మధ్యస్థులు. ధ్యేయ వాసనా త్యాగం అవలంబించి ఉంటారు- ఎందునూ ఉద్వేగము (      ) లేదువారికి. ఎవరికిని అపకారమాచరించరు- వివేకమే వారిచూపు- ప్రబోధమే వారికి ఉపవనము. (విహారస్థానము) వీరిపదవి అందరకు అతీతము- వీరి ఆశయము పూర్ణేందుశిశిరము- సంసారభీతి ఉండదువీరికి- నిత్యతుష్టులు. శత్రువులందు ఉదాసీనులు- దయాదాక్షిణ్యాది గుణములు గలవారు-

గురువులకు పెద్దలకు సమయోచిత మయిన సేవచేతురు- వారిని పరిపాలింతురు- సంసారమందు వీరు వినాశము నొందరు- ప్రేమించరు- ద్వేషించరు- దుఃఖించరు- కాంక్షించరు- మితభాషులు-ఆవశ్యకకార్యములందు అనలసులు- అడిగినదానికి బదులు చెబుదురు- అడగనపుడు స్థాణువువలె నుందురు- ఇచ్ఛాద్వేషములుండవు- ఇట్టివారు సంసార బాధ నొందరు. అందరకు ప్రియమును చెప్పువారు, ఆక్షేపించినా చతురముగా (నేర్పుగా) సమాధానము చెప్పుదురు- భూతముల ఆశయమును గుర్తించి ప్రవర్తింతురు- ఇట్టివారికి సాంసారికబాధ యుండదు- యుక్తాయుక్త దృష్టితో లోకవృత్తాన్తాన్ని అరచేతిలోని మారేడుపండువలె గ్రహింతురు- లోకముయొక్క క్షణభంగురస్థితిని గుర్తింతురు- ఉత్తమ స్థానమును అధిష్ఠింతురు- మానవులయొక్క వైషమ్యదృష్టికి ఫలంకని పెట్టి నవ్వుతూ తటస్థంగా ఉంటారు- జితేంద్రియులు, మహానుభావులు పరాపరుడగు పరమాత్మను సాక్షాత్కరించు కుంటారు. ఇదీ జీవన్ముక్తుల స్వభావము- నీకు విపులంగా చెప్పాను.

కాని మూర్ఖులగు బద్ధులయొక్క పరిస్థితిని (స్వభావాన్ని) నేను వర్ణింపజాలను- ఆ మూర్ఖులకు వివేకబుద్ధిలేని స్త్రీలు అభిమతులు, ఇష్టులు. వారు (ఆస్త్రీలు) నరకలోకాలనే అగ్నులయొక్క మంటల వలె ప్రకాశిస్తూ ఉంటారు- ఆర్జన పాలన వ్యయములందు అనేకానర్థములతో గూడిన అర్థములు ధనములు వారి కభిమతములు. వాటివల్ల అనేక ఆపదలను అనుభవిస్తూ ఉంటారు- ఇలాంటి ధనములను వెచ్చించి వీరు ఫలాభిసంధితో గూడిన యజ్ఞాదికర్మలను చేస్తూ ఉంటారు. ఇంతే కాని ఫలాపేక్షలేని కర్మలను జేయరు- అందును దంభమాన మద మాత్సర్యము మున్నగు దురాచారాలు మెండు- పునర్జన్మ పునర్మరణాది సుఖదుఃఖములు అధికము- ఇట్టి మూర్ఖులు యెన్నటికిని తరించ లేరు- తరించటానికి కారణం ఏమాత్రం లేదువీరికి. వీరిస్థితి మేము చెప్పలేము.

కనుక రామా! నీవు మాత్రము ధ్యేయవాసనాత్యాగముతో విలసించెడి (ప్రకాశించెడి) పూర్ణదృష్టిని అవలంబించి జీవన్ముక్తుడుగా విహరించు- రాఘవా! మనస్సులో సర్వ ఆశలను విడు- రాగమును వదలు- వాసనలను చంపుకో- బాహ్యమున మాత్రం అన్నీ చేస్తూ ఉండు- కర్మాచరణమును అనుసరిస్తూ ఉండు. లేకుంటే నిన్ను ఆధారంగా చేసికొని అజ్ఞానులు కూడా కర్మలను మానుకుంటారు. లోపల మాత్రం సంసారస్థితులను పరిత్యజించు. సంసారదశలను పరిశీలించు- తుచ్ఛముకాని పరమపదమును గుర్తించు. దానినే చిత్తంలో భావిస్తూ విహరించు. లోపలనిరాశ- బయటికిఆశ- బయటికితాపము- లోపల శీతము కనుపరచాలి- బయటికి అన్నిపనులు ఆరంభించినట్లు లోపల అన్నిపనులు విడచినట్లు ఉండాలి. బయటికి కర్తగాను, లోపలి అకర్తగాను ఉండాలి. వ్యావహారికముగాను, పారమార్థికముగాను లోకంలోని వస్తువులయొక్క- సారాసారతారతమ్యాన్ని తెలిసికొన్నావు. కనుక ఆ దృష్టితో నీయిచ్ఛవచ్చినట్లు ఉండు. ఉల్లాస హర్షాలు కృత్రిమంగా ఉండాలి- ఉద్వేగ గర్హములు కూడా కృత్రిమంగా ఉండాలి- ఆరంభ సంరంభాలూ కృత్రిమంగా ఉండాలి- ఇలా లోకంలో విహరించాలి- అహంకారాన్ని విడచి నిశ్చయబుద్ధితోనుండి కళంకరహితుడవై విహరించాలి- ఆశాపాశములను త్రెంచుకొని సర్వసముడవై బహిః ప్రాకృతి కార్యముల నాచరించుచూ విహరించాలి- ప్రాణికి పరమార్థంగా బంధం లేదు- మోక్షంలేదు- ఈ సంసార పరివర్తనమంతా మిథ్య. ఇంద్రజాల విలాసము- ఎండమావులందు నీటిభ్రాంతివలె ఇది (సంసారము) అవివేకముచే నయిన భ్రాంతి- బంధరహితుడు, అద్వితీయుగు, సర్వవ్యాపకుడు, అగు ఆత్మకు బంధం ఎక్కడిది? అది లేకపోతే మోక్షమెక్కడిది? ఈ సంసారభ్రాంతి తత్త్వజ్ఞానం లేనందున కలుగుతోంది. తత్త్వజ్ఞానంవల్ల నశిస్తోంది. త్రాటిమీద పాము అనే భ్రాంతి వంటిది-

రామా! సూక్ష్మబుద్ధి గలవాడవునీవు. తత్త్వం తెలిసికొన్నావు- నిరహంకారుడ వయినావు- ఆకాశమువలె నిర్మలంగా ఉండు- రామా.

నీవు సాక్షీరూపుడవు- సుహృద్బాంధవులయందు మమతావాసనలను విడిచిపెట్టు- అవిద్యమాన స్వరూపులగు (స్వరూపములేని) సుహృదాగులయొక్క చింతన నీకేల? నేను చెప్పినట్లు వాసనాత్యాగము చేయగా నీవు ఆవాసనలకంటె వేరయినా సాక్షివనీ పరమార్థస్వరూపుడవని పరిశేషన్యాయంచేత ఊహింపబడుచున్నావు- లేక స్వరూపరహితములయిన పదార్థములకంటె పరమార్థస్వరూపుడవయిన నీవు విలక్షణుడవు. అసత్స్వభావములయిన అవిద్యా తత్కార్యములకంటె నీవు బలవంతుడవని ఊహింపబడుచున్నావు- కనుక అవిద్యాలక్షణ కారణముకంటె కూడ అనాదికాలప్రవృత్తమయిన బంధమును కూడ వాసనవలెనే విడిచిపెట్టు- భోగసాధకములగు బంధువులతో నీకేమీ ప్రయోజనంలేదు. స్రక్చందనవనితాదులతో లాభంలేదు తత్ప్రాప్తినిమిత్తములయిన శుభాశుభకర్మలతో నిమిత్తంలేదు- రామా! ఆత్మతత్త్వమొక్కటే సత్యమని భావంగల నీకు భయహేతువులతో ఏలాటిసంబంధమూలేదు. ప్రపంచ భ్రాంతినుండి భయపడతావేం? బంధువులతో సంబంధమే నిజంలో నీకు లేనపుడు వాళ్ళతాలూకు సుఖదుఃఖాలతో నీకు ఏమిసంబంధము? ఎందుకు నీవు వార్లను జూచి దుఃఖించడం?

రామా! నీవు వెనుక ఉన్నట్లయితే ముందు ఉండగలవు- ఇపుడు ఉంటున్నావు. ఈసంగతి నీకు నిశ్చయంగా తెలుసు. అపుడు ఈబంధువులను గూర్చివలె గడచిన జన్మలలోని బంధువులగూర్చి యేల దుఃఖించవు?

ఇంక నీవు నేను కాలత్రయావర్తిని కాను (నిత్యుడను కాను) అని అంటావు. అయితే యిపుడు అనిత్యుడవయితే ముందూ అనిత్యుడవే- కాబట్టి ఆత్మ అనిత్యుడు, క్షణికుడు అని తెలుసుకున్నావు. కనుక అపుడుకూడ రెండవక్షణంలో దుఃఖింపతగినవాడు, దుఃఖించువాడు లేనందున దుఃఖానికి ప్రసక్తే లేదు.

ఇక మూడవపక్షంలో (నేను క్షణికుడను గాను అనిత్యుడను మాత్రమే అను పక్షంలో) అనగా వెనుక ఉన్నాను ఇపుడు ఉన్నాను- ఇకముందు ఉండను- అని అనుకుంటే అపుడు సంసారంబంధం నీకు నశించినది కనుక దుఃఖింప పనిలేదు- నీవు ఉన్నపుడుకదా ఇది నిన్ను బాధించేది. నీవే లేనపుడు వీళ్ళను (బంధువులను) గురించిన బాధ నీకేల? కాబట్టి రామా! ప్రాకృతమయిన ప్రపంచక్రమంలో దుఃఖం తగదునీకు- సహజ సంతోషవృత్తిమాత్రం అవసరం- కనుక రామచంద్రా! దుఃఖాన్ని విడిచిపెట్టు- విషయసుఖాన్నికూడా విడిచిపెట్టు- పరమాత్మ అంతటా ఉన్నాడు- కనుక సమత్వబుద్ధితో మెలగు- నీవు అనంతుడవు- సత్స్వరూపుడవు- ఆకాశమువలె సర్వాంతరుడవు. ప్రకాశరూపుడవు. నిత్యశుద్ధుడవు. ముత్యాలహారంలో దారములవలె సకల పదార్థములయొక్క హృదయంలో ఉండేవాడవు. మాటిమాటికి పుట్టుచుండుట ప్రపంచంలో అజ్ఞానులకు సహజం. జ్ఞానులక్షణం అదికాదు- రామా! నీవు జ్ఞానివి. సుఖంగా ఉండు- ఈసంసారం ఎప్పుడూ దుఃఖబహులము- ఇది అజ్ఞానంవల్ల పుట్టింది- ఇది నీవు గుర్తించావు- భ్రాంతికంటె దీనికి వేరురూపంలేదు- స్వప్నంలో భ్రాంతికంటె వేరేమీ లేదు- సర్వశక్తియుక్తుడయిన పరమేశ్వరునకు ప్రపంచాకారముగా భాసించడమనేది ఒకానొకశక్తి.

ఎవరి కెవరు బంధువు? ఎవరి కెవరు శత్రువు? సర్వేశ్వరుని సంకల్పంలో అందరకు అందరూ బంధువులే, శత్రువులే. ఉదాసీనులే- ఈ సంబంధం పరస్పరనిమిత్తంగా జరుగుతోంది. దీనికి తుద మొదలు లేదు- నీటి తరంగసమూహం వంటిది ప్రపంచసంబంధం- చక్రముయొక్క అంచువలె క్రిందుమీదికి, మీదుక్రిందికి తిరుగుతూ ఉంటుంది- స్వర్గస్థులు నరకానికి పోతారు. నారకులు స్వర్గంచేరుతారు- మనుష్యయోనినుండి పశుయోనికి పశుయోనినుండి పక్షియోనికి పోతూ ఉంటారు. ఒకద్వీపంనుంచి మరొకద్వీపానికి పోతారు. ధీరులు కృపణు

లవుతారు. కృపణులు ధీరులవుతారు. ఈ పాతోత్పాతములతో తిరుగుతూ ఉంటారు. అగ్నికి మంచుకణం ఉండదు. అలాగే ప్రపంచంలో ఒక్కటీ స్థిరమయిన పదార్థంలేదు. స్వచ్ఛమయింది లేదు. సంతాప రహితమయినదీ లేదు. ఎంతటి మహాభాగ్యవంతులయిన బంధువులయినా కొన్నినాళ్ళకు నశించకమానరు. పరత్వ,ఆత్మీయత్వ,అన్యత్వ, త్వత్త్వ, మత్త్వాది, భావన సత్యము కాదు. రామా! "నీకు వీడు బంధువు, వాడు పరుడు, వీడు నేను, వాడునీవు. అనే మిథ్యాదృష్టి నీకు నశించుగాక. ఈదృష్టితో విలాసార్థంగా వ్యవహరించు. అంతఃకరణలో మాత్రం అజ్ఞానవాసనలతోకూడా యీ మిథ్యాదృష్టులను ఛేదించు.

రామా! ఈ సంసారసరణిలో వాసనాభారం లేకుండా శ్రమచే అలసట చెందకుండా విహరించు. వాసనాక్షయమును కలిగించే తత్త్వ విచారము పెరిగినకొలదీ లోకవ్యవహారాలు శాంతిస్తాయి. వీడుబంధువు వీడుకాడు అనేలెక్క స్వల్పబుద్ధులకేగాని ఉదారచరితులకు గాదు. "నేనులేని తావులేదు. నాదికాని వస్తువులేదు. అనే నిశ్చయంలో ఉంటుంది ధీరులచిత్తవృత్తి. ఉదయాస్తమయములు లేనిది. చిదాకాశము. స్వరూపప్రతిష్ఠితుడు సర్వమును తనలో చూచుకుంటాడు. రామా! అనాదిసిద్ధమయిన యీ సంసారంలో నీవు అనేకజన్మల నెత్తుటచే భూతజాతులన్నీ బంధువులేనీకు. దేహముద్వారా నీతోటి పూర్తిగా సంబంధంలేనివారు ఎవ్వరూలేరు.

రామా! వివిధజన్మల నెత్తిన యీ ప్రపంచంలో వీడుబంధువు, వీడు అబంధువు అని యనుకొనుట భ్రమ. ఈ త్రిభువనము నీకు చిరకాల బంధువు, అబంధువునుకూడ.

## ౧౯. పావనబోధనము.

వసి॥ దీనికి దృష్టాంతంగా ఒకయితిహాసం ఉంది. గంగానదీతీరాన అన్నదమ్ములయిన మునిపుత్రుల సంవాదం. "బంధువు" "అబంధువు"

అనే కథాప్రసంగంతో జ్ఞాపకమునకు వచ్చింది- చాలా ఆశ్చర్యంగా ఉంటుంది విను చెబుతాను-

జంబూద్వీపంలోని కొండగుబురులో కీశారణ్యముగల మహేంద్ర పర్వతముగలదు. దానిమీద కల్పవృక్షాల నీడన అనేకమంది మునులు కిన్నరులు విశ్రాంతి తీర్చుకుంటారు. పొడవయిన శిఖరాలతో ఆకాశాన్ని కూడా జయించి ఉంది- శిఖరకందరములలోని ప్రతిధ్వనులు సామవేదఘోషములవలె ఉన్నాయి- శిఖరాగ్రములందు వ్రేళ్ళాడు మేఘాలు మెరపులతో ప్రకాశిస్తూ కుంతలాయుధములవలె ఉన్నాయి.

ఆ పర్వతానికి రత్నాలతో కూడిన చరియ యొకటి ఉంది. దాని మీద మునుల స్నానపానాలకు ఆకాశగంగ ఉన్నది- అందు దీర్ఘతపుడను మునిశ్రేష్ఠుడు కలడు- ఆయనకు ఇద్దరుకుమారులు అతిసుందరులు వారిపేరు పుణ్యుడు, పావనుడు- ఈ కుమారులతో భార్యసమేతుడై ఆ దీర్ఘతపుడు ఆకొండచరియమీద నివసిస్తూ ఉండగా కొంతకాలానికి పుణ్యుడనే పెద్దకుమారుడు తత్త్వవేత్త అయ్యాడు- రెండవవాడు మూర్ఖత్వంవదిలాడు- కాని ఆత్మజ్ఞానం కలగలేదు. ఆమధ్యస్థితిలో ఉన్నాడు. ఇలాఉండగా తండ్రికి నూరేండ్లు నిండాయి. దివంగతుడయినాడు- జన్మజరామరణ స్వర్గనరకపాశాది వృత్తాన్తాలతో భీతిల్లి తుదకు సంసారంమీద విరక్తి కలిగింది. దేహత్యాగం చేశాడు- కావడి మోయువాడు కావడిబరువును దించుకున్నట్లయింది- కల్పనాజాలంలేని చిత్పదాన్ని చెందాడు- (అనగా పరమపదమును (ముక్తిపదమును) పొందాడు.)

పిదప భార్య నేలమీదపడి దుఃఖాక్రాంతయై పొర్లాడింది. తుదకు భర్తగారుపదేశించిన యోగశక్తిచే దేహత్యాగం చేసింది- భర్తను అనుగమించింది- తలిదండ్రులిట్లు మరణింప వారికి పారలౌకికకర్మ చేయాలనే వ్యసనం పెద్దకుమారుడికి కలిగింది. దుఃఖరహితంగా చిన్నవాడు (పావనుడు) మాత్రం దుఃఖించాడు. ఆ దుఃఖంతో అడవిఅంతా

వెతకాడు అన్నగారికోరకు, ఎక్కడా అన్నగారు కనిపించలేదు. యింకా దుఃఖాంబుధిలో మునిగాడు. ఇలాఉండగా పెద్దవాడు (అనగా అన్న గారు) తలిదండ్రులకు సంస్కారంచేసి ఏడుస్తూఉన్న తమ్ముని వద్దకు వచ్చాడు- ఇలాఅన్నాడు తమ్మునితో-

పుణ్యః కుమారా! (సోదరుడికి యీ సంబోధన) కన్నీరుధార కట్టేలాగున ఏడుస్తున్నావు ఎందుకు? నీ తలిదండ్రులు ముక్తి పొందారు. అది ఉత్తమస్థానము. వారినిగూర్చి ఏడ్వపనిలేదు. నీతండ్రి స్వస్వరూపాన్ని పొందాడు. నీవు వారలమీద "ఈమె నాతల్లి" "ఆయన నాతండ్రి" అనే వ్యామోహాన్ని ముడివేసుకున్నావు- అందువల్ల యింతగా ఏడుస్తున్నావు. "ఆమె ఒక్కతే నీకు తల్లికాదు" "ఆయన ఒక్కడే నీకు తండ్రికాడు" నీవొక్కడవే వార్లకు కుమారుడవుకావు- నీకు లెక్కలేనంతమంది తలితండ్రులున్నారు, వారికి లెక్కలేనంతమంది కుమారులున్నారు- అందులో నీవొక కుమారుడవు- ప్రతిఋతువు నందును చెట్టుకు పండ్లుకలిగినట్లు ప్రతిజన్మయందునూ, మానవులకు అనేకమంది బంధువులు తయారవుతారు. తీగలకు కొమ్మలకును ఆకులూ మొగ్గలూ లెక్కలేకుండా ఉన్నట్లు- నీవు తలితండ్రులనుగూర్చి దుఃఖింప తలచుకుంటే గడచిన తలితండ్రులనుగూర్చి దుఃఖించవేం? వారు వేల కొలది ఉన్నారుగా! వారంతా మరణించారుకా? నాయనా? ఈప్రపంచం ఒకవిధమయిన భ్రాంతిగా యిలాగోచరిస్తుంది. ఇదమిథ్య- పరమార్థంలో నీకు మిత్రులూ లేరు బంధువులూలేరు- జన్మలేదు- నాశమూ లేదు- ఇవన్ని ఎండమావులవలె భ్రాంతిసిద్ధములు. నీవు చూచే సంపదలు, ఛత్రచామరాదులు ఇవన్నీ కలలో చూచినట్లు రెండుమూడు రోజులు చూస్తున్నావు. అంతేకాని ఇందులో ఏవీ స్థిరంగా ఉండేవి కావు- పరమార్థంలో నీవూలేవు- నీకు మేమూలేము. "వాడుపుట్టాడు" "ఏడుచచ్చాడు" అనేదృష్టులు కేవలసంకల్పంవల్ల పుట్టిన సంధిప్రేలాపాలవంటివి- అందులో సత్యం ఏమాత్రంలేదు- అజ్ఞానమనే మరు

భూమిలో పుణ్యపాపాలనే తరంగాలతో వాసనాజాలమనే మృగతృష్ణోద కము (ఎండమావులనీరు) భాసించుచున్నది- ఇంతకంటె ప్రపంచంలో పరమార్థం యేమాత్రం లేదు-

## ౨౦. పావనబోధ.

తండ్రిఎవరు ? తల్లియెవరు ? మిత్రుడెవరు ? బంధువులెవరు ? భ్రాంతియుక్తమయిన బుద్ధిచే బయలుదేరారు వీరందరు. గాలికి దుమ్ము బయలుదేరినట్లు- బంధుమిత్రాది ప్రపంచం అంతా సంకేతమాత్రం. బంధువనుకుంటే బంధువు- శత్రువనుకుంటే శత్రువు. విషపురుగులు విషాన్ని ఆహారంగా తీసికుంటాయి. వాటికది అమృతంలాగ జీవనహే తువవుతుంది. మనము దానిని (విషమును) విషంగా చూస్తాము. మనకది విషమవుతుంది- ఇంతే యీ ప్రపంచంకూడ. అన్ని దేహము లందును అభిన్నముగానున్న ఆత్మకు వీడు బంధువు- వీడు శత్రువు అను భేద మేమిటి ? నీవు రక్తమాంసాది జడపదార్థ సంఘాతమయిన దేహము కంటె విలక్షణుడవు. చేతన స్వభావుడవు. నిన్ను నీవు విచారించుకో. పరమార్థంలో నేను పుణ్యశబ్దవాచ్యమగు దేహాదిరూపుడనుకాను. నీవు పావనశబ్దవాచ్య దేహాదిరూపుడవు కావు- ఈ రెండుపేరులు మిథ్యా జ్ఞానంచేత కల్పితములే- ఇలాగే తల్లిదండ్రులు మొదలగువారి శరీరము కూడ కల్పితమే. ఇంక నీవు లింగశరీరరూపుడనని తలచేయెడల ఈ లింగ శరీరము ఇంతకుముందు అనేకమంది తల్లితండ్రులతో సంబంధించి యున్నది కనుక వారందరిని గురించి యిప్పుడు దుఃఖించవేమి ? నీకు చక్క-గా పుష్పించిన ప్రదేశాలలో అనేకమృగములు బంధువులయినవి. (అనగా లోగడ మృగములందు పుట్టావు నీవు. కొలనులయందు హంస లలో పుట్టావు. అడవులలో చెట్లుగా పుట్టావు- కొండలలో సింహాము లందు పుట్టావు- ప్రవహించే నదులలోనూ, కొలనులలోనూ, మత్స్యము లందు పుట్టావు- దశార్ణ దేశాలలో అడవికోతులలో పుట్టావు- తుషార దేశాలలో రాజకుమారుడవయినావు- పుండ్ర దేశములలో అడవికాకి

వయినావు- హైహాయ దేశములలో ఏనుగవు- త్రిగర్త దేశాలలో గాడిదవు- శాల్వ దేశాలలో కుక్కవు. సర్జనవృక్షములందు పక్షివి- మర్రిచెట్టునందు చెట్టుదొలిచెడి పురుగవు- మందర పర్వతమున కోడివి- దాని గుహాలో బ్రాహ్మణుడవు- కోసల దేశములలో బ్రాహ్మణుడవై, వంగదేశములలో తిత్తిరిపక్షివై, తుషార దేశములలో అశ్వమై, బ్రహ్మగారి యజ్ఞంలో పశువై, తాటిచెట్టు మొదట పురుగై, మేడిచెట్టుయందు దోమవై, వింధ్యపర్వతంమీద కొంగవై బుట్టి తుదకీ జన్మలో నాకు తమ్ముడవయితివి. హిమవత్పర్వతగుహాలో భుజపత్రవృక్షముయొక్క తొర్రలో ఆరుమాసాలు పిపీలికము గానున్న నీవు నాకు తమ్ముడవయి తివి- మన గ్రామానికి ప్రక్కనున్న పల్లెలో ఎండిన ఆవుపేడలో ఒకటి న్నర సంవత్సరం తేలువై ఉండి నాకు తమ్ముడవయితివి- అడవిలో పులిందీస్త్రీకి బిడ్డగా బుట్టి నీవు నాకు తమ్ముడవయితివి- ఇలా అనేక జాతులందు అనేకజన్మలను ధరించావు నీవు పూర్వం జంబూద్వీపంలో.

ఇలా నీ తాలూకు ప్రాక్తనవాసనాక్రమమును నేను సూక్ష్మ బుద్ధితో గ్రహించాను. నా తాలూకు జన్మపరంపరలనుగూడ నేనెరుంగు దును. జ్ఞానదృష్టితో వాటినిగూడా చెబుతావిను నీకు.

నేను పూర్వం త్రిగర్త దేశాలలో చిలుకను. నదియొడ్డున కప్పను. అడవులలో లావకమను నొకానొకపక్షిని. వింధ్యపర్వతంమీద పులిం దుడను. వంగదేశాలలో చెట్టుఅయ్యాను. వింధ్యాద్రియందు ఒంటెగా కూడ పుట్టాను. హిమవత్పర్వతమున చాతకపక్షిని. పౌండ్ర దేశంలో రాజును. సహ్యాద్రికుంజములలో పెద్దపులిని. వాడినే యిపుడు నీకు అన్నను. పదిసంవత్సరాలు నేను గద్దను. అయిదుమాసాలు మొసలిని. నూరుసంవత్సరాలు సింహాన్ని. ఆంధ్రగ్రామంలో చకోరమై హిమవ త్పర్వత ప్రదేశాలలో మాండలికుడనై శ్రీశైలంలో ఆచార్య పుత్రు డనై, ఇపుడు పుణ్యుడనే పేరుబెట్టుకొని నీకు ఇదిఅంతా చెబుతున్నాను- వెనుకటి సంసారవాసనలన్నీ భ్రాంతులు- వానిని స్మరించి చెప్పానునీకు.

పరిస్థితి అంతా ఇలాఉంటే యిప్పుడు ఏతల్లినిగూర్చి ఏడుద్దాము? ఏతండ్రినిగూర్చి ఏడుద్దాము? ఏబంధువులనుగురించి ఏడుద్దాము? ప్రపంచస్థితిఅంతా ఇంతేకదా! అడవిలోని చెట్టుకు అనేక ఆకులు పుట్టుచూ, రాలుచూ ఉన్నట్లు మానవులకు అనేకమంది తల్లులూ, అనేకమంది తండ్రులూ, అనేకమంది బంధువులూ పుడుతూ ఉంటారు. రాలిపోతూ ఉంటారు. ఇందులో సుఖదుఃఖాలకు అవధి(హద్దు)ఏమిటి? కనుక దీనినంతా విడిచి మనము స్వచ్ఛంగా ఉందాం- నీవు "నేను" "నేను" అనే ప్రపంచభావనను విడిచి ఆత్మజ్ఞానులు పొందెడిగతిని పొందు- తత్త్వవేత్తలు ప్రపంచంలో నిరభిమానంగా ఉంటారు- నీకు భావాభావములు లేవు. జరామరణములు లేవు. దుఃఖంలేదు. తల్లి లేదు. తండ్రిలేదు. కేవలాత్మరూపుడవు. ఈ సంసారయాత్రలో నానాభినయములను చేసెడి నరులు వట్టిమూఢులు. పురుషార్థ బుద్ధియుక్తులు మధ్యస్థులు. తత్త్వజ్ఞులు కేవల సాక్షిరూపులు. వీరు కర్తలుగా కనిపించుచున్ననూ కర్తలు కారు దీపములవలె- కరగతమయిన దర్పణాదులు దమయందు ప్రతిబింబించియున్న బింబధర్మములయెడ తమకేలాటి అభినివేశములేనట్లు తత్త్వజ్ఞులు తమయందధ్యస్తమయిన కార్యములందు కర్తలయినను తాము యేమాత్రము అభినివేశము లేక యుందురు.

కనుక కుమారా! ఏషణాత్రయమునువిడిచి మననశీలమయిన మనస్సుతో హృదయపుండరీకమునందలి ఆత్మను సాక్షాత్కారముచేసికొని సంసారమలమును పూర్తిగా విడిచి పరిశిష్టమయిన ఆత్మస్వరూపంతో తృప్తిచెందు- అన్నాడు అన్నగారు తమ్మునితో-

## ౨౧. తృష్ణావిచిత్సాయోగము.

వసి॥ రామా! అన్నగారుచేసిన ఆత్మబోధచే తమ్ముడికి తత్త్వనిశ్చయం కలిగింది- అన్నదమ్ములిద్దరూ జ్ఞానసిద్ధులయినారు- యథేచ్ఛం అడవిలో సంచరించారు. కొంతకాలానికి వారు దేహత్యాగం

చేసి ముక్తి బొందారు చమురుతీసిన దీపాలు ఆరిపోయినట్లు- కనుక వెనుకటిజన్మలో వెనుకటి దేహముతో అనుభవించిన బంధుసమూహానికి అంతులేదు- అందులో ఎవరినిగూర్చి దుఃఖద్దాం? ఎవరిని విడిచి పెడదాం. కనుక అనంతములయిన ఈతృష్ణలను విడనడమే ఉపాయము కాని వీటిని కాపాడటం (పెంచటం) బాగుపడుటకు ఉపాయంకాదు- కట్టెతో నిప్పు పెరుగుతుంది- విషయచింతనతో తృష్ణ పెరుగుతుంది- కట్టెతీస్తే నిప్పు చల్లారుతుంది- విషయచింతన మానితే తృష్ణ నశిస్తుంది- కనుక రామా! ధ్యేయమగు తృష్ణాత్యాగమును అవలంబించు. కృపా దృష్టితో చూడు లోకాన్ని- ప్రకృతవ్యవహారాన్ని అనుష్ఠించు- ఇది జ్ఞానమార్గము-అతిస్వచ్ఛము. నిష్కామము. దీనిని పొందినవాడు మరల సంసారమోహాన్ని పొందడు. వివేకమనే ప్రియమిత్రుణ్ణీ పరమార్థబోధ అనే ప్రియసఖినీ ఆధారపరచుకుంటివా ఎంతటి సంకటాలలో తిరిగినా చెడిపోవు ధైర్యమనేది ధనములను కాలతన్నుతుంది- బంధువులను మెడపట్టిగెంటుతుంది. సంసారసంకటంనుంచి ఉద్ధరించాలంటే ఇదితప్ప మరొకటిలేదు. కనుక వైరాగ్యంచేత, శాస్త్రంచేత, మహాత్త్వాది గుణములచేతను ప్రయత్నపూర్వకంగా మనస్సును ఉద్ధరించుకోవాలి సాంసారికవిషయములనే గోతులనుండి తుచ్ఛవిషయాభిలాష లేకుండుట యనే మహాత్త్వగుణంగల చిత్తమునకు లభించెడి ఫలమునకు త్రిభువనైశ్వర్యముచాలదు- రత్నాల కోశాగారములు చాలవు. కనుక నీజగత్కుక్షిలో పడుట లేచుటలతో ఊగులాడే వాళ్ళమనస్సు ఎన్నటికి విశ్రాంతి చెందదు- మనస్సు బ్రహ్మామృతరసపూర్ణమయిన వానికి ప్రపంచంఅంతా ఆనందరసపూర్ణమయినట్లే తోస్తుంది. చెప్పులు తొడిగినవాని కాళ్ళకు కుశకంటకాదులతో నిండిన నేలకూడ మెత్తని చర్మంతో కప్పినట్లే భాసిస్తుంది. వైరాగ్యమువలన మనస్సు పరిపూర్ణమవుతుంది. ఆశకు పరాధీనమయిన మనస్సు పరిపూర్ణంకాదు- ఆశావశమయిన మనస్సు రిక్త (శూన్య) మవును. ఆశా వివశ చేతస్కుల యొక్క- చిత్తము అగస్త్యమహామునిచే పానంచేయబడిన సముద్రంవలె

శూన్యమవుతుంది- ఎవని చిత్తమనే చెట్టుమీద తృష్ణయనే పిచ్చికోతి తిరగదో వాని హృదయమనే యడవి బాగా శోభిస్తూ ఉంటుంది. నిస్పృహులకు యీ బ్రహ్మాండమంతా గోష్పదం అంతటిది- మహా కల్పం ఒక్క నిముషము- నిస్పృహుల మనస్సుల యందలి చల్లదనము నకు చంద్రునియందలి చల్లదనముచాలదు- హిమాచలగుహలోని అరటి మంచిగంధము చెట్లయందలి చల్లదనము చాలదు- స్పృహాహీనుని మనస్సు పరిపూర్ణమయినట్లు పూర్ణచంద్రుడు పరిపూర్ణుడు గాడు- క్షీర సాగరము (పాలసముద్రము) పరిపూర్ణముకాదు- లక్ష్మీవదనము పరి పూర్ణముకాదు- ఆశయనే పిశాచిక మానవుని మనస్సును మలిన పరు స్తుంది- మేఘపంక్తి చంద్రుని కాటుకమసి సుధాలేపమును (సున్నపు పూతను) మలినపరచినట్లు- చిత్తమనే చెట్టుయొక్క ఆశలనే కొమ్మలు దిగంతములను కప్పివేశాయి. వాటిని నరకితే ఇంక ఆ చెట్టుకు స్వరూ పం ఉండదు- (అరూపమయిన బ్రహ్మను పొందుతుంది) చిత్తమనే చెట్టుయొక్క తృష్ణలనే కొమ్మలను నరకితే ధైర్యమనే చెట్టు అనేక కొమ్మలతో విస్తరిస్తుంది- ధైర్యం చెడకుండా చిత్తనాశం సంపాదించు కుంటే, రామా! నాశరహితమయిన స్థానం దొరకుతుంది. కనుక ఈచిత్తవృత్తులకు, ఆశలకును మరల మొలకరించుటకు అవకాశం ఇయ్యా నిచ్చో, ఇంక సంసారభయం ఉండదు. చిత్తమును వృత్తిరహితంగా నీవు చేసికొనేయెడల నీవు మోక్షస్థితిని పరిపూర్ణస్థితిని పొందుతవు- చిత్తంలో చేరి తృష్ణఅనే గుడ్లగూబ నిరంతరం అన్నివ్యవహారాలలోను క్షోభపెడుతూ ఉంటుందో, అప్పుడు కలిగే అమంగళాలకు అంతు లేదు- ఎప్పుడో ఒకమాటు యింటిలో గుడ్లగూబ చేరితేనే మరణమో దారి ద్ర్యమో సంభవిస్తుందని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అంటారు- అలాంటిది ఎప్పుడూ చిత్తంలో నివసించిఉంటే కలిగే అనర్థాలకు అంతం ఏమి ఉన్నది? ఆశతో విషయములను చింతించుటయే చిత్తవృత్తి- కనుక చిత్తవృత్తియే ఆశ. కనుక ఆశనువదలితే చిత్తమునకు వృత్తి లేదు- వృత్తి లేకుంటే చిత్తములేదు. ఎవడు యేవిధమయిన చిత్తవృత్తితో

ఉంటే వాడు ఆవృత్తిలోనే నశిస్తాడు. కనుక చిత్తశాంతికోరకు చిత్త వృత్తులను రూపుమాపుకో. రామా! ఏషణాత్రయమును వదలి, ఆశను విడిచి జీవన్ముక్తుడవగుము- పాపిష్టి ఆశాపిచాచం మనస్సులో ఉంటే సంకెళ్ళవలె బంధమేకాని మోక్షం ఎన్నటికీ ఉండదు- ఆశాపాశాలు విడిపోతే ముక్తి పొందనివాడు లేడు.

౨౨. నుంచి, ౨౯. వరకు బల్యుపాఖ్యానము.

వసి॥ లేకుంటే బలిచక్రవర్తివలె అకస్మాత్తుగా విచారోదయం కలిగి జ్ఞానం కలుగుగాక నీకు-

శ్రీరా॥ స్వామీ! మీదయవలన నేను పొందదగిన బ్రహ్మను పొందాను- మనస్సు విశ్రాంతి చెందినది- శరత్కాలనభస్సువలె నిర్మలమయింది మనస్సు- తృష్ణయనే అంధకారం పటాపంచలయింది. ఆనందపూరితుడ నయినాను- కాని మీమాటలు వింటూఉంటే నాకు తృప్తి తీరలేదు. బలిచక్రవర్తికి జ్ఞానోదయం ఎలా కలిగిందో శెల విర్వండి. వినమ్రుడయిన శిష్యుడికి ఉపదేశించడంలో సత్పురుషులు బాధపడుతూ ఉంటారు. అన్నాడు రాముడు-

వసి॥ రామా! విను చెబుతాను బలివృత్తాంతం- వింటే నీకు కూడా ఆత్మబోధ కలుగుతుంది. ఈ బ్రహ్మాండంలో ఒక దిక్కున భూమికి దిగువభాగమున పాతాళమనే లోకం ఉంది- దానవ కన్యల తోనూ, ఆదిశేషాది సర్పములతోనూ, రాక్షసులతోను నిండియున్నది. ఒకానొకచోట దిగ్గజములు, మరోకచోట నారకులు, ఇంకొకచోట రత్నాకరాలు (సముద్రాలు) మరియొకచోట కపిలుడు, ఇంకొకచోట స్వర్ణలింగాకారమయిన శివుడు ఉన్నారు. అందులో విరోచనుని కుమారుడు బలి యను నతడు రాజు ఉన్నాడు- అతడు మహాపరాక్రమశాలి. ఒక్కసారి కేకవేస్తే చాలు సురవిద్యాధరోరగులు వచ్చి కాళ్లు పిసికే వారు. అతడు త్రైలోక్యరత్నాలకు ధనాగారం- త్రైలోక్యపాలకులకు

పోషకుడు- ఇతని పేరు చెపితే ఐరావతముయొక్క గండస్థలాలు ఎండి పోయేవి- కుపితుడయ్యేసరికి వేదుసముద్రాలూ ఎండిపోయేవి- ఆయన గారు చేసిన యజ్ఞాలలో లేచిన ధూమములు (పొగలు) పెద్ద పెద్ద మేఘాలు అయి బ్రహ్మాండకోటరానికి కవచాలు (చొక్కాలు) అయ్యాయి. ఇలాంటివాడై బలి పదికోట్ల సంవత్సరాలు రాజ్యం ఏలాడు. కొన్ని యుగాలు గడచిపోయాయి ఇతని పరిపాలనా కాలంలో. అనుభవించదగిన భోగాలు అన్నీ అనుభవించాడు. అనుభవం మితిమీరింది. తుదకు వాటిమీద వైరస్యం కలిగింది.

ఒకనాడు మేరుశిఖరంమీద రత్నాలతో తయారుచేసిన కిటికీలో కూర్చొని ప్రపంచపరిస్థితిని గూర్చి ఇలా ఆలోచించాడు. నేను యింకా ఇలా ఎంతకాలం రాజ్యమేలాలి. ఎంతకాలం ప్రాపంచికభోగాలు అనుభవిస్తే మాత్రం ఏమిలాభం. ఇది అంతా పైకిమధురంగా ఉంటుంది. తుదకు అన్నీ నశించేవే- యీభోగానుభవంచేత ఏమిసుఖం నాకు- ఎప్పటికీ అవేపగళ్లు- అవేరాత్రులు- అవేపనులు- వీటినిచూస్తే సిగ్గువేస్తోంది. ఏమీ సంతోషంగా లేదు- మాటిమాటికి భార్యను కౌగిలించుకొనుట, మాటిమాటికి భోగించుట, ఇది పిల్లచేష్టలక్రింద తేలింది మహానుభావులదృష్టిలో- ఎన్నాళ్లు చేసినవ్యాపారమే (పనే) మళ్ళీ చెయ్యాలం- పగలుతర్వాత రాత్రి రాత్రి తర్వాత పగలు. చూస్తే ఇది సిగ్గు వేస్తోంది. ఈ సంసారయాత్ర పిచ్చివాడి చేష్టలవలె ఉంది- ఈ ఆడంబరం ఇలా ఎంతకాలం సాగించాలి. సాగిస్తే మాత్రం పొందే ఫలమేమిటి? పరమార్థం ఇందులో ఏమీలేదు- పురుషార్థం అసలే సున్న''అని యిలాఆలోచించి వెంటనే ధ్యానంలో ఉండిపోయాడు కొంత సేపటికి లేచాడు ధ్యానంనుంచి. వెనుక తన తండ్రిని తాను అడుగగా అతడు చేసిన ఉపదేశాన్ని స్మరించాడు. ఇలా అనుకున్నాడు. ''వెనుక తత్త్వవేత్త యగు నా తండ్రిని నేను ఇలా అడిగాను. నాన్నా అన్ని భ్రాంతులూ శాంతిచే తావు (అవది) యేది? మనోమోహం ఏతావున

శాంతిస్తుంది. ఎక్కడికి చేరితే, ఏషణాత్రయం విడిపోతుంది. పునరావృత్తిలేని విశ్రాంతి స్థానమేది? దేనిని పొందితే నాకు తృప్తికలుగుతుంది? దేనిని తెలిసికుంటే మరొకటి తెలిసికొనదగినది ఉండదు? ఈ భోగాలు నాకు సుఖావహంగాలేవు- నామనస్సును క్షోభపెట్టుచున్నవి. మోహంలో పడవేస్తున్నాయి- నాన్నా నాకు పరిపూర్ణానందమయిన వస్తువును ఉపదేశించు" అని అడిగాను. విన్నాడు నాతండ్రి. చల్లని మాట చెప్పాడు. ఆమాటనాకు జ్ఞప్తికి వచ్చింది యిప్పుడు-

## ౨౩. విరోచన వచనము.

విరోచనుడు॥ కుమారా! మోక్షమనే అతివితతమయిన దేశం ఒకటిఉంది- అందులో ఎన్నిలోకాలయినా యిమిడిపోతాయి- అందులో సముద్రాలులేవు- కొండలులేవు- అడవులులేవు- తీర్థాలులేవు- నదులులేవు- సరస్సులులేవు- పంచభూతాలులేవు- సూర్యచంద్రులు లేరు- దిక్పాలకులులేరు- దేవదానవభూత యక్ష రక్షస్సులులేరు- వృక్ష లతా గుల్మాదులులేవు- తృణకాష్ఠాదులులేవు- ఊర్ధ్వాధోభాగములులేవు- ఆత్మ అనే రాజొక్కడే కలడు ఆపట్టణంలో. అతడు సర్వకర్త- సర్వవ్యాపకుడు కూటస్థుడు. అతనికి ఆలోచనా పటీయసుడు మంత్రి ఉన్నాడు- అతడే మనస్సు అనేవాడు- ఇతడు కూర్చనివాటిని కూరుస్తాడు. కూర్చియున్నవాటిని వేరుచేస్తాడు- ఆత్మకు లేని సంసార సంబంధాన్ని తెచ్చిపెట్టాడు- ఉన్న పరిపూర్ణానందైకరసాన్ని విఘుటపరుస్తాడు- ఎదీ అనుభవించలేడు- దేనినీ తెలిసికొనలేడు- వట్టిజడుడు- కాని ఆరాజుగారి కొరకు అన్నిపనులు చేస్తూ ఉంటాడు- ఆరాజుగారి పనులన్నీ నెరవేర్చువాడు ఇతడొక్కడే- ఇతడే అన్నిపనులూ చేసి పెడుతూ ఉంటాడు రాజగారికి- రాజుమాత్రం ఏకాంతంలో స్వస్థంగా ఉంటాడు. అని అన్నాడు తండ్రి (విరోచనుడు) కొడుకుతో(బలితో)-

విన్నాడు కొడుకు. ఇలా అడిగాడు- ఆధి వ్యాధులులేని ఆదేశమేది? దానిని చేరేది ఎలా? ఇదివరకు ఎవరు చేరారు! ఆరాజు ఎవరు?

ఆమంత్రి యెవరు? విలాస మాత్రంచేత ప్రపంచం అంతా వణికించిన మేము వాని నేల జయించలేము? ఈకథ నాకు శ్రోత్రిగా ఉన్నది- చెప్పు- సందేహం తీర్చు- అన్నాడు.

విరో॥ కుమారా! ఆమంత్రి చాలా బలవంతుడు. అతడికి లక్షల కొలది సైన్యం ఉన్నారు దేవదానవులు- కనుక ఇతణ్ణి ఆక్రమించలేరు ఎవరూ-ఇతడు ఇంద్రుడు గాడు-యముడు కాడు- కుబేరుడు కాడు- దేవత కాడు- రాక్షసుడు కాడు- కుమారా! అతడిమీద యేవిధమయిన ఆయుధాలూ పని చెయ్యవు- కలువ పువ్వుతో రాతిని కొట్టితే యెంతో ఇతణ్ణి ఉక్కు-ఆయుధాలతో కొట్టినా అంతే-అస్త్రశస్త్రాలకు లొంగడు. భటుల బెదరింపులకు భయపడడు. ఇతనికి దేవదానవులందరూ వశమైపోయారు- ఇతడు విష్ణువు కాకపోయినా హిరణ్యాక్షహిరణ్యకశిప్వాది అసురుల నేలకూల్చాడు- నారాయణాది దేవులనుగూడ తత్త్వవేత్తలను స్వాధీన పరచుకొని గర్భకోశులలోకి త్రోశాడు- ఈమంత్రి అనుగ్రహంచేతనే మన్మథుడు ముల్లోకములను ఆక్రమించాడు. జయించాడు. విజృంభించాడు. ఇతని అనుగ్రహంచేతనే క్రోధం చెలరేగుతోంది దేవాసుర యుద్ధము ఈయనకు ఒక ఆటమాదిరిది. ఈమంత్రి ఆ ప్రభువుచేతనే (ఆత్మచేతనే) జితుడవుతాడు-ఇతరులకు జేయుడు కాడు-బహుతర సుకృత పరిపాకముచే వివేకము ఉదయించినపుడే అప్రయత్నంగా ఆ ప్రభువు ఆమంత్రిని జయించాలని యిచ్ఛపుటుతుంది-అలాంటి మంత్రినిజయించే శక్తి నీకున్నట్లయితే నీవు పరాక్రమవంతుడవన్నమాటే- ఆమంత్రిఅనే సూర్యుడు ఉదయిస్తే ముల్లోకములనే కొలనులు వికసిస్తాయి. అతడు అస్తమిస్తే ముల్లోకాలు అస్తమిస్తాయి- నీ బుద్ధిబలంచేత అతణ్ణి జయింపసమర్థుడవయితే ధీరుడవన్నమాటే- అతణ్ణి జయిస్తే జయింబడకపోయినా లోకాలన్నీ జయింపబడినట్లే- ఇతణ్ణి జయించకపోతే వెనుకజయించియున్న లోకాలన్నీ జయింపబడనట్లే. కనుక మరణ రాహిత్యము కొరకు, శాశ్వతానందము కొరకు అతనిని జయింప ప్రయ

త్నించు. కష్టమనుకోనకు. అతిబలవంతుడయిన అతడు విలాసగా మూడులోకాలను వశపరచుకున్నాడు- అన్నాడు తండ్రి-

## ౨౮. చిత్తజయోపాయము.

బలి॥ అతన్ని జయించే ఉపాయం చెప్పమని అడిగాడు కొడుకు.

విరోచన॥ కుమారా! రాజయోగమనే యుక్తిచే అతడు క్షణంలో సులభంగా సాధ్యమవుతాడు జయించడానికి. పిల్లవానివలె యుక్తితో మచ్చిక చేసుకోవాలి అతణ్ణి- ఇలాంటి వాళ్ళే ఆరాజుగారిని చూస్తారు. రాజపదమును పొందుతారు. రాజు సాక్షాత్కరిస్తే మంత్రి వశమయినట్లే. మంత్రిని వశపరచుకుంటే రాజు ప్రత్యక్షమవుతాడు మాటిమాటికి రాజును చూడకపోతే మంత్రి దుఃఖాన్నే యిస్తాడు. సుఖం ఇయ్యడు. మంత్రిని జయించకపోతే రాజు అదృశ్యమవుతాడు. కనుక రాజసందర్శనము, మంత్రిపరాజయము, ఈరెంటినీ ఒకేదఫా అభ్యసించాలి. పురుషప్రయత్నంచేత మెల్లమెల్లగా రెంటినీ సాధించుకుంటే నీవు ఆదేశం (మోక్షదేశం) చేరుతావు- చేరితివా అక్కడికి మళ్ళీ నీకు దుఃఖం ఉండదు_ అచ్చోట మంచిమంచి గొప్పవారుంటారు_

కుమారా! విను నీకు ఆదేశాన్ని ప్రకటిస్తాను. ఇదివరకు నీతో "దేశం దేశం" అని అన్నాను. నీవుకూడా అదియొక దేశమునని అనుకొని యుండవచ్చు- మోక్షమునే నేను దేశమనే పేరుతో చెప్పాను. రాజు అంటే పరమాత్మ- మంత్రిఅంటే మనస్సు- మనస్సునందు వాసనారూపముతో నుండి ఈ ప్రపంచం స్థూలమయింది- మట్టి కుండగా పరిణమించినట్లు, పొగ మేఘముగా పరిణమించినట్లు, అతణ్ణి జయిస్తే సర్వం జయించినట్లే. యుక్తిలేనిదే మాత్రం జయింప బడనేరడు- అన్నాడు తండ్రి.

బలి॥ నాయనా! ఆయుక్తి యేదో చెప్పమన్నాడు- కొడుకు. తండ్రి యుక్తిని చెప్ప నారంభించాడు. కుమారా! (1) విషయవాంఛ

కూడదు- ఇది ముఖ్యమయిన యుక్తి (ఉపాయము) దీనిని క్రమంగా అభ్యసించాలి- విషయవాంఛ నశించునంతవరకు మానవులకు దుఃఖములు తప్పవు- అభ్యాసంలేనిదే అలవడదు ఇది. కనుక ధ్యేయవాసనాత్యాగమును అభ్యసించాలి. పురుష ప్రయత్నం లేనిదే అనుకూలమయిన శుభఫలము నెరవేరదు. పురుషప్రయత్నం అత్యంతావసరము- లోకులంతా దైవం దైవం అంటారు- దైవానికి ఒక ఆకారం లేదు- నియతిప్రయుక్తమయిన శుభాశుభక్రియయే దైవమని మానవులంటారు మనుష్యదృష్టితో. శాస్త్రీయదృష్టి గలవారనరు అలా- లోకంలో హర్షామర్షములకు కారణమయిన కర్మ నశిస్తే ఏది హర్షామర్ష వినాశమునకు తయారయినదో దానిని జనులు దైవమని అంటున్నారు, కనుక ఇట్టి నియతిరూపమయిన దైవము పురుషప్రయత్నంచేత జయింపబడుతుంది. సమ్యగ్జ్ఞానంచేత మిథ్యాజ్ఞానం జయింపబడినట్లు- పురుషుడు ఎలా సంకల్పిస్తే అది అలా అయితీరుతుంది- ఫలవంతముగా సంకల్పిస్తే అది ఫలవంతమే అవుతుంది. సుఖమునే యిస్తుంది- మా మతంలో జీవుడంటే మనస్సే- మనస్సంకల్పానికి అనుకూలంగా పనులు నెరవేరుతాయి సామాన్యంగా- చిత్తం సామాన్యంగా నియతపదార్థాలను, (వ్యావహారికవస్తువులను) అనియత పదార్థాలను (ప్రాతిభాసిక పదార్థాలను) తయారు చేస్తుంది- అంచేత ఈచిత్తము తాను సంకల్పించిన వస్తువులను అనుసరించి ఫలనియతిని కూడ సంపాదిస్తుంది- కనుకనే మనోమయుడయిన జీవుడు ఒకనొకప్పుడు మోహాధికారముగల జన్మయందు నిత్యనియతైకస్వభావుడవు పరమాత్మయందు, ఆత్మసాక్షాత్కార నామకమగు నియతిని (అనగా సమానాకారవృత్తిధారను) (అనగా నిర్వికల్పకసమాధిని) చేయుచు ఈ జగత్కోశంలో అసంగుడై స్వస్వరూపంతో ప్రకాశిస్తూ ఉంటాడు. ఇతడే ఒకప్పుడు (వ్యుత్థాన దశలో) శాస్త్రలక్షణమయిన నియతితో తన ఆశ్రమమునకు తగిన కర్మను చేయుచు అజ్ఞానులు "వీరుయాజ్ఞికులు వీరుశిష్టులు వీరుసదాచార ప్రవర్తకులు" అను పేరులతో గుర్తించుటకు ప్రఖ్యాతమయిన

(నియతి) శబ్దముగలవాడై ప్రకాశిస్తూ ఉంటాడు- కొండచరియ తాను స్వయంగా కదలనిది యయినా గాలియొక్క వేగంవల్ల చెట్లు కదలుతూ ఉంటే తాను కదలుచున్నట్లు అవి కదలకుంటే తాను స్థిరంగా ఉన్నట్లును స్ఫురిస్తుంది- అలాగే సమాధినుంచి లేచిన జీవుడు కూడ- కనుక మనస్సు ఉన్నంతవరకూ దైవంలేదు నియతీలేదు- అంతా మనస్సే- దీని సంకల్పమే. మనస్సునశిస్తే యేది కలుగుతుందో అది నీకు కలుగు గాక. జీవుడే పురుషుడయినాడు- అనగా కర్మజ్ఞానములకు అధికారము గల శరీరం ధరించాడు- కనుక వాడు ఏది సంకల్పిస్తే అది అవుతోంది. సంకల్పం వాడి స్వాధీనంలో ఉన్నదికనుక పౌరుషంచేత వైరాగ్యాది సాధనాలను సంపాదించుకొని పరమపురుషార్థరూపమగుయిన బ్రహ్మాత్మ భావమునే సంకల్పించాలి- సంసారాత్మభావాన్ని సంకల్పించకూడదు.

కుమారా! పురుషార్థసంపాదనకంటె మానవజన్మకు వేరుఫలం లేదు- కనుక గట్టిపౌరుషం తెచ్చుకో- భోగతృష్ణను చంపుకో. ఇది చావనిదే ఎవ్వనికీ అఖండానందము లభించదు- భోగవాంఛ (విషయ వాంఛ) ఉన్నంతవరకూ సంసారకుహారంలో ఊగులాట తప్పదు. వైరాగ్య శ్రవణ మనన సమాధ్యభ్యాసములు లేనిదే విషయభోగము లనే పాములతో అల్లిన సంసారదశయనే ఊయెలలో ఊగులాట యెన్న టికీ తప్పదు. అన్నాడు తండ్రి.

బలి॥ నాన్నా భోగములయందు నిస్పృహామాత్రం ఎలా కలుగు తుంది? అదేకదా జీవునకు నిత్యాత్మభావాన్ని ప్రసాదించేది. అని అడిగాడు కొడుకు.

విరో॥ కుమారా! ఆత్మజ్ఞానం చేతనే భోగములందు నిస్పృహ కలుగుతుంది. హృదయంలో వైరాగ్యం స్థిరపడుతుంది. ఈయది తత్త్వవిచారంవల్లకాని కలుగదు. కాబట్టి తత్త్వవిచారము ఆవశ్యకము. అవ్యుత్పన్నమయిన చిత్తమును మంచిమార్గాన పెట్టుటకు దినపరిమాణ కాలంలో రెండుభాగాలు భోగములతోను ఒకభాగం శాస్త్రశ్రవణం

తోను మరొకభాగం గురుశుశ్రూషతోను గడపాలి- కొంచెం వ్యుత్పత్తి గల చిత్తంకలవాడు ఒకభాగం సంసారభోగములతోనూ, రెండుభాగాలు గురుశుశ్రూషతోనూ, ఒకభాగం శాస్త్రశ్రవణంతోనూ గడపాలి. పూర్తిగా వ్యుత్పత్తిగల చిత్తమును రెండుభాగములు. శాస్త్రవైరాగ్యములతోను రెండుభాగములు. ధ్యాన గురు పూజలతోను గడపాలి. వీటన్నిటియందును శుద్ధచిత్తుడే అధికారి. ఇతరుడు అధికారి కాడు. నిర్మలమయిన గుడ్డకే రంగు అంటుతుంది. మలినవస్త్రానికి అంటదు- కనుక మలిన మయిన చిత్తమును మెల్లమెల్లగా శ్రుతిస్మృతిగురూక్తులచే లాలనచేసి వశపరచుకోవాలి. ఆత్మవిచారమూ, తృష్ణాక్షయమూ, ఈ రెండూ ఒకేదఫా అభ్యసించాలి- పరమాత్మజ్ఞానం కలిగితే (ఆత్మసాక్షాత్కారం కలిగితే) తృష్ణాక్షయం- తృష్ణాక్షయం కలిగితే ఆత్మసాక్షాత్కారం అని యీ రెండూ పరస్పరాశ్రయములై ఉన్నాయి. భోగపుంజమునందు రుచితగ్గితే పరబ్రహ్మయందు మనస్సుకు విశ్రాంతి చిక్కుతుంది. మనస్సు విశ్రాంతి చెందక భోగలంపటులయిన వాళ్ళకు ఎన్నటికీ ఆత్మానందము ప్రాప్తించదు- యజ్ఞ దాన తప స్తీర్థసేవాదుల వలన పుణ్యద్వారా విషయసుఖమే లభిస్తుందికాని వైరాగ్యము లభించదు- తృష్ణాక్షయమునకు ఆత్మసాక్షాత్కారముదక్క వేరొక యుపాయములేదు- భోగవైరాగ్యాభ్యాస ఈ పురుషప్రయత్నం లేనిదే మరియే యితర ఉపాయంచేతనూ ఆత్మసాక్షాత్కారము మీద బుద్ధి ప్రసరించదు- కనుక కుమారా! దైవాన్ని దూరంగా త్రోసివేసి పౌరుషం ఆశ్రయించి భోగాలను తృణీకరించు- (ఛేదించు) భోగనింద ముదిరితే (గట్టిపడితే) తత్త్వవిచారము కలుగుతుంది. భోగనిందవల్ల తత్త్వవిచారము, తత్త్వవిచారంచేత భోగనింద ఇవి రెండూ ఒకదానిని మరొకటి బలపరచుకుంటాయి- భోగనింద, తత్త్వవిచారము, ఆత్మజ్ఞానము, ఈమూడును అత్యంతప్రియమిత్రులు- పరస్పరం ఉపకారం చేసుకుంటాయి- కనుక ముందు దైవాని త్రోసివేసి పురుషప్రయత్నంచేత పళ్లు పటపటా కొరికి భోగములమీద వైరాగ్యాన్ని సంపాదించాలి. అయా

దేశాచారములకు కులాచారాలకు తగినట్లుగానూ, బంధువుల సంమత మగునట్లుగానూ, పౌరుషంచేత క్రమంగా ధనం సంపాదించాలి- ఆ ధనం చేత ఆరాధించి గుణశాలులగు సుజనులను వశపరచుకోవాలి- వారి తోటి సహవాసమువలన వైరాగ్యము అలవడుతుంది. తరువాత తత్త్వ విచారం పిదప జ్ఞానం ఆ వెనుక అన్నిశ్రుతులకు అద్వితీయబ్రహ్మయందు తాత్పర్యనిర్ణయం ఆపైన పరమపదప్రాప్తి ఇలా క్రమంగా కలుగుతాయి ఇవి- విషయభోగమును ఎప్పుడు విరమించితే అప్పుడే తత్త్వవిచారము కలిగి పరమపదమును పొందగలవు నీవు- అంతేకాని యీలోపుగా అది సాధ్యపడదు- విషయోపరమణమువలన ఆత్మస్వరూపమునందు విశ్రాంతి నొందగలవు- మరల యీకల్పనా ప్రపంచంలోకిదిగవు- నీకు యిప్పుడే భోగనింద కలిగిందికనుక నీవు సదా శివరూపుడవే- నీకు నమస్కారము. అని తండ్రి బ్రహ్మదృష్టితో నమస్కారమన్నాడు కొడుకుతో-

బలి॥ ఇలా చెప్పాడు నాతండ్రి నాకులోగడ- అది యిప్పుడు స్మృతిపథానికి వచ్చింది- నాకిపుడు ప్రాపంచికభోగాలమీద విరక్తి కలిగిందిగట్టిగా- అదృష్టవశాత్తు శాంతిసుఖాన్ని అనుభవిస్తున్నాను నేను- "లోగడ ఎప్పుడూ ఆశను పూర్తిచేయుటమే, ఎప్పుడూ డబ్బు సంపాదించడమే" "ఎప్పుడూ భార్యను బతిమాలుకోవడమే"- ఇలా సంపదలను పరిపాలించుకొనుటలో నాకెప్పుడూ బాధగానే ఉండేది- అబ్బా! శాంతిభూమి చాలాదొడ్డది. సుఖదుఃఖదృష్టులన్నీ నాశనమై పోతాయి యీదశలో- శాంతిపొందాను- సుఖిస్తున్నాను- ధనార్జన అనేది మహాదుఃఖకరం- శరీరమును శరీరముతో కలిపి, మాంసమును మాంసముతో కలిపి నేననుభవించిన కాంతాసుఖమంతా మోహవిజృంభితము- మహదైశ్వర్యం సంపాదించాను- నిష్కంటకంగా రాజ్య భోగాలు అనుభవించాను- నాసామర్థ్యంచేత ప్రాణులనందఱినీ వశ పరచుకున్నాను- కాని వీనివల్ల శాశ్వతసుఖం ఏమికలిగింది నాకు ఈ ప్రపంచంలో జరిగేది అంతా మామూలేకాని క్రొత్తయేమీలేదు

యిందులో- అంతా చర్వితచర్వణప్రాయం- కనుక దీనినివిడిచి పరిపూర్ణాత్మ స్వరూపంలో ఉన్నాను- కాలవశంచేత ఎంతటి వస్తువయినా నశించే దే ప్రపంచంలో- అంచేత ప్రపంచం నిస్సారమయింది- ఇంతవరకు నేను బాలుణ్ణిగా ఉండిపోయాను- రాజ్యాధిపత్యంమీాది కోరికచే దేవతలతో విరోధం సంపాదించుకున్నాను- చాలాకాలం అనర్థములను అర్థములని భావించి కష్టంగా కాలం గడుపుకున్నాను. అజ్ఞానంచేత తృష్ణాపాశబద్ధుడనై ప్రపంచంలో తరించటానికి నేనేమీా చేసికోనలేదు. ఇపుడు గడచినదానికి వగచిన ఫలితంలేదు. ఇపుడు జన్మసాఫల్యానికి మార్గం వెదకుకుంటాను. (ఆలోచిస్తాను) అపరిచ్ఛిన్న బ్రహ్మైకజ్ఞానం చేత నాకు పరిపూర్ణసుఖం లభిస్తుంది- అందుకొరకు తత్త్వవిచారం చేస్తాను. "ప్రపంచమనగా ఏది? నేను అనేవాడెవడు?" అని ఆత్మసాక్షాత్కారోపాయమును గురించి నా కులగురువయిన శుక్రాచార్యులను అడుగుతాను- ఆయన ఉపదేశంచేత నాకు అజ్ఞానం నశిస్తుంది- జ్ఞానం కలుగుతుంది- ఆత్మస్వరూపంలో ఉండిపోతాను. మహానుభావుల ఉపదేశాలు వ్యర్థపోవు- అనుకున్నాడు బలి.

౨౬. బలికి శుక్రాచార్యులుపదేశించుట.

వసి॥ రామచంద్రా! బలి ఇలా ఆలోచించుకొని కనుమూసి శుక్రాచార్యులవారిని ధ్యానించాడు హృదయంలో- ఈ సంగతి శుక్రాచార్యులవారు గ్రహించారు- శిష్యుడు తత్త్వజిజ్ఞాసతో తన దర్శనం కోరుతున్నాడని నిర్ణయించుకున్నాడు- తాను స్వయంగా రత్నాల కిటికీవద్దకువచ్చి ప్రత్యక్షమయినాడు- బలిచక్రవర్తి గురువుగారిని (శుక్రాచార్యులను) జూచి, అర్ఘ్యపాద్యాదులతో బూజించి పాదాభివందనం చేశాడు- రత్నసింహాసనం మీాద కూర్చుండపెట్టాడు- ఇలా అన్నాడు బలి శుక్రాచార్యులతో-

బలి॥ స్వామీా మీా అనుగ్రహంవల్ల నాకొకవిధమయిన ప్రతిభాశక్తి కలిగింది- అదినన్ను మీాతో మాట్లాడమని ప్రేరేపిస్తోంది.

సూర్యుడు ఉదయించి యెవరిపనులు వారిని చేసికొనుమనినట్లు- నాకు సాంసారిక భోగాలమీద విరక్తి కలిగింది. తత్త్వజిజ్ఞాస కలిగింది. ఈ విషయసుఖానికి హద్దునది? దీనికి కారణమేమిటి? నేనువవరు? నీవెవరు? ఈలోకములన్ని ఏవి? నాకు వీటితత్త్వం విచారించి చెప్పండి? అని అడిగాడు బలి-

శుక్ర॥ దానవరాజేంద్రా! (బలిచక్రవర్తీ) పెక్కుమాటలేల నేను నభోమార్గాన వెళ్ళదలచినాను- నీకు దీనిసారం చెబుతావిను. చైతన్యమునేది ప్రపంచంఅంతా నిండిఉంది. ఈవిషయసుఖం. (భోగజాలం) చిన్మాత్రం- చిన్మయము- నీవుచిత్తు- నేనుచిత్తును- ఈలోకాలన్నీ చిద్రూపాలే ఇదీ నివడిగిన వానికి సంగ్రహంగా సమాధానం- నీవు శ్రద్ధగల వివేకివయితే యీ నిశ్చయంవల్లనే ఫలం పొందుతావు. శ్రద్ధావివేకాలు లేకపోతే యెంతచెప్పినా లాభం ఉండదునీకు- బూడిదలో పోసిన ఆహుతులే అవును- చిచ్చైత్యముల యొక్క పరస్పరాధ్యాసయే బంధము-(చిచ్చైత్య విషయవిషయిలు) అనగా చైతన్యమునకు విషయాకారమును జెందుటయే బంధము. విషయాకారమును విడచుటయే ముక్తి. విషయాకార వినిర్ముక్తమయిన చైతన్యమే పరిపూర్ణాత్మయని వేదాంత సిద్ధాంతము- ఈ నిశ్చయంతో నీవు చూచే యెడల స్వయంగానే అఖండ బ్రహ్మాకార వృత్తికలిగి ముక్తిపదమును పొందగలవు- నేను దేవలోకానికి వెళ్ళాలి. సప్తఋషులు దేవతలపనిమీద వచ్చి ఉన్నారు అక్కడ- నేను కూడా అక్కడ ఉండాలి- రాజా! ఈ శరీరం ఉన్నంతవరకూ ముక్తాంతఃకరణులకు కూడా ఆగంతుకంగా ప్రాప్తమయిన పనులను విడిచిపెట్టడం రుచించదు- అది స్వాభావికం" అని అంటూ శీఘ్రంగా లేచి వెళ్ళాడు శుక్రాచార్యులు-

## ౨౭. బలి సమాధిలో విశ్రాంతి చెందుట.

వసి॥ రామచంద్రా! వెంటనే బలిచక్రవర్తి మనసా ఆలోచించుకున్నాడు. కులగురువగు శుక్రాచార్యులు చెప్పినమాట కరెక్టు(నిజము)

అనుకున్నాడు- ఇలా నిర్ణయించుకున్నాడు- "ప్రపంచం అంతా చిద్రూపం. నేను చిద్రూపుడను. ఈ లోకాలు, దిక్కులు, క్రియలు, అంతా లోపల వెలుపలా పరమార్థంలో చిద్రూపము లేతప్ప వేరు కాదు. చీకటి కంటెను ఘటపటాదిజడముల కంటెను విలక్షణంగా చైతన్యమనేది ప్రకాశించకపోతే సూర్యుడనే వాడు యెక్కడ ఉండేవాడు?" అప్పుడు సూర్యుడికి చీకటికి భేదమేమి? చైతన్యమే భూరూపంగా ప్రకాశిస్తోంది. చైతన్యమే దిగ్రూపంగా ప్రకాశిస్తోంది- చైతన్యమే శైలములు నభస్సు దేహం. ఇంద్రియాలు మనస్సు ఏషణాత్రయం ప్రపంచపరిస్థితి అంతా చైతన్యంతప్ప వేరేమి లేదు. చైతన్యముతోనే భోగేచ్ఛ కలుగుతోంది- కేవల జడశరీరంతో మాత్రాసంస్పర్శ లేదు! భోగమూ లేదు- కాబట్టి కాష్ఠలోష్టాదులతో సమానమయిన యీ శరీరంతో ఏమీ లాభం లేదు. అశేష ప్రపంచం రూపమయిన చిత్తు నేను- ఆకాశమున సూర్యగోళకంలో ఉన్న చైతన్యమూ నేనే- ఈ భూతపంజరంలో ఉన్న చైతన్యమూ నేనే- రెండవ వస్తువే లేదు- లోకంలో ఇంక శత్రువెవరు? మిత్రుడెవరు? బలిమొక్క శరీరం కొస్తేమాత్రం చైతన్యానికి కలిగే చెరుపేమి? రాగద్వేషాలు కామక్రోధాలు మొదలయిన భావాలన్నీ చిద్రూపాలు. చైతన్యమునందు కల్పితాలు- ముల్లోకములలోనూ కంచుకాగడాతో వెదకినా చైతన్యముకంటె వ్యతిరేకంగా ఏమీ లేదు. కేవలచిన్మాత్రమైన నాకు ద్వేషమూ లేదు. రాగమూ లేదు. మనస్సూ లేదు. మనోవృత్తులూ లేవు. "చిత్తు" "చిత్తు" అనేది చైతన్యానికి ఒక పేరు కాదు. సర్వ నామరూప కల్పనలకు అధిష్ఠానమయిన చిచ్ఛక్తియే తనకు పేరయిన శబ్దరూపముగా భాసిస్తోంది- "నేవరు?" అనే ప్రశ్నకు కూడా నాకు సమాధానం వచ్చింది. దృశ్య సంబంధములేని శుద్ధబోధరూపుడను నేను- ఇలాంటి భూరూపుడనయిన నాయందు పరిచ్ఛిన్నమయిన జీవభావం అనేది ఆభాసమాత్రం భ్రాంతి. అలాంటి జీవభావాన్ని చరమ సాక్షాత్కార వృత్తిచే ప్రకాశించేది స్వరూపంతో నేను తొలగించుకుంటాను- జీవభావాన్ని రూపుమాపు

కొని పరమేశ్వరభావమునొందిన నాకు నమస్కారము. జీవభావం తొలిగితే నాఆత్మ పరమేశ్వరుడే- నాకు చైత్య (విషయ)ములతో సంబంధం లేదు- సర్వావభాసములు నాదురూపములు. సంవేద్యములతో నాకు అక్కరలేదు. నేను సచ్చిన్మాత్రుడను- ఆకాశమువలె అనంతుడను. అణువుకంటె అణువును. ఈ సుఖదుఃఖదశలు నన్నంటవు. ప్రపంచంలోని భావాభావములేదియు నన్ను పరిచ్ఛిన్న పరచలేవు దేశకాలవస్తు భేదములతో అథవా అవితత్స్వరూపంలో పరిచ్ఛేదపరచుగాకనన్ను. అయినా అంతమాత్రంచేత నాకేమీ దోషం అంటదు. నేను పరిచ్ఛిన్నుడను కానేరను. అవి నా స్వరూపములే కాని నాకంటె వేరుకావు. నా స్వరూపములై నాకంటె వేరురూపము లేనివానితో నాకు పరిచ్ఛేదము రాదు- దీనికి దృష్టాంతం చూడు- ఒకానొక దేవదత్తుని యెడమ చేతులో శాంతధనం (డబ్బు) ఉంది- దాన్ని కుడిచేతితో కుడిచేతిలోకి తీసికున్నాడు. అప్పుడు దేవదత్తుని యెడమచేతిలో డబ్బులేదనుకోండి. అంతమాత్రంచేత రెండుచేతులతో కూడిన శరీరముగల దేవదత్తునకు ఎడమచేతులోని డబ్బు యెడమచేతినుంచి తొలగించినంతమాత్రంచేత దేవదత్తుని డబ్బుపోయినట్లవునా కాదు. అలాగే నాస్వరూపములయిన ప్రాపంచిక పదార్థాలతో నాకు పరిచ్ఛేదం యేర్పడినా అవికూడా నా రూపములే కనుక నాకేమాత్రము చెరుపులేదు. మానవులకు తత్త్వబోధ కలగకపూర్వమూ ప్రపంచము నాస్వరూపమే. కలిగిన తరువాతనూ నాస్వరూపమే- కనుక ఉన్నది పోయింది లేదు. క్రొత్తది వచ్చిందీలేదు-ఉన్నది చిత్తు ఒక్కటే- అలాంటి చిద్రూపుడనయిననాకు సంకల్పవికల్పాలచేత వచ్చిందీలేదు, పోయిందిలేదు. అజ్ఞానంచేత మనస్సును క్షోభపెట్టుకున్నాను-తత్త్వజ్ఞానంవల్ల శాంతించాను.” అని యిలా ఆలోచించుకొని బలి ప్రణవంలో అకారాదిమాత్రాత్రయాన్ని విడిచి ఆవలి అర్థమాత్రా స్వరూపమయిన తురీయమును భావించుచు సమాధిలో ఉండిపోయాడు. సర్వసంకల్పాలు శాంతించాయి. కల్పనలన్నీ అంతరించాయి- త్రిపుటీ యావత్తూ రూపుమాసింది అపుడు. ధ్యాతృ

ధ్యేయ ధ్యాన భావాన్ని విడచి నిర్మలుడై, వాసనారహితుడై ఉండి పోయాడు. ఆ రత్నాల గవాక్షంలో (కిటికీలో) చాలాకాలం గోడ మీద చెక్కిన రాతిబొమ్మవలె-

## ౨౮. శుక్రాచార్యుడు దానవులను సమాధానపరచుట.

వసి॥ ఇంతలో బలిచక్రవర్తి యొక్క అనుచరులగు దానవులు క్షణంలో ఆతని స్ఫటికాల మేడనెక్కారు- ఆ యనుచరులలో కొందరు డింభుడు మొదలయిన మంత్రులు- మరికొందరు కుముదుడు మొదలగు సామంతరాజులు, ఇతర రాజులు, హయగ్రీవాది సైనికులు, బంధువులు- లడుకాది స్నేహితులు- కుబేర యమ శక్రాదులు కానుకలనిచ్చేడి దేవతలు- యక్ష విద్యాధరులు- నాగులు- రంభా తిలోత్తమాది స్వర్లోకవేశ్యలు- చామరిణులగు వరాంగనలు- నానాదిక్కులు విదిక్కులనుండి వచ్చినవారంతా బలిచక్రవర్తిని సేవించడానికి సమయాన్ని యెదురుచూస్తూ ఉన్నారు అచ్చట. ధ్యాన మౌన సమాధిలో గోడ మీద బొమ్మవలెనున్న బలిని చూచారు అందరూ అత్యాదరంతో నమస్కరించారు. కొందరు (స్నేహితులు) విషాదం చెందారు. ఉదాసీనులయిన మరికొందరు విస్మయం చెందారు. తత్త్వవేత్తలు ఆనందించారు ఇతణ్ణిచూచి- ఇలా ఉండగా "ఏమి జరిగింది యిక్కడ" "ఎందుకిలా ఉన్నాడు రాజు? అని విచారించి మంత్రులు కులగురువయిన శుక్రాచార్యులవారిని ధ్యానించారు- వెంటనే ఆయనగారు ఆ మేడమీద ప్రత్యక్షమయినాడు- ధ్యానమౌనంలో ఉన్న దానవేశ్వరుని చూచాడు క్షణకాలం విశ్రమించి ప్రేమతో క్షణకాలంచూచి సంసారభ్రాంతి తీరి ఉన్నాడు బలి అని విచారించి సభను నిందిస్తూ ఇలా అన్నాడు శుక్రుడు. "ఓ దైత్యులారా! బలి ఆత్మవిచారంతో బ్రహ్మపదమును పొందాడు. అదే యీసుఖవిశ్రాంత్యతిశయము. ఇతడు ఇలాగే స్వాత్మానందానుభవంలో చిరస్థాయిగా ఉండుగాక ఇతనికి మనోభ్రాంతులు తొలగిపోయాయి- సంసారమిహిరము పటాపంచలయింది. ఈస్థితిలో మనం

పలకరించకూడదు అతణ్ణి- అజ్ఞానాంధకారం తొలగితే వచ్చే ఆత్మ జ్ఞానమనే వెలుగే యిప్పుడితనికి సంప్రాప్తమయింది- ఇతడు స్వయం గానే కొంతకాలానికి మేలుకొంటాడు-కనుక "ఓ దానవనాయకులారా! మీ పనులు మీరు నెరవేర్చుకోండి. ఈతడింక వెయ్యి సంవత్సరాలు సమాధినుండి వ్యుత్థితుడవుతాడు." అని అన్నాడు శుక్రాచార్యులు-

ఇలా గురువు చెప్పేసరికి దైత్యులందరూ హర్షామర్ష విషాదముల వల్ల కలిగిన మనశ్చింతను విడిచిపెట్టారు అందరు- వెనుకటి రాజ్యతంత్ర వ్యవహారప్రకారం కొలువుకూటాన్ని కొనసాగించారు. తమతమ పను లను తాము నెరవేర్చుకున్నారు- ఎవరుతావు వారు చేరారు-

౭౫. బలిచక్రవర్తికి విజ్ఞానము ప్రాప్తించుట.

వసి॥ రామా! అపైన దివ్యమానప్రకారంగా వేయి సంవత్స రాలకు దేవదుందుభి ధ్వనులతో సమాధినుంచి లేచాడు బలి- సూర్యో దయం అయితే కమలాకరం వికసించినట్లు వికసించింది బలిపురం అంతా- సమాధినుంచి మేలుకొన్న వెంటనే దానవులువచ్చి చేరక పూర్వమే ఇలా ఆలోచించుకున్నాడు బలి క్షణకాలం ఆసమాధి గేహంలో- "అబ్బా! పారమార్థికస్థితి యెంతటి ప్రశాంతమయింది? క్షణకాలం అందులో ఉండేసరికి నాకు ఎంతో సుఖంగా ఉంది- కాబట్టి యికముందు నేను ఇదే త్రోవలో ఉంటాను- విశ్రాంతి తీసికుంటాను- బాహ్యవిభూతులతో నాకు లాభంలేదు. చంద్రబింబములందు కూడ ఇంతటి ఆనంద తరంగాలుండవు. ఇపుడు నామనస్సులో ఉన్నంతగా" అని మరల సమాధిలోకి పోబోవుచుండగా దానవులందరూవచ్చి చుట్టు మూగారు. వాళ్లనుజూచి మరల ధ్యానించాడు. వీరందరు తనకు నమస్కారాలుచేస్తూ ఉండటంకాని, తాను చేయించుకోవడముకాని రుచించలేదు బలికి. "వీరందరు తన శరీరంచుట్టూ మూగిఉన్నా వారి మీద తనకు అనురాగం లేకపోతే, కేవల దర్శనమాత్రంచేత మనస్సు

మలినం కాదనుకున్నాడు- ఉండనీవారు అలా అనుకున్నాడు- "నేను మోక్షం కోరుతున్నానే వెనక నన్ను బంధించిందెవరు? బంధంలేనిదే మోక్షం కోరడమెందుకు నేను? ఇది పిల్లచేష్టగా ఉన్నదినాకు. తెలివి గలపనిగా కనిపించలేదు. నాకీధ్యానాధ్యానాలు అనవసరము. నా ఆత్మ తత్త్వంలో నేనుండిపోతాను- వచ్చేదిరానీ పొయ్యేదిపోనీ- నాకీ దేహముయొక్క వృద్ధిక్షయాలతో నిమిత్తంలేదు- నాకు ధ్యానమూ వద్దు- ధ్యానాభావమూవద్దు- భోగమూవద్దు- విరాగమూవద్దు- నాకు పరతత్త్వంలోనూ వాంఛలేదు- ప్రపంచస్థితిలోనూ వాంఛలేదు- ధ్యానంవల్ల పొందదగిన లాభమూలేదు- ఐశ్వర్యంవల్ల పొందదగిన లాభమూలేదునాకు- నేను చచ్చినవాడనూకాను- బ్రతికినవాడనూ కాను- సత్తునూకాను- అసత్తునూకాను- నాకు లోకంలో ఏవస్తువూ లేదు- నేను ధ్యానవృత్తిలోనుండి పొందదగినదేమీలేదు- నాకు దేని తోనూ పనిలేదు- ఏమీ చేయవలసినదిలేదు" కాబట్టి ప్రస్తుతముండిన రాజ్యపరిపాలనమును నేనెందుకు చెయ్యాను!" అని నిర్ణయించుకున్నాడు. ఒక్కమాటు మూట్లాడించియున్న దానవులనందరినీ చూచాడు. చూపు తోనే వారల శిరఃప్రణామాలను అందుకున్నాడు- ఆపైన ధ్యేయ త్యాగమాయమయిన చిత్తం(మనస్సు)తో రాజకార్యములను నెరవేర్చు కున్నాడు- దేవద్విజ గురువులను పూజించాడు. సుహృద బంధు సామంత సజ్జనులను గౌరవించాడు- భృత్యులకు ధనమునిచ్చాడు- లలనలను విచిత్రవిభవములతో లాలనచేశాడు. ఇలా దినదినప్రవర్ధ మానుడై ఉండగా బలికి కొంతకాలానికి యజ్ఞంచెయ్యాలని బుద్ధి కలిగింది. జనులందరినీ తృప్తిపరచుచూ, దేవఋషిగణములను పూజిం చుచూ, శుక్రాచార్యులు మున్నగువారిని ఋత్విక్కులుగా పెట్టుకొని మహాక్రతువును (అశ్వమేధమును) చేశాడు- అంతట విష్ణువు, బలి చక్రవర్తి భోగలాలసుడు గాడని నిర్ణయించుకొని బలియొక్క ఈప్సితం నెరవేర్చడానికి ఆ యజ్ఞానికి వచ్చాడు. భోగైకకృపణుడు అగు అతని (విష్ణువుయొక్క) తమ్ముడు దేవేంద్రుడు. పైగా తనకంటె పెద్దవాడు

అన్నగారు అతని కీ మూడులోకాలు కట్టపెట్టాలనుకున్నాడు. భిక్షుణ చాతుర్యం కలవాడుకనుక మాయాబలంచేత బలిచక్రవర్తిని మోసగించి ముల్లోకములను ఆక్రమించి బలిని బంధించాడు పాతాళంలో- రామా! ఇప్పటికి అతను (బలి) అక్కడ (పాతాళంలో) ఇంద్రుడు కాగల ప్రారబ్ధకర్మతో కూడినవాడై ఉన్నాడు- జీవన్ముక్తుడై ధ్యానమార్గంలో ఉన్నాడు- ఇతనికి సంపద్విపత్తులు రెండూ సమానములు. ఇతడు పదికోట్ల సంవత్సరాలు ముల్లోకాలు పాలించి తుదకు విరక్తి చెందాడు. ఇతనికి వేలకొలది ఊహాపోహాలు గడచిపోయాయి. సంపద్విపదములు అంతరించాయి ఇతని ముందఱ. కనుక ఇప్పటికి భోగాభిలాషను వదలి సంపూర్ణ మనస్కుడై ఆత్మారాముడై యున్నాడు. ఏడు పాతాళము లలో మధ్యమ పాతాళమయిన రసాతలంలో. రామా! మరల నీ బలి చక్రవర్తిచే అనేకవేల సంవత్సరాలు మూడులోకములు ఇంద్రుడై జన్మించి యేలవలసి యున్నది. ఇంద్రపదవి అబ్బినందున అతనికి సంతోషం లేదు. ఉన్నపదవి పోయినందున దుఃఖమూలేదు. సర్వసమదర్శి యతడు. రామా! బలియొక్క విజ్ఞానప్రాప్తికథ యిది- ఇదే దృష్టిని నీవుకూడా మనస్సులో పెట్టుకొని వృద్ధిచెందు- బలి చక్రవర్తివలె ఆత్మవిచారం చేసికొని తత్త్వజ్ఞానం సంపాదించి అద్వైతసిద్ధిని పొందుము- పదికోట్ల సంవత్సరాలు జగత్త్రయంలోని భోగాలు అనుభవించాడు బలి. తుదకు వైరస్యం (వైరాగ్యం) అనుభవించాడు. కాబట్టి భోగభారము (భోగాతిశయము) ఎప్పటికయినా దుఃఖం పర్యవసానంగా కలదే కనుక దానిని విడిచిపెట్టు. సత్యస్వరూపానందాన్ని అనుభవించు. ఇది దుఃఖపర్యవసానము గలది కాదు- రామా! "దూరస్థాః పర్వతారమ్యాః" అన్నట్లు విషయాకారములు పైకి రమ్యంగా కనిపిస్తాయి- దగ్గరకుపోతే ఆపర్వతాలు ఎంతో నిజం విచారిస్తే యీవిషయాలుకూడా అంతే- ఇలాంటి విషయాల (ప్రాపంచికపదార్థాల) మీదికి పరుగెత్తుతూ ఉంటుంది చిత్తం- దాన్ని కట్టిపారవేయి నీ హృదయకుహరంలో- నీవు చిదాత్ముడవు- నీకంటె వేరువస్తువు లేదు లోకంలో, ఎందుకు వ్యర్థంగా పరు

గెత్తడం? రామా! నీవు సర్వవ్యాపకుడవు. పరిచ్ఛిన్నుడవు కావు. పురుషోత్తముడవు. అనేక వేల పదార్థముల ఆకారం ధరించిన చిచ్ఛక్తిగల వాడవు. నీయందే యీ ప్రపంచం పడుగూ పేకగా వ్యాప్తమైఉంది- నీకు జన్మమరణాది వికారాలు లేవు- భోగతృష్ణ పెరిగినకొలదీ జన్మమరణాలు పెరుగుతూ ఉంటాయి- అవి తరిగినకొలదీ యివి తరుగుతూ ఉంటాయి- కనుక భోగతృష్ణను విడు- నీ చైతన్యబలమువలననే ఈ ప్రపంచం అంతా ఆభాసిస్తూ ఉంది- వృథాగా దుఃఖింపకు- సుఖదుఃఖాలనేవి నీవి కావు- నీకు లేవు. శుద్ధచిత్తుడవై సర్వావభాసకుడవగుము- దీనికి ఉపాయం చెబుతావిను. వెనుక నీవు ఏదేదియిష్టమని ప్రేమించావో అది అంతా నీకు అనర్థసాధనమే- అప్పుడు ఏదేది అనిష్టమని అనుకున్నావో అది యంతా నీకు మంచిదే. తపస్సు అనిష్టమనుకున్నావు- ఇంద్రియనిగ్రహం అనిష్టం అనుకున్నావు. ప్రాణాయామం అనిష్టం అనుకున్నావు- ఇవన్నీ నీకు ఇష్టసాధనములే. ఇపుడు ఇలా అనుకుని దీనిని అభ్యాసంలో పెట్టుకో క్రమంగా సప్తభూమికాపర్యంతం ఈ అభ్యాసంలో ఉండి తుదకు ఈకల్పనను (భావనను) కూడా విడిచిపెట్టు- ఇష్టానిష్టదృష్టిని విడిచిన వానికి శాశ్వతంగా సమతాబుద్ధి కలుగుతుంది. తరువాత మరల జన్మఉండదు. రామా! మనస్సు ఎందెందు ప్రవేశించునో వానివాని నుంచి దానినిలాగి ఆత్మతత్త్వంమీద నియమించవలెను. ఇలా మనస్సు అనే మదపుటేనుగును అభ్యాసక్రమంచేత వశపరచుకుంటే నిరతిశయానందం తప్పక లభిస్తుంది. మిథ్యాదృష్టిగల హతాశయులతో నీకు సామ్యంలేదు. ఆత్మతత్త్వ నిర్ణయము లేని వార్తికంకెను మూర్ఖుల మాటలను పట్టుకుని నడచువారికంటెను మూర్ఖులు లోకంలో వేరే లేరుసుమా! కనుక అవివేకం తొలగించుకో- వివేకం సంపాదించుకో- అందుకుగాను శ్రవణ మనన నిదిధ్యాసాదులందు పురుషప్రయత్నం అవలంభించు- వైరాగ్యశ్రవణాదులున్ననూ బహిర్ముఖదృష్టి పనికిరాదు. ప్రత్యగ్దృష్టి ఆవశ్యకం- కనుకనే వార్తికకారు లన్నారు- ఇలా "ప్రత్యగ్దృశాం వివోతాయ విబంధాయ పరాగ్దృశామ్" అని- కనుక

స్వయంవిచారణలేనిదే వేదవేదాంత తర్కాదులవలన ఆత్మతత్త్వం అభివ్యక్తంకాదు. కాబట్టి రామా! నీకు మదుపదేశంచేత జ్ఞానం లభించింది. దాన్ని దృఢంచేసికొనుటకు నీవుకూడ విచారణచేసికో. జ్ఞానం ఆరూఢమవుతుంది. ఆత్మతత్త్వం నిరూఢజ్ఞానానికే గోచరిస్తుంది కాని, సందేహావికల్పాలకు గోచరించదుసుమా! రామా! నీవు ఆత్మతత్త్వానికి కళంకములయిన అవిద్యావరణవిక్షేపాలను రూపుమాపుకొని విచార గురు శాస్త్రోపదేశాదులను ఆశ్రయించు. వివేకవైరాగ్యాదులను కాపాడుకో. ఆలస్యప్రమాదాది దోషాలను చంపుకుంటే సమాధి సుఖామృతాన్ని పొందుతావు అపుడు. బ్రహ్మము అవుతావు. అన్నారు వసిష్ఠులు.

### ౩౦. ప్రహ్లాదోపాఖ్యానము - ప్రారంభము.

బలిచక్రవర్తి చరిత్రను చెప్పాడు వసిష్ఠులు. ఈశ్వరానుగ్రహం వల్ల తత్త్వవిచారమూ, జ్ఞానోదయమూ కలిగే విధానం వర్ణించాలనుకున్నారు. అందుకుదాహరణగా ప్రహ్లాద చరిత్రను చెప్పటం ప్రారంభించారు శ్రీరామునకు.

వసి॥ రామా! దైత్యేశ్వరుడయిన ప్రహ్లాదుడు జ్ఞానసిద్ధిని పొందాడు. విను ఆచరిత్ర చెబుతా నీకు. పూర్వం పాతాళలోకంలో సురాసురులను గడగడ వణకించిన రాక్షసుడొకడు గలడు. హిరణ్యకశిపుడను పేరుగలవాడు. విష్ణువంతటి పరాక్రమం గలవాడు ఇతడు. ముల్లోకములను ఆక్రమించాడు. దేవేంద్రుని అధికారమునుంచి తొలగించాడు. ఆ అధికారాన్ని తాను ఆక్రమించాడు. రాత్రికాలంలో ముడుచుకొని ఉండి తెల్లవారి వికసించగనే రాజహంసకు గృహమయినట్లు ఉన్నది ఇతని చందం.

ఇలా ఉండగా కొంతకాలానికి కుమారులు కలిగారు ఇతనికి (హిరణ్యకశిపునకు) అపరసూర్యులవలె అతితేజస్సుతో వృద్ధిపొందారు

వాళ్లు- అందులో ప్రహ్లాదుడనే వాడు ఉత్తముడు- సౌందర్యవంతుడు- గుణవంతుడు-ఇతనివల్ల తండ్రికి యెంతో కీర్తి లభించింది- ఇతనిని సహాయంగా పెట్టుకుని సైన్యధనములతో కూడికొని మదించాడు హిరణ్యకశిపుడు- సూర్యచంద్రాది దేవతలను బాధింపసాగాడు- వారు ఓర్వజాలక శ్రీమహావిష్ణువుతో మొరబెట్టుకున్నారు- హిరణ్యకశిపుని చంపితేకాని బ్రతుకలేమన్నారు- ఎంతటి గొప్పవారయినా పలుమారు జరిగే అపకారాలను సహింపలేరు- అంతటి విష్ణుమూర్తి భయంకరమయిన నారసింహ శరీరమును ధరించి హిరణ్యకశిపుని వధించాడు. అంతట స్వర్గలోకాన్ని ఆక్రమించిన దానవులంతా పలాయనం చెప్పారు. పాతాళలోకాన్ని ప్రళయప్రపంచంవలె పాడుచేసి అంతర్ధానం చెందాడు నారాయణుడు. మృతశిష్టులయిన రాక్షసులు అంతా ప్రహ్లాదుని అండజేరి జీవిస్తున్నారు. ప్రహ్లాదుడు వార్లతోకూడి తండ్రి ఔర్ధ్వదైహిక కర్మల నాచరించాడు. మిగిలిన బంధువర్గాన్ని ఓదార్చాడు.

౩౧. పిదప తండ్రి మృతికి లోలోపల దుఃఖితుడై ప్రహ్లాదుడు ఇలా విచారించాడు- "ఏమి మాకిపుడు ఉపాయం కొంచెం పౌరుషంగా బుట్టిన రాక్షసులందరినీ యిలాగే విష్ణువు చంపుతూ ఉంటాడు. పాతాళలోకంలో ఎన్నటికీ పరాక్రమవంతులుండజాలరు. పుట్టినవారల్లా చస్తూ ఉంటారు- దేవతలు మా దేశాన్ని పూర్తిగా ఆక్రమించారు- పూర్వం నాతండ్రి యెవరిచే వింజామరలతో విసరబడినాడో వారే యిపుడు స్వర్గంలో దేవేంద్రునకు వింజామర వేస్తున్నారు- కాలచక్రం తలక్రిందుయయినది- నిర్భయంగా బ్రతికే రాక్షసులకు అనివార్యమయిన భయం ఏర్పడింది- ఇంకేమి చెప్పవలె- కనుక ఒక్కటే ఉపాయం ఆవిష్ణువును ఆక్రమించడానికి అనుకుంటాను- అంతకంటే వేరేమార్గంలేదు- సర్వదా శరణార్థులందరకూ ఆతడే శరణ్యము- అంతకంటె ముల్లోకములలో మరొకడులేడు- ఆతడు ప్రపంచోత్పత్తి స్థితిలయములకు కారణుడు- కనుక ఈనిముషము మొదలుకొని నేనా శ్రీమన్నారాయణమూర్తిని

ప్రపత్తి జెందెదను. నేనే నారాయణస్వరూపుడను. "నమో నారాయణాయ" అనే మంత్రం సర్వార్థసాధకము- ఆ మంత్రం నాహృదయ కోశంనుంచి తొలగదు- విష్ణువే పంచభూతములు- విష్ణువే యీ ప్రపంచం అంతా- విష్ణుస్వరూపుడు కానివాడు విష్ణువును పూజించినా ఫలం పొందలేడు- కనుకనే విష్ణుస్వరూపుడనై విష్ణువును పూజిస్తాను." అని ఇలా నిశ్చయించుకొని పరిపూర్ణమయిన ఆవిష్ణుస్వరూపాన్ని తన యందు సమగ్రంగా కల్పించుకున్నాడు-

౩౨. పిదప పూజకొరకు బాహ్యంలో(తనయెదుట) మరొక విష్ణువు ఉండవలెనని అనుకున్నాడు- సర్వాభరణ భరితమయిన మరొకవిష్ణు విగ్రహం కల్పించుకొని సర్వాభరణ పరివారసమేతమయిన ఆ మహాదేవుని సర్వసంభారములతో మానసికపూజచేశాడు- తరువాత తన దేవతార్చన గృహంలో బాహ్యవస్తువులతో బాహ్యపూజకూడా చేశాడు ప్రహ్లాదుడు- ఆనందించాడు. పరమ భక్తి కుదిరింది అతనికి విష్ణువుమీద- ప్రతిరోజూ పూజించడం సాగించాడు- అదిమొదలు దానవులందరూ వైష్ణవులయినారు- (విష్ణుభక్తులయినారు) కనుకనే లోకంలో సదాచారానికయినా దురాచారానికయినా రాజు ప్రధాన కారణ మన్నారు. ఈవార్త దేవలోకందాకా పోయింది. దేవతలందరూ ఆశ్చర్యపోయారు. రాక్షసులందరికీ విష్ణుభక్తి కుదిరిందే కారణమేమి? అని విస్మయంలో మునిగారు- పాలసముద్రంలో భోగి భోగశయనుడయియున్న విష్ణువుదరి జేరారు దేవతలు- ఆయనగారికి ఈరాక్షసుల చరిత్ర అంతా సావధానంగా చెప్పారు. ఇలా జరుగుటకు (విష్ణుభక్తి రాక్షసులకు కుదురుటకు) కారణమేమని అడిగారు ఇలా-

విబుధులు॥ ఓయి భగవంతుడా! నీకు ఎల్లపుడు శత్రువులయిన దైత్యులందరూ, నీయందు తన్మయత్వాన్ని చెందారు- ఇది మాయగా ఉందిమాకు- అతిదురాచారులయిన దానవులకు ఇక ముందెన్ని జన్మలకో కలుగదగిన విష్ణుభక్తి యిప్పుడెలా కలిగింది. దానవు లెక్కడ?

విష్ణుభక్తి యెక్కడ? అతిమూఢులు గుణవంతులయినారు. అలా ఉంది యీకథ- ఏది యెచ్చట పొసగదో అది అచ్చట శోభించదు- మేకల గుంపులో కుక్కను నిలపెట్టితే అందం లేదు- ఈ అనౌచిత్యంవల్ల మే మందరమూ వజ్రాయుధపు పోటుల వలనవలె దుఃఖిస్తున్నాము. 1) పగటికాలపు చంద్రుడూ, 2) యౌవనం దిగజారిపోయిన (ముసలి దయిన) కామినీస్త్రీ, 3) పద్మాలు లేని సరస్సూ, 4) అక్షరంముక్క లేని ఆకారవంతమయిన ముఖమూ, 5) ఎప్పుడూ ధనపరాయణుడయిన రాజూ, 6) ఎల్లప్పుడు దుర్గతికి పాలయిన సజ్జనుడూ, 7) నృపాంగణమును జెందిన దుర్మార్గుడూ, ఈ ఏడునూ, హృదయమునకు శల్యములంటారు పెద్దలు. అలాగే యీ రాక్షసులుకూడా మాకు శల్యములయినారు- ఏది యెక్కడ క్రమమో, ఏది యెక్కడ తగునో, ఏది యెక్కడ నిందితముకాదో, అదే అక్కడ శోభిస్తుంది. పద్మం నీటిలో ఉంటే అందంకాని మొరకను ఉంటే అందంకానుగదా! నీచులూ, మూఢులూ, దురాచారులూ, తామసులూ అయినదానవు లెక్కడ? విష్ణుభక్తి యెక్కడ? కనుక ఉప్పుమట్టి నేలలో నాటిన తామరతీగవార్త శ్రోతలనెల్లు సుఖపెట్టదో దితిసుతులకు మాధవభక్తి అబ్బినదను మాట కూడా మాకు సుఖంగా లేదు మహాత్మా! అన్నారు దేవతలు శ్రీ మహావిష్ణువుతో-

33. ఇలా అతిపటాటోపంతో గర్జించి మాట్లాడే దేవలోకాన్ని చూచి విష్ణువు ఇలా అన్నాడు-

శ్రీ॥ మ॥ వి॥ దేవతలారా! ప్రహ్లాదుడు విష్ణుభక్తుడయినాడని మీరు దుఃఖింపకుడు- ఇది అతనికి కడపటిజన్మ- దీనితో ఇతనికి ముక్తియే- ఇంక నితడు మాతృగర్భంలో నివసించడు- కాలినగింజ మొలకరించదు- గుణవంతుడు గుణరహితుడు కావడం అనర్థకరంకాని- గుణరహితుడు గుణవంతుడు కావడము అనర్థకరముకాదు. ఇట్టి విచిత్రములు ఆత్మీయములు (నావలన కలిగెడివి.) కనుక ప్రహ్లాదుని భక్తివల్ల మీరు దుఃఖింపకుడు- అన్నాడు మాధవుడు-

వసి॥ రామా! దేవతలతో ఇలా చెప్పి శ్రీమహావిష్ణువు అంతర్ధానమయినాడు. ఆ దేవతాసమూహంకూడా అతనిని(విష్ణుని)పూజించి ఆకాశమార్గమున స్వర్గమును జేరారు- అప్పటినుంచి దేవతలందరూ ప్రహ్లాదునితో స్నేహంగా ఉన్నారు- ప్రహ్లాదుడుమాత్రం జనార్దుని త్రికరణశుద్ధిగా అఖండభక్తితో పూజించుచునే యున్నాడు- వివేకమూ, ఆనందమూ, వైరాగ్యమూ, వృద్ధిపొందినవి యితనికి. విషయ భోగములందు విసుకు పుట్టింది- కాంతలు అసహ్యంవేశారు- లోక వ్యవహారంచూస్తే రోతపుట్టింది. చిత్తము సాంసారికభోగాలను విడిచింది. పరమవిశ్రాంతిని అందుకోలేకపోతుంది. మధ్యలో ఊగుతోంది- ప్రహ్లాదుని పరిస్థితిని కనిపెట్టాడు క్షీరసముద్రంలోఉండే శ్రీమహావిష్ణువు- పాతాళమార్గంగుండా ఆతని పూజాగృహాన్ని చేరాడు- దర్శనమిచ్చాడు. గ్రహించాడు ప్రహ్లాదుడు. శ్రీమహావిష్ణుని అత్యాదరంతో ద్విగుణంగా పూజించాడు జనార్దనుని యెదురుగా సాక్షాత్కరించినవానిని. పరమానందభరితుడయినాడు ప్రహ్లాదుడు స్తుతించటం ప్రారంభించాడు-

౩౮. శ్రీ॥ మ॥ వి॥ దైత్యకులచూడామణీ! నీకభిమతమయిన వరంకోరుకో- మాటిమాటికీ యీ జన్మ జరాదుఃఖాలు లేకుండుటకు అన్నాడు భగవంతుడు-

ప్ర॥ స్వామీ! సర్వదుఃఖోపశామకమయిన వరాన్ని మీరే ప్రసాదించండి- సకల ప్రాణుల హృదయాకాశంలో ఉండే మీకు తెలియనిదేమున్నది. అని అన్నాడు ప్రహ్లాదుడు-

శ్రీ॥ వి॥ అన్ని అనర్థాలనూ పోగొట్టునదీ, నిరతిశయానందాన్ని ప్రసాదించేదీ బ్రహ్మజ్ఞానం. దానికి బ్రహ్మవిచారం అవసరం- అదినీకు కలుగుగాక- అన్నాడు భగవంతుడు-

వసి॥ రామచంద్రా! శ్రీమహావిష్ణువు యిలాఅని అంతర్ధానమయినాడు- ఆయనగారు అంతర్ధానం చెందేసరికి ప్రహ్లాదుడు దోసెటి

లోని పూలను విడిచిపెట్టాడు. అదే పద్మాసనంవేసి కూర్చున్నాడు. స్తుతించుచూ మనస్సులో ఆలోచించుకున్నాడు— "భగవంతుడు నన్ను భవసాగరము తరించుటకు బ్రహ్మవిచారం చేయమని సెలవిచ్చాడు— కనుక నేను ఆత్మవిచారం చేస్తాను." నేను అనగా ఎవరు? మాట్లాడు చున్నాను— వెళ్లుచున్నాను— నిలచున్నాను— ప్రయత్నపూర్వకంగా విషయసుఖం అనుభవిస్తున్నాను- ఎవరు నేను ? ఈ దేహముకంటె బాహ్యమయిన వృక్ష తృణ పర్వతాదులతో కూడిన ప్రపంచమా ? నేనుకాను— మొట్టమొదట లేకుండా పుట్టినదీ, జడమయినదీ, ప్రాణ వాయువులతో చలించేదీ, కొద్దికాలంలో నేనశించేదీ,అయిన దేహమూ నేనుకాను. జడమై కర్ణశష్కుల్యాకారముతో కల్పితమై క్షణంలో నశించుచూ, ఆకారములేని శబ్దమూ నేనుకాను- క్షణికమూ, అచేత నమూ అయిన స్పర్శ నేనుకాను. ఇట్లే రూపరస గంధములనే విష యాలుకూడా నేనుకాను. చైత్య (విషయ) వర్జితమయిన చిన్మాత్రు డను నేను. శుద్ధచేతనుడను. సకలావభాసకుడను. ఈచేతనుని చేతనే ఘటాపటాదులు మొదలుకొని సూర్యునివరకూ ఉన్న వస్తువులన్నీ ప్రకాశిస్తున్నాయి. "ఆ" ఇప్పటికి నాకు స్మృతికి వచ్చింది విషయ మంతా- నిర్వికల్పక చైతన్యము యొక్క ఆభాస నేను— ఇట్టి నాచేతనే యీ యింద్రియవృత్తులన్నీ ప్రకాశిస్తున్నాయి— సర్వవ్యాపకమయిన నిదాఘము (ఎండ) చేత మరల మరీచికలు ప్రకాశిస్తున్నాయి—అలాగే సర్వవ్యాపకమయిన చైతన్యముచేతనే ప్రాపంచిక పదార్థములు కూడా భాసిస్తున్నాయి— వీటియొక్క ఉనికికూడా యీచైతన్యముయొక్క ఉనికిమీదనే ఆధారపడిఉంది- వస్త్రములయొక్క శుక్లాదిగుణములు దీపముచేతనే ప్రకాశించుచున్నవి— ఇతడే సకలపదార్థములకూ అనుభవ స్థానము— అన్నివస్తువులూ ప్రతిబింబించటానికి అద్దమే స్థానభూతము— (ఆధారము) ఈచిత్పదార్థము యొక్క అనుగ్రహమువల్లనే, సూర్యుడు వెచ్చగానూ, చంద్రుడు చల్లగానూ, కొండలు గట్టిగానూ, నీరుద్రవం

50)

గానూ ఉన్నవి. మనకు అమలులోనున్న అన్నివస్తువులూ పుట్టుటకూ, పెరుగుటకూ, నశించుటకూ, కారణము ఈచిత్పదార్థమే- ఇతనికి మరి యొకటి కారణములేదు- వియదాది పదార్థములకు పదార్థత్వము ఇతని వలననే ఏర్పడుచున్నది. మంచునకకు మంచి చల్లదనమేర్పడినట్లు, ఈతనినుంచి జగత్తు పుట్టినది. ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితి లయ ములకు కారణములు బ్రహ్మ విష్ణు రుద్రాదులు. వారికికూడా కారణం ఈచిత్పదార్థము- చిత్తు, చైత్యము, ద్రష్ట, దృశ్యము, అనే భేదాలు ఏవీ యితనియందు లేవు- స్వయం ప్రకాశుడు. అతడే నేను- కనుక నేను నాకు నమస్కారము- ఈ భూతములన్నీ ఈ చిత్పదార్థమునకు అవినాభూతములు- "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాది శ్రుత్యుక్త లక్షణము యితనియందే సమన్వయించుచున్నది- కారణము నందు కార్యము సూక్ష్మరూపములో నున్నను, అంతరాత్మయగు నీ చిత్పదార్థము సంకల్పించినదే ఉత్తరక్షణమందు పుట్టును- లేనిది పుట్టదు- ఘటపటాకారము లయిన చిత్పదార్థములన్నీ యీ చిదాదర్శ మునందు ప్రతిబింబించి యున్నవి- వృద్ధిక్షయాది వికారములుకూడా ఇతనియందే కల్పింపబడినవి- సూర్య ప్రతిబింబము నందలి వృద్ధిక్షయ ములు బింబసూర్యునియందు ఆరోపించినట్లు- ఈతత్త్వము అజ్ఞానులకు దృశ్యంకాదు- మనోనాశముయినవారలకు దృశ్యమవును. ఈ చిత్పదా ర్థము ఆద్యంతరహితము. సర్వాకారము- చరాచరవస్తువులకు అంత రాత్మరూపము- అనాదియొక్క స్థావరజంగమరూపములకు లెక్కలేదు. నేను సూర్యదేహంతో ఆకాశంలో విహరిస్తున్నాను- నేను శంఖచక్ర గదాధరుడనై ప్రపంచంలో విహరిస్తున్నాను. నేను పద్మాసనమందుండి నిర్వికల్పసమాధిలో నున్నాను- నేను త్రినేత్రుడనై ప్రపంచసంహార మును చేయుచున్నాను. దేవేంద్రరూపంతో త్రిలోకములను పాలించు చున్నాను. "త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉతవాకుమారీ। త్వం జీర్ణో దండేన వంచసి త్వం జాతో భవసి విశ్వతోముఖః॥" అను శ్రుత్యర్థమంతయు నాయందే అన్వయించును. నేను చిదూ్ర్భమినుండి

తృణలతా గుల్మాదులను పుట్టించుచున్నాను. ఆడుకునే పిల్లవాడు బురదమట్టితో బొమ్మలను తయారుచేసినట్లు నేను లీలార్థమై యీ ప్రపంచాడంబరమును తయారుచేశాను- నేనీ ప్రపంచాన్ని కారణ రూపంతో వ్యాపించియున్నాను. కార్యప్రపంచము యొక్క సత్త (ఉనికి) నన్నుపొంది తిరోభావమును చెందుతోంది- నాకు తత్త్వజ్ఞానం కలిగి నేను దీనిని విడిచినా జీవన్ముక్తవ్యవహారంలో ఉంటూనే ఉంటుంది. అయినా నన్నేమీ చెయ్యలేదు- చిదాదర్శంలో (చిద్దర్పణంలో) ప్రతిబింబించని వస్తువేదియు లేదు- నేను పుష్పాలలో పరిమళమును పద్మపత్రములందు కాంతిని, కాంతులందు లావణ్యమును (రూప కళను) రూపములందు అనుభవముకూడ నేనే- సర్వసంకల్ప రహితమయిన స్థావర జంగమ ప్రపంచమంతా నేనే- రసతన్మాత్ర రూపమయిన శక్తి పుంజీభూతమై సాగర నదీ సరః కూపాది జలస్వరూపమవుతుంది- అదే చెట్లయందు శాఖాపల్లవాదులు పుట్టుటకు కారణమవుతుంది. నేను నాకోరికచే సర్వపదార్థములలోను ప్రవేశించి చిత్రవిచిత్రములయిన జీవచైతన్యములను తయారు చేయుచున్నాను- పాలలో నెయ్యి నీటిలో రసశక్తి ఎలాగో సర్వవస్తువులందునూ చిచ్ఛక్తి అలాగే ఉన్నది జడమయిన యీ ప్రపంచం యావత్తూ మూడుకాలములందునూ, చిద్రూపుడనయిన నాయందు ఏకాంశంలో ఉండియున్నది- నేనీ ప్రపంచాన్ని వ్యష్టిభేదంతో తయారు చేశాను కనుక నేను విరాట్టును సమష్టిభావంతో తయారుచేశానుకనుక నాబ్రహ్మాండము- నేను ఇంద్రుని ఓడించలేదు- అసురులను (దేవతలను) శస్త్రములతో కొట్టలేదు- కావాలి అని కోరలేదు. అయినా యీ జగద్రాజ్యం నాపాల పడింది- ఆశ్చర్యము! ఎంతటి విస్తారమును చెందితిని? నా స్వరూపంలో నేను యిమడకున్నాను- ప్రళయకాల సముద్రం సముద్రపరిమాణంలో ఇమడనట్లు- నిరతిశయానందరూపముతో రుచివంతమయిన నా స్వరూపమునందు నేను నాశమొందుటలేదు. అత్యల్పమయిన యీ ప్రపంచమనే బ్రహ్మాండము అతి విస్తృతమయిన నాస్వరూపమునుతన శరీరము

నందు ఇముడ్చుకొనలేకపోతోంది. నాదురూపము విరించి లోకము కంటె ఆవలిది. ఇరువదినాల్గు తత్త్వములకంటెను, ముప్పదియారు తత్త్వములకంటెను పరమయినది. ఇంకా పెరుగుచునే ఉన్నది- ఇప్పటికిని మరలుటలేదు- ఇంతకాలమువరకు ఈదేహమే నేనను భావన నిరాధారంగా ఎలాకలిగింది నాకు? అపరిచ్ఛిన్నమయిన నారూపము నకు ఈపరిచ్ఛేద భావము ఉచితముకాదు- నీవు నేను వీడు వాడు అనే బుద్ధులు కేవలము భ్రాంతులు- దేహమేమిటి? అదేహమేమిటి? బ్రతికినవాడెవడు? చచ్చినవాడెవడు? నాతాత ముత్తాతలందరూ వట్టి పనికిమాలిన పేలవబుద్ధి కలవారయినారు. మోక్షసామ్రాజ్యాన్నివిడిచి, సంసారమనే మరుభూములలో రమించటం మరిగారు. బ్రహ్మభావంతో కూడిన మహాదృష్టి యెక్కడ? పాములకువలె దినదినగండముగాఉండే భయంకరమయిన రాజ్యవిభూతులెక్కడ? అన్నిదృష్టులలోకి పరిశుద్ధ మయిన చిన్మయదృష్టియే గొప్పది- కనుక సర్వవస్తువులలోను అంత ర్యామిగానుండి విషయసంబంధరహితమై ప్రత్యక్చేతనరూపుడనయిన నాకొరకు నేను నమస్కారము. నేనీ జీర్ణసంసారమును జయించాను. పొందతగిన ఫలంపొందాను- ఆత్మబోధ అనే సామ్రాజ్యం అత్యుత్తమ మయినది. శాశ్వతమయింది. దీన్ని విడిచి రాజ్యవిభూతులతో రమించను- లోకంలో దారుకీటకాలు దారువులో బ్రతుకుతూ ఉంటాయి- నీటి పురుగులు నీటిలో బ్రతుకుతాయి- రాతి సందులలో పుట్టే వృశ్చి కాదులు అందులో బ్రతుకుతాయి. అలాగే ఈ అనాత్మకుడయిన దానవకీటకం కూడా భూతలంలో ప్రభువని అభిమానంపెట్టుకొని దాన్ని విడవలేక ఆశపడుతోంది- అవిద్యామయములు అన్నపానాదులు- అవిద్యామయం శరీరం- వాటిలో దీనిని పోషించుచున్నారు లోకులు- మాతండ్రి యింతకాలం రాజ్యమేలి ఏమి పురుషార్థం సంపాదించాడు? ఆత్మానందం అనుభవించిక ఎన్నాళ్లు యెన్నిరాజ్యాలు ఏలినా వాడు ఏమీ అనుభవించినట్లుకాదు. మూర్ఖుడు ఆత్మానందాన్ని విడిచి విషయానందాన్ని అభిలషిస్తాడు. ఒంటె మంచితీగలను వదిలి ముళ్లు

కంచెలో దూకుతుంది- బోధదృష్టిని విడిచి తగలబడ్డ యీరాజ్యభోగాలలో ఎవడు రమిస్తాడు? చెఱకుపానకం వదిలి వేపాకురసం ఎవడు త్రాగుతాడు? నాతాత ముత్తాతలంతా వట్టిమూర్ఖులు- ఈదృష్టిని విడిచి సంకటములయిన రాజ్యభోగాలలో మునిగారు- నందనవన భూమి లెక్కడ? మరుభూమి లెక్కడ? బోధదృష్టి లెక్కడ? భోగదృష్టి లెక్కడ? మూర్ఖులుకోరే రాజ్యంలో ఏమీ సుఖంలేదు- చిత్తత్వంలో అంతా సుఖమే- సర్వవ్యాపకమయిన చైతన్యమునకు సుఖసాధనములన్నీ సులువుగా లభిస్తాయి- సూర్యునిలోని తేజశ్శక్తి చంద్రునిలోని అమృతశక్తి, హిరణ్యగర్భునియందలి మాన్యత (సర్వోత్కృష్టత) దేవేంద్రునియందలి త్రిలోకాధిపత్యము, శివునియందలి నిరతిశయానంద జ్ఞానైశ్వర్య పరిపూర్ణత్వము, ఉదకమునందలి ఆప్యాయకత్వము విష్ణువునందలి జయలక్ష్మీశక్తి, మనస్సునందలి శీఘ్రగామిత్వము, వాయువునందలి బలవత్వము, అగ్నియందలి దాహశక్తి, ఉదకమునందలి రసశక్తి, మునులయందలి మహాతపశ్శక్తి, బృహస్పతియందలి విద్యాశక్తి, గంధర్వులందలి ఆకాశగమనశక్తి, పార్వతియందలి స్థిరతాశక్తి, సముద్రనందలి గాంభీర్యశక్తి, మేరుపర్వతమునందలి ఔన్నత్యశక్తి, బౌద్ధులయందలి శాంతి, మద్యమునందలి మదలోలత, వసంతఋతువునందలి పుష్పమయత్వము, వర్షాకాలమునందలి మేఘగర్జనము, యక్షులయందలి మాయామయశక్తి, ఆకాశమునందలి నిష్కళంకత్వము, మంచుయందలి శీతతాశక్తి, గ్రీష్మఋతువునందలి తాపశక్తి, ఈ మొదలగు శక్తులన్నీ అనేకవస్తువులందు నిర్వికార చైతన్యముచేతనే కల్పింపబడినవి. చిత్రవిచిత్రములయిన పదార్థములందు చిచ్ఛక్తి సమానముగానే యుండును. పదార్థములందలి వైచిత్ర్యము దానికంటదు- సూర్యుని వెలుగు పురుషునియందెట్లు ప్రసరించునో అట్లే రాతియందును ప్రసరించును. పదార్థము భేదింపవచ్చు. చైతన్యము భేదించదు. కాలము భేదించవచ్చు. చిత్తు భేదించదు. దేశము భేదించవచ్చు. చిత్తు భేదించదు. దేశకాలవస్తుకృతమయిన భేదము దీనికిలేదు- రెండు మధురపదార్థములను, రెండు చేదు

పదార్థములను ఒకేదళ్ళా అనుభవించినమా, విషయభేదమేకాని అనుభూతిలో భేదములేదు- అలాగే ఘటపటాదులను ప్రత్యక్షముగా ఒకేమారు అనుభవించునప్పుడు, నాటిరెంటికి భేదమున్నా, వాని జ్ఞానమునకు మాత్రం భేదంలేదు-

కనుక ముందు మనసా దృశ్యపదార్థజాతం లేదని నిర్ణయించుకోవాలి- ఆపైన చిత్తం వానిని గూర్చిన శోకాదిపరిణామములను విడిచి పెడుతుంది- కాని రాగాది సంస్కారము (వాసన) మాత్రం వదలదు- పరమార్థ సదద్వైతానంద స్వభావుడయిన ఆత్మను సాక్షాత్కరించుకొను నంతవరకు ఈవాసనపోదు- కనుకనే గీతలో శ్రీకృష్ణుడు "రసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే" అని అన్నారు- కాలత్రయమందునూ విషయదృష్టి లేకపోతే సర్వోపశమమయిన శుద్ధచైతన్యమే మిగులుతుంది- ఈ ఆత్మతత్త్వము వాక్కులకందనిది కనుక లేనిదానివలె నైరాత్మ్య సిద్ధాంతాన్ని (శూన్యవాదసిద్ధాంతాన్ని) పొందినదివలె ఉన్నది- శాస్త్రీయవ్యవహారంలో ప్రత్యగ్రూపంలో బ్రహ్మపదార్థం ఉండియే యున్నది- పరమార్థదశలో నక్కలు ప్రవర్తించవు కనుక లేనిదివలె అగుచున్నది- ఇంక శబ్దప్రవృత్తికి నిమిత్తాన్ని కల్పించ దలచినచో, అన్నిశబ్దాలకు ప్రవృత్తినిమిత్తం కల్పించవచ్చు. కనుక అంతాబ్రహ్మమే- సంకల్పకల్పితమయిన (కూడిన) చైతన్యము ప్రపంచమును స్పష్టముగా గ్రహించలేదు- కంటికి గుడ్డచుట్టితే వస్తువు స్పష్టముగా గోచరించదు- కట్టివేసిన పిట్టవలె ఇష్టానిష్టసంకల్పములనే వలముతో కూడిన చైతన్యము లేచిపోలేదు- కళ్లులేని పక్షులు వలలో పడ్డట్లు సంకల్పవికల్పాలతో కూడిన మానవులు మోహజాలంలో పడుతున్నారు- సంకల్పములనే వలలోచిక్కుకుని విషయాలనే గోతులలోపడి, మాతాతముత్తాతలు నిరాబధమయిన మోక్షపదవిని కానలేకపోయారు- కనుకనే ఆదుర్బుద్ధులు కొద్దిరోజులలోనే మడిసిరి మశకములవలె- తత్త్వం తెలిసికొంటే మాత్రం ఈ సంసారాంధకూపంలోపడి ఉండేవారు కారువారు- ఇచ్ఛాద్వేషములవలన పుట్టిన ద్వంద్వమోహం

చేత మానవులు కీటములతో సమానులగుచున్నారు- తత్త్వజ్ఞానంచేత ద్వంద్వమోహాన్ని చంపుకున్నవాడే సార్థకమయిన జీవితము గలవాడు. చంద్రిక యొక్క కాంతులు (కిరణములు) వెచ్చగా నుండవు- నల్లగానూ ఉండవు. అలాగే చిత్తునకు కూడా కలనలు (కల్పనలు) ఉండవు. అవిచ్ఛిన్న చిదాత్మనయిన నాకు నమస్కారము- ఓ లోకాలోకామణీ! ఓ దేవా! ఎంతకాలానికి తెలియబడితివయ్యా! పరామర్శింపబడ్డావు- పొందబడ్డావు- పరమార్థరూపంతో అభివ్యక్త మయినావు చిరకాలానికి- సాంసారిక వికల్పాలనుంచి ఉద్ధరింపబడ్డావు- నీవు ఎలాంటివాడవో అలాంటి నీకో కదణ్ణము:- నాదురూపమయిన నీకు నమస్కారము- మేఘావరణములేని చంద్రబింబమువలె ఆనందైకరసమయిన పారమార్థిక స్వరూపంతో స్వయంప్రకాశమానమై వెలుగొందుచున్న నాదురూపమునకు నేను మ్రొక్కుచున్నాను.

౩౫౪. బ్రహ్మాత్మచింతనము.

ప్రశ్న॥ ఓంకారము సగుణ, (సప్రపంచ) నిర్గుణ (నిష్ప్రపంచ) బ్రహ్మస్వరూపము. (వాచకము)। ప్రపంచమంతా ఆబ్రహ్మస్వరూపము. బ్రహ్మ త్వగస్థిమాంస మేదస్సులతో కూడిన దేహముకంటె వేరయినను దాని లోపలనుండియే సర్వమును ప్రకాశింప చేయును. సూర్యగోళముములో నుండే సూర్యాదులను ప్రకాశింప జేయును- అగ్నిని వెచ్చపరచును. జలమును అమృతము చేయును- తన సత్తచేతనే ఇంద్రియములవల్ల స్పర్శాది భోగముల ననుభవించును- నిష్క్రియమయినను ఒకచోట నుండదు- ఎప్పుడు కాలరూపమున తిరుగుతున్నా కుమ్మరివాని చక్రమువలె నువ్వుగింజ మాత్రముకూడ దాటదు- శాంతుడయినా అన్ని వ్యవహారములూ అతనివే- ఎన్నికర్మలుచేసినా ఎన్ని కర్మల ఫలమనుభవించుచున్నా అతడు నిర్లిప్తుడే- సర్వభోగములందును సముడు- దృశ్యములయిన భోగములతో దృక్ స్వరూపమునకు వికారముంటదు- ఆత్మ వస్తుతః అభయుడు- తత్తత్కార్యానురూపమయిన

వస్తుజాలమును బ్రహ్మాదిస్తంబపర్యంతమయిన దానిని సృజించును- వానికధికరణములయిన లోకములను పదునాల్గింటిని సృజించెను- సాన్నిధ్యమాత్రముచే లోకములను త్రిప్పుచుండును. ఇదియే యితనికి కర్మఫలము. నిత్యాత్మసత్తయే స్పందసత్త- అందువలననే యితడు నిత్యస్పందమయుడు. నిత్యము నిష్క్రియుడు- నిత్యము (ఎల్లపుడు) నిర్లిప్తుడు అనగా గాలివలె నిత్యస్పందమయుడు- రాతివలె నిష్క్రియుడు- ఆకాశమువలె నిర్లిప్తుడు- మనస్సు మొదలగు పదునోకండింద్రియములను ఇతడు ప్రేరేపించును- దురవస్థాపరుడివలె కర్మరతుడై దేహగేహంలో ఉండి భోగములను అనుభవించును. ఇట్టి ఆత్మనే అన్వేషించాలి. స్తుతించాలి. ధ్యానించాలి. ఇతణ్ణి అన్వేషిస్తేనే జరామరణసంమోహాన్ని దాటగలరు లోకులు- జ్ఞానమాత్రంచేత పొందటానికి సులువుగా శక్యుడు- స్మృతిమాత్రంచేత వశపరచుకోడానికి యోగ్యుడు ఆప్తబంధువునివలె- శరీరమనే పద్మకుహరంలో తుమ్మెద లాగకున్నా పిలవకున్నా దేహంలోనేలభిస్తాడు- "కూ"అంటె క్షణంలో ఎదురుగా వస్తాడు- ఇతనిని యెంత సేవించినా ఇతనికి ఎంత సంపత్తిఉన్నా ధనికులకువలె గర్వంలేదు ఇతనికి. పువ్వులలో పరిమళం నువ్వుగింజలలోనూనె రసజాతులలో (పండ్లలో) మాధుర్యం ఉన్నట్లు ఉన్నాడు ఈ ఆత్మదేవుడు దేహంలో. హృదయంలో ఉన్నా విచారణ చేయనందున తెలియడంలేదు ఎవరికీ చాలాకాలంనుంచి చూడని బంధువువలె. విచారించి తెలిసికుంటే మహానందం కలుగుతుంది ప్రియమిత్రుని కలుసుకున్నట్లుగా ఈ నిరతిశయానందరూపుని తెలిసికుంటే జరామరణరాహిత్యానికి హేతువులయిన బుద్ధులు పుడతాయి- రాగాది పాశాలు తెగిపోతాయి- కామాది శత్రువులు నశిస్తారు- తృష్ణలు మనస్సును కత్తిరించలేవు- (ఛేదించలేవు) పట్లూడిన ఎలుకలు యిల్లు గుల్లచేయజాలవు- ఇతణ్ణి చూస్తే ప్రపంచం అంతా చూచినట్లే- ఇతణ్ణి వింటే ప్రపంచం అంతా విన్నట్లే, స్పృశిస్తే ప్రపంచం అంతా స్పృశించినట్లే. ఇతడు ఉంటే జగత్తుఅంతా ఉన్నట్లే- ఇతడు నిద్రించిన

వార్లలో మేలుకొని ఉంటాడు- పరిచ్ఛేదభావం గలవార్లను చావ కొడతాడు- ఆర్తుల ఆపదలను తొలగిస్తాడు- ఉపాసకులకు (వాంఛితా లను ప్రసాదిస్తాడు) కోర్కెలను తీరుస్తాడు- ప్రపంచ పరిస్థితిలో జీవుడుగాఉండి భోగములందు ప్రకాశిస్తాడు- అసాధారణమయిన జీవ భేదభ్రమలోకూడ సాధారణమయిన ఐకాత్మ్య స్ఫూర్తికి బాధలేదు. చేతనోపాధులందు పూర్వోత్తరానుసంధానం చేసికొనే తెలివిగలవాడు గానూ, వర్తమానవస్తువులను చూచువాడుగానూ ఉంటాడు. ప్రాపం చిక పదార్థముల సంభారంలో అధిష్ఠానసత్తా సామాన్యమాత్ర స్వభా వుడై సర్వానుగతుడై ఉంటాడు.

ఇతడు ఆకాశంలో శూన్యుడు. గాలిలో స్పందము. అగ్నిలో వెలుగు- నీటిలో మాధుర్యరసము. భూమిలో కాఠిన్యము. అగ్నిలో వేడిమి- చంద్రునిలో చల్లతనము. ఇతరవస్తు సామాన్యంలో సత్తా రూపుడు- అన్నివస్తువులందునూ ఇతడు అనుస్యూతమై ఉన్నాడు- నేను అద్వితీయుడను-నాకు ఇతర కల్పితవస్తువులతో సంబంధము లేదు. భూరేణువులతో ఆకాశమంటదు- నీటితో తామరాకు అంటియుం డదు- రాతికి భయకంపాదులతో సంబంధంలేదు- నాకితరవస్తువు లతో సంబంధంలేదు- సుఖదుఃఖాలు నాకు దేహంలో కలగనీ కలగక పోనీ నాకేమీ సంబంధంలేదు. పారకాయబుర్రకు నీటిధారలతో బాధ లేదు. దీపపు వెలుతురును త్రాటితో కట్టలేము- అలాగే ప్రపంచా తీతుడయిన పరమాత్మ బద్ధుడు గానేరడు- మాకు లేనిపోని యింద్రి యములతోకాని యింద్రియవృత్తులతోకాని యేమి ప్రయోజనము? ఆకాశము దేనితో అంటుతున్నది? మనస్సు దేనిచే కొట్టబడుచున్నది? అలాగే శరీరాన్ని నూరు ముక్కలు చేస్తేమాత్రం ఆత్మకు కలిగెడి హానియేమి? కుండ పగిలితే కుండలోని ఘటాకాశం పగులునా? దయ్యం వలె కనుబడకుండా బాధిస్తోంది మనస్సు. జడమయిన మనస్సు నశిస్తే మనోవ్యతిరిక్తాత్మజ్ఞానంచేత ఆత్మకు చెరుపేమి? సుఖదుఃఖమయ

మయిన వాసనయే అజ్ఞానదశలో మనస్సు అయింది పూర్వం- ఇపుడు నాకు అపరిచ్ఛిన్నానందం కలిగింది జ్ఞానంచేత- చూచేవాడు ఒకడు- గ్రహించేవాడు మరొకడు- అనుభవించే వాడొకడు- సంకటపడేవా డొకడు- చక్రమువలె గుండ్రముగా త్రిప్పే చాతుర్యం యెవరిది ఇది ? ప్రకృతి అనుభవిస్తుంది. మనస్సు దేహము సంకటపడుతుంది- ఆత్మకు ఈసంకటం నాదనే భావం ప్రకృతివల్ల కలిగిన మూర్ఖము- కేవలమయిన ఆత్మకు ఏబాధాలేదు- నాకు భోగముల మీద వాంఛలేదు. అవి వద్దని కోరికలేదు- వచ్చేదిరానీ- పొయ్యేదిపోనీ- నాకు సుఖం మీద అపేక్షలేదు. దుఃఖములమీద ఉపేక్షాలేదు. సుఖదుఃఖాలు వస్తేరానీ పోతే పోనీ- నేనెవడను వాటిని రమ్మంటానికీ, పొమ్మంటానికీ- నాశరీరంలో అనేకరకాల వాసనలు పుట్టుచున్నవి- నశించుచున్నవి. వాటితో నాకేలాటి సంబంధమూ లేదు. వాటికి నాతోను ఏలాటి సంబంధమూ లేదు-

ఇంతకాలమువరకు నన్ను అజ్ఞానమనే శత్రువు చావకొట్టాడు. నావద్దనున్న వివేకమనే సర్వస్వాన్ని నాశంచేశాడు- అపహరించాడు. ఈశ్వరానుగ్రహంవల్ల నేను వానిని చంపాను- నావివేకం నేను తెచ్చుకున్నాను. నాశరీరమనే చెట్టుతొర్రలో అహంకారమనే పిశాచం౦డేది. పరమాత్మజ్ఞానమనే మంత్రంచేత ఆపిశాచాన్ని వదల్చుకున్నాను. ఇపుడు నాశరీరమనేచెట్టు నిరహంకారమయింది. పిశాచంలేనిదయింది. పుణ్యవంత మయింది. మోహమనే దారిద్ర్యం పోయింది. దురాశలనే దోషాలు పోయినవి- వివేకమనే ధనరాసులు సంప్రాప్తమయినవి. తెలియవలసిన వానిని తెలిసికొన్నాను. చూడవలసినవానిని చూచాను. పొందదగిన వానిని పొందాను. ఇంక నాకు మిగిలినదేదీలేదు. పారమార్థికమయిన తావుచేరాను- ఇక్కడ ఏవిధమయిన అనర్థాలూ లేవు. విషయములనే సర్పములులేవు మోహమనే మంచులేదు- ఆశలనే ఎండమావులులేవు- రజోగుణంలేదు- శమదమాదులనే చల్లని వృక్షములుగలవు- శ్రీ

మహావిష్ణువును స్తుతించి మ్రొక్కి ప్రార్థించి శమదమాదినియమము లతో ఆత్మసాక్షాత్కారం చేసికొన్నాను- చాలకాలమునుంచి అహంకారముయొక్క అడుగుజాడను బట్టి సంసారంలో పడినాను- ఇంద్రియములనే పాములపుట్టలో ప్రవేశించాను. మరణమనే మురికిగోతులో కూలిపోయాను. తృష్ణ అనే పొదలో చొచ్చాను- వాసనలనే అడవులలో చిక్కుకున్నాను- జన్మజరలనే పాడుబావులలో పడ్డాను- దుఃఖములనే దావాగ్నులచే దగ్ధమయినాను- ఎగరవేయుట, పడవేయుట, ముంచుట, లేవనెత్తుట, పుట్టించుట, చంపుట, మొదలయిన చేష్టలతో మహాహింసపెట్టాడు అహంకారమనే శత్రువు నన్ను.

ఆ శ్రీమన్నారాయణమూర్తి అనుగ్రహంచేత నాకు స్వయంగానే ఆత్మబోధ కలిగింది. యిప్పుడు రాక్షసుడు (అహంకారము) కనిపించడు ఎక్కడా- అతనిజాడలేదు ఎక్కడా- హృదయగతుడయిన పరమేశ్వరుని సాక్షాత్కారంచేసికొనేసరికి అహంకారమనే చోరుడు పలాయనపరాయణుడయినాడు. తెల్లవారగానే దొంగ పలాయితుడయినట్లు- అజగరం లేచిపోయిన చెట్టువలె ప్రశాంతంగా ఉన్నానునేను. దొంగ చేతులోనుంచి విడువబడితినని సంతోషంగా ఉన్నాను- దవాగ్నిచే కాలి చల్లారిన కొండవలె ఉన్నాను-

ఆత్మవిచారంచేత అహంకారము నశిస్తే ఇంక మోహమేమిటి? దుఃఖములేమిటి? ఆశలేమిటి? ఆధులేమిటి? నరకము స్వర్గము మోక్షము మొదలగు భ్రాంతులు అహంకారమున్నపుడుకదా! గోడమీద బొమ్మలు వేయుట కుదురునుకాని ఆకాశంలో కుదురదుకదా! గుడ్డ మకిలగా ఉంటె కాషాయరంగు అంటదు- అహంకారమనే మైత్యం ఉంటే చిత్తంలో జ్ఞానముయొక్క చమత్కారము ప్రకాశించదు- అహంకారమనే మేఘంపోతే తృష్ణ అనే ధారావర్షం ఉండదు- అపుడు చిత్తమనే శరత్కాలనభస్సు స్వచ్ఛంగా ఉంటుంది.

అహంకారమనే బురదలేక అతినిర్మలంగా ఉన్న ఆనందైకరసుడ నయిన నాకొరకు నేను నమస్కారము- ఇంద్రియములనే మొసళ్లు లేచి పోయి చిత్తమనే బడబాగ్ని చల్లారిన ఆనందాబుధియగు నాకొరకు నేను నమస్కారము- అహంకారమనే మేఘం తొలగిపోయి ఆశలనే దవాగ్నిచల్లారిన ఆనందశైలమయిన నాకొరకు నేను నమస్కారము. ఆనందమనే పద్మములు వికసించి చితలనే తరంగాలు తగ్గిపోయిన స్వరూపబ్రహ్మ అనే మానససరస్సు అయిన నాకొరకు నేను నమస్కారము. బుద్ధి బుద్ధివృత్తులనే శుక్లకృష్ణపక్షములు గలిగి, పద్మములనే కోటరములలో (తొర్రలలో) నివసిస్తూ సర్వమానసములనే సూర్య రూపుడనయిన నాకు నేను నమస్కారము.

షోడశకళలతో కూడుకొని స్వతః నిరవయవుడై సదా వృద్ధిలో నుండి పరిపూర్ణుడయిన చంద్రరూపుడనయిన నాకొరకు నేను నమస్కారము- హృదయమునందలి అజ్ఞానాంధకారమును పోగొట్టుచూ నిత్యమూ ఉదయించి యుండి సర్వవ్యాపకుడయినను అదృశ్యుడయిన సూర్యరూపుడనయిన నాకొరకు నేను నమస్కారము-చమురు వత్తి లేక స్వతస్సిద్ధముగా వెలిగెడి చిద్దీపమయిన నాకొరకు నేను నమస్కారము.

నేను శమాదిగుణయుక్తమయిన మనస్సుచే మదనానల సంతప్త మయిన మనస్సును ఛేదించాను- ప్రత్యక్ప్రవణమయిన యింద్రియము లతో పరాక్ప్రవణమయిన మనస్సును ఛేదించినాను. ప్రత్యక్ప్రవణ మయిన మనస్సుచే విషయాభిముఖమయిన మనస్సును తెగగొట్టితిని. చైతన్యాభిముఖమయిన అహంకారముచే అహంత్మాభిముఖమయిన అహంకారాన్ని చంపుకున్నాను, ఇపుడు కేవలజ్ఞప్తిమాత్ర స్వరూపుడ నయినాను- బ్రహ్మోఽహంభావంచేత దేహాదులయందలి అహంభావం పోయేసరికి నేను కేవలము స్వచ్ఛస్వరూపుడ నయినాను.

ఇపుడు నా శరీరము బుద్ధిశూన్యమూ, చిత్తశూన్యమూ, ప్రాణ శూన్యమూ అయిన శుద్ధాత్మరూపంలో ఉన్నది- తృష్ణ అనే త్రాడు

తెంచుకొని నాశరీరమనే పంజరమునుండి దురహంకారమనే పక్షి యెక్కడకు ఎగిరిపోయిందో తెలియదు- అజ్ఞానమనే గూటిని పీకి పారవేసే సరికి అహంకారమనే పిట్ట శరీరమనే చెట్టునుంచి యెచ్చటకు ఎగిరిపోయినదో తెలియదు- భోగవాసనలన్నీ సమాధిచే ఉచ్ఛిన్నము లయినవి- ఇంతకాలమువరకు నేను వృధాగా అహంకారశీలుడనై ఎవనినిగా ఉన్నానో కదా ఆశ్చర్యం. ఇపుడు నేను నిరతిశయానంద రూపుడను. పరమాత్మను. నాకు అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మసాక్షా త్కారవృత్తి కలిగింది నాకు. అహంకారమనే నీలమేఘము తొలగి పోయేసరికి-

ఇపుడు నామనస్సు నిర్విషయము- సంకల్పరహితము- ఏషణ రహితము- అహంకారభ్రమాదులతో దూరాపాస్తము- నిశ్చేష్టము- భోగాభిలాషావిరహితము- కనుకనే ప్రశాంతము- గొప్పగొప్ప ఆపద లన్నీ రూపుమాసినవి- పరిపూర్ణానందాత్మ ప్రాప్తించాడు- జ్ఞానంచేత అజ్ఞానజాడ్యం పోయింది.

## ౩౫. ప్రహ్లాద కృతాత్మస్తవనము.

ప్రహ్లా॥ మానుషానందము మొదలు హిరణ్యగర్భానందమువరకు నుండు ఆనందములకు ఆవలివాడయిన నిరతిశయానందరూపాత్మ లభిం చాడు నాకు అదృష్టవశంచేత- అయ్యా! మీకొక నమస్కారం- మీకుమ్రొక్కాను- మిమ్ము సాక్షాత్కరించుకున్నాను- కౌగలించు కుంటున్నాను- మహాత్మా! యీ ముల్లోకములలో మాకు మీకంటె బంధువెవరు? నీవు అభక్తులను హింసిస్తావు- భక్తులను పాలిస్తావు- ఉపాసకులకు అభీప్సితములను ఇస్తావు- స్తావకరూపముతో స్తుతిస్తావు. గంతృరూపముతో నడుస్తావు- సర్వరూపముతో వ్యవహరిస్తావు- అలాంటి నీవు యిపుడు నాకు ప్రత్యక్షమయినావు. ఇంకెక్కడకు పోయెదవు? ఓ సత్తాపూరితాశేషవిశ్వా! (ఉనికిచే సకల ప్రపంచమును

నిండియున్నవాడా ?) ఓ విశ్వజనీనా ! (సకలజనహితుడా !) అంతటా నీవే గోచరిస్తున్నావు నాకు. ఇంకెచటికి పరుగెత్తేదవు ! మన యుభయులకు అనేకజన్మలు దూరమును కలిగించే అజ్ఞానమనేది ఉండేది పూర్వం- ఇపుడు అది నశించింది. కనుక అత్యంతా భేదలక్షణమయిన సామీప్యం కుదిరింది.

ఓ కృతకృత్యుడా ! కర్తా ! భర్తా ! సంసారవృంతమా! (సంసారమనే ఆకుతొడిమవంటివాడా!) నిర్మలుడా! చక్రాబ్జహస్తా! (విష్ణూ!) ఓ చంద్రార్ధధారీ! (శివా!) విబుధనాథా! (దేవేంద్రా!) పద్మజన్మా! (బ్రహ్మదేవుడా!) నీకు నమస్కారము- మన యుభయులకు వ్యవహారదశలోనే భేదము- అదియూ లేనిపోని కల్పనామాత్రం నిజంకాదు. నీవే అనంతవిచిత్రవస్తురూపంతో ప్రవాహాదిత్యత్వంతో భాసిస్తున్నావు. మొదట ద్రష్టవై తరువాత స్రష్టవై తదుపరి అనేకరూపములతో ప్రకాశించువాడవై అవల సర్వాధిష్ఠానరూపంతో సర్వగుడవయిన నీకు దండము.

ఇంతకుముందు ప్రతిజన్మలోనూ నీవే నాజీవరూపుడవై కామక్రోధాదిదోషములను చెంది చెడుత్రోవలోపడి నీస్వరూపమునూ మహిమనూ చెడగొట్టుకొని ఊర్ధ్వాధోలోకములకు తిరిగావు- ప్రాపంచిక భ్రాంతులకు గురిఅయినావు- బాహ్యదృష్టిలో పడినందున నిన్ను నీవు పొందలేకపోతివి- ముల్లోకాలు తిరిగినా కొద్దిపాటి పురుషార్థం కూడా నీకు సంప్రాప్తంకాలేదు- మృత్కాష్ఠ పాషాణ జలమాత్రమయినదే యీ ప్రపంచం అంతా. ఇందులో నీవు మినహా పరమార్థం ఏమీలేదు. దేవా ! ఇపుడు నీవు ప్రాపంచిక పదార్థాలను విడిచిపెట్టావు. నిన్ను నీవు తెలిసికొన్నావు. పొందావు- గ్రహించావు- మోహాన్నితరించావు- అయ్యో ! నీకొకదండము- కంటినుంచి బయలువెడలిన అంతఃకరణము యొక్క- వృత్త్యవచ్ఛిన్న చైతన్య స్వరూపుడవయిన నీవు మాకు కనిపింపకుండుట ఆశ్చర్యము. త్వగింద్రియాన్ని స్పృశించి యున్నావు- జ్యోత్స్నా

దికమును స్పృశించిఉన్నావు- గంధాన్ని స్పృశించి ఉన్నావు. నువ్వు గింజలో నూనెవలె ఉన్నావు. లోపలఉండి వానినన్నిటిని ప్రకాశింప చేస్తావు కాని బయటికి ఒక్కడికీ కనిపించవే! ఇదేమిచిత్రం. నీవు శ్రవణేంద్రియంలో ఉండి శబ్దశక్తిని (గాన కావ్య పురాణాది గుణచమత్కారాన్ని) ప్రకాశింపచేస్తూ శరీరంమీద రోమాంచం కలిగిస్తూకూడ ఎక్కడో దూరంగా ఉన్నట్లు కనిపించవే ఇదేంచిత్రం? జిహ్వేంద్రియాన్ని అంటిఉంటావు- జిహ్వా పల్లవం మీద పడిన మధుర ఆమ్లాది వస్తువుల రుచిని తెలుపుతావు. సుఖ స్వరూపుడవయిన నీయొక్క రుచి మాత్రం చిక్కనీయవు. సుగంధ పుష్పాలను మాలగాకూర్చి మెడలో వేసికొని దేహం అలంకరించు కుంటావు. నీవుమాత్రం చేతులోచిక్కవు వేదవేదాంత సిద్ధాంత తర్కపురాణ గీతాలతో తెలియబడుతూకూడ క్షణంలో మరపుకువస్తావే నీవు ఏమిటో విచిత్రం.

నిన్నుచూచిన తరువాత మాత్రం నాకీశరీరభోగాలు రుచించడం లేదు సూర్యుని ప్రకాశింపచేసేది నీవు- చంద్రుని ప్రకాశింపచేసేది నీవు- రాతిని బరువుగా చేసేదినీవు- గాలి మున్నగువాటిని ఆకాశంలోనిలిపేది నీవు- పంచభూతాలను నిలపెట్టిందనీవు- అదృష్టవశంచేత నీవు నేనయినావు నేను నీవయినాను- నేనేనీవు- నీవేనేను- మనయిద్దరకూ ఏమీ భేదంలేదు- "త్వం" "అహం" "నీవు" "నేను" అనే శబ్దాలు రెండూ లక్ష్యార్థమును బోధించడానికి పర్యాయములు. ఒకే శాఖనుంచి చీలినవి- నీవు అనే శబ్దము కారణోపాధితో కూడిన వాచ్యార్థమును చెపుతుంది. "నేను" అనే శబ్దము కార్యోపాధితో కూడిన వాచ్యార్థమును చెపుతుంది. కనుక ఇవిరెండు ఉపాధిని చెప్పునవే- అందువల్లనే పర్యాయములు. వాటికొక దండము.

నేను సర్వవ్యాపకుడను- నిరహంకారరూపుడను- నీరూపుడను- సర్వసముడను- దిక్కాలాద్యనవచ్ఛిన్నుడను. నిర్మలుడను- సాక్షి రూపుడను- స్వరూపప్రతిష్ఠితుడను- అట్టివాడు అఖండస్వరూపమునకు నమస్కారము-

పరమాత్మా ! నీవు నాఆత్మయందు ప్రత్యగ్రూపంతోనే ఉన్నావు కాని పరాగ్రూపంతో లేవు- నాలోపలనున్న మన ఆది యింద్రియములను నీవు ప్రేరేపించుటచే నాకీవిషయం తెలిసింది- కనుక నారూపమయినసీవు సంవిచ్ఛరీరడవుకాని ఒకానొక శక్తిని ధరించినవాడవు కాదు- శరీరం పడిపోవుగాక- ఉండుగాక- దానియిష్టం- నాకేమీ సంబంధంలేదు దానితో- చాలాకాలానికి నేను నేనయినాను- స్వాత్మలాభము (స్వస్వరూపప్రాప్తి) కలిగింది- ఇంతకాలానికి ప్రపంచభ్రాంతి నశించింది ప్రళయంలోవలె- చిరకాలం సంసారంలో ఉండి అలసితిని కనుక ఇపుడు దీర్ఘవిశ్రాంతిని పొందాను- సర్వాతీతుడవును సర్వస్వరూపుడవును అయిన నీవు అనే నాకొరకు నమస్కారము- నేనే నీవని చెప్పేవాళ్ళకు కూడా ఒక్కదండము-

నీదుసాక్షిత్వము అంతులేని భోగములను ప్రకాశింపజేయును. అయినా వాటిదోషాలతో అంటదు- వాటిమీద అభినివేశం ఉండదు- అట్టిది పరమాత్మయొక్క సాక్షిస్వరూపము- అహంకార రూపుడవు కాకున్నా (అహం అను భావములేకున్నా) అన్నిటియందూ ఉన్నావు నీవు- అన్నిపనులూ నీవే- నీవు లేనిదే ఏపనీ లేదు- చిత్రంగా ఉంది నీమాయ- నేను నీరూపుడనే కనుక సృష్టిప్రారంభంలో జీవరూపంతో ప్రవేశించి నామరూపాత్మక ప్రపంచాన్ని ప్రకటింపచేస్తున్నాను- నీ రూపంతోటే నేను జగత్తు వశపరచుకొని పాలించుచున్నాను. ప్రళయకాలంలో ప్రపంచమును ఉపసంహారము చేయుచున్నాను. నాకు ఎప్పుడూ నీకంటె వేరురూపములేదు- నీవు పరమాణువువలె అతి సూక్ష్ముడవు గుర్తింప సాధ్యుడవుకావు. అయినా అలాంటి నీయందు యీమొత్తం ప్రపంచం అంతా యిమిడి ఉంది- మర్రిగింజలో విశాలమయిన మర్రిచెట్టు ఉన్నట్లు-

ఆకాశమున ఉన్న మేఘాన్ని చూచి కొందరు గుర్రమని భ్రాంతి పడతారు. మరికొందరు ఏనుగని భ్రాంతిపడతారు కొందరు రథమను

కుంటారు. అలాగే నీయందుకూడా అనేకవందల పదార్థభ్రాంతులు కలుగుతున్నాయి ప్రజలకు. ఉన్నదిమాత్రం నీ స్వరూపం ఒక్కటే ప్రపంచం అంతా వ్యాపించిఉంది- ఇకముందు ముక్తాత్మ అయిన ప్రహ్లాదుడు స్వాభిన్నుడయిన బద్ధాత్మకొఱకు మోక్షోపాయాన్ని ఉపదేశిస్తాడు.

ప్రహ్లా॥ ముముక్షువయినవాడు వికారశీలములయిన పదార్థములను బాధించుటకూ నిరతిశయానందస్వరూపమును పొందుటకును అసంగాత్మజ్ఞానమును సంపాదించుకొని బాహ్యవస్తువులను త్రోసిరాజంటూ ఆత్మభావనతోనే ఉండాలి-

ముందుగా కోపాన్ని రూపుమాపుకోవాలి. కాపట్య క్రౌర్యాలను తుడిచిపెట్టుకోవాలి. ఎంతటి మొనగాళ్ళయినా ప్రాకృతగుణాలవల్ల కలిగే సంకటాలలో మునిగిపోతారు. "నేను ఎవరు? ఇదియేమిటి?" అని ముందుగా విచారించుకొని తరువాత ప్రపంచాన్ని పరిహసించి వెనుకకలిగిన దౌరాత్మ్యావస్థను మాటిమాటికి స్మరించుకొంటూ చింతింపకోవాలి- వెనుకటి పనులన్నీ అయిపోయినవి ఆరోజులు గడచిపోయాయి. అప్పుడు నీవు మనశ్చింతలనే అగ్నిమంటలతో వ్యాప్తమై ఉండేవాడవు ఆరోజులు అంతరించాయి. ఇప్పుడు నీవు నీ శరీరంలో రాజువయినావు- ఇప్పుడు నీకు సుఖదుఃఖాలు అంటవు. ఇంద్రియాశ్వములను జయించి మనస్సు అనే మదపుటేనుగును వశపరచుకొని భోగాలనే శత్రువులను నాశంచేసి సామ్రాజ్యం ఏలుతున్నావు.

అంతులేని ఆకాశమార్గంలో బాటసారివి నీవు. నీకు ఎల్లప్పుడూ ఉదయాస్తమయములులే. నిత్యం ప్రకాశరూపుడవే. ఇలాంటి భాస్కరుడవు నీవు- కాని అనాదికాలంనుంచి అజ్ఞాననిద్రలో నిద్రించియున్నావు. భోగానుభవలీలకొఱకు లేపబడుచున్నావు- కామినీస్త్రీ నిద్రించెడి కాముకపురుషుని లేపినట్లు. కనుకనే నీ చిచ్ఛక్తి నేత్రాది ఇంద్రియములనే గవాక్షములందుండి ఇంద్రియవృత్తులనే తేనెటీగల ద్వారా

రూపాదులనే మకరందమును అనుభవిస్తోంది. (పానంచేస్తోంది.) ప్రాణాపాననిరోధాభ్యాసంగల యోగులకు బ్రహ్మరంధ్రమును భేదించుకొని సుషుమ్నానాడీకుండా వెళ్లుటకు గల మార్గములను నీవే తెలుపుచున్నావు-

నీవు దేహాపుష్పంలో పరిమళం- దేహమనే చంద్రునిలో అమృతము- దేహమనే చిగురాకులో మకరందము- దేహమనే మంచుగడ్డలో చల్లతనము- దేహమనే పాలలోమీగడ- లేక ఆజ్యము- దేహమనే చెట్టులోనిప్పువు- అతిమధురమయిన అమృతరూపుడవు- సూర్యాదులకు భాసకుడవు- వాయువులకు స్పందరూపుడవు- మనస్సు అనే ఏనుగునకు మదము నీవు- ప్రజ్ఞ అనే అగ్నిజ్వాలయొక్క దహన ప్రకాశశక్తులునీవు- నీకుస్వాధీనమై మాయొక్క వాక్కు మరణమూర్ఛా స్వప్నములందు ఉపశమించుచున్నది. ఇతర సమయములందుమాత్రం పుట్టుచున్నది- అదెందువలననో తెలియకున్నది. ప్రపంచపదార్థాలు నీయందు సువర్ణంలో కటకకేయూరములవలె ఉన్నవి- నీవు ఒక్కడవే "వాడు వీడు" "నీవు నేను" అనే శబ్దాలతో చెప్పబడుచున్నావు- ఆకాశంలో మేఘం కొద్దిగాలికి మెల్లగా కదులుతూఉంటే తెలియనివాళ్లు "ఏనుగనీ, గుర్రమనీ, మనుష్యుడనీ" అనుకుంటారు క్రిందఉండి. బ్రహ్మాండాలు అనే ముత్యాలహారం కూర్చటానికి దారం నీవు- భూతములనే సస్యములకు క్షేత్రము (పొలము). నీవు అసత్ప్రాయమయిన అవిద్యాబీజంలో ఉన్న పృజ్యవస్తు వస్తువుల యొక్క స్వరూపం ప్రకాశింప చేస్తావు- వస్తువులో శోభఉన్నా నీవులేకపోతే ఉండదు అది. వనితయొక్క రూపం ఎంతలావణ్యంగా ఉన్నా ఆమె గ్రుడ్డిదయితే ఆలావణ్యం రాణించదు- అర్థక్రియాశక్తితో నీవు అనుగ్రహించకపోతే ఆవస్తువు అర్థక్రియాకారి కానేరదు- అద్దంలో ప్రతిఫలించిన కాంతల శరీరలావణ్యముకాని, ముఖసౌందర్యముకాని, చుంబనాలింగనాధరాస్వాదనాది పనులతో తృప్తి చెందుటకు ఉపయోగపడదు- నీవు లోపలలేకపోతే యీ శరీరము కాష్ఠలోష్ఠప్రాయమై పొరల వలసి

నదే- చీకటిరాత్రులలో కొండ చెట్లూ యెంతయెత్తుగా ఉన్నా ప్రకాశించక పొయ్యేసరికి నిరర్థకమే ఆ ఔన్నత్యము- సూర్యుని ఆశ్రయించి దీపాదుల కాంతికాని మంచుకాని నశిస్తుంది- నిన్నుపొంది సుఖదుఃఖ క్రమంనశిస్తుంది-సూర్యుని ప్రకాశఉంటేనే ప్రాతఃకాలంలో శుక్లనీలాది వర్ణములు కనిపిస్తాయి- నీవు లోపలఉంటేనే సుఖదుఃఖాలు గోచరిస్తాయి- లేకపోతే గోచరించవు- అలాంటి సుఖదుఃఖాలు కూడా నీయొక్క చరమసాక్షాత్కారం కలిగేసరికి నశిస్తాయి దీపాన్ని చూచి చీకట్లు నశించినట్లు- సుఖదుఃఖముల శోభకూడా నిన్నుచూచి(నీతత్త్వాను చూచి) పుట్టుతుంది. నీయొక్క నిజతత్త్వం ప్రత్యక్షం చేసికొనేసరికి సమూలం నశిస్తుంది- ఒక్కక్షణకాలం కూడా ఉండలేదు- మిథ్యాభూతమయిన యీ సుఖదుఃఖాది భావన స్థిరంగానూ సత్యంగానూ స్ఫురిస్తుంది. నీ సాక్షాత్కారానంతరం అంతుచిక్కదు. ఇది చచ్చిన వస్తువు మరలకలలోకి వచ్చినట్లూ కలలోకనిపించినవస్తువు జాగ్రదవస్థలో మరలచచ్చినట్లూ ఉన్నది- ఉత్పలాకారమయిన తరంగాలతో మాలకూర్చటం సాధ్యంకాదు- క్షణకాలమయినా స్థిరంగా ఉండని వస్తువులతో పనిజరగటం సాధ్యంకాదు- క్షణికవస్తువులతో పనినెరవేరే యడల మెరుపుతీగలతో మాలకూర్చి మెడనవేసికొని నాట్యమాడవచ్చు. ఇంతటి దుర్ఘటమయిన సుఖదుఃఖాదిశోభను వివేకవంతుల చిత్తంలో ఉండి గ్రహించుచునే ఉన్నావు- కాని సమస్థితిని మాత్రం విడిచిపెట్టవు. ఇదే అవివేకులకంటె వివేకులందలి విశేషము. అవివేకులందు నీవు యేరూపంలో ఉండేదీ నేను చెప్పజాలను. వారల వికల్పాలకు అంతములేదు. ఒక నియమమూలేదు. నీకు వారు కల్పించే నామరూపాలకు పరిమితిలేదు. కాబట్టి నేను చెప్పజాలను. దీనికంతకూ కర్తృత్వాధ్యాసయే మూలకారణము. అతి విస్తృతాకారా! నీకు జయము, సర్వాగమాస్పదా! నీకు జయము- సర్వప్రమాణవేద్యా! నీకుజయము- పుట్టినవాడా! నీకుజయము- పుట్టుకలేనివాడా! నీకు జయము- నశించెడివాడా! నీకుజయము- నాశరహితుడా! నీకుజయము-

భావపదార్థరూపుడా! నీకుజయము- అభావపదార్థరూపుడా! నీకు జయము- జయింపతగినవాడా! నీకుజయము- జయింపతగనివాడా! నీకుజయము- సంతోషించుచున్నాను- ప్రకాశించుచున్నాను- శాంతించుచున్నాను- ప్రారబ్ధశేషమునుజయించుటకు జీవించుచున్నాను- నాకు నేను నమస్కారము- నేను నీరూపుడనయి యుండగా నాకు జన్మమరణము లెక్కడివి? సంపద్విపత్తు లెక్కడివి? బంధమోక్షము లెక్కడివి? కనుక శాశ్వత సుఖంలో విశ్రమించాను.

గమనిక- ఇచట ప్రహ్లాదుడు వివేకి అవివేకు లిద్దరకు ప్రసిద్ధమయిన రూపంలో ఆత్మను స్తుతించాడని గ్రహించవలెను-

ఇట్లు ఆత్మ స్తవనము ముగిసెను.

## 32. అసురమండలము వ్యాకులపడుట.

వసి॥ రామా! ఇలా ఆత్మచింతన చేస్తూనే నిర్వికల్పపరానంద సమాధిని పొందాడు ప్రహ్లాదుడు- చిత్రవులోని కొండవలెనూ చెక్కిన రాతిబొమ్మవలెనూ నిశ్చలంగా ఉన్నాడు- ఇలా తనయింటిలో చాలా కాలం గడిచింది అతనికి. భువనముల మధ్యనున్న మేరుపర్వతమునకు వలె- అకాలంలో ఎంత తడిపినా విత్తునుంచి మొలకరానట్లు అసురాధీశులు ఎంతలేపినా తెలివిరాలేదు అతనికి- (ప్రహ్లాదునికి) ఇలా కొన్ని వేల సంవత్సరాలు గడచాయి తదేకదృష్టితో- పరమానందంలో మునిగి చూచేవారికి మరణించినవానివలె దేహ మాత్రావశేషంగా ఉన్నాడు-

ఇంతలో పాతాళలోకం యావత్తూ అరాజకమయినది అతి ఘోరంగా- మాత్స్యన్యాయం ప్రబలింది. బలవంతులు దుర్బలులను పీడించుట ప్రారంభించారు- హిరణ్యకశిపుడు మరణించాడు. కొడుకు ప్రహ్లాదుడు సమాధిలో నున్నాడు- మరొకడెవడూ రాజ్యానికి అధికారి కాలేదు. దానవులు ఎంతప్రయత్నించినా ప్రహ్లాదునకు మెలకువరాలేదు

సమాధినుంచి- సూర్యాస్తమయానంతరం రాత్రి నిద్రించిన పురుషులు స్నాన దాన ప్రస్థానభావనాది చేష్టలు చేస్తారనే ఆశ వుట్టుండదో అలాగే యింక అసురాధిపుడయిన ప్రహ్లాదుడు ప్రభోధావస్థలోకి వస్తాడనే ఆశకూడా తీరిపోయింది దానవులకు- అందరూ భయపడ్డారు- దొంగలవలె యథేచ్ఛం తిరగడం ప్రారంభించారు. దుర్బలుల పట్టణము లను బలవంతులు ఆక్రమించుకున్నారు- ఆడువారు అన్నిరకములా బాధింపబడ్డారు- కట్టు పైగుడ్డలు దక్కటం కష్టమయింది. దేవతల పిల్లలకు కూడ చులకనయినారు దానవులు. నానారకాల బాధలకు గురిఅయినారు. అసురమండలం అంతా వ్యాకులమై పోయింది.

## ౩౪. పరమేశ్వర వితర్కము.

వసి॥ రామా! ఇలా కొంతకాలంకాగా అఖిలజగజ్జాలమునూ క్రమంగా పరిపాలించడానికి కంకణంకట్టుకున్న శ్రీమహావిష్ణువు కార్తీక శుద్ధ యేకాదశినాడు క్షీరసముద్రంలో మేలుకున్నాడు. దేవతలకొరకు ప్రపంచపరిస్థితిని ఒక్కమారు పరికించాడు- మనసా స్వర్లోకస్థితినీ భూలోకసంబంధమయిన ఆచారక్రమాన్ని పరిశీలించాడు- ఆవల పాతాళలోక పరిస్థితిని విచారించాడు. "పాతాళంలో ప్రహ్లాదుడు సమాధిగతుడుగా ఉండగా స్వర్గలోకంలో అభివృద్ధిజెందిన దేవేంద్రుని సంపదను చూచాడు. పాలసముద్రమునుంచి లేచి ఆదిశేషునిమీద పరుండి పద్మాసనబద్ధుడై శంఖ చక్ర గదాపాణియగు విష్ణువు మనసా కర్తవ్యాన్ని ఇలా ఆలోచించుకున్నాడు-"ప్రహ్లాదుడు సమాధి సామ్రాజ్యంలో విశ్రాంతుడయినాడు- సృష్టి కష్టస్థితిలో పడింది- నిర్దైత్య మయినది. (రాక్షసరహితమయినది.) దైత్యులు లేకపోయేసరికి దేవతలకు జిగీష (జయేచ్ఛ) పోతుంది- రాగద్వేష రహితులవుతారు దేవతలు. ద్వంద్వాతీతులై మోక్షం పొందగోరుతారు. స్వర్గసుఖం నుండి క్రమంగా విరక్తులవుతారు- స్వర్గసుఖమందు ఉపేక్షాభావం

కలుగుతుంది- సాత్వికులవుతారు దేవతలందరూ శాంతిని పొందుతారు- దేవత్వమునొందెడి యజ్ఞతపఃకర్మలు కూడా భూలోకంలో జరగవు యికముందు- మనుష్యులు కూడా శమాదిసంపత్తి గలవారవుతారు- ఇలా కర్మలు శాంతించేసరికి భూలోకం నాశమొందగలదు. కల్పాంతం వరకు ఉండదగిన త్రిలోకములు ఇలా క్రమంగా అంతరిస్తాయి. ఎండసోకితే మంచు హరించినట్లు- ఇలా ప్రపంచస్థితి తారుమారై నశించేసరికి పరిపాలన అనే నా లీలను కూడా నేను నశింపచేసికొన్నట్లు అవును- నేనేమి ఉచితమాచరించినట్లు? కనుక నేనుకూడా నా లీలావిగ్రహాన్ని చాలించుకొని మరల ఇంకొక అవతారం ఎత్తడానికి పరమాత్మలో లీనం కావాలి- కనుక అనవసరంగా అకాలంలో దేవమనుష్యాది వర్గంతో కూడిన ప్రపంచం అంతరిస్తే శ్రేయస్సు లేకపోలేదు- అది ఆత్యంతిక శ్రేయస్సుకాదు. "వైరాగ్యాత్ ప్రకృతౌలయః" వైరాగ్యమువలన ప్రకృతియందు లయమగుదురు అని చెప్పుటచే ప్రకృతిలయము సిద్ధిస్తుంది దేవమనుష్యాదులందరికీ, నిద్రయందు అందరకు సకలదుఃఖములు ఉపశమించినట్లు ఈ ప్రకృతి లయత్వము కూడ ఒకవిధమయిన శ్రేయస్సే- కాని యింత మాత్రంతో పరమపురుషార్థం లభించదు- అనేక జన్మానుష్ఠిత నిష్కామకర్మవలన వివిదిష యేర్పడాలి. తరువాత తత్త్వజ్ఞానం కలగాలి. పిదప తత్త్వసాక్షాత్కారం కలగాలి- మూలాజ్ఞానావరణం నివర్తించాలి- అపుడు పునరావృత్తిరహితమయిన మోక్షం లభించాలి- ఇదీ క్రమము- ఇదే నిరతిశయానంద లక్షణమయిన శ్రేయస్సు- ఇయ్యది కేవల వైరాగ్యమాత్రంచేత సాధ్యంకాదు- కనుక ఇట్టి శ్రేయస్సు అందరకు లభించాలిఅంటే దానవులు జీవించి ఉండాలి. దైత్యులయొక్క ప్రయత్నంచేత దేవతలకు స్వర్గసుఖమునందు అభినివేశమూ (అభిలాష) దానివల్ల మానవులు భూలోకంలో యజ్ఞాది కర్మలాచరించుట అంచేత సంచారము (ప్రపంచము) క్రమముగా జరుగుట ఇదంతా ఈ క్రమంగా జరగాలి లేకుంటే జరగదు. అని

కాబట్టి నేను పాతాళ లోకంచేరి దానవాధీశుని (ప్రహ్లాదుని) మామూలుగా రాజ్యాధికారంలో ఉంచుతాను- వసంతాది ఋతువులు చెట్లను మామూలు స్థితిలో నుంచినట్లు- ప్రహ్లాదుని కాక ఇతర రాక్షసుని కనుక నేను పాతాళమునకు రాజుగాచేసే యెడల అప్పుడు ప్రహ్లాదుడు దేవతలను పొందగలడని (అనగా దేవత్వము నొందగలడని) నేననుకుంటాను- ప్రహ్లాదున కీ శరీరము కడపటిది- పరమపావనముయినది. ఇతడు ఈ దేహంలో కల్పాంతమువరకూ ఉండాలి- ఇది పరమేశ్వరుని సంకల్పసిద్ధమైన దైవనియతి- కనుక నేను వెళ్ళి అతనినే (ప్రహ్లాదునే) సమాధినుంచి మేలుకొలిపెదను- అతడు జీవన్ముక్తులవలె అసంసక్తి సమాధిలో నుండి రాజ్యమేలుగాక. మణిచేష్టా రహితమై ప్రతిబింబాన్ని ధరిస్తుంది- ఇలా అయితే ప్రపంచం నశించదు- సురాసురులకు ద్వంద్వ యుద్ధము తటస్థిస్తుంది. అప్పుడు నాక్రీడ (ఆట) సాగుతుంది-

యద్యపి నాకు ప్రపంచముయొక్క స్థితినాశములు రెండూ సమానములే- కాని అవి రెండూ యథాక్రమంగా జరుగుగాక అని నాయభిప్రాయము. వేరువిషయంతో నాకు ప్రసక్తిలేదు- నీ కెందుకీపని నీవు యోగనిద్రలో ఉండి సుఖింపరాదా! అని నన్నంటారు కొందరు- అది సరికాదు- భావాభావ పదార్థములు రెండూ నాకు తుల్యములే. కాని అవి నశించుటలోకాని, నశింపకుండుటలోకాని, అభినివేశము లేకుండుటయే నాకు యోగనిద్రా ప్రాప్యమయిన సుఖము- కనుక పాతాళమునుచేరి అసురేశ్వరుని (ప్రహ్లాదుని) సమాధినుండి లేపెదను. ఇలా నేను నటించినా అజ్ఞానివలె సంసారలీలను నెరవేర్చినవానిని కాను కనుక నేను నిశ్చలుడనే అని వితర్కించుకున్నాడు శ్రీమహావిష్ణువు-

## ౩౯. నారాయణ వచనోపన్యాసము.

వసి॥ పాలసముద్రములోని శ్వేతద్వీపమునుండి బయలుదేరాడు పరివారంతోసహా-పాలసముద్రముయొక్క-అథశ్ఛిద్రముగుండా (ద్వారా)

ప్రహ్లాదనగరం ప్రవేశించాడు- బంగారు మందిరంలోఉన్న ప్రహ్లాదుని చూచాడు సమాధిలో నున్న బ్రహ్మవలె- శ్రీమహావిష్ణువు తేజస్సుచే దానవులందరూ భయపడి పలాయనం చెప్పారు. సూర్యునికి భయపడిన గుడ్లగూబలవలె. ఇద్దరుముగ్గురు పరివారజనులతో డనే అసురగృహ మును ప్రవేశించాడు విష్ణువు తన నిజంవేషంతో- ప్రహ్లాదుని సమాధి నుంచి లేపుటకు పాంచజన్యమను శంఖమును పూరించాడు- ఆ మోతతో దిక్కులు పిక్కటిల్లి పోయాయి- అసురజనమంతా భయపడి మూర్ఛిల్లి పడిపోయారు- వైష్ణవజనం ఆనందించారు- దానవేశ్వరుడగు ప్రహ్లా దుడు మెల్లగా లేచాడు సమాధినుంచి బ్రహ్మరంధ్రమునుండి బయలు దేరిన ప్రాణశక్తి తో మిన్నదిరంధ్రములందునూ (ఇంద్రియములందునూ) ప్రవేశించింది- అప్పటికి ఆతని చైతన్యం విషయాభిముఖమయింది. చిత్తులింగ దేహం అనే దర్పణంలో ప్రతిబింబించింది- క్రమంగా మనో రూపాన్ని చెందినది- క్రమంగా నేత్రాలు కొద్దిగా విప్పారినవి- శరీర మునకు కొంచెము చలనము కలిగింది- నిమిషమాత్రంలో మనస్సు పీవరమయినది- సూర్యుడు అర్ఘ్యోదయమవ్వగానే సరస్సులోని పద్మ ములు వికసింపసాగినట్లు ప్రహ్లాదుడు తెలివితో వికసింపసాగాడు- ఇంతలో "బుధ్యస్వ" మేలుకో అనే శ్రీమహావిష్ణువుయొక్క మాట వినవచ్చినది- ప్రబోధమును చెందాడు ప్రహ్లాదుడు- ముఖము వికసించి యున్నాడు ప్రహ్లాదుడు- అపుడు విష్ణువు అతనితో (ప్రహ్లాదునితో) ఇలా అన్నాడు- పూర్వం తన నాభికమలంలో పుట్టిన బ్రహ్మతో అన్నట్లు-

విష్ణు! ఓ సజ్జనుడా! నీ వంశపరంపరావచ్చెడి రాజ్యలక్ష్మిని స్మరిం చుకో- నీ యాకారమును గుర్తించు- అకాలంలో దేహవిరమణము తగదు- ఇది గ్రాహ్యము. ఇది త్యాజ్యము. అనే సంకల్పం లేకపోతే జీవుడికి ప్రియాప్రియములు అంటవు. హేయోపాదేయబుద్ధి లేని నీకు ప్రియాప్రియములతో ప్రయోజనమేమి ? లే సమాధినుంచి. నీవు ఈ శరీరంతో కల్పాంతవరకూ ఉండాలి- ఇది దైవనియతి- నేను ఎఱుగు

దును, నీ ఆయుర్దాయము మాకు తెలుసును. నీవు జీవన్ముక్తుడవుగా కల్పాంతవరకు ఈశరీరంతో ఉండవలసినదే- ప్రళయావసానమున స్వస్వరూపంలో ఉండిపోతావు నీవు- నీకీశరీరము కల్పాంతమువరకు ఉండేదిగానూ, పరావరుడయిన పరమాత్మను సాక్షాత్కరించుకొనేదిగానూ జీవన్ముక్తిలవిలాసాలు గలదిగానూ తయారయింది-

ఇంకా పన్నెండుమంది సూర్యులూ, ఏకకాలంలో ఉదయించలేదు. కొండలు భూమిలో విలీనం కాలేదు- ప్రపంచం ప్రజ్వలించుట లేదు. ముల్లోకములను దుమ్ము లేపుతూ గాలివీచుట లేదు. దేవతల తలపుర్రెలను ఎగరవేసికొనుచూ వీచుటలేదు. పుష్కరావర్త మేఘములందు మెరపులు మెరయుటలేదు. భూమి మండుటలేదు కొండలు పగులుటలేదు. దిక్కులు మోతపుట్టడంలేదు. ప్రపంచంలో బ్రహ్మ విష్ణుమహేశ్వరులు ముగ్గురే మిగిలి యుండలేదు- ప్రపంచంలో ప్రళయకాలమేఘాలు వ్యాపించలేదు. దిగ్విభాగం లోకాలోకపర్వతశిఖరములచే ఊహింపబడుటలేదు. ద్వాదశాదిత్యుల కిరణములు సంచరించడంలేదు. ప్రళయకాల మేఘాలు గర్జించడంలేదు. ఇలాంటి ప్రళయకాల చిహ్నాలు యేవీ లేవు. ఎందుకూ నీవు శరీరం చాలించడం ?

నేను గరుడవాహనుడనై లోకాలు తిరుగుచునే ఉన్నాను. కనుక శరీరత్యాగం చేయవద్దు- ఇదిగో ప్రపంచం- ఇదిగో నీవు- ఇదిగో నేను- ఇదిగో ఆకాశాదిభూతపంచకము- కనుక శరీరం త్యజించవద్దు- ఎవడికి అజ్ఞానంచేత దుఃఖాలు మనస్సును బాధిస్తాయో వాడికి మరణం. అతిమూఢునికిమరణం- అతిదుఃఖికి మరణం- ఆశాపాశబద్ధునికి మరణం- వ్యాకులచిత్తునకు మరణం- తృష్ణాపూరితాంతఃకరణునకు మరణం- వివేకాంకురములు లేనివానికి మరణం- మనస్సులో రాగద్వేషాలు బాగాపెరిగి యున్నవానికి మరణం- దేహమనే అడవిని ఆధివ్యాధులనే దవాగ్నులు తగలబెట్టేవానికి మరణం.

మరణమనేది లోకంలో శరీరత్యాగమని ప్రసిద్ధమయింది- అది తత్వజ్ఞానికి ఉచితంకాదు- సద్రూపుడయిన ఆత్మక్రియారహితుడు. కనుక ఇతనికి శరీరత్యాగమనే క్రియ సంభవించదు- అసంగుడయిన ఆత్మకు దేహసంగమే లేదుకనుక అసద్రూపమయిన దేహముతో పరిత్యాగము దూరాపాస్తమే యగును- దేహాది సద్భావజ్ఞానము అజ్ఞానంచే ఏర్పడినందున దేహం అసద్రూపం-

ఆత్మతత్త్వ సాక్షాత్కారంనుంచి మతి ఉత్క్రాంతి చెందక, శరీరమునుంచి ఈప్రాణం ఉత్క్రాంతిచెందు జ్ఞానిజీవితం శోభిస్తుంది. అహంకారములేని వానికి, నిర్లిప్తమయిన బుద్ధిగలవానికి, సర్వభూతములందునూ సమతాబుద్ధిగలవాని జీవితం శోభిస్తుంది. రాగద్వేషరహితమయిన బుద్ధితో ప్రపంచాన్ని సాక్షిగాచూచేవాని జీవితం శోభిస్తుంది. ఎవడు ప్రపంచం నిస్సారమని గుర్తించి దృఢంగా మనోనాశంచేసికొని సాక్షిమాత్రుడుగా ఉంటాడో, వానిజీవితం శోభిస్తుంది- మిథ్యావస్తువులందు మనస్సు లీనంకాక బ్రహ్మయందు మాత్రమే మనస్సు విలీనమయినవాని జీవితం శోభిస్తుంది- సత్యతాబుద్ధిలేక వాసనారహితంగా ప్రపంచవ్యవహారాన్ని జరిపుకునే వానిజీవితం శోభిస్తుంది- లోకవ్యవహారంలో ఉన్ననూ, హేయోపాదేయములు సంప్రాప్తమయినపుడు, సంతోషదుఃఖములు లేనివాని జీవితం శోభిస్తుంది- శమదమాది గుణసంపత్తిగల తత్త్వజ్ఞునియొక్క జీవితం శోభిస్తుంది- ఎవనిగూర్చి విన్నా ఎవనిని చూచినా, ఎవనిని స్మరించినా, భూతములు ఆనందించునో, వాని జీవితం శోభిస్తుంది-

౮౦. విష్ణు॥ ప్రహ్లాదా! ఉన్నదేహం కనుపిస్తూ ఉంటే జీవితం అంటారు లోకులు- మరొకదేహం ధరించడానికి పూర్వదేహం విడిస్తే మరణం అంటారు- ఈ రెండూ నీకులేవు. జ్ఞానియందలి గుణాలనూ, అజ్ఞానిలోని గుణాలను వివరించి చెప్పటానికి గాను జ్ఞానికి జీవితం శోభిస్తుంది- నీమరణం శోభించదనీ చెప్పానుకాని ఆ రెండూనీకు ఉన్నవని

కాదు- గాలి ఆకాశంలో సంచరిస్తున్నా దానితో అంటదుకనుక అది ఆకాశరహితమయినదే- అలాగే నీవుకూడా దేహంలో ఉన్నా దాని మీాద ఆసక్తిలేదు కనుక నీకు నీవు అదేహుడవే- నీదేహానికి సోకిన శీతోష్ణాది స్పర్శలను నీవు గుర్తిస్తున్నావు కనుకనూ, ఇతరుని దేహానికి సోకిన శీతోష్ణస్పర్శలను నీవు గుర్తించడంలేదుకనుకనూ, నీవు నీదేహం లోనే ఉన్నావని అనవలసివచ్చింది. అయితే నేను అసంగుడనుఎలా? శీతోష్ణాది స్పర్శజ్ఞానానికి నిమిత్తమయితినికదా! అని అనుకోనకు- చెట్టుపెరగటానికి ఆకాశంఅడ్డుపడలేదు కనుక ఆకాశం చెట్టుపెరుగుటకు కారణమన్నారు- అలాగే నీవుకూడా శరీరంలో ఉంటేనే మనస్సుకు శీతోష్ణాదిస్పర్శజ్ఞానం కలుగుతోంది లేకుంటే లేదు- కనుక నీవు కారణమన్నారు- అంతమాత్రంచేత నీ అసంగత్వానికి భంగంలేదు- నీవు ప్రబుద్ధుడవు- తత్త్వజ్ఞానివి- కనుక దేహములేనివాడవే- కలలో ఈశరీరముకాక మరొకశరీరము కల్పించుకుంటావు. ఆకల అంతమొందు తుంది. తరువాతకూడా ఆశరీరం ఉంటుందంటావా? అలాగే అజ్ఞానం నశించినతరువాత, శరీరంమీాద ఆసక్తిపోతే శరీరంలేనట్లే- ఈ పరిచ్ఛిన్న మయిన దేహము అజ్ఞులయందే ఉన్నది- కేవల చైతన్యము ప్రకాశ కత్వరూపంతో అన్ని వస్తువులందూ ఉన్నది- ఆరూపంతో అన్నివస్తు వులూనీవే- అప్పుడు ఈ దేహంతో విశేషమేమి నీకు? అజ్ఞానివలె నీవు ఈ దేహమాత్రుడవేకావు- అజ్ఞానికి దేహముయొక్క అభివృద్ధివల్ల సంతోషమూ, తన్నాశమువల్ల దుఃఖమూ (విషాదమూ)కలుగుతుంది- జ్ఞానికి మిన్నువిరిగి మీాదపడినా విషాదంలేదు- నవనిధులు లేచి ఎదు రొచ్చినా సంతోషమూలేదు- కొండలు చలించినా ప్రళయాగ్నులు మండినా ఉత్పాతవాయువులు వీచినా జ్ఞాని స్వప్నరూపంలోనే ఉం టాడు. భూతములయొక్క వృద్ధిక్షయములతో ఆత్మకు వృద్ధిక్షయాలు లేవు- దేహము కదలినా అందులోని పరమేశ్వరుడు కదలడు. "నేను దేహానికి సంబంధించినవాడను దేహమునాకు సంబంధించినదీ" అనే భావము కేవలము కల్పనామాత్రము- దానిని నీవు విడిచేదిలేదు-

ధరించినదీ లేదు- "ఇది చేస్తాను" "ఇది చేసిచాలు" అనే భావాలు తత్త్వవేత్తకు నశిస్తాయి- జ్ఞానులు యెన్నిపనులు చేసినా వార్లకు వాటియందు కర్తృత్వం లేదు- వారు చేసినవారు కారు- వాటిని చేయనందువల్ల వారు అకర్తలు కారు- అకర్తృత్వంచేత అభోక్తృత్వమనేది ఆత్మకు సహజమయిపోయింది- లోకంలో నాటని వ్రీహ్యాదులను కోసి అనుభవించిన వారెవరు? కర్తృత్వభోక్తృత్వములు శాంతిస్తే శాంతియే మిగులుతుంది- అదే ముక్తి ముదిరితే (శాంతి) వివేకవంతులు చిద్రూపులు సర్వప్రపంచం ఆక్రమించి ఉంటారు- వీరికి అప్రాప్తమయిన ఐహిక ఫలంలేదు పరిగ్రహించడానికి. పరిగ్రహించిన ఐహికమూ లేదు త్యజించడానికి- అంగప్రధాన క్రియాకలాప లక్షణవికారములు లేని కూటస్థాత్మకు సాంగప్రధాన క్రియాసాధ్యమయిన స్వర్గాదిఫలాన్ని కూడా పరిగ్రహించవలసినపని లేదు- పరిత్యజించవలసిన పనియు లేదు- గ్రాహ్యగ్రాహకసంబంధం(హానోపాదాదానాది సంబంధం)క్షీణిస్తే రాగద్వేషాది విక్షేపాలు శాంతిస్తాయి. అయ్యది (అశాంతి) స్థిరమయితే మోక్షమనిపించుకుంటుంది. అలాంటి పరిస్థితిలోనుండు నీలాటి శాంతపురుషులు కూడా ప్రారబ్ధక్షయపర్యంతం వ్యవహారదశలో ఉంటారు సుషుప్తిలో బ్రహ్మప్రాప్తి పొందినవారుకూడా ప్రాణస్పందాన్ని ఉదరంలోని అన్నరసస్పందాన్ని పొందినట్లుగా. ఇలాంటివారే జీవన్ముక్తులు. అలాగే నీవుకూడా పరమాత్మసాక్షాత్కారంచేత వాసనారహితుడవయినా జాగ్రత్సుషుప్తుల సంధిదశలో ఉన్నవానివలె ఆత్మసంస్థమయిన మనస్సుతో లోకస్థితిని (వ్యవహారదశను) అనుసరించు. ఆత్మారాములయిన మహానుభావులు ఎంతరమ్యంగా ఉన్నా అనాత్మవస్తువులందు రమించరు- ఆత్మకు సంబంధించిన (శరీరసంబంధమయిన) దుఃఖములకు భయపడరు. ఆత్మానందమే వారికి అతిమధురము- నిత్యబుద్ధులు (తత్త్వజ్ఞులు) అసంగులై ప్రాపంచిక కార్యములను ఆచరిస్తారు. వారికి వాటిమీద ఆస్థ (వాంఛ) ఉండదు. అద్దములు బింబములను గ్రహించినట్లు. అద్దము ఎదురుగా వచ్చియున్న బింబాన్ని తనలో గ్రహిస్తుంది కాని

దానిమీద కోరిక ఏమాత్రం ఉండదు దానికి. తత్వవేత్తలు ఆత్మ స్వరూపవిషయంలో మేలుకొని ఉంటారు. ప్రపంచస్థితిలో (వ్యవహార దశలో) నిద్రించి ఉంటారు- ఆ నిద్రలో ఉండే బాలురవలె వ్యవహ రిస్తారు. ప్రహ్లాదా! నీవు మనస్సును ఆత్మతత్త్వంమీద నిలిపి ఒక్క- బ్రహ్మకల్పపర్యంతం పాతాళలోకంలో రాజలక్ష్మిని అనుభవించు- ఆవల చ్యుతిరహితమయిన విదేహకైవల్యాన్ని అనుభవించు అన్నారు శ్రీమహావిష్ణువు.

## ౪౧. ప్రహ్లాదాభిషేకము.

వసి॥ రామచంద్రా! పద్మనాభుడు ఇలా చెప్పేసరికి ప్రహ్లాదుడు చెప్పినజవాబు విను చెబుతాను.

ప్రహ్లా॥ దేవా! అసురులకు హితమేది? దేవతలకు అహితమేది? అని విచారించి విచారించి నేను అలసిపోయాను. ఇప్పుడే ఒక్క-క్షణం విశ్రాంతితీసికున్నాను. స్వామీ! మీదయవల్ల నాకు సమాధ్యసమాధు లందూ, సదేహ విదేహ ముక్తులందునూ, తత్త్వజ్ఞానంచేత స్వరూపావ స్థితి అనేది కుదిరింది- దేవా! చాలాకాలం నిర్మలమయిన నామన స్సులో దర్శనమిచ్చావు. ఇపుడు మరల బాహ్యదృష్టిలో కనిపించు చున్నావు. ఇది నాభాగ్యం. నేను సర్వసంకల్పరహితమయిన దృష్టిలో ఉన్నాను- నాకు శోకమోహాలులేవు. వైరాగ్యం కుదరలేదనే చింత లేదు. దేహత్యాగం చెయ్యాలనే వాంఛలేదు- సంసారం అంటె భయమూలేదు- అద్వైతదృష్టిలో శోకమోహాలకు తావులేదు. కదా! ఉన్నదొక్క- ఆత్మతత్త్వమే అయితే ఇంక దేహమెక్క-డ? సంసార మెక్క-డ? భయాలు ఎక్క-డ! దేహత్యాగం చెయ్యాలనే కోరిక లేకుండగనే నిర్మలమయిన వివేకంతో సమాధిలో ఉన్నాను. "అబ్బా విరక్తికలిగిందినాకు సంసారం విడిచిపెడతాను నేను"అనేభావం అజ్ఞాను లకుగాని జ్ఞానులకుండదు- దేహంలేకపోతే దుఃఖాలుఉండవనీ, దేహం ఉంటే దుఃఖాలుఉంటాయనీ, అనుకొనే వాళ్లు జ్ఞానులుకారు. సుఖ

దుఃఖాది సంబంధమయిన ఆందోళన మూఢునిది కాని పండితునిది కాదు. నేను వేరు వాడు వేరు అనే భేదవాసన కూడా అజ్ఞానులకే జ్ఞానుల కుండదు– "ఇది త్యాజ్యము" "ఇది గ్రాహ్యము" అనే భావం కూడా మూఢులకే– అద్వితీయబ్రహ్మయే ప్రపంచం అంతా నిండి ఉంటే హేయోపాదేయబుద్ధులకు తావేది లోకంలో! ప్రపంచంఅంతా విజ్ఞానాభావనమే కాని పరమార్థము కాదు కదా! ఇందులో హేయమేమిటి! ఉపాదేయమేమిటి? కనుక నేను తత్త్వవిచారములో ద్రష్టృదృశ్యాలను గురించి విచారించుచూ క్షణకాలం విశ్రాంతి తీసికున్నాను. సమాధికాలంలో నేను ఎలాఉన్నానో ఇపుడు వ్యుత్థానకాలంలోకూడా అలాగే ఉన్నాను. పరమాత్మభావమును పొందిననూ ఆత్మనగు నేను, మీరు ఆజ్ఞాపించిన నాకర్తవ్యమును చేయుచున్నాను. మీ ఆజ్ఞకు బద్ధుడనై ఇంతేకాని నాకు కోరిక కలిగికాదు–

స్వామీ! పుండరీకాక్షా! మీరు త్రిలోకపూజ్యులు– కనుక నావల్లకూడ పూజను గ్రహించండి" అని చెప్పి ప్రహ్లాదుడు శ్రీమహావిష్ణువున కెదురుగా పూజాపాత్ర పుచ్చుకొని నిలబడినాడు. పరివారసమేతమయిన గోవిందుని పూజించాడు. ఎదురుగా కూర్చున్నాడు– భగవంతుడయిన శ్రీమహావిష్ణువు ప్రహ్లాదునితో ఇలా అన్నాడు–

శ్రీభగవాన్॥ ప్రహ్లాదా! నీవు రాజ్యసింహాసనం అధిష్ఠించు– నేను స్వయంగా పట్టాభిషేకంచేసి త్వరగా వెళ్ళాలి– నాశంఖధ్వని విని వచ్చిన సిద్ధసాధ్యసురాదులు నీకు మంగళమును చేతురుగాక" అని పలికి ప్రహ్లాదుని సింహాసనంమీద కూర్చుండబెట్టి శ్రీమహావిష్ణువు సప్తసముద్రోదకములతోనూ, సర్వతీర్థజలములతోనూ, విప్రర్షిసంఘములతోనూ, సిద్ధసాధ్యగణములతోనూ, విద్యాధరాప్సరోగణములతోనూ, హిరణ్యకశిపురాజ్యమునందు పట్టాభిషేకంచేశాడు. మరుద్గణాలూ స్తుతించారు. సురాసురులు స్తుతించారు. తరువాత పట్టాభిషిక్తుడయిన ప్రహ్లాదునితో ఇలా అన్నారు నారాయణులు.

శ్రీభగవాన్॥ ప్రహ్లాదా! మేరువు మొదలగు పర్వతములు న్నంతవరకు, పృథ్వియున్నంతవరకు, సూర్యచంద్రులున్నంతవరకు అఖండ గుణశాలివై రాజ్యమేలుము. ఇష్టానిష్టములను భావమునువదిలి వీతరాగ భయక్రోధుడవై సమదృష్టితో రాజ్యమేలుము- నిరతిశయానంద వస్తువును సాక్షాత్కరించుకున్న నీవు రాజ్యమందు ఆరతిని చూపతగదు. అలాగే స్వర్గమర్త్య లోకములందుకూడ ఆరతిని చూపతగదు. ప్రజల యందు ప్రసక్తించిన వధ బంధ దండాది కార్యములను అనుష్ఠించు- మనస్సులో రాగద్వేషాలు యెవరిదిరాదను పెట్టుకొనకు- దేహాతిరిక్తాత్మ భావనతో అహంతా మమతలను విడిచి లాభాలాభములందు సమ దృష్టితో నుండుము- ప్రాపంచిక వ్యవహారమంతా నీకు బాగా తెలుసు. పరమార్థంలో నీవు పరిపూర్ణుడవు- నీకు ఉపదేశించ వలసినదిలేదు- రాగద్వేషాలు లేకుండా నీవు రాజ్యమేలుచున్నంతలో అసురులకు ఏవిధమయిన దుఃఖమూ ఉండదు- అసురుల వెంటివెంట నీరు కార్చ వలసిన పనిలేదు. ఇది మొదలు దేవదానవులకు యుద్ధము లేకుండుగాక- ప్రపంచం అంతా మందరపర్వతము బయటికి తీసిన సముద్రమువలె స్వస్థంగా (నిశ్చింతగా) నుండుగాక- దేవాసురస్త్రీలుకూడ అంతః పురములందు యెవరి భర్తలతో వారు సుఖముగానుందురుగాక- ఓ దనుసుతా! నీవు అజ్ఞానాంధకారమును వదిలి, స్వప్రకాశ బ్రహ్మాత్మ స్ఫూర్తినొంది నిస్సపత్నమయిన రాజ్యలక్ష్మిని, కామక్రోధాది రహిత మయిన స్వారాజ్యలక్ష్మిని చిరకాలమనుభవించుము.

ఇట్లు ప్రహ్లాదాభిషేకము ముగిసినది.

## ౪౨. ప్రహ్లాదవ్యవస్థ.

వసి॥ రామచంద్రా! పుండరీకాక్షుడు ప్రహ్లాదునితో ఇలా అని అతనిచే పుష్పాంజలులచే పూజింపబడ్డాడు- గరుడారూఢుడయ్యాడు- క్షీరసముద్రంచేరాడు సురముని బృందంతో- సురముని బృందాన్ని

విడచి శేషశాయి అయినాడు- దేవేంద్రుడు అమరులతో స్వర్గం చేరినాడు. ప్రహ్లాదుడు పాతాళంలో ఉన్నాడు- ఇలా అందరు సుఖంగా ఉన్నారు- రామా! ఇదీ ప్రహ్లాదుడికి ఆత్మబోధ కలిగినకథ- పరమ పావనము- పాపహారము- అమృతద్రవమువలె శీతలము- అతిమధురము- ఈకథను లోకంలో మానవులు మనసా విచారించే యెడల వారు ఎంతటి పాపులయినా త్వరలోముక్తిని పొందుతారు- సాధారణమయిన విచారణచేతనే పాపము పోవుచుండగా యోగవాక్యవిచారం చేత ఎవడు పరమపదమునుపొందడు? పాపమనగా అజ్ఞానము- అది ఆత్మవిచారంతో పోతుంది- కనుక పాపమునకు మూలచ్ఛేదమయిన ఆత్మజ్ఞానమును విడువతగదు- ప్రహ్లాదుని యొక్క ఈజ్ఞానసంసిద్ధిని విచారించెడి మానవులకు ఏడుజన్మలపాపం నశిస్తుంది సందేహం లేదు- అన్నాడు వసిష్ఠులు-

శ్రీరా॥ స్వామీ! సరేకాని పరతత్త్వమునందు విలీనమయిన ప్రహ్లాదుని మనస్సు పాంచజన్య (శంఖము) ధ్వనిచే ఎలా మెలకువ చెందినది? ఈసందేహం తీర్చండి అన్నాడు శ్రీరాముడు.

వసి॥ రామా! ముక్తులు రెండురకాలు- సదేహముక్తి విదేహముక్తి అని- వీటివిభాగం చెబుతావిను- నీసందేహం తీరుతుంది- ఈ రెంటిలో ఏషణాత్రయరహితమయినస్థితి జీవన్ముక్తస్థితి- దీనినే సదేహముక్తి అంటారు- అదేస్థితి దేహత్యాగానంతరం పునర్జన్మరహితమయితే అది విదేహముక్తి అనిపించుకుంటుంది- ఆస్థితి చెందినవాళ్లు మళ్ళీ కనిపించరు- జీవన్ముక్తుల చిత్తంలో పునర్జన్మకు కారణముకాని శుద్ధవాసనలుంటాయి- పరమపావనమయిన శుద్ధబ్రహ్మాత్మభావన ఉంటుంది వాళ్ళకు అప్పుడు నిద్రించిన వాళ్ళకువలె- (ఈదృష్టాంతం వాసనాస్థితికి మాత్రమే) ఇలాంటి వాళ్లు వేయిసంవత్సరాలు గడచినా లోపలఉన్న ఆవాసనతో ప్రబుద్ధులవుతారు- (వ్యుత్థితులవుతారు). కనుక ప్రహ్లాదుడు కూడ అంతస్థమయిన శుద్ధసత్వవాసనతో మేలుకున్నాడు- శ్రీమహా

విష్ణువు సమస్త భూతములకు ఆత్మరూపుడు- ఆయన ఎలా సంకల్పిస్తే అలా అవుతుంది- అన్నిటికీ ఆత్మే కారణం- కాబట్టి ప్రహ్లాదుడు ప్రబోధమును పొందుగాక అని సంకల్పించాడు వాసుదేవుడు. వెంటనే నిమేషమాత్రంలో లేచాడు ప్రహ్లాదుడు- వాసుదేవుడు ఏమరు కారణం లేకుండా భూతములకు కారణుడై సృష్టికొరకు వాసుదేవమయుడైన ఆత్మరూపంతో ప్రకాశిస్తాడు- కనుకనే ఆయనగారి దర్శనం చూస్తే ఆత్మదర్శనం అవుతుంది- ఆత్మదర్శనముగానే ఆయనదర్శనము అయినట్టే- ఆత్మావలోకనంచేత విష్ణువును కనిపెడతాడు మాధవుని ఆరాధిస్తే ఆత్మావలోకనం కలుగుతుంది- కనుక రామా! ఈదృష్టి మనస్సులో పెట్టుకొని ఆత్మసాక్షాత్కారానికి ప్రయత్నించాలి- శాశ్వత పదవిని పొందాలి- ఆత్మ విచారమనే సూర్యుని చూడని వాళ్లకు సంసారమనే వర్షాకాలము గాఢముగానే ధారకలదై మహాత్మ్యమనే కాన్పిస్తుంది- ఆత్మానుగ్రహం కలవార్ని ఈవిష్ణుమాయ ఏమీ చేయలేదు- ఆత్మయొక్క ఇచ్ఛచేతనే ఈ సంసారమాయ లావు అవుతోంది- దేహేంద్రియాదులలో జన్మమరణాలను ఇస్తోంది- ఆత్మయొక్క ఇచ్ఛచేతనే వివేకవిచారాది జన్మ లభించినప్పుడు తగ్గిపోతోంది ఆవిష్ణుమాయ- కనుక ఈశ్వరానుగ్రహంవల్ల కలిగిన విచారముచేతనే తప్పక జ్ఞానసిద్ధి కలుగుతుందని యీ ఆఖ్యానానికి తాత్పర్యం- ఇందుకు నిదర్శనంగా "పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్య బంధవిపర్యయౌ" అను బాదరాయణసూత్రమును "మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ" అను గీతాస్మృతియు కనుపడుచున్నవి అన్నారు వసిష్ఠులు-

## ౪౩. ప్రహ్లాద విశ్రాంతి.

శ్రీరా॥ స్వామీ! చంద్రకిరణాలవల్ల ఓషధులు సుఖించినట్లు మీవచనామృతధారలచే మేము సుఖించుచున్నాము- వినసొంపయిన మీమాటలు మేము గ్రహించాము. కాని నాకొక్క సందేహం కలుగు

తోంది- వెనుక మీరు పురుషప్రయత్నంవల్లనే జ్ఞానప్రాప్తి కలుగు తుందని చెప్పారు- అది నిజమయితే శ్రీమహావిష్ణువుయొక్క వరం లేకుండా ప్రహ్లాదుడు జ్ఞానమును (జీవన్ముక్తిని) ఎందుకు పొందలేదు ? చెప్పండి అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా ! ఇదా నిసం దేహం- ప్రహ్లాదునకు పురుషార్థము స్వప్రయత్నం చేతనే లభించింది- నడుమన ద్వారమాత్రమయింది మాధవుని వరము కాబట్టి నేను వెనుక చెప్పిన నియమానికి భంగం లేదు- విను చెబుతాను-

తెల్లగుడ్డకూ తెలుపువర్ణానికి భేదంలేదు- పుష్పమునకూ దాని పరిమళానికీ స్వరూపభేదంలేదు- సువ్వాగింజకూ, నూనెకూ భేదంలేదు. అలాగే ప్రహ్లాదుడికీ, నారాయణునకూ ఆత్మభేదంలేదు. ఎవరు విష్ణువో అతడే ప్రహ్లాదాత్మ ఎవడు ప్రహ్లాదాత్మయో అతడే విష్ణువు. విష్ణు, ఆత్మ శబ్దములు రెండూ పర్యాయపదములు, విటపి, పాదప (చెట్టు వృక్షము) శబ్దములవలె. ప్రహ్లాదుని యొక్క ఆత్మరూపుడయిన విష్ణువు చేతనే ప్రహ్లాదుడు విష్ణుభక్తియందు నియోగింపబడ్డాడు. కనుక స్వాత్మరూపుని స్వయముగానే తెలిసికొన్నాడు- ప్రహ్లాదుడు ఒకానొక పుడు స్వప్రయత్న కృతవిచారబలముచేత తెలిసికొంటున్నాడు. జ్ఞాన మునుపొందుతున్నాడు- మరొకపుడు భక్తిరూపమయిన ప్రయత్నముచే లభించిన విష్ణుమూర్తియొక్క దేహద్వారా జ్ఞానసిద్ధిని పొందుచున్నాడు. ఎంతకాలము భగవంతుని ఆరాధించినా, ఎంతకాలము భగవంతుని యందు పరమప్రేమగలవాడయినా విచారములేనిదే జ్ఞానము నీయ జాలడు మాధవుడు- విచారమంటే పురుషప్రయత్నమే. పురుషప్రయత్న సిద్ధమయిన జ్ఞానము ముఖ్యము. వరాదులచే లభించిన జ్ఞానముగౌణము. (అముఖ్యము) నీవుకూడా ముఖ్యహేతువునే ఆశ్రయించు- కనుకనే మాధవుడు "ఆత్మావబోధ పర్యంతమయిన విచారము కలుగుగాక" అనే ప్రహ్లాదుడికి వరమిచ్చాడు- పురుషప్రయత్నం అక్కరలేదనే

మాధవుని (విష్ణువుయొక్క) అభిప్రాయమయితే "నీకు జ్ఞానము కలుగుగాక" అనే వరమునే ఇచ్చేవాడు- అలా ఇయ్యలేదు- "ఇంద్రియములను విషయములనుంచి నిగ్రహించుకో మన్నారు బలాత్కారంగా- స్వప్రయత్నంచేత విచారం అభ్యసించమన్నారు." లోకంలో నదయినా తన పురుషప్రయత్నాయత్తమయిన మంచి (శుభాచరణము) చేతనే లభిస్తుందనికాని, వేరు ఉపాయంచేత లభించదన్నారు. "కనుక పౌరుషమును ఆశ్రయించమన్నారు" యింద్రియాలను నిగ్రహించుకోన్నారు. సంసారజలధిని దాటమన్నారు. పరమ పదమును పొందమన్నారు.

పురుషప్రయత్నం అక్కరలేకుండగనే భగవంతుడు సాక్షాత్కారం అన్యోయడల బ్రహ్మదేవుడు మృగములనూ, పక్షులనూ ఎందువల్ల ఉద్ధరించడం లేదు? (ఆత్మతత్త్వమును చూపుట లేదు!) శిష్యుడి ప్రయత్నం అక్కరలేకుండా గురువు శిష్యుని ఉద్ధరించగలిగే యెడల ఒంటెను గాని, మదించిన ఎద్దును గాని ఎందువల్ల ఉద్ధరించడంలేదు. కనుక పురుషప్రయత్నం లేకుండా భగవంతుడు ఉద్ధరించలేడు- గురువు ఉద్ధరించలేడు- ధనము ఉద్ధరించలేదు- ఇంద్రియనిగ్రహమును పొంది దృఢమయిన జ్ఞానమును సంపాదించుకొని పురుషప్రయత్నంచేత మానవుడు సంపాదించుకునే పరమపురుషార్థాన్ని ముల్లోకాలలో మరోదానిచే దేనిచేతనూ సంపాదించుకోలేడు-

కనుక రామచంద్రా! జీవాత్మచే పరమాత్మను ఆరాధించు- (శ్రవణంచెయ్యి) ఆత్మచే ఆత్మను అర్పించు (నిరంతరానుసంధానం చెయ్యి.) ఆత్మచే ఆత్మను సాక్షాత్కరించుకో- ఆత్మస్వరూపంలో ఉండిపో- ఇంక నీ కుచ్యుతి ఉండదు.

విషయాసక్తి మెండై అధ్యాత్మశాస్త్రాలు అభ్యసించలేక, ఇంద్రియములను జయించలేక, ఆ రెంటికి దూరమయిన మూర్ఖులను ఎలాగయినా సన్మార్గంలో పెట్టాలని శాస్త్రాలలో శివవిష్ణ్వాదిభక్తి చెప్పబడింది- కనుక స్వప్రయత్న జన్య విచారమే జ్ఞానోదయానికి ముఖ్య

హేతువు- అభ్యాస ప్రయత్నాలు రెండూ ముఖ్యహేతువులు జ్ఞాన సిద్ధికి- అవి రెండూ లభించనప్పుడు దేవతాపూజ అనేది రెండవ (గౌణ) క్రమము- ఇంద్రియాలోలుడు ఎంతపూజించినా దేవతలను లాభం లేదు- జితేంద్రియుడు పూజించనందువల్ల వచ్చేనష్టం లేదు- కనుక విచారము ఉపశమము (వైరాగ్యము) ఈ రెండూ లేనిదే భగవత్సాక్షాత్కారము కలుగదు- ఈ రెండూ లేనివానికి ఈశ్వరుడు కూడ సహాయం చేయలేడు. వైరాగ్య తత్త్వవిచారములు కలవానికి ఈశ్వరునితో పనే లేదు.

కనుక రామా! నీవు ఆ రెండూ లభించేట్లు ప్రయత్నించు. ఆ రెండూ సిద్ధిస్తే నీవు సిద్ధుడవగునట్టే లేకుంటే నీవు అడవిగాడిదవు. (ఈమాట వసిష్ఠులు రాముని ఉద్దేశించి అన్నది కాదు- వైరాగ్య బోధలు లేని మానవుల నుద్దేశించి అన్నది అంతా రాముడు నిమిత్త మాత్రము) మానవులు మాధవప్రేమను ప్రార్థిస్తారే కాని, తన చిత్తాన్ని ప్రార్థించరేం? ప్రతిప్రాణికీ హృదయపుండరీకంలోనే విష్ణువు ఉన్నాడు- ఆయన్నివిడిచి బాహ్యవిష్ణువును ఆరాధించే వారు నరాధములు- ఆవిష్ణువునకు హృత్కమలంలో ఉండే చైతన్యస్వరూపము ముఖ్య శరీరము- శంఖ చక్ర గదాహస్తాదులు గౌణమయిన ఆకారము. ముఖ్యమయిన ఆకారాన్ని వదిలి గౌణాకారాన్ని పూజించప్రయత్నించే వారు చేతిలో అమృతాన్ని పారబోసి ఆహారం కొరకు ధాన్యం పండించాలని వ్యవసాయప్రయత్నం చేసే వారన్నమాట-

కనుక రామా! ఎవడు ఆత్మతత్త్వ చమత్కృతియందు స్థితిని పొందలేడో వాడు శంఖ చక్ర గదాపాణియగు పరమేశ్వరుని అర్చించాలి. కష్టించి ఆయన్ని పూజించటంచేతనూ, కష్టించి తపస్సుచేయడంచేతనూ, చిత్తం నిర్మలమవుతుంది. పిదప వైరాగ్యం కలుగుతుంది- నిత్యాభ్యాస వివేకములవల్ల చిత్తం శీఘ్రంగా నిర్మలమవుతుంది. తప్పక ప్రసన్నమవుతుంది- కనుక శాస్త్రంలో హరిపూజాక్రమంచేత ఫలం కద్దని చెప్పడంకూడా పరమేశ్వరుని సంకల్పమే! పరమేశ్వరుడంటె

ప్రయోజనం మనస్సులో పెట్టుకొని తపస్సుచేయటానికి అడవికివెళ్లాడు బంధువులందరనూ విడిచి, చక్కగా వికసించిన కమలములుగల సరస్సును చూచాడు అక్కడ- అందులో మునిగాడు కంఠంవరకూ భగవంతుడు సాక్షాత్కరించేవరకు తపస్సుచేయదలచాడు అలాగే ఉండి అందులో ఇలా ఎనిమిదిమాసాలు గడచాయి- తుదకొకనాడు తపస్సుచే తప్తుడయిన ఆ గాధికి దర్శనమిచ్చాడు శ్రీమహావిష్ణువు- బ్రాహ్మణోత్తమా! "లెమ్ము సరస్సునుంచి- కోరుకొమ్ము వరమును- నీఅభీప్సితము నెరవేరెడి సమయమాసన్నమయింది" అన్నాడు విష్ణువు- "భూతముల హృత్పద్మ కుహరంలో ఉండే శ్రీమహావిష్ణూ! నీకు నమస్కారము. నవఘనశ్యామా! నీకు నమస్కారము- మీరు రచించిన మాయను (పరమాత్మయందు అధ్యాసింపబడిన మాయను) నేను చూడకోరుచున్నాను!! అన్నాడు గాధి-

బ్రాహ్మణోత్తమా! "నీవు విష్ణుమాయను చూచెదవు- నీకు నేను వరమిచ్చితిని. మాయాదర్శనం కాగానే మాయను తరించెదవు నీవు" అన్నాడు శ్రీమహావిష్ణువు- ఇంతలో అంతర్థానం చెందాడు- విష్ణువు అంతర్థానం చెందేసరికి వెంటనే గాధి సరస్సునుంచి లేచాడు- విష్ణుసాక్షాత్కారమయినందుకు సంతసించాడు- ఇలా కొంతకాలం గడచింది- ఈ ఆనందంలో బ్రాహ్మణకృత్యాలు నెరవేర్చుకుంటున్నాడు- ఒకనాడు ఆసరస్సులో స్నానంచేశాడు- విష్ణుమూర్తి వాక్యమును మనస్సులో చింతించుచున్నాడు- స్నానసమయంలో పాపక్షయం కొరకు అఘమర్షణస్నానం చేయుదలచి దర్భపుల్లతో నీటిలో సుడివలె పరివర్తనము (దర్భపుల్లతో గుండ్రముగా త్రిప్పుటను) చేశాడు- నీటిలో మునిగి ప్రణవాది మంత్రములను స్మరింపటంలో తెలివితప్పింది గాధికి- మంత్రం మరచిపోయాడు- ఆనీటిలో ఉండియే తాను తన యింటిలో మరణించినట్లు విపరీతజ్ఞానం కలిగింది గాధికి-తాను పడిపోయినట్లూ, ఉచ్ఛ్వాసనిశ్వాసములు లేనట్లూ, శరీరము విరమకొని పోయి

నట్లూ, ముఖము నల్లపడినట్లూ, శవమువలె వాడిపోయినట్లూ గ్రుడ్లు తేలిపోయినట్లూ, బంధువులందరూ ఏడుస్తూ చుట్టుమూగినట్లూ, భార్య కాళ్ళమీదపడి ఏడ్చుచున్నట్లూ, తల్లి గడ్డముపట్టుకొని ఏడ్చుచున్నట్లూ చూడవచ్చినవారందరూ, ఇరువైపులా కంటనీరుకార్చుచూ నిలబడి యున్నట్లు, చేతులూ కాళ్లూ, వ్రేళ్ళూ బిగబడియున్నట్లు, నోరు తెరచు కొనిపోయి యున్నట్లు, తానొక శవాకారంగా ఉన్నట్లు బంధువులు ఏడ్చిఏడ్చి తుదకు గుండెలు కొట్టుకొనుచూ, దహనముకొరకు శ్మశానమునకు తీసికొనిపోయినట్లు భ్రమించాడు. అచ్చట శ్మశానంలో గద్దలూ, కాకులూ, నక్కలూ మాంసాపేక్షచే చుట్టుమూగి ఉన్నాయట. బంధువులు ఎండుకట్టెలతో చితిపేర్చించి మండుచున్న అగ్నిలో దహనంచేశారట. బంధువులందరూ స్నానంచేశారట. చితాగ్ని ఆ శవాన్ని భస్మంచేసిందట. ఇదీ ఆగాధికి నీటిలో ఉండగా కలిగిన భ్రాంతిజ్ఞానం మొదటిది.

25. శ్వపచరాజ్యలాభము. తరువాత, అదే సరస్సులోమునిగి ఉండగా రెండవ భ్రాంతిజ్ఞానం కలిగింది ఇలా.

“భూతమండలమనే ఒకానొక దేశము యొక్క చివర ఒక గ్రామసమీపంలో ఉండే మాలదాసియొక్క గర్భంలో తానుఉన్నట్లు, గర్భవాసాదిదుఃఖాలు అనుభవిస్తూఉన్నట్లు, పెంటలో పురుగువలె ఆకలపడుచున్నట్లు, కొంతకాలానికి మెల్లగా దానికడుపులో నుంచి నల్లగా పుట్టినట్లు, మాలవాండ్ల యింట్లో శిశువుగా పెరిగినట్లు, క్రమంగా పదునారు సంవత్సరములవాడయినట్లు, వేట కుక్కలను వెంటబెట్టుకొని వేటకొరకు అడవిలో తిరుగుతూ ఉన్నట్లు, ఒక లక్ష మృగాలను చంపి కిరాతుల వృత్తిని అవలంబించినట్లు, ఒక మాల దానిని పెండ్లాడినట్లు, ఆడతుమ్మెద మగతుమ్మెదతో విహరించినట్లు, ఆక్రొత్తపెండ్లికూతురయిన భార్యతో, వనప్రదేశమందు విలాసగా విహరించినట్లు, వనకుంజములందు విశ్రమించినట్లు, కొండగుహాలందు

నిద్రించినట్లు, ఆకులగుబురులో దాగినట్లు, తీగలగుబురులో నివాస మేర్పరచుకొన్నట్లు, వ్యసనాతురుడై అడవిలో చెట్లచాటునా, తీగల చాటునా, ఆకులచాటునా నివసించినట్లు, పురుషాకారం ధరించి వచ్చిన వింధ్యారణ్యమా! ఏమి? అన్నట్లు తన ఆకారంఉన్నట్లు నానారకాల పూలమాలలు ధరించినట్లు, పూలపాన్పులందు పొరలినట్లు, కొండచరియ లందు తిరిగినట్లు, అడవిలో మృగమారణంలో మిక్కిలిపాండిత్యం కలవాడయినట్లు, ఆకొండచరియలందు విపటానికి కూడా సాధ్యంకాని చిత్రగల కొదుములను కనినట్లు, క్రమంగా వార్ధక్యం సంప్రాప్తమయి నట్లు తరువాత భూతమండలమనే తన దేశంచేరి జన్మభూమి ప్రవేశించి, తాటాకుల గుడిసె వేసికొని మునీంద్రునివలె ఊరికి దూరంగా ఉన్నట్లు, తన అంతటి శరీరం గలిగిన కొడుకులతోనూ, బహు భార్యలతోనూ, ముసలివాడై, వృత్తి, పేరుకూడా, కృశమై, మాలదానితో గార్హస్థ్యం అవలంబించి ఉన్నట్లు, చూచుకున్నాడు తనని. (అనగా ఇలా రెండవ దశా భ్రాంతి కలిగిందన్నమాట.)

తరువాత అచటనున్న మాలలందరిలోను ముసలివాడై కుటుంబి అయిన ఆగాధికి ఎంతకాలం ఆభాగ్య బిడ్డలు కుటుంబం అంతా ఉన్నదో అంతవరకు ఆకుటుంబం తనను మృత్యుదేవత నన్ను తీసికొని పోవు చున్నట్లు తలచాడు. వర్షకాలంలో వర్షప్రవాహంచేత రాలిన ఎండా కులు కొట్టుకొనిపోవుచున్నట్లు గుంపునుంచి చెదిరిన లేడిపిల్లవలె అడవిలో ఒంటరిగా ఏడ్వటం ప్రారంభించాడు. ఇలా కొన్నిరోజులు ఏడుస్తూ గడిపి చివరికి ఆదేశాన్ని విడిచాడు. గాలికి కొట్టుకొని పోయే మేఘాల వలె అనేక దేశాలు తిరిగాడు. తిరిగి తిరిగి ఒకానొకప్పుడు కీరదేశంలో ఒక ధనికుల పట్టణం ప్రవేశించాడు. అతిరమణీయమయిన ఆపట్టణంలో స్వర్గమార్గంవలె ఉన్న రాజమార్గం చేరాడు. అచ్చట మణులతోను రత్నాలతోను తయారుచేసిన గృహం చూచాడు. అందులో ఒకరాజు చనిపోగా మరియొకరాజు కొరకు నిరీక్షిస్తూ ఇటునటు తిరుగుచూ మేరు

పర్వతిమువలె ఉన్న ఏనుగును ఒకదానిని చూచాడు శ్వపచుడయిన యీ గాధి. అతిఉత్సాహంతో ఇది కదిలేకొండా ఏమి అన్నట్లు ఊహిస్తూ చూస్తూ ఉన్నాడు కొంతసేపు. ఇలాచూస్తూ ఉండగా ఆ ఏనుగ యీ గాధిని(మాలవానిని) తన తుండంతో వీపుమీద ఎక్కించుకున్నది. ఇతడు ఏనుగుయొక్క గండస్థలం చేరే (ఎక్కే)సరికి దుందుభిధ్వనులు మోగాయి. జనుల జయధ్వనులుకూడా దిక్కులు నిండిపోయాయి. వందిమాగధుల కోలాహలం ఉద్భవించింది. ఈ గాధిని రాజుగా అలంకరించటానికి వేశ్యాంగనలు చుట్టుముాగారు. మానవతులయిన స్త్రీలు రత్నాలహారాలను మెడలోవేశారు. విచిత్రవర్ణమూ విచిత్రమయిన పరిమళమూ గల పూలుచుట్టారు కొందరు ఆడువారు. అనేక పరిమళద్రవ్యాలను ఒంటికి పూశారు. రత్నకాంచన భూషణములతో భూషితుడయిన ఆరాజు (గాధి) ఆస్త్రీలచిత్తాన్ని గ్రహించాడు. కల్పవృక్షమువలె శోభితుడై ఉన్నాడు. అలా ఉన్న ఆరాజును పరివారసమేతమయిన అమాత్యవర్గం సింహాసనమున పట్టాభిషేకం చేశారు. ఐరావతమందు దేవేంద్రుని పట్టాభిషేకము చేసినట్లు. ఇలా ఆ మాలవాడు (గాధి) కీరపుర దేశంలో రాజ్యమును పొందాడు. అడవిలో ఆడసింహాలతో మగసింహంవలె కీరనగరంలో నాగరికస్త్రీ పురుషులతో చక్కగా ప్రకాశిస్తూ ఉన్నాడు. చాలకాలం మంత్రులతోనూ, పౌరులతోనూ రాజభోగాలు అనుభవించాడు. రాజతేజస్సును నలుదిక్కులా ప్రసరింపచేశాడు. రాజాజ్ఞను నలుదిక్కులా వ్యాపింపచేశాడు. కొన్నిరోజులు స్వేచ్ఛగా రాజ్యమేలాడు. ఆదేశంలో "గవలుడు" అను పేరుతో ప్రసిద్ధి చెందాడు గాధి.

## ౪౭. రాజ్యభ్రంశము.

వసి॥ విలాసినీలతో విహరించి, మంత్రిమండలమువల్ల పూజలనంది, సామంతరాజులచే నమస్కరింపబడి, ఛత్రచామరాది రాజచిహ్నాలనుధరించి అడ్డులేని ఆజ్ఞగలవాడై రాజ్యపరిపాలనాపద్ధతులను గుర్తించి,

ప్రజల శోకభయాయాసాలను పారద్రోలి, మహోన్నతదశలో నుండి, ఎల్లకాలం స్తోత్రగీతాలతో ఆత్మతత్త్వజ్ఞానం పూర్తిగా మరచాడు- మద్యపాన మత్తుడు ఒళ్లుమరచినట్లు- ఈ శ్వపచుడు (గాధి) కీరదేశము లలో 8 సంవత్సరాలు రాజ్యంచేశాడు- అంతవరకు దయాదాక్షిణ్య శౌచాదిగుణములుకలిగి ఉన్నాడు- ఇలాఅంటూ ఒకనాడు బుద్ధిపూర్వకంగా ఉన్న ఆభరణాలన్నీ తీసివేశాడు- సూర్యచంద్రాగ్నులు లేని ఆకాశం మాదిరి నల్లగా ఉన్నాడు- హారనూపుర కేయూరవలయాలు అతనికి అంతగా నచ్చలేదు- అతని చిత్తము కృత్రిమమయిన భూషణాదులను అభినందించలేదు- అలాంటి వేషంతో (ఆభరణాలుతీసిన వేషంతో) ఒంటరిగా బయటిముంగిలివద్దకు వచ్చాడు- అచట గుమికూడిన మాలలసంఘాన్ని చూచాడు- వారందరూ వసంతఋతువులో కోకిలవలె వీణాగానం చేస్తున్నారు- ఆగుంపునుంచి ఒక ముసలి మాల (నాయకుడు) లేచివచ్చి ఈగాధి (శ్వపచరాజు) తో ఇలా అన్నాడు- "ఓ కటంజా! ఇచట కీరమహీపతి గానకలా కోవిదుడగు నిన్ను బాగా గౌరవించుచున్నాడా! వస్త్రాసనాభరణాదుల నర్పించి నీకోర్కె తీర్చుచున్నాడా! సూర్యోదయం చూచి పద్మం ఆనందించినట్లు నిన్నుచూచేసరికి నాకు పరమానందం కలుగుతోంది- అశేషానందములకూ పరమావధి బంధుదర్శనము" అని ఇలా శ్వపచుడు అంటూ ఉండగా రాజు (గాధి) ఆయా తాత్కాలికచేష్టలతో తిరస్కారం చూపాడు- అతని యెడల ఈపరిస్థితిని కిటికీలనుండా స్త్రీలూ, ప్రకృతులూ (అమాత్యాదులూ) చూచారు- వీడు (ఈరాజు) మాలవాడని తెలిసికొని ముఖం మాడ్చుకున్నారు- మంచువర్షించిన పద్మాలవలెనూ, ఈతిబాధలు ప్రవేశించిన గ్రామాలవలెనూ, దవాగ్ని వ్యాపించిన కొండలవలెనూ నగరజనులు వెలవెల పోయ్యారు. రాజుమాత్రం ఆ మాలవాని సంభాషణను పూర్తిగా తిరస్కరించాడు. ఏమాత్రం లెక్కగొనలేదు. చెట్టెక్కి కూర్చున్న పిల్లి అరపును సింహము లెక్కగొననట్లు- వెంటనే రాజు అంతఃపురం ప్రవేశించాడు- అచ్చటివారంతా మ్లానులై (వాడి

పోయి)ఉన్నారు- తానుకూడ సర్వావయవములంనూ కృశించిపోయాడు- అంతఃపురంలోని జనులుఅందరూ దుఃఖముతో కూడిఉన్నట్లు గ్రహిం చాడు- మంత్రులూ, నగరజనులూ, స్త్రీలూ ఈరాజును ఇంట్లో ఉన్న వానినికూడా స్పృశించడంలేదు- శవాన్ని చూచినట్లు చూస్తున్నారు- భృత్యులు పూర్తిగా విడిచిపెట్టారు ఇతణ్ణి- శ్మశానముమువలె ఈగాధి శరీరాన్ని యెవరూ గౌరవించేవారులేరు- దగ్గరకు వచ్చేమనిషికూడా దుర్లభమయింది ఇతనిపరిస్థితి- సభ్యులుకాని భటులుకాని ఇతని ఆజ్ఞను పాటించువాడు ఒక్కడు లేడు. అందరూ ఇతణ్ణివిడిచి లేచిపోయారు- తుదకు ఎంత అరచినా పలికే దిక్కులేకపోయింది ఇతనిగతి.

వాళ్ళందరూ "ఇంతకాలంనుంచీ మనం మాలవాణ్ణి రాజుగా పెట్టుకుని చెడిపోయినాము. కులభ్రష్టుల మయినాము. కనుక ప్రాయ శ్చిత్తంచేసికొని పరిశుద్ధులమవుదాం" అని నిర్ణయించుకొని నగర జనులూ, మంత్రులూ అంతా అగ్నిప్రవేశం చేయదలచుకొని, ఎంగు కట్టెలతో మంటచేసికొని, అగ్నికుండంలో ప్రవేశించారు- కళత్రములు కన్నీరు కారుస్తున్నారు. భృత్యుల రోదనధ్వనులు దిక్కులు పిక్కటిల్లి పోయినవి. నగరమంతా ప్రళయకాలమాసన్నమయినట్లున్నది- రాజ్యం లోని సజ్జనుల సహవాసంచేత పవిత్రీకృతచిత్తుడగు గవలుడు శోకా కులుడై ఇలా ఆలోచించాడు- "నన్నుంచికదా ఈదేశంఅంతా ఇంతటి అనర్థాన్ని చెందినది- అకాల ప్రళయమయమయింది. నాయకులందరూ నశించారు- నేను జీవించి యీ దుఃఖం అనుభవించడంకంటె మర ణించడం నాకు మహానందం అనిపిస్తోంది- లోకనింద్యుడయిన దుర్మా ర్గుడు బ్రతుకుటకంటె చచ్చుటమేలు" అని నిశ్చయించుకొని గవలుడు ఆమండినమంటలో తన శరీరాన్ని మిడతవలె ఆహుతి చేసికొన్నాడు- "ఇలా గాధి నిర్వేదంచేత అగ్నిలో ప్రవేశించి, తన శరీరాన్ని దహింప చేసికొనేసరికి, ఆసమయంలో కలిగిన సంచలనంచేత సరస్సులో అఘ మర్షణ స్నానంచేస్తున్న గాధికి, నీటిలో ఉండగనే ఛప్పున తెలివి వచ్చింది- అన్నారు వసిష్ఠులు శ్రీరామునితో.

ఇలా వసిష్ఠమహర్షి శ్రీరామునితో చెప్పుచుండగా సాయంకాలమయింది– సూర్యుడస్తమించాడు– సాయం తన కృత్యం నెరవేర్చుకొనుటకు సభఅంతా లేచింది– మరల సూర్యోదయంతో సహా సభాస్థలినలంకరించింది–

ఇట్లు వసిష్ఠ శ్రీరాముల సంవాదము పన్నెండవరోజు
ప్రసంగము ముగిసినది.

## ౮౭. ప్రత్యక్షావలోకనము.

వసి॥ రామా ! గాధి రెండుక్షణాలలో ఈ ప్రపంచభ్రాంతినుండి తెప్పరిల్లుకొని మనోనిర్మాణమునుంచి బయటపడి తెలివితెచ్చుకున్నాడు. కల్లుత్రాగినవాని మత్తు దిగిపోయినట్లయింది ఇతనిపని– "నేను గాధిని. నేను స్నానతర్పణాదులు చేయవలెను. చండాలరాజ్యాదులు నాపనులు కావు–" అని తెలుసుకున్నాడు. నీటిలోనుంచి కాలుపైకి తీశాడు– ఒడ్డుచేరి ఆప్రదేశం అటుఇటు చూచేసరికి ఆశ్చర్యం కలిగింది ఇతనికి– క్షణకాలం "నే నెవరు ? నాకు కనిపించేదిఅంతా ఏమిటి ? నేనేమి చేసినాను?" అని కనుబొమ్మలు చిట్లించుకొంటూ ఆలోచించుకున్నాడు లోలోపల– "అలసటచేత క్షణకాలంలో నాకు మహాభ్రాంతి కలిగిందని గుర్తించి ఉదయార్కునివలె లేచి నీటిలోనుంచి ఇలా ఆలోచించాడు– "నాతలి తండ్రులూ నాచిన్నతనంలో యేనాడో పోయారుగదా! నాకు వివాహమే కాలేదు– ఆడవారి ముఖమే నెన్నడూ చూచి యెరుగనే నాబంధువులందరూ నాదేశానికి చాలదూరంగా ఉన్నారే! ఇలాంటి నేను ఇప్పుడు భార్యలమధ్య, తలితండ్రులమధ్య, బంధువులు చుట్టుమూగియుండగా చావటం ఏమిటి? ఎంతటి భ్రాంతిలోపడ్డాను ? ఇదంతా కల్పనామాత్రమేకదా ? నామనస్సృష్టిలో నేను చూడడమే కదా ?" కనుక నేను బంధువులమధ్య మరణించడమనే విషయం వట్టిభ్రాంతి– అది అలాఉండనీ– "ఇది అంతా మాయామోహం– ఇందులో నిజ

మేమీలేదు. బెబ్బులి అడవిలో తిరిగినట్లు మానవులచిత్తము నిత్యమూ అంతులేని భ్రాంతిజ్ఞానాలలో తిరుగుతూనే ఉంటుంది.''అని నిశ్చయించుకొని భ్రాంతిని పోగొట్టుకున్నాడు గాధి. కొన్నిరోజులు తన ఆశ్రమంలోనే గడపాడు- ఇలాఉండగా ఒకనాడు ఒక అతిథి గాధియొక్క ఆశ్రమానికి వచ్చాడు- గాధి ఆయతిథిని ఫలపుష్పరసాశనములతో తృప్తిపరచాడు- అంతట ఉభయులూ స్నానసంధ్యాద్యనుష్ఠానములను తీర్చుకున్నారు- జపతపాలు ముగించుకున్నారు- మృదువయిన పల్లవశయ్యను ఆసాదించి పరున్నారు- అపుడు వారిద్దరకు ఇలా సంభాషణ జరిగింది- మొదట గాధి ఆవచ్చిన అతిథిని ఇలా అడిగాడు ప్రసంగంలో "బ్రహ్మన్ మీరు చాలా కృశించి ఉన్నారే! శ్రమపడి ఉన్నట్లు కనిపించుచున్నారే! ఏమికారణం?''అన్నాడు సమాధానం చెబుతాడు అతిథి-

అతిథి॥ మహాశయా! నేను కృశించడానికీ, శ్రమపడటానికి కారణం చెబుతావిను యథార్థంగా- మేము ఎప్పుడూ అబద్ధం చెప్పము-

"భూ మండలంలో ఉత్తరదిక్కున కీరమని ఒక ప్రసిద్ధమయిన దేశంఉంది. ఆదేశంలో నేను ఒకమాసం రోజులున్నాను. అచ్చటి పురజనులగౌరవానికీ, వారు ఇచ్చేడి ఆహారపదార్థాలకీ ఆశపడినాను-'' ఇలాఉండగా ఒకనాడు ఒకడు ప్రసంగవశంలో ఇలా చెప్పాడునాతో ఒకానొకచోట ఆదేశంలో "ఇచట ఒక మాలవాడు తాను బ్రాహ్మణుడనని చెప్పి యెనిమిదేండ్లు మాకు రాజుగా రాజ్యమేలాడు- తరువాత ఆతని నిజస్థితి మేము తెలిసికొనే సరికి, అతడు అగ్నిలోపడి మరణించాడు- ఆతనితోటి స్పర్శసంభాషణాదులచే తాము చెడిపోయినట్లు గుర్తించి నూరుమంది బ్రాహ్మణాదులు నిప్పులోపడి మృతిచెందారు''అని

ఈమాట ఆదేశస్థుల నోటవిని, నేనాదేశంనుంచి లేచివచ్చి ప్రయాగచేరి శుద్ధికొరకు ప్రాయశ్చిత్తం చేసికున్నాను, కృఛ్రచాంద్రాయణవ్రతమును అవలంబించాను ముమ్మాటు- ఇప్పటికి మూడోసారి

ఆఖరయింది. ఈరోజు వ్రతసమాప్తి కనుక పారణపురోజు. అందుకుగా నేను ఇచటకు వచ్చాను. అందుచే అలసిఉన్నాను- చిక్కి ఉన్నాను- అన్నాడు. అతిథి గాధితో-

వసి॥ రామచంద్రా! ఈ విషయం అంతా గాధి ఆ యతిథినుంచి విని కూడా మాటిమాటికి మళ్ళీమళ్ళీ తరచి అడిగాడు బ్రాహ్మణాతిథిని గాధి- ఎన్నిమార్లు అడిగినా ఆ అతిథి అలాగేచెప్పాడు. గాధి ఆశ్చర్య పోయాడు. ఆరాత్రి గడచింది తెల్లవారగానే ప్రాతస్నానాదులను నెర వేర్చుకొని అతిథి గాధితో చెప్పి వెళ్ళిపోయాడు- ఆపైన గాధి ఇలా ఆలోచించుకున్నాడు- "నేను కలలో (భ్రాంతిలో) ఏవిషయాన్ని తెలిసికున్నానో ఆవిషయం అంతా ఈ బ్రాహ్మణుడు నిజంగాచెప్పాడు. కనుక ఒకవేళ ఇదంతా శంబరునియొక్క మాయానిర్మాణం అయి ఉంటుందా! నేను బంధువులమధ్య మరణించడం అనేది తప్పకుండా మాయే. అందులో సందేహంలేదు అదినాకే అనుభవంలో ఉంది. ఇక నేను చండాలునిగా నుండి ఆ దేశంలో రాజుగా ఉన్నాననేది విచా రించి ప్రత్యక్షంగా తెలిసికోవాలి అని నిర్ణయించుకున్నాడు గాధి- వెంటనే భూతమండల దేశములో చివరనున్న గ్రామానికి వెళ్ళాడు బయలుదేరి- దీనినిబట్టి రామా! పురుషప్రయత్నమునకు సాధ్యంకానిది లేదని తెలుస్తుంది- ప్రాజ్ఞులు తమ పురుషప్రయత్నంచేత మనో రాజ్యాన్నికూడా ప్రత్యక్షం చేసికోగలరు. అందుకు ఈగాధి స్వప్నంలో చూచినదానిని ప్రత్యక్షపరచుకొనుటయే తార్కాణము- సర్వమూ ప్రయత్నంచేత లభిస్తుంది- కనుకనే గాధి జగన్మాయను ప్రత్యక్షపరచు కొనుటకు ప్రయత్నించాడు-

గాధి యిలా బయలుదేరి మధ్య అనేక దేశాలు దాటి తాను వెనుక రాజ్యమేలిన భూతమండలదేశం చేరాడు- ఆ దేశం చివర తాను నివసించిన గ్రామం ప్రవేశించాడు- అందులో మాలవానికొంప కూడా చూచాడు- అందు తాను మాలవాడుగానూ రాజుగానూ, ఉండుట

కూడా వైరాగ్యపూరితమయిన మనస్సన్నివేశంతో తెలుసుకున్నాడు- ఆమాలగృహము (మాలకొంప) గాధి మనస్సును వైరాగ్యమార్గంలోకి దించింది. ఆయిల్లు (మాలకొంప) ఇలా ఉంది. వర్షకాలపు ధారా వర్షంచేత గోడలమీాద గడ్డిచెట్లు మొలచిఉన్నాయి- ఇంటికప్పు అంతా సగం చిందవిందరగా లేచిపోయిఉంది- లోపల తాము పడుకున్న చాప ముక్కలు కనిపిస్తూ ఉన్నాయి- గోడలు మాత్రమే మిగిలి గట్టి దారిద్రాన్ని దౌర్భాగ్యాన్ని సూచిస్తోంది- (అనగా దారిద్ర్య దౌర్భాగ్య దౌరాత్మ్య దుర్దశలు ఇలా ఆకారం ధరించి కనిపిస్తూ ఉన్నాయా ! ఏమి! అన్నట్లు కనిపిస్తోంది ఆకొంప.) ఇంకా ఆయింటిలో గవాక్ష మహిషముల ఎముకలూ, దంతాలూ, పడిఉండి సాక్ష్యమిస్తున్నాయి ఇది మాలకొంప అని. ఇంకా తాము నీరు త్రాగిన కుండపిడతలూ, అన్నంతిన్న మూకుళ్లూ, వర్షానికి పడిననీటితో నిండిఉన్నాయి. ఇలాంటి కొంపను వెంటనే చూచాడు గాధి.

ఇదంతా చూస్తే తన శరీరమే ఎండిన శవాకారమై ఇలా కనిపిస్తూ ఉన్నదావిమి? అని తోచింది గాధికి- అత్యాశ్చర్యం కలిగింది- వెంటనే ఆయిల్లు విడిచి ఆసమీాపంలో ఉన్న మరోకుగ్రామం చేరాడు- ఆవూరిలో ప్రజలను అడిగాడు "మీాపూరి చెంప ఉన్న ఆమాల రాజు వృత్తాంతం మీాకు తెలుసా ? చాలాకాలంక్రిందట జరిగిన వృత్తాంతాన్ని కూడా బుద్ధిమంతులయినవాళ్లు ప్రత్యక్షంగా అరచేతిలోని పండువలె స్పష్టంగా తెలుసుకుంటారని విన్నానునేను పెద్దలవల్ల- కనుక ఓ గ్రామపెద్దలారా ? మీా ప్రక్కఊరిలోని ముసలిమాలవాని వృత్తాంతం మీాకు జ్ఞాపకమున్నదా ? ఉన్నచో నాకు ఉన్నదిఉన్నట్లు నిజంచెప్పండి, బాటసారులు సంశయాలను తీర్చేయెడల గొప్పఫలమున్నదని అంటారు" అని మాటిమాటికి గాధి ఆ గ్రామవాసులను అడుగగా వాళ్లు ఇలా జవాబు చెప్పారు.

గ్రామ్యాః- హేబ్రహ్మన్ ! మేము చెప్పేది అంతా నిజమని నమ్ము ఉన్నది ఉన్నట్లు చెబుతున్నాము మీాకు. మాప్రక్క పల్లెలో

"కటంజుడ"ను పేరుగల మాలవాడు అతిభయంకరాకారుడై, పుత్ర పౌత్ర సుహృద్భృత్య బంధుస్వజన బృందంతో కూడుకొని, మఱ్ఱిచెట్టు యొక్క ఆకులవలె అతివిస్తీర్ణమయిన కుటుంబంగల వాడయినాడు- ఫలపుష్పసమృద్ధమయిన వనమును కార్చిచ్చు నాశనంచేసినట్లు ఆముసలి మాలని కుటుంబంఅంతా ఆతనిభార్య మృత్యురూపమై నాశంచేసింది- అంచేత ఆదేశం విడచి కీరపురానికి వెళ్ళి యెనిమిది సంవత్సరాలు రాజుగాఉన్నాడు- ఆ పట్టణంలోనివారు ఇతని నిజస్థితిని తెలుసుకొని తుదకు ఇతణ్ణి నిరాకరించారు, వెలివేశారు, అదిభరించలేక అగ్నిప్రవిష్టుడై శుద్ధిచెందాడు-పట్టణవాసులుకూడా అగ్నిప్రవిష్టులై పరిశుద్ధులయినారు- ఎందుకు మీరింత ప్రయత్నపూర్వకంగా ఆమాలని వృత్తాంతం అడుగుతున్నారు ? ఆయన మీకు బంధువా ? లేక స్వయంగా అతనికి బంధువయినారా ?" అని అడిగారు వాళ్లు-

ఇలా చెప్పుచున్న వాళ్ళను గాధి మాటిమాటికీ గుచ్చిగుచ్చి అడిగాడు- ఇలా ఆప్రాంతంలో ఒక్కమాసం ఉన్నాడు- వాసయోగ్యాల గృహాలలో- ఎక్కడ విచారించినా వాళ్ళంతా తాను అనుభవించినట్లు నిజంచెప్పారు. వాళ్ళ నోటినుంచి నిజపరిస్థితిని చెప్పగా తెలిసికొని గాధి అత్యాశ్చర్య భరితుడయినాడు.

## ౪౮. మాయామహత్వకథనం.

వసి॥ రామా ! గాధి యింకా ఆమాలవాని కొంపలోనే మనస్సును ప్రవేశపెట్టాడు- కలిగిన ఆశ్చర్యానికి అవధి (హద్దు) మీరింది- ఆ యా స్థానాలూ, సదనాలూ, (గృహములూ) చూచాడు- తన మనస్సులో తానే చెప్పుకున్నాడు- "ఇదుగో ఇవి చచ్చిన ఏనుగుల దంతపంక్తులు. ఇంటిచుట్టూ ప్రాకారపుగోడగా పాతబడినవి- ఇదుగో ఇచ్చట పూర్వం ఉత్సవరోజుల్లో మతించి మాలవాని బంధువులతో సహా ఆడకోతుల మాంసం వండుకొని తిన్నచోటు ఇక్కడ ఏనుగుమదం

కలిపిన మద్యమును త్రాగి నిద్రించినచోటు- ఇచ్చోట పిణ్యాకములతో, మాంసములతో పెంచిన ఆడకుక్కలను తోలు త్రొక్కించో వచ్చిన మదపుటేనుగుల దంతాలకు కట్టేసిన తావు. ఇది ఏనుగుల కుంభస్థలంలోని ముత్యాలు పోసిన, ఏనుగదంతాలతో తయారుచేసిన మూడుకుంచాల పరిమాణంగల పాత్ర- నల్లటి దున్నపోతుచర్మంచేత ఆచ్ఛాదించబడిఉంది ఇది- ఈతావుల ఈగ్రామం చివర మరికొన్ని తావుల మాలపిల్లలతో కూడా పాంసుక్రీడలాడిన తావు. ఇచ్చట కాకి పిల్లలు నిశ్వాసవాయువులచే వెదురుకర్రలతో పిల్లనగ్రోవివలె పాడిన తావు- ఇచ్చట ఆడకుక్కలరక్తం త్రాగబడినది- ఇచట శవాలంకారాలు సంపాదించినతావు- ఇచ్చట వివాహసమయాలలో కుటుంబంతో కూడా నృత్యమాడిన తావు- ఇచ్చట ఎగిరిపోయే పక్షులను పట్టుకొనుటకు తయారుచేసిన వంశపంజరం (వెదుపేళ్ళబుట్ట) అని తనలో తానే చెప్పుకున్నాడు-

వసి॥ రామా! గాధి ఈవిధంగా వెనుకటి కథలను స్మరించుకుంటూ, స్థానములను తిలకించుచూ, విధివిలాసాన్ని మనస్సులో సూమన్న చేసికొంటూ ఆశ్చర్యావిష్టుడై చాలకాలానికి బయలుదేరాడు అచటినుంచి- భూతమండలదేశం విడచాడు- దేశాంతరం చేరాడు- నదీశైలాటవులను దాటాడు- మంచుకొండను ప్రవేశించాడు- అచట తాను వెనుక చూచిన కీరదేశాన్ని తిలకించాడు- అందులో రాజుగారి అత్యున్నతమయిన ప్రాసాదం ప్రవేశించాడు- అచ్చట తాను నివసించిన ప్రాసాదాములనూ, ఇతరులు నివసించిన గృహములనూ, ప్రాసాదములనూ, తానుసేవించిన ఆరామాలనూ చూచాడు-

అచ్చటి జనులనుకూడ ఈ శ్వపచుని (మాలరాజు) వృత్తాంతం యథార్థంగా చెప్పమని అడిగాడు-

నాగరులు॥ ఆపట్టణవాసులు ఉన్న యథార్థం చెప్పారు ఇలా- “అయ్యా! ఇక్కడ శ్వపచుడు ఎనిమిది సంవత్సరాలు రాజ్యంచేశాడు.

మంగళకరమయిన ఏనుగ అతనికి రాజ్యం ఇచ్చింది– తుదకు అతను మాలడని తెలిసికొనేసరికి అగ్నిప్రవేశంచేశాడు" అన్నారు– రామా! ఆ దేశంలో పన్నెండు సంవత్సరాలున్నాడు గాధి యీవిచారణకు, కుతూహలంతో ఇతడు ఎవ్వణ్ణి అడిగితే వాడల్లా ఇలాగే చెప్పాడు– వింటూవచ్చాడు గాధి– తన ప్రత్యభిజ్ఞకు సరిపోయిందికనుక చమత్కారం అనుభవిస్తూ వచ్చాడు.

తరువాత ఆపట్టణంలో రాజరూపంతో ఉన్న శంఖచక్రగదాధరుడయియున్న విష్ణుమూర్తిని చూచాడు గాధి అప్పుడే రాజగృహము నుంచి బయలుదేరి వస్తుండగా– అతని వెంట యీగాధియొక్క– వెనుకటి సేన, వాహనాదులు ఉన్నవట– చూడగానే తన వెనుకటి రాచరికము స్మృతికి వచ్చింది. 'వీరు కీరకామినులు' 'ఈయవి వింజామరలు!' 'వీరు వింజామర వీచెడివారు' 'ఇవి మదపుటేనుగుల గుంపులు' 'వీరు సామంత రాజులు' 'ఇవి కల్పవృక్షములవలె సంకల్పానుసారమయిన ఫలముల నిచ్చెడి వృక్షములు' 'ఇవి ధనధాన్యాది వస్తుసమూహములు' 'ఇవి కల్పవృక్ష లతా కుంజములవలె సుందరమయిన గృహపంక్తులు' 'ఇది నేను వెనుక అనుభవించిన కీరజనరాజ్యం' 'నాస్వప్నం అంతా సత్యంగా నాకు జాగ్రత్తు అయింది' 'ఈమాయ ఇలా ఎందుకు విజృంభించిందో తెలియకున్నది.' 'అబ్బా! యీ దీర్ఘకాల మనోభ్రాంతిచేత నేను వివశుడయ్యాను.' ఛీ! కష్టం నామనస్సు వాసనలచే చెడిపోయింది. 'నేను వట్టి మూఢుడను' పసిపిల్లలకు కలిగినట్లు నాకు అతివిస్తృతమయిన భ్రాంతులు పుట్టుచున్నవి– "ఈమాయ అంతా ఆ చక్రధారియగు శ్రీ మహావిష్ణువు నాకు చూపెట్టాడని యిప్పుడు నాకు గట్టిగా జ్ఞప్తికి వచ్చింది– కాబట్టి యిపుడు యీకొండ గుహలో కూర్చొని ప్రయత్నిస్తాను ఈమాయ ఎలాపుట్టిందో "ఎలా ఉంటుందో" కనిపెటతాను– అని ఆలోచించి గాధి ఆపట్టణంనుంచి బయలుదేరి బయటికి వచ్చి ఆ మంచుకొండ గుహలో ప్రవేశించి ప్రశాంతంగా కూర్చొని ఒకటిన్నర

సంవత్సరం కొద్దిపాలు త్రాగుచూ తపస్సు చేశాడు శ్రీమహావిష్ణువు యొక్క అనుగ్రహంకోరకు- పిదప కొంత కాలానికి పుండరీకాక్షుడు పయోమూర్తియై (అనగా నిర్మలాకారుడై) ఆ కొండ గుహాలో ద్విజ మందిరం ప్రవేశించి గాధికి ప్రత్యక్షమయినాడు- ఇలా అన్నాడు అతనితో-

విష్ణువు॥ గాధీ! నామాయా వైచిత్ర్యం చూచావు కదా! ప్రాతీతికమయిన (భ్రాంతిసిద్ధమయిన) జగజ్జాలం నీకు ప్రత్యక్షమయినది కదా! నీ మనోవాంఛితమయిన నా మాయాదర్శనము నీకు సంప్రాప్త మయినా కూడా ఇంకా గిరితటగుహాలో (కొండచరియగుహాలో) తపస్సు చేస్తావెందుకు? ఇంకేమి కావాలేమిటి? అన్నాడు పుండరీ కాక్షుడు-

వసి॥ రామా! ఇలా చెప్పుచున్న హరిని చూచి గాధి పూల రాశితో పాదాలమీద పూజించాడు- అర్ఘ్యపాద్యాలిచ్చాడు- ప్రద క్షిణ నమస్కారాలు చేశాడు- ఇలా అన్నాడు శ్రీమహావిష్ణువుతో- దేవా! మిక్కిలి తమోమయమయిన వసీమాయను నాకు చూపించావుగో తమగు దానిని మరొకమాటు ప్రకటించండి- (కంటికి కనుపరచండి) మనస్సు వాసనా మాత్రంచేత ప్రభ్రాంతిని కనుపరస్తుందో స్వప్నంలో వలె, దానిని (ఆ భ్రాంతిని) జాగ్రదవస్థలో కూడ చాలాకాలం కంటికి ఎలా కనుపరుస్తుంది నీమాయ? నాకు నీటిలో ఒక్క ముహూర్త మాత్రంలో ఈస్వప్నవిభ్రమం కలిగింది- అది జాగ్రదవస్థలో కూడా ఆదే విధంగా ప్రత్యక్షమయింది. చాలాసేపు ఇది ఎలా? నేను శ్వపచ భ్రాంతితో (మాలవనే భ్రమతో, కొద్దిసేపుకాని, చాలాసేపుకాని చేసినపనులు నామనస్సులో ఉండవలసినవేకదా! శ్వపచ శరీరము యొక్క ఉత్పత్తి నాశములుకూడా మనస్సులో ఉండవలసినవే కదా? అలా ఎందుకుండలేదు? బయటికి ఎలా కనిపించాయి? అని అడిగాడు-

భగవంతుడు॥ గాధీ! నీవు ఏ జగద్భ్రాంతిని చూస్తున్నావో! అది అంతా నీకు ప్రత్యక్షంగా కాకుండా ఉండి వాసనాజాలంతో కూడిన

నీచిత్తరూపం చెందిన ఆత్మతత్త్వముయొక్క స్వరూపమై భాసిస్తోంది. అది నిజంలో లోపలిదీకాదు- బయటదీకాదు- కొద్దిదీకాదు- పెద్దదీ కాదు- నీవు ఉన్నదని తలచే యీపంచభూతాత్మమయిన ప్రపంచం అంతా నీచిత్తంలోనే ఉంది- బయటలేదు- పత్రపుష్పఫలాదులన్నీ మొలకలోనే ఉన్నాయి- అంతే ఈ ప్రపంచంకూడా- మొక్కలోనున్న పత్రపుష్పఫలాదులు ఆ మొలకకు బయట స్ఫురించినట్లు- బాహ్యపృథివ్యాది వాసనావిష్టమయిన నీ చిత్తమునకు అవి బయట కనుపిస్తున్నాయి. నిజంలో పృథ్వ్యాది ప్రపంచం చిత్తమునందే ఉన్నదికాని బయటలేదు- కుమ్మరి వర్తమానకాలంలో ఉన్నకుండను కంటితో చూస్తాడు- తయారు చెయ్యబోయే కుండయొక్క ఆకారాన్ని మనసా సమర్థించుకుంటాడు- గడచిన కుండను మనసా స్మరిస్తాడు- ఇది మొదటిది రూపాలోకకాలము- రెండవది మనస్కారకాలము- మూడవది తత్తాకాలము (స్మర్యమాణకాలము) ఈమూడు కాలములను సూర్యాదుల గమనమే వ్యక్తపరుస్తుంది. ఇందులో రూపాలోక మొక్కటే బయటిది- మిగిలిన రెండును లోపలివే- అనగా మనస్సులోవే- అలాగే చిత్తము కూడా ఈ ప్రపంచాన్ని తనలో ఉపసంహారము చేసికొంటున్నది- బయటికి సృష్టిస్తోంది- ఇది లోకానుభవ సిద్ధము- పెళ్ళగించి వేసిన చెట్టుకు, ఆకులూ కొమ్మలూ ఎలాపుట్టవో, వాసనారహితుడయిన జీవునకు కూడా అలాగే జన్మమరణాలు ఉండవు. కాబట్టి నీమనస్సులో ఉన్న వాసనాజాలంలో ఏకదేశమే (కొద్దిభాగముమాత్రమే) ఈశ్వపచ వృత్తాంతము. నీవు ప్రతిభావశంచేత మహత్తరమయిన శ్వపచ వృత్తాంతాన్ని మనస్సు ఉన్నదానినే ఎలాచూచావో! అలాగే నిజమని నీవనుకొన్న "అతిథి వచ్చుట" మున్నగు వృత్తాంతం (ప్రపంచజాతం) కూడా మనస్సులోనిదే- కనుకనే అతిథి వచ్చినట్లూ, తిన్నట్లూ, పరుండినట్లూ, శ్వపచ వృత్తాంతం చెప్పినట్లూ భ్రాంతిని పడ్డావు నీవు అదే భ్రాంతిలో లేచివెళ్ళావు- భూతమండలం చేరావు. అచటి గ్రామాలు కూడా చూచావు- ఇదీ భ్రాంతియేసుమా- అదే రీతుగా కటంజుని పడిపోయిన

గుడిసె చూచుట, అచ్చటి జనులవల్ల కటంజ వృత్తాంతం వినుట, కీర నగరం నీవు చేరుట. కీరులచే శ్వపచరాజ వృత్తాంతమును తెలిసికొనుట. ఇదంతయు నీకు భ్రాంతిసిద్ధమే కాని పరమార్థముకాదు- నీవు ఇది నిజమని పొరపడుచుంటివే కాని, ఎంతమాత్రము నిజముకాదు- నీవు ప్రత్యక్షంగా కీరనగరం చూచావనుకున్నది భ్రాంతే- అష్టముహూర్తస్నాన కాలంలో మాయచే భ్రాంతిపడ్డావనుకున్నదీ భ్రాంతే- ఇందులో ఏదీ నిజం కాదు- సంవత్సరం సాధించతగిన పని స్వప్నంలో ఒక్క క్షణ కాలంలో జరిగిపోతుంది- కనుక అక్కడ అతిథీ లేడు కీరనగరమూ లేదు. భూతములూ లేవు- అంతా నీవ్యామోహమే- అతిథి వాక్యంవిని భూత మండల దేశానికి బయలు దేరాలని అనుకొని బయలు దేరినట్లు భ్రమించావు. నీవు త్రోవలో గిరికందరంలో విశ్రమించినట్లు భ్రమించావు. వ్యామోహ పరవశచిత్తుడవు కనుక భూతమండలాన్ని శ్వచాపగారమును (మాలవాని కొంపను) చూచాననుకున్నావు- అంతే కాని నీవు ఎక్కడికి వెళ్ళలేదు- ఏదీ చూడలేదు- ఇక్కడనే సరస్సులోని నీటిలో ఉన్నావు-

కనుక తత్త్వజ్ఞానం కలుగు నంతవరకు భ్రమకు దేశకాలం నియమంలేదు- ఏది ఎక్కడనయినా కనిపిస్తుంది- ఏ కాలంలోది ఏ కాలంలో నయినా కనిపిస్తుంది- అలాగే అయింది- నీపరిస్థితిఅంతా- కనుక ఇంక లెమ్ము- బ్రహ్మచర్యాశ్రమానికి తగిన అగ్నికార్య స్వాధ్యాయాది నిజకర్మను ఆచరించు- ప్రశాంతచిత్తుడవై ఉండు. మానవులు స్వకర్మానుష్ఠానం లేనిదే శ్రేయస్సును పొందలేడు- అని గాధికి ఉపదేశించి పద్మనాభుడు వివిధ మునిగణపరివృతుడై పాలసముద్రమును జేరెను.

## ౭౯. గాధికి జ్ఞానప్రాప్తించుట.

వసి॥ రామచంద్రా! విష్ణుమూర్తి అంతర్ధానం చెందగానే గాధికి విష్ణువు చెప్పినమాట నిజమువునా! కాదా? అనే సందేహం కలిగింది. నేను చూచినదంతా భ్రాంతి అని చెప్పాడు శ్రీమహావిష్ణువు-

"అది నిజమో అబద్ధమో మళ్ళీ వెళ్ళిచూస్తాను" అని కున్నాడు- మళ్ళీ అదే విచారంలో పడ్డాడు- గాధికి మరల అలాగే కనిపించింది- జనులు కూడా అలాగే చెప్పారు- మరల కొండగుహను జేరి భగవంతుని (విష్ణువును) ఆరాధించాడు- కొద్దికాలంలోనే భగవంతుడు ప్రత్యక్ష మయ్యాడు- అనుగ్రహించాడు- "ఎందుకు మళ్ళీ తపస్సుచేస్తున్నావు" అని అడిగాడు పుండరీకాక్షుడు-

గాధి॥ స్వామీ! నేను ఆరుమాసాలు భూతమండలదేశాన్ని కీరపట్టణాన్ని తిరిగాను, అచ్చటి ప్రజలంతా నావృత్తాంతం యథా తథంగానే చెప్పారు- నాకుకూడా అవేగుర్తులు కనిపించాయి- మీరు నాతో అది అంతా భ్రాంతి అని చెప్పారు "మహాత్ములమాటలవల్ల మోహం పోవాలికాని, మోహంవృద్ధికాకూడదు-" అని అన్నాడు గాధి-

శ్రీభగవానుడు॥ గాధీ! నీచిత్తంలో ఈ వృత్తాంతమంతా ఎలా భ్రాంతిగా తోచిందో, అలాగే భూతమండల దేశవాసులకునూ, కీరదేశవాసులకునూ, కటంజక, శ్వపచుల వృత్తాంతం భ్రాంతిగానే తోచింది- కనుకనే వాళ్లు నీతో నీకుతోచినట్లే చెప్పారు-

బాధకజ్ఞానంలేనిదే ప్రతిభాస (భ్రాంతిజ్ఞానము) నివర్తించదు- ఒక మాలవాడు గ్రామసమీపంలో ఒకానొక కొంపను కట్టుకున్నాడు- అది "నేను కట్టుకున్నానని" నీవు అభినివేశపడ్డావు భ్రమపడి- ఒకానొక పుడు ఒకేభ్రాంతి అనేకమందికి కలుగుతుంది ఒకే సమయంలో. కాకోల మనే కాకి విశేషము తాటిపండుమీద కూర్చున్నట్లు మనోగతి అతి విచిత్రము- అనేకమంది పిల్లలు ఒకేఆటలో నిమగ్నులవుతూఉంటారు- అలాగే అనేకమంది ఒకేరకమయిన కలకంటారు ఒకే సమయంలో- పచ్చికచే నల్లగాఉండే ఒకే వనప్రదేశంలో అనేక లేడిపిల్లలు సంచరిస్తూ ఉంటాయి- ఒకే సమయంలో- తమతమ ప్రారబ్ధవశంచేత పరిణామ కాలంలో అనేకరకములయిన ఫలములు పొందదగియున్నా, సైనికులు మొదలగువారు ఒకే సమయంలో ఆయారూపమయిన ఫలభ్రాంతితో

యుద్ధాదిప్రయత్నాలు చేస్తూఉంటారు- ఆరూపనులను అడ్డుపరచుటకు గాని, అనుకూలపరచుటకుగాని, కాలం కారణమనే లోకప్రవాదము భ్రాంతిమాత్రము- (కాలమనేది ఆత్మయందే యున్నది) కాలము ఆత్మనిష్ఠము- కాలానికి ప్రత్యేకంగా ఒక ఆకారంలేదు- కాలం బ్రహ్మస్వరూపము- కాలమనేది దేనినీ గ్రహించలేదు- త్యజించలేదు- "జన్యానాం జనకః కాలః" అనున్యాయప్రమాణంజన్య పదార్థమాత్రానికి కాలము ఉపాధియని అట్టివర్ష కల్పయుగాత్మకమగు కాలమును, సూర్యక్రియాచంద్రపిండాది పదార్థసమూహములచే సంకల్పింపబడుతోంది- కాలముచే పదార్థసమూహం కల్పింపబడుతోంది- కనుక, గాధీ! సమానాకారమయిన భ్రాంతి, నీకూ, భూతమండలవాసులకూ, కీరపురవాసులకూ ఒకేసమయంలో కలుగుటచేతనే అందరకు ఒకేరకమయిన జ్ఞానం కలిగింది- కాబట్టి నీమనస్సులో ఉన్నట్లు వారు చెప్పారు. వారు చెప్పినట్లే నీమతికీ తోచింది. ఇకనయినా ఈవ్యామోహం తీసివేసికొని వర్ణాశ్రమధర్మాలను ఆచరించుచూ, ఆత్మవిచారం చేసుకుంటూఉండు ఇక్కడే- నేను వెళ్ళివస్తాను అనిచెప్పి భగవంతుడయిన పుండరీకాక్షుడు అంతర్థానమయినాడు- కాని గాధి మాత్రం ఆకొండ గుహలోనే ఉన్నాడు- అనగా గాధి మనస్సు యింకా ఆకొండ గుహలోనే తిరుగుతోంది- అదే మనశ్చింతతో ఆలోచిస్తోంది- ఇలా కొన్ని మాసాలు గడవగా ఆగుహలో మళ్ళీ భగవంతుని ఆరాధించాడు గాధి అనే బ్రాహ్మణుడు- మరొకపుడు ప్రత్యక్షమయినాడు విష్ణుమూర్తి- మనోవాక్కాయకర్మలచే పూజించి యిలా అన్నాడు గాధి భగవంతునితో-

గాధి॥ స్వామీ! జననమరణాద్యనర్థబహుళమయిన ఈప్రపంచమాయను సంస్మరిస్తూ, నాస్వప్నస్థితిని (మాలవానినిగా ఉన్నస్థితిని) ఆలోచించుకుంటూ మహావ్యామోహంలో పడిపోతున్నాను- కనుక నాకు ఈమోహనివృత్తికి ఉపాయం చెప్పండి- చెప్పి వెంటనే వెళ్ళి

పోకండి- నాయీవత్సం దేహాలు తీరేంతవరకు, వ్యామోహం రూపు మాసేంతవరకు ఇక్కడే ఉండండి- నన్ను ఏదో ఒక మంచిత్రోవలో నియమించండి" అన్నాడు గాధి-

భగవా! గాధీ! ఈప్రపంచం అంతా మాయాశాంబరముయొక్క ఆడంబరము. ఇందులో అజ్ఞానంచేత అనేక ఆశ్చర్యజనకములయిన కల్పనలుతోస్తూ ఉంటాయి- నీవు కీరపురంలో కాని, భూతమండలంలో కాని చూచినదంతా మాయకు ఉచితమె- మానవులకు నిద్రలో ఊహించరాని భ్రమలు బయులుదేరుతూ ఉంటాయి- కనుక నీకు తోచిందంతా భ్రాంతికాని నిజం ఎంతమాత్రంకాదు. ఇదిగో నేను చెప్పేమాట ఒక్కటివిను- అసలువిషయం చెబుతాను- నీసందేహం తీరుతుంది- నీవు భూతమండలదేశంలో కటంజకుడనే మాలవాడు ఎలాంటివాడు ఉన్నాడని నీచిత్తంలో కల్పించుకున్నావో (భ్రాంతి పడ్డావో) ఆదేశంలోకూడా అలాంటివాడే, (అదేశరీరం, అదేగ్రామం, అదేయిల్లు, అదేభార్యకలవాడే) తయారయినాడు. నీటిలో మునిగి యున్న నీచిత్తంలో ఆకటంజునిస్థితి యావత్తూ నాసంకల్పవశంచేత నీచిత్తంలో భాసించింది- చిత్తము అనుభవించిన దానిని ఒకప్పుడు మరచిపోతుంది- అనుభవించని దానిని స్మరిస్తుంది- స్వప్నమనోరాజ్యం లోని సన్నివేశం ఎలాంటిదో మనస్సుకు జాగ్రత్తులోకిరాడ మనస్సు అలాంటి సన్నివేశంతోనే ఉంటుంద- యోగిదృష్టిలో భవిష్యత్కాలీన మయిన వస్తువు, తదుత్తరకాలంలో ఆవస్తువుచు చూచేవాళ్ళకు అది భూతకాలవస్తువే అవుతుంది- అలాగే కటంజుని చరితం గడచిపోయినా జరుగుచున్నట్లు తోచింది నీకు-

అయితే ఆకటంజుడు నేనేనని, వాని భార్యాబిడ్డలు నావారే యనీ, వానియిల్లు నాయిల్లేఅనీ ఎందువల్ల అహంమమాభిమానంలో మునిగానని నీకొక సందేహం కలగవచ్చు- కాని యీనీ సందేహం అత్యల్పమయినది. అనాత్మవేత్తలకు, అనాత్మభూతములగు, దేహా

గృహ కళత్రాదులందు అహంమమాభిమానం (అనగా దేహమునందు అహంభిమానమూ, గృహకళత్రాదులందు మమాభిమానమూ) లోకసిద్ధమైఉంది. సర్వాత్మాహంభావన గలవాడికి ఈఅభిమానం ఉండదు. పరిచ్ఛిన్నాహంభావం గలవానికే ఇదిఅంతా. అపరిచ్ఛిన్నాత్మాహంభావం గలవానికి కూడా అహంకారమున్నా, అది మజ్జనహేతువు కాదు- (అనగా వ్యామోహంలో ముంచదు). సొరకాయ బుర్ర నీటిలో తాను మునిగినను ఆశ్రయించినవానిని ముంచనట్లు- నీవు వాసనాజాలగ్రస్తచిత్తుడివి- రోగం కొద్దిగా వంటమిగిలియున్నవానివలె స్వస్థుడవు కాలేదు నీవు- (స్వరూపావస్థితమయిన ఆత్మను పొందలేదు)- పరిపూర్ణజ్ఞానివి కావు- కనుక మనోభ్రాంతిని పోగొట్టుకొనలేక పోతున్నావు- గట్టిగా తన యింటిని బాగుచేసికొనుటో, లేక పరాయివారింటిలో చేరుటో, లేనివాడు వర్షపుబాధను తప్పించుకోలేనట్లయింది నీపని. వెంటనే నీ మనస్సులో తోచిన భ్రాంతిచే నీవు పరాభవింపబడుతున్నావు- మాయ అనే చక్రానికి చిత్తమనేది మధ్యన ఉండేకుండ (నాభి) ఆకుండను ఆధారంగాచేసికొని చక్రం తిరుగుతూ ఉంటుంది- ఈ చిత్తమును ఆధారంగాచేసికొని మాయతిరుగుతూ ఉంటుంది- కుండ పగిలిపోతే చక్రం తిరగలేదు. చిత్తం ఆత్మజ్ఞానంచేత లయిస్తే (నశిస్తే) ఇంక నామాయ మానవుని బాధించలేదు.

కాబట్టి నీవు ఈకొండగుహనుంచి లేచి పది సంవత్సరాలు తపస్సు చెయ్యి- తరువాత నీకు అనంతమయిన ఆత్మజ్ఞానం కలుగుతుంది- అని చెప్పి పుండరీకాక్షుడు అంతర్ధానమయినాడు- గాధి వివేకవశంచేత వైరాగ్యంపొందాడు-

భ్రాంతిని రూపుమాపుకున్నాడు. ఇదంతా తన పురాకృతకర్మయొక్క చేష్ట అని నిర్ణయించుకున్నాడు. దానిని నిందించుకున్నాడు. తపోనుష్ఠానముకొరకు ఋష్యమూకమునకు బయలుదేరాడు- అచట పది సంవత్సరములు సర్వసంకల్పరహితుడై తపస్సుచేశాడు. ఆత్మ

జ్ఞానం సంపాదించుకున్నాడు— జీవన్ముక్తి పొందాడు—

గాంధ్యుపాఖ్యానము ముగిసినది.

౫౦. రాఘవాశయ వినియోగము.

వసి॥ రామా! ఊహింప అలవికాని మాయాశక్తి ఇంతటి గొప్పదనుమా! పరమాత్మను అండజేరి జీవులను బాధించడం దీనిపని— లేకపోతే గాధికి రెండుఘడియలసేపు కలవచ్చినట్లురావడం ఏమిటి? ఆ కొద్దికాలంలో అనేకసంవత్సరాలు మాలవాడుగా రాజ్యమేలటం ఏమిటి! స్వప్నభ్రాంతి ఎక్కడ? ప్రత్యక్షంగా కంటికి వస్తువు కనిపించడం ఎక్కడ? అంతా అబద్ధం (అసత్యం) కావడమేమిటి? ఏమాత్రం సందేహం లేకపోవడం ఏమిటి? కనుకనే నేను ఇంతటి మోహకారి మరొకటి లేదని చెప్పాను. ఏమాత్రమయినా పరాకుచెంది (అజాగ్రతగా) ఉన్నాడా మానవుడు గభాలున సంకటంలోకిత్రోసి ఊరకుంటుంది. అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ! ఈమాయాచక్రముయొక్క వేగాన్ని నిరోధించుకోవటం ఎలా? దీనికి వశంకాకుండా తప్పించుకోటం ఎలా? సెలవివ్వండని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! సంసారమే మాయయొక్క స్వరూపం— ఇది ఒక చక్రం వంటిది— ఈమాయాచక్రానికి మధ్యఉండే కుండ (నాభి) వంటిది చిత్తం— కనుక చిత్తమనే కుండను గట్టిగా కదలకుండ పట్టుకుంటే పురుష ప్రయత్నంచేత మాయాచక్రం తిరగడం మానుతుంది— (అనగా చిత్త నిరోధం చేసికుంటే, మాయానిరోధం సాధ్యమవుతుందని భావము)— తాడులాగితే ఆడే ఆటబొమ్మలు ఆతాడు గట్టిగాపట్టుకుంటే ఇంక కదలవు. అంతే దీని పనికూడా— రామా! నీవు చక్రయుద్ధములలో మొనగాడవే నేను చెప్పిన దృష్టాంతం నీకెందుకు తెలియులేదు— కుండ కదలకుండా పట్టుకుంటే ఇంక చక్రం కదలదు— కనుక సంసారచక్రానికి

నాభి(కుండ)అయిన చిత్తాన్ని పట్టుకొని సంసారచక్రాన్ని నిరోధించుకో- ఇంతకంటె మాయాచక్రం తిరగకుండా చేయడానికి మరొక యుక్తి లేదు. కనుక చిత్తనిరోధమనే యోగమే నీకుపాయం- ఈ ఉపాయం అవలంబించకపోతే మానవుడు పొందే దుఃఖానికి అంతుఉండదు- ఈ దృష్టితో ఉండి చిత్తనిరోధమనే ఉపాయం ఆచరిస్తివా ఇంక అగాధమింతా పోయిందే అనుకో- ఇందులో సందేహం ఉండదు నీవు అనాదియైన- సంసారమనే మహారోగం మానడానికి మనోనిరోధం అనే మందు కంటె మరో మందు ఇంతవరకు తయారు కాలేదు- ఇకముందు కూడా తయారు కాబోదు- కనుక రామచంద్రా! తీర్థయాత్రలూ, దానధర్మాలూ, తపోయజ్ఞాలూ మాని చిత్తమును వశపరచుకో- పరమశ్రేయస్సును పొందగలవు నీవు-

రామా! మనస్సులోనే సంసారం ఉంది ఘటంలో ఘటాకాశం ఉన్నట్టు ఘటం నశిస్తే ఘటాకాశం లేదు- చిత్తం నశిస్తే సంసారం లేదు- మహాకాశం ఘటంలో ప్రవేశించి ఘటాకాశమనే పరిచ్ఛేదాన్ని పొందింది- బాధపడుతోంది- ఇలా ఉండగా దైవాత్తు ఘటం పగిలిపోయింది- వెంటనే మహాకాశం పరిచ్ఛేదం భావం విడిచి తన నిజరూపాన్ని (మహాకాశస్వరూపాన్ని) ఆశ్రయించి సుఖించింది- అలాగే నీవుకూడా అపరిచ్ఛిన్న బ్రహ్మవై, మనస్సులో ప్రవేశించి, పరిచ్ఛిన్నమయిన జీవుడవై దుఃఖిస్తున్నావు- ఆ మనస్సును నశింపచేసినట్లైతే ఇంక నీకు పరిచ్ఛిన్నమయిన జీవభావం ఉండదు- అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మభావం పొందుతావు-నిరతిశయ స్వరూపానందం అనుభవిస్తావు నీవు-

వర్తమాన (అమలులోఉన్న) ప్రపంచవిషయాలను, రాగద్వేషాలు లేకుండా అనుభవిస్తూ, భూతభవిష్యద్విషయాలను మనసా తలచకుండా ఉండేయెడల చిత్తం (మనస్సు) నశించిపోతుంది. ప్రతి క్షణమూ సంకల్పరహితుడవై ఉంటే చిత్తం నశిస్తుంది. సంకల్పం ఉన్నంతవరకూ చిత్తముయొక్క విభూతులు పెరుగుతూనే ఉంటాయి-

మేఘాలు నభోమండలంలో ఉన్నంతవరకూ, వర్ష జలబిందువులు ఎక్కడో ఒకతావున తప్పవు- చైతన్యము చిత్తముతో కూడి ఉన్నంతవరకూ సంకల్పాలను కల్పిస్తూనే ఉంటుంది. చైతన్యము చిత్తారహితమయినదా (నిరాలంబమయినదా) ఆపైన కామకర్మవాసనాదులు మూలజ్ఞానంతో సహా మండిపోతాయి- తగలడిపోతాయి- చంద్రకిరణాలు సోకినంత వరకే మంచుబిందువులు- అవి పోయిన తరువాత ఇంక మంచుపట్టదు- చిత్తరహితమయిన చైతన్యమే ప్రత్యక్చైతన్యము- ఇందులో ఇంక సంకల్ప వికల్పాలుండవు- ఈస్థితియే సత్యమయినది- శివమయినది- పరమాత్మస్వరూపమయినది ఇదే- సర్వావభాసకమని చూపబడెను- ఆపాపిష్ఠి మనస్సుయొక్క ప్రసక్తి యెంతమాత్రం ఉండదు ఈస్థితిలో-

మనస్సు ఉన్నతావుకు ఆశలుచేరుతాయి- సుఖదుఃఖాలు చేరుతాయి- శ్మశానంలోకి కాకులు చేరినట్లు తత్త్వవేత్తలయిన విద్వాంసులకుకూడా మనస్సు ఉన్నదికాని, అందులో నివాసనామయమయిన బీజములు తత్త్వజ్ఞానంచేత నశించిపోతాయి- అందువల్ల వాళ్ళకు ఆశలుండవు- సుఖదుఃఖాలుండవు- రాగద్వేషాలుండవు- శాస్త్రాభ్యాసంచేతనూ, సజ్జన సహవాసంచేతనూ, అభ్యాసయోగంచేతనూ, ప్రాపంచిక వస్తువులు అవస్తువులని (అపారమార్థికమైనవని) భావన కలుగుతుంది- అజ్ఞానమునుంచి చిత్తాన్ని మరల్చాలి- పురుషప్రయత్నంచేతనూ, దృఢనిశ్చయంతోనూ, బలాత్కారంగా శాస్త్రాభ్యాసములందు ప్రవేశపెట్టాలి- ఆత్మను కనిపెట్టడానికి ఆత్మేముఖ్యకారణము. అగాధమయిన సముద్రంలో పడినరత్నాన్ని కనిపెట్టడానికి రత్నమేకావాలి- అవివేకంచేత ఆత్మ అనుభవించే దుఃఖాలు వివేకంచేత ఆత్మే పోగొట్టుకోవాలి. కాబట్టి ఆత్మ విజ్ఞానంలో ఆత్మేముఖ్యహేతువు- కనుక రామా! నీవు ఏపనిచేస్తున్నా సంకల్పరహితుడవై సంవిన్మాత్రపరుడవై ఉండు- ఎలాంటిదశలోనూ సంవిత్తును (చైతన్యమును) విడువరాదు- "ఇదినాది" "వాడునావాడు" "ఏమనేను" అనేవాసనలను విడిచిపెట్టు- కేవలాత్మ

నిష్ఠగా నుండు— బాహ్యవిషయానపార్థక్యములుగానూ, జాగ్రత్స్వప్న సుషుప్తులందరనూ చైతన్యాను సంధానంతో ఉండు— బాహ్యవిషయాలను విడిచి, మనస్సును నిర్మలపరచుకొని, చైతన్యానుసంధానం చేసికో. ఇది సహజము, ఇది అనుభవము, ఇది ఇష్టము, ఇది అనిష్టము, అనే భావాలు మనస్సులో ఉంచకూడదు. నిజంగా నీవు అంబని కపృకర వాది కారణాలను సాక్షివలె ప్రకాశింపజేయుచు, చిన్మాత్రస్వరూపుడవుగ నుండు— నీకు జాగ్రత్స్వప్నసుషుప్తులు లేవు— గంధమాల్యాది వస్తువులు లేవు. స్వపరభేదములు లేవు— ధర్మాధర్మములు లేవు— వజ్రస్తంభంవలె ఆత్మతత్త్వనిష్ఠ గట్టిగా ఉన్నచో— ఆత్మతత్త్వామృతాన్ని ఆస్వాదించువానికి హాలాహలంకూడా అమృతమవుతుంది.

రామా! నిర్మలమైన చిదంశను మరచినప్పుడే సంసారకారణమయిన మహామోహం వెంటపడుతుంది— ఆత్మనిష్ఠ కుదిరినప్పుడు ఈ మహామోహం పటాపంచలవుతుంది— స్వస్వరూపానుసంధానంగల జీవుడు ఆశాసముద్రాన్ని సులువుగా తరిస్తాడు అతనిచైతన్యం అతినిర్మలమై ప్రకాశిస్తుంది— ఆత్మానందం అనుభవించు వానికి ఇతర రసాయనాదులు విషప్రాయాలు అవుతాయి—

కనుక రామా! ఇలాంటి జీవన్ముక్తులతోనే మేము నిరంతరం స్నేహంచేస్తాము. మిగిలిన పురుషులను మేము కంటితోకూడా చూడము— వాళ్లు పురుషులమని పిలువబడుతున్న గాడిదలు— రామా! ఇతర యోగులూ, ఉపాసకులూ తత్త్వవేత్తల ముందర ఎంతమాత్రం చాలరు. మేరుపర్వతం ముందర ఏనుగు ఎంతటిదో, అంతటివారే తత్త్వవేత్తముందర యోగులుకూడా— ఈ చిత్ జ్యోతిస్సు ముందర సూర్యచంద్రాది జ్యోతిస్సులు ఎందుకూ కొరగావు— ఆత్మవెలుగు ముందర సూర్యాదులు పగటిదీపాలవలె వెలవెలపోతూ ఉంటారు— కనుక తేజస్వులలో కాని, ఈశిత్వవశిత్వాది యోగసిద్ధిగల వారలలో కాని, శరీరబలం కలవారలలో కాని, వాచాలురలో కాని, ఇతర ఔన్నత్య

ముగల వారలలోకాని, తత్వవేత్తయే గొప్పవాడు- మిగిలినవారందరూ ఈతని క్రిందివారలే- పరమాత్మయొక్క ప్రకాశతోనే సూర్యాది జ్యోతిఃపదార్థాలు ప్రకాశిస్తున్నాయి- సూర్యాగ్ని చంద్రమణితారకాదులు ఎలా ఆత్మప్రకాశచే ప్రకాశిస్తున్నవో, అలాగే ఆత్మతత్వాన్ని గుర్తించిన నరోత్తములుకూడా ప్రపంచంలో విరాజిల్లుచున్నారు- రామా! పుట్టలోని పురుగులకంటెనూ, నేలమీద తిరిగెడి గాడిదలకంటెనూ, చెట్టుమీద నివసించెడి పక్షులకంటెనూకూడా తత్త్వజ్ఞానం లేని మానవులు నీచులు (అధములు)- ఉన్న ఆత్మను అజ్ఞానంచేత గుర్తించకపోతే అనాత్మజ్ఞుడనీ, జ్ఞానంచేత గుర్తిస్తే ఆత్మజ్ఞుడనీ అంటారు తత్త్వవేత్తలు- అనాత్మజ్ఞుడు దుఃఖార్హమయిన పనులు సంకల్పిస్తూ ఎంతటి సొగసైనవేషం వేసుకున్నా, చైతన్యంలేని శవం మాదిరేవాడి బ్రతుకు- ఆత్మజ్ఞానికి ఏ వేషమూ లేకున్నా వాడు విలాసపురుషుడే- వాడు సచేతనుడే- చిత్తము స్థూలమయినచో సంపాదించుకున్న కొద్దిపాటిజ్ఞానంకూడా ఎగిరిపోతుంది దూరంగా, కారుమేఘుంకమ్మితే వెలుతురు ఎగిరిపోయినట్లు- కనుక మనస్సును కృశింపచెయ్యాలి. అది బలిస్తే మనకు చిక్కు- భోగాభిలాషను క్రమంగా తగ్గిస్తేకాని అది (మనస్సు) కృశించదు- "అనాత్మయందు ఆత్మభావన, దేహమాత్రమునందు ఆత్మభావన, పుత్రదారకుటుంబాదులందు మమత్వభావన, (ఇదినాది, అదినాది అను భావన) అన్నివస్తువులందు ఆసక్తి" ఇవి మనస్సు బలియుటకు హేతువులు- ఇంకనూ జరామరణదుఃఖాలూ, ఆధివ్యాధివిలాసాలూ, హేయోపాదేయ ప్రయత్నాలూ ధనలోభమూ, కాంతాకనకములందనురాగమూ, ఆపాతరమణీయమయిన సంసారమందు విశ్వాసమూ, దురాశాపుంజమూ, విషయములందు (ప్రపంచవస్తువులందు) సంచారమూ, ఇవన్నీ చిత్తము (మనస్సు) బలియుటకు హేతువులే-

రామా! శరీరమనేది పాడుగొయ్యి- ఇందులో ఎప్పుడో మొలిచింది చిత్తమనే విషవృక్షం పెరిగింది- ప్రరూఢమయింది- విచారసార

మానే రంపంతో నిన్ను కోసివేయుము- రాఘవా! రాజసింహా! శరీరమనే అడవిలో సంచరిస్తున్న చిత్తమనే మావపు ఏనుగును, బుద్ధిఅనే గోళ్ళతో చీల్చివేయుము- రామా! చెడుచోట ఆసక్తి కలిగి, శరీరములోని మాంసం గ్రసించిపుష్టిచెంది, ఇతరులను పొడిచిచంపుటలో నేర్పుగల ఓష్ఠములనె ముక్కులుగలిగి, స్వార్థమనే ఒకేచూపుగల, తామస వృక్షాలలో, నల్లనయిన చిత్తమనే కాకిని దూరంగా పారద్రోలుము- రామా! చిత్తమనే మగపిశాచాన్ని తృష్ణఅనే ఆడపిశాచం సేవిస్తోంది. వీళ్ళిద్దరూకలసి అజ్ఞానమనే వటవృక్షంమీద విహరిస్తున్నారు- లోగడ దేహశతములనే అడవిలో తిరిగి ఉన్నారు- ఇలాటి చిత్తపిశాచాన్ని నీ హృదయకోశంనుంచి వివేకవైరాగ్యములచే, పారద్రోలకపోతే నీకు స్వరూపావస్థానమనేముక్తి లేదుసుమా!

రామా! ఈ మనస్సు ఒక గొప్ప సర్పము- దీనికి శుభాశుభ కర్మలు ఆస్యము- (నోరు)- చింతలు విషము- శరీరమూ దీనికి కుబుసము. అనేకమంది మానవులను చంపింది ఇది- ప్రాణవాయువే దీనికాహారము- ఇది హృదయమనే బూరుగచెట్టుయొక్క తొర్రలో ఉంటుంది- చైతన్యమనే గారుడమంత్రం ప్రయోగిస్తేకాని యిది చావదు- కనుక రామా! ఆ గారుడమంత్రం ప్రయోగించి చంపి నీవు భయరహితమయిన స్థానము పొందు.

రామా! చిత్తమనేది ఒక గద్ద- ఇది యెల్లప్పుడు శరీరములనే శవపంక్తులను సేవించటంచేత అమంగళమయిన ఆకారాన్ని ధరించి ఉంది- జాగ్రత్స్వప్నములందు దిగంతములవరకు సంచరించి అలసటచెంది తుదకు సుషుప్తిఅనే శ్మశానంలో విశ్రమిస్తుంది- ప్రాపంచిక భోగాలనే మాంసం తింటుంది. ఇందుకుగాను దిగంతములవరకు పరుగిడుతుంది- ఇలాంటి చిత్తమనే గద్ద, నీశరీరమనే చెట్టునుంచి లేచిపోయినదంటే నీవు పూర్తిగా జయంపొందినట్లే-

రామా! మనస్సు అనేది ఒక మహామర్కటము- దీనినిపట్టి పాశ్చాత్యదేశాలకు పంపుము- ఇది గొప్పమేఘము- ఇది హృదయా

కాశంలో ఉంటుంది- వాసనాజాలమనే గాలికి తిరుగుతూ ఉంటుంది- దీనిని సంకల్పరాహిత్యమనే మంత్రముయొక్క ప్రభావంచేత రూపు మాపినపే కాని నీవు ముక్తి పొందజాలవు-

రామా! చిత్తమనే పాశాన్ని త్రెంచుకొనక నీకు ముక్తి రాదు- రామా! చిత్తమనే అజగరాన్ని దహింపచేయకపోతే నీవు పూర్ణానందము నొందజాలవు- రామా! నీవు మనస్సుచేతనే మనస్సును నిర్మూలపరచుకొని చాపల్యము విడు- రామా! తత్త్వజ్ఞానంచేత మనోలయం చేసుకొని, దృశ్యజాతమంతా గడ్డిపోచకంటె కూడా తుచ్ఛంగా చూచుచూ, ప్రారబ్ధశేషమును అనుభవించెడి విలాసతో లోకసంగ్రహం కొరకు సోమపానం చెయ్యి- ఋత్విగ్జనులతో యాగములందు విహరించు. శాస్త్రనిషిద్ధములు కాని లౌకిక కర్మలందు రమించు వాటివల్ల నీకేమాత్రమూ బంధప్రసక్తి లేదు-

## ౫౧. ఉద్దాలక మనోరథవర్ణనము.

వసి॥ రామా! చిత్తవృత్తులు, [illegible] ఐహికాముష్మిక విషయములతో సంగముకలవి కాన, అతిదీర్ఘములు- వాసనామయములు కాన అతిసూక్ష్మములు. ప్రమాదపడితే వెంటనే సమాధి సుఖాన్ని చెడగొట్టడానికి హేతువులు కనుక తీక్ష్ణములు- ఆత్మప్రతిబింబ గ్రహణమునకు తగినవి కనుక అతి నిర్మలములు. కనుకనే క్షురధారల (పదునైన కత్తియొక్క అంచుల) వలె, అవిశ్వసనీయములు. (నమ్మతగనివి)- వీటిని నమ్మియుండకు సుమా! చాలకాలానికి సత్కులక్షేత్రంలో పుట్టిన నీశరీరమనే లతయందు, చిత్తశుద్ధి, శ్రవణమనన నిదిధ్యాసలూ, అనే దోహదముల (ఎరువుల) చే, పరమాత్మను పరిచయం చేసుకునే బుద్ధి అనే ఒక లత (తీగ) పుట్టింది. దానిని దృశ్యపదార్థముల నుంచి దృష్టిని మరల్చుట అనే వివేకామృత జలసేకంతో తడిపి పెంచు. దీనిని చిన్నతనమునుంచి పెంచితేనే పెరుగుతుంది. వార్ధకం ప్రవేశం

చిందా, శరీరమనే లత వాడి నేలమీదపడిపోతుంది. పైకి లేవదీయుటకు కూడా సాధ్యంకాదునీకు- ఇంక అది కాచిపూచేది సున్న- నేనికముందు చెప్పబోయే ఆఖ్యానములందలి రహస్యార్థమును గుర్తించి, దానిని మాటిమాటికి మనసా భావించడమే, ఆ కాయ లత పెరగటానికి, కారణ మయిన, వివేక జలము- ఆభావననీకు నిరంతరం ఉండేయెడల నిరతిశయా నందం పొందుతావు. కనుక నీవు ఉద్దాలకునివలె, భూతపంచకమును "కారణముకంటె భిన్నముగా కార్యముండజాలదను" యుక్తితో, విశీర్ణ పరచి, (విశకలముచేసి) తదధిష్ఠానమయిన సన్మాత్రపదార్థమును సూక్ష్మ మయిన బుద్ధితో విచారించుకో- అని అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ విన్నాడు శ్రీరాముడు- "ఉద్దాలకుడు భూతపంచక మును ఎలావిశీర్ణంచేశాడు" అధిష్ఠాన చైతన్యమును ఎలాగుర్తించాడు! చెప్పమని అడిగాడు వసిష్ఠులవారిని- వసిష్ఠులు జవాబు చెప్పటం ప్రారం భించారు.

వసి॥ రామచంద్రా! పంచభూత వివేకంచేత ఉద్దాలకుడు తత్వ దృష్టిప్రాప్తించిన విధానం చెబుతావిను.

బోర్లించిన కుండలుమాదిరి కొండలుగల ప్రపంచమనే జీర్ణ గృహముయొక్క- (పాడుబడ్డ కొంపయొక్క-) కోణంలో గంధమాదన పర్వతంమీద ఒకానొక ప్రదేశంకలదు- అక్కడ కర్పూరగమ్మ [illegible] పరాగాలతోనూ, కింజల్కములతోనూ పూలుపూచినచెట్లు అనేకం ఉన్నాయి- వాటిమీద రంగురంగుల పిట్టలు (పక్షులు) నివసించి ఉండేవి- అనేకమంది వనేచరులు దాని చరియమీద తిరుగుతూ ఉంటారు. అచ్చట విలువలేని మహారత్నాలూ, ఒకచోట, పద్మరాగమణులవలె ఎర్రతామరపద్మములు ఒకచోట, మంచుగుట్టలు మరొకచోట, అద్దములవలె నిర్మలోదకముగల మహాసరస్సులు ఇంకొకచోట ఉన్నవి- అచ్చట దట్టమయిన నీడగల సర్జన వృక్షముక్రింద, యౌవనదశరాక పూర్వమే తాపసవృత్తిలో ప్రవేశించి, ఘోరతపమును ఆచరించెడి,

"ఉద్దాలకు" డను ఒక మహాముని ఉండేవాడు. అతడు మొట్టమొదట అల్పప్రజ్ఞుడు– (కొద్దిజ్ఞానంగలవాడు) కాని విచారకుశలుడు. పురుషార్థం సాధిద్దామనే పట్టుదల కలవాడు– నిర్మలచిత్తుడు– అతడికి తపస్సు చేతనూ, అభ్యాసక్రమంచేతనూ, క్రమంగా జ్ఞానం అలవడింది– ఇలా విచారించడం (ఆలోచించడం) ప్రారంభించాడు–

"పురుషార్థములలో ప్రధానమయిన పురుషార్థమేది? దేనియందు విశ్రాంతిచెందితే సుఖదుఃఖాలుండవో? పునర్జన్మఉండదో? అది నాకు లభించేదిఎలా? నేను ఎప్పటికి చిరస్థాయిగా విశ్రాంతి చెందుతాను– నా మనస్సులోని భోగవాసనలు ఎన్నడు శాంతిస్తాయి–"ఇది చేశాను" ఇది యింక చేయవలెను" అనేకల్పననుగూర్చి నేనెపుడు పరిహాసించెదను. నామతిలోని సంకల్ప వికల్పాలు ఎప్పటికి నశిస్తాయి– తరంగపరిపూర్ణమయిన తృష్ణానదిని నేనెపుడు దాటుదును? ప్రాపంచిక పదార్థాలతో ఈమూఢులు చేసే బాహ్యప్రవృత్తిని నేనెపుడు యెగతాళిచేతును? వీళ్ళపనులన్నీ పిల్లవాళ్ళ పిచ్చిచేష్టలవలె ఉన్నాయి– సంకల్పవికల్పాలతో ఊగులాడే నామనస్సు ప్రశాంతమయ్యే దెన్నడు? నేను స్వప్రకాశస్ఫురణముచే ప్రాపంచికపనులను పరిహాసిస్తూ లోలోపల నేను సంతసించేదెన్నడు? నేను ధర్మార్థకామములందు నిస్పృహుడనై, సర్వసమతా బుద్ధితో, మంధరపర్వతం లేవదీసిన సముద్రంవలె ప్రశాంతమయ్యేది ఎన్నడు? ఆ శాసహస్రములతో నిండి నిబిడీకృతమైయున్న ఈదృశ్య సంపదను సర్వాత్మస్వరూపముతో చూచునదెన్నడు? సకల ప్రపంచమును చిన్మాత్రస్వరూపముగజూచుచు ఆనందించేదెన్నడు? పుట్టుగ్రుడ్డికి కండ్లువచ్చినట్లు, నాకీ అజ్ఞానాంధకారముతొలచి, చిదాత్మ జ్ఞానమబ్బేది యెన్నడు? ఇష్టానిష్టములనువదిలి, స్వీకరింపతగినది, పరిత్యజింపతగినది అనేభావమునువిడిచి, స్వప్రకాశస్థితిలోనుండి నేను సంతసించేదెన్నడు? కదాశలనే (నీచ ఆశలనే) గుడ్లగూబలతోనిండి, మంచుచే జీర్ణమయిన హృత్పద్మములుగల అజ్ఞానమనే కృష్ణపక్షరాత్రి నశించేదెన్నడు?

మనస్సు ఉపశాంతమై ఈకొండగుహాలో నిర్వికల్పసమాధిలో నేను రాతివలె కదలకుండ నుండునది యెన్నడు? అభిమానవృత్తులనేమదధార లను స్రవిస్తూ ఉండే అహంకారమనే మదపు ఏనుగు, పరమాత్మ జ్ఞానమనే సింహంచేతిలో చచ్చేదియెన్నడు? నిర్వికల్ప సమాధిలో విశ్రాంతి చెంది, మూగవానివలె పూనవ్రతములోనున్న నానెత్తిమీద పక్షులు గడ్డిపోచలతో గూడుకట్టే దెన్నడు? ధ్యానమార్గంలో స్థిరపడిన చిత్తముగల నారొమ్ముమీద వేళ్ళాడే నాజటాగ్రములను (జడలకొన వెంట్రుకలను) గూడుగా తయారుచేసికొని పక్షులు విశ్రమించే దెన్నడు? తృష్ణలనే కరంజవృక్షములతోనిండి, జన్మమరణములనే పొదగుబురులు గలిగి, ఉన్న సంసారమనే అడవి సరస్సును (కొలనును) నేను విడిచి వెళ్లున దెన్నడు?''

అని యిలా చింతాపరవశుడై ఉద్దాలకుడనే బ్రాహ్మణుడు మాటిమాటికి కూర్చుండి ధ్యానాభ్యాసం ప్రారంభించాడు- కోతివలె చంచలమయిన మనస్సు విషయాలనే ఆకర్షింపబడేసరికి అతనికి మనస్స మాధానము (ఏకాగ్రత) ఏమాత్రమూ కుదురలేదు- కాని కొంతకాలం అభ్యసించగా బాహ్యవిషయాసక్తి తగ్గింది చిత్తానికి- సాత్త్వికము లయిన దేవాదిభోగ్యములమీద పరుగెత్తింది మనోమర్కటము. (మనస్సు అనేకోతి) ఒకప్పటికి అతని మనస్సు ఆభ్యంతరవిషయాలను కూడా విడిచి ధ్యేయవిషయాన్ని చేరింది మరి కొంతసేపటికి అతని మనస్సులో ఉదయార్కునివంటి (ఉదయకాల సూర్యునివంటి) తేజస్సు భాసించింది- ఆ తేజస్సును చూచి అతడి మనస్సు విషయాభిముఖ మయింది- తరువాత కొంతకాలానికి కొద్దిగా బ్రహ్మస్వరూపం అభి వ్యక్తమయింది అతనికి- వెంటనే అజ్ఞానాంధకారము కొద్దిగా శాంతిం చింది- అజ్ఞానాంధకారము సడలుట ప్రారంభించేసరికి విషయవాసన లన్నీ ఒకేదఫా ఉద్రిక్తములయినాయి- మనస్సు ఆవిషయవాసనలందు లంపటమయింది- భయపడ్డ పక్షివలె ఎగిరి పరుగెత్తడం ప్రారంభించింది

అతడి మనస్సు. తుదకు లోపలి వెలుపలి విషయస్పర్శలను విడిచి, అజ్ఞానము యొక్కయు, ఆత్మజ్యోతిస్సు యొక్కయు అంతరాళ (మధ్య) స్థితియగు నిద్రయందే చాలకాలం లయించి పోయింది.

ఇలా ధ్యానవృత్తులందు పర్యాకులమయిన చిత్తముగల ఉద్దాలకుడు ఆకొండగుహాలో పెద్దగాలికి కొట్టుకొనే చెట్టువలె సంకటంలో పడిపోయాడు- తుచ్ఛములయిన తృష్ణాతరంగాలకు లొంగిపోయాడు- పర్యాకుల మనస్కుడై కొంతకాలం ఆకొండమీద తిరిగాడు- కొంతకాలానికి ఎవరకూ చొరశక్యముగాని యొక గుహాను ప్రవేశించాడు- అచ్చట గాలిపోకదు- మృగాలు పక్షులు తిరగవు- దేవగంధర్వులు కూడా ఎన్నడూ చూచియెరుగరు దీనిని- బ్రహ్మవలె ప్రకాశిస్తూఉంది అది- పూలగుత్తులతో నిండిఉన్నది- లేతగడ్డితో కోమలమయినది- చంద్రకాంతమణులతోనూ, మరకతమణులతోనూ తయారుచేసినట్లున్నది- దట్టమయిన చల్లనినీడ అక్కడ- రత్నదీపాలు- వనదేవతలు రహస్యంగా కట్టుకున్న అంతఃపురగృహమా ? యేమి అన్నట్లున్నది అది. ఆగుహాకు ఇరువైపులా చలిని పోగొట్టుశక్తిగల యెండమాత్రమే ఉన్నది. అందుచే అది ఎక్కువ చల్లగానూ లేదు- ఎక్కువ వెచ్చగానూ లేదు- శరత్కాల సూర్యుని వెలుగువలె ప్రకాశిస్తోంది పచ్చగా- (గౌరవర్ణముగా) లేత ఎండచే శుష్కించి, ధ్వనిలేని మందమారుతము వీస్తూ ఉంటుంది- పూచిన పూగుత్తులచే పరిమిళితమయిఉంది ఆగుహా- అలాంటి గుహాను చేరాడు ఉద్దాలకుడు- తుమ్మెద గిరగిర గుండ్రముగా తిరిగితిరిగి పద్మకోటరమును(పద్మముయొక్కగర్భమును) ప్రవేశించినట్లు-

## ౫౩. ఉద్దాలక విచారము.

సృష్టి వ్యాపారమును మానుకున్న బ్రహ్మదేవునివలె స్తిమితంగా (సమాధానంగా) ఉన్నాడు- పూగుత్తులతో నిండియున్న కోమలలతా పత్రములతో (వాడని ఆకులతో) ఆసనం తయారు చేసికొన్నాడు-

దానిమీద కృష్ణమృగాజినమును పరచాడు. దానిమీద కూర్చొని చిత్తవృత్తులను నిరోధించుకోనదలచి ఉత్తరదిక్కుకు అభిముఖుడై సిద్ధాసనంవేసి కూర్చున్నాడు. బ్రహ్మాది గురుపరంపరకు ప్రణామాంజలి అర్పించాడు. నిర్వికల్పసమాధికోరకు మనోమృగమును (మనస్సు అనే మృగాన్ని) ప్రపంచవాసనలనుండి మరల్చాడు. ఇలా విచారణ ప్రారంభించాడు

“ఓ మూర్ఖమనమా! (మనస్సా!) నీకీ సంసారవృత్తులతో ఏమి ఫలము? నీపనిని బుద్ధిమంతులు మెచ్చరుకదా? శాంతిఅనే రసాయనమును (దివ్యౌషధమును) విడిచి ప్రపంచభోగాలకు పరుగెత్తేవాడు దేవతావృక్షములుగల మందారవనమును విడిచి విషవృక్షములుగల అడవికి పారిపొయ్యేవానితో సమానుడు. నీవు పాతాళానికి పోయినా, బ్రహ్మలోకానికి (సత్యలోకానికి) వెళ్ళినా, ఉపశమమనే రసాయనమును సేవించనిదే నీకు నిరతిశయానందమనే ముక్తి లేదు. నీవు ఇలాగే భోగాశాపరంపరలతో మునిగి తేలే యెడల నీకు నేను వెనుక జెప్పిన దుఃఖపరంపరలు తప్పవు. కనుక భోగాశలనువిడిచి పరమశ్రేయస్సు అగు నిర్వాణమును ఆశ్రయించు. ఈవిషయ పరంపరలన్నీ నీకు ఘోర దుఃఖపరంపరల నిచ్చెడివే కాని సుఖమునిచ్చెడివి కావు. మూర్ఖ మనస్సా! ఈపాపిష్ఠి శబ్దస్పర్శాదులతో నీకేమిఫలము? మేఘాన్నిచూచి కప్ప అరచినట్లు ఎందుకు శబ్దాదులను చూచి వృథాగా భ్రమిస్తావు. ఓమనో మండూకమా! ఇంతకాలం ప్రపంచమనే మైదానంలో కళ్లుమూసికొని గబగబ తిరిగావునీవు. ఏమిఫలంపొందావు?

దేనివల్ల నీవు విదేహకైవల్యం పొందుతావో, దేనివల్ల జీవన్ముక్తి విశ్రాంతిసుఖం పొందుతావో, అలాంటి సమాధిలో నీవు నిముషమైనా నిలచిఉండవేం? మూర్ఖ? వ్యర్థంగా బయటికి బయలుదేరి శ్రోత్రేంద్రియంతో తాదాత్మ్యంచెంది శబ్దమును అనుసరించి చెడిపోకు. అడవిలోని మృగాలు ఇలాగే వేటకాని ఘంటాశబ్దంవిని మోసపోయి

అధ్వాని వెంటపడిపోయి చచ్చి ఊరకుంటాయి— అంతే అవుతుంది నీ బ్రతుకుకూడా— అడవిలో ఏనుగులనుపట్టేవాళ్లు ఆడఏనుగు నొకదాన్ని బాగాశిక్షించి, దానినిచూపి, వనగజమును ఆశపరచి ఆకర్షించి గోతులో పడవేసి పట్టుకుంటారు. అలాగే నీవు త్వగింద్రియముతో తాదాత్మ్యం చెంది విషయ స్పర్శలతో మోసపోయి సంసారకూపంలోపడి పోతున్నావు— అలాచెడిపోకు. అలాగే రసనేంద్రియాన్ని పొంది చేపవలె చెడిపోకు. చక్షురింద్రియాన్ని పొంది రూపసంపద కాశపడి కాంతిపుంజానికి ఆశపడిన పక్షివలె చెడిపోకు— ఘ్రాణేంద్రియాన్ని ఆశ్రయించి గంధానికి అభిముఖమై తుమ్మెదవలె బంధంలో పడిపోకు— శబ్దమున కాసపడి కురంగము (లేడి) చెడిపోయింది— స్పర్శకాసపడి అడవిఏనుగు చెడిపోయింది— రసనేంద్రియ విషయమగు రసమున కాసపడి (రుచి కాసపడి) మీనము (చేప) నశించింది— రూపమున కాసపడి పతంగము (పక్షి) చెడిపోయింది— గంధమునకాసపడి తుమ్మెద చెడిపోయింది— ఈ అయిదునూ ఒక్కొక్క ఇంద్రియమువల్ల చెడిపోయినవే— సర్వేంద్రియ విషయములందును సక్తుడయిన అజ్ఞానికి కలిగే అనర్థములకు పరిమితి ఉండదు. నిరతిశయసుఖమునకుబదులు నిరతిశయ దుఃఖప్రాప్తియే వాడిగతి— కనుక చిత్తమా! సర్వానర్థములతో కూడిన నీకు సుఖమెక్కడిది? వాసనాజాలమును నీవు బంధంకొరకే నిర్మించుకున్నావు— పట్టుపురుగు నోటివెంట సహజంగా లాలాఫేనము (నురుగువంటి తెల్లని చొంగ) బయలుదేరుతుంది— అదే పట్టుదారంగా పరిణమిస్తుంది—తుదకు ఆదారంలో చిక్కుకొని పోతుంది యీపురుగు— కనుక తనకు బంధాన్ని తానే నిర్మించుకున్నట్లు అయింది. అంతే మనస్సు (చిత్తము) యొక్క గతికూడా—

కనుక నీవు కర్మలవలనను, ఉపాసనాదులచేతను, శరత్కాల మేఘమువలె ముందు పరిశుద్ధమగుము. ఆవల శ్రవణమననాది పరిపాకమువలన కలిగెడి జ్ఞానమువల్ల పూర్తిగా శాంతినొందుము— నీకు పరిపూర్ణ

జయములభిస్తుంది— చిత్తమా! జన్మమరణములూ, బాల్యకౌమారాది దశలూ, భాగ్యదారిద్ర్యావస్థలూ, గల ప్రపంచస్థితిని తెలిసియుండి కూడా నీవు విడువనిచో దీనిని తుదకు నీవు నశిస్తావసుమా!

అయినా నేనునీకు హితోపదేశంచేయుట ఎందుకు! నేను తత్త్వ విచారంచేస్తూ కూర్చుంటే నీయంతట నీవే బలాత్కారంగా చస్తావు. కాకనిన్ను ఉచ్ఛేదం (నాశనం) చేయుటానికి కూడా నేను వేరే ప్రయత్నం చేయనక్కరలేదు— అజ్ఞానం ఉంటే నీవు ఉంటావు— అదిలేకపోతే నీవు ఉండవు— కనుక దానిని (ఆ అజ్ఞానమును) నశింపచేస్తే చాలు— నీవు వెంటనే నశిస్తావు— వర్షకాలమేఘము లున్నంతవరకు మంచుబాగా పడుతూఉంటుంది— అజ్ఞానం ఉన్నంతవరకు చిత్తం గట్టిపడి ఉంటుంది— వర్షకాలమేఘములుపోతే మంచుపోతుంది— అజ్ఞానంపోతే చిత్తం కృశిస్తుంది— వాసనాక్షయంచేత చిత్తం కృశించినచో (సూక్ష్మమయినచో) అది క్షీణించినట్లే తలుస్తానేను— కాని వాసనాక్షయానికే తత్త్వవిచారం కావాలి— (అసద్రూపమయినదానికీ) లేనిదానికీ, చావు సిద్ధమయిన దానికీ హితోపదేశంచేయుట, ఆకాశాన్ని కొట్టినట్లు, నీటినికొట్టినట్లు, గాలిని కొట్టినట్లు. కనుక చిత్తమా! నీవు చావసిద్ధమై ఉన్నావు కనుక స్వరూపంలేని నిన్ను విడిచిపెటతాను— విడిచిపెట్టతగినదానికి హితోపదేశంచేయుటకంటె పరమమూర్ఖం మరొకటి లేదు—

చిత్తమా! నేను నిర్వికల్పుడను— చిత్ జ్యోతీరూపుడను— నిరహంకారుడను— వాసనారహితుడను— నీవు అహంకారమునకు బీజ (కారణ) భూతమయినదానవు— కనుక నీతో నాకు సంబంధంలేదు— నీవు నాకు పరమశత్రువు— ఎందువల్ల అంటె, నిర్వికల్పుడ నయిననాకు దేహాదులందు అహంతా దృష్టిని (నేను అను భావమును) పుట్టించావు నీవు. ఇది మిథ్యాభూతమయినా మూఢులకు మాత్రం వినాశహేతువే— కనుక ఇదే నీఅపరాధము— అపరిచ్ఛిన్నమయిన ఆత్మతత్త్వమునకు పరిచ్ఛిన్నమయిన మనస్సునందు ఉనికి అసంభవము— ఆడ మగ ఏనుగు

లకు మారేడు పండులో నివాసము ఎంతటి అసంభవమో అంతటి అసంభవము ఇది- ఓ చిత్తమా! నీవు పాడు బావిని ఆశ్రయించావు- కామక్రోధలోభాదులనే సర్పవృశ్చిక పిశాచాదులకు స్థానమయిన వాసనాజాలమును ఆశ్రయించావు- అంచేత నిన్ను నేననుసరించను. తప్పకవిడుతును- "దేహమే ఆత్మ" అనే భ్రాంతి (మోహము)విచార రహితుడయిన మూఢునకుగాని, నాకేమిటి? కాలిబొటనవ్రేలిలగాయతు తల (శిరస్సు) వరకు కణశః కణశః విచారించిచూచాను- అంతా దేహమేకాని ఎక్కడా "అహమ్" నేను" అనేవాడు కనిపించలేదు దేహంలో- నేను అనేవాడు దేశకాలవస్తుపరిచ్ఛేదరహితుడు- అతనికి ఇయత్త (పరిచ్ఛన్నరూపము లేదు- ఏకత్వము లేదు- అన్యత్వము(భేదము) లేదు- మహత్వాణుత్వములు లేవు- నేను చిద్రూపుడను కనుకనే సాక్షి స్వరూపుడయిన నాచే తెలియదగిన నిన్ను (చిత్తమును) తెలుసు కున్నాను- నీవు దుఃఖకారణము కనుకనే వివేకజన్య బోధచే చంపు తున్నాను నిన్ను- చిత్తమా! ఇది మాంసము- ఇది రక్తము- ఇవి ఎముకలు- ఇవి శ్వాసవాయువులు- ఇందులో అహమనే వాడెవడు? స్పందాంశము (చలనము) అంతా వాయువుది- జ్ఞానాంశమంతా పరమాత్మది- ఈశరీరంలో నాకు జరామరణాలు రెండు కనిపిస్తున్నాయి ఇందులో అహమనేవాడు నాకెక్కడ కనిపించడంలేదు- అహంపదార్థం కంటె మాంసంవేరు- రక్తంవేరు- ఎముకలు వేరు- ప్రాణవాయు స్పంద ము వేరు- ఇందు అహంపదార్థం ఏది? ఇదంఘ్రాణము- ఇదిజహ్వా- ఇది త్వగింద్రియము- ఇవి చెవులు- ఇవి కండ్లు- ఇది స్పర్శ- ఇందులో అహ మెవ్వరు? పరమార్థంగా విచారిస్తే మనస్సు నేనుకాను- నీవు(చిత్తము) నేనుకాను- వాసన (సంస్కారము) నేనుకాను- అద్వితీయమయిన శుద్ధచైతన్య రూపుడను నేను- అధ్యారోపదృష్టిలో అంతటా నేనే ఉన్నాను- అపవాదదృష్టిలో ఏదీ నేనుకాను- ఇదే యథార్థమయిన దృష్టి- ఇతరమంతా అయథార్థమే- ఇంతవరకు అజ్ఞానమనే ధూర్తుని వలన మోసపోయాను- కష్టపడ్డాను- అడవిలో తోడేలుకు (నక్కకు)

చిక్కిన లేగదూడమాదిరి అయింది నాబ్రతుకు- అదృష్టవశాత్తు ఇప్పటికి గుర్తించాను అజ్ఞానమనే దొంగను- వీడు నా నిజరూపాన్ని దొంగిలించే గజదొంగ- ఇంక నేను వీనిని ఆశ్రయించను- దుఃఖరహితుడనయిన నాకు దుఃఖయోగ్యమయిన అజ్ఞానం (చిత్తం) తో పొత్తు కుదరదు- కొండకు, కొండమీద వాలిన మేఘానికి సంబంధం లేక- నిజంలో నాకు అహంకారాదులతో సంబంధం లేదు కనుక వచనాది క్రియలుకూడా ఉండకూడదు- కాని ఇటువలె తాత్కాలికంగా అహంకారభావాన్ని కల్పించుకొని, నీకీ ఉపదేశాలు చేస్తున్నాను- మాటాడుతున్నాను- కంటితో చూస్తున్నాను- ఇపుడు ఆత్మావలోకనంచేత అనహంకారత్వమును పొందాను- నిజంగా నేననుకుంటాను. ఈ చక్షురాదీంద్రియాలు యథార్థస్థితిలో నాదురూపములే- అలాకానిచో నే జడములయిన ఇవి ఈదేహంలో ఉంటేయేమి? పోతేనేమి? వీటితో ప్రయోజనమేమి? ఇంతవరకూ నేను కాలమంతా వ్యర్థపుచ్చుకున్నాను. గడ్డిగాదం లేని పాడుకొండమీద లేడి తిరిగినట్లయింది నాబ్రతుకు. ఇంద్రియగోచరములగు వస్తువులలో ఏదీ అహంప్రత్యయాస్పదం కాదు. కంటికి కనిపించేది అహంప్రత్యయాస్పదం (నేను అని అనుకొనతగిన వస్తువు) కాదు- చెవినోకినది కాదు- ఘ్రాణమునకు గోచరించినది కాదు- త్వగింద్రియమునకు విషయమగునది కాదు- ఇవన్నీ స్వార్థపరమై వాటివాటి విషయాలమీద అభిమానం చెంది "ఘ్రాతా, శ్రోతా, ద్రష్టా" అని వ్యవహరింపబడుతున్నాయి- ఈభావన అంతా మిథ్య- కనుక దేహమునందు అహంభావన భ్రాంతిమాత్రము. ఆవాసన పనికిరాదు తప్పక విడువవలెను.

అయితే వాసనలను విడిచినా జీవనహేతువగు ప్రారబ్ధకర్మ ఉన్నంతవరకు శరీరము ప్రవర్తిస్తూనే ఉంటుంది- తత్ప్రయుక్తమయిన సుఖదుఃఖాలుకూడా కలుగుతూనే ఉంటాయి- కాని తాత్కాలికంగా సుఖదుఃఖాలు అనుభవించినా, "అహం సుఖీ" "అహం దుఃఖీ" ఇత్యాది

అభిమానం ఉండదు- ముందు కలుగబోయే సుఖదుఃఖ జ్ఞానములు కూడ కలగవు- శోకమోహభయవిషాద చింతోద్వేగాది సర్వసంతాపములు శాంతించి పోతాయి. ఇదే వాసనాత్యాగమునకు ఫలం-

కనుక మూర్ఖములయిన ఇంద్రియములారా ! స్వీయవాసనలను విడిచి కర్మల నాచరించండి- దుఃఖాన్ని పొందకు- మీరు విషయములను ఆర్జించడంలోనూ, వాటిని పోగొట్టుకొనుటలోనూ కేవలం దుఃఖమనుభవించుటకే మీరు వాటి వాసనను ముడివేసుకుంటున్నారు- వాసనా, రాగ, ప్రవృత్త్యాదులన్నీ జ్ఞానికి స్వరూపాభిన్నములే-అజ్ఞానికి మాత్రమే భిన్నములు- ఇంద్రియములనె పిల్లలారా ! మీరు తృష్ణ చేతనే చెడిపోతున్నారు- తృష్ణలోనే జరామరణ సంకటాలలో దొర్లుతున్నారు- ముత్యముల రంధ్రంలో దూర్చిన దారం ముత్యాలను బంధించుటకు కారణమైనట్లు మీలోఉన్న వాసనయే మీబంధానికి కారణము. ఇది యావత్తూ కల్పనామాత్రము- పరమార్థము కాదు. సంకల్పత్యాగంచేత ఈవాసన తెగిపోతుంది- ఇది పెరిగినంతవరకు మీకు వ్యామోహమూ, నాశమూ తప్పదు- కనుక ఓ చిత్తమా ! నీవు ఇతరేంద్రియములతో ఐకమత్యాన్ని పొంది, ఆత్మయొక్క పరమార్థ స్వరూపాన్ని, నీయొక్క మిథ్యారూపాన్ని నిశ్చయించుకొని, నిర్మల బోధరూపమగు నిర్వాణమునే గ్రహించు.

## 43. ఉద్దాలక విచార విలాసము.

ఉద్దా॥ పరిచ్ఛిన్నములయిన నువ్వులకూ పూలకూ వాసనలు అంటవచ్చు- స్థూలములయిన పృథివ్యప్తేజో వాయువులకును కస్తూరి మొదలగువాని వాసన అంటవచ్చును- కాని, పరమాణువును, పరమమహత్తును అగు ఆత్మకు వాసన లంటుటకు వీలులేదు- విషయ సంబంధ ద్వారా అంటునన్నచో ఆవిషయములతోకూడ ఆత్మకు సంబంధము లేదు కాన అదీ పొసగదు-

ఇంక విషయములను సంపాదించినది జడములయిన ఇంద్రియములు. వానిని ప్రకాశింపచేసింది చిత్ప్రతిబింబములద్వారా బుద్ధీ అహంకారమున్నూ- కనుక వాటియొక్క సూక్ష్మావస్థలే వాసనలు- ఇలాంటి వాసనలను మనస్సు అనుభవిస్తోంది-

జాగ్రదవస్థలో అనుభవించిన విషయములే వాసనారూపముతో నుండి మనస్సు స్వప్నమునందు అనుభవిస్తోంది- కనుక బుద్ధ్యహంకారములతో కాని, మనస్సుతో గాని ఆత్మకు సంబంధము లేదు- కనుక నేను నిర్లిప్తమయిన చిద్రూపుడనే కాని నేను జడమయిన మన ఆదిసంఘాత రూపుడనుగాను- స్థూలదేహము తన దుశ్చేష్టలచే సంసారస్థితిని ఏర్పరచుకొని అనుభవించుగాక, లేక విడచుగాక, నాకు దానితో సంబంధము లేదు- కనుకనే చిద్రూపుడనయిన నాకు జన్మమరణములు లేవు. శుద్ధచైతన్యమునకు జీవితముతో ఫలంలేదు. చైతన్యము సకలభూతములకూ ఆత్మరూపము- సకలభూతములకు జీవితము- సర్వదేశకాలవస్తువులందు విస్తరించియున్న చైతన్యమునకు జీవితంతో వచ్చిన దేమిటి? మరణంతో పోయిన దేమిటి? ఈజన్మమరణములనేవి దేహాలందు అహంభావముగలవారు కల్పించుచున్నవి- ఇవి దేహాదులకుగాని, ఆత్మకు లేవు- అహంభావము (అహంకారము)అనేది వ్యర్థమయిన భ్రాంతి- మనస్సు ఎండమావులవంటిది. పదార్థములా అత్యంతజడములు. ఇంక అహంభావన(నేను అనే భావము)ఈమూటిలో దేనికో నాకు బోధపడుట లేదు-

దేహమూ రక్తమాంసమయము- మనస్సా విచారణకు నిలవదు- చిత్తాదులాజడములు- ఇంక అహంభావము దేనికి? ఇంద్రియములు నిత్యము స్వోదరపూరకములు- తమతమ విషయములమీద వ్యాపించటమే వీటిపని- ఇవి అహంకారమునకు చేసే ఉపకారము ఏమాత్రమూ లేదు-పదార్థములా పదార్థస్వరూపంలోనే ఉండిపోయినాయి- (అనగా బాహ్యరూపంలోనే ఉండిపోయినాయి-) ఇంక అహంభావన దేనికి? సత్వరజస్తమోగుణములుమూడును, ప్రకాశప్రవృత్తిమోహములనే

తమపనిలోనే ఉండిపోయినవి- ప్రకృతిగుణముల సామ్యావస్థ అనేదాని స్వభావంలో అది ఉంది- సద్రూపమయిన బ్రహ్మ తన స్వరూపంలో ఉన్నది- ఇంక అహంభావన దేనికి? ఈ దేహంలో ఉన్న జీవాత్మకూడా పరమాత్మ స్వరూపుడేకనుక అతడు అహంకారాస్పదుడుగాడు- ఈ పరిస్థితిలో "నేను" అని దేహమాత్రమునం దభిమానము గలవాని ఆకారమేమి? జాతియేమి? నిజంలో దీనిపేరేమి? వర్ణమేమి? ఈభావంతో నేను గ్రహించునదేమి? త్యజించునదేమి? కనుక ఏవిధంగాను నిర్వ చించి చెప్పటానికి అలవికానందున అహంకారమనేది కేవలం మిథ్య- దీనికి ఆత్మతో సంబంధంలేదు- కనుక అహంకారమనేదిలేదు- లేని దానితో నాకు సంబంధమూలేదు. కనుకనే "నీవునేను" అనే ద్విత్వ కల్పనాలేదు- కాబట్టి ప్రపంచం అంతా బ్రహ్మాత్మకం- బ్రహ్మకంటె వేరుగ లోకంలో ఏదీలేదు-

అద్వితీయమయిన ఆత్మ సర్వవ్యాపకుడయియుండ అహంకార మనే రెండవవస్తువునకు తావేలేదులోకంలో- లోకంలో ఆత్మయొక్క-డే కాని పదార్థములుకూడా లేవు- ఒకవేళ పదార్థములున్నా వానితో ఆత్మకు ఏలాంటి సంబంధమూలేదు- మనస్సు తన కవయవమయిన ఇంద్రియాలతో నాట్యమాడుతోంది- చిదాత్మమాత్రం ఇంద్రియముల తోనూ, బాహ్యవిషయములతోనూ నిర్లిప్తుడే- సూదంటురాయికీ, సూదికీ ఎలా సంబంధంలేదో, అలాగే ఒకచోటనున్నా దేహేంద్రియ మనస్సులతో చైతన్యానికికూడా సంబంధంలేదు- "అహం" అనేది వస్తుతత్త్వమును గుర్తించని మహాభ్రాంతి అయియుండగా, లౌకికులకు "ఇదినాయిల్లు, ఇదినాధనం" అనే బుద్ధులు విపరీతములు- భ్రాంతులు- అజ్ఞానంచేత కలిగిన అహంకార చమత్కారము తత్త్వజ్ఞానంచేతనే నశిస్తుంది- ఆత్మ వ్యతిరిక్తంగా లోకంలో ఏమీ లేనందున నేను "సర్వంబ్రహ్మ" అనే భావంతోనే ఉంటాను- అహంకారమనే దానిని యింక మనస్సుతోకూడ స్మరించను- పూర్తిగా మరుస్తాను- దానిని

పూర్తిగా విడిచి శరదభ్రమువలె నిర్మలంగా ఉంటాను. అహంభావమును మనసా అనుసంధానం చేసితిమా! అనర్థాలు రాసులవుతాయి- పాపం పెరుగుతుంది. సంతాపం వృద్ధిఅవుతుంది- ఈభావన (అహంభావన) ఉన్నంతవరకు జన్మమరణములుతప్ప మరొకఫలంలేదు- మనస్సుకు ఎన్నటికీ విశ్రాంతి ఉండదు- “ఇది చెయ్యాలి, అదిచెయ్యాలి” “ఇదిఉన్నదీ, అదిలేదు” అనే భావాలే గ్రీష్మఋతువులో ఎండ పెరిగినట్లు పెరుగుతూఉంటాయి- సూర్యకాంతమణులు మండినట్లు మండుతూ ఉంటాయి-

అహంభావం నశిస్తే సంసారమనేచెట్టు ఎండిపోతుంది- ఇంక మళ్ళీ మొలవదు-తృష్ణలనే నల్లత్రాచులు దేహములనే చెట్లతొర్రలలో నివాస మేర్పరచుకున్నాయి- విచారాత్మ అనే గరుత్మంతుడు వచ్చాడా అవి యెక్కడకు పోతాయో తెలియదు- ప్రపంచం అజ్ఞానంవల్ల తయారయింది- కనుక అసత్యము. కనుకనే ప్రపంచవ్యవహారముకూడా అసత్యమే- కనుక నీవు నేను అనే వ్యవహారంకూడా అసత్యమే- ప్రపంచం పుట్టక పూర్వము ఏరూపముతో ఉందో పుట్టిన తరువాతకూడా దాని కదేరూపం నిజము- కుండకు మృద్రూపమే సత్యము- తరంగాలకు జలరూపమే సత్యము- కనుక క్షణకాలం మధ్యలో కనిపించే దేహాదులందు ఆస్థ (ఆదరము) తగదు-

స్వప్నవికారాలెట్టివో, భయభ్రాంతులెట్టివో, మదలీలలెట్టివో, నౌయానసంభ్రమములు (పడవమీద ప్రయాణం చేయునపుడు కలిగెడి భ్రాంతులు) ఎట్టివో, సన్నిపాత వికారములెట్టివో, తిమిరాదిదోషదుష్టమయిన చక్షురాదీంద్రియ వికారములెట్టివో, అత్యానందావస్థవస్థయందు కలిగెడి భావాలెట్టివో, భార్యావిధురులకు కామాదిదోషావేశదశలందు కలిగెడి కామిన్యాదిరూపభ్రాంతులెట్టివో,అట్టివే యీప్రపంచ భ్రాంతులుకూడా- అవీ అనుకున్నంతవరకే- ఇవీ అనుకున్నంతవరకే- తుదకు బాధ (నాశం) వాటికీకద్దు- వీటికీకద్దు- కాని వాటికీ వీటికీ

కొంచెం కాలభేదంఉంది- స్వప్నవికారాలు కొద్దికాలమే ఉంటవి- ప్రపంచభ్రాంతులు ఇంక కొంతకాలం ఉంటాయి- కనుక వెర్రిమనస్సా! ప్రాపంచిక వస్తువులయందున్న ఆకాలవిశేషమే నీకు సత్యతాబుద్ధిని పుట్టించి, అనురాగమును కలిగించి, సంయోగవియోగాలతో సుఖ దుఃఖాలు కలిగిస్తూ నిన్ను వడిపిస్తోంది.

అయినా ఇదంతా నీదోషంకాదు. నీయందు అహమభిమానము గల నాదోషమే. అసత్యమయిన నిన్ను సత్యమని నేను నమ్మటేల? నీవు చేసినదంతా నేను చేసితినని అనుటేల? నీకు నాకూ సంబంధంలేదని తెలిసికొంటే నాదోషం పోతుంది- అదేనీకు శాంతి- నిన్ను నిమిత్తం చేసికొని తయారయిన భోగవాసనలన్నీ దానితోనే నశిస్తాయి-

లేకుంటే మనమా! నీవు చిత్ప్రతిబింబాన్ని గ్రహించి చైతన్యం కలిగి ఉన్నావుకనుక భోగసంపదమీద విరాగంచెంది వాటిని మననం చెయ్యడంమానితే, చరమసాక్షాత్కారవృత్తితో ఆత్మసాక్షాత్కారం చేసికొని నీకునీవే మోక్షవిశ్రాంతిని చెందుతావు- నేనేమీ ముక్తి పొందేదిలేదు- నేనెప్పుడు ఏకరూపుడనే- (ఒకేమాదిరి ఉండువాడనే) నాకొకప్పుడు బంధమూలేదు. ఇపుడు మోక్షమూరాదు-

చిత్తము (మనస్సు) తన పరివారమయి బాహ్యేంద్రియాలతో సహా పరమాత్మ అనే అగ్నిమంటలోపడి దగ్ధమై మేలిమి బంగారము వలె పరిశుద్ధమై శాశ్వతస్థితిని పొందుతుంది.

లోకంలో యుద్ధవీరుడు తన శరీరమును స్వర్గమునకుపోవు తన కంటె వేరని గ్రహించి, తనదేహానికి సంబంధించిన గృహక్షేత్ర ధనాదు లందు మమతావాసనవిడిచి మరణమునుకూడా అంగీకరించి బ్రహ్మ లోకం చేరుతున్నాడు- అలాగే మనస్సుకూడా శరీరం తనకంటె వేరని గ్రహించి దానిమీద ఆత్మాభిమానంవిడచి, తన వినాశాన్ని కూడా అంగీకరించి బ్రహ్మలోకాన్ని జయిస్తుంది.

రామా! శరీరానికి మనస్సు శత్రువు. మనస్సుకు శరీరము శత్రువు- దీనికది యాధారము- దానికిది ఆధారము- ఇందులో ఏ ఒకటి లేకున్నా రెండోది ఉండ నేరదు- ఆధారం లేకపోతే ఆధేయం లేదు- ఆధేయం లేకపోతే ఆధారంలేదు- శరీరాన్ని ఆధారంగా చేసికొని మనస్సు బ్రతుకుతోంది. మనస్సును ఆధారంగా చేసికొని శరీరం బ్రతుకుతోంది. కనుక ఇవి రెండూ పరస్పరానురాగం కలవి- శరీరాన్ని మనస్సు బాధపెడుతుంది- మనస్సును శరీరం బాధిస్తుంది- కనుక నీ రెండూ పరస్పర ద్వేషంగల శత్రువులు. కనుక ఇవి రెండూ పరస్పర ద్వేషంగల పెద్దపులులవలె తయారయినాయి- ఈ రెంటిమధ్య (శరీర మనస్సులమధ్య) అడవిలేడివలె చిక్కుకున్నాడు జీవుడు- ఇంక వీడికి సుఖమెక్కడిది? ఈ రెంటినీ మొదలంట నాశనం చేస్తేనే వీడికి(జీవుడికి) పరమసుఖము-

అయితే శరీరమనస్సుల రెంటిలో శరీరము మరణంచేత నశిస్తే అన్నిదుఃఖాలు పోతాయికనుక ఇంక జీవుడికి సుఖమేకదా! అని అంటారు కొందరు- కాని అది సరిఅయిన సమాధానంకాదు- ఎందువల్ల అంటే శరీరం నశించి మనస్సు ఒక్కటి ఉన్ననూ, దేహాకల్పన తప్పదు కనుక మనస్సు ఉంటూ ఉండగా దేహం మరణించినది చెప్పడం ఆకాశాన వెళ్ళే స్త్రీ భూమిని మ్రింగినదని చెప్పే కథమాదిరిగా ఉంటుంది- సహజ విరోధంగల యిద్దరు యుద్ధసన్నద్ధులై ఉంటే అనర్థ పరంపరలు ధారావర్షంగా పడుతూనే ఉంటాయి- శరీరమనస్సులు రెండూ పరస్పర విరోధముతో వైషయిక సుఖభోగమునందు కలసి(చేరి)ఉంటే మూడవ వాడు దానిమీద అనురాగం కలిగి ఉండేయెడల వాణ్ణి సముద్రోదకంలో ఉన్న బడబాగ్నిలో విడిచిపెట్టాలి. అలాంటి అధముడు దానిమీద (బడబాగ్నిమీద) కూడా అనురాగం చెందుతూనే ఉంటాడు.

మనస్సు తన సంకల్పంచేత శరీరాన్ని కల్పించి (తయారుచేసి) జీవితాంతమువరకు దాని కాహారమును కల్పించి, పోషించి, తుదకు

సకల దుఃఖాలను సమర్పిస్తుంది- మనస్సు తెచ్చిపెట్టిన దుఃఖాలతో తపించి తపించి యున్న దేహము తుదకు మనస్సుయందు రాగద్వేష శోకమోహపాపాదులను పుట్టించి మనస్సును బాధింప తలుస్తుంది. అయితే మనస్సువల్ల పుట్టిన శరీరానికి మనస్సు తండ్రికదా కొడుకు తండ్రిని చంపుటకాని బాధించుటకాని తగునా అని అంటారు పెద్దలు. కాని, ఆ తతాయియగు తండ్రిని కుమారుడు చంపుటలో దోషంలేదు- శత్రుత్వ మిత్రత్వము లనేవి ప్రకృతి (స్వభావ) సిద్ధములుకావు. సుఖ మిచ్చేవాడు మిత్రుడూ, దుఃఖమిచ్చేవారు శత్రువులూ- అని అంటారు శాస్త్రజ్ఞులు- మనస్సువల్ల శరీరందుఃఖాలు అనుభవిస్తోంది కనుక శరీరం మనస్సును చంపుతోంది- మనస్సు ఈణకాలంలో శరీరాన్ని దుఃఖము లకు భోగాయతనంగా తయారుచేస్తుంది- కనుక ఇలా పరస్పరదుఃఖ దములయిన శరీరమనస్సులు రెండూ జాత్యా (జన్మతోనే) అతివిరుద్ధ ములై ఉండగా జీవుడికి సుఖాగమమెక్కడిది ?

కనుక మనస్సు నశించేయడల దేహానికి దుఃఖంలేదు. మనస్సు నశించిందంటే శరీరము ఉత్సాహంతోటి నిత్యము జ్ఞాన తత్సాధనో పాయములందు ప్రయత్నిస్తుంది. మనస్సును మళ్ళీ తలయెత్తకుండా చేస్తుంది. అయితే మనస్సుకూడా శరీరనాశంకొరకు యెందువల్ల ప్రయ త్నించకూడదు? అని అంటారు. కాని శరీరం చచ్చినందువల్ల మనస్సు కేమీ లాభంలేదు. ఆత్మ వివేకంకలుగని మనస్సుశరీరాన్ని నశింప జేసినా నశింపజేయకున్నా ఆశరీరం సకలాపదలకు నిలయమే అవుతుంది- అదిమళ్ళీ అనర్థాలకొరకే పుటుతూఉంటుంది. అందువల్ల మనస్సునకు ఇష్టసిద్ధికాదు. కనుక మనస్సుశరీరాన్ని చంపప్రయత్నించదు.

శరీరమనస్సులు రెండూ పరస్పరానుగ్రహంతో బలసి జడరూప ములై దుఃఖమునిచ్చుటకే ఒకేరూపములయినవి రెండుగా చీలి ఉన్నాయి. లోకంలో నిప్పునీరు రెండూ ఒకచోట పాకం (వంట) కొరకు చేరిఉన్నట్లు. మనస్సు నశిస్తే దేహం నశిస్తుంది- మనస్సు వృద్ధి

నొందితే చెట్టువలె దేహం వృద్ధిపొందుతుంది- మనస్సు క్షీణిస్తే వాసనలు లేనందున శరీరం క్షీణిస్తుంది కాని, శరీరం క్షీణిస్తే మాత్రం మనస్సు క్షీణించదు- కాబట్టి మనస్సునే నశింపచెయ్యాలి పట్టువలలో- కనుక సంకల్పాలనే వృక్షములూ, తృష్ణలనే తీగలూగల మనస్సనే అడవిని ఛేదించి విశాలమయిన భూమిమీద సుఖిస్తాను నేను- సంకల్పాలు నశిస్తే మనస్సు స్వరూపమాత్రంగా ఉన్నా నన్నేమీ చెయ్యలేదు- వర్షకాలం తీరితే మేఘాలు నశించినట్లు నశించిపోతుంది- శరీరము దేనికొరకు భోగసంపదను వాంఛించిందో దానితో నాకు సంబంధం లేదు- నాతో దానికి సంబంధం లేదు- ఈసుఖలేశాలతో నాకేమి ప్రయోజనం- కనుక "దేహము నేనుకాదు" అనే ముఖ్యముగా తెలిసికొనదగిన విషయము అందు యుక్తి చెబుతా విను- శరీరమే అహంపదార్థమయిన ఆత్మ అయ్యే యడల శవశరీరము నందుకూడా అన్ని అవయవములు ఉన్నవికదా! కదలదేం అది? కనుక శరీరముకంటె ఆత్మ వేరు అనక తప్పదు- అతడు అనస్తమిత ప్రకాశస్వరూపుడు- సూర్య చంద్రాదులకుకూడ వెలుగునిచ్చేడి వాడు- కనుక నేను అజ్ఞానిని కాను- నాకు దుఃఖము లేదు- నాకు అనర్థము లేదు- శరీరము ఉండనీ లేకపోనీ నేనుమాత్రం విగతజ్వరుడనే- ఆత్మయొక్క సన్నిధిలో మనస్సుకాని, ఇంద్రియాలుకాని, వాసనలుకాని ఉండవు. రాజునొద్ద పామరులుండజాలరు- కనుక నేను ఆత్మపదమును పొందాను. అద్వైతీయుడ నయినాను. జయమును పొందాను. ముక్తినొందాను. నాకే కోరికా లేదు- ఇప్పుడు నాకు మనోదేహేంద్రియాదులతో సంబంధం లేదు- ఈ నాస్వస్వరూపావస్థానమునుంచి నేను లీలామాత్రంచేత చలించి ఉన్నపుడు నాకీ దేహేంద్రియాదికము పరివారమువలె(పరిజనము వలె) ఉండుగాక. మంచిదే. స్వచ్ఛత, పూర్ణకామత, విదితాత్మత, నిర్లోభత, సత్యత, ఆదంతత, ఉపశమత, మృదుభాషిత, మొదలగునవన్నీ నాకు హృదయవల్లభులగు కాంతలు- కనుక అందరకు అంతటా అన్నీ కల్పనచే సంభవిస్తాయి- కాని నాకు మాత్రం విషయ

జాతమును గూర్చి రాగద్వేషాలూ, తత్ఫలములయిన సుఖదుఃఖాలూ నశించాయి- కనుక నేను పూర్ణవిశ్రాంతిని తీసికుంటాను" అని-

## ౫౪. ఉద్దాలక విశ్రాంతి.

వసి॥ నిర్ణయించుకుని ఉద్దాలకుడు పద్మాసనం వేసుకొన్నాడు. కండ్లు సగము మూసుకున్నాడు. ఓంకారమును తార (ఉచ్చైః) స్వరంతో ఉచ్చరించడం ప్రారంభించాడు. (ఇలా మాటిమాటికి ఉచ్చరించడం ప్రారంభించేసరికి, ఓంకారాకారవృత్త్యుపహితచైతన్యమూ, కూటస్థచైతన్యమున్నూ, అఖండబ్రహ్మచైతన్యమునకు అభిముఖమయింది- అందు మొట్టమొదట నిర్వికల్ప సమాధి ప్రతిష్ఠితం కాగలందులకు, ప్రణవము యొక్క- ప్రథమభాగమయిన అకారమును, ఉచ్చైస్స్వరంతో ఉచ్చరించేసరికి లోపలనున్న ప్రాణవాయువు క్షోభించి (కలవరపడి) దేహమునుండి బయటికి పోవుటకు ప్రారంభించింది- అదే పట్టుదలతోనుండి ప్రాణవాయు నిష్క్రమణమనే (ప్రాణవాయువును బయటికి పంపుటయనే) రేచకముతో శరీరమును శూన్యం చేశాడు- (ఖాళీచేశాడు) అగస్త్యుడు సముద్రాన్ని ఖాళీచేసినట్లు- అపుడు అతని ప్రాణవాయువు చిద్రసంతో నిండియున్న బాహ్యాకాశంలో ఉండిపోయింది- గూటినుంచి యెగిరిన పక్షి ఆకాశంలో ఉన్నట్లు- ప్రాణవాయువు బయటికి వచ్చునపుడు జరిగిన వరపిడి (వత్తిడి) వల్ల బ్రహ్మభావనచే ఒకవిధమయిన జ్వాల బయలుదేరి శరీరమును తగలపెట్టింది. అడవిలో గాలితో బయలుదేరిన దవాగ్ని ఎండుచెట్లను తగలబెట్టినట్లు- ఈతనికి మొదటి అవస్థ కేవలము బ్రహ్మభావనతో జరిగినదిగాని హఠయోగమువలన జరిగినదికాదు- హఠయోగమువల్ల మూర్ఛామరణాదులు తటస్థించును కనుక హఠయోగము అతిదుఃఖప్రదము.

ఇలాగే రెండవభాగమయిన ఉకారమును అనుదాత్తస్వరముతో (మంద్రస్వరముతో) ఉచ్చరించగా కుంభమునందలి నింతుజలమువలె

కుంభకమను క్రమము ప్రాణవాయువులకు సంభవించినది- ప్రాణవాయువులు స్తంభించిన ఉదకములవలె ఉండిపోయాయి- లోపలా వెలుపలా క్రిందకూ మీదికీ ఎక్కడా కదలికలేదు ప్రాణవాయువులకు- మొదట పుట్టిన అగ్నివల్ల తగలపడిన దేహం తెల్లటి భస్మ అయింది- ఎముకలు కర్పూరపుచూర్ణముతో తయారుచేసిన పడకమీద పరుండినట్లు అగపడుచున్నాయి నిశ్చలంగా తెల్లగా గాలికి ఎగిరివచ్చి ఆభస్మ ఎముకలతో సహా తన శరీరం అంతా వ్యాపించింది- తుదకాభస్మ ప్రచండమారుతముచే ఎగిరి చుట్టు తిరుగుచూ ఆకాశంఅంతా క్రమ్మినది శరత్కాలంలోని మబ్బుమంచువలె- ప్రణవముయొక్క మధ్యమ భాగమయిన ఉకారసాధ్యమయిన కుంభకక్రమంలో భావనవల్ల తటస్థించిన అవస్థ ఇది- అంతేకాని హఠయోగముచే తటస్థించినదికాదు-

అలాగే ప్రణవముయొక్క మూడవభాగమయిన మకారమును ఉచ్చరించునపుడు ప్రాణములకు పూరక మనుక్రమము కలిగెను-

అయితే రేచక పూరక కుంభకముల మూటియందునూ, సమగ్రమయిన ప్రణవమునే ఉచ్చరింతురు. కాని రేచకమునందు మొదటి భాగమగు అకారము మాత్రమే అభివ్యక్తమవును- అకారమునకు కంఠముస్థానము- దాని నుచ్చరించు నపుడు ప్రాణవాయువుచే కంఠ్య భాగమగు అకారము మాత్రమే అభివ్యక్తమవును- ఉకారమునకు ఓష్ఠములు స్థానము. దానినుచ్చరించునపుడు ప్రాణవాయువుచే ఓష్ఠ స్థానికమగు ఉకారముమాత్రమే అభివ్యక్తమవును- మకారోచ్చారణ సమయమున ప్రాణవాయువుచే దంతోష్ఠస్థానికమగు మకారమాత్రమే వ్యక్తమగును- కనుక విభజించి చెప్పబడినది-

పూరకమునందు ప్రాణవాయువులు ఆత్మానందమునందుండును- బాహ్యాకాశమునందు అతిచల్లగా నయినవి- క్రమముగా చంద్రమండలమునంటును- ధర్మమేఘమను సమాధియందువలె ప్రాణవాయువులు అమృతమయమయిన కిరణధారలుగా తయారయినవి- ఆకసమునుంచి,

లోగడ గాలి యెగరకొట్టబడగా మిగిలిన శరీరభస్మమునందు అమృతరస ప్రవాహము శివునినెత్తిన గంగాప్రవాహము పడినట్లు పడినది. ఆతని శరీరము చంద్రబింబముతో సమానముగ ప్రకాశించినది. చతుర్బాహువులు గలిగి నారాయణశరీరాకారముగ తయారయినది ఉద్దాలకుని శరీరము. అమృతమయమయిన ఆతని ప్రాణవాయువులు ఆతని శరీరమును పూరించినవి. ఉద్దాలకుని శరీరము తడిసి యెండిన భూతలమువలె పరిశుద్ధమయి ప్రకృతసమాధి కార్యమునకు అనుకూలమయినది.

పిదప ఉద్దాలకుడు పద్మాసనాసీనుడై స్థిరంగాకూర్చుని దేహమునందు ఇంద్రియ పంచకమును దృఢముగా కట్టివేసి నిర్వికల్పసమాధిని అనుష్ఠింప ప్రారంభించాడు. తన మనస్సును నిర్మలపరచుటకు ఉద్యమించాడు. ప్రాణాయామాభ్యాసంచేత ప్రాణాదివాయువులు ప్రశాంతమయినాయి. కాని మనస్సుమాత్రం ఆశాతృష్ణాలోభాదులచే బయటికి రాదలచినది. పూర్వానుభూతమయిన గృహక్షేత్ర పుత్రమిత్రాది చింతలో నిమగ్నమయింది. పసులుగా పాతిన కట్టుకొయ్యను పశువులు తమ మెడత్రాడుతో పెళ్ళగించి గొడ్డిదాటి బయటపడినట్లయింది ఆతని మనస్సుయొక్క పరిస్థితి. అలాంటి చిత్తాన్ని ఉద్దాలకుడు వివేకబలంచేత గట్టిగా నిరోధించాడు. దృష్టిని ఏకాగ్రపరచి అర్థనిమీలితనేత్రుడయినాడు. మొదట రాజయోగమున కనుకూలముగ ప్రాణాపానములను నిరోధించాడు. ఇంద్రియములను విషయములనుండి ప్రత్యాహారమొనర్చినాడు. బాహ్యస్పర్శలను (బయటవస్తువులతో సంబంధములను) పూర్తిగావిడిచిపెట్టాడు. కుండలో దాచిన మణి దూరముగ ప్రసరించిన కాంతులను (కిరణములను) విడిచినట్లు. మనోవాసనారూపములయిన అంతర(లోపలి) విషయములను లాగి అధిష్ఠానబ్రహ్మతత్త్వంలో విలీనం చేశాడు. పాదముచే గుదస్థానమును నొక్కిపట్టి నవద్వారములందలి వాయువులను హృదయమునందు నిరోధించాడు. ఆత్మరత్నముయొక్క ప్రకాశములతో ఒప్పుచున్నట్లు మెడను గట్టిగా నిలపెట్టాడు. ప్రత్యా

హోగోపాయములచే వశీకృతమయిన మనస్సును ధారణా యోగంలో నిలిపెట్టాడు- శరత్కాలనభస్సువలె మనస్సును నిర్మలపరచాడు. గాలి దోమలను పారదోలినట్లు వికల్పపుంజాలను మనస్సును దూరంగా తరిమి వేశాడు- (పోగొట్టుకున్నాడు) బ్రహ్మాకారమయిన చిత్తవృత్తి ధారలకు విచ్ఛేదకములై మధ్యమధ్య వచ్చిపడే విపరీత భావనావికల్పాలను పోగొట్టుకున్నాడు- వికల్పపుంజము దూరంగాపోయేసరికి హృదయా కాశంలో తమోగుణప్రయుక్తమయిన అంధకారంతో కప్పబడి కదలు చున్న కాటుకవంటికాంతిగల వివేకాగ్నిని (వివేకమనేసూర్యుని) చూచాడు- సత్వగుణోద్భూతమయిన వివేకోదయంచేత ఆఅంధకారాన్ని కూడా రూపుమాపుకున్నాడు. వెంటనే అతిసుందరమయిన తేజఃపుంజ మును చూచాడు-రాత్రికాలపు చీకటిపోగా ప్రాతస్సంధ్యాకాల పద్మము వలెఉంది.(అనగా సత్వగుణోద్భావనయందు వ్యగ్రుడయిన ఉద్దాలకునకు తదనుకూలమయిన తేజఃపుంజభ్రాంతి కలిగింది.)రక్తపూరమును మింగి వేటున్నది ఆ తేజఃపుంజము- అది లయించినది కొంతసేపటికి. వెంటనే మనస్సు నిద్రాదశను పొందినది- సూర్యుడు రాత్రినిఛేదించినట్లు ఉద్దాల కుడు ఆ నిద్రాదశనుకూడా ఛేదించుకున్నాడు- ఆ నిద్రాదశ పోయేసరికి అతని మనస్సు అనేక రకములయిన వాసనలచే పరికల్పించుకున్న రూపములతో ఆకసమును భావించినది- ఆభావనపోయినది- కొంతసేపు మనసు మూఢంగాఉంది- ఆమౌఢ్యాన్నికూడా తప్పించుకున్నాడు ఉద్దాలకుడు- సూర్యుడు రాత్రికలిగిన జాడ్యాన్ని లోకమునుంచి తొల గించినట్లు- ఇలా ఉద్దాలకుని మనస్సు, తేజ, స్తమో, నిద్రా, మోహాది, దశలను ప్రకాశము కనిపించుట, చీకటికనిపించుట, నిద్రించుట, మూఢ మగుట అను దశలను దాటి క్రమంగా వాచామగోచరమయిన నిర్వికల్ప సమాధ్యవస్థయందు ప్రవేశించింది కొద్దిసేపు- మరల అతని మనస్సు బాహ్యప్రపంచాకారాన్ని చెందింది- చెరువులోని నీరు కాలవద్వారా చేలో ప్రవేశించి చేనునిండిన తరువాత ఆచేనుకట్టలు అడ్డువచ్చేసరికి ఆనీరు మరల వెనుకకు తిరిగి చెరువునే ప్రవేశించి గుండ్రముగ చెరువు

నొక్క ఆకారమునే చెందును- అలాగే యీతడి మనస్సుకూడ అయినది- చిరాభ్యాసంవల్లనూ, పూర్వ మనుభవించిన సమాధ్యానందమునందలి రుచివల్లనూ, ఆ సంస్కారమును పురస్కరించుకొని అతడి మనస్సు మధ్యమధ్య నవిచ్ఛిన్నమయిన సవికల్పసమాధిని పొందుతూ వచ్చింది. ఇలా సవికల్పసమాధిచే క్రమంగా క్షీణించి అతని మనస్సు పాలునీరువలె చిదేకరసత్వమునొందినది. చిత్తమునందలి చిత్తత్వమను ధర్మముపాస్యసరికి అందులోని ప్రతిబింబచైతన్యము బింబైక్యమును పొందినది- మనస్సు విషయాకారమును విడిచి సాక్షిచైతన్యసాధారణ్యమును పొందినది- నిర్వికల్పసమాధియందు స్థిరపడి ఉద్దాలకుడు ఆసమాధివల్ల తత్త్వసాక్షాత్కారమును పొంది సర్వజగదధిష్ఠానమయిన శుద్ధచైతన్యస్వరూపుడయినాడు- నిరతిశయానందము నొందాడు- గాలిలేనిచోటనున్న దీపమువలెనూ, చిత్రమునందలి బొమ్మవలెను, నిస్తరంగమయిన సముద్రుడివలెను నిశ్చలంగా ఉన్నాడు-

ఆస్థితిలోనుండి ఉద్దాలకుడు ఆకాశమున సిద్ధసాధ్యాదిదేవతాగణమును చూచాడు అనేకమందిని (అనేకమాసులు) అనేకసిద్ధులను దర్శించాడు చంద్రసూర్యఇంద్రాదిపదవుల నిచ్చువాటిని. పాదాలమీద పడి ప్రతిమాలుకున్ననూ వార్లను క్రీగంటితోకూడా చూడలేదు. ఏమాత్రమూ ఆదరణ చూపలేదు- ఇలా ఆసిద్ధులనన్నింటిని అనాదరణ చేసి బ్రహ్మానందమందిరంలో ఆరుమాసాలు నిలచిపోయాడు ఉత్తరాయణంలో సూర్యుడు ఉత్తరదిక్తటంలో ఉన్నట్లు- జీవన్ముక్తదశలలో కడపటిదగు సప్తమ భూమికను పొందాడు- దేవతలు సిద్ధులు సాధ్యులు హరిహరబ్రహ్మలు ఉన్నారు ఆస్థితిలో- అపుడు అతని మనస్సు ఆనందంలోనూ లేదు. నిరానందంలోనూ లేదు. స్వప్రకాశ చిదేకరస పరిపూర్ణముగా ఉంది- ఆస్థితిలో క్షణకాలమయినా ఉన్నవాని మనస్సు మరల భోగపుంజమునందు అనురాగమును చెందదు- స్వర్గాన్ని చూచినవాడికి భూలోకంమీద కోరికపుట్టదు- ఇదే పరమశాంతమయిన స్థితి.

ఇదే శాశ్వతమయినది. శివమయినది. ఇందు విశ్రాంతిచెందిన వానికి మరల సంసారభ్రాంతి పుట్టదు- ఈస్థితిని పొందిన సజ్జనులు మరల దృశ్య ప్రపంచానికి రారు. చైత్రరథమను ఉద్యానమును ప్రవేశించిన వారు మేడిచెట్ల అడవికి ఆశపడరు. ఇట్టి మహానందపదవిని పొందిన మానవులు దృశ్యజాలమును మెచ్చరు. రాజులు దైన్యమును కోరరు. ఇలాంటి స్థితిని చెందిన మనస్సు ఇతరులయొక్క మహత్తర ప్రయత్నముచే సమాధినుంచి వ్యుత్థానము చెందును ఇదన్ని ఆరవభూమికయందు మాత్రమే. ఏడవభూమికయందు అదియునులేదు-

ఉద్దాలకుడు యీస్థితిలో ఆరుమాసములుండి మేఘపటలము నుండి సూర్యుడు బయటికి వచ్చినట్లు సమాధినుండి లేచాడు. వెనుక చూచిన చంద్రబింబమువలె మెరసెడి స్త్రీలను చూచాడు- వారు నమస్కరించెడివారు కొందరు- చామరములను ధరించినవారు కొందరు- పతాకాపటలములను గ్రహించినవారు మరికొందరు- ఇలాగే విద్యాధరీ స్త్రీలతో కూడియున్న విద్యాధరులను కూడ చూచాడు- ఉద్దాలకుడు ఆస్త్రీలు ఆయుద్దాలకమునితో ఇలా అన్నారు.

"స్వామీ! అనుగ్రహించి మాప్రణామాలు (నమస్కారాలు) అందుకోండి. ఈ విమానం ఎక్కి స్వర్గానికిరండి. స్వర్గము ప్రపంచ భోగాలలో ఉత్తమమయినది- అందులో మీ యిష్టంవచ్చిన భోగాలను కల్పపర్యంతము ఉచితంగా అనుభవించండి. ఎవరు యేతపస్సు చేసినా స్వర్గముకొరకే కదా! ఏపుణ్యకర్మలు ఆచరించినా యిందుకే కదా చూడండి హారచామరములు ధరించి విద్యాధరస్త్రీలు మిమ్ముల సేవించుటకు వచ్చియున్నారు- ధర్మార్థములయొక్క సారము కామము. కామముయొక్క సారము స్త్రీలు- అలాంటిస్త్రీలు స్వర్గంలోనే యున్నారు- వసంతఋతువు వంటే పూలగుత్తులుండును" ఇలా సంభాషణ చేస్తూవున్న వారలను గౌరవించి యుద్దాలకుడు మోసపోకుండగా నిస్పృహముగా యున్నాడు- ఆస్వర్గైశ్వర్యమును అతడు అంగీకరించ

లేను. విడిచిపెట్టనూ లేదు. ఓ సిద్ధులారా! మీరు వెళ్ళండి. అని మాత్రం చెప్పి ధైర్యంతో తన సమాధిలో తానుండి పోయాడు.

భోగవిరసుడై స్వధర్మ నిరతుడైన ఆయుద్దాలకుణ్ణి సిద్ధులు కొంత కాలము సేవించారు- మరలి స్వర్గంచేరారు. జీవన్ముక్తుడగు యుద్దాలక మహాముని ఆ వనప్రదేశములలో, ఋష్యాశ్రమములలో యథాసుఖముగా విహరించాడు. అది మొదలుకొని అతడు కొండగుహలలో లీలామాత్రంచేత ధ్యానమార్గములో ఉండిపోయాడు- సమాధిని పొందిన యాతడు ఒకప్పుడు ఒకరోజునకూ యింకొకప్పుడు ఒకమాసమునకూ, మరొకపుడు సంవత్సరమునకూ, కొన్ని సంవత్సరాలకూ, మేలుకొన్నాడు. అది మొదలుకొని యుద్దాలకుడు వ్యవహారదశలో ఉన్ననూ సమాహితుడయియే చిదేకరస స్వరూపముతో సూర్య తేజస్సువలె సర్వ సముడుగా ఉండిపోయాడు. క్రమంగా సప్తమ భూమికయందు విశ్రాంతిని చెందాడు.

## ౨౫౫. ఉద్దాలక నిర్వాణము.

శ్రీరా॥ మహర్షీ! మీరు ఆత్మజ్ఞానమనే పగటికాలానికి సూర్యులు- నాసంశయములనే గడ్డిపోచలకు అగ్నిహోత్రులు- అజ్ఞానమనే అగ్నిమంటలకు చంద్రులు- సత్తాసామాన్యమని సెలవిచ్చారే మీరు ఇందాక ఏమిటది? చెప్పండి అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామచంద్రా! చిత్తము (మనస్సు) విషయభావనను పూర్తిగావిడిచి, తత్సంస్కారములను పూర్తిగామరచి, చిదచిత్తుల ఉభయమునందు అనుగతమైన (ఏకరూపమయిన) స్థితితో నుండుటయే సత్తాసామాన్యము-

సర్వబుద్ధివృత్తులందూ ప్రతిబింబించిన చైతన్యము, సకలదృశ్యములు బాధింపబడగా వృత్తి తద్విషయములులేనిదై, స్వస్వరూప

మయిన బింబచైతన్యమునందు ఎప్పుడు లీనమగునో, అప్పుడు అఖండ చైతన్యమునకుండెడి రూపము సత్తాసామాన్యము—

చేతస్సు (చిత్తము) చరాచర నిఖిలబాహ్యార్థమగు ప్రపంచమును నిషేధించి అఖండచైతన్యాకారముతో నున్న స్థితి సత్తాసామాన్యము—

సకలభూతములు (తమయొక్కస్వరూపముతో భాసించక) తమ పారమార్థికరూపముతో భాసించుట సత్తాసామాన్యము—

తాబేలు కడుపులో దానియవయవములు లీనమయినట్లు భావనయను ప్రయత్నములేకుండా సహజముగా దృశ్యములు ఆత్మస్వరూపమునందు లయించుట సత్తాసామాన్యము—

ఈదృష్టి పంచమషష్ఠ భూమికలందు సమాధిలో నున్నప్పుడు గూడ కలుగును— సప్తమ భూమికను జేరిన వ్యక్తికెప్పుడూ కలుగును. కేవలము అజ్ఞానమాత్రము నున్నటికిని కలుగదు— జీవన్ముక్తులందరూ యీదృష్టిలో నుండి భూమిమీద పాదరసాదులవలెనూ, ఆకాశమున వాయువువలెనూ, ఐహికాముష్మికభోగతృష్ణా రజస్సులతో అంటకుండ నుందురు. రాఘవా! మాబోటివారు, నారదాదిమహర్షులు, బ్రహ్మ విష్ణు ఈశ్వరాదులు వీరందరము ఈదృష్టిలో నున్నవారమే— ఇదే స్థితిని పొంది ఉద్దాలకుడు ప్రారబ్ధక్షయపర్యంతము ప్రపంచంలో ఉన్నాడు—

ఇలాఉండగా కొంత కాలానికతనికి శరీరము చాలించి (విడిచి) విదేహముక్తిని పొందాలని బుద్ధిపుట్టింది— ఇలా ఆలోచించి కొండ గుహలో చిగురుటాకులుపరచుకొని పద్మాసనంవేసికూర్చొని కండ్లను మూసికొని, గుదసంకోచమువల్ల దేహద్వారములు తొమ్మిదింటిని నిరోధించుకొని శబ్దస్పర్శాదిగోచరములయిన ఇంద్రియవృత్తులను ఒక్కొక్కదానిని హృదయమునందు ఉపసంహరించుచూ హృదయమునందు చేరిన ఆవృత్తులను చిద్ఘనస్వరూపముగ భావించుచూ ప్రాణ

వాయువును నిరోధించుకొని శరీర, మెడ, తలలను, సమానస్థితిలో నిలపెట్టి జిహ్వామూలమును (నాలుకను) తాలుమూలమునందు (కంఠచ్ఛిద్రమునందు) ఉంచి ముఖమెత్తి మనోదృష్టులను, లోపలా, బయటా, క్రిందా, మీదా, రూపాదివిషయమునందూ, శూన్యమునందూ, ఉంచక, చిన్మాత్రమునందు నిలిపి, దంతములతో దంతములను స్పృశించాడు- ప్రాణాదివృత్తిప్రవాహమును నిరోధించుటచే అతడు నిశ్చలుడై ప్రసన్నవదనుడై ఆనందావిర్భావంచేత సంజాతకంటకుడైనాడు- ఉత్తమానందాన్ని అనుభవించాడు మనస్సులో- సత్తాసామాన్యస్థితిని పొందాడు- (నిరతిశయానందాస్వాదము లభించనంతవరకు మనస్సు నిరోధక్లేశాన్ని సహించలేక బహిః (బయటికి) వస్తుంది- నిరతిశయానందమును ఆస్వాదించినదా దానియందే గుడపిపీలికాన్యాయంచేత ఆసక్తమై స్వరూపాన్నికూడ మరచి, స్వానుగతమయిన చిత్సామాన్యమునే పొందుతుంది- ఆచిత్సామాన్యదశాక్రమమునొక్క- లయమే సత్తాసామాన్యప్రాప్తి- క్రమంగా అతడికి ఆనందావిర్భావమునకు చిహ్నములయిన రోమాంచాదులుకూడా క్రమంగా ఉపరమించాయి- ఆనందపులకాలు అంతరించాయి- ప్రారబ్ధభోగమునకు హేతువయిన మలశేషం నశించింది. నిర్మలుడయినాడు. సంసారభ్రాంతులు సమాధి ప్రారంభంనుంచీ తగ్గుతూవచ్చి పూర్తిగా క్షీణించాయి చివరికి- వేడినీళ్ళలోని వేడి క్రమంగా తగ్గినవిధంగా క్రమంగా అతడిప్రాణాలు ఉపశమించాయి- హేమంతఋతువునందు చెట్లయొక్క- రసము సూర్యకిరణముల తేజస్సునందు ఉపశమించినట్లు- వెంటనే సకలవికల్పములు నశించి నిర్వికారుడై హైరణ్యగర్భాంత విషయసుఖములను తిరస్క-రించిన వాచామగోచరమయిన సుఖమును పొందాడు- ఆసుఖంలో దేవేంద్రభోగం కూడా సముద్రంలో గడ్డిపోచవంటిది- అపుడు ఉద్దాలకుడను బ్రాహ్మణుడు త్రివిధపరిచ్ఛేదరహితమయిన అఖండానందరూపుడయినాడు- ఉద్దాలకుని జీవచైతన్యము నిజరూపమును చేందేసరికి అతని భౌతిక శరీరము ఆరుమాసాలు సూర్యకిరణముల తేజస్సుకు ఎండి డొక్క-అయి నాడి

వరములతో పర్వతసంబంధమయిన శిలవలె ప్రకాశించింది. ఇలా గడ చిన తరువాత చాలాకాలానికి నభస్థలము నుండి పార్వతీదేవితో కూడిన బ్రాహ్మ్యాదిమాతలు భక్తునిగనుక అభిమాన ఫలసిద్ధికొరకు ఆపర్వతిమానవు విచ్చేసినారు. ఆవిచ్చేసిన దేవతామాతలలో నిఖిలవిబుధ వంద్యయగు చాముండాదేవి ఎండిపోయిన ఉద్దాలకుని శవశరీరమును ఎత్తి తన కిరీటకోటియందు అలంకరించుకొన్నది భూషణముగా. పవిత్ర మయిన ఆతడి శరీరము చాముండాదేవి యొక్క మందారమాలాగణ ముతో చుట్టబడిన శిరోభూషణమగు మాల్యమునందు తుమ్మెదవలె సుఖవిశ్రాంతిని చెందినది. కనుక నిశ్వాసుని చరితమును పరిశీలించు వారలకు కూడ సకలసంసారతాపములు శాంతించి పరమపురుషార్థము లభించును.

## ౫౮. ధ్యానవిచారము.

వసి॥ రామచంద్రా! విచార, వైరాగ్య, సమాధ్యభ్యాస క్రమంలో విహరిస్తూ ఆత్మతత్త్వమునందు విశ్రాంతిచెందు. శాస్త్రము లను వినాలి. అందలి అర్థముగనుక దానాన్ని గుర్తించాలి. గురువు యొక్క మాటలమీద విశ్వాసం ఉండాలి. తన చిత్తమును శోధించు కోవాలి. సకల దృశ్యములను నిషేధించుకొని చిన్మాత్రమునందు విశ్రాంతి చెందాలి. తీక్ష్ణమయిన చిత్తస్థానమ ఉపేక్షించిన స్వామిగ ఏమీ లేకున్నా శాశ్వతమయిన మోక్షపదమును పొందుతావు నూతన పురుష. అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ మహర్షీ! ఒకానొకజ్ఞాని వ్యవహారమునందున్నప్పటికీ, సమాధినొందకనే నిత్యంగా విశ్రాంతిచెంది ఉంటాడు. మరొకడు ఏకాం తంగా ఉండి సమాధినియతుడై (అనగా నిత్యము సమాధిమగ్నుడై) ఉంటాడు. ఈయిద్దరిలో ఎవరు గొప్పవాడో చెప్పండి! అని అడిగాడు శ్రీరాముడు.

మూఁడు చూచును. స్వప్నావస్థయందు ఆదేహతత్త్వము సర్వ వస్త్వాత్మక మని గ్రహించును. ఇట్టివాఁడే సమాహితుఁడు. రాగద్వేష రహితుఁడై సర్వ వస్తువుల యందును సమదృష్టి కలవాఁడు సమాహితుఁడు. సమాహితుని మనస్సు స్వప్నమునందువలె జాగ్రదవస్థయందు కూడ యీ దృశ్య ప్రపంచమును స్వమాయా పరమాత్మ స్వరూపముగనే గ్రహించును. సర్వాతిరిక్తముగ జగత్తును గ్రహించడు. అంగడివీధియందు అనేక మంది జనులు గుమిగూడి తమతమ పనులను తాము నెరవేర్చుకొను చున్నను ఉదాసీనుఁడు సన్న్యాసికి వీరందరు ఉపకారులు కారు. గనుక వీరు లేనివారి క్రిందనే వానికి లెక్క. అట్లే తత్త్వజ్ఞానికి గ్రామమునందు జనులు క్రిక్కిరిసియున్నను వాఁడు తన కుపకరించనందున లేనివారితో సమానులే. కనుకనే జ్ఞానికి నగరములు కూడ అడవులని నేను చెప్పితిని అంతర్ముఖమయిన మనస్సు కలవాఁడు నిత్యము నిద్రించినను బుద్ధుడే. (మేల్కొన్నవాఁడే) మెళకువున్నవాఁడే వీఁడు పట్టణమును, పల్లెను, గ్రామమును, అరణ్యమును అడవిగానే చూస్తాఁడు. అంతర్ముఖుఁడు సర్వ ప్రపంచమును శూన్యమయిన ఆకాశంగాను భావిస్తాఁడు- పూర్ణకామునకు ప్రపంచమంతయు రసార్ద్రమై శీతలముగానే ఉండును. (సుఖముగానే యుండును) లోపలతృష్ణతో తాపమునొందువారలకు యీ ప్రపంచము కార్చిచ్చుమంటలమయముగా దోచును. పృథివ్యాది పంచభూతములు, పర్వతములు, నదులు, దిక్కులు- ఇవన్నీ లోపలనున్న అంతఃకరణతత్త్వముయొక్క భాగాలే. బయటివివలె కన్పించుచున్నవి. మట్టిగింజలే బయటికి మర్రిచెట్టువలె ప్రకాశించుచున్నవి. కనుక లోపలగాని వెలుపలగాని బాహ్యప్రపంచ మేదియు లేదు. పూర్వజన్మ వాసనాబలము చేత మేలాసంకల్పిస్తే ఆ నేమముతో పరమార్థమైన ఆత్మతత్త్వమే యిలా బయలుదేరింది. లోపలనున్న ఆత్మతత్త్వమే బయటికి ప్రపంచముగా భాసిస్తోంది- పెట్టెలోనున్న కర్పూరము సువాసనారూపముతో బయటికి భాసించినట్లు. అట్లాగే బయటికి ప్రపంచరూపముగాను లోపల అంతఃకరణరూపముగాను భాసించుచున్నవి. అయ్యది సద్రూ

పమూ కాదు. అప్రమాపము కాదు. (అనగా ఆ ప్రపంచము వున్నదీ కాదు లేనిదీ కాదు. బాహ్యాభ్యంతరములు ప్రపంచము లోపల వెలుపల నున్న ఆత్మనుంచి వేరు పరచినచో అది లేనిదే యగును. అట్లు నేను పరచనిచో దానియొక్క వునికి చేతనే సకలమూ లోపల వెలుపల అను భేదము యేర్పరచుకొని అందు మీద "అహం మమ" ధ్యాసను పొందుటచే ఆ యధ్యాసం (భ్రాంతి) పోయినచో ఆ ప్రపంచము పూర్తిగా నశించును. సప్రమాప ఆత్మజ్ఞానముండి కర్మేంద్రియములతో వ్యవహరించుచున్నను అభిమానము లేనందున హర్షశోకాది విక్షేపములకు లేశమయినను తావులేదు- ఆస్థితి సమాధిలో సమానమే యగును. సర్వగతమయిన ఆత్మను భావించుచు, చిత్తవృత్తులు శాంతించి, ధ్యాన శోకములు లేనివాడు సమాహితుడు- ప్రపంచము నందలి ఉత్పత్తి నాశములను గమనిస్తూ మూఢులయొక్క అహంమమతాదృష్టులను గూర్చి పరిహసించువాడు సమాహితుడు-

అహంతామమతాదృష్టులు, (అభిమానములు) ప్రత్యక్స్వభావుడయిన జీవాత్మయందయినా ఉండాలి- శ్రుతిసిద్ధమయిన బ్రహ్మస్వభావమందయినా ఉండాలి- ఈ రెండుపక్షాలూ కుదరవు-దృక్కునకు దృశ్యాశ్రయత్వము కుదరనందున ప్రత్యగాత్మయందు అహంతామమతా ప్రపంచం ఉండటానికి వీలులేదు- అసంగాద్వయకూటస్థస్వరూపుడయిన బ్రహ్మయందు అహంతామమతాజగత్తుయొక్క జన్మ అసంభవము- ఆతని అసంగత్వమునకు భంగంవాటిల్లునుకనుక. ఎలాగంటె శరత్కాలంలోని ఎండతో కలసి దూరంగా తరంగబృందమునందు ఒకవిధమైన కాంతి కనిపిస్తూఉంటుంది- ఆకాంతి బాగాకాచిన వెండియొక్క కాంతి వలె ప్రకాశిస్తూ ఉంటుంది- కాని అది తరంగములలోపల ఉన్నదా అంటే లేదు. ఆనదియొద్దకు వెళ్ళి లోపలమునిగిచూస్తే తరంగోదకంలో కనిపించదు కనుక- బయట ఆకాశంలో ఉన్నదాఅంటే అదీలేదు- అసంగకూటస్థమయిన ఆకాశమునందు తరంగక్రియాజన్యమయిన

దుష్కృతఫలమూ లేదు— సుకృతఫలమూ లేదు— వీనికి కర్మలతోటీ పని లేదు— కర్మాభావంతోటీ పని లేదు. జ్ఞాని చిత్స్వభావంతో స్వస్వరూపంగా ఉండిపోతాడు— వీని చిత్తమునందు రాగద్వేషాలు పుట్టవు— రాతిమీద తీగలు చెట్లు పుట్టవు—ఒకవేళ వాసనాభ్యాసం చేత సహజంగా ఇచ్ఛాద్వేషాలు పుట్టినా అవి పరమార్థదశలో వాని స్వరూపభూతములే కాని స్వరూపాతిరిక్తములు కావు.

## ౫౭. భేదనిరాసము.

వసి॥ రామచంద్రా! పరమార్థంలో ప్రపంచమంతా చిదభిన్నం— వ్యవహారదశలో కూడ చిత్స్వభావమే ఆయా రూపంతో గోచరిస్తోంది—

మరియును చిద్రూపమగు ఆత్మ— కనుకనే అందులో చైతన్య ప్రభారూపమగు జ్ఞానము (అనగా కారణమను జ్ఞానము) కలుగుచున్నది— అజ్ఞానమే అహంకారాదిరూపమూ, ఘటపటకుడ్యాది భేదరూపము, తదాధార దేశకాలాదిరూపమూ అయిన ప్రపంచము— ఆవస్తువు నందలి బ్రహ్మస్వభావము తెలియనందున జరుగుతోంది ఇది అంతా— ఇలాగే లవణం బ్రహ్మస్వరూపం— అది తెలియకపోతే, దానియందు కలిగే లవణాజ్ఞానం ప్రపంచమయింది— మోక్షమునందలి మాధుర్యజ్ఞానము ప్రపంచము— రాతియందలి కాఠిన్యజ్ఞానమూ, నీటిలో ద్రవత్వమూ, వృక్షమునందలి శాఖాదిజ్ఞానమూ, ఆకసమునందలి శూన్యత్వమూ, ఆత్మకుడ్యమునందలి నిబిడత్వమూ, ఆత్మరూపమయిన చంద్రబింబంలోని చిద్రసాయనమూ, పరమాత్మస్వరూపమగు గుడంలోని మాధుర్యమూ, పరమాత్మరూపమగు మణిలోని ప్రకాశమూ, ప్రపంచంగా గోచరిస్తోంది— నిజంలో ఆవస్తువులు పరమాత్మరూపములే— అది తెలియనందుననే ప్రపంచభానము జరుగుతోంది అక్కడ— కనుక స్వప్రకాశమయిన పరమాత్మ స్వరూపమే మాయికమగు జగదాకారంగా అనుభవింపబడుతోంది— ఇంతేకాని ఆత్మస్వరూపముకంటె భిన్నముగ ప్రపంచ

మనేది లేగా- నీటిలో ద్రవత్వమూ, గాలిలో స్పందమునూ, ఉన్నట్లే చిద్రూపాత్మయందు ప్రపంచం ఉంది- జీవుని భ్రాంతికనుకూలముగ పరమాత్మకి వ్యర్థము చెందును- కనుక ప్రపంచమునకు అధిష్ఠానసన్మాత్ర రూపమే పరమార్థమయిన (నిజమయిన) స్థితి- జీవులకు ఆనందరూపత్వమే పరమార్థస్థితి- కనుక జీవేశ్వరులకు భేదము ఇసుమంతయు లేదు- ఉభయులకు ఉపాధిభేదమే కాని తత్త్వములో చిద్రూపులే- కనుక జీవపరమాత్మలకు స్వరూప భేదము లేదు. రామా! ఈ విషయం అంతా ఒక్క మాటలో చెపుతాను విను- ప్రపంచం అంతా పరిపూర్ణ స్వప్రకాశమూ, ఆనందైకరసమూ, విషయవ్యావృత్తమూ, ప్రశాంతమూ, అగు బ్రహ్మమే- "సర్వం ప్రశాంతం" "అంతా ప్రశాంతము" అనే శబ్దరూపమయిన ఆహార్య భేదదృష్టి (బాధకాలీన ఇచ్ఛాజన్య భేదదృష్టి) (భేదము లేదని తెలిసియుండికూడ భిన్నముగా వ్యవహరించుట.) వ్యర్థము. దీనివల్ల సాక్షాత్ ప్రయోజనము లేదు. ఏలయన విరోధము రెండు వాచ్యార్థములకు తోచుచుండగా విరోధముగల భాగములను విడిచి, భాగత్యాగలక్షణను ఆశ్రయించి, తద్వారా అఖండార్థమును బోధించుటయే అభేదవ్యవహారమునకు ఫలము. ఆ యఖండార్థము, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతి, తురీయాత్మరూపమగు, అకార, ఉకార, మకార, అర్ధమాత్రలను నాలుగుపాదములుగ విభజించి, పూర్వపూర్వ పాదమును ఉత్తరోత్తరపాదములందు ప్రవిలాపము చేసి, అర్ధమాత్రతో అద్వితీయము, ఆనందైకరసము, నిత్యాపరోక్ష చిన్మాత్రరూపమూ, అగు నేయార్థము లక్షణచే జెప్పబడినదో అదియే కాని సంసృష్టరూపము కాదు-

## ౫౮. సురఘువృత్తాంతము (మాండవ్యోపదేశము)

వసి॥ రామా! శబ్దమయమయిన భేదవ్యవహారము అఖండార్థ బోధకొరకే కాని మరొకదానికొరకు గాదను విషయమునందు నీకొక ఇతిహాసము చెపుతాను విను- అదే సురఘు అనే కిరాతరాజుయొక్క-

చరిత్ర. చాలా ఆశ్చర్యంగా ఉంటుంది- ఉత్తరదిక్కున భూమినుండి పుట్టిన కర్పూరముల రాశియా! ఈశ్వరుని అట్టహాసమా! చంద్రుని వెన్నెలా! అన్నట్లు, హిమవత్పర్వతముయొక్క శిఖరాన కైలాసమనే పర్వతం ఉన్నది- అది హిమవత్పర్వత శిఖరాలకు నాయకమణివలె వెలుగుతోంది- అది ఈశ్వరునికి గృహము. (నివాసస్థానము) ఆహిమవచ్ఛిఖరమునకు ఒకమూలన హేమజటులనే కిరాతులున్నారు. వాళ్ళకు సురఘుడు అనే రాజొకడుండేవాడు- ఇతడు ఐశ్వర్యంలో ఇంద్రుని మించినవాడు- జ్ఞానంలో బృహస్పతికంటె గొప్పవాడు. రసాలంకారాదులతో ఒప్పెడి ప్రబంధరచనలలో శుక్రుని(శుక్రాచార్యులను)మించినవాడు- అతడు నిగ్రహానుగ్రహములతో రాజకార్యములను నెరవేర్చుకుంటూ ఉన్నాడు- ఇలా ఉండగా అతనికి ప్రజలను అనుగ్రహించటం చేత సుఖమూ, నిగ్రహించటంచేత దుఃఖమూ సంప్రాప్తమయింది- ఆ రెంటితో కొంతకాలం బాధపడ్డాడు- తనకు ఊర్ధ్వగతి (స్వర్గప్రాప్తి) లేదని నిశ్చయించుకున్నాడు. దిగులుచెందాడు. ఇలా ఆలోచించుకున్నాడు-

"నేను ఈ పజలను గానుగ నువ్వుగింజలను పీడించినట్లు పీడించుట ఎందుకు? వారుకూడా నావలె బాధపడతారుకదా! నేను ప్రజలకు ధనమును ఇస్తాను- దానివల్ల వాళ్ళకు సంతోషం కలుగుతుంది- నావలె అందరూ ఆనందిస్తారు- ఇంక నేనెవరినీ బాధించకూడదు- లేకపోతే చేయువలసివచ్చిన నిగ్రహమును (శిక్షను) చేస్తూనే ఉంటాను- నిగ్రహమనేది లేకపోతే ప్రజలు వారివారి మర్యాదలో నుండరు. అబ్బా! ఎంతకష్టము- ఈప్రజనాకు వధబంధాదులతో దండింపతగినదీ అయింది. అనుగ్రహింపతగినదీ అయింది- కనుక ఒకప్పుడు అదృష్టవశాత్తు సుఖివంతుడను అవుతున్నాను- మరొకప్పుడు దురదృష్టవశాత్ దుఃఖినీ అగుచున్నాను-" అని అతని మనస్సు ఊగులాడుతూ ఒకచోటిలో విశ్రాంతి చెందలేదు-

ఈస్థితిలో అతనియింటికి ఒకపుడు మాండవ్యముని వచ్చాడు- దేవేంద్రునియింటికి నారదుడువచ్చినట్లు- అతణ్ణి పూజించి సురఘుడు తన సందేహం తీర్చమని అడిగాడు ఇలా-

సుర॥ స్వామీ ! మీరాకచే నాకు పరమానందం కలిగింది- నేను ఇపుడు ధన్యుడనయినాను- మీరు పరమపదంలో చాలకాలం విశ్రాంతి పొందిఉన్నారు- కనుక నాకీసందేహం తీర్చండి- మహాత్ముల సహవాసముచే అన్నిబాధలు తొలగుతాయి అని అంటారు పెద్దలు- సందేహం అనేది పెద్దరోగం- (సందేహః ప్రాణసంకటః) అని సామెత (లోకోక్తికూడా ఉంది)- అదేమంటే నేను నా రాజ్యపరిపాలనలో కొందరిని నిగ్రహించాను- బాధించాను- కొందరిని అనుగ్రహించాను- నిగ్రహంవల్ల వారి శరీరాలు బాధపడిఉండవచ్చు- అనుగ్రహంవల్ల కొందరు ఆనందించి ఉండవచ్చు. ఆనందపరచినందున నాకు సుఖం కలిగినా కష్టపెట్టినందున నాకు దుఃఖముతప్పదుకదా ! కనుక స్వామీ! యీ రెంటియందునూ నాకు సమత్వదృష్టి ఉండే విధానం ఏమిటి- దయచేసి చెప్పండి-

మాండవ్య॥ రాజా ! వారివారి పురుషప్రయత్నంచేతనే మనస్సులో పేలవత్వము పోతుంది- ఎవరికివారు స్వయంగా విచారించుకోవాలి. "నేను ఎవరు? ఈశరీరం ఎలా వచ్చిందినాకు? ఈ ఇంద్రియాలుఏమిటి ? ఈ పుత్రమిత్రకళత్రాదు లెవరు !" అని యిలా ఆలోచించుకోవాలి- విచారణాశీలమయిన మనస్సును హర్షామర్ష విషాదములు కదల్చలేవు- మనస్సు బ్రహ్మాకారమయితే నిశ్చలమవుతుంది- అనగా మనస్సు స్వరూపమాత్రంతో ఉన్నా దానియొక్క సంకల్పవికల్పాలు ఉండవు- తత్త్వదృష్టికలవానికి దుఃఖనివృత్తిమాత్రమే ఫలముకాదు- నిరతిశయా నంద సామ్రాజ్యప్రాప్తికూడకలదు- వివేకదృష్టికలవాడు మేరు, అబ్ధి నభస్సులనుగూడ అత్యల్పముగ చూస్తాడు- పరిచ్ఛేదభావాన్ని విడిచిన మనస్సు సంసారవృత్తులందు నిమగ్నముకాదు- నీచమయిన మనస్సు

క్షుద్ర కార్యమందుగూడ మోహాపడుతుంది- కుంటివాడు గోష్పాద తోయంలోకూడా మునిగిపోతాడు- రాజా! నీవు దృశ్యప్రపంచ మాత్రాన్ని అవలంబించిన మనోవాసనతోటి యీదైన్యంలో పడ్డావు- స్వయంప్రకాశమానమయిన పరమాత్మానుభవం చిక్కినంతవరకు ప్రపంచంమీద వైరాగ్యం సంపాదించాలి- ఆత్మసాక్షాత్కారముగు నంతవరకు అధ్యాత్మశాస్త్రాన్ని తరచాలి-

కనుక సర్వ ప్రపంచమును వదలి సర్వదేశకాల వస్తువులందును పరిపూర్ణమయిన ఆత్మనే భావించవలెను- అప్పుడు పరిపూర్ణాత్మ సాక్షాత్కారం కలుగుతుంది- ప్రపంచమునందు వైరాగ్యము కలుగనిదే ఆత్మసాక్షాత్కారము కలుగదు- లోకంలోనే పరోక్షవస్తువును త్రోసి పుచ్చందే ఇతరవస్తువులభించదే అట్టిస్థితిలో ఆత్మవిషయంలో చెప్పేది ఏమిఉన్నది! ప్రపంచాన్ని విడువనిదే ఆత్మదొరకదు- ఇది ఖచ్చితము (స్థిరము) దృశ్యజాతం అంతా విడిచిపెట్టిన తరువాత విడుచుటకు సాధ్యముకానిదేదో అదే పరమపదము- అని చెప్పి మాండవ్యుడు ఋషి మండలమునకు వెళ్ళాడు-

౫౯-వ సర్గ.

వసి॥ రామచంద్రా! అతడు వెళ్ళినవెంటనే ఈ కిరాతరాజు విచారణచేయడం ప్రారంభించాడు- ఏకాంతంగా కూర్చున్నాడు- ఆలోచించాడు- "నేనెవరు! ఈకొండలు నేనుకాదు- భూమి నేనుకాదు- కిరాతమండలం నేనుకాదు- గజాశ్వసామంతులతోకూడిన పట్టణం నేను కాదు- రాజ్యభోగాలు నేనుకాదు- రాజ్యంనేనుకాదు- నాకు వాటితో సంబంధంలేదు- వాటికి నాతో సంబంధంలేదు- కాళ్లుచేతులు మొదలగు అవయవాలతోకూడిన శరీరముమాత్రం నేను- అని అనుకుంటున్నాను- ఇది ఎంతవరకు సరిపోవునో విచారణచేస్తాను. శరీరంలో ఉన్న మాంసాస్థులు నేనుకాదు- మాంసం జడం- నేను చేతనుణ్ణి- రక్తం జడం-నేను చేతనుణ్ణి- ఎముకలు జడములు- నేను చేతనుణ్ణి- కర్మేంద్రియాలన్నీ

జడములు. నేను చేతన్నాన్ని— అలాగే బుద్ధీంద్రియాలుకూడా జడాలే— కనుక అవి నేనుకాగా— శరీరంలో ఏదేది జడభాగమో అదల్లా నేను కాను— సాంసారికభోగాలు జడములు. అవీ నేనుకాను— సంసారదోష మునకు మూలకారణం మనస్సు. అదీ జడమే— కనుక అదీ నేనుకాను— ఇంక "బుద్ధి" "అహంకారము" అని దేనినమకుంటున్నామో అవికూడా జడములే కనుక నేనుకాను— కనుక శరీరాది మనోబుద్ధిపర్యంతమగు భూతకోశమునే నేనుకాను— ఇలా స్థూలసూక్ష్మ భూతసంఘాతమేదీ నేనుకాను—

ఇంక మిగిలిన దానినిగూర్చి విచారిస్తాను. పైవన్నీ నేనుకాక పోగా చైత్యములను (విషయములను) (ఘటపటాదులను) తెలుసుకొనే వాడు ఎవడో ఒకడు "నేను దీనిని, తెలుసుకొనుచున్నాను" అని అనుకుంటూ సాక్షిచైతన్యముచే తెలియబడుచున్నాడు. వాడే ప్రమాత. వాడుకూడా నిజమయిన ఆత్మకాదు. ప్రమాతృత్వం ఆత్మకు తాత్త్వికమయిన రూపంకాదు ఈయుక్తివల్ల సాక్షివేద్యమయిన ప్రమితి ప్రమేయములుకూడా నేనుకాను. కాన శుద్ధసాక్షిని నేను. ఈనిశ్చయం నాకు ఇప్పటికి కుదిరింది.

నాకు చిత్రంగా ఉంది— నా నిజరూపం నాకిప్పటికి తెలిసింది. అపరిచ్ఛిన్నమయిన పరమాత్మను నేను— బ్రహ్మేంద్రాదులందరూ నాయందే కల్పింపబడ్డారు— సంసారమనే ముత్యాలహారానికి దారము వంటిది చిచ్ఛక్తి— దీనికి ఆకారంలేదు. వికారాలులేవు. చతుర్దశభువనములు ఈచిచ్ఛక్తియొక్క వివర్తములు. సుఖదుఃఖదశలు జీవులకు మిథ్యావభాసములు— ఈ చైతన్యముయొక్క అనుగ్రహంచేతనే మనస్సు దేహమనే రథమెక్కి నాట్యమాడుతోంది. మనస్సు, శరీరము, మొదలయినవేవీ నిజంలోలేవు. కల్పితాలు. ఇవి నశించినందువల్ల పోయిందేమీ లేదు. చిత్తమనే నటునియొక్క నాట్యవిలాసం ఈజగజ్జాలం— ఇది సాక్షిస్వరూపదృష్టిచే తానే చూడబడుతోంది. దీపంతో కుండను

చూచినట్లు— కనుక నాకు నిగ్రహానుగ్రహములనే చింతలు వ్యర్థములు. అవి దేహానివికాని ఆత్మవికావు. నేను ఆత్మనుకాని శరీరాన్నికాను— కనుక నాకు వాటితో సంబంధంలేదు.

అబ్బా! ఇప్పటికి నేను తెలిసికొన్నాను. నాభ్రాంతి తొలగింది. చూడతగిన దానిని చూచాను. కనిపించే దృశ్యజాతంఅంతా చిన్నిష్పందము. (చైతన్యముయొక్క ఆభాస) కాని వేరేమీకాదు.

కాబట్టి ప్రపంచమే మిథ్య అయితే ఇక నాకు నిగ్రహానుగ్రహాలు లేమిటి? సుఖదుఃఖాలేమిటి? శోకమోహాలేమిటి? సర్వము బ్రహ్మమే. ఇదివరకు నేను మూఢత్వంలో ఉన్నాను. ఇప్పుడు నాకు మూఢత్వము పోయింది. వివేకినయ్యాను. ఆనందైకరసస్వభావంతో పరిశీలించిచూస్తే నాస్వరూపాన్ని నాకు శోకమెక్కడ? మోహమెక్కడ? చూచుట యెక్కడ? చేయుటఎక్కడ? ఉండుటయెక్కడ? వెళ్లుటఎక్కడ? అంతా చిద్రూపంగానే ప్రకాశిస్తోంది. తేటతెల్లగా ఇప్పటికి నాతత్త్వం నాకు బోధపడింది. నా స్వరూపానికి నమస్కారము— నాకు కలిగిన జ్ఞానోదయానికి నమస్కారము.

## ౭౦. సురఘు నిర్వాణము.

వసి॥ రామచంద్రా! హేమజటాధీశుడగు సురఘుడు బ్రహ్మాత్మ నిశ్చయంచేత ఉత్తమస్థితిని పొందాడు విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వమును పొందినట్లు— దుఃఖపర్యవసితమయిన పనులలో ఖేదమును పొందలేదు. అప్పటినుంచి రాజుకు ఉచితమయిన నిగ్రహానుగ్రహములందు నిశ్చలంగా ఉన్నాడు— హర్షామర్షములను వదిలేసి ప్రతిరోజూ రాజకార్యములు చేస్తూండేవాడు. చిత్తముమాత్రము, సుషుప్తదశలో ఉన్నట్లు నిశ్చలంగా (నిర్వికారంగా) ఉండేది. ద్వంద్వము లేవీలేవు (శోకమోహాదులు) ప్రపంచమంతా చిత్తత్వముయొక్క కల్పన అని నిశ్చయించుకుని పరిపూర్ణచిత్తుడై ఉన్నాడు. ప్రబోధదశలో ఉన్నా

సమాధిలో ఉన్నట్లే వాని చిత్తము చిద్రూపమందు లయించింది. సంగరహితుడై అనేకవందల సంవత్సరాలు రాజ్యమేలాడు- ఏమాత్రమూ ఆకారంలోమార్పులేదు. (అనగా నిర్వికారుడైయే రాజ్యం చేశాడని అర్థము).

తుదకు అవయవ సన్నివేశరూపమయిన తన శరీరాన్ని విడిచి పెట్టాడు. ఎండసోకిన మంచుబిందువు తనరూపాన్ని విడిచినట్లు- హిరణ్యగర్భాదులకు నియంతయై సకల ప్రపంచముయొక్క- ఉత్పత్తిలయములకు కారణమయిన పరబ్రహ్మను ప్రవేశించాడు- ఘటాకాశము మహాకాశములో చేరినట్లు,జీవచైతన్యము పరమాత్మ చైతన్యంలోపలే భావం చెందిపోయింది- (అనగా ముక్తిపొందాడు) అదేముక్తి-

## ౬౧. సురఘు పరిఘు సమావేశము.

వసి॥ రామా! నీవుకూడ సురఘునివలె అజ్ఞానమును నశింప చేసికో- ఈదృష్టి గాఢాంధకారంలో ఉన్నవానికి దీపం దొరకినట్లే సుమా! ఏవిధమయిన పరితాపమూ ఉండదు మనస్సుకు- అఖండమైన నిర్వృతిని పొందుతాడు- కనుక పరమపావనమయిన యీదృష్టిని సురఘుడు పరిశీలించుకున్నట్లు పరిశీలించుకొని, నీమనస్సుకు దృఢం చేసికొని ఇతరులకు బోధించుచు సమాధానమును చెందమన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ ఆమాటవిని శ్రీరాముడు, గాలికికొట్టుకునే నెమలి పింఛముమీరాది వెంట్రుకవలె చంచలమయిన మనస్సుకు సమాధానము (ఏకాగ్రత) కుదురుట అసంభవమనుకున్నాడు- వసిష్ఠుని అడిగాడు, అది (మనస్సమాధానం) ఎలా కుదురుతుందో చెప్పమని- వసిష్ఠులు సురఘునకూ పర్ణాదుడను రాజర్షికి జరిగిన సంవాదాన్ని దృష్టాంతంగా చూపుచూ జవాబు చెప్పటం ప్రారంభించారు-

వసి॥ రామా! ఏకసమాధానమునందు మనస్సు నిలిపిన సురఘు పరిఘులయొక్క- పరస్పర సంలాపం చెబుతావిను- నీసందేహం తీరు

తుంది- పూర్వం పారసీక దేశాలకు ప్రభువయిన పరిఘుడను రాజొకడుండేవాడు- అతడు ఈ సురఘునకు పరమమిత్రుడు- మన్మథ వసంతములవలె మైత్రి యెంతటిదో అంతటిది వారిమైత్రి- ఒకానొకప్పుడు పరిఘుని దేశంలో గొప్ప అనావృష్టి దోషం ఏర్పడింది ప్రజలకు ఇక్కట్లు రావడం వల్ల- ప్రజలు క్షుత్క్షామజీవితులై (ఆకలిచే కృశించిపోయిన ప్రాణాలు గలవారై) నశింపసాగారు- ఆపరిస్థితినీ ప్రజలకష్టాన్నీ చూచి రాజుకు కూడా చాలా దుఃఖం కలిగింది- మొత్తం రాజ్యం అంతా పూర్తిగా విడిచిపెట్టాడు రాజు- అక్కడ ప్రజానాశనానికి ప్రతీకారం చేయలేక పోయాడు. వైరాగ్యం కలిగింది- అడవికి వెళ్ళాడు తపస్సు చేసికో దలచాడు- పౌరులకు తెలియకుండా ఎక్కడో దూరంగా ఒక ఆసనాన కూర్చొని శాంత మనస్కుడై చాలాకాలం రాలిన ఎండాకులను భక్షిస్తూ (చాలాకాలం) తపస్సు చేశాడు- అప్పుడే అతనికి పర్ణాదుడను పేరు వచ్చింది. అప్పటి తాపసులలో జంబూద్వీపంలో ఇతడే పేరు పొందాడు- ఇలా వెయ్యేండ్లు తపస్సుచేయగా ఈశ్వరానుగ్రహము చిత్తశుద్ధి కలిగి తత్త్వజ్ఞానం అబ్బింది- ద్వంద్వరహితుడయినాడు వీతరాగుడయినాడు. జీవన్ముక్తుడయినాడు- ఆసాధులూ అచలులూ లగు మునులతో కూడుకొని ముల్లోకాలూ తిరిగాడు యథేచ్ఛగా- ఆస్థితిలో ఒకప్పటికి హేమచూడమహీపతియొక్క (సురఘునియొక్క) ఇంటికివచ్చాడు పరిఘుడు- వారుభయులూ ప్రాచీనస్నేహితులు జ్ఞానపూర్ణులు- విజ్ఞాతవిజ్ఞేయులు- పరస్పరం సన్మానం చేసికొన్నారు- నాపుణ్యం మంచిదంటే, నాపుణ్యం మంచిదని ఒకరినొకరు మన్నించుకున్నారు- ఒకరినొకరు కౌగలించుకున్నారు. పరస్పరం సంతోషించారు. ఏకాసనోపవిష్టులయ్యారు. (ఒకే ఆసనంమీద ఉభయులూ కూర్చున్నారు)- ఇలా సంభాషించుకున్నారు- ముందు పరిఘుడు ఇలాఅన్నాడు.

పరిఘుడు॥ రాజా! నిన్ను చూచుటచే నాకు పరమానందం కలిగింది. సహజమయిన ప్రేమకు కొంతకాలం వియోగం జరిగేసరికి

శతశాఖలతో (అనేక కొమ్మలతో) విస్తరిస్తుంది- అది విశ్వాసగర్భితములయిన ఆ వెనుకటి కథలనూ, ఆసంభాషణలనూ, ఆచేష్టలనూ స్మరించుకొని మాటిమాటికి సంతోషిస్తున్నాను. మాండవ్య మహాముని అనుగ్రహంచేత నీకు ఎలాజ్ఞానంకలిగిందో అలాగేనాకుకూడా ఈశ్వరానుగ్రహంవల్ల జ్ఞానం కలిగింది- ఇపుడు నీవు నిర్దుఃఖంగా ఉంటివా? విశ్రాంతంగా ఉంటివా? నీచిత్తము ఆత్మారామమై నిర్మలంగా ఉన్నదా? సమతాదృష్టితో రాజకార్యములను నెరవేర్చుచుంటివా? నీ దేశములోని ప్రజలు ఆధివ్యాధులు లేకుండా పాడిపంటలతో సుఖంగాఉన్నారా? భూమి అన్నిసస్యములను ఫలింపచేయుచున్నదా? నీకీర్తి దిగ్గృతవ్యాప్తంగా ఉన్నదా? నీగుణగణములు దిగంతవ్యాప్తంగా ఉన్నవా? వరిచేలలో కాపలాకాచే ఆడపిల్లలు ప్రతి గ్రామంలోనూ నీయశస్సును పాడుచున్నారా? నీకు భృత్యమిత్రపుత్రకళత్రక్షేత్రవిత్తాదులన్నిటియందూ కుశలమేనా? నీశరీరం ఆధివ్యాధులులేకుండ ఆరోగ్యంగా ఉన్నదా? ఐహికాముష్మికపుణ్యమును నెరవేర్చుచున్నదా? విషయసుఖములందు నీచిత్తము విరాగమేనా? అబ్బా! మనము చాలకాలమయిందికదా వియోగంచెంది ఇప్పటికి దైవాత్తూ కలిశాం-

మిత్రమా! సంయోగ వియోగములవల్ల కలిగే సుఖదుఃఖావస్థలను చూడని జనులుండరుకదా లోకంలో అలాగే మనంకూడా చాల కాలం విడిపోయాం. ఇపుడు దైవికంగా మళ్ళీకలిశాం- ఇదంతా దైవవిధి- అతివిచిత్రంకదా! అన్నాడు పరిఘుడు-

సురఘుడు॥ భగవన్! అతి గంభీరమయింది- ఈశ్వరేచ్ఛ అదే నియతి- నియతియొక్క నడకను ఎవరు గుర్తించగలరు? మనముభయులము దేశకాలములందు చాలదూరంగా వియోగంచెంది ఇపుడు మళ్ళీ చేరాము- (కలిశాము) నీరాకవల్ల కలిగిన పుణ్యవిశేషంచే మేము పరమపావన మయినాము- నిర్వ్యాకులంగా ఉన్నాము- మాపుణ్యం ఫలించింది- మాపురంలో సకలసంపదలూ చేకూరాయి. సజ్జనసాంగత్యం పరమపదముతో సమానంకదా! అన్నాడు సురఘుడు-

## ౬౩ సమాధినిశ్చయము.

వసి॥ రామా! ఇలాంటి ప్రాచీన స్నేహాగాఢత్వమైన ఇష్టాగోష్ఠిలో ఇలా అన్నాడు పరిఘుడు- తత్త్వవేత్తకు సమాధివ్యవహారదశలలో సుఖ తారతమ్యం ఉన్నదంటావా? లేదంటావా? అని పరీక్షించాలనుకున్నాడు. అందుకుగాను మొదట తన అనుభవాన్ని బయటపెట్టాడు-

పరిఘుడు॥ రాజా ! ఈసంసారజాలంలో ఏపనిచేసినా సమాహిత చిత్తునకు సుఖమిస్తుంది- ఇతరుడికి సుఖమివ్వదు. నీవు సంకల్పరహితు డవై పరమోపశమమైన, అతిప్రశస్తమైన సమాధిని అనుష్ఠించుచుంటివా? అని అన్నాడు-

సురఘు॥ మిత్రమా! సర్వసంకల్పవర్జితమైన పరమోపశమరూప సమాధి అనగా ఏమిటి? చెప్పు! అని అడిగాడు సురఘుడు (అనగా మనస్సు అతిచంచలంకదా! అలాంటిదానికి విశ్రమణాస్పదమయిన సమాధి ఎలాసంభవిస్తుంది?) అని సురఘుని ప్రశ్నకు తాత్పర్యం- లేక "నన్ను సమాధి అనుష్ఠించుచుంటివా" అని అడిగితివే! కారణంఏమిటి? ఎందుకుగాను సమాధిని అనుష్ఠించాలి! అనికూడా అతని ప్రశ్నకు తాత్పర్యం చెప్పవచ్చును.

మిత్రమా! తత్త్వవేత్త ఎల్లప్పుడు వ్యవహారదశలో ఉంటే మాత్రం కిందరూపుడు! అనావృతాద్వితీయచిత్స్వభావుడయిన ఆత్మ అసమాహితచిత్తుడు ఎలా అవుతాడు! కానప్పుడు ఇంకసమాధిని అను ష్ఠించవలసిన పనియేమి! నిర్మలాత్మ స్వరూపంతో ఉండుటే సమాధి అయినప్పుడు అది ఆత్మకు సదా (ఎప్పుడూ) ఉన్నది కనుక అందుకొరకు సమాధిని అనుష్ఠించనేల! ఇంక పద్మాసనం వేసికొని కూర్చున్నా, బ్రహ్మతత్త్వాన్ని దోసెలలో ఉంచినా, ఎవడిచిత్తము విశ్రాంతిని చెందదో అలాంటి అజ్ఞాని సమాధిని ఆచరించి ప్రయోజనమేమి! వాడికి సమాధిని ఉపదేశించిన లాభమేమి! ప్రాపంచిక విషయములందు ఆశా

పాశములను [తె]ంపుకొని ఆత్మను పరమార్థస్వరూపమునందుంచుటయే సమాధి- అంతేకాని తూష్ణీంభావమాత్రము సమాధికాదు- అలాంటి సమాధివల్ల ప్రయోజనం లేదు. ఇలాంటి సమాధి లోష్ఠకాష్ఠములకు కూడా ఉంది- అబాధితాత్మదర్శనరూపమయిన పరాప్రజ్ఞయే సమాధి. ఇలాంటి సమాధిలో ఉన్నవానికి చిత్తవిక్షేపాలు ఉండవు. అహంకారం ఉండదు- వాడి మనస్సు ద్వంద్వాలమీదికిపోదు- మేరుపర్వతమువలె స్థిరంగా ఉంటుంది- జ్ఞేయతత్త్వమును గుర్తెరిగి హేయోపాదేయములను విడచిన మనస్థితియే సమాధి. ఇలాంటి సమాధి నాకు తత్త్వజ్ఞానముకలిగి నప్పటినుంచి ప్రాప్తించే ఉన్నది- దానిని ఇపుడు నేను అనుష్ఠించవలసినపనిలేదు- తామరకాడయొక్క దారాన్ని పిల్లవాడు చేతపుచ్చుకొని దూరంగాలాగితే తెగిపోతుంది- అలా ప్రబుద్ధమనస్కుని యొక్క చిత్తసమాధానము విచ్ఛిన్నముకాదు- సూర్యుడు పగటికాలం అంతా వెలుగునిచ్చుటకు ఉపేక్షింపడు.(విరమించడు) అలాగే మాబుద్ధి జీవితాంతమువరకు తత్త్వదృష్టినుంచి మరలదు- నదీనీటి ప్రవాహమును అడ్డగించుకొనదు. అలాగే నామనస్సు విజ్ఞానదృష్టిని క్షణకాలంకూడా విరమించదు- కాలము కాలగతిని మరువదు- ప్రాజ్ఞునిబుద్ధి ఆత్మతత్త్వమును మరువదు- సదాగతియగు వాయువు స్పందమును (చలనమును) మరువదు- ప్రాజ్ఞునిబుద్ధి నిశ్చయింపతగిన చిన్మాత్రమును విస్మరించదు- సూర్యాదులు కాలగతిని నిర్వహింపక మానరు- చైతన్యస్ఫూర్తి చేత్యములను (విషయములను) విడచి చిత్త్వమును అన్వేషించక మానదు- పదార్థము సత్తను (ఉనికిని) విడిచి యెట్లుండదో, జ్ఞానియొక్క చిత్తము కూడా ఆత్మజ్ఞానవిహీనమై క్షణకాలంకూడా ఉండదు- ప్రపంచంలో గుణవంతుడయినవాడు గుణములేకుండా ఉండడు- జ్ఞానిఅయినవాడు ఆత్మచింతన లేకుండ ఉండడు-

కనుక మిత్రమా! నేను ఎల్లపుడు సంప్రబుద్ధుడనే- సదానిర్మలుడనే- సర్వదా శాంతాత్మనే- సర్వదా సమాహితుడనే- నాచిత్త

సమాధికి విచ్ఛిత్తి ఎలాకలుగుతుంది? ఆత్మాకారమై ఉన్నపుడు- కనుక నాచిత్తమెప్పుడూ (సమాధినుంచి తొలగి) లేదు- ఆత్మకంటె భిన్నముగా మనస్సు అనేదే లేదంటావా? అప్పుడు సమాధే లేదు-అంతా అద్వితీయాత్మయే- కనుక సర్వవ్యాపకుడయిన ఆత్మ సర్వప్రపంచ రూపుడై సర్వదా ఉన్నాడు- ఇంక సమాధి ఏమిటి? అసమాధియేమిటి? కాబట్టి తత్త్వజ్ఞునిదృష్టిలో సమాధ్యసమాధులు లేవు- ఆ రెండూ సమానములే- ఇక ఆ రెంటికి భేదమును సూచించి నీవడిగిన ప్రశ్నకు అభిప్రాయమేమి? గట్టిగా విచారిస్తే నీప్రశ్న వ్యర్థము- అర్థరహితము- అన్నాడు హేమచూడ రాజు (పరఘునకు)-

## ౬3. సురఘు పరిఘుసఖ్యము.

పరిఘు॥ రాజా! నిజంగా నీవు తత్త్వవేత్త- నేను పరీక్షించి తెలుసుకున్నాను- చంద్రునివలె శీతలాంతఃకరణుడవు- రాజీవమువలె ఆనందరసపూరితుడవు- నిర్మలుడవు- ప్రకటాశయుడవు- నిస్తరంగాబ్ధి వలె ప్రకాశిస్తున్నావు- స్వస్వరూపమునందున్నవాడవు ఇష్టానిష్టములందు సమభావంతో ఉంటావు- అంతటా సంతోషం చెందుతావు- అంతటా వీతరాగుడవు- సారాసారవిచారణచేసి సర్వప్రపంచము ఆత్మస్వరూపమని గుర్తించావు- భోగాభిలాషదశను విడిచావు- (దాటావు) స్వస్వరూపమునందు పరితృప్తి చెందావు- నాకు చాలా ఆనందం కలిగింది అన్నాడు పరిఘుడు-

సురఘు॥ మిత్రమా! నాకు ఉపాదేయమయిన వస్తువు ఈప్రపంచంలో ఏదీలేదు- ఉపాదేయం లేదుకనుకనే హేయమూలేదు- గ్రాహ్యము (ప్రతియోగి) లేనిదే హేయము ఉండుట అసంభవము- సర్వవస్తువులూ తుచ్ఛములూ కాలవశంచేత అతుచ్ఛములూ అవుతూ ఉంటాయి- బద్ధముక్తుడయినరాజుకు ఒక్క గ్రామమిస్తే సంతోషిస్తాడు- వాడే మొదట ఐశ్వర్యపరిపూర్ణుడయితే రాజ్యం అంతా

యిచ్చినా తృప్తిపడను- (ఐశ్వర్యపూర్ణునకు రాజ్యం అంతా యిచ్చినా గొప్పగా యిచ్చినట్లు భావించడు-) అలాగే తుచ్ఛత్వాతుచ్ఛత్వములు మనోవృత్తులు- అవినాకు నశించాయి- కనుక ఒకటి తుచ్ఛమనీ మరొకటి అతుచ్ఛమనీ అనేభావమే నాకులేదు- దేశకాలవశంచేత తుచ్ఛవస్తువు అతుచ్ఛం అవుతూ ఉంటుంది- అతుచ్ఛము తుచ్ఛమవుతూ ఉంటుంది- ఇట్టి నిందాస్తుతులు వివేకులకు పనికిరావు- రాగద్వేషములవల్లకాని నిందాస్తుతులులోకంలో కలగవు- కోరికగల వస్తువు నందుకాని అనురాగం కలుగదు- వివేకంచేత మహోదారమయిన ఆత్మవస్తువును వాంఛించినాను- ఇంకనాకు నిందాస్తుతులతో ప్రసక్తిలేదు- మూడులోకాలలోనూ, స్త్రీలూ, శైలములూ, సముద్రములూ, వనపంక్తులూ, నిఖిలవస్తువులూ, వస్తుశూన్యములు- సత్యత్వశూన్యములు వీనిలో నిజంగా సారంలేదు- ఆపదార్థంలో లోపలివస్తువులన్నీ మాంసాస్థిమయాలు (అనగా మాంసము ఎముకాలతో కూడినవే- శరీరంలోని వస్తువులు) బయటివస్తువులు కొయ్యవీ, మట్టివీ, రాతివీ, వీనిలో కోరతగినవేవి? ఏమని కోరేదినేను? కనుక వాంఛయే లేకపోతే రాగద్వేషాలు నశించిపోతాయి- పగటికాలం సమాప్తమయితే (అనగా సూర్యాస్తమయితే) ఎండా ఉండదు- వెలుగూ ఉండదు- కాబట్టి నామనస్సు విక్షేపరహితమై స్వాత్మస్వరూపమునందే తృప్తి చెందిఉన్నది- ఇదే ఉత్తమస్థితి- ఇదే ఉత్తమ విశ్రాంతి- ఇదేసుఖదశ- ఇంతకంటె సేవించతగినదశ మరొకటిలేదు- అని ఆత్మనిశ్చయాన్ని వెల్లడించాడు సురఘుడు-

## ౬౮. వసిష్ఠోపదేశము.

వసి॥ రామచంద్రా! సురఘుడు, పరిఘుడును, తత్త్వవిచారం చేసికొని, ప్రపంచం భ్రాంతిమాత్రమని నిశ్చయించుకొని, ఒకరినొకరు గౌరవించుకొని, వారివారి పనులలో ప్రవేశించారు- అలాగే నీవుకూడ విచారణ చేసికొని జ్ఞానము సంపాదించు- తత్త్వవిచారజన్యమయిన

జ్ఞానంకలవానికి అహంకారం చస్తుంది- శరత్కాలమేఘంవలె చిత్తం నిర్మలమవుతుంది- సుప్రసన్నమయిన చిదాకాశమందు పరమాత్మ ప్రతిఫలితుడవుతాడు- నిరంతరము ఆత్మానుసంధానం చేసేవాడి మనస్సుకు శోకమోహాదులంటవు- వాడు వ్యవహారదశలో ఉన్నా, రాగద్వేషములు కలవాడని మూఢులనుకొనుచున్నా మనస్సులో కలంకం ఏర్పడదు వాడికి- సమ్యగ్జ్ఞానముగల మునినీ మనస్సు బాధించలేదు- జ్ఞాని చిత్తము భోగైకశరణముగా నుండదు- నందనవనంలో విషకంటక వృక్షాలుండవు- జ్ఞానియొక్క చిత్తంలో క్షుద్రసుఖాభిలాష ఉండదు- విరక్తుడయినవాడు జన్మమరణములపట్ల దుఃఖించడు- జ్ఞానిచిత్తము కూడా జన్మమరణములయెడ దుఃఖమునొందదు- ఆకాశానికి దుమ్ము అంటదు- జ్ఞానిచిత్తానికి పాపమంటదు- అవిద్యావ్యాధికి విచారజన్య జ్ఞానమే మందు- "ఇది అజ్ఞానము" అని తెలుసుకుంటే భోగభూమి నశిస్తుంది- ఇది స్వప్నమని తెలుసుకుంటే స్వప్నభోగాలు ఎగిరిచక్కా-పోతాయి- ఎల్లకాలం నీటిలో ఉన్నా చేపకండ్లకు నీరు అంటదు- నిత్యము వ్యవహారపరుడయినా, అనాసక్త చిత్తునకు పాపమంటదు- చిద్రూపమయిన సూర్యుడు ఉదయిస్తే అజ్ఞానమనే రాత్రి క్షీణిస్తుంది- అప్పుడు జ్ఞానియొక్క చిత్తము పరమానందాన్ని పొందుతుంది- జ్ఞానార్కుడుదయించి అజ్ఞాననిద్ర అంతరిస్తే ప్రబోధం కలుగుతుంది- ఇంకమళ్ళీ ప్రపంచ వ్యామోహం ఉండదు- మానవుడు ఆత్మచింతనచే మోహమును తొలగించుకొని అంతశ్శీతలంగా ఉంటాడు- ఏరోజులలో చిచ్చంద్రిక హృదయాకాశంలో ప్రకాశిస్తూ ఉంటుందో అవేరోజులు, అవేశాస్త్రాలు- వారేమిత్రులు- ఆత్మావలోకనమందు ఉపేక్షవహించిన వాళ్ళకు జన్మమరణదుఃఖాలు ఎన్నటికీ తప్పవు.

రామా! ఈ జీవుడనేవాడు ఒక యెద్దువంటివాడు. ఈయెద్దు సంసారమనే బురదగుంటలో దిగబడింది- నీవు పురుషప్రయత్నంచేత ఎలాగయినా బలాత్కారంగా ఉద్ధరించాలినీవు- ఈ ఎద్దును ఆశలనే

త్రాళ్ళచే కట్టారు- భోగాలనే తృణవిశేషాలకు ఆసపడింది. ముసలితనంచేత అవయవాలపట్టు తప్పింది- శోకమనే బుస్సలు కొడుతోంది- దుఃఖమనే బరువు మోస్తోంది- జన్మఅనే జాంగలంలో (మైదానంలో) జీవిస్తోంది- దుష్కర్మలనే బురద శరీరమంతా పట్టుకుంది- వ్యామోహమనే చిన్నచిన్న బురదగుంటలలో మునుగుతుంది- రాగములనే దోమలచే కొట్టబడింది- తృష్ణఅనే చర్మమయమయిన తాడు ముక్కుకొనానికి తగల్చి లాగబడుతోంది- మనస్సు అనే వర్తకుని స్వాధీనంలో ఉంది- బంధువులనే బంధనములచే కదలుటకుకూడ సాధ్యంకాకుండాఉంది- పుత్రమిత్రకళత్రాదులనే మురికిపేడలో మునిగితేలుతోంది- బాగా అలసిఉంది- క్షీణమయినా విశ్రాంతిలేదు- రాకపోకలచే కృశించిపోయింది- సంసారమనే అడవిలోపడింది- ఎక్కడా దీనికి నీడదొరకలేదు- తీవ్రతాపములనే ఎండకు ఎండుతోంది. బాహ్యాకారం భాసురం ఉందికాని లోపలమాత్రం అతిదీనంగాఉంది- చక్షురాదీ బాహ్యేంద్రియాలు మీదయెక్కి తొక్కుతున్నాయి- కర్మబోధకములయిన అర్థవాదలనే ఘంటానాదములకు భ్రమపడుతోంది- పాపకర్మలనే కొరడాదెబ్బలకు పరుగెత్తుతోంది- ఆవిర్భావతిరోభావములనే బండిచక్రముల బరువును లాగుతోంది- అజ్ఞానమనే అడవిలో తెగతిరిగి కృశించిపోయింది- ఎప్పుడు తన అనర్థాలలోనే తానుమునిగి కృశించిపోతోంది దిక్కులేక- కర్మభారంచేత అతిదీనంగా ఏడుస్తోంది- ఇలాంటి ఎద్దును నీవు బలాత్కారంగా ఏవిధంగానయినా ఈసంసార పల్వలము (బురదగుంట) నుండి ఉద్ధరించకపోతే నీవు పురుషధౌరేయుడవు కానేరవు సుమా! తత్త్వజ్ఞానంచేత చిత్తాన్ని నశింపచేస్తేనా జీవుడు మరల పుట్టడు- భవార్ణవాన్ని తరిస్తాడు- బ్రహ్మిష్ఠుడగు సద్గురుని దరిజేరుటయే దీనికి (సంసార తరణమునకు) ఉపాయము సజ్జనులనే పాదపములు (చెట్లు) లేనిదేశము మరుభూమి- అందు నివసించతగదు- రామా! సుజనులనే సంపెంగ చెట్లక్రింద క్షణకాలం విశ్రమించినాచాలు- ఏకొద్దిపాటి వివేకం కలవాడుకూడా స్వాత్మలాభవిశ్రాంతిలేని సంసారంలో

నిద్రించకూడదు- ఆత్మే ఆత్మకు బంధువు. ఆత్మే ఆత్మకు శత్రువు- దేహాభిమానగర్వంచేత ఆత్మను జన్మమరణములనే బురదగుంటలో త్రొక్కకూడదు-"ఈ దేహదుఃఖమేమిటి?" "ఇది ఎలావచ్చింది-ఎలానశిస్తుంది" అని ప్రాజ్ఞులు ప్రయత్నపూర్వకంగా ఎప్పుడూ పరీక్షించాలి- సంసార సముద్రంలో మునిగిన ఆత్మను ఉద్ధరించడానికి ధనములు సహాయపడవు- మిత్రులు సహాయపడరు- శాస్త్రములు సహాయపడవు- బంధువులు సహాయపడరు- నిత్యమూకూడా ఉండే మనస్సు అనే స్నేహితుడు తోడ్పడే కొంచెం ఆలోచిస్తే ఉద్ధరించగలడు- వైరాగ్యమూ, అభ్యాస యోగమూ అను రెంటి సహాయంచేత తత్త్వావలోకనం అనే ఓడను ఎక్కియడల భవసాగరం దాటసాధ్యం అవుతుంది- నిత్యమూ దురాశలచే తగలపడుచూ దుఃఖిస్తూఉండే ఆత్మను ఉపేక్షించకూడదు- ఆదరించాలి. ఉద్ధరించాలి. జీవుడనే ఏనుగునకు అహంకారమనేది పెద్దకొయ్య- తృష్ణఅనేది త్రాడు- మనస్సు దానిమదం- అది జన్మపరంపరలనే ఊబి (బురద) లో దిగపడింది- దీనిని లేవదీయక తప్పదు. రామా! విమూఢత్వమును పోగొట్టుకొని, అహంకారాన్ని తుడిచిపెట్టుకుంటే ఆత్మరక్షింపబడతాడు- సంకల్పవికల్పాలు రూపుమాపుకొని అహంభావాన్ని పీకిపారవేస్తే ఆత్మబురదలోనుంచి గట్టెక్కి మంచి త్రోవలో పడతాడు. బోధపర్యంతమయిన తత్త్వవిచారంలో ప్రవేశిస్తాడు- ఇందుకుగాను బాహ్యాధ్యాత్మిక ఆసక్తిని విడవాలి- తః కాపి శరీరం కాష్ఠలోష్ఠసమంగా చూచేయడల పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది- అహంకారమనే మేఘంపోతే చైతన్యమనే సూర్యుడు బయటపడతాడు- ప్రత్యక్షమవుతాడు- తత్పరిణామంగా మోక్షపదము సంప్రాప్తమవుతుంది- చీకటిపోతే వెలుతురు స్పష్టపడుతుంది- అహంకారం విచ్ఛిన్నమయితే ఆత్మతత్త్వం ప్రత్యక్షమవుతుంది- అహంకారం నశించిన తరువాత ఉండే అవస్థయే సుఖావస్థ- అదే ప్రయత్నపూర్వకంగా సంపాదించాలి. ఈదశ ఎవరికీ గోచరించేదికాదు- దీని కుపమా

నము లేదు. దృశ్యసంబంధం ఏమాత్రం ఉండదు ఈదశలో- కేవలము చిత్ప్రకాశాంశ కలిక స్థిరపడే యెడల అదే తురీయస్థితిని పొందితే, అప్పుడు దానికదే ఉపమానం అవుతుంది. రెండవది ఈస్థితికి ఉపమానం లేదు. కాని కొంతవరకు సుషుప్తిదశ దానికి సన్నిహితము కనుక ఉపమానము కాగలదు- విక్షేపరాహిత్యంలో సుషుప్తిదశ ముక్తిదశకు ఉపమానం అవుతుంది- ఇందులోనే అజ్ఞానావరణంకూడా లేకుండా ఉంటే ఇది తురీయావస్థ అనటంలో అభ్యంతరం లేదు- కనుక కొంతపోలిక ఉన్నందున దానిని పోల్చవచ్చు. ఘటంపగిలితే ఘటాకాశం మహాకాశంలో లీనమయినట్లు మనస్సు అహంకారము అనే ఉపాధులునశిస్తే త్వంపదలక్ష్య పదార్థము తత్పదలక్ష్య స్వరూపమవుతుంది-

రామా ! ఇలాంటి ముక్తిదశ సుషుప్తికి చాలదగ్గరది- వాచామగోచరమయినది. హృదయమందు మాత్రమే అనుభవింపబడునది- అసాధారణమయిన గవాదుల స్వరూపం పరిచయంకావాలంటే అనుభవంకంటే వేరు ప్రమాణంలేదు. అలాగే ఆత్మానుభవానికికూడా అనుభవంకంటే వేరుప్రమాణంలేదు- కాబట్టి రామా! దృశ్యప్రపంచం అంతా ఆత్మస్వరూపమే- చిత్తము బాహ్యవిషయమునుండి మరలి లోపలి ప్రత్యగాత్మయొక్క- ఆకారాన్ని చెంది దృఢపడి నిశ్చలమయితే చరాచరప్రపంచరూపుడును, చక్షురాదీంద్రియవృత్తులకు సాక్షిస్వరూపుడునూ అగు పరమాత్మసాక్షాత్తుగ అనుభవింపబడుతూనే ఉంటాడు. ఇందులో సందేహం లేదు.

తరువాత చతుర్థభూమికలో ఆత్మానుభవమూ, పంచమభూమికలో విషయవాసనలు పూర్తిగా నశించటమూ షష్ఠభూమికలో అప్రయత్నంగా పరమపురుషార్థరూపమయిన ఆత్మప్రకాశానుభవము స్పష్టంగా కలగడమూ సిద్ధిస్తుంది. పిదప సప్తమభూమికలో సమాధ్యసమాధులందు సమతాస్థితీ చిదేరసస్థితీ కలుగుతుంది.

## ౬౫. భాసవిలాస వృత్తాంతము.

వసి॥ రామచంద్రా! మనస్సును మనస్సుతో ఛేదించి ఆత్మసాక్షాత్కారం చేసికోనకపోతే సంసార దుఃఖానికి నాశం ఉండదు. స్వప్నం లోని సూర్యబింబపు బొమ్మకు అస్తమయము లేనట్లు— మనస్సుని మనస్సుతో ఛేదించడం అంటె సంకల్పవికల్పాత్మకమనస్సును సంకల్ప వికల్పరాహిత్యాభ్యాసంచేత రూపుమాపటం— అంతవరకు అనర్థాలు గుంపులుగుంపులుగ వచ్చిపడుచునే ఉంటాయి— ఈవిషయంలో నీకొక పురాతనమైన ఇతిహాసం చెబుతాను— సహ్యపర్వతాలచరియమీద భాసుడు విలాసుడు అను స్నేహితులిద్దరకు జరిగిన సంవాదాన్ని—

వసి॥ రామా! భూలోకంలో సహ్యపర్వతమని యొకటికలదు— అదిఎత్తులో ఆకాశాన్ని మధ్యభాగంలో భూభాగమంతా అధోభాగం చేత పాతాళలోకాన్ని ఆక్రమించిఉండేది— దానియందలి అటవీసంపదలు వర్ణనాతీతములు— దాని ఉత్తరపు చరియమీద బ్రహ్మాండమయిన ఆశ్రమం ఒకటి ఉండేది— దానిలో ఇద్దరు తాపసులుండేవారు. వారిద్దరికీ చెరియొకకొడుకు చొప్పున ఇద్దరుకొడుకులు కలిగారు. వారిలో ఒకరి పేరు విలాసుడు మరొకరిపేరు భాసుడు— నూనెకు నువ్వుగింజకువలె అఖండమైత్రి(పరమమైత్రి) వాళ్ళిద్దరికీ—క్రమంగా బాల్యంవదిలి యౌవనము పొందారు వాళ్ళు— ఇంతలో వాళ్ళతండ్రులు ముసలివారై దివంగతులయి నారు—అందుచేత వీళ్ళిద్దరూ దిగులు చెందారు. ఉత్సాహంతగ్గింది—అలాగే ఆ దుఃఖంతోటే యిద్దరూ తమ తండ్రులకు ఔర్ధ్వదైహికకర్మలు చేశారు— ఘోరదుఃఖంలో మునిగారు. ఎంతటివారికయినా లోకస్థితి అలంఘ్యముకదా రామచంద్రా! తండ్రులకు అపరకర్మచేసి పితృవియోగ దుఃఖాన్ని పట్టలేక ఏడ్చిఏడ్చి తుదకు మతిలేని వాళ్ళవలె నిశ్చేష్టు లయినారు—

౬౩. ప్రపంచ మనిత్యమని ప్రతిపాదించుట.

కృశగాత్రులయినారు. గృహక్షేత్రధనాదులందు విరక్తులయి నారు- అదే అడవిలో కొన్నిరోజులూ, మాసాలూ, సంవత్సరాలూ, కూడా గడిచాయివాళ్ళకు- ఇందులో కొంతకాలం వాళ్ళిద్దరకు వియోగం తటస్థించింది. దైవాత్ మళ్ళీకలిశారు- పరస్పరం ఇలా సంభాషించుకున్నారు-

విలా॥ మిత్రమా! భాసా! నీకు స్వాగతము- ఇన్నిరోజులూ నాతో వియోగించెంది కాలం ఎక్కడ గడిపావు? నీతపస్సు సఫలమేనా? నీబుద్ధికి దిగులు తీరినదా! వివేకము కలిగిందా? ఆత్మసాక్షాత్కారమయినదా? నీవు కుశలమేనా? అని అడిగాడు విలాసుడు భాసుని,

వసి॥ రామా! సంసారమునందు విరక్తుడై ఆత్మజ్ఞానమునొందక ఇలామాట్లాడిన విలాసునితో భాసుడు స్పష్టంగా ఇలా అన్నాడు ఆదరణతో,

భాస॥ మిత్రమా! ఇప్పుడిప్పుడే కొంచెం కులాసాగాఉన్నాను. అదృష్టవశాత్తు చూచానునిన్ను- సంసారంలో ఉన్నమాకు కుశలమనేది స్థిరంగా ఎలాలభిస్తుంది? ఆత్మతత్త్వం తెలియనంతవరకూ కామసంకల్పాదులు నశించనంతవరకూ, సంసారసముద్రాన్ని తరించనంతవరకూ, మానవుడికి కుశలమనేది సున్న. ఆశాపాశాలు మనస్సులో త్రెగిపోనిదే సుఖమెక్కడిదీ- ఆత్మజ్ఞానం కలగనిదే సుఖమెక్కడిదీ- సర్వసమత్వం చిత్తానికి కలుగనిదే సుఖం ఎక్కడిదీ- తత్త్వసాక్షాత్కారం కలుగనిదే సుఖంఎక్కడిదీ- మిత్రమా! ఆత్మప్రాప్తి లేనిచో జ్ఞానమనే ఔషధము లేనిచో సంసారమనే విషూచికావ్యాధి మాటిమాటికి పుట్టుచునే ఉంటుంది- బాల్యమనే పేరుతో విజృంభించి నవీనయౌవనమనే చిగురాకు వేసి ముసలితనమనే పూలుపూస్తూ మాటిమాటికి పుటుతూ ఉంటుంది సంసారమనే విషవృక్షం- శరీరమనే జీర్ణవృక్షమునుండి పునర్మరణమనే

పూగు త్తి ముసలితనమునే పూలతో బయలుదేరుతూనే ఉంటుంది దానిమీాద బంధువులనే తుమ్మెదలు ధ్వనిచేస్తూ ఉంటాయి- ఈశరీరం మరణించిన తరువాత దైవాత్తు నరజన్మకాని, స్థావరజన్మకాని, తిర్య గ్జన్మకాని, ప్రాప్తిస్తే అందు దుష్కృతకర్మలు అనుభవిస్తూ శీతోష్ణ వాతవర్షాదులందు ఈగలదోమల బాధలనుభవిస్తూ విరసంగా ఉంటుంది- లేక స్వర్గం దొరకినప్పటికీ అక్కడ పుణ్యం సంపాదించడానికి అవకాశం లేదుకనుకనూ వెనుక చేసిన పుణ్యంఖర్చుఅయినదికనుకనూ, హాస్యామర్షా సూయాకామాదిదోషాలు పూర్తిగాఉండటంచేత శమదమాదిగుణ సంపత్తి అబ్బక, కేవల భోగలంపటులగుటచే గడచినరోజులే మంచి వనుకుంటూ నీరసంగా సంవత్సరాలు వృథాగానేగడచిపోతూఉంటాయి- ఇంక ఒకవేళ అదృష్టవశాత్తు మళ్ళీ మనుష్యజన్మవచ్చినా, అందులో కూడా దుర్లభమయిన బ్రాహ్మణాదిశరీరం ప్రాప్తించినా అక్కడకూడా ఐహికాముష్మికభోగములకు సాధనములయిన లౌకిక వైదిక క్రియలందు మునిగితేలుతూ ఉండటం తప్పదుకనుక ఇందులోనూ ఆత్మవివేకం కలుగుతుందనే ఆశలేదు- కనుక ఏజన్మయెత్తినా కొద్దిగొప్ప అనే కాలభేదమేకాని శుభాశుభకర్మలతోటీ, సుఖదుఃఖలవములతోటీ గడచి పోతూనే ఉంటుందికాలం- ఆయుర్దాయమంతా ఇలాగే సమాప్త మవుతుంది.

ప్రతిజన్మలోనూ, మనస్సు అనే మదపుటేనుగు పరమాత్మ అనే కట్టుకొయ్యనుంచి త్రెంచుకొని తృష్ణలనే ఆడయేనుగులతో విహరించ టానికి పరుగెత్తుచునే ఉంటుంది- శరీరమనే చెట్టులో హృదయమనే గూటిలో (తొర్రలో) విషయాభిలాషఅనే ముసలిగద్ద పరమపురుషార్థా నికి ఉపయోగించే ఆయుర్దాయమనే చింతామణిని వ్యర్థంగా పోగొట్టు కొని వృద్ధిపొందుతోంది- రోజులనేవి నీరసములై, నిస్సుఖములై (సుఖములేనివై) పనికిమాలిన పనులనే శరీరముగలవై ఎండాకులవలె రాలి నశించి పోతూనే ఉంటాయి- వార్థక్యం వచ్చేసరికి పుత్రకళత్రా

దులవల్ల అవమానాలు ఎక్కువవుతాయి- శరీరకాంతి తగ్గుతుంది- ముఖం తెల్లపడుతుంది- శరీరమనే సరస్సు ఎండిపోతుంది- యౌవనమనే నీరు ఇంకిపోతుంది. రాజహంసవలె ఆయుస్సు క్షణంలో ఎగిరిపోతుంది వార్ధక్యంలో కాలమనే గాలికి కదలిన జీవితమనే మునలిచెట్టు (ఎండు చెట్టు) నుండి భోగాలనే పుష్పాలూ, రోజులనే ఆకులూ రాలి క్రింద పడతాయి- భోగములు నివర్తించినా (అనగా భోగ్యవస్తువులు లేక పోయినా) భోగాశచావదు- వాటిని సంపాదించుకునే శక్తి లేనందున కలిగే దుఃఖం తప్పదు- తత్సంయుక్త శోకమోహచింతలు తప్పవు జీవితంలో- తృష్ణఅనేది చాలదూరంగా ప్రసరిస్తూ ఉంటుంది- ఇలా ఉండగా సంసారరూపమయిన వీణయొక్క ఆయుస్సు అనే దారాన్ని యమునడనే ఎలుక వచ్చి ఎప్పుడో కొరికేస్తుంది- యౌవనమనే పెద్ద తరంగాలతో, క్రోధద్వేష భయాదులనే నురుగుతో, లోభతృష్ణాదు లనే సుడిగుండాలతో జీవితమనే నది ప్రవహిస్తూ ఉంటుంది- ప్రవృత్తి లక్షణమయిన నదికూడా ఇలాగే ప్రతిజన్మలోనూ ప్రవహిస్తూనే ఉంటుంది- ఈకాలసముద్రంలో అంతులేని బంధుసమూహమనే నదులు ఎప్పుడూవచ్చి కలుస్తూనే ఉంటాయి- దేహమనే రత్నశలాకము (రత్న కణిక) ఏజన్మలో మునిగిపోతుందో ఎవ్వడికీ తెలియదు- ఏ దేశగిరికి ఏదేజన్మరానున్నది ఎవ్వనికీ తెలియదు- సముద్రపు సుడిగుండా లలో గడ్డిపోచ తిరిగినట్లు ఈసంసారసాగరంలో మనశ్చింతలనే సుడి గుండాలలో చిత్తమెప్పుడూ తిరుగుతూనే ఉంటుంది- లౌకిక వైదిక కార్యములనే అలలో కొట్టుకుపోతూ చిత్తం క్షణంకూడా విశ్రాంతి పొందదు- మతి అనే ఆడపక్షి "ఇదిచేశాను" "ఇదిచెయ్యాలి" "ఇది చేస్తున్నాను" అనే కల్పనలతో చుట్టుకొని ఎప్పుడూ మోహపడుచునే ఉంటుంది. "వీడుమిత్రుడు" "వీడుశత్రువు" అనే ద్వంద్వరూపమయిన మదపుటేనుగు మర్మస్థానములను తెంచుతూనే ఉంటుంది- మనస్సు అనే చేప చింతానదిలో ఎప్పుడూ చంచలంగా తిరుగుతూ వృద్ధిని

పొందుతూ ఉంటుంది. ఆత్మకు (తనకు) సంబంధించని దుఃఖములన్నిటినీ దేహాత్మబుద్ధితో తాను తెచ్చిపెట్టుకొని జీవుడు (మానవుడు) ఎప్పుడు దైన్యం చెందుతూ ఉంటాడు. జరామరణ లక్షణమయిన గాలికి కొట్టుకొంటూ ప్రపంచమనే కొండమీద దొరలుచూ ఉండే యీజీవుడు ఎండాకువలె ఎప్పుడో తెలియకుండా జీర్ణమై రాలిపోతాడు.

౬౭. అంతస్సంగ విచారము.

వసి॥ రామా! భాసవిలాసుగిద్దను ఇలాకుశల ప్రశ్న చేసికొని కాలక్రమేణ ఆత్మజ్ఞానంకలిగి ముక్తిపొందారు. కాబట్టి సంసారపాశ బద్ధమయిన చిత్తము సంసారాన్ని తరించడానికి జ్ఞానంకంటే వేరే ఉపాయంలేదని చెబుతున్నాను నేను. వివేకికి ఈసంసార దుఃఖంఅంతా అతి పేలవం అయిపోతుంది. (అనగా సులభంగా దాటతగింది అవుతుంది.) చిన్నపిట్టకు దుస్తరమయిన సముద్రం గరుత్మంతునకు గొప్ప పరిమాణమవుతుంది. దేహద్వయమందు అభిమానం త్యజించి చిన్మాత్రనిష్ఠులయిన మానవులు శరీరాన్ని దూరంగా చూస్తారు. దేహాభిమానం లేనివాడికి దేహం ఎన్నిదుఃఖాలతో క్షోభపడుతుంటేమాత్రం ఏమి? రథం ఎన్నిముక్కలయితేమాత్రం సారథికేమి బాధ? మనస్సుక్షోభిస్తే చైతన్యానికి వచ్చిన ముప్పేమి? తరంగజలం తారుమారయినంత మాత్రాన సముద్రానికి వచ్చినముప్పేమి? కనుక అహంభావంచస్తే ఎవరికి ఎవరితోటీ సంబంధం ఉండదు. నీళ్ళకూ హంసలకూ ఏమీ సంబంధంలేదు. నీళ్ళకూ రాళ్ళకూ ఏమీసంబంధంలేదు. రాళ్ళకూ కొయ్యలకూ సంబంధంలేదు. అలాగే ప్రాపంచికభోగవిషయాలకూ పరమాత్మకు ఏలాంటిసంబంధమూలేదు. చిత్తాత్త్వము పరమాత్మసంసారబంధము. ఈ రెంటికీ ఏమీసంబంధంలేదు. ఆకాశాన్ని త్రాళ్ళతో కట్టడానికి బ్రహ్మకుకూడా సాధ్యంకాదు. అలాగే చిద్రూప పరమాత్మను బంధించటానికి సంసారానికి ఏంతమాత్రం సాధ్యంకాదు. చెరువులోనీరు పద్మాలను తొడమీద కూర్చుండబెట్టుకున్నట్లు ధరించి

ఉన్నా ఆనీటికీ యీ పద్మాలకూ ఏమీ సంబంధంలేదు- అలాంటిదే శరీరాత్మలకుగల సంబంధం- నీళ్ళకు కొయ్యముద్దతోటి సంఘట్టము వల్ల నీటికణాలు పైకిలేచినట్లు దేహాత్మలయొక్క సంబంధంవల్ల చిత్తవృత్తులు పైకిలేస్తూ ఉంటాయి- కొయ్యకు నీటితో సాన్నిధ్యం ఉన్నంత మాత్రంచేత దారువుయొక్క ప్రతిబింబములు నీటిలో సంక్రమిస్తాయి- అలాగే శరీరములుకూడా ఆత్మయందు కనిపిస్తున్నాయి. అద్దమునందు కాని తరంగాదులందుకాని కనిపించే ప్రతిబింబాలు పరమార్థంగా సత్యములుకావు- అసలే అసత్యములు (అసత్తులు) కావు- మరేమనిన ప్రాతిభాసికసత్యములు- అలాంటివే శరీరాలుకూడా ఆత్మకు కొయ్య, నీరు, రాయి, ఈమూడు పరస్పరం కొట్టుకుంటే (వరసుకుంటే) ఇందులో దేనికీ దుఃఖంలేదు- అలాగే శరీరాద్యాకారంగా పరిణమించిన పంచభూతాలు, చందనాదులతో సంయోగంచెందినా, స్త్రీ పుత్రాదులతో వియోగంచెందినా దుఃఖానికి యేమాత్రం ప్రసక్తిలేదు- అస్త్రతగిలిన కొయ్యతోటి సంబంధంవల్ల నీటికి చలనమూ, ధ్వనీ కలుగుతుంది- అలాగే చిత్ప్రతిబింబితమయిన దేహేంద్రియాదులకు చలనాదులు, ధ్వన్యాదులూ, (శబ్దాదులూ) కలుగుతున్నాయి- కనుక కేవల జడములకు ఈసుఖదుఃఖాదిజ్ఞానాలు లేవు- చిచ్ఛరీరములకూ నిజంగా లేవు- ఇవి కేవలము అజ్ఞానమాత్రము- అజ్ఞానము నశిస్తే మొత్తమంతా చైతన్యమే- నీరూ, కొయ్యా ఈరెండూ కలిస్తే ఇందులో దేనికీ సుఖదుఃఖానుభవంలేదు- అలాగే దేహానికీ, దేహాభిమానికీ సంబంధించినా సుఖదుఃఖానుభవాలు లేవు- అజ్ఞానికి సంసారము సత్యంగా గోచరించినట్లు జ్ఞానికి సత్యంగా గోచరించదు- రాతిలోపల నీరు ప్రవేశించి లేదు కనుక లోపల స్నేహము లేదు- అలాగే లోపల ఆసక్తిలేని వానికి బాహ్యపదార్థభోగాలు ఉండవు- సలిలకాష్ఠముల సంబంధము అంతస్సంగరహితము- శరీరాత్మల సంబంధంకూడా అంతస్సంగ రహితము- అంతటా పరిశుద్ధమయిన చైతన్యము మాత్రమే నిండియున్నది- సుఖదుఃఖాదిసంయుక్త చైతన్యమనేది లేదు- అయినా అజ్ఞానంచేత అలాంటి

చైతన్యంకూడా ఒకటి ఉన్నదనే భ్రాంతికలదు- లోపలిభ్రాంతిచేత సంబంధంలేకపోయినా ఉన్నట్లు భాసిస్తుంది స్వప్నాగనా సురతమువలె- కనుక సలిల కాష్ఠములకు వలె శరీరపరమాత్మలకు కూడ సంబంధమనేది మిథ్యాభూతము- అంతస్సంగం లేదు కనుకనే నీటిలో కట్టెలనెన్ని వేసిననూ నీరు బాధపడుటలేదు- అలాగే ఆత్మకు శరీరంతో సంబంధం లేదు కనుకనే శరీరదుఃఖాలు ఆత్మకంటవు-

శరీరముతోటి తాదాత్మ్యభావనచేతనే శారీరదుఃఖాలకు వశుడవు తున్నాడు ఆత్మ- ఆ అభిమానాన్ని త్యజిస్తే ముక్తుడవుతాడని అంటారు పెద్దలు- ఒకానొక నీటిమడుగులో ఆకులూ, నీరూ, మకిలా, (పాకుడూ, కొయ్యముక్కలూ) కలిసి ఉన్నవనుకోండి- అయినా వాటికి ఒకా దానిమీద మరోదానికి అంతస్సంగం లేదుకనుక నిర్దుఃఖంగా ఉన్నాయి అవి- ఆత్మాదేహేంద్రియాలు కలిసిఉన్నా అంతస్సంగం లేకపోతే దుఃఖంలేదు- రామా! మొక్కకు గింజకారణమయినట్లు అంతస్సంగమే (మనస్సంగమే) జరామరణమోహాలకు కారణము- అసంగసహితుడు సంసారమగ్నుడు- సంగరహితుడుముక్తుడు- ఇదినిజము- అంతస్సంగము గల చిత్తము నూరుకొమ్మలతో పెరుగుతూ ఉంటుంది. సంగరహిత మయిన చిత్తము విలీనమై పోతుంది-

రామా! అంతస్సంగముగల మనస్సు పగిలిన స్ఫటికలింగము వంటిది. (అనగా పూజార్హముకాదు) అసక్తమయిన మనస్సు అభగ్న స్ఫటికము వంటిది- ఇది చక్కగా గుర్తించాలి- అసక్తమయిన చిత్తము సంసారంలో ఉన్నా అది నిర్మలమే- ముక్తమే- సక్తమయిన చిత్తము దీర్ఘతపోయుక్తమయినా బద్ధమే- ముక్తము యెన్నటికీ కాదు- కనుక రామా! అంతస్సంగమే బంధమోక్షములకు కారణము- అంతస్సంగ రహితుడు ఏపనిచేసినా వానికి కర్తృత్వము అంటదు- నీటిలో కట్టెల బరువును మోసేపడవ స్వయముగా తాను దారువయినను (కొయ్య అయిననూ) తనలోపలి దారుగతములయిన ఛేదభేదదాహాదిగుణ దోష

ములతోనూ, జలగతములయిన చలన, పరివర్తన, నైర్మల్య, పంకిలత్వాది, గుణదోషములతోనూ అంటదు. (అనగా నీటిలోపడవ కొంత బరువును మోస్తూఉంటుంది- అది కొయ్యతో చేసినదే- అయినా ఆపడవకు దానిలోపలఉన్న కట్టెలయొక్క గుణదోషాలు అంటవు- నీటిలోఉన్నా నీటియొక్క గుణదోషాలూ అంటవు- ఇందుకు కారణము ఈపడవకు ఆకాష్ఠ జలములమీద అంతస్సంగం లేకపోవడమే- అనగా అంతస్సంగములేని మనస్సుకు శరీరేంద్రియాలు సంబంధించియున్నా వాటి గుణదోషాలు అంటవని తాత్పర్యము-)

రామా! కర్తృత్వములేని ఆత్మకు అంతస్సంగవలననే కర్తృత్వం ఏర్పడుతోంది- స్వప్నంలో వ్యాఘ్రాదిభయంవల్ల పరుగెత్తాలనే వ్యాకులత కలిగినట్లు- జాగ్రదవస్థలో తండ్రి యుద్ధంచేయుడంలేదు- వాడికి దేహచేష్టలేవీలేవు- కాని వానిపుత్రులూ భృత్యులూ యుద్ధం చేస్తూ ఉన్నారు- అదిచూస్తూ ఉన్నాడు తండ్రి- అయినా వీడికికూడా ఆయుద్ధంలో కర్తృత్వం ఉన్నట్లే- సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉండటం చేత- అలాగే మనస్సు కర్తృత్వం కలదై సుఖదుఃఖాలు కలదిగా ఉంటే, ఆ మనస్సును చూస్తూ దానిమీద అభిమానంగా ఉండటంచేత ఆత్మకుకూడా కర్తృత్వం ఉన్నట్లు ఏర్పడుతోంది-

మనస్సు కనుక కర్తృత్వముకలదిగా లేకపోతే లోపలి ఆత్మయొక్క అకర్తృత్వము స్పష్టపడుతుంది- కనుకనే శూన్యచిత్తుడయిన మానవుడు ఏపనిచేసినా దానిని చేసినట్లు గుర్తించలేడు- కనుక మానవుడు మనస్సుతోనే పనిచేస్తున్నాడు. మనస్సుతో చేయునిపనియే లేదు- కేవలశరీరం ఏపనికీ కారణంకాదు- మనస్సునందు కర్తృత్వశక్తి లేకపోతే దేహముకర్త అని కల్పించాలి- మనస్సునందే కర్తృత్వశక్తి ఉన్నందున దేహానికి ఆశక్తి కల్పింపవలసిన పనిలేదు- కనుక అసంసక్తమయిన మనస్సు చేయుచున్ననూ, చేయనిదే- చేసినదాని ఫలమును అనుభవించనిదే- కాబట్టి కర్తృత్వభోక్తృత్వాలకు మనస్సం

గమే ముఖ్యకారణం. అసంసక్తుడయినవాడు బ్రహ్మహత్యాశ్వమేధాదుల ఫలంతో కూడా లిప్తుడుగాడు. దూరదేశంలో ఉన్న కాంతయందు మనస్సు లగ్నమయిన వాడికి తనముందున్నది నిప్పో, నీరో కూడా తెలియదు. (ఇది ఊర్వశియందు ఆసక్తమయిన మనస్సుగల పురూరవసునకు ప్రసిద్ధము) (వెనుక ఇంద్రాహల్యాఖ్యానంలో ఇది విస్తరించి చెప్పబడినది.)

కనుక రామా! అంతస్సంసక్తి లేనివాడు విక్షేపదుఃఖాన్ని అనుభవించడు. నిర్విక్షేపసౌఖ్యాన్ని అనుభవిస్తాడు. అలాంటివాడు చేసినా చేయకున్నా వాడికి కర్తృత్వభోక్తృత్వాలుండవు. కనుక కలిసి మెలిసిఉన్న పదార్థాలన్నిటికీ సకలదుఃఖములనూ తెచ్చిపెట్టేది అంతస్సంగమే అని గట్టిగా నమ్ము. కాబట్టి దానిని పూర్తిగా విడిచి పెట్టాలి.

రామా! అంతస్సంగదోషంలేని చిత్తం ఆకాశంవలె నిర్మలమవుతుంది. శాంతమవుతుంది. అద్వితీయత్వాన్ని పొందుతుంది. అని అన్నారు శ్రీవసిష్ఠులు.

### ౭౮. సంగవిచారయోగోపదేశము.

శ్రీరా॥ మహర్షీ! సంగమంటే ఎలాంటిది. అది ఎలా బంధాన్ని ఇస్తుంది. దాన్ని ఎలాత్యాగం చేస్తే మోక్షం ఇస్తుంది. దానికి ఉపాయం ఏమిటి? అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! శరీరము జడం. క్షేత్రజ్ఞుడు (జీవుడు) చేతనుడు. వీళ్ళయిద్దరకు స్వభావభేదం చాలాఉంది. అయినా దాన్ని ఆలోచించకుండా శరీరధర్మాలను ఆత్మయందూ, ఆత్మధర్మాలను శరీరమందు ఆరోపించి అధ్యాసచేత దేహమే ఆత్మఅనే విశ్వాసమే సంగము. అదే బంధానికి కారణం. మరిన్ని త్రివిధపరిచ్ఛేదరహితుడయిన ఆత్మను పరిచ్ఛేదము కలవానినిగా నిశ్చయించుకొని తనయొక్క అపరిచ్ఛిన్న

సుఖస్వరూపాన్ని మరచి శబ్దస్పర్శాది విషయాలనుండి సుఖమును కోరు టయే సంగము-

సర్వమూ ఆత్మస్వరూపమే- "కనుక నేను దేనినికోరేది దేనిని విడిచేది" అనేభావంతో జీవన్ముక్తుడుగా ఉండటమే అసంగస్థితి-

నేను అహంకార పరిచ్ఛిన్నుడనుగాను- నాకంటే వేరువస్తువు మరొకటిలేదు- "కనుక మిథ్యాభూతములయిన దేహాదులందు విషయ సుఖములు ఉండనీ, పోనీ, నేనుమాత్రం దేహాదులతో సంబంధంలేని వాడను- అనేభావం అసంగము-

కర్మరాహిత్యాన్ని (నైష్కర్మ్యాన్ని) కోరక, కర్మలయందు ప్రవర్తించక, ఫలసిద్ధ్యసిద్ధులందు సమానముగ నుండువాడు అసంసక్తుడు-

ఆత్మతత్త్వైకనిష్ఠుడై మనస్సు హర్షవిషాదములకు లోను (వశము) కాని వాడు అసంసక్తుడనీ జీవన్ముక్తుడనీ చెప్పబడతాడు-

సర్వకర్మఫలములనూ కర్మలతో విడువక మనస్సుతో విడుచు వాడు అసంసక్తుడు- సంగరహితంగా చేసినపనులన్నీ చక్కని శ్రేయస్సు సంపాదిస్తాయి- సంసారవ్యాధిని పెంచవు- సంసక్తి ఉన్నదా? వచ్చిపడే దుఃఖరాసులకు మితిఉండదు- ఇంక సంసక్తికి ఫలాలు చెబుతావిను-

గ్రామ్యపశువుల ముక్కురాలకు త్రాడుపోసి లాగుకొని పోతుం డగా బరువుమోస్తూ బాజారువెంట భయంతో పరుగెత్తటం సంసక్తి ఫలం. మనస్సంగానికి ఫలం-

చెట్లు స్థావరశరీరంతో శీత, వాతా, తపక్లేశాలను అనుభవిస్తూ జీవించడం (బ్రతకడం) సంసక్తికి ఫలం- పురుగులు నేలతొర్రలలో (చిన్న చిన్న భూరంధ్రములలో) శరీరబాధ అనుభవిస్తూ కాలంగడపటం సంసక్తికిఫలం- పక్షి ఆకలికి బాధపడుతూ, ఎప్పుడు పిట్టలగొట్టువాడు వచ్చునో అని తనఆయుర్దాయానికి భయపడుతూ చెట్టుమీద నివసించి

ఉండటం సంసక్తికిఫలం- లేడి దూర్వాంకురములనూ (గరికపోచలనూ) గడ్డినీ ఆహారంగా తీసికొంటూ కిరాతుల బాణప్రహారాలకు దేహత్యాగం చేయడం సంసక్తికి ఫలం- చచ్చిన మానవులు క్రిమికీటకాది యోనులందు పుట్టడం సంసక్తికిఫలం- సముద్రంలోని తరంగాలవలె భూతములు మాటిమాటికీ పుడుతూచస్తూ ఉండటం సంసక్తికి ఫలం- నరులు మాటిమాటికి చచ్చి తృణగుల్మాదులుగా పుట్టి కదలకుండా ఉండటం సంసక్తికిఫలం- భూమిమీదపడ్డ నీటిని వ్రేళ్ళతో పీల్చుకొని తృణగుల్మలతాదులు ఉద్భవించడం సంసక్తికిఫలం- ఎల్లపుడూ అనర్థ పరంపరలతో సంసారనది వృద్ధిపొందటం సంసక్తికిఫలం-

ఈ సంసక్తి రెండురకాలు- ఒకటి వంద్య సంసక్తి- రెండవది వంధ్యసంసక్తి అని- ఇందులో రెండవదగు వంధ్యాసంసక్తి మూఢులకు మొదటి వంద్యసంసక్తి తత్త్వవేత్తలకు- ఆత్మతత్త్వజ్ఞానం లేక దేహాదులు నిత్యమని తలంచి సంసారమందుండెడి ఆసక్తి వంధ్యాసంసక్తి- ఆత్మతత్త్వజ్ఞానంకలిగి నిత్యానిత్య వివేకంచేత అసత్యమయిన సంసారాన్ని విడిచిన సంసక్తి వంద్యసంసక్తి- శంఖచక్రగదాధారియగు శ్రీ మహావిష్ణువు వంద్యసంసక్తిచేతనే ముల్లోకములను పాలిస్తున్నాడు- నిరాలంబమయిన ఆకాశమార్గంలో సూర్యుడు బాటసారిగా ప్రతిరోజూ తిరగటం వంద్యసంసక్తిచేతనే- హిరణ్యగర్భుడు ద్విపరార్థకాలపర్యంతం (తనకు ముక్తిలభించునంతవరకు) బ్రాహ్మశరీరముతో ప్రపంచం సృష్టించటం వంద్యసంసక్తివలననే- శంకరుడు అర్ధనారీశ్వరాకారంతో భూతిభూషితమయిన శరీరాన్ని ధరించి ఉండటం వంద్యసంసక్తివల్లనే-బ్రహ్మతత్త్వజ్ఞానంలో దృఢమయిన ప్రతిష్ఠగల సిద్ధులూ, లోకపాలురూ, ఇతర ఋషిపుంగవులూ, వంద్యసంసక్తివల్లనే ప్రపంచంలో ఉన్నారు- మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకంలో ఉండే తత్త్వవేత్తలు కూడా వంద్యసంసక్తివలననే జరామరణములు లేకుండా శరీరమనే యంత్రాన్ని ధరించి యున్నారు-

ఇంక వంధ్యాసంసక్తిని నిరూపిస్తానువినూ- గద్ద మాంసపు ముక్కలకు అపేక్షపడినట్లు మనస్సు ప్రపంచభోగాలకు వృథాగా ఆశ పడుతోంది- ఇది వంధ్యసంసక్తి-

వాయువు భువనకోటరంలో సంసక్తివల్లనే వీచుచున్నాడు-పంచ భూతములు తమతమ పనులలో సంసక్తివల్లనే ఉంటున్నవి- ద్యులోకంలో దేవతలు, భూలోకంలో నరులు, పాతాళంలో పాములూ, అసురులూ, బ్రహ్మాండమనే మేడిపండులో దోమలవలె ఉన్నారు- ఇదీ సంసక్తి వల్లనే- భూతకోటి మాటిమాటికీ పుట్టుతూ చస్తూ ఉండటం అంతా సంసక్తివల్లనే- రామా! ఈ జనసమూహం నిర్ఝరాంబుకణములవలె విలయం చెందటం సంసక్తివల్ల జనసమూహం ఎండాకులవలె రాలి పోవటం సంసక్తివల్ల- ఆకాశంలో నక్షత్రరాశి చెట్టుమీద దోమల గుంపువలె ఉంది- క్రిందికూ మీదకూ ఎగిరిపడుతూఉండే కాలమనే పిల్లవాని చేతిలోని బంతివలె చంద్రుడు ఇప్పటికి తనరూపాన్ని విడచుట లేదు- ఇది అంతా సంసక్తివల్లనే- ఇంద్రాది దేవతాబృందంకూడా అంతులేని దుఃఖపరంపరలను తెచ్చిపెట్టే దుఃఖండకాన్ని (ప్రణవిక్షేప మును) వాళ్లు దుఃఖమనుభవిస్తూ కూడా ఛేదింపలేకపోవడం సంసక్తి వల్లనే-

రామచంద్రా! పరాకాశంలో (చిదాకాశంలో) వాసనామాత్రం చేత ఎవరిచేతనో ఈ ప్రపంచ విచిత్రం తయారు చేయబడింది- రామా! మనస్సంగిమనే రంగులో శూన్యమయిన ఆకాశమునందు ప్రపంచమనే బొమ్మ తయారుచేయబడింది- ఇది యెన్నటికీ సత్యంకాదు- ఈసంసా రంలో సంసక్త మనస్కులయొక్క శరీరాలను తృష్ణఅనేది కొరికేస్తుంది- అగ్నిజ్వాల గడ్డిపోచను మ్రింగినట్లు- సముద్రపుఒడ్డున ఉన్న ఇసుక రేణువుల నయినా లెక్కించవచ్చుగాని సంసక్తమనస్కునకు సంప్రాప్త మయ్యే శరీరాలనుమాత్రం లెక్కించటానికి యెవనికీ సాధ్యంకాదు- గంగానదీతరంగాలను లెక్కించవచ్చునుగాని సంసక్తమనస్కుని శరీరా

లను లెక్కించలేము. సంసక్తమనస్కులయొక్క రమ్యమయిన ఆగః పురపంక్తులు రౌరవనరకాలు. లోకంలోని ప్రతివస్తువూ సంసక్తమనస్కులకు దుఃఖరూపమే. నదులన్నీ సముద్రంలోకి వచ్చినట్లు, దుఃఖపరంపరలన్నీ సంసక్తచిత్తుని వద్దకే చేరును. అవిద్యకు మనస్సంసర్గమే రూపము (ఆకారము) అది శరీరపరంపరలనే భారాన్ని మోస్తుంది. ఎప్పుడూ జన్మమరణాలనే దశలను కోరుతూఉంటుంది. ఇలాంటి అవిద్యాప్రపంచం అంతా వ్యాపించిఉంది.

రామా! అసంసక్తిచేత భోగవిభూతులు శాఖోపశాఖలతో విస్తరిస్తాయి. వర్షకాలంలో నదులు విస్తరించినట్లు. రామా! అంతస్సంగమనేది శరీరాలకు నిప్పుకణిక. అంతస్సంగరాహిత్యం శరీరములకు రసాయనము. లోపలనున్న అంతస్సంగంచేత జీవుడు తగలడిపోతాడు. కాబట్టి దేనియందూ ఆసక్తి లేని మనస్సే అఖండసుఖము కొరకు సమర్థమవుతుంది. రామా! తత్త్వజ్ఞానంలో మనస్సుకు సంసక్తిని వృద్ధిచేసికోవాలి. అవిద్యాత్మకమయిన ప్రపంచ విషయంలో మనస్సుకు సంసక్తిని తగ్గించుకోవాలి. ఇలాంటివాడే ముక్తుడు.

## ౭౯. శాంతిసమాయంత యోగోపదేశము.

వసి॥ రామా! వివేకి అయినవాడు ఎప్పుడూ తత్తత్కాలోచిత సర్వవ్యవహారాలలో ఉన్నా, పుత్రమిత్ర భృత్యదారాదులతో వ్యవహరిస్తున్నా, నిషిద్ధములు కాని లౌకిక, శాస్త్రీయకర్మలు ఆచరిస్తున్నా, మనస్సును నేను చెప్పబోవు విధంగా తయారుచేసుకోవాలి. చేయతగిన పనులందు కాని, గడచినవాటిని గురించిన మనశ్చింతలందు కాని వర్తమాన వస్తువులందు కాని, ఊర్ధ్వాధోమధ్యభాగములందు కాని, దిక్కులందు కాని, కళత్రభృత్యాదులందూ, ఇంద్రియవృత్తులందూ, ఆధ్యాత్మికప్రాణమునందూ, శిరోతాలు, భ్రూమధ్య, నాసా, ముఖ, తారకాదులందూ, అంధకారమందూ, వెలుతురునందూ, హృదయాకాశ

మందూ, జాగ్రత్స్వప్నసుషుప్తులందూ, శుద్ధసత్వగుణమందూ, తమో గుణమందూ, రజోగుణమందూ, గుణసమాహారమందూ, కార్యకారణ ములందూ, ఆదిమధ్యములందూ, సర్గస్థిత్యాదికాలములందూ, దూర, సమీపాది దిక్పరిచ్ఛేదములందూ, నామరూపాత్మక పదార్థజాతిమందూ జీవునియందూ శబ్దస్పర్శరూపరసగంధములందూ, విషయాభిలాష పార వశ్యమందూ, విషయభోగఫలములందూ, ఖేచరసిద్ధుల గమనాగమనము లందూ, అతీతానాగతములను దెలిసికొనుటయందూ, చిరజీవనాదు లందూ, మనస్సు సక్తముగాకూడదు- సాక్షిచైతన్యమునందు విశ్రమిం చాలి- భూమానందమునకు (ఆత్మానందమునకు) అభిముఖంకావాలి- సర్వత్ర నీరసంగా ఉండాలి- విగతాసంగుడయిన జీవుడు బ్రహ్మత్వమును పొందుతాడు- అలాంటివాడు వ్యవహారప్రపంచంలో ఉండనీ, లేకపోనీ- ఆత్మరతి యగు జీవుడు కర్మలుచేసినా, చెయకున్నా కర్మఫలములతో సంబంధించడు- (అంటడు) లేకుంటే జీవుడు బుద్ధి సాక్షిత్వాంశమును కూడ వదలి శాంతచిద్ఘనుడై ఉండుగాక-

రామభద్రా ! ఫలేచ్ఛాగహితుడయిన జీవుడు గతసంగుడు కనుక వీనికి సంగనిమిత్తమయిన, అవిద్యా, కామ, కర్మవాసనలుండవు. కావున కర్మఫలముతో అంటడు- ప్రారబ్ధక్షయపర్యంతం దేహభారాన్ని మాత్రం సహిస్తాడు- (సహించువాడివలె ఉంటాడు.)

## ౭౦. అసంసంగవికల్పోపదేశము.

వసి॥ రామా ! అసంసంగాభ్యాసంలో విశ్రాంతిచెందిన జీవులు వ్యవహారం చేస్తున్ననూ, శోకభయాలుండవు వాళ్ళకు- మనోవిక్షో భానికి తగిన నిమిత్తములున్ననూ, (అనగా పుత్ర మిత్ర ధననాశాదు లున్ననూ) పరమార్థసుఖంతో అంతఃపూర్ణుడయిన వానిముఖాన ఒక విధమయిన కాంతి కనిపిస్తూ ఉంటుంది- విషయములను విడిచి, విషయి యగు ఆత్మను అవలంబించినవాని మనస్సు ఇండుపగింజచే నీరువలె

అతినిర్మలమవుతుంది- నిత్యమూ ఆత్మదృష్టితో లీనమయిన జ్ఞాని స్వస్థుడయినా, చంచలుడయినా, (వ్యవహారపరుడయినా) మనఃక్షోభము గలవానివలె కనపడతాడు ఇతరులకు- ప్రతిబింబసూర్యుడు కదలుచున్నట్లు కనుపించినవిధంగా- ఆత్మారాములయిన మహానుభావులు బయటికి నెమలిపింఛముయొక్క- అగ్రభాగమువలె చలింపుచున్నట్లు కనిపిస్తారు- లోపలమాత్రం మేరుపర్వతంవలె స్థిరంగా ఉంటారు. ఆత్మాకారమయిన చిత్తము నైపుణిక సుఖదుఃఖాలతో రంజితంకాదు- (అంటకా) శుద్ధస్ఫటికము- ఎఱ్ఱని జపాకుసుమాదులతో అంటదు- నిరతిశయానందాభ్యుదయాన్ని పొంది జీవేశ్వరులయొక్క- తత్వాన్ని గుర్తించిన సచ్చిత్తమును (నిర్మల మనస్సును) సంసారదృష్టి రంజింపచేయలేదు- జలలేఖ (నీటిచారి) పద్మమును అంటలేదు. లోకంలో గట్టిగా అసక్తుడని (ఆసక్తిలేనివాడని) ఎలాంటివానిని అనాలి. అంటే "పరమాత్మజ్ఞానం పొంది వాసనారహితుడగుచూ నిర్వికల్పసమాధియందువలె సుఖమగ్నుడుగా ఉంటాడో వాణ్ణే అసక్తుడని అనాలి- ఆత్మారాముడయిన జీవుడు ప్రపంచమునందు అసంగుడవుతాడు- ఆత్మజ్ఞానంచేతనే సంసక్తి క్షీణిస్తుంది- వేరుఉపాయంచేత క్షీణించదు- రామా! నేను చెప్పిన యీ అసంసక్తదృష్టిని పొందినజీవుడు ప్రియాప్రియరహితుడై జాగ్రదవస్థలోకూడా సుషుప్తియందున్నవాడగును. వీనికింక ఉదయాస్తమయములుండవు- (జన్మమరణములుండవు) అసంసక్త్యభ్యాసక్రమమందు నిరూఢమయినవాడు సూర్యుడగును-(సూర్యమండల ద్వారా బ్రహ్మలోకము జేరును ) కాలక్రమవశంచేత చంద్రుడు అమావాస్యనాటి సూర్యుడయినట్లు- చిత్తము చిత్తముయొక్క- అవస్థను విడిచినచో ఆదశ జాగ్రదయందలి సుషుప్తమనిపించుకొనును- ఇలాంటి సుషుప్తిని బొందినవాడు జీవించియుండి వ్యవహారమగ్నుడైనా సుఖదుఃఖాది వికారములనొందడు. అహంకారము లేనివాని శరీరము యంత్రపు బొమ్మవంటిది- అహంభావమనే శక్తియే చిత్తాన్ని బాధించేది- ఆత్మతత్వమును చెందితే ఇంక ఆచిత్తమును బాధించేది ఏది?

సుషుప్త బుద్ధి(నిద్రించిన బుద్ధిగలవాడు) (అనగా అహంకార రహితుడు) అభిమానమును త్యజించి కర్మలు చేసినా బద్ధుడుగాడు. కనుక రామా! సౌషుప్తవృత్తిని ఆశ్రయించి నీవు కర్మను ఆచరించు ఆచరించకపో- కర్మ అనేది వర్ణాశ్రమ స్వభావమువల్ల ఏర్పడేది- అహంభావము లేని వానికి వర్ణాశమవిభాగభేదము ఉండదు- గ్రహించకూడదు- విడిచి పెట్టకూడదు" అనే భావాలు అజ్ఞునకు రుచిస్తాయి- జ్ఞానికి రుచించవు. వీడు యథాప్రాప్తానుసారిగానే ఉంటాడు- సుషుప్త బుద్ధికి క్రియాక్రియలు వికారమును గలిగించవు- పుట్టిన పసిపిల్లవాడు దేనిని సంకల్పించకుండా ఊయెలలో పరుండియున్నట్లు రామచంద్రా! ఏ ఫలమును కోరకుండా నీవుకూడా కర్మలు చేయుము- విషయచింతన వదిలి కేవల చైతన్యము నందు స్వస్థత చెందినవాడు ఏపని చేసినా వాడికి దానియందు కర్తృత్వము అంటదు- జ్ఞాని సౌషుప్తదశను పొంది యెల్లప్పుడు ఆనందరసపూర్ణుడుగా ఉంటాడు. సుషుప్తస్థుడు సర్వావస్థలందును సమానభావంతో ఉంటాడు- బయటికి లోలునివలె అగపడతాడు- పనులందు చలించడు. (అనగా లోపల చాంచల్యము నొందడు) రామా! నీవుకూడ సుషుప్తావస్థుడవై శరీరమును చాలించు. లేక చాలకాలంధరించు- సౌషుప్త స్థితియే అభ్యాసయోగంచేత ప్రౌఢిని జెంది తుర్యమవుతుందని చెప్పారు తత్త్వగోవిదులు- ఏవిధమయిన దుఃఖములులేకపోతే నిరతిశయ సుఖ సమృద్ధి సుషుప్తి దశలో ఉన్నది కనుక (ఆనందమయకోశదశలో ఉన్నది కనుక) సౌషుప్తదశయె తుర్యమని చెప్పబడింది. సుషుప్తియందున్న వాడు పరమానందభరితుడై యుండి ఈ ప్రపంచరచనయావత్తూ లీలా మాత్రమని తెలుస్తాడు- భయశోకములనువదలి సంసారభ్రాంతి తొలగి తురీయావస్థను పొందినవాడు తిరిగి సంసారంలో ప్రవేశించడు- పరమ పవిత్రమయిన స్వస్వరూపస్థితిని పొందినవాడు భ్రాంతిసిద్ధమయిన ఈ ప్రపంచాన్ని కొండమీదివాడు దిగువనున్నవానినివలె పరిహసించేస్తూ చూస్తాడు. ఇలా అసంసక్తుడు యావజ్జీవమూ తురీయపదవిలోనుండి

(జీవన్ముక్తుడుగానుండి) అవసానమందు విదేహముక్తిని బొందును- ఇట్టివాడే తుర్యాతీతుడనీ, విదేహముక్తుడనీ అంటారు-

## ౭౧. సంసారోపదేశము.

రామా! తురీయావస్థవరకే జీవన్ముక్తునకు అనుభవగోచరమగును. వేదవాక్యలకు విషయమవును. తురీయాతీతస్థితి విదేహముక్తులది. ఈయది వేదవాక్యలకు గోచరముకాదు- సుషుప్తావస్థలో కొంతకాలం ప్రపంచస్థితిని అనుభవించి పిదప పరమానంద ఘూర్ణితుడై తుర్యస్థితిని పొందుతాడు- రామచంద్రా! నీవుకూడా తురీయాతీత దశను పొందునంతవరకు ప్రయత్నింపుము- ఆవల ద్వంద్వరహితస్థితిని పొందుము- రామా! సుషుప్తావస్థతో (అసంసక్తితో) నీవు వ్యవహరించుచున్ననూ పటములోని చంద్రునకువలె క్షయోదయములుండవు- శరీరసన్నివేశము స్థిరంగా ఉంటె సంవిత్తు (జ్ఞానం) స్థిరంగా ఉంటుందనీ శరీరంనశిస్తే సంవిత్తు (జ్ఞానము) నశిస్తుందనీ అనుకోనకు- అది భ్రమ- శరీరమనేది భ్రమ- చిన్మాపుడయిన నీకు దేహనాశంతో ప్రయోజనమేమి? దేహస్థితితో ప్రయోజనమేమి? నీవు ఆత్మబోధ స్థిరపడుటకు తగినప్రయత్నం చేసికొంటూఉండు- నీవు పరమార్థ సత్యమయిన వస్తువును తెలిసికొన్నావు- మోక్షపదమును గుర్తించావు- స్వస్వరూపమును పొందావు- ఇంక నీకు శోకమేల? ప్రియాప్రియములను వీడినమనస్సు శరత్కాలంలోని ఆకాశమువలె నిర్మలంగా ఉంటుంది- రామా! ఆత్మస్వరూపాన్ని పొందిన నీమనస్సు ఇంక క్రిందికిరాదు. యోగమంత్రతపస్సిద్ధుడయిన పురుషుడు ఆకాశమునుండి భూలోకమునకురాడు- పరిశుద్ధమయిన చైతన్య మొక్కటే ప్రపంచం అంతా వ్యాపించి ఉంది- ఆత్మఅనే శబ్దము వ్యవహారముకొరకు కల్పింపబడింది- నామరూపాది భేదమనేది దూరాపాస్తము- సముద్రంఅంతా జలమయమే- తరంగాదికమనేది నీటికంటే వేరుగలేదు- అలాగే ఆత్మకంటె వేరుగ భూతోయా

దికమనేది (పంచ భూతాత్మక ప్రపంచమనేది) లేదు. సముద్రంలో పూర్ణ జలమునకంటె వేరువస్తువు కనిపించదు- అలాగే విస్తృతమయిన ప్రపంచంలో ఆత్మకంటె మరొకవస్తువు కనిపించదు. కనుక రామా! "నీవు, వారు, నేను" అనే వ్యవస్థ (నిర్ణయం) ఎక్కడ చేస్తావు? దేహాది అవయవాలలో ఏది నీవో, ఏది నీదో, అదియేది? దేనియందు నీవుంటివో, ఏదినీది కాదో? అదియేది- అధ్యాసదృష్టిలో ఏవీ నీరూపములుకాని నీతో సంస్పృష్టములుకానికావు- అధిష్ఠానదృష్టిలో అన్ని నీరూపములే- అన్ని నీతో సంబంధించినవే- పరమార్థంలో ద్వితీయ వస్తువే లేనందున దానివల్లకలిగే దేహతత్సంబంధాదులు దూరాపాస్తములు-

రామా! అభ్యుపేత్యవాదంతో మాట్లాడుతున్నాను- ద్వితీయ వస్తువు ఉన్నదనుకున్నా, అదిసత్యమనుకున్నా, చిద్రూపుడవయిన నీకు జడరూపములయిన వాటితోటి సంబంధము కుదురదు- ఎండనీడలకు వెలుతురు చీకటులకు సంబంధము అసంభవము- అలాగే దేహి దేహములకుకూడ సంబంధము అసంభవము- రామా! శీతోష్ణాలకు సంబంధము లేనట్లు దేహాత్మలకు సంబంధంలేదు- సంబంధమనేది అవినాభావముగల పదార్థములకు ఉంటుంది- అట్టిది జడచేతనములయిన దేహాత్మల కెట్లు కుదురును- చిన్మాత్రుడయిన ఆత్మకు దేహముతో సంబంధమనేకథ కుదరనిమాట- నిష్పానందు సముద్రము అను మాట వంటిది- దేహాత్మలకు సంబంధము ఆశ్రయాశ్రయిభావరూపమా? విషయ విషయి భావరూపమా? ఈరెండూ కుదరవు- చైతన్యమునకు దేహము ఆశ్రయమంటే చిద్విషయము కాదుకనుక దేహమునకు స్ఫురణము (ప్రకాశ) లేకపోవలసి వస్తుంది- ఇంక విషయ విషయిభావరూపమంటే ఆశ్రయము కాదు కనుక సమవాయాది సంబంధాదులు కుదరవు- కాక విషయతాసంబంధము మిథ్యాపదార్థములందుగూడ నుండును- గావున నీ దేహేంద్రియాలకు సత్యత్వము సంభవించదు-

కనుక చిన్మాత్రుడయిన ఆత్మకు దేహముతో సంబంధమున్నదనుమాట దురవబోధమగుమాట-

ఇంక దేహాత్మలకు సంబంధము ఆధ్యాసికమన్నచో ఆధ్యాసిక సంబంధం అధిష్ఠానాత్మకం కనుక అధిష్ఠాన సాక్షాత్కారం చేత అది నశిస్తుంది- మరియు చిదాత్మ నిర్మలుడు, నిత్యుడు, స్వయం ప్రకాశుడు- నిరామయుడు- దేహము అసత్యము, మలినము, జడము, సామయము. కనుక నీ రెంటికి సంబంధమెట్లు? శరీరము ప్రాణవాయువుచే కదలుతుంది. అన్నాద్యాహారములచే వృద్ధిచెందుతుంది- కనుక శరీరస్పందంలో (శరీరచలనంలో) ప్రాణమయినా కారణము బలమయినా కారణము- ఆత్మమాత్రము కారణముకాదు- కాబట్టి ఇలాంటి దేహానికి ఆత్మతో సంబంధం లేదు- కనుక ద్వితీయవస్తువు నిజంగా ఉన్నా దానికి ఆత్మతో సంబంధం కుదరకపోతే ద్వితీయవస్తువనేదే నిజంలో లేదనే పక్షంలో సంబంధంలేదని చెప్పటం యెందుకు? మరియు ద్వితీయవస్తువు ఉన్నదని అంగీకరించి దానితోటి ఆత్మకు సంబంధంలేదని నిరూపించడానికి యేవి యుక్తులో అవే యుక్తులు ద్వితీయవస్తువు లేదని చెప్పటానికి కూడా- కనుక ద్వైతభ్రమను విడిచి అద్వైతచిన్మాత్రమునందు స్థితిని సంపాదించుకో- ఈస్థితిలో బంధమోక్షాదిశంకయే లేదు- సర్వము ఆత్మమయము- శాంతము- అనేదే నిజము. నేను సుఖిని, దుఃఖిని, ఇత్యాది దృష్టులు చాలచెడ్డవి- కాబట్టి బాహ్యాభ్యంతర ప్రపంచం అంతా ఆత్మయే యని దృఢపరచుకో- సుఖదుఃఖాదులందు వస్తుత్వబుద్ధి (సత్యతాబుద్ధియే) ఉండేయెడల ఇంక నీకు దుఃఖానికి అవధియుండదు- కొండకు గడ్డిపోచకూ ఎంతటి సామ్యమో పట్టువస్త్రానికి రాతికీ ఎంతటి సామ్యమో! పరమాత్మ శరీరములకుకూడా అంతటి సామ్యమే ఉన్నది-

రామా! తేజస్తిమిరములకు సామ్యమూ, సంబంధమూ ఎట్లు లేవో అట్లే ఆత్మ శరీరములకుకూడా ఆ రెండూ లేదు- శీతోష్ణములకు

అభేదము కథలలోకూడా లేదు- జడప్రకాశములయిన శరీరాత్మలకు కూడ సంబంధము లేదు. శరీరము ప్రాణవాయువుయొక్క సంబంధం చేత కదలుతోంది- పోతోంది- వస్తోంది- దేహనాడులలో చేరిన వాయువుచే ధ్వని (శబ్దం) చేస్తోంది- కంఠతాల్వాదిస్థానములందు జిహ్వాదులచే కొట్టుకొని (తాకి) బయలువెడలిన ప్రాణవాయువులచే కవర్గ చవర్గ టవర్గాది శబ్దములు బయలుదేరుట ప్రత్యక్షసిద్ధము- వెదురు బొంగులోకి గాలిపోతే ధ్వని కలుగుతుంది అంతే యిక్కడకూడ- విషయప్రదేశమునందు చక్షుస్పందమునకు నిమిత్తము కానీనికా పరిస్పందము. (గ్రుడ్డు తిరుగుట) అదికూడ ప్రాణవాయువువలననే కాని, ఆత్మవలనగాదు. ఇంద్రియస్ఫురణమువల్ల కలిగెడి విషయస్ఫూర్తిమాత్రమే ఆత్మకు సంబంధించినది- తదితరమునకు ఆత్మతో ఏలాటి సంబంధమూ లేదు- ఇలాంటి ఆత్మసంవిత్తు (ఆత్మ చైతన్యము) ఆకాశోపల కుడ్యాదులందంతటా ఉంది- అయినా చిత్తమునందే అభివ్యక్తమవుతుంది కాని ఆకాశాదులందు అభివ్యక్తంకాదు- అద్దమునందే ప్రతిబింబము అభివ్యక్తమయినట్లు- చిత్తమనే పక్షి శరీరమనే గూటిని వదిలి తన వాసనావశంచేత ఎక్కడకేగునో అక్కడల్లా ఆత్మ అనుభవింపబడుతూ ఉంటాడు. పుష్పం ఉన్నచోట పరిమళం (సువాసన) ఉంటుంది- చిత్తం ఉన్నచోట ఆత్మసంవిత్తు ఉంటుంది- భూతలంలో పల్లపు ప్రదేశము నీటికి నిలయము. అలాగే ఆత్మసంవిత్తుకు అంతఃకరణమే ఆస్పదము. (స్థానము) కనుక అంతఃకరణమే భూతసృష్టికి కారణము- ఆత్మ సర్వాతీతుడుకనుక కారణముగ కనిపించుచున్నా కారణముకాదు- ప్రపంచ సృష్టిలో సారమయిన అంతఃకరణమునకు కారణము, అవిచారణ, అజ్ఞానము, మౌర్ఖ్యము- అంటారు పెద్దలు- ఈ అజ్ఞానము "అహం అజ్ఞః" అనే అనుభవంచేత అందరకు ప్రత్యక్షమగుచునే ఉన్నది- కనుక రామా! ఆత్మతత్త్వాజ్ఞానంచేతనే చిత్తనాశము కలుగును- ఈ కారణం చేత జీవుడు అంతఃకరణము చిత్తము మనస్సు అనే పేరులుగల అజ్ఞానమే సంసారకారణమని విచారించుకోనవలెను-

శ్రీరా॥ స్వామీ! చిత్తానికి (మనస్సుకు) ఈనాలుగు పేరులు ఏవ్యుత్పత్తిచే వచ్చినవో సెలవివ్వండినాకు- అది తెలిసిననేకాని నేను విచారణచేసికొనుటకు వీలులేదు- అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా ! అన్ని పదార్థములూ ఆత్మతత్త్వరూపములే. ఇవి అన్నీ సమష్టి చిత్తమునుంచియే పుట్టాయి- సముద్రంలోని నీరు కొంతభాగం స్పందరూపంగా ఉంటుంది- కొంతభాగం నిశ్చలరూపంగా ఉంటుంది- తరంగములందు స్పందరూపంగా ఉంటుంది- తరంగరూపమును చెందని భాగంలోని జలం నిస్పందంగా ఉంటుంది- అలాగే ఆత్మతత్త్వంకూడా ఒకానొకచోట స్పందరూపంగా ఉంటుంది- ఒకానొకచోట నిస్పందంగా ఉంటుంది- స్పందరూపంగా ఉన్నతావున జంగమ పదార్థాలూ నిస్పందరూపంగా ఉన్నతావున స్థావరపదార్థాలూ తయారవుతాయి- స్పందముగల ఆత్మతత్త్వమే పురుషులు మొదలయినవారు, అస్పందమయిన ఆత్మతత్త్వమే శిలాదిస్థావరములు. ఈజంగమ స్థావర పదార్థములయొక్క శరీరములందు ఆత్మశక్తి అయిన అజ్ఞానము కల్పితమయి యున్నది- కనుక తాను కల్పించిన అజ్ఞానమే స్వయముగా తానయి ఉన్నాడు ఆత్మ ప్రలయమునందూ సుషుప్తియందునూ ఆ అజ్ఞానమే ఆత్మప్రతిబింబముతో భూషితమై (అలంకృతమై) ప్రకాశిస్తూ జీవుడనబడుచున్నాడు రూఢ్యంశచే- ఆజీవుడే సంసారమందు మహామోహమాయాపంజరమందలి కుంజరము- ఈ జీవశబ్దమునందు యోగాంశము (వ్యుత్పత్త్యంశము) కూడ కలదు- "జీవ ప్రాణధారణే" అను ధాతువును బట్టి ప్రాణవాయువును ధరించియుండుటచే జీవుడనబడు చున్నాడు-అదే అజ్ఞానము "అహంభావముచే" "నేను" అను భావముచే అహంకారమనబడుతుంది- అదే అజ్ఞానము నిశ్చయాత్మక వృత్తిచే బుద్ధి యనబడుతోంది- ఇలాగే కారణత్వాంశ ప్రాధాన్యముచే ప్రకృతి అని, "దిహ ఉపచయే" వృద్ధిని చెందుచుండుటచే దేహమనీ, అజ్ఞానాంశ ప్రాధాన్యమునుబట్టి జడమనీ, చిత్ప్రాధాన్య

మును బట్టి చేసినదనీ, అనబడుతోంది- కనుక జడమయిన అజ్ఞానమూ అజడమయిన తత్సాక్షి (సాక్షి) ఈ రెంటియొక్క మధ్యనున్న (అంతరాలికమయిన) సాభాసమనస్సే- నానాత్వమును చెంది జీవ,బుద్ధి, మన,శ్చిత్త, అహంకారాది నానా నామములతో విస్తరించియుంది- కనుక పరమాత్మయే ఉపాధిలో ప్రవేశించి ఔపాధికములయిన పేరులను అనేకింటిని పొందుచున్నాడు ఇందుకు "స ఏష ఇహ ప్రవిష్టః అన ఖాగ్రేభ్యః" అని మొదలుకొని "ప్రాణన్నేవప్రాణోనామభవతి వదన్ వాక్ ..........ఇమం లోకమతిక్రామతి మృత్యోర్రూపాణి" అను బృహదారణ్యకశ్రుతియూ, "బుద్ధేర్గుణే నాత్మగుణేనచైవ ఆరాగ్రామాత్రో హ్యవరోఽపిదృష్టః" "వాలాగ్రశతభాగస్యశతధాకల్పితస్య చ భాగో జీవస్సవిజ్ఞేయ స్సచానం త్యాయకల్పతే" "తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" "తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అను తైత్తిరీయ శ్రుతియు, "స ఏవం సీమానం విదార్య ఏతయా ద్వారా ప్రాపద్యత" "తస్మాది దంద్రోనామ" యదేత్ హృదయం మనశ్చైతత్సం జ్ఞానమజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం "ఇత్యాదైత్యతరేయక శ్రుతియునూ, "త్వమేకోఽసి బహూనానుప్రవిష్టః" "ఏకో దేవో బహుధా విచార" "ఏకస్సన్ బహుధావిచార" ఇత్యాది ఇతర శ్రుతులునూ, ప్రమాణములు- ఇలా జీవస్వరూపము అనేక స్థలములందు వేదాంతములందు నిరూపింపబడినది- దీనినివిడిచి, అజ్ఞానులు వారివారి దురూహలచే జీవస్వరూపమును వేర్వేరుగ కల్పించారు. కాని దానిని ఆదరించతగదు- కాబట్టి రామా! శుద్ధాత్మకు సంసారసంబంధము లేదు- జడమయిన దేహమునకు సంసారసంబంధము లేదు- జడము కాకుండా శుద్ధచేతనుడు కాకుండా నడుమనున్న జీవునకే సంసారము- ఆధారాధేయములలో ఏ ఒక్కటి నశించినా రెండవదానికి నాశము లేదు- కావున శరీరాదులు నశించినందున ఆత్మకు నాశము లేదు- ఒక్క ఆకుమీద రసము నశిస్తే మొత్తము రసము నశించినట్లు కాదు- అలాగే శరీరం నశిస్తే దేహి (ఆత్మ) నశించదు- ఆత్మ వాసనారహితుడయినచో, శరీరము నశించినా వాసన

యుంటాడు. నాశరహితుడైనవాడు బ్రహ్మాకారంగా ఉంటాడు- శరీరనాశంవల్ల తాను (ఆత్మ) నశించినట్లు ఏమూఢునకు భ్రాంతికలుగుతుందో వాడికి తల్లిగొంతుక స్తన్యప్రదేశంలో భేతాళుడు(బ్రహ్మరాక్షసి) పుట్టాడను భీతితో స్తన్యపానంకూడా దుర్లభం అవుతుంది- ఇంకా వాడు బ్రతకటం ఎలాగో తెలియకున్నది- చిత్తమునకు ఆత్యంతిక నాశము కలుగుచో, జీవుడు తన బ్రహ్మభావమును గుర్తించుకొని, నిరతిశయానంద లక్షణమయిన అభ్యుదయమును పొందినట్లే. అది వానికి పరమపురుషార్థమయిన మోక్షము. కనుక చిత్తనాశమువల్ల జీవునకు ఏవిధమయిన నాశములేదు కనుక అందునుగురించికూడ భీతిల్ల పనిలేదు. కనుక ప్రతివాడూ "చచ్చాను, నశించాను" అని అనుకోవటం పొరపాటు. (భ్రాంతి) అలాంటివాడు మరల మరొక శరీరాన్ని ధరించి కనిపిస్తూనే ఉన్నాడు. ఈ సంసారంలో మరణములనే నదులలోని తరంగాలలోని గడ్డిపరకలవలె జీవులు పుట్టాను, చచ్చాను, వృద్ధిపొందాను, సుఖి, దుఃఖి, ఇత్యాది భావాలతో ఊహించబడుచునే ఉన్నారు- దీనికంతకు వాసనావైచిత్ర్యమే కారణము. కోతి ఒక చెట్టునుంచి మరొక చెట్టుకు గంతులువేసినట్లు జీవుడు వాసనావశంచేత ఒక శరీరంనుంచి మరొకశరీరానికి గంతువేస్తాడు. మళ్ళీ దాన్నికూడా విడిచి ఇంకొక శరీరానికి పోతాడు. అనంతములయిన ఈ దేశకాలములలో అనంతములయిన శరీరాలను గ్రహిస్తాడు. వాసనాజాలమే యీ జీవులను ఇలా త్రిప్పుతూ ఉంటుంది. వాసనలనే త్రాళ్ళతో కట్టబడి దారిద్ర్యరోగ వియోగాది దుఃఖభారములను మోయుచూ, నానాయోనిదుర్దశా పరిణామముచే జీవితమును చెరచుకొని, తుదకు నరకగోతులలో పడుతూ ఉంటారు జీవులు- ఈయది వీళ్ళకు వాసనాదోషమువల్ల ఏర్పడిన దురవస్థ- అన్నారు వసిష్ఠులు-

ఇలా వసిష్ఠమహాముని ఉపదేశించుచుండగా సాయంకాలమయింది. సభవారు సాయంకృత్యముల నెరవేర్చుకొనుట నమస్కరించి వెళ్ళారు. తిరిగి సూర్యోదయంతో సభను ప్రవేశించారు-

ఇట్లు ౧౩వ రోజు ప్రసంగము ముగిసినది-

## ౭౨. మోక్షస్వరూపోపదేశము.

వసి॥ రామా! దేహముపుట్టితే నీవు పుట్టలేదు-దేహము చస్తే నీవు చావలేదు- కనుక దేహము నీకేమీ కాదు- అనగా నీకు దానితో సంబంధములేదు- కుండబదరన్యాయస్థలంలో కుండపగిలితే బదరములు (రేగుపండ్లు) నశించినవా! ఘటాకాశస్థలంలో ఘటంపగిలితే ఆకాశం నశించినదా! వినాశశీలమగు (నశించుస్వభావముగల) వస్తువు నశిస్తే తాను నశించానని దుఃఖించువాడు ఛీ! మూర్ఖుడు- పగ్గములకూ, (త్రాళ్ళకు) రథములకు ఏలాటి సంబంధమో ఆలాటి సంబంధమే దేహేంద్రియాదులతోటి చైతన్యానికి- సరస్సునకు, బురదకు, నిర్మలోదకమునకు, పరస్పరానురాగం లేదు. అలాగే దేహానికీ, ఇంద్రియాలకూ, ఆత్మకూ పరస్పరానురాగంలేదు- మార్గస్థులు విడిపోయినందునగాని, కలిసినందునగాని, దుఃఖమూ లేదు ప్రేమా లేదు. అంటే ఈ దేహేంద్రియాత్మలకుకూడ దయ్యమున్నదనుకొని ఝడుసుకొని, పళ్లుకొరకుట, వికారముగ ముఖమును ఏర్పరుచుట వాగుట మొదలయినవి ఎలాంటివో అలాంటివే భార్యాపుత్రాదులనుజూచి సుఖదుఃఖాదివికారాలు చెందటం. ఈ జనసమూహం అంతా భూతపంచమువల్లనే తయారయింది- కర్రబొమ్మలో కర్రలకంటె వేరేమీ ఉండవు. అలాగే శరీరంలో కూడ భూతపంచక పిండంకంటె వేరేమీ లేదు- మానవులారా! భూతపంచకముయొక్క విక్షోభమునందునూ, నాశమునందునూ, వాటిపుట్టుకనందునూ, మీకెందుకు? హర్షామర్షవిషాదాలు (సంతోష, క్రోధ దుఃఖాలు).

భూతసంఘాత స్వరూపమనేది సమానంగా ఉండగా స్త్రీలోనూ పురుషులలోనూ ఏమి అతిశయం ఉంది? సౌకుమార్యము, సౌందర్యము, అవయవవిశేషము అనేవిశేషాలు చూచి అజ్ఞానంచేత సంతోషించవలసిందే కాని జ్ఞానంకలవాళ్లు సంతోషించరు- జ్ఞానులకు స్త్రీ శరీరంలో కూడా భూతపంచకపిండమే గోచరిస్తుంది- రాతిబొమ్మనూ, కొయ్య

బొమ్మనూ కలిపి ఒకచో పెట్టితేమాత్రం వాటికి పరస్పరం అనురాగం కలుగుతుందా! అలాగే చిత్తశరీరములకుకూడా— రెండూ జడములే— ఒకదానిమీద మరొకదానికి అనురాగమేమిటి? మట్టితో మనుష్యులను తయారుచేసి ఒకచోట చేర్చిఉంచితే ఒకరిమీద మరొకరికి మమత ఉండదు. అలాంటిదే బుద్ధీంద్రియాత్మ మనస్సులయొక్క సాంగత్యం కూడా— రాతిబొమ్మలకు పరస్పర స్నేహసంబంధ యోగ్యత లేదు— అలాంటివే దేహేంద్రియాత్మప్రాణములుకూడా ఇందులో దుఃఖం దేనికి? అక్కడ అక్కడ పుట్టిన గడ్డిపోచలు తరంగాలు ఒకచోట కలిసినట్లు భూతములుకూడా అలాగే కలిశాయి— సముద్రప్రవాహంలో అనేకవస్తువులు కలుస్తున్నాయి విడిపోతున్నాయి— అలాగే పుత్రపశ్వాదిప్రాణులుకాని, పృథివ్యాదిభూతములుకాని, స్వారబ్ధదేహమునందును, స్వాధిష్ఠానమయిన ఆత్మయందును, సంయోగ వియోగాలను చెందుతున్నాయి— సముద్రము సుడిగుండమనే వేషము వేసికొని, గుండ్రముగా తిరుగుచూ అందులోపడిన తృణకాష్ఠాదులను కలుపుకొనుచూఉంది— అలాగే ఆత్మకూడ చిత్తమనే వేషంవేసికొని దేహేంద్రియాకారమయిన భూతాలను త్రిప్పుతూ ఉన్నాడు— సముద్రం ఆసుడిగుండమనే ఆకారాన్ని విడిచిపెడితే తృణకాష్ఠాదులను విడిచిపెడుతుంది— అలాగే ఆత్మకు ప్రబోధం కలిగితే(తత్త్వజ్ఞానం కలిగితే) చిత్తాకారాన్ని విడిచిపెడతాడు— అప్పుడు దేహేంద్రియాదులనుగూడ విడుస్తాడు. అప్పుడు తాను శుద్ధాత్మస్వరూపాన్ని ధరిస్తాడు— ఖేచరులయిన దేవాదులు వసుధామండలమును (భూమిని) చూచినట్లు భూతసంఘముయొక్క సంబంధమునుండి విముక్తుడయినవాడు జ్ఞానదశలో దేహమును తెలిసికొంటాడు—(అనగా దేహము వేరు నేనువేరు అని తెలిసికుంటాడు— భూతవివేకముచే దేహాతీతుడయినవాడు సూర్యునివలె ప్రకాశిస్తాడు— త్రిపుటీరహితమయిన ఆత్మతత్త్వమును తెలిసికొంటాడు. ఈనిఖిలవస్తుజాతంతో కూడిన ప్రపంచం అంతా ఆత్మస్పందమే కాని మరొకటి కాదు— తరంగకణకల్లోలములతో కూడిన నీరంతా సముద్రమే— ఈజ్ఞానం కలవారు వీతరాగులు— పాప

రహితులు- సత్త్వసంపన్నులు- జీవన్ముక్తులు- వాసనారహితులై సంచ రిస్తూ ఉంటారు వ్యవహార ప్రపంచంలో- ఒడ్డునఉన్న కఱ్ఱలతో సము ద్రంలోని నీరు మలినంకాదు- గాలికిలేచిన దుమ్ముతో ఆకాశము మలినముకాదు- లోకవ్యవహారాలతో జీవన్ముక్తులు మలినులు కారు- సముద్రంలోకి ఎలాంటివస్తువులువచ్చినా మంచివని అనురాగంకాని, చెడ్డవని ద్వేషంకాని లేదు దానికి- అలాగే జ్ఞానికి రాగద్వేషాలుండవు- మనోమననమంతా చిద్విలాసమని వారికి తెలుసు- అహంతామమతలు దృశ్యదర్శన సంబంధమువల్లనే మనస్సులో భాసిస్తున్నాయి- ఆత్మకు సంబంధంలేదు వాటితోటి- "దృక్, దృశ్యం" అనే రెంటిలో దృశ్య మనేది, దృక్ వల్ల సిద్ధించేదికనుక, అది సత్యమా ? అసత్యమా ? అనే నిర్ణయం ఇంతవరకు తేలనందున, హర్ష శోకములకు యోగ్యముకాదు అది. ఇక రెండవదయిన దృక్కు- అనేది స్వతస్సిద్ధము, దృశ్యాధీనము కాదు. అలేపకము (అసంగము) కనుక కలిగిన హర్షశోకములతోటి కూడ అంటదు-కాబట్టి యెట్లయినను హర్షశోకితులకు ప్రసక్తిలేదునీకు.

మరియు నీకు హర్షశోకములు సత్యవిషయమందా ? అసత్య విషయమందా ? లేకసత్యాసత్య విషయమందా ? చెప్పు- ఇందులో రెండవపక్షం అంగీకరిస్తే అసత్యం ఎలాగో అసత్యమేకనుక నీహర్ష శోకములలో విషయమే లేనందున అవి నిర్విషయములు ఆపక్షంలో- ఇక మొదటి పక్షంలో సత్యమయిన వస్తువు యెప్పుడూ ఉన్నది కనుక అది క్రొత్తగా లభించినదని సంతోషమక్కరలేదు- పోయినదని దుః ఖమూ అక్కరలేదు- లోకంలో వస్తువుయొక్క లాభాలాభములవల్లనే హర్షవిషాదములు కలుగుచున్నాయి- అవి యిట అప్రసక్తములు సత్యాసత్యమనే మూడవపక్షం విరుద్ధముకనుక పొసగదు- అందువల్ల లేదనవలసె వస్తుంది ఆపక్షం. కనుక అది రెండవపక్షంతో సమానమే- కనుక హర్షశోకములకు యోగ్యమయిన వస్తువే లేనందున వాటివిష యమై మోహము అనుచితము.

కాక దృశ్యదర్శన సంబంధముల చేతనే సుఖము అభివ్యక్తమవును- అనగా భోగసుఖంకొరకు అందరూ విషయేంద్రియ సంబంధమును అంగీకరిస్తున్నారు- అప్పట్లు అభివ్యక్తమయ్యేది పరమాత్మ స్వరూపసుఖమే కనుక అదే బ్రహ్మ- ఆ బ్రహ్మను విషయాకార వృత్తితో ఆస్వాదిస్తే విషయమునందు రాగాదిదోషములను పుట్టించి సంసారాన్ని యిస్తుంది- దానిని (ఆ బ్రహ్మమును) అఖండైకాత్మ భావంతో గ్రహిస్తే మోక్షమునిస్తుంది- ఇంకే తేడా- సుఖమునందు పుణ్యతారతమ్యప్రయుక్తమయిన క్షయాతిశయములు లేనిచో అదేముక్తి సుఖమన్నారు బుధులు. అనగా సుఖమునకు పుణ్యముకొద్ది తరుగు పెరుగులుంటులే బంధము- అవిలేకపోతే ముక్తి- ఇలా మేము చెప్పిన ఆత్మస్వరూపమును అవలంబిస్తే స్వరూపావరణదృష్టి నశిస్తుంది-స్వరూప దృష్టి ప్రకాశిస్తుంది- అప్పుడు తుర్యత్వమునుపొందుతాడు- అదే ముక్తి- దృశ్యదర్శన సంబంధరహితమయిన తుర్యదశలో, రామచంద్రా ! ఆత్మ స్థూలుడుగాడు. సూక్ష్ముడు కాడు. ప్రత్యక్షుడు కాడు. చేతనుడు కాడు. జడుడు కాడు. దూరస్థుడు కాడు. సమీపస్థుడు కాడు. ఉన్నవాడు కాడు. లేనివాడు కాడు. ప్రాప్యుడు కాడు- అప్రాప్యుడూ కాడు. పదార్థమూ కాదు. అపదార్థమూ కాదు. పంచభూతాత్మ కాదు అపంచభూతాత్మా కాదు. అది మనస్సుతోగూడ అగు ఇంద్రియములకు అతీతమయిన వస్తువు- సమ్యగ్జ్ఞానము కలిగి చూచువానికి ఈ ప్రపంచం అంతా ఆత్మమయము- అనాత్మమయమయిన వస్తువే లేదు- పంచభూతములందలి కాఠిన్యాది ధర్మములన్నీ ఆత్మరూపములే- రామా ! చిత్పదార్థము లేకుంటే ప్రపంచవస్తువులకు ఉనికియే లేదే- ఇంక అవి ఆత్మకంటె భిన్నముగ నున్నవనే మాట ఎంతపిచ్చిమాట ? కనుక రామా ! నీవు ప్రపంచ అంతా ఆత్మేకాని, వేరువస్తువు నిజంలో లేదని గట్టిగానమ్ము- ఉన్నట్లు కనిపించడం భ్రాంతి-

## 23. స్వాత్మవిచారము.

వసి॥ రామా! ద్వైత ప్రపంచాన్ని విడిచి, తత్త్వవిచారదృష్టితో నున్నవానికి స్వస్వరూపావస్థితి రూపమగు ముక్తి సులభము- రామా! నీకు ఇంకొకరకమయిన అహంభావదృష్టిని చెబుతాను విను- దీనితో కూడ నీవు అచలమగు ఆత్మతత్త్వాన్ని గుర్తింతువు- దివ్యజ్ఞానము కలుగును- అది యేదన "నేనే ఆకాశము- నేనే సూర్యుడను- నేనే దిక్కులు- నేనే దేవతలు- నేనే రాక్షసులు- నేనే లోకాలు- నేనే చంద్రుడు- నేనే చీకటి- నేనే మేఘాలు- నేనే భూసముద్రాదికం- నేనే వాయ్వగ్న్యాదికము- సర్వప్రపంచము నేనే- ముల్లోకములంతా నేనే ఉన్నాను అంతటా- సర్వప్రపంచరూపుడనయిన, అద్వితీయుడనయిననాకు ద్విత్వమనేది (స్వగతభేదమనేది) ఎలాంటిది? ఈనిశ్చయం కలవాడవగుచు, ఆవల నీలోని జగత్తు నీరూపమని గ్రహించు- ఇంకినీవు హర్షశోకములకు వశుడవు కావు- రామా! నిఖిల ప్రపంచమూ ఆత్మమయమయితే ఇంక ఆత్మీయమేమున్నది- ఆత్మకంటె భిన్నమయిన దేది? చెప్పు?

చిద్రూపమయిన ఆత్మకంటె భిన్నముగ ఏమున్నది? దేనినిపొంది హర్షవిషాదాలు పొందెదవో నీవు చెప్పు. ఎవ్వడయినా లోకంలో హర్షవిషాదాలకు లోనయినాడా? వాడు అజ్ఞాని అయినట్లే- వాడు జగన్మయుడే- చిన్మయుడు కాడు-

ఇదీకాక అహంకారదృష్టులు మరిరెండు చెబుతాను విను- సాత్త్వికములు- అతినిర్మలములు- తత్త్వజ్ఞానంవల్ల కలుగుతాయి ఇవి- పారమార్థికమయిన మోక్షం ఇస్తాయి- ఒకటి "నేను అన్నిటికి ఆవలవాడను- ఆకాశాదులవలె సూక్ష్ముడను- అవస్థాత్రయంలోని దృశ్యముకంటె అతీతుడను" అనేది ఒకరకమయిన అహంకృతి- ఇది మొదటిది- "నేనే సర్వప్రపంచము" నాకంటె భిన్నముగ ప్రపంచమునకు స్వరూపము లేదు" అనేది రెండవ అహంకృతి- "దేహమే నేను" అనేది మూడవ అహంకృతి- ఇది కేవలము దుఃఖాన్నే ఇస్తుంది కాని ఏమాత్రం సుఖాన్ని ఇయ్యదు- ఈమూడు అహంకారములను విడిచి మిగిలిన

నిరహంభావమును (పూర్ణ చిన్మాత్రమును) అవలంబించి ఉండు- ఆత్మ సర్వప్రపంచాతీతుడు- సర్వప్రపంచసత్తను (ఉనికిని) బాధించువాడు- (అనగా శోధనావస్థలో ప్రపంచాతీతరూపుడు- బాధావస్థలో ప్రపంచముయొక్క సత్తను (ఉనికిని) బాధించువాడు-) అయినా ప్రపంచ బాధకు (ప్రపంచ నిషేధానికి) అధిష్ఠానరూపంతో ప్రపంచాన్ని నిండి ఉన్నాడు- ప్రపంచాన్ని ప్రకాశింపజేస్తున్నాడు- శాస్త్రాలు, గురువచనాలు, యుక్తులు, ఇవి ఆత్మను దిఙ్మాత్రంగా సూచించునవి- నీవు నీ అనుభవంలో చూచుకో- దేహాది వాసనారూపమయిన హృదయ గ్రంథిని (అహంకారతాదాత్మ్యాధ్యాసను) విడు- రామా! ఆత్మతత్త్వం యుక్తివల్ల సిద్ధించేదికాదు- ఆప్తవాక్యంవల్ల సిద్ధించదు- కేవలం స్వానుభవైకవేద్యము- శ్రుత్యాదులు ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటకు (నిరూపించుటకు) రాలేదు- సర్వానుభవసిద్ధమయిన ఆత్మతత్త్వమును ప్రపంచమునుంచి వేరుపరచి చూపుటకు వచ్చినవి- బాహ్యాభ్యంతరవిషయములందు (లోపలిబయటి వస్తువులందు) అంతఃకరణము ప్రవర్తించగా అట్టి అంతఃకరణ వృత్తులవల్ల ప్రత్యక్షముగా పదార్థప్రధానరూపమయిన అపరోక్షజ్ఞానము (వస్తువులయొక్క ప్రత్యక్షజ్ఞానము) కలుగుతుంది- (అనగా కన్ను తెరిచేసరికి కంటిఎదుటనున్న కుండమీద కన్నుద్వారా అంతఃకరణము ప్రవేశించి "ఇదికుండ" అనే ప్రత్యక్షజ్ఞానము కలుగుతుంది- ఇలాగే అనుమితి, ఉపమితి, శబ్దప్రమాణములవల్లకూడ అనుమితి మొదలగు జ్ఞానములు కలుగును- ఇలాంటి జ్ఞానములపట్ల దృశ్యమయిన విషయమునూ, దర్శనమును అంతఃకరణవృత్తినీ, ఈరెంటినీ త్రోసివేయగా (విడువగా) మిగిలిన జ్ఞానమనునది నిత్యాపరోక్షమయిన ఆత్మయే- ఈయది సర్వానుభవసిద్ధము- ఇదే విషయాన్ని "ప్రతిబోధ విదితం మత మమృతత్వంహి విందతే" అను శ్రుతి చెప్పుచున్నది- ఈయది సత్యాసత్యాది ధర్మములు కలదికాదు- అణుత్వ మహత్త్వాది ధర్మములు కలదికాదు- వాగాదీంద్రియములకు గోచరించునదికాదు- ఆత్మానాత్మరూపమగు నామరూపవిభాగము

ఆత్మచేతనే తన అజ్ఞానశక్తిచే (మాయాశక్తిచే) కల్పింపబడ్డది— ఇతడు నిత్యపరోక్ష స్వప్రకాశపరిపూర్ణస్వభావుడయిననూ, (ఇతడు ఎల్లప్పుడు ప్రత్యక్షమగు స్వయంప్రకాశరూపుడయిననూ) స్థూలదృష్టులు ఊహింప లేకున్నారు— ఇందుకారణము పరమాత్మ పుర్యష్టకమను నుపాధియందు ప్రతిబింబించి జీవభావమును జెందుటయే— పుర్యష్టకమందు ప్రతిబింబించి యుండుటవలననే సర్వులకు "అహం అహం" "నేను నేను" అను పదములచే అభివ్యక్తమవుచున్నాడు— ఇతడు సర్వవ్యాపకుడు కనుక పరిచ్ఛిన్నమయిన శరీరమందే ఉన్నాడని అనుకోనకూడదు— సర్వపదార్థములకు సత్తాస్ఫూర్తులనిచ్చువాడు కనుక కూడా అలా భావించకూడదు— కాని లోకులు అపరిచ్ఛిన్నాత్మను పరిచ్ఛేదభావంతో చూచుటకు కారణము పరిచ్ఛిన్నమయిన పుర్యష్టకమనే (దేహమనే) ఉపాధియే— ఈ శరీరమునందు సర్వులకు ప్రేమ, ఇచ్ఛ, విచిత్రభోగతృష్ణ, ఇవన్నీ, కలుగుటకు కారణము శరీరములో నిరతిశయప్రేమాస్పదము, నిరతిశయానందరూపము అయిన ఆత్మఉండుటే— ఆకాశాన సూర్యుడు ప్రకాశిస్తూ ఉండబట్టి, అందరకు వారివారి పనులు నెరవేర్చుకుందామని కోరిక కలుగుతోంది— వారి పనులను నెరవేర్చుకుంటూ వ్యవహరిస్తున్నారు— ఒకవేళ ఆకాశమున సూర్యుడుండగనే యీవ్యవహారం వీళ్లు మానుకుంటారనుకుందాం, సూర్యుడికేమి పోయింది? అతడికేమిబాధ? అలాగే శరీరంలో ఆత్మఉంటేనే శరీరమందు ఇచ్ఛాప్రీత్యాదివ్యవహారము— శరీరం నశిస్తుంది—ఈవ్యవహారం అంతా పోతుంది— అంతమాత్రం చేత ఆత్మకు ఏమిపోయింది— కనుక ఏవిధంగా ఆలోచించినా ఆత్మకు జన్మమరణాలులేవు— ఇచ్ఛాద్వేషాలులేవు— బంధమోక్షాలులేవు—ఆత్మజ్ఞానం లేనందువల్ల, అనాత్మయందు ఆత్మభ్రాంతి పుట్టింది— త్రాటియందు సర్పభ్రాంతి పుట్టినట్లు— కనుక నిదిభ్రాంతి— దీనివల్ల దుఃఖమే కాని సుఖమేమాత్రములేదు— ఆత్మకు ఆదిలేదుకనుక పుట్టదు— పుట్టుక లేదుకనుక చావదు— ఆత్మవ్యతిరిక్తమయినది లేనేలేదుకనుక కోరదు— ఆత్మ అద్వానిని— దేశకాలాది పరిచ్ఛేదములులేవు కనుక ఆత్మకు బంధము

లేదు. బంధములేదు కనుక మోక్షములేదు- మోక్షాభావమే అతనికి సహజము- సర్వుల ఆత్మయు ఇలాంటి స్వభావముగలవాడే- విచారింపని దోషంచేత మూఢులు ఆత్మజన్మమరణములు గలవాడని యెంచుచున్నారు- రామా ! నీవు ప్రపంచముయొక్క పరిస్థితిని చక్కగా పూర్వాపరవిమర్శచేసికొని దుఃఖమును వాపుకో- (పోగొట్టుకో) మూఢులవలె దుఃఖింపకు- రామా ! జ్ఞానియగువాడు బంధమోక్షములనే రెండు కల్పనలను విడిచి, కామాది వ్యాపారశూన్యుడై దేహాదులచే వ్యవహరించాలి-

మోక్షమనేది ఆకాశంమీద లేదు- పాతాళంలో దాగిలేదు- భూమిమీద లేదు- సమ్యగ్జ్ఞానముచే తెలివినొందిన నిర్మలమయిన మనస్సే మోక్షము- అన్ని ఆశలందును, అసంసక్తిచే.(వైరాగ్యముచే) చిత్తము నశించుటయే మోక్షమన్నారు తత్త్వవేత్తలు- నిర్మలమయిన తత్త్వజ్ఞానము కలుగనంతవరకే అదివరకు లేనట్లు భావించి అతిదీనంగా మోక్షం మోక్షం అని కోరుతూ ఉంటారు లోకులు- పరమాత్మజ్ఞానం కలిగి చిత్తము చిన్మాత్రాకారమును చెందిందా! ఇంక పదిమోక్షాలు యిస్తామన్నా అక్కరలేదంటారు- ఒక్కమోక్షాన్ని కోరరని చెప్పటం యెందుకు ?

రామా ! "ఇది మోక్షము, ఇది బంధము" అనే అతిపేలవమయిన కల్పనను- (లేక భావమును) విడిచి సర్వము మనసా త్యజించి నీవే ఆమోక్షమగుము- రామా ! భేదభావమును విడిచి చతుస్సముద్రపర్యంతమయిన భూవలయమును నిస్సంగముగ పాలింపుము- అంతస్సంగములేనిచో రాజ్యాదిపరిపాలనము దోషావహము కాదు- (పాపకారి కాదు-)

## ౭౮. వైరాగ్యోపదేశము.

వసి॥ రామచంద్రా ! ప్రళయసుషుప్తులందు ఆత్మ అజ్ఞానావృతుడై ఉంటాడు- అందుచే పరమప్రేమాస్పదమయిన నిరతిశయానంద

రూపాన్ని గుర్తించలేడు మానవుడు- ఇక ఆత్మయందలి కామకర్మ వాసనా పరిపాకక్రమంచేత సృష్టిసమయంలోను జాగర స్వప్నావస్థ లందును చిద్విలాసముచేతనే సూక్ష్మస్థూల సమష్టి వ్యష్టి శరీరము పుటు తుంది- అందమైన భార్యాపుత్రాదుల ముఖంచూడని విరహిపురుషు నకు హృదయంలో దౌర్మనస్యం (దిగులు, బెంగ) నిరంతరం పుట్టుమనే ఉ టుంది- ఆ దేహద్వయమునందు అహంతామమతాధ్యాసలుకలిగి, అంతులేని అనర్థములను తెచ్చిపెట్టెడి రాగద్వేషలోభమోహాదులు పుటుతూఉంటాయి- అట్టి రాగద్వేషాదులచే కర్మలయందు ప్రవృత్తి నివృత్తులూ, పుణ్యపాపవాసనలూ, మున్నగు అనర్థపరంపరా సుఖరూపు డయిన ఆత్మకు దుఃఖరూపమయిన సంసారబంధమూ మొదలగునది యావత్తూ వచ్చిపడుతుంది- ఆత్మఅనే సముద్రం, మనస్సు, బుద్ధి, అహం కారం, వాసనలు, ఇంద్రియములు, అనే నీటితో ప్రకాశిస్తూ ఉన్నది- ఇందులో చిత్త అహంకారములకు పేరుభేదమేకాని, అర్థభేదంలేదు- కనుక చిత్తాహంకారములలో ఏదొకటినశించినా రెండూ నశించినట్లే, కాబట్టి రామా! తుచ్ఛములయిన బంధమోక్షబుద్ధులను ఏషణాజాల మును విడిచి, వైరాగ్యవివేకములచే మనోనాశమును సంపాదించుకో "నాకు మోక్షం కావాలి" అనే కోరిక మనస్సులో పుట్టి అదే మన నంతో మనస్సు ఉంటే ఇదికూడా ఒకవిధమయిన సంకల్పాత్మక మనో వికారమే కనుక, దీనివల్ల మరోశరీరం తయారవుతుంది- సర్వవ్యాపక, సర్వాతీత, అసంగ, పరిపూర్ణ చైతన్యానికి బంధమోక్షాలెక్కడివి? కనుక మనస్సును నిర్మూలంచేసుకో-

ప్రాణవాయువుచే, ఇంద్రియసమూహమూ, శరీరమూ, కదలు తుంది- సర్వవ్యాపియగు ఆత్మ కదిలేవాడు- కనుక ఆత్మకూ దేహేంద్రి యాలకూ చాలా వైలక్షణ్యం (భేదం) ఉంది- ఈస్థితిలో ఏమిటి? "వాడువీడు నేనునీవు" నాఅవయవాలు, నాది, నీది అనే వ్యామోహం మూఢులకు? ఇంతటి భేదం ఉన్నా దేహేంద్రియాల యొక్క ధర్మము

లయిన కర్తృత్వభోక్తృత్వాలు అవిద్యచే దేహాదితాదాత్మ్య సంసారాధ్యాసవల్ల ఆరోపింపబడుతున్నాయి- అనుభవింపబడుచున్నవి కాదా- ఆ అనుభవానికి అనుకూలంగా వాసనలు బయలుదేరుచున్నాయి- విజ్ఞానముకలిగిన పిమ్మట యీ అధ్యాస ఉండదు- ఈ అనుభవం ఉండదు. ఈ వాసనలుండవు. దీపంచేత చీకటి నశించినట్లు పరమార్థజ్ఞానంచేత ప్రపంచవాసన సమూహం నశిస్తుంది- శాస్త్రయుక్తులవల్ల అవిద్య లేదనే మనోనిశ్చయం కలిగితే ఎండకు మంచుకరగినట్లు అవిద్య నశించిపోతుంది. సింహం పంజరమును భేదిస్తుంది- తత్త్వజ్ఞుడు జడమయిన శరీరానికి యీ భోగాలెందుకను నిశ్చయంతో ఆశాపంజరమును భేదించి పారేస్తాడు- ఆశాపాశాలు తెగిపోతే మనస్సుకు పరిపూర్ణానందం కలుగుతుంది- రాజ్యమిచ్చిన నీచుడికివలె- దురభినివేశాలు రూపుమాసిపోతాయి- విషయములకు ఏమాత్రం లొంగని ధైర్యం కలుగుతుంది- పరనిర్వాణం సంప్రాప్తమవుతుంది- మంచిమణివలె ఆత్మ ప్రకాశిస్తూ ఉంటాడు- నిరాకారమయిన ఆత్మతత్త్వం ప్రత్యక్షమవుతుంది- గడచిన రోజులను పరిహసించుకుంటాడు- విషయలోలులతో సాంగత్యం ఉండదు- మనస్సు విషయాలలో రంజింపదు- శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వదోషాలు రూపుమాసిపోతాయి- సంసారసాగరాన్ని తరిస్తాడు- పునరావృత్తిరహితమైన మోక్షసామ్రాజ్యాన్ని అధిష్ఠిస్తాడు- మనోవాక్కాయకర్మలతో అందరు ఆమోదించతగిన చరిత్రగలవాడవుతాడు. ఆచరిత్రకు తగిన ఫలాన్ని (ఆనందాన్ని) పొందుతాడు- దానప్రతిగ్రహాలుండవు- స్తుతినిందలుండవు- ఉదయాస్తమయము లుండవు- హర్షశోకములుండవు- సర్వారంభములనువిడిచి, సర్వోపాధులను విడిచి, సరాశలను విడిచి జీవన్ముక్తుడవుతాడు.

రామా! ఏషణాత్రయమును విడిచి మౌనంగా ఉండు. నీరంతా వర్షించిన మేఘం ఉన్నట్లు- నిరాశ (తృష్ణాత్యాగము) సుఖపెట్టినట్లు స్వర్లోకవేశ్యకూడ సుఖపెట్టలేదు- కంఠంలో ప్రవేశించి చంద్రుడు కూడా సుఖపెట్టలేడు- నిరాశగల మనస్సులో ఉన్నంతటి మాధుర్యము

పుష్పములతో నిండిన క్రొత్తతీగలలోకూడ ఉండదు- నైరాశ్యమువల్ల కలిగే చల్లతనము హిమగిరివల్లకూడ కలుగదు- ముత్యాలవల్లకలగదు. రంభల (అరటికంభముల)వల్ల కలుగదు- మంచి గంధమువల్ల కలుగదు. చంద్రునివల్లకలుగదు- నిరాశవల్లకలిగే సుఖం రాజ్యప్రాప్తివల్లలేదు- స్వర్గమువల్లలేదు- చంద్రునివల్లలేదు- మాధవ్రసివల్లలేదు- కాంతా సంగమము వల్లలేదు- ముల్లోకసంపదలు గడ్డిపోచవలె ఎక్కడ ఉపకరించవో, ఆదేపరానివృత్తి- అదినైరాశ్యము (తృష్ణాత్యాగము) వల్ల కలుగుతుంది-

రామా ! ఆపదలనే కరంజివృక్షములకు (ముళ్ళచెట్లకు) గండ్రగొడ్డలి అయినట్టియు, పరనిర్వృతికి స్థానమయినట్టియు, శమమనే వృక్షమునకు పూగుత్తియగు నిరాశత్వమును అవలంబించు- తృష్ణాత్యాగముతో అలంకృతమైన ఆకారము గలవానికి పృథివీఅంతా గోష్పాదమంతటిది- మేరుపర్వతమంతా చిన్నరాయివంటిది- మూడులోకములు తృణప్రాయములు- నిరాశులయిన పురుషధౌరేయులు, ధనసంబంధమైన భోగమంతను పరిహసిస్తారు- రామా ! ఆశ ఎవని మనస్సులో అడుగు పెట్టదో వాడితో పోలినమనుష్యుడేలేడు- "నాకిదికావాలి, నాకిది అక్కరలేదు" అనేభావం ఎవరిమనస్సులో లేదో, అలాంటి స్వాధీన చిత్తుణ్ణి ఎలాపోల్చగలము? కనుక రామా ! నైరాశ్యం అన్నిసంకటాలకు అవసానము-(పరమావధి) సంకటములులేని పరమసుఖము- బుద్ధికొక్క పరమ సౌభాగ్యము- రామచంద్రా ! నీకు ఆశలులేవు- నీవు ఆశలకు సంబంధించినవాడవుగావు- కనుక వైరాగ్యాది సాధనసంపత్తితో ముఖ్యాధికారివి కనుక తత్త్వజ్ఞానసంపత్తితో ప్రపంచం అంతా భ్రమమాత్రమని గ్రహించు- రథంమీద ప్రయాణం చేసేవాడికి ఇరువైపులా తరుగుల్మాదులు తిరుగుచున్నట్లు తోస్తూ ఉంటుంది- అంతే ఈప్రపంచ భ్రాంతికూడా- ఎంతచెప్పినా తెలియనివాడివలె (మూఢునివలె) "ఇది నాది, వాడునావాడు, నేను"అని మోసపోతావేం భ్రాంతచిత్తముతో- ధీరులు ప్రపంచమంతా ఆత్మయేయని నిశ్చయించి, నానాత్వము లేదని

గ్రహించి, అద్వితీయమని గుర్తించి ఖేదమునొందరు. ప్రాపంచికపదార్థ ములన్నీ ఆత్మస్వరూపములని గ్రహిస్తే ఆత్మ తానే కనుక ఇంక ఆశ అనేది పుట్టదు మనస్సులో- "ఉన్నది, లేదు" అనే వివాదంలేకుండా ఆద్యంతములలో ఉండే తత్త్వమే పదార్థములయొక్క స్వరూపం. దానిని ఆధారంగా చేసికొని ఉండు. వైరాగ్యశూరుడయిన వానిమనస్సు నుండి మాయఅనేది పరుగెత్తుకొని పోతుంది- సింహాన్ని చూస్తే లేడి పరుగెత్తినట్లు- మన్మథోద్రేకముగల హింతను (భార్యను) ముసురు రాతిబొమ్మతో సమానంగా చూడు- రామా! ఈభోగాలు ఆనంద పరచవు- ఈఆపదలు దుఃఖపెట్టవు- ధైర్యంగాఉండు- దృశ్యపదార్థాల యొక్క శోభలు ధైర్యాన్ని చెడగొడతాయిసుమా! జ్ఞాని మీద నూతన యౌవనంగల యెంతటి చిన్నపిల్ల అనురాగం కలిగిఉన్నా మన్మథుడు వేసిన బాణాలు ఇసుకరేణువులై పోతాయి- తత్త్వజ్ఞుని రాగద్వేషాలు లాగలేవు- కదలకుండా కదలడువాటికి- ఇంక ఆక్రమించ లేవని చెప్పపనిలేదు- భార్యను కదిలే తీగవలెచూస్తూ తాను అద్రి శిలాకారంగా (కొండరాయియొక్క ఆకారంగా) ఉన్నవాడు మరుభూ ములవంటి సంసారభోగాలతో రమించడు- జ్ఞాని అయాచితంగా (అప్ర యత్నంగా) వచ్చినదానిని ఆసక్తిలేకుండా అనుభవిస్తాడు- ఒకవేళ కాకతాళీయంగా కాంతాదిభోగాలను అనుభవించినా జ్ఞానికి, సుఖమూ ఉండదు- దుఃఖమూ ఉండదు- మందరపర్వతాన్ని రెండువైపుల తరం గాలు క్షోభపెట్టలేకపోయినవి. సమ్యగ్ జ్ఞానముగలవాని మనస్సును సుఖదుఃఖములనే తరంగాలు రెండూ క్షోభపెట్టలేవు- ప్రపంచాన్ని అసత్యబుద్ధ్యా చూస్తూ ఆత్మపదమును అవలంబించి ఉండు- హిరణ్య గర్భుడు ప్రపంచములను సృష్టిస్తున్నా ఆత్మపరాయణుడే- ప్రపంచ పరాయణుడుగాడు. అలాగే తత్త్వవేత్త విక్షేపజనకములయిన దేహేం ద్రియాదులతో కూడినవాడయినను, విక్షేపరహితుడే. వాటివాటి తరుణములందు సుఖదుఃఖము లెన్నివచ్చినా మనఃక్షోభము నొందడు జ్ఞాని- రామా! ఆత్మజ్ఞుడు కర్మేంద్రియములయొక్క పనులలోముని

గినా, అసక్తమనస్కుడు గనుక అపనులయొక్క పనులతో అంటడు- ఎప్పుడూ లోపలకలంకం (దోషం)ఉంటేనే కలంకము కలదని అంటారు. బంగారములోపల రాగి కలిస్తేనే కల్తీబంగారమని అంటారు. అంతేకాని బయట మట్టిపట్టినంతమాత్రాన కల్తీబంగారమని అనరు- అలాగే మనస్సులో రాగాదిదోషాలు ఉంటేనే దోషికాని, బయటికి కర్మలు చేసినంతమాత్రాన దోషిగాడు- శరీర వ్యతిరిక్తమయిన ఆత్మతత్త్వమును చూచుచున్నవానికి శరీరం కోస్తూఉన్నా దుఃఖంఉండదు- ఒక్కమారు తెలియబడిన ఆత్మతత్త్వము ఎల్లప్పుడు తెలియబడుచునే ఉంటుంగి- మరపుకురాదు- ఒకమారు తెలియబడిన బంధువు తెలియబడనివాడుకాడు- సర్పభ్రాంతి పోయిన తరువాత త్రాటిమీద సర్పభ్రాంతి కలుగదు- బంగారమును కాచి మకిలతీసివేసి శుద్ధిచేసినతరువాత దానిని మరల బురదలోవేసినా మలినముకాదు- (కల్తీ బంగారమనిపించుకోదు) అలాగే హృదయగ్రంథులు (రాగాది వాసనలు) క్షీణించిన తరువాత (నశించిన తరువాత) మరల బంధమనేది ఎన్నటికీ జరుగదు- తొడిమ నుంచి జారిపడిన పండును మరల తొడిమ కతికించుటకు ఎవడెంత ప్రయత్నముచేసినా సాధ్యపడదు- రాతిలోనున్న మణిని రాతిఛేదించిగాని మణితత్త్వవిచారణచేసికోని, మణికాని అంశములను తీసివేసి, స్వచ్ఛమయిన మణి అంశాన్ని బయటికిదీసిన తరువాత మరల ఆమణిని కాని ఆ పాషాణమునుకాని వెనుకటివలె అనుసంధానంచేయుటానికి ఎవ్వడు సమర్థుడు ? అవిద్యయొక్క స్వరూపం తెలిసికున్నతరువాత దానిలో ఎవరు మునుగుతారు? శ్వపచులయొక్క (మాలవాండ్లయొక్క) ఉత్సవసమాజం (గుంపు) వెళ్లుచున్నట్లు తెలిసినతరువాత ఇంకదానిని మోహము వినోదంగా ఆసక్తితో చూస్తాడు- నిర్మలోదకమునందు కలిగిన క్షీరభ్రాంతి (పాలనుభ్రమ) విచారణవల్ల పోతుంది- తత్త్వవిచారము వల్ల సంసారవాసన పోతుంది- మద్యమును (కల్లును) జలమను భ్రాంతితో బ్రాహ్మణులు తెలియనంతవరకు త్రాగితే త్రాగవచ్చును. తెలిసినపిదప విడుతురుకాని త్రాగరు- ఎంతటి రూపలావణ్యాదులుగల

స్త్రీ అయినా పటములోని బొమ్మనుగానే చూస్తారు తత్త్వవేత్తలు- పటములోని స్త్రీయొక్క బొమ్మకు మషీ కుసుమాది రంగులు ఎలాంటివో జీవించిఉన్న స్త్రీకికూడ కేశోష్ఠాదులుకూడా అలాంటివే-బెల్లము యొక్క తీపితనమును అనుభవించిన బెల్లానికిగాని అనుభవసాధనమయిన జిహ్వకుగాని, అనుభవించు దేవదత్తాదులకుగాని, ఎన్నిప్రయత్నములు చేసిననూ మార్చుటకు సాధ్యముకాదు- అలాగే ఆత్మయొక్క శాన్తికానందానుభవం కూడా అలాగే అన్యథాకరణం (వేరుపరచుటకు) సాధ్యంకాదు- కనుక ఒకమారు అనుభవించిపడే మారకపోతే ఎల్లప్పుడూ తదేక వ్యసనంతో అనుభవించబడుచున్నదానిని మార్చుటకు వీలుకాదని వేరుగ చెప్పనేల? పరపురుషునియందు గట్టి వ్యసనంగల స్త్రీ యింటిపనులలో వ్యగ్రురాలయినప్పూ, మనస్సులో పరపురుష సంగమామృతమనే (పరసంగరసాయమునే) ఆస్వాదిస్తూ ఉంటుంది- అలాగే శుద్ధమయిన పరతత్త్వమునందు విశ్రాంతి చెందినవానిని ఇంద్రాది దేవతలుకూడా కదల్చలేరు- పరపురుషునియందు వ్యసనంగలస్త్రీని లోకంలో యెంతబలవంతుడయిన భర్త అయినా ఆమె సంకల్పములోని కాంతుని తోటి సంగమసంతోషమునుండి మరల్పగలిగాడా? అలాగే ఆత్మానంద చిదాలోకమును అవలంబించియున్న తత్త్వవేత్తయొక్క బుద్ధిని ఎవడు మరల్పగలడు ? చూ॥ శివధర్మోత్తరఖండంలో- "శ్లో॥ జ్ఞానామృతరసో యేన సకృదాస్వాదితో భవేత్। విహాయ సర్వకార్యాణి మనస్తత్రైవ ధావతి ॥" ఒక్కమారు జ్ఞానామృతరసాన్ని ఆస్వాదిస్తే మనస్సు అన్ని పనులూ విడిచిపెట్టి అక్కడకే పరుగెత్తుతుంది అని- స్త్రీలోకము క్షణం తీరకలేకుండా యింటిపనులు నెత్తినపడ్డా, అత్తమామలూ, భర్తా, యెన్నివిధాల కనిపెట్టిఉన్నా పరపురుషునందు వ్యసనంకలిగే ఉంటుంది- అలాగే అవిద్యాదోషము లేనివాడు ఎంతటి వ్యవహార ప్రపంచంలో ఉన్నా లోపల ఆత్మానందాన్ని అనుభవిస్తూనే ఉంటాడు- ఇందులో సప్తమభూమికలో ఉన్నవానికి శరీరం తెగకోసినా కోసినట్లుకాదు- కంట నీరుకారుచున్నా ఏడ్చినట్లుకాదు. దేహము నశించినా తగలపెట్టబడిన

వాడుకాడు- నశించినా నశించినవాడుకాడు- ఇలాంటివానికి (సప్తమ భూమికను అభిషేకించినవానికి) యెన్ని ఆపదలువచ్చినా, యెన్ని సంపదలు వచ్చినా హర్షశోకములతో ఏమాత్రమూ అంటడువాడు-

## ౭౫. ముక్తాముక్తవిచారము.

వసి॥ రామా! జనకమహారాజు తత్త్వజ్ఞుడై చాలకాలం రాజ్యం పాలించాడు. రాజ్యవ్యవహారమును చూచుకున్నాడు. కాని ఏమాత్రం మనోవ్యాకులత చెందలేదు. నీతాత దిలీప మహారాజుకూడా అన్ని పనులు చూచుకుంటున్ననూ, వీతరాగుడుగానే రాజ్యం అనుభవించాడు చాలకాలం. నిర్లిప్తుడుగా ప్రజాపాలనచేశాడు- మాంధాత విచిత్ర బలముగల సైన్యముతో యుద్ధంచేశాడు- రాజ్యమేలాడు ముక్తిపొందాడు- బలిచక్రవర్తి పాతాళపీఠంలో నిజంగా వ్యవహారదశలో ఉన్నవాడువలె కనిపిస్తూ నిరాసక్తుడై జీవన్ముక్తునివలె ఉన్నాడు- నముచి అనే దానవేశ్వరుడు దేవతలతో ద్వంద్వయుద్ధంచేస్తూనే ఉన్నాడు- దేవదానవుల ఆచారాలను విమర్శిస్తూనే ఉన్నాడు. కాని మనస్సులో ఏమాత్రం పరితాపమును అనుభవించలేదు. నిర్లిప్తుడుగానే ఉన్నాడు- దేవేంద్రునితో యుద్ధమాడి శరీరము త్యజించిన వృత్రాసురుడు మనస్సులో శాంతుడుగానే ఉన్నాడు- పాతాళతలపాలకుడయిన ప్రహ్లాదుడు నిరపాయంగా దానవకార్యాలు చూచుకుంటూనే చెప్పనలవికాని ఆనందం అనుభవించాడు- మాయయే ప్రధానముగాగల శంబరాసురుడు కూడ సంసారమాయను విడిచియే వ్యవహరించాడు- నిస్సంగుడుగానే ఉండి విష్ణుమూర్తితో యుద్ధమాడి కుశలుడనే రాక్షసుడు తత్త్వజ్ఞానమును పొంది శరీరత్యాగం చేశాడు- సకలదేవతలకు ముఖప్రాయుడయిన అగ్నిహోత్రుడు క్రియాజాలమును నెరవేర్చుచూ యజ్ఞలక్ష్మిని చిరకాలం అనుభవించాడు- తుదకు ముక్తిపొందాడు- దేవతలతో సమానంగా సోమపానముచేసినా లోపల దానిని బ్రహ్మానందరసమునుగా భావించి సుఖదుఃఖాది సంబంధమునుపొందలేదు- దేవగురువయిన బృహ

స్మృతి భార్యకొరకు చంద్రునితో యుద్ధమాడినవాడయినా దేవతలకు పౌరోహిత్యమును చేస్తూవున్నా ముక్తుడయినాడు- ఆకాశమున ప్రకాశించే శుక్రుడు రాక్షసులకు నీతిశాస్త్రాన్ని రచించి నిర్వికారుడుగానే కాలంగడిపాడు- సర్వసంచారియగు వాయువు సకలభూతములను సంచలింపజేస్తున్న వాడయినా తుదకు ముక్తుడయినాడు-

బ్రహ్మదేవుడు ప్రాణులను ఉత్పాదనోపాయములను వారి వారి కర్మానుసారము సృష్టిశక్తి జ్ఞానముకలవాడయియున్నవా ద్విపరార్థ కాల విస్తీర్ణమును సమతాబుద్ధితోనే గడిపాడు- ముక్తిపొందాడు- కృష్ణుడు (విష్ణువు) ఎన్నో యుద్ధాలు చేశాడు- జరామరణాలు అనుభవించాడు- అయినా ముక్తుడుగానే ఉన్నాడు- ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాముకునివలె భార్యను (పార్వతిని) తన శరీరంలో సగభాగాన ధరించాడు- అయినాముక్తుడే- శివుని మెడలోని ముత్యాలహారమువలె ధరించియున్నా పార్వతి ముక్తురాలే- ఇలా భృంగీశుడు (శివగణములో ఒకానొకడు) తన రక్తమాంసమును తనతల్లికి కోసియిచ్చాడు- శివధ్యానపరుడై ముక్తిపొందాడు- కుమారస్వామి తారకాసురునితో యుద్ధమాడినా ముక్తిపొందాడు- నారదుడు కలహకౌతుకంతో ప్రపంచమంతా సంచరించినా ముక్తుడే- విశ్వామిత్రుడు జీవన్ముక్తుడుగా నుండే యజ్ఞయాగాలు చేశాడు-

ఆదిశేషుడు భూమిని ధరిస్తున్నాడు- సూర్యుడు పగటికాలం తయారుచేస్తున్నాడు- యముడు ప్రాణులను శిక్షిస్తున్నాడు- వీళ్ళందరూ జీవన్ముక్తులే- ఇంకా చాలామంది ఈ త్రిభువనంలో యక్షసురాసుర నరులు సంసారంలో ఉన్నారు ముక్తిపొందారు-

మరికొందరు సంసారంలో యుద్ధ, వధ, బంధాది, విచిత్రాచారాలలో ఉండికూడా మనస్సు ప్రశాంతంగా (అసంసక్తంగా) ఉండటంచేత రాతివలె మూర్ఖులుకూడా ముక్తిపొందారు- మరికొందరు పరప్రబోధను (తత్త్వజ్ఞానమును) పొంది చిత్తవిక్షేపము లేకుండుటకు అడవికి

వెళ్ళారు- భృగు భరద్వాజ విశ్వామిత్ర శుకాదులు- జనక యయాతి మాంధాతృ,సగరాదులు, ఛత్రచామరధారులై రాజ్యాలలో నేఉన్నారు- కొంతమంది ఆకాశమున నక్షత్రమండలంలో ఉన్నారు-బృహస్పతి,శుక్ర, చంద్రసూర్యాదులు- మరికొందరు దేవతాధికారాన్ని పొంది విమానారూఢులై స్వర్గంలో ఉన్నారు అగ్ని, వాయు,వరుణ, యమ, తుంబుర, నారదాదులు, బలి, సుహోత్ర ప్రహ్లాదుడు మున్నగువారు పాతాళకుహరంలో జీవన్ముక్తులుగా ఉన్నారు- తిర్యగ్జాతులలో కూడా గరుత్మంతుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలయినవారు కృతబుద్ధులు (జ్ఞానులు) ఉన్నారు- దేవతలలో కూడ ప్రాజ్ఞులు కొంతమంది మూఢులుగా ఉన్నారు- ఈశ్వరశక్తి సర్వత్ర సర్వదా సర్వభావంతో ప్రసరిస్తూ ఉంటుంది- (సంభవిస్తుంది) విధియొక్క విచిత్రమయిననియతి సన్నివేశ విశేషంచేత ఎన్నిపనులనయినా జరుపగలదు. ఆవిధి దైవమనీ, బ్రహ్మమనీ, సర్వేశ్వరుడనీ, శివుడనీ, ఈశ్వరుడనీ, వివిధ నామములతో చెప్పబడుతున్నాను- ఈపేరులన్నీ మనయొక్క ప్రత్యక్చైతన్యమునకే కాని యితరమునకుగాదు. ఇసుక రేణువులలో సువర్ణం ఉంటుంది- అలాగే అవస్తువులో వస్తువు (పరమార్థమగు ఆత్మతత్త్వము) ఉంటుంది- వస్తువులో అవస్తువుకూడా ఉంటుంది- బంగారు కణములలో మలము (మాలిన్యము) (ఇతర లోహముయొక్క కలియిక) ఉన్నట్లు- అయుక్తమయినదానిలో యుక్తితో విచారించిచూస్తే యుక్తత ఉంటుంది చూడు చిత్రం- పాపము అత్యంతాయుక్తమయినదికదా! అందులోకూడ కొంతగుణంఉంది- అది ఫలావస్థలో భయంకరమై పురుషుణ్ణి ధర్మమార్గంలో ప్రవేశపెటుతుంది- యుక్తితో విమర్శిస్తే ఇద గొప్పగుణముకదా! దానికి- అలాగే అసత్యంలో శాశ్వతమయిన సత్యముఉన్నది- ప్రపంచం అంతా అసత్యమనే భావనతో ధ్యానంచేస్తే తుదకు ధ్యానసాక్షిఅయిన స్వప్రకాశాత్మతత్త్వం సంప్రాప్తమవుతుంది. దేశకాలములయొక్క విలాసంచేత లేనిదికూడా పుటుతుంది- శాంబరమాయాసృష్టిలో తోడేళ్ళకుకూడా కొమ్ములు మొలుస్తాయి- వజ్రా

యుద్ధమువలె దృఢంగా కనిపించేవికూడా కల్పాంతము వచ్చేసరికి చంద్రుడు, సూర్యుడు, భూమి, కొండలు, మొదలగునవి లేకుండా పోతాయి.

కాబట్టి రామా! ఈదృష్టిని మనస్సులో పెట్టుకొని చావుపుట్టు కలు దేశకాలవిలాసాలని గ్రహించి హర్షామర్ష విషాదేహాలను(సంతోష క్రోధదుఃఖ చేష్టలను) విడు. సర్వసమత్వంతో ఉండు. ఉన్నది లేనట్లు భాసిస్తుంది. లేనిది ఉన్నట్లు భాసిస్తుంది. కనుక వాటియందు అవగా నాదరాలుంచవద్దు విదేహముక్తిలో తత్త్వజ్ఞానం పూర్తిగా నశి స్తుంది. కనుక మరలి సంసారప్రాప్తి లేదు. జీవన్ముక్తితో మాత్రం అజ్ఞానం కార్యకారి కాకున్నా సంస్కార మాత్రంగా ఉంటుంది. ముక్తి అనగా మరచిన మెడలోని హారమును స్మరించినట్లు క్రొత్తగా పొంద నదేమీ లేదు ముక్తిలో. వివేకం ఉంటే ముక్తి సులభము. అది లేకపోతే దుర్లభమవుతుంది. కనుక మనోనాశమును చేసికొని వివేక మును అలవరచుకో. ముక్తిని గోరువాడు ఆత్మావలోకనముకొరకు ప్రయత్నించాలి. ఈకాలంలోకూడా సుహోత్రుడు, జనకుడు, మొదలయినవారు, వీతరాగులు, నిరభిమానులు, జీవన్ముక్తులు, మహాను భావులు ఉన్నారు.

కనుక రామా! నీవుకూడ వివేకవైరాగ్యాలు సంపాదించుకొని, జీవన్ముక్తుడుగా విహరించు. లోష్టాశ్మకాంచనములను సమానంగా చూచుకో.

దేహధారులకు ముక్తి అనేది రెండురకాల కనిపిస్తోంది. సదేహ ముక్తి, విదేహముక్తి, అని. వాటివిభాగం చెబుతాను. ముందు ఈరెంటియందూ సాధారణంగా ఉండే ముక్తి చెబుతాను. పదార్థ ములమీద సంసక్తి (అనురాగము) లేక, మనశ్శాంతితో ఉండటం ముక్తి. ఇలాంటిముక్తి దేహంఉన్నా లేకున్నా సంభవిస్తుంది. ప్రేమ పూర్తిగా లేకపోవుటయే ఉత్తమకైవల్యము. అది దేహము ఉన్నా

ఓడ వడప్రవాహుండగా ఈ సంసారసాగరమునుండి యెవడు దాటడో ఛీ వాడు ఉండియేమి ప్రయోజనము ? తత్త్వజ్ఞానంచేత సంసారసాగర మును బాధించుకొని సర్వమును బ్రహ్మభావంతో చూస్తూ సంసార సముద్రంలో ప్రవేశించినవాడు మగవాడు- సజ్జనులతో తత్త్వవిచారం చేసి, రామా ! తత్త్వజ్ఞానం సంపాదించి తర్వాత ఈ సంసారంలో క్రీడిం చటం బాగుంటుంది- రామా ! నీవు ధన్యుడవు- ఈచిన్నవయస్సులోనే సంసార విచారమును ప్రారంభించావు- నీవలె మొదట సంసారమును విచారించి, అతిమనోహరమయిన తత్త్వజ్ఞానం సంపాదించి, ఆవల అందులో ప్రవేశించినవాడు అందులో మునిగిపోతాడు- తత్త్వవిచారము చేయక పూర్వభోగాలను ఉపేక్షించాలి- (అనుభవించకూడదు)తత్త్వ జ్ఞానం కలిగిన తరువాత, అసంగబుద్ధితో సేవించాలివాటిని- గరుత్మం తుడు అమృతాహరణమునకు పూర్వము పాములను భక్షించేదికాదు- తరువాత తల్లియొక్క శాపమోచనమయిన పిదప నిశ్శంకంగా భుజి స్తోంది- అలాగే ఈ సంసారభోగాలనుకూడా చూడాలి. తత్త్వవిచారణ చేసిన తరువాత సేవించిన ప్రపంచభోగాలు ముందుకాలంలో పురోభి వృద్ధిని యిస్తాయి- మిగిలినవి కేవలం దుఃఖకరములే- తత్త్వదృష్టి కలవానికే బలము, బుద్ధి, తేజస్సు, వృద్ధిచెందుతుంది- రామా ! నీవు తెలిసికోవలసిన తత్త్వాన్ని తెలుసుకున్నావు కనుక చంద్రునివలె మనోహరంగా ప్రకాశిస్తున్నావు- అన్నారు వసిష్ఠులు-

## ౭౭. జీవన్ముక్త స్వరూపవర్ణనము.

శ్రీరా॥ మహర్షీ ! జీవన్ముక్తుల వృత్తాంతం చాలసార్లు చెప్పారు. విన్నారు- కాని తృప్తి తీరలేదునాకు. మళ్ళీ ఇంకొకసారి చెప్పండి- అయినా మీమాటలు విన్నకొద్దీ వినాలనిపిస్తాయి- ఇదేంచిత్రమో తెలియకుంది- అన్నాడు శ్రీరాముడు-

వసి రామచంద్రా ! జీవన్ముక్తుల లక్షణములను (గుణములను) అనేకసారులు చెప్పానునేను- మళ్ళీ చెబుతావిను- దృశ్యప్రపంచంలో

నిదురించినవానివలె ఉంటాడు- జీవన్ముక్తుడు- ఏషణాత్రయం ఉండదు.
పరమార్థదృష్టిలో ప్రపంచం లేనట్లే భావిస్తాడు- నిత్యానందంలో
ఉంటాడు- చేతపుచ్చుకున్న వస్తువునుకూడా బుద్ధిలో గ్రహించడు-
ఎల్లప్పుడూ అంతర్ముఖుడుగానే ఉంటాడు- ప్రజల వ్యవహారం అంతా
యంత్రపు బొమ్మల చరిత్రలాగ పరిహసిస్తాడు- గడచిన దానిని స్మరిం
చడు- రాబోవుదానిని కోరడు- వర్తమాన వస్తువును ఆదరించడు.
వ్యావహారిక ప్రపంచంలో నిద్రించిఉన్నా ఆత్మవిషయంలో మేలుకొనే
ఉంటాడు- వ్యవహారవిషయంలో ప్రబుద్ధుడుగా (మిక్కిలి కుశలుడుగా)
ఉన్నా ఆ కౌశలముయొక్క (ఆ నేర్పరితనముయొక్క) ఫలాన్ని కోరడు
కనుక నిద్రించినవాడుగానే ఉంటాడు- లోపల దేనిమీదనూ ఆశ
ఉండదు- బయటికి ఎన్నిపనులు చేస్తున్నా చేయనివానివలె ఉంటాడు.
కోరిక లేకుండా శరీర వర్ణాశ్రమోచితమయిన కర్మలను, రాజ్యాదిబంధు
కార్యములను చేస్తూ ఉంటాడు- దేనిని అనుభవించినా భోక్తృత్వాభి
మానం ఉండదు- ఏపనిచేసినా కర్తృత్వాభిమానమూ ఉండదు.
అన్నిటియందూ ఉదాసీనుడు- రాగద్వేషాలూ హర్షశోకాలూ ఉండవు.
అసంసక్తమయిన చిత్తంతో భక్తునియందు భక్తసమాచారుడుగానూ,
శత్రువుయందు శత్రుడుగానూ ఉంటాడు- బాలులలో బాలుడు- వృద్ధులలో
వృద్ధుడు- దుఃఖించువారిలో దుఃఖించువాడు- ధీరులలో ధైర్యవం
తుడు- యువకులలో యువకుడు- నోరు తెరచిమాట్లాడితే పుణ్యకథలే
మాట్లాడుతాడు- దైన్యం ఎరుగడు నిత్యానందుడు- ప్రసన్నమధురుడు-
ప్రతిభాపూర్ణుడు- ఖేదరహితుడు- అందరికీ ప్రియుడు- అతని సాంగత్యం
చేత అన్నితాపాలు పోగొట్టుతాడు- పుణ్యంతో పనిలేదు- భోగాలతో
పనిలేదు. కర్మలతో పనిలేదు- పాపములతో పనిలేదు- భోగత్యాగము
లతో పనిలేదు- బంధువులతో పనిలేదు- కర్మారంభములతో పనిలేదు-
నిష్కర్మతో పనిలేదు- బంధమోక్షములతో పనిలేదు- స్వర్గపాతాళ
లోకాలతో పనిలేదు- ప్రపంచమందు అద్వితీయాత్మభావముతో ఉం
టాడు- బంధమోక్షములగూర్చి మనస్సు కార్పణ్యమును చెందదు-

ఏమిటని వాని అభిప్రాయము- నీటిలో తరంగచలనమువల్ల చలించే నురుగురాశికి ఒకచోట స్థైర్యంలేదు- ఈ భ్రాంతిక్రమానికి కూడా సంసారభ్రమణం స్థైర్యంలేదు- ఇందులో సుఖదుఃఖప్రసక్తి అసంభవం- ప్రాతిభాసికమయిన యీ ప్రపంచదృష్టి స్వప్నంవంటిదాన్ని అవలంబించిఉన్న జీవన్ముక్తులు పుట్టరు- చావరు- దుఃఖించరు- సుఖించరు- రాత్రిపూట ఒక్కక్షణకాలంలో వచ్చిపోయే స్వప్నములు ఎలాంటివో ప్రపంచధర్మాలు కూడా ఆత్మయందు అలాంటివే అని చూస్తూ ఉంటారు జీవన్ముక్తులు. ఎప్పుడూ చావుపుటుకలలు గల ఈ పాపిష్టి సంసారంలో కాఠిన్యం ఏమిటి? ఆనందం ఏమిటి? అన్నాని అభిప్రాయము- జీవన్ముక్తులదృష్టిలో శుభకర్మఫలములనేవి ఉంటే, అవి పోయినందున దుఃఖపడవలసిన ప్రసక్తి ఉండేది- వాళ్ళదృష్టిలో శుభకర్మఅనేదే లేదు. కనుక హర్షవిషాదములకు ప్రసక్తి లేదు- దుఃఖదశ అనేది సుఖదశయొక్క అవసానంలో వుంటుంది. స్వకార్యములయిన శోకమోహాదులను కలిగిస్తుంది- ఇదీ దీనిక్రమం- ఈస్థితిలో జీవన్ముక్తుని దృష్టిలో శుభకర్మలేదు. కనుక దానికి అవసానంలేదు. కాబట్టి దుఃఖదశలేదని భావము. పుణ్యాపుణ్యములులేవు కనుక సుఖదుఃఖములులేవు. సుఖదుఃఖములులేవుకనుక హేయోపాదేయములులేవు (గ్రహించతగినవీ త్యజింపతగినవీ లేవు.) ఇవిలేవు కనుక కోరతగినవీ కోరతగనివీలేవు. రమ్యారమ్యములనేవి లేవుకనుక భోగవాంఛ నశించింది- కనుక నైరాశ్యము (నిరాశత్వము) ప్రౌఢమయింది- (గట్టిపడింది) మంచు కరగినట్లు క్షీణించి పోయింది మనస్సు- నువ్వగింజలే తగలపడిపోతే యింకనూనె ఎక్కడనుంచి వస్తుంది వాటినుంచి- కాబట్టి రామా! ఆత్మవ్యతిరిక్తము బొత్తిగాలేదను నిశ్చయంకలిగి దృశ్యపదార్థములందు, సంకల్పవికల్పాలునశిస్తే జ్ఞాని నిత్యతృప్తుడగుచూ స్వరూపానందంతో, ప్రారబ్ధక్షయపర్యంతమూ జాగ్రత్స్వప్నములందు యథాప్రాప్తములయిన వస్తువుల ఆలోచనమాత్రంతో ఉంటాడు- అవి లయిస్తే సుషుప్తిలో నిద్రిస్తూ ఉంటాడు-

70)

## ౭౮. యోగవర్ణనము.

వసి॥ రామా! రాత్రిపూట కొరివిదయ్యం తిరుగుతూఉంటే అగ్నిచక్రమనే భ్రాంతికలుగుతుంది- నీరు తొందరగా గిరగిరతిరిగితే సుడిగుండమనే భ్రాంతికలుగుతుంది- ఆకాశమువంకచూస్తే పిచ్ఛాకారంగా కనిపిస్తుంది- మరొకచోట ముత్యములరాశిగా కనిపిస్తుంది- ఇంకొకచోట వెంట్రుకలకొప్పుగా కనిపిస్తుంది- ఇలాగే చిత్తస్పందము వల్ల ప్రపంచం కనిపిస్తోంది- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ మహర్షీ! ఈచిత్తము (మనస్సు) దేనివల్ల చలిస్తుంది? దేనివల్ల చలించడం మానుతుంది- అది చెప్పండినాకు. ఆ దేకదా దీనికి చికిత్స- అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామా! తెలుపూ, మంచూ, తిలలూ, తైలమూ, పుష్పము పరిమళమూ, నిప్పూవేడీ, ఇవి విడదీయుటకు వీలులేకుండ కలిసి ఉన్నట్లు చిత్తస్పందములు రెండూ కలిసిఉన్నవి- వీటిరెంటికి భేదము కల్పితము- మిధ్య- చిత్తము, చిత్తపరిస్పందము, ఈ రెంటిలో ఏ ఒక్కటి నశించినా రెండునశిస్తాయి- గుణి గుణముల రెంటిలో, గుణి నశించినా గుణమునశిస్తుంది- గుణమునశించినా గుణి నశిస్తాడు- ఇందులో నీకు సందేహం అక్కరలేదు. కనుక చిత్తస్పందములకు భేదమనే అంశమే కల్పితము- అభేదమనేది వాస్తవము- కనుక మనస్సు జీవించి యుండగా దాని స్పందము నశించదు- కనుకనే రామా! శాస్త్రమునందు చిత్తనాశమునకు యోగము, జ్ఞానము అని రెండుక్రమములు (ఉపాయములు) చెప్పబడ్డాయి- అందు యోగమనగా చిత్తనిరోధము- జ్ఞానమనగా సమ్యగ్ వేక్షణము (యథార్థవస్తువును తెలిసికొనుట)-

శ్రీరా॥ మహర్షీ! యోగమన ఎలాంటిది? అదెప్పుడు ఎలా ఆచరించాలి? ప్రాణాపానవాయునిరోధము యోగమని అంటారు- దానివిధానము ఎలా? ఇది శాశ్వతసుఖము నిచ్చునా? అన్నాడు శ్రీరాముడు-

వసి॥ ఈసర్గ చివరివరకు ఈప్రశ్నకు సమాధానము చెప్పదలచి చిత్తచలనము ప్రాణవాయువు యొక్క చలనమీాద ఆధారపడి యుండు నని చెప్పుచున్నాడు. అందుకొరకు ప్రాణవాయువుయొక్క స్వరూపాన్ని నిరూపిస్తారు మొదట వసిష్ఠుడు. రామచంద్రా! నేలమీాద ప్రవహించే నీరు నేలనుగల ప్రతిగుంట (తొర్ర) లోను ప్రవేశించి అవి నిండిన తర్వాత ప్రవహిస్తూ ఉంటుంది- అలాగే దేహంలో 72 ప్రధాననాడు లున్నాయి- అందు ప్రతినాడికి 72, 72 చిల్లరనాడులు కలవు. వాటి అన్నిటియందూ నిండా (అంతటా) ప్రాణవాయువు సంచరించుచుంటుంది. ఆ ప్రాణవాయువుయొక్క చలనముచే ఆయాస్థానములందు జరిగెడి పని భేదమునుబట్టి దానికే అపానాదిపేరులు పెట్టబడినవి- పరిమళమునకు పుష్పము ఆధారము. తెలుపు తనమునకు మంచు ఆధారము- అలాగే చిత్తమునకు ప్రాణవాయువు ఆధారం- నీటి దృష్టాంతమునుబట్టి ప్రాణ మునకు రసమనికూడ పేరుకలదు. "అపోమయః ప్రాణః" "ప్రాణోవా అంగానాంరసః" ఇత్యాదులు కూడ ప్రమాణములు- లోపలి ప్రాణవా యువుయొక్క పరిస్పందంవల్ల సంకల్పమున కభిముఖమయిన సంవిత్తును చిత్తమని అంటారు- ప్రాణచలనమువల్ల చైతన్యముయొక్క చలనము వలన చిత్తచలనము. (అనగా చిత్తమునకు విషయాకారమును పొందుట యను వృత్తికలుగుట) కనుక శాస్త్రరహస్యమును తెలిసినవారు ప్రాణ వాయువున కధీనమై చలించునట్టిదే చిత్తమని అంటారు- అందుచేత ప్రాణ వాయువును నిరోధిస్తే చిత్తము నిరోధింపబడుతుంది- మనశ్చాంచల్యము నిరోధింపబడితే సంసారబంధము తగ్గిపోతుంది- సూర్యాలోకము తగ్గితే లోకవ్యవహారము తగ్గుతుంది- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ మహర్షీ! శరీరమనే కొంపలో హృదయాది స్థానము లందు డెబ్బదిరెండువేల నాడులలోను, ముఖనాసికాది గోళకము (ఛిద్రము) లందునూ సంచరించెడి స్వభావముగల ప్రాణాదివాయువులను నిరోధించడం ఎలా చెప్పండి! అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! ప్రాణస్పందనిరోధమునకు రాజయోగమునకు సంబంధించిన ఉపాయాలు చెబుతానువిను- ఈరాజయోగము సాలంబనమనీ, నిరాలంబనమనీ, రెండురకాలు. వీటినే సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతమూ అని అంటారు- శాస్త్రాభ్యాసమూ, సజ్జనసహవాసమూ, వైరాగ్యాభ్యాసమూ, ఈమూటిచేతను లోగడి సంసార వ్యవహారములందు నిరాదరణను దృఢపరచుకుంటే ప్రాణస్పందము నిరుద్ధమవుతుంది-

2. ఏదో ఒక తత్త్వమునందు (అనగా మొట్టమొదట స్థూలమైయున శిఖరమునందుగాని, చంద్రబింబమునందుగాని, మణిదేవతామూర్త్యాదులందుగాని ఎక్కడ పీడిమనస్సు రమిస్తే అక్కడ మనస్సును ఏకాగ్రపరచి ఏదో ఒకతత్త్వమును గట్టిగా అభ్యసించినందున ప్రాణస్పందము నిరోధింపబడుతుంది-

3. ఇక మరీ మొండి చిత్తము (మనస్సు) అయ్యేయెడల పూరక కుంభక రేచకాది క్రమంతో ఏకాంత ధ్యానమును అభ్యసించి ప్రాణమును నిరోధించాలి.

4. ఓమ్ అను ప్రణవమును ఉచ్చరించుటను అలవాటుపరచుకొని, తుదకు ఆ ప్రణవముయొక్క తురీయమాత్రయందు చిత్తమును నిల్పి ధ్యానాభ్యాసము చేసినచో ప్రాణస్పందము నిరోధింపబడును.

5. కేవల రేచకముచే లోపలి ప్రాణవాయువునంతయును బయటికి పంపి, దీర్ఘకాలము శరీరావయవములందు వాయుసంచారము లేకుండా అభ్యసించే యెడల ప్రాణస్పందము నిరోధింపబడుతుంది-

6. కేవల పూరకముచే శరీరమంతయును వాయువుతో పూరించి కొండమీది మేఘములవలె పూర్తి అగువరకు మెల్లగా వృద్ధిపరచబడినదగుచు ప్రాణవాయువు నిశ్చలమగుచుండగా ఇంక నేమాత్రము నాసారంధ్రములందు గాలి స్పృశించకుండా చేస్తే ప్రాణస్పందము నిరోధింపబడుతుంది-

7. ఇట్లే కుంభకమునందు పూరకానంతరము పూర్ణకుంభమును వలె (నిండుకుండ యందలి నీరువలె) చాలకాలము వాయువు (ప్రాణ వాయువును) కదలకుండ చేస్తే (అనగా ప్రాణమును శరీరములో స్తంభింప చేస్తే ప్రాణవాయువు నిరుద్ధమవును. ఈ చెప్పబడిన రేచకపూరక, కుంభక, ప్రాణాయామ, క్రమము, పాతంజలయోగశాస్త్రమునందు జెప్పబడినది— "తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః" అను సూత్రముతో ఆరంభించి, ఆసనజయము కుదిరిన తరువాత శ్వాసప్రశ్వాసలనడక లేకుండ జేయుటయను ప్రాణాయామము అభ్యసింపవలెను— శ్వాసయనగా బాహ్యవాయువును లోపలికి పీల్చుట— ప్రశ్వాసమనగా లోపలివాయువును బయటికి వెళ్ళగొట్టుట— ఈ రెంటినీ (శ్వాస ప్రశ్వాసముల రెంటినీ) లేకుండ జేయుటయే ప్రాణాయామము— ఈయది బాహ్యవృత్తి, అభ్యంతరవృత్తి, స్తంభవృత్తి అని మూడు విధములుగా ఉండును— ఇందు ప్రశ్వాసపూర్వకమగు గతినిరోధము మొదటిది— (అనగా లోపలివాయువును బయటికి పంపి గతినిరోధము చేయుట) బయటిగాలిని లోపలికి పీల్చి గతినిరోధము జేయుట (కదలకుండ జేయుట) రెండవది— ఒకే ప్రయత్నముచే నీ రెండు విధముల చలనము లేకుండ జేయుట మూడవది— ఇదియే స్తంభవృత్తి— ఈ మూడును దూదిపిండమువలె బయట చలించుటచేతను, లోపలనాభి మొదలగు స్థానములందు సంచరించుటచేతను దేశపరిదృష్టములనీ (దేశమునందు చూడబడునట్టివనీ) క్షణములయొక్క— ఇయత్తావధారణముచే (ఇన్నిక్షణముల కాలమును నిర్ణయముచే కాలపరిదృష్టములనీ, ఇంతటి సంఖ్యగల శ్వాసప్రశ్వాసకాలములచే తెలియబడుచు సంఖ్యాపరిదృష్టములనీ, చెప్పబడతాయి— వీటికే మృదు, మధ్య, తీవ్రములను దశలుకూడ ఉండును— ఇలా అభ్యసింపబడిన ప్రాణాయామము స్వచ్ఛమయిన దూది పిండమునుండి వెలువడు సన్నని దారమువలెను తామరతూడునుండి సన్నగాలాగిన దారమువలెనూ, దీర్ఘము, సూక్ష్మము అయిన ప్రాణ వాయువులచే దీర్ఘము సూక్ష్మములను నవస్థలను పొందును— ఇట్టి

ప్రాణాయామముచే చిదావరణము నశించును- మనస్సు ధారణ యోగ్యమగును-

8. నోరు తెరచినవానికి జిహ్వామూలమునందు స్తనమువలె వ్రేళ్ళాడునట్లు కనిపించెడి ఘంటికను. (ఇంద్రియోనిని) బాగాచాచి మడిచి మూర్ధరంధ్రమునందు ప్రవేశపెట్టబడుచున్న నాలుకతో బిగబట్టి పీడించి) ప్రాణవాయువును బ్రహ్మరంధ్రమునందు ప్రవేశపెట్టి ధరించి యున్నచో ప్రాణస్పందము నిరుద్ధమగును.

9. ఈ వికారాలు యేవిలేకుండా సూక్ష్మమగు హృదయాకార మందలి సంవిత్తును నిర్వికల్పసమాధివల్ల లీనముచేయగా ప్రాణస్పందము నిరుద్ధమగును-

9. నాసాగ్రమునందు కంటిని మనస్సును నిరోధించుటవలన కూడ ప్రాణస్పందనిరోధము కలుగును-

10. లంబికా యోగమువలనగాక ఉపాయాంతరమువలన పన్నెం డంగుళముల పర్యంతమయిన బ్రహ్మరంధ్రస్థానమునందు చేరిన ప్రాణ వాయువు కదలికలేక స్థిరమయినచో ప్రాణస్పందము నిరుద్ధమగును-

11. ఇలాగే భ్రూమధ్యమున రెండు గుడ్లయొక్క వెలుగును (అనగా చక్షురింద్రియమును) చిరకాలము నిరోధించినను, జిహ్వాగ్రము నందు దృష్టిని నిరోధించినను, చిన్మాత్రస్వభావుడయిన పరమేశ్వరుని జీవాత్మనుగా తెలిసికొన్నను ప్రాణస్పందము నిరుద్ధమగును-

12. గుర్వనుగ్రహమువలనగాని, యీశ్వరానుగ్రహమువలన గాని తత్త్వజ్ఞానము కలుగగా వెంటనే చిత్తవికల్పములు ఉపశమించి మనోనిరోధము కలుగును-

13. దహరాకాశమునందు చాలకాలము చిత్తమును నిలిపి తత్త్వసాక్షాత్కారము చేసికొన్నను మనోనిరోధమగును- దీనినే పాతం జలయోగంలో ఇలాచెప్పారు- "హృదయే చిత్తసంవిత్స్వార్థసంయమా

త్పురుషజ్ఞానమ్" అని- ఇలా మనోనిరోధమునకు ఉపాయాలు చెప్పారు వసిష్ఠులు-

శ్రీరాముడు ఈకథ అంతా విన్నాడు- ఇతనికి హృదయశబ్దము యొక్క అర్థములో సందేహం కలిగింది- హృదయశబ్దము పుండరీకాకారమయిన మాంసపిండమునందూ, మనస్సునందూ, పరమాత్మయందూ ప్రయోగింపబడుతోందికదా! వసిష్ఠులు ఏఅర్థంలో హృదయశబ్దమును ప్రయోగించారో తెలుసుకోవాలనుకున్నాడు- బ్రహ్మర్షీ! హృదయశబ్దానికి మీ అభిప్రాయములో అర్థమేమి? చెప్పండి అన్నాడు- వసిష్ఠుడు శ్రీరాముని సందేహంలోని మూడు విభాగములను రెండుగానే భావించాడు సమాధానం చెప్పుటకు ఆరంభించాడు-

వసి॥ రామా! ప్రాణులయొక్క హృదయము రెండేవిధములు. ఉపాదేయము, హేయము, అని (అనగా గ్రహింపతగినది. విడువతగినది అని) ఈ రెండు విభాగములనుగూర్చి చెబుతానువిను- పరిచ్ఛిన్నమయిన మానవశరీరంలో వక్షస్థలమునకు లోపలనున్న హృదయము హేయ హృదయము. ఇదే పుండరీకాకారమయిన మాంసపిండమనీ, మనస్సు అని చెప్పబడుతుంది- ఇది శరీరంలో ఒకమూలనున్నది- "హృది+అయం" హృదయం" అను వ్యుత్పత్తిచే పరమాత్మవాచకమయినది మరొక హృదయశబ్దము- ఈహృదయము ఉపాదేయము- (గ్రహింపతగినది) ఈ హృదయము (అనగా పరమాత్మ) లోపలా వెలుపలా నుండును. బాహ్యమునందు మాత్రమే ఉండదు- లోపలమాత్రమే ఉండదు- ఇదే ప్రధానమయిన హృదయము- దీనియందే ద్యావాపృథివ్యాది ప్రపంచమంతా నిలచియున్నది- సకల పదార్థములు ప్రతిబింబించుటకు ఆదర్శము (అద్దము) ఇదే- సర్వ సంపదలకు కోశము- సకల జంతువుల సంవిత్ (చైతన్యమే) హృదయమనబడును. ఇంతేకాని శరీరావయవములలో నొక భాగమయిన మాంసమయపిండము హృదయముకాదు. ఇది జడము- రాయివంటిది-

కనుక రామా! సంవిత్తన్మయమయిన శుద్ధహృదయమునందు (పరమాత్మయందు) లోకవాసనలను విడిచి చిత్తమును బలాత్కారముగ నియమించినచో ప్రాణస్పందము నిరోధింపబడును- ఈ ఉపాయములచే కాని ఇంకా ఇతరమయిన ఆయా గురువులు నోటచెప్పెడి ఉపాయాంతరములచే కాని ప్రాణస్పంద నిరోధము కావచ్చును- అభ్యాసక్రమంచేత ఈ యోగములన్నీ నిరాబాధముగ భవఛేదనమునందు (సంసారనాశనమునందు) ఉపాయములు కాగలవు- అభ్యాసక్రమమును విడిచి హఠాత్తుగ నిరోధించే యెడల రోగాదిబాధలు తటస్థించును- ఈ మనోనిరోధమను యోగము అభ్యాసపాటవంచేత దృఢపడి వైరాగ్యముతో కూడినదగుచో మోక్షఫలమును ఇచ్చును- లేక భోగవాసనలతో మనస్సు నిండి యున్నదగుచో విచిత్రమయిన భోగఫలసిద్ధిని కలిగించును-

కనుకనే పాతంజలశాస్త్రమునందు భ్రూమధ్యాది స్థానభేదంచేత ధారణాభేదములు చూపబడినవి- నాభిచక్రమున ధారణచేస్తే కాయవ్యూహజ్ఞానమనీ కంఠకూపమునందు ధారణచేస్తే ఆకలిదప్పికలుండవనీ కూర్మనాడియందు ధారణచేస్తే స్థైర్యమనీ, (కుతుకయొక్క ప్రదేశమునందుండునది కూర్మనాడి) మూర్ధజ్యోతిః ప్రదేశమున ధారణచేస్తే సిద్ధదర్శనమగుననీ, ధారణాభేదము చేకొన్ని ఫలభేదములు చెప్పబడినవి- (మూర్ధజ్యోతిస్సు అనగా కపాలచ్ఛిద్రమునందు ప్రకాశించెడిజ్యోతిస్సు) ఈ సమాధిభేదములు ఆయాఫలసిద్ధుల విషయమై వికల్పబహులముగ (చాలవిధములుగ) ఉన్నను, పరమశాంతియే ఫలముగాగల నిష్కామునియొక్క సమాధివిషయంలో వికల్పభేదం లేదు- అభ్యాసయోగమువల్లనే మానవుడు ఆత్మారాముడవును- వీతశోకుడవును- అంతస్సుఖుడవును- కనుక రామా! యోగాభ్యాసమును ఆచరించుము- అభ్యాసయోగం చేత ప్రాణపరిస్పందము నశించగా మనస్సు శాంతి నొందు- ఆవల మిగులునది నిర్వాణమే- వాసనావిశిష్టమయిన మనస్సు జన్మ- వాసనారహితమయిన మనస్సు మోక్షము- నీకు ఏదియిష్టమయితే దానిని

పదార్థములన్నీ పరమాత్మయే కాని పరమాత్మకంటె భిన్నములు కావను నిశ్చయము సమ్యగవేక్షణము- (సమ్యగ్ జ్ఞానము) రామా! అసమ్యగ్ జ్ఞానమువల్ల జన్మ (బంధము) సమ్యగ్ జ్ఞానమువల్ల మోక్షము- అస మ్యగ్ జ్ఞానమువల్ల రజ్జుసర్పభ్రాంతి- సమ్యగ్ జ్ఞానమువల్ల తన్నివృత్తి- సంకల్పములూ, సంవేద్యములూ, లేని స్వయంప్రకాశ స్వభావమయిన సంవిత్తుయే (చైతన్యమే) ముక్తియందుండును- ఇతర మేమియు ఉండదు- శుద్ధరూపమయిన సంవిత్తు పరమాత్మయనియు, అశుద్ధ మయిన సంవిత్తు అవిద్యయనియు అంటారు పండితులు- చైతన్యమే విషయాకారమును చెందనది- ఈ రెంటికి భేదకల్పనభ్రాంతి ప్రపంచం అంతా పరిపూర్ణమయిన ఆత్మయను నిశ్చయమే- యథార్థమయిన ఆత్మజ్ఞానము- సర్వమూ ఆత్మే అయితే భావమేమిటి? అభావమేమిటి? బంధమేమిటి? మోక్షమేమిటి? ఇవి యెక్కడివి? ఎందుకు మూఢులు దుఃఖించటం? బ్రహ్మయే బృంహితాకారమై నటునివలె ఈదృశ్య ప్రపంచంగా వ్యవస్థితమై ఉన్నది- జ్ఞానముచే భేదభావమును రూపు మాపుకొని ఆత్మభావముతో ఉండునీవు- అధిష్ఠానమయిన సన్మాత్ర రూపంతో చూచేయెడల కట్టెకు, రాతికి, గుడ్డకు, ఏమీ భేదములేదు- అన్ని సద్రూపములే- దృశ్యప్రపంచము ఆద్యంతములందు లేనిది- నాశ రహితమయిన స్వరూపముకలదే వస్తువు- (యథార్థము) ఇదే ఆత్మ యొక్క రూపము- కనుక నీవు ఆత్మమయుడవగుము- స్థావరజంగ మాత్మక ప్రపంచమంతా నిరతిశయానంద బ్రహ్మరూపము- ఇందులో సుఖదుఃఖములకు ప్రసక్తియేది? కనుక స్తిమితంగా ఉండునీవు- శుద్ధా త్మను కౌగిలించుకొని(ఆధారపరచుకొని)లోపలకూడ అదేనిశ్చయంతో ఉండే మానవుని భోగములెట్లు బంధింపగలవు- ఆత్మవిచారము చేసెడి వానిని అంతశ్శత్రువులు ఏమీ చేయజాలరు- మందమారుతములు కొండను భేదింపజాలవు- నీరులేని చెరువులో కొంగలు చేపలను సులు వుగా పట్టుకుంటాయి- విచారరహితుణ్ణీ, ఆశాపాశబద్ధుణ్ణీ దుఃఖాలు అమాంతం మింగేస్తాయి- కనుక సర్వప్రపంచమూ ఆత్మే కాని అవిద్య

అనేది లేదు ఎక్కడా- ఈ దృష్టిలో నీవు మనస్థైర్యం చేసికో- ప్రపంచంలో ఆత్మకంటె వేరువస్తువు లేదు- అన్నికాలములలోను నీరేకాని నీటికంటె వేరుగ తరంగ ఫేన బుద్బుదాదులు లేవు. ఇలాంటి నిశ్చయము ప్రధానంగా గల పురుషుడు ఆత్యంతిక చిత్తనాశమునొంది ముక్తుడగును-

## ౯౦. దృశ్యదర్శన సంబంధము.

వసి॥ రామా! నేనికముందు చెప్పబోయే విమర్శనాదృష్టిని మదిలో భావించేవాడికి కంటిఎదుటనున్న భోగాలమీదకూడా కోరిక పుట్టదు- చక్షురింద్రియము (కన్ను) ఇష్టానిష్టములయిన రూపములను (వస్తువులను) ఆలోచిస్తుంది. దానిమీద "అహం" "నేను" అను అభినివేశపడతాడు జీవుడు- (అభిమానపడతాడని అర్థము.) అందుచేత జీవుడకు సుఖదుఃఖాలు కనిపిస్తున్నాయి- అసలు జీవుడు చక్షురింద్రియమునకు (కంటికి) నాయకుడే కాని చక్షురింద్రియమే తాను కాదు- ఈ విమర్శఉంటే జీవుడికి సుఖదుఃఖాలతో ప్రసక్తి ఉండదు-బరువును మోసే ఎద్దే ఆమోతవల్లకలిగే దుఃఖం అనుభవిస్తుంది కాని ఆబరువయినవస్తువునకు నాయకుడయి (అధిపతిఅయి) నవాడు ఆదుఃఖం అనుభవించడు- (అనగా మోసే ఎద్దుకే దుఃఖంకాని, దానిమీద వేసిన యజమానికి దుఃఖంలేదు.) పైగా జీవుడికి కేవలం కంటిమీదమాత్రమే "నేను" అను అభిమానం లేదు- పదియింద్రియములూ, శరీరమూ మనస్సులోని కామ కర్మాదివాసనలూ, ఈమొత్తముమీద "నేన"ను అభిమానం ఉంది- (అనగా జీవుడుకన్ను ఒక్కటే నేననుకోడు- మొత్తం శరీరం నేననుకుంటాడు- కాబట్టి చక్షురింద్రియమనేది యీ గ్రూపులో (మొత్తంలో) ఒకటి అయింది- కనుక ఈ ఒక్కదానికి అననుకూలమయిన వస్తువుతో సంబంధంకలిగినంత మాత్రాన జీవుడికి దుఃఖంతో ప్రసక్తి యేమి? రూపమును మాత్రంచూచే కన్ను అందులో నిమగ్నమయితే జీవుడికెందుకు ఇంతదుఃఖం? బరువుమోసేగాడిద బురదగుంటలో దిగపడితే సేనాపతికి

ఓ చిత్తమా! కన్ను విచిత్రమయిన రూపమును చూచిందనుకో- అది నదిలో నీటియొక్క చలనమువలె అనియతమయినది- మిథ్యాభూతమయినది- "ఇదిగోవు, ఇదిగుర్రము, ఇదిస్త్రీ, ఇదిపశువు" అని అనేక సుజాతి, దుర్జాతి, వికల్పాలతో కూడియున్నది- (అనగా కంటికి కనిపించే రూపాలలో కొన్ని మంచిజాతివి ఉన్నవి- కొన్ని హీనజాతివి ఉన్నవి) అన్ని కంటికి స్ఫురిస్తూ ఉంటాయి- ఇందులో నీకేమి పోయింది? ఎందుకు నీకింత అనురాగం? ఎందుకు నీకింత బాధ?

పోనీ కన్ను తానుచూచిన వస్తువును చిత్తమునకు (మనస్సుకు) అందించేసరికి చిత్తము ఆవస్తువుయొక్క ఆకారమును పొందిన దనుకుందాం- అయినా స్పర్శకు అభినివేశం పెంపొందుటకు అహంకారం కదా కారణము. దానికింత వ్యామోహపడుటకు కారణమేమి?

అహంకారమా! చిత్తమునందు (మనస్సునందు) రూపాదుల యొక్క ఆకారము స్ఫురిస్తే స్ఫురించుగాక. ప్రళయకాలసముద్రంలో చిన్నచాపవలె నీవెక్కడనుంచి గాయులుదేరవచ్చావు?

ఇదిగాక స్త్రీ పిండాది లక్షణమయిన రూపము (ఆకారము) సూర్యాదుల వెలుతురును ఆశ్రయించి ప్రకాశిస్తోంది. సూర్యాదుల వెలుతురుకూడా స్త్రీ పిండాదులను ఆశ్రయించుకొంటుంది- కనుక ఆ రెంటికీ అన్యోన్యసంబంధము కలిగేసరికి సౌందర్య భ్రాంతితో కామాది వికారాల చేత మనస్సుకు వ్యాకులత ప్రసిద్ధమయింది- లోకంలో ఇదికూడా మనస్సుకు (చిత్తమునకు) వ్యర్థమే- ఎందువల్ల అంటే- చిత్తమేమో లోపలఉండేది- స్త్రీ పిండమూ, సూర్యాదుల వెలుతురులూ, వెలుపల ఉండేవి- కనుక ఈ రెంటితోటి చిత్తమునకు సంబంధంలేదు- కాబట్టి చిత్తమా! నీకు వ్యాకులత అనవసరం- రూపము ఆలోకము (వెలుతురు) మనస్కారములు (మనోవృత్తులు) ఈమూడూ భిన్నదేశస్థితములుకనుక పరస్పరము సంబంధములేనివి- సంబంధము కలవాటివలె కనబడతాయి. ముఖము, అద్దము, ప్రతిబింబము, ఈమూడు కూడా అంతే. ఒకదాని

కొకదానితో సంబంధంలేదు. కాని అలాకనిపించవు సంబంధం ఉన్నట్టే గోచరిస్తాయి- ఇలా గోచరించటానికి అజ్ఞానమే కారణము. జ్ఞానంచేత అజ్ఞానం నశిస్తే ఇవన్నీ వేరే ఉండిపోతాయి. లక్కతో కర్రలు కలిసి నట్లు రూపాలోకమనస్కారములు మనఃకల్పనచేతనే పరస్పర సంబంధ మున్నట్లు గోచరిస్తాయి- మనస్సంకల్పమే మానవునకు బంధము- ఇది అభ్యాసయోగంచేతను తత్త్వవిచారంచేతను నశిస్తుంది- మందమధ్య మాధికారులకు యోగాభ్యాసపూర్వక తత్త్వవిచారం పనిచేస్తుంది- ముఖ్యాధికారులకు యోగాభ్యాసం అక్కరలేకుండగనే జ్ఞానోదయం కలుగుతుంది- అజ్ఞానభావన నశిస్తుంది- సడలిపోతుంది సంసారప్రవృత్తి- ముఖ్యాధికారికి అజ్ఞాననాశంచేత రూపా, లోక, మనోవృత్తులు నశిస్తే మరల ఎన్నటికీ కలియవు- అన్నిభూతములకు అంతరింద్రియమయిన మనస్సే బాహ్యేంద్రియములకు తెలివినిచ్చే గురువు- దాన్నిముందు నాశనం చెయ్యాలి- కొంపలో దయ్యం ఉంటే కొంపలో ఉన్నవాళ్ళకూ భయమే- ఆకొంపకు వచ్చేవాళ్ళకూభయమే- దయ్యాన్నివదలగొటితే ఎవరికీ భయం ఉండదు- చిత్తమా! వృథాగా ఎగిరిపడుతున్నావు నీవు- నీవినాశానికి ఉపాయం నేను ఆలోచించాను- ఆద్యంతములలో లేవునీవు- మధ్యలో మాత్రం మిణుకుతున్నావు-ఇదికూడా నీచావు కే- అయిదుయింద్రియములు తెచ్చికట్టిన శబ్ద స్పర్శ రూప రస గంధము లనే అయిదు ఆకారములు (వేషములు) వేసికొని లోపల నాట్యమాడు తున్నావు- నిన్ను అభిమానించి యెవడు “నాది” అని అనుకుంటాడో వాడిముందటనే నీనాటకం ఉపయోగించేది- అసంగోదాసీనచిదేకరసుడ నయిన నాముందర సాగదు- పాపిష్ఠి చిత్తమా! నీనాటకం (ఆట) చూస్తే నాకేమాత్రం సంతోషంగా లేదు- ఇంద్రజాలికం ఎలాంటిదో అలాంటిది నీబ్రతుకు- వృథాగా ఎగిరిపడి చస్తున్నావు- పాపిష్ఠిదానా! నీవుఉండు- పో- నీతోనాకేమీ సంబంధంలేదు- నీవు బ్రతికియున్న దానవుకావు- సహజంగానే నీవు చచ్చినదానవు- విచారణవల్ల మరింత చచ్చావు- నీకొకస్వరూపంలేదు- వట్టి జడమునీవు- శతస్వభావము

కలదానవు- అజ్ఞానంగల మూఢుడే నీకు బాధ్యుడు- విచారముకలవివేకి నీకు బాధ్యుడు కాడు- ఇంతవరకూ మేము నీకు స్వరూపంలేదనీ, చచ్చిన దానవనీ తెలియలేకపోయినాము- ఇప్పుడు తత్త్వజ్ఞానకాలంలో తెలుసుకున్నాం. చీకటియొక్క స్వరూపం దీపాలకే తెలుస్తుంది-

దుర్మార్గురాలవయిన నీవు చాలకాలం సజ్జనసాంగత్యంలేని నా శరీరమనే గృహమును ముట్టడించావు- చావుపీనుగవు నీవు తొలగిపొమ్మేసరికి సకల సజ్జనులకు సంసేవ్యమయింది నా దేహమనే గృహం-

దుర్మార్గపు చిత్తమా ! నీవు కాలత్రయంలోనూ లేనిదానవని నేను తెలిసికున్నా నాముందటి నిలచుంటకు సిగ్గుపడవేం-

ఓ బ్రహ్మరాక్షసీ ! తృష్ణాపిశాచాలతో కామక్రోధాది దయ్యాలతో నాశరీరమనే కొంపనుంచి లేచిపో-

అబ్బా ! నాఅదృష్టవశంచేత వివేకమాత్రంచేత నాశరీరమనే కొంపనుంచి చిత్తమనే భేతాళుడు లేచిపోయాడు- ఏమి ఈచిత్రం క్షణభంగురము దుర్గారి మూఢము అయిన ఈచిత్తము చేత కాలమంతా వృథాపుచ్చబడిందికదా !

చిత్తమా ! ఏమి నీ పరాక్రమము ! ఏమినీబలము! ఏమినీ ఆధారము! ఇంతమందిలో నన్నే ఇంతిగా బాధించి చంపుతున్నావేం ? నిన్ను నేనిపుడు కొత్తగా చంపనక్కరలేదు- నీవింతకుముందే చచ్చిఉన్నావని తెలిసికొనుటయే నీకు వధ- ఇంతకు లోగడ నిపరిస్థితి నేను తెలిసికోలేదు- ఇప్పుడు తెలుసుకున్నాను- కేవలాత్మభావంలో ఉండిపోయాను- ఇకముందు నేను జీవించియుండునంతవరకూ నిన్ను విడిచియే జీవన్ముక్తునిగా ఉంటాను. అబ్బా ! ఇప్పటికి నేను స్వస్థంగా ఉన్నాను- దయ్యం వదిలిన వానివలె- నీవుచేసిన వికారాలన్నీ తలచుకుంటే నాకిపుడు నవ్వు వస్తోంది- ఇంతకాలానికి తత్త్వవిచారమనే కత్తితో నిన్ను పొడిచి పొడిచి చంపాను- చచ్చావునీవు- పరమపవిత్రమయిన తావు చేరాను

నేను- ఇంక శరీరమనే నగరంలో సుఖంగా ఉంటాను- నామనస్సు చచ్చింది- చింతలు నశించాయి- అహంకారమనే రాక్షసుడు చచ్చాడు- ఇప్పుడు స్వస్థంగా ఉంటాను- నాకు మనస్సు ఏమిచుట్టం? ఆశలేమి చుట్టాలు? ఈ అహంకార మేమిచుట్టము? వృథాగా నాకొంపలోపడి తిన్నారు- చన్నారు- నాశనమయ్యారు పూర్తిగా దండిగ తిండితిని.

అద్వితీయుడు, కృతకృత్యుడు, నిత్యుడు, నిర్మలాత్మ నిర్వికల్ప చిద్రూపుడు, అగు నా ఆత్మకు ఒక్క నమస్కారము-

నాకు శోకం లేదు- మోహం లేదు- అహంకారం లేదు- శుద్ధ చిద్రూపుడయిన నా ఆత్మకు నమస్కారము-

నాకు ఆశలు లేవు- కర్మలు లేవు- సంసారము లేదు- కర్తృత్వము లేదు- భోక్తృత్వము లేదు- దేహము లేదు- అసంగుడయిన నా ఆత్మకు నమస్కారము-

నేను ఆత్మశబ్దమునకు విషయుడను కాను- అనాత్మనూ కాను- మరెవ్వడను నేను? కనుక సర్వమూ నేనే- ఇట్టి నా ఆత్మకు నమస్కారము-

నేను అన్నిలోకాలకు కారణము. అన్నిటిని ధరించినవాడను- అన్నిలోకములు నేనే- నాకు పరిచ్ఛేదము లేదు- ఇట్టి నా ఆత్మకు నమస్కారము-

నిర్వికల్పుడు, నిత్యుడు, నిరవయవుడు, సనాతనుడు, సర్వప్రపంచ రూపుడు, అగు నా ఆత్మకు నమస్కారము-

నీరూపుడు, వాగగోచరుడు, ప్రకాశరూపుడు, ఆత్మైకనిష్ఠుడు' ఇట్టి నా ఆత్మకొరకు నమస్కారము-

నేను సర్వవ్యాపకము సర్వసమము అతిసూక్ష్మము, సర్వప్రపంచ ప్రకాశము, అగుస్థితిని పొందాను. ఇట్టి నా ఆత్మకు నమస్కారము-

అవిద్యాతత్కార్యములను వదల్చుకొని ఈశ్వరస్వరూపమును పొందాను నేను-

## ౮౧. చిత్తములేదని నిరూపించుట.

అని ఇలా విచారించి తెలుసుకుంటూను తత్త్వవేత్తలు- మనస్సునకు దృశ్యమంతా ఆత్మేఅనే జ్ఞానంకలిగి ప్రపంచాన్ని తుడిచిపెట్టింది మనస్సు- ఇంక తాను మాత్రం ఎక్కడిది? మనస్సుకూడా జగత్తులోనిదే కదా! జగత్తే లేకపోతే తానెక్కడిది? మాయవల్ల పుట్టింది కనుక చిత్తము (మనస్సు) లేనిదే- పడవమీద పిల్లవానికి ప్రక్కన ఉన్న స్థాణువులు కదలుచున్నట్లు భ్రాంతి కలుగుతుంది- అలాగే అజ్ఞానికి చిత్తమనేది ఉన్నట్లు భ్రాంతి కలుగుతుంది- ఆత్మవేత్తకు ఆ భ్రాంతి ఉండదు- మూఢత్వమువల్ల కలిగిన భ్రాంతి నశిస్తే ఇంకచిత్తం కనిపించదు- చక్రారోహభ్రమ తగ్గిన తరువాత (అనగా ఆచక్రమునుంచి దిగినతరువాత) ప్రక్కవస్తువులు తిరుగుచున్నట్లు తోచదు- కనుక ఇలా చిత్తములేదనీ బ్రహ్మమొక్కడే కలడనీ, బ్రహ్మమే సర్వప్రపంచమనీ, నిశ్చయంకలిగింది కనుక అసత్యములయిన పదార్థభావనలను విడిచివేశాను-

నాసందేహాలు తీరాయి- నామనోబాధ తగ్గింది- ఏషణాత్యాగం చేసి, నాసహజ పారమార్థికాత్మ స్వభావంతో నేనుంటాను.

వెలుతురుపోయిన తరువాత గోడమీద రంగులేమీ కనిపించవు రాత్రి- చిత్తము నశించిన తరువాత చాపల్యము ఉండదు- చిత్తమూ చచ్చింది- తృష్ణకూడా ఎగిరిపోయింది- మోహమనే పంజరం పటాపంచలయింది- నిరహంకారత్వము కలిగింది- నాజీవాత్మకు అజ్ఞాననిద్ర పోయింది- నేను స్వస్వరూపమును పొందాను-

అద్వితీయ బ్రహ్మమొక్కటే- ప్రపంచము శాంతించింది- భేదము నిజము (సత్యము) కాదు- ఇంక నేనేమి విచారించేది? లేని ప్రపంచమును గూర్చిన ముచ్చట యింతటితో చాలు- ఏమి ప్రయోజనము? దీనితో- లోకంలో వ్యవహారదశలో ఉన్నవనుకునే మనోబుద్ధి చిత్తాహంకారాది వస్తువులూ, శ్రుతిదృష్టిలో ఆత్మ బ్రహ్మచైతన్యము,

అనే వస్తువు- లేవని ప్రసిద్ధమయిన రజ్జుసర్పాదికము వంధ్యాపుత్రాదులు ఇది అంతా స్వప్రకాశమయిన బ్రహ్మయే విస్తరించి ఉన్నది- ఆ బ్రహ్మయందే "ఉన్నదీ, లేదు" అనే వికల్పములన్నీ ఆరోపింపబడ్డవి.

కనుక చిత్తము ఉండనీ, పోనీ, చావనీ, బ్రతకనీ- దాని విచారణతో నాకేమి ప్రయోజనము? నేనింతవరకు నాస్వరూపమునుగూర్చి విచారించుకోనక పరిచ్ఛిన్నమయిన దేహాది స్వభావుడనయినాను- ఇప్పుడు విచారించుకున్నాను- అపరిచ్ఛిన్నరూపుడనయినాను- విచారించుకొనుచున్నప్పుడున్న నేను ఎక్కడపోయానో నిరూపించుకొనలేకున్నాను- అయినా ఇంక నాకీవిచారణ యెందుకు? దీనితో చచ్చిన మనస్సు మళ్ళీ పుట్టుతుంది- అనేక సంకల్పవికల్పాత్మకమయిన మనస్సును విడిచి పెడతాను- అని ఇలా నిర్ణయించుకొని, ఓం అని ప్రణవము నుచ్చరించి శాంతాత్మనై మౌనంగా నా స్వరూపంలో ఉంటాను- భోజన గమన స్నానాదులంతటను నాబుద్ధిలో ఆత్మవిచారమునే చేస్తూఉంటాను- అనవరతము ఆత్మవిచారణచేయని మానవుడు మృతుడని అంటారు పెద్దలు- సత్పురుషులు ఆత్మవిచారణచేసి స్వస్థమయిన చిత్తముతో భయరహితులై తమతమ వర్ణాశ్రమోచితాచారములందుంటారు-

## ౮౨. ఇంద్రియానుశాసనయోగము.

వసి॥ రామచంద్రా! బృహస్పతి అన్నగారయిన సంవర్తుడు ఇలా ఆత్మవిచారం చేసికొని, ఆత్మసాక్షాత్కారం చేసికొన్నాడు- ఆయనగారు నాకు వింధ్యపర్వతంమీద చెప్పారు దీనిని- అదే విషయం నీకు చెప్తున్నాను- ఈదృష్టి మనస్సులో పెట్టుకో, నీవుకూడా తత్త్వవిచారంచెయ్యి క్రమంగా సంసారసాగరాన్ని తరించు- ఇదిగాక వీతహవ్యుడనే మహాముని ఇంద్రియాలకు మనస్సునకు బోధించిన కథ ఒకటి ఉంది- చెబుతావిను దాన్నికూడా నీకు నీసందేహాలు తీరుతాయి-

వీతహవ్యుడనే మహాముని కొంతకాలం వింధ్యపర్వతం గొప్ప- గుహలలో తిరుగుతూ ఉండేవాడు- అతనికి కాలవశాత్తూ సంసారం మీద రోతపుట్టింది- నిర్వికల్పసమాధిచేసి బ్రహ్మభావమును పొందవలె నని తలచాడు- సన్యసించాడు- జీర్ణమయిన ప్రపంచాన్ని విడిచి పెట్టాడు- అరటి ఆకులతో ఒక కుటీరం ఏర్పాటుచేసుకున్నాడు. అందులో కృష్ణాజినాపరచుకుని పద్మాసనంవేసి కూర్చున్నాడు. రెండుపాదతలము లంటూనూ చిన్ముద్రతో కరాంగుళులు పెట్టుకున్నాడు- మెడ నిక్కబెట్టి కూర్చున్నాడు- క్రమంగా మనస్సును విషయములనుండి ఉపసంహ రించడం ప్రారంభించాడు- ఆస్థితిలో పరిశుద్ధ మనస్సుతో ఇలా విచా రించటం ప్రారంభించాడు.

అబ్బా! ఆశ్చర్యం- ఎంత నిగ్రహించినా ఈమనస్సు సముద్ర తరంగాలలోపడి ప్రవాహానికి కొట్టుకుపోయే ఆకువలె మహా చంచలంగా ఉంది. స్థిరపడుటలేదు. అరచేతితో తట్టినబంతివలె ఇంద్రియగోచరము లన్నీ విషయాలతో నాట్యంచేస్తూనే ఉంది. విడిచిపెట్టిన వస్తువులనే మళ్ళీపట్టుకుంటోంది. దేనినుండి దీని మరల్చాలో దాన్ని దానిమీదికే పరుగిడుతోంది మళ్ళీ- చెట్టుమీద కోతి కొమ్మకొమ్మకు ఎగిరినట్టు ఘటమునుంచి పటముమీదికి పటమునుంచి బండిమీదికి ఎగురుతోంది-

ఈమనస్సుకు అయిదుద్వారాలున్నాయి బయటకు రావడానికి- అవే అయిదు గహరాగేంద్రియాలు- ఇవి మహాపాపిష్ఠివి. ఇప్పుడు వాటికి బుద్ధిచెబుతాను వినండి- ఓ ఇంద్రియములారా! నేను సమాధితో ఆత్మసాక్షాత్కారం చేసకొనుట మీకిష్టంలేదా? ఎందుకు సముద్ర తరంగాలవలె ఇంత కొట్టుకుంటారు? మీవల్ల నేను పొందిన దుఃఖాలు ఒక్కమాటు స్మరించుకోండి. వృథాగా అనర్థం సంపాదించుకోటానికి అదిరిపడమాకండి. మీరు మనస్సుకు ద్వారములు- జడములు- జలమును కు ఉత్సేకం (ఎగిరిపాటు) ఎంతవ్యర్థమో జడములయిన మీకుకూడా ఎగిరిపాటు అలాగేవ్యర్థం- జ్ఞానశూన్యములయిన మీరు బయటపడి

పరుగెత్తినం "శతాంధాఃకూపం ప్రవిశంతి" అను న్యాయమవుతుంది-చిదాత్మనగు నేను సాక్షిమాత్రుడనుగ నుండి ఈదర్శనాది వ్యవహారా లను చేస్తున్నాను- పనికిమాలిన యింద్రియములారా! మీరెందుకు నిరర్థకంగా వ్యాకులపడతారు? నిజమయిన రూపము లేని ఓ చక్షురాది ఇంద్రియములారా! మీరు కోరివిషయ్యాల్గాగ వృథాగా తిరుగు తున్నారు- పాతాళలోకానికీ, స్వర్గలోకానికీ, ఎలా సంబంధం లేదో మీకుకూడా సాక్షీ చైతన్యంతో సంబంధం లేదు- భయపడిన బాటసారి పాముకు దూరంగా ఉంటాడు- సనాతనుడయిన బ్రాహ్మణుడు పాలవా డికి దూరంగా ఉంటాడు- అలాగే ప్రతిజేకరసుడయిన ప్రత్యగాత్మ పరాగ్రూపములయిన (జడములయిన) ఇంద్రియాలకు దూరంగా ఉం టాడు- చైతన్యము యొక్క సత్తా మాత్రం చేతనే మీకీ సంక్షోభం-

ఓ చిత్తమనే చారుడా! (బయటతిరుగువాడా!) చిత్తమనే చార్వాకుడా! (దేహాభిమానీ) కుక్క తిరిగినట్లు తిరుగుచున్నావు నీవు కేవలం అనర్థము కొరకు- "నేను చైతన్యము కలవాడను" అనే వాసన నీకు వట్టి భ్రాంతి- నీకూ చైతన్యానికీ సంబంధమే కుదరదు- అహం కారమువలన జీవిస్తున్నాననే భావంకూడా నీకు పనికిరాదు- అహం కారమువల్ల జీవించుట లేదు- పరమాత్మతోనే జీవిస్తున్నావు- "న ప్రాణేన మర్త్యో జీవతి కశ్చన। ఇతరేణ తు జీవంతి యస్మిన్నే తావుపాశ్రితౌ" అను శ్రుతి కార్యకరణ సంఘాతరూపమయిన శరీరము ఆత్మ చైతన్యము చేతనే జీవించుచున్నదని చెబుతోంది.

మూర్ఖ చిత్తమా! అహంకారమనేది పుట్టితే నేను పుట్టాననే భావంకూడా విడిచిపెట్టు- చైతన్యము యొక్క ఆద్యంతములు లేని తత్త్వము- తద్భిన్నము లేదు- నీ వెక్కడ ఉన్నావు శరీరంలో చిత్తమనే పేరుపెట్టుకొని- భోగకాలంలో అమృతంలాగ ఉండి పరిణామంలో విషంలాగ తయారయ్యే కర్తృత్వభోక్తృత్వాలు మాత్రం రెండు తయా రయినాయి నీకు- బాహ్యేంద్రియ సముదాయమును ఆశ్రయించి ఎగ

తాళిపాలు కాకుము— నీవు కర్తవు కావు. భోక్తవూ కావు. కేవల జడుడవు. నీవే సాక్షిచైతన్యముచే తెలియబడుచున్నావు. అట్టి నీవు మరొకదానిని యేమి తెలుపగలవు? జడమయిన నీకే ఒకవిధమయిన స్వరూపం లేకపోతే ఇంక నీకు భోగములేమిటి? భోగములకు నీవేమిటి? జడమగు వస్తువునకు స్వరూపములేదు— కనుక దానికి జ్ఞాతృత్వము కర్తృత్వము భోక్తృత్వము, అజ్ఞత్వము, అనే ధర్మములు సంభవించవు— నీవు చేతనురాలవే అయ్యేయెడల ఎప్పుడు ప్రత్యక్చైతన్యరూపంతోడనే ఉండే దానవు— అలా ఉండటం లేదు. భావాభావవికల్పాలతో ఊగులాడుతున్నావు. నిర్వికల్పంగా లేవు— కనుక గట్టిగా అచేతనమయినదానవే. అందులో సందేహంలేదుగా— ఇంక నీకర్తృత్వభోక్తృత్వాదులు తుడిచి పెట్టుకుపోతాయి— జడమయిన వాళ్ళకు కర్తృత్వం ఉన్నదా! నీకు మాత్రం ఎక్కడనుంచి వస్తుంది? నీవు జడవే. అయితే కొయ్యబొమ్మ కూడా ఆడించే చేతనుడయిన పురుషుని వ్యాపారంచేత ఆడుతోంది కదా! అని అంటావా— అలాగయితే నీవుకూడ చేతనుడయిన సాక్షివల్ల నాటకం ఆడుతున్నావు కనుక, వాని మహిమను ఆధారపరచుకునే బ్రతుకు. నీవు గర్వపడకు. కాబట్టి ప్రతిమయొక్క ఆటను ఫలమును చేతనుడే అనుభవిస్తున్నాడు. కాని ప్రతిమ (బొమ్మ) అనుభవించటం లేదు. అలాగే నీవు చేసే జీవనాదులయొక్క ఫలమును అనుభవించువాడుకూడ చిదాత్మయే కాని నీవు కాదు— నీవు అనవసరంగా జీవనాదుల కొరకు పరుగెడుచున్నావు— లోకంలో గొడ్డలి పురుషునిశక్తితో కట్టెను పగలకొట్టుతోంది— కనుక లావకుడని (కట్టెలకొట్టువాడని) పురుషుణ్ణే అంటున్నారు— గొడ్డలిని అనుటలేదుసుమా! ఎవడు ఎవనిశక్తిచే చంపబడుచున్నాడో వాడు వానిచే చంపబడినవాడే— పురుషునిశక్తితో ఖడ్గము చంపుతోంది— అప్పుడు చంపువాడు పురుషుడే కాని ఖడ్గము కాదు— పాత్రతో పానీయమును (జలాదులను) త్రాగుచున్నారు పురుషునిశక్తిచే— త్రాగువాడు పురుషుడే పాత్ర కాదు— కనుక ఆత్మే భోక్తృభోగ్యఉపకరణాదులను స్వప్నమునందువలె తయారుచేస్తున్నాడు.

జడమయిన నీవల్ల జరుగునది ఏమీ లేదు- పరమాత్మ చిదాభాసుని ద్వారా ఎప్పుడూ నీకు బుద్ధి చెబుతూనే ఉన్నాడు- తెలిసినవాళ్లు మూఢులకు ఎన్నిసార్లయినా బుద్ధి చెప్పాలి- నీకు నామరూపాలు ఆత్మయొక్క చిచ్ఛక్తివల్లనే కలుగుచున్నవి- అనగా ఆత్మ తనను తాను తెలిసికొనలేక నీవలె తయారయినాడు. తనను తాను తెలిసికొని (ఆత్మ జ్ఞానము వలన) నీభావమును (నీరూపమును) వదలుచుకొన్నాడు- కనుక చిత్తమా! నీవు చచ్చినదానవు- మూఢమయినదానవు- పరమార్థంలో లేవు నీవు- "నీవే నేనను" తాదాత్మ్యాధ్యాస ఇంక నాకు వద్దు- మనః కల్పనలన్నీ ఇంద్రజాలికములు- బ్రహ్మయొక్క స్వరూపం విజ్ఞాన మాత్రము- బ్రహ్మగారి చిచ్ఛక్తియే (మాయయే) నరులుగానూ, దేవతలుగానూ, జగత్తుగానూ, తయారవుతోంది-

చిత్తమా! నీవు ఆత్మభావనచే చిన్మయమవుతావు- (అనగా చిదాకారమవుతావు.) అపుడు నీకూ పరమాత్మకు భేదం లేదు- అభేదమే మీ యిద్దరికీ ఇంక ఏర్పాటెందుకు? లోకంలో దుఃఖమనేది అనుకున్న వస్తువు లభించకపోతే కలగటం సహజం- నీవు ఆత్మరూపమయితే ఆత్మ సర్వవస్తు స్వరూపుడు కనుక నీవుకూడ సర్వవస్తు స్వరూపురాలవే- ఇంక నీకు లేని వస్తువేమి ఉన్నది దుఃఖించడానికి- కనుక లోకంలో అహం అనే వస్తువు ఒక్కటే ఉన్నది- త్వం (నీవు) అనే వస్తువు లేదు- నిస్పందమయిన ఆత్మ ఒక్కటే ప్రకాశిస్తూ ఉంటే ఎవరికేమి బాధ? సర్వప్రపంచమూ ఆత్మస్వరూపమే యని శాస్త్రసిద్ధాంతం- నీవు (చిత్తము) ఆత్మస్వరూపముగాక ఆత్మభిన్నమగుచో నీకు నిజమయిన స్వరూపమే లేదు- కనుక నేను నీవు నాది నీది అని ఎందుకీ పనికిమాలిన కోరికలు నీకు? స్వరూపరహితమయిన నీవు అదిరిపడటం ఎందుకు? కుందేటికొమ్ముతో ఎవడు చచ్చాడు? లోకంలో ఉన్న అంశాలు రెండే- చిత్తు, అచిత్తు అని- మూడవ అంశం లేదు- ప్రతి వస్తువుకూ ఎండ నీడ అనే రెండే అంశాలు ఉంటాయి- తత్త్వజ్ఞానంవల్ల చిత్తిజాడ్య

దృష్టులు రెండూ నశిస్తే మిగిలెడి స్వప్రకాశ పరిపూర్ణాత్మస్వరూపమే నీది- (నీవు) కనుక మూఢచిత్తమా ! నీకు కర్తృత్వము లేదు- భోక్తృత్వము లేదు- పరబ్రహ్మస్వరూపమగు దానివే నీవు- ఇకనయినా మౌర్ఖ్యమును విడిచిపెట్టు-

అయితే నేనే ఆత్మనయితే "మనసైవాను ద్రష్టవ్యమ్ మనసైవే దమాప్తవ్యమ్" ఇత్యాదిశ్రుతులందు ఆత్మజ్ఞానమునకు సాధనముగా నే నెందుకు చెప్పబడ్డాను ? అని సందేహం ఉండవచ్చునీకు- అది సరి కాదు- అజ్ఞానదశలో శాస్త్రముకాని, ఆచార్యుడుకాని తత్త్వమును ఉపదేశించడానికి అలాకల్పించి చెప్పింది శ్రుతి- అంతమాత్రంచేత నీకొక పరమార్థ స్వరూపమున్నదని గ్రహించకు- అనీకాక శ్రుతి చెప్పినట్లు నీవు కరణమే (సాధనమే) అయ్యావనుకో లోకంలో సాధనములకు స్వయంగా కదిలే సామర్థ్యం లేదు గనుక నీకుకూడ కదలుటకే సామర్థ్యం లేదు- ఇంక నీకు కర్తృత్వాభినివేశమెందుకు ! వృథా అది- కరణమా నేది స్వరూపరహితము- లోకంలో జడమగు- కదలుటకుకూడ సామర్థ్యము లేదు దీనికి- కర్త దారిచూపకపోతే- కర్త లేని సాధనములకు ఏమీ శక్తి లేదు- లావకుడు (కోయువాడు) లేనిదే కత్తి ఏమీ చెయ్యలేదు- ఖడ్గప్రహారంవల్ల పిచ్చెపరుచుటలో పురుషునియందే శక్తి కనిపిస్తోంది కాని జడమయిన ఖడ్గమునందు కనిపించుట లేదు- ఎంతటి మహాశాస్త్ర మయినా ప్రయోగించే కర్తయుంటేనే దానిపని జరుగుతోంది- లేకుంటే జరుగుట లేదు- కాబట్టి మూఢమనమా ! నీవు కర్తవు కావు- వృథాగా దుఃఖానికి పాల్పడకు- ఇతరులకొరకు క్లేశపడుట చేతనుడయిన ఆత్మకు శోభించునుకాని సాధనములలో ముఖ్యమయిన ప్రకృతికార్యములకు శోభించదు- ఈశ్వరుడు జీవుడై క్షుత్పిపాసలతో బాధపడుతున్నాడనికూడ నీవు దుఃఖింపవలసిన పనిలేదు- అతడికి కృతాకృతములతో పనిలేదు- నీగర్వంలో నేను ఉపకారం చేస్తానని బయలుదేరుతున్నావే కాని, నీ ఉపకారం పొందేవాడెవ్వరూ లేరు- వృథాప్రయాస నీది- నిత్య

తృప్తుడయిన ఈశ్వరునకు ఇచ్ఛయే లేదు. నీ ఉపకారం అతని కక్కర లేదు. మిగిలిన పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియాలు అచేతనములు. వాటికి నీవు తెచ్చిపెట్టెడి భోగాలతో ఏమీ ప్రయోజనంలేదు. కొండ రాతికి ఎంత అన్నంపెట్టితే మాత్రం ఏం ప్రయోజనం !

కనుక స్వయంప్రకాశరూపుడూ, సర్వవ్యాపకుడూ, అద్వితీయుడూ, చిద్రూపుడూ, అయిన ఆత్మచేతనే ఈ ప్రపంచం నిండిఉన్నది. ఇతరవస్తువేదీ లేదు. ఒకవేళ కల్పిత ప్రపంచాన్ని అంగీకరించినా అది ఆత్మయందే కల్పింపబడింది కనుక అధిష్ఠానమయిన ఆత్మను అది అప్రాప్తము కాదు. ప్రాప్తమయిన వస్తువునందు ఎవరికీ కోరికుండదు. నీపని ఎలా ఉన్నదంటె రాజుగారి భార్యనుజూచి ఒకానొక యువకునికి మనోవికారం కలిగినట్లుంది. ఆవికారం వాడిచావుకేకాని సంభోగసుఖానికి కాదు. అంతే నీగతికూడా.

ఒకవేళ "ఈశ్వరునితో కలిసియుండి నేనుభోగములను అనుభవిస్తాను" అని నీకు ఆశ ఉందేమో! కాని అదికూడా నెరవేరదు. నీవు ఈశ్వరునితో కలిసేసరికి నీస్వరూపమే నాశనమవుతుంది. పువ్వునుండి పిందె, కాయ, పండు, తయారవుతుంది. కాని పువ్వుమాత్రం యెన్నటికీ పండుతో సంబంధించి (కలిసి) ఉండలేదు. పండుదశ వచ్చేసరికి పువ్వుయొక్క రూపమే నశిస్తుంది. అలాగే నీవుకూడా.

రెండవదానితో కలిసి అభేదమును పొందుటయే నీకు ఈశ్వరునితో సంబంధము. అనగా ఒకదానికి మరొకదానితోటి ఈ రెంటిలో ఒక్కదానియొక్క క్రియచేగాని రెంటియొక్క క్రియచేగాని కలసి మొదటిది రెండవదానిలో అంతర్భావమును చెందుటకాని అభేదమును చెందుటకాని సంబంధమునకు ఫలము. ఇట్టి సంబంధము వలన మొదటనున్న ద్విత్వముపోయి యేకత్వము కలుగును.

ఇలాంటి సంబంధము చిత్తమా! నీకు ఈశ్వరునితో కుదరదు. నీపనులు విహితనిషిద్ధాదులు అనేక రీతులుగ నున్నవి. అనగా నీవు

వేదవిహితమయిన పనులు చేయడానికి తయారవుతావు- వేదనిషిద్ధమయిన పనులు చేయడానికి తయారవుతావు- నీవసలు ఏకవిధంగా ఉండవు- నీదశలుకూడ భిన్నములు అనగా నీవు ఒకప్పుడు సుఖదశ- మరొకప్పుడు దుఃఖదశ- ఎప్పుడూ ఒకేదశలో ఉండవు-నీవు కలిసి ఉండబోయే ఈశ్వరునిదగ్గర ఇలాంటి భేదాలు లేవు- ఆయన ఎప్పుడూ ఏకరూపమయిన క్రియగలవాడే- ఒకేరూపమయిన దశలో నుండువాడే కనుక ఇట్టివానితో నీకు సంబంధం కుదరదు- అసలు సంబంధం చేయతగిన స్థితి నీవద్దలేదు-"వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అనునట్లు సంబంధము అనేది సమానములయిన క్షీరములకు (పాలకు) కుదురుతుంది- అర్ధసమములయిన (సగముసామ్యముగల) క్షీరనీరములకు (పాలకునీటికి) కుదురుతుంది అంతేకాని విలక్షణములయిన నీరువహ్నులకు (నీరు, నిప్పులకు) సంబంధము కుదరదు- అత్యంత విరుద్ధములయిన వాటికి కర్మంచాలక సంబంధం కలిగితే ఆ రెంటిలో దేనికో ఒకదానికి స్వరూపనాశనము తప్పదు- నిప్పు నీరులకు సాహచర్యసంబంధం కలిగితే బలాబలములనుబట్టి నిప్పుఅయినా చల్లారుతుంది. నీరయినా ఇంకిపోతుంది- ఈ రెండు తరగతులూ స్వరూపనాశనం క్రిందకే వస్తాయి- అంతేకాని సంబంధించి ఉన్నవాటి క్రింద లెక్కకురావు- అలాగే అత్యంత విలక్షణములయిన నీకు ఈశ్వరునికీ సంబంధం కుదరదు- సంబంధంకలిగితే చిత్తమా! నీకు స్వరూపనాశం తప్పదు-

అయితే శబ్దస్పర్శాది విరుద్ధగుణములు సూక్ష్మభూతములకు పంచీకరణముచే "అన్ని భూతములుకలిసి ఒకచోట ఉండుట యను సంబంధముకలిగినదికదా! అలాగే విరుద్ధధర్మములుగల నాకుగూడ ఆత్మతో సంబంధము కలుగకూడదా! అని నీఅభిప్రాయము కావచ్చు. కాని అదికూడ కుదరదు- నీవుచూపిన దృష్టాంతమునట్లు నీవనుకున్నట్లు పరస్పరవిరోధములేదు- అచ్చట ప్రత్యేకద్రవ్యములను ఆశ్రయించియుండెడి శబ్దస్పర్శాది గుణములు పరస్పరము కలియక కలిగేపరికి పంచీ

కృతద్రవ్యములను ఆశ్రయించి ఉన్నవి- (ఉ॥ ఆకాశానికి శబ్దమొక్కటే గుణము- వాయువునకు శబ్దస్పర్శలు రెండుగుణములు- ఇలా) ఇచ్చట మీరుభయులు (చిత్త ఈశ్వరులు) పరస్పరవిరోధములుకలవారు- నీవు (చిత్తము) జడము- ఆత్మచేతనుడు సంవిత్వ జాడ్యములకు చాలావిరోధముంది- ఈస్థితిలో నీవు సంవిద్రూపుడయిన ఆత్మతో కలిసేయెడల నీనుంచి ఆత్మ తన సంవిదంశమునుండి దిగజారుచో క్రమంగా నిన్ను సాధించెడి (అనగా కల్పించెడి) (తయారుచేసెడి) వాడే లేకపోతాడు కనుక నీకు స్వరూపనాశం కలుగుతుంది. లేక ఆత్మనుండి నీ స్వరూపమే దిగజారిపోయేయెడల నీకు స్వరూపనాశం కలుగుతుంది- (అనగా నీస్వరూపం నాశనం చేసికోటానికి నీవు ఆత్మను చేరినట్లవును.) కనుక ఆత్మసంబంధమును అపేక్షించిన నీకు అన్నివిధములా చావు తప్పదు- అంచేత ఆత్మతో సంబంధమును అపేక్షించి నీవు నాశము కాకుము-

అథవా నేను ఒంటరిగా నాస్వరూపంతో ఉంటే నాకు దొరకేవి “నీవు నేను, నాది, నీది, అది, ఇది” అనే దృశ్యసంపదే కదా! దీనివల్ల దుఃఖమేకాని సుఖం కనిపించటం లేదుకదా! నేను ఆత్మతో కలిస్తే ఆసంవిత్తు (చైతన్యము) చేత ఈదృశ్యసంపద నశిస్తే దృశ్యదుఃఖం పోయి నిరతిశయానందం లభిస్తుందని నీవు తృప్తిపడేయెడల అప్పుడు ఏకాగ్రముగా ఆత్మను ధ్యానించి సమాధినిష్ఠలోనుండి ఆత్మజ్ఞానం సంపాదించుకో- ఇంకా ఇది బాగుంటుంది- నీవు సమాధిలోఉంటే నీకు సుఖమున్నదికాని- ఎప్పుడూ సంకల్పములకు అభిముఖమైఉంటే సుఖం లేదు. అంతాదుఃఖమే, కాక ప్రవాహోదకం రాళ్ళమీదపడితే బిందువులు బిందువులుగా విడిపోతుంది- అలాగే శిలాప్రాయములయిన (జడములయిన) దేహేంద్రియాదులమీద సంవిత్తును (అనగా లోపలనున్న చైతన్యమును) బయటికి తీసికొనివచ్చి పడవేస్తే అనేకధా విడిపోయి విశీర్ణమై పోతుంది- అది అలా విడిపోవుటే దుఃఖంనీకు.

ఏమండోయి! నేను సంకల్పించడంలేదు- ఆత్మే కర్తృత్వ స్వభావంచేత సంకల్పిస్తున్నాడు- అని అంటావేమో! అది నిజంకాదు.

నీవు కల్పించెడి నానాత్వ, ఏకత్వ కల్పనలతో స్ఫురిస్తున్నాడు ఆత్మ- అతడేమీ స్వయంగా సంకల్పించటంలేదు- అతడు స్వయంగా సంకల్ప రహితుడు- వానియందు సంకల్పములు కలగడం ఆకాశాన పువ్వుపుట్టి నట్లే- కనుక ఆత్మయందు కర్తృత్వాదులు లేవు. ఈచిదాత్మ అభాస మాత్రంగా స్ఫురిస్తూఉంటె సముద్రము నీటిచే నురుగు, బుడగలు, తరంగములతో ప్రకాశించినట్లు ప్రపంచం ప్రకాశిస్తూఉంది- కనిపిస్తూ ఉంది- సముద్రంలో మండెడి నిప్పుకోరివి ఉండదు- ఆత్మయందు ద్వితీయవస్తువు ఉండదు- కనుక ఆత్మ భేదరహితుడయితే, దేహము మనస్సు జడమయితే "ఇది వేరు- అది వేరు- ఇదిమంచిది- అదిమంచిది" అనే భేదకల్పనకు కారకుడు (కల్పకుడు) లేడుకనుక ఆకల్పనలేదు- కనుక సంవేద్యములు (విషయములు) లేని సంవిత్తు మాత్రమే మిగిలి నది- ఇంక "నేను, వీడు, నాడు, నాది, వాడిది" అనే కల్పన ఎట్లో చెప్పు?

ఆద్యంతములులేని నీరూపుడగు సర్వవ్యాపక పరమాత్మయందు భేదకల్పనను ఎవడు తయారుచేయగలడు- ఆకాశమున ఋగ్వేదమును ఎవడు వ్రాయగలడు? (ఇచట ఋగ్వేదశబ్దము లేఖ్యమాత్రమునకు ఉపలక్షణము) కాబట్టి ఓ చిత్తమా! సకల వస్తువులందును సారభూత మయిన సంవిన్మాత్రుడయిన పరమాత్మ సకలదిక్కుల నిండిఉండినట్లు నాకు అసందిగ్ధముగ ప్రత్యక్షమగుచుండగా నాకు సుఖాసుఖలవములు అసత్యమైపోయాయి- కాబట్టి వెనుకటి సుఖదుఃఖప్రత్యయము భ్రాంతి యే కాని యథార్థం కాదు-

౮౩. చిత్తములేదను విచారయోగము.

వసి॥ రామచంద్రా! ఆ వీతహవ్యమహాముని ఏకాంతముగా ఉండి ఇంద్రియసమూహమునుగూర్చి బోధించినబోధ ఇంకాఉన్నది- దాన్నికూడా చెబుతాను విను- అదే భావనలో నీవుకూడా ఉండు- దుఃఖమునువిడు-

"ఓ ఇంద్రియగణమా! అజ్ఞానదశలో మీకు కలిగిన ఉనికి బ్రతికి యున్నంతవరకు అనర్థములవల్ల దుఃఖమును అనుభవించటానికీ, తుదకు మాటిమాటికీ మృత్యునరకాదులను అనుభవించటానికీ ఏర్పడింది- నేను వెనుక మీకు జేసిన ఆత్మతత్త్వోపదేశం చేత మీ సత్త (ఉనికి) మంట కలిసిందని నేనుగట్టిగా నమ్ముచున్నాను- మీరు మాయ (అజ్ఞానము) వల్ల పుట్టారుకనుక మీకీగతి పట్టింది-

చిత్తమా! నీయాట అంతా దుఃఖానికే కాని సుఖానికి ఎంత మాత్రము కాదు- పక్షులు నిప్పుతో క్రీడించుట రెక్కలు మాడిపోవుటకే- పిల్లలు నిప్పుతో ఆడుకొనుట చేతులు కాలుటకే- చూడు నీవు ఉన్నంతవరకు సంసారమనే నదులు, భ్రాంతులనే నీటితరంగములతో నిండి కాలసముద్రాన్ని చేరుతూనే ఉంటాయి- దుఃఖరాసులు అహమహమికతో వచ్చిపడుతూ ఉంటాయి ధారావర్షములవలె- సంపద్విపత్తులనే కలరావ్యాధి భూతగణముమీద వ్యాపిస్తుంది- జరామరణములనే పూలగుత్తి కళేబర (దేహ) మనే జరద్రుమము (ముదురు చెట్టు మీద వికసించి చక్కగా ప్రకాశిస్తూ ఉంటుంది- దానిమీద దగ్గుతో కూడిన పిల్లికూతలనే తుమ్మెదల అరపుకూడ వినబడుతుంది- హృదయమనే పాడుగోతిలో మనోరథములనే పాములు తిరుగుతూ ఉంటాయి- చింతలనే పిచ్చికోతి తిరుగుతూ ఉంటుంది- లోభమనే పక్షి సుఖదుఃఖములనే తీక్ష్ణమయిన ముక్కుతో శమదమాదిగుణసంపత్తి అనే పూగుత్తి తుంచిపారేస్తుంది- కామమనే కోడి రాగాదివాసనలతో నిండిన హృదయమనే (మనస్సు అనే) పెంటపోగును కాళ్ళతో వెదచిమ్ముతుంది- అజ్ఞానమనే (భ్రాంతి జ్ఞానమనే) గుడ్లగూబ మోహమనే రాత్రికాలంలో, శ్మశానంలో భేతాళునివలె హృదయ చెట్టుమీద తిరుగుతూ ఉంటుంది- ఇవీ, మరికొన్ని అనేకములయిన అశుభసంపదలు (అనర్థసంపదలు) చిత్తమా! నీవూ, నీ పరివారమయిన ఇంద్రియగణమూ ఉన్నంతవరకూ తప్పవు. నిరంతరం కలుగుతూనే ఉంటాయి-

చిత్తమా! ఇక మీరు లేకుంటే కలిగే గుణసంపదకు లీక్షిస్తాను. హృదయంలో మోహమనే మంచు ఆరిపోతుంది- నిర్మలమయిన జ్ఞాన ప్రకాశము (వెలుతురు) కలుగుతుంది- రజోగుణముయొక్క స్పర్శ ఉండదు మనస్సునకు- చిత్తవైకల్యమును కలిగించెడి వికల్పములు మనస్సులో కలుగవు- అందరను ఆహ్లాదపరచెడి మైత్రియను పరమ పవిత్రమయిన భావము కలుగుతుంది- చింతఅనే దోషము నశిస్తుంది- (ఉండదు) అజ్ఞానం నశిస్తుంది- జ్ఞానం ఆవిర్భవిస్తుంది- హృదయంలో వైషమ్యం ఉండక- సర్వసమత్వం ఏర్పడుతుంది- ఆత్మాకారమయిన మనోవృత్తులు ఏర్పడతాయి- వాటిచే చరాచరప్రపంచం బాధితమవు తుంది- మనస్సు చైతన్యమునందే ముఖ్యముగా విశ్రాంతి చెందుతుంది. ఆత్మస్వరూపము అవాప్తపూర్ణ మవుతుంది- అశనాపిపాసాది పాపుల యొక్క సాంగత్యాన్ని అపేక్షించదు- అడవిలో దావాగ్నిదగ్ధము లయిన చెట్లకు వసంతకాలంలో మరల ఆకులు పుట్టినట్లు జ్ఞానాగ్నిచే జరా జన్మ మరణాదదోషములుపోయిన మానవులకుకూడ ఆరోగ్యము, పుష్టి, పుష్టి, కాంతి, మున్నగు గుణములు మరల పుటతాయి- నిరతిశయానం దాత్మయందు పునరావృత్తి రహితమయిన విశ్రాంతి కలుగుతుంది- దీనికి సంబంధించి యింకా చెప్పనలవికానన్ని గుణములు కలుగుతాయి మీరు లేకపోతే-

కనుక చిత్తమా! నీవు లేకపోతే అన్ని ఆశలు నశిస్తాయి- నీవుంటే అన్ని కోరికలు పెరుగుతాయి- కాబట్టి నీవు ఉండుట అనే పక్షమొకటి, నీవు లేకుండుట అను పక్షమొకటి. రెండుపక్షములు తేలాయి- ఈ రెంటిలో ఏది శ్రేయస్కరమనుకుంటే ఆపక్ష మంగీకరించు నీవు-

బహుశః నీకు ఆత్మభావమే (                    ) సుఖకరమని తలుస్తానేను. అయితే దానినే (అభావమునే) (నీవు లేకుండుటనే) భావించు- సుఖమయిన పద్ధతినివిడిచి పెట్టుట మూఢత్వముకదా! నిజస్థితిలో నీవు లోపల చైతన్యము కలిగి మనోరూపముతో జీవించి

ఉంటే యెడల, నిన్ను లేకుండ పొమ్మని యెవడంటాడు? ఎవడు కోగు తాః! చిత్తమా! నీవారూపంతో లేవు. నేను శ్రుతిశాస్త్రానుభవాదులతో విచారించి చెప్పుచున్నాను- పూర్తిగా పరమాత్మభావంతో ఉండుట నీకుకూడయిష్టమే కాబట్టే, నేను చెప్పిన రెండుపక్షములలో మొదటిపక్షమునే అవలంబించావు నీవు- నీవు మొట్టమొదట లేనిదానవే. భ్రాంతిచే ఉన్నాననేభావం కలిగిందినీకు- ఆభ్రాంతి యిపుడు విచారంవల్ల నీకు నశించింది- విచారణ చేసుకోనకుండుటే నీకురూపం. విచారణచేస్తే నీకు స్వరూపంలేదు. విచారంచేసేసరికి సర్వసమమయిన బ్రహ్మము అయినావు. వెలుతురు లేకపోతే చీకటి పుటుతుంది- తత్త్వవిచారం లేకపోతే నీవు తయారవుతావు. వెలుతురువస్తే చీకటిపోతుంది. తత్త్వవిచారంచేస్తే నీవు కాలికిబుద్ధి చెబుతావు.

మిత్రమా! ఇంతవరకు నేను అల్పవివేకంతో ఉన్నాను- అంచేత నీవు బలిసిపోయావు- అందువల్ల సుఖదుఃఖాదిద్వంద్వాలుకూడ వెంటబడ్డాయి- ఇపుడు నాకు వివేకం కలిగింది- దాని అనుగ్రహంచేత అవిద్యమానమయిన నీమొదటిరూపం నశించింది- ఆద్యంతములులేని ఆత్మరూపము సంభవించింది- నావివేకానికి నేను నమస్కరిస్తున్నాను- చిత్తమా! స్వయముగా నీవు శాస్త్రముచే పలుసార్లు బోధింపబడ్డావు- మధ్యలో వచ్చిన చిత్తమనే రూపం నీకుపోయింది- మాహేశ్వర రూపమును పొందావు- సకలవాసనారహితుడయిన మహేశ్వరుడవయ్యావు- అవివేకమువల్ల పుట్టినవస్తువు వివేకంవల్ల నశించితీరుతుంది- వెలుతురు లేనందున కలిగిన చీకటి వెలుతురువల్ల నశించితీరుతోంది- చిత్తమా! విచారము స్థిరపడేసరికి నీవుకోరకున్నా నీమిథ్యారూపమునకు వినాశం కలిగింది- అది నీసుఖంకొరకే- కనుక ఇంకనీవు లేవని సిద్ధాంతయుక్తులతో నిర్ణయించానునేను- ఇంద్రియాధిపతివగు చిత్తమా! పూర్వము లేని నాస్తిరూపురాలవగు నీకు క్షేమమగుగాక- ఇకముందుగూడ నీకు క్షేమమగుగాక- నేను సుఖపడ్డాను- అదృష్టవశాత్తు శాంతుడనయినాను- సంసారతాపంపోయిందినాకు- తురీయమగు ఆత్మస్వరూానేలోపం

ఉన్నానునేను- కనుక ప్రపంచంలో చిత్తమనేది ముమ్మాటికి లేదు- ఆత్మముమ్మాటికి ఉన్నాడు- ఆ ఆత్మను నేనే నాకంటే వేరుఆత్మ లేదు- నేను స్వయంప్రకాశ చైతన్యరూపుడను- అంతటా ఉన్నాను- కాల త్రయంలోనూ ఉన్నాను- శుద్ధచిదేకరసంలో "ఏష ఆత్మా" అనే కల్పనకూడా లేదు- అద్వితీయ వస్తువునకు ఇతరభేదమనునది అసంభవం- కాబట్టి నేను "అయమాత్మా" అనే మాటను ఉచ్చరించకుండా మౌనంగా ఆత్మస్వరూపంలో ఉంటాను- సర్వధర్మాతీతమయిన ఆత్మ తత్త్వమునుపొంది విశ్రాంతుడనయినాను.

## ౮౮. వీతహవ్యమనోజగద్వర్ణనము.

వసి॥ రామచంద్రా! వీతహవ్యుడు ఇలా నిర్ణయించుకొని వాసనారహితుడై వింధ్యాద్రిగుహలో నిర్వికల్పసమాధిలో ఉండిపోయాడు- స్వప్రకాశసంవిదానందరూపుడగుచు స్తిమితాంభోధివలె అతి సుందరంగా ప్రకాశించాడు- కాలిపోయినకట్టె యందలి నిప్పువలె అతడి ప్రాణవాయుసంతతి క్రమంగా లోపలనే చల్లారినది- అతని నేత్రములు పూర్తిగా నిమీలితములు కాలేదు- బాహ్యప్రపంచమును మరచాయి- అర్థోన్మీలితములై అంతర్ధ్యేయమునందు స్థిరపడ్డాయి- స్థిమితంగాఉన్నాయి- ముక్కుచివరమాత్రం అత్యల్పముగా చూపుకలదివలె ఉన్నవి- సగమువిచ్చిన పద్మములవలె ఉన్నవి- కాయశిరోగ్రీవములు (శరీరము, శిరస్సు, మెడ, ఈమూడును) సమానంగా ఉంచాడు- కొండ రాతిమీద చెక్కిన బొమ్మవలె కాని పటమునందలి వ్రాతబొమ్మవలె కాని ఉన్నాడు. ఈస్థితిగా ఉన్న ఆమునికి మూడువందలయేండ్లు అరముహూర్తము (అరక్షణం) అయింది- ఇంతకాల మయినట్లు ఏమాత్రం తెలియలేదు- శరీరాన్ని విడువలేదు- జీవన్ముక్తుడుగాఉన్నాడు- ధ్యానిస్తూ ఉన్నాడు- అంతవరకు ఉరుములధ్వని వినిపించలేదు, ధారావర్షపుధ్వని వినిపించలేదు- సమీపమునందున్న సామంతరాజుల వేట

లలో వచ్చిన ఏనుగుల గర్జనములను వినలేదు- క్రోధపూరితములయిన సింహాముల గర్జనములను వినలేదు- పిడుగుపాటుకు అరచిన జనుల కోలాహాలములను వినలేదు- మదించిన శరభమృగముల అరపుల వినలేదు- భూకంపంచే విరిగిపడ్డ కొండచరియల చప్పుడు వినబడలేదు- అడవిని కాల్చేడి అగ్నిమంటల ధ్వని వినిపించలేదు- నీటిప్రవాహాముల తాకిడి ధ్వని వినిపించలేదు- గ్రీష్మఋతుసంబంధమయిన తాపములు కూడా ఒంటికి సోకలేదు- కనుక వీటిలో వేటికీ మేలుకొనలేదు- ఇలాఉండగా కురిసినవర్షాలవల్లా, కొట్టుకొనివచ్చిపడిన మట్టికీ ఆగుహా బురదఅయి ఎండి మట్టితో నిండిపోయింది- అందులో చిక్కుపడ్డాడు రాముని- కాని సమాధిలో ఉండటంచేత ఏమాత్రం బాధఅనిపించలేదు- అతడికి మూడువందల సంవత్సరాలు గడచినతరువాత సూక్ష్మశరీరంలో ప్రతిబింబించిన చైతన్యమే శరీరమును గ్రహించింది- లేచాడు సమాధినుంచి వీతహావ్యుడు- ప్రారబ్ధశేషం మళ్ళీ వెంటపడింది- తద్భోగంకొరకు జీవచైతన్యం హృదయంలో ఉన్మేషమును చెందినది. స్థూలమయినది. మనోరూపాన్ని ధరించినది. హృదయంలోనే కల్పనను ప్రారంభించింది.

ఆ కల్పనాదశలో ఈమూడువందల సంవత్సరములు కడచిన తరువాత మరినూరేండ్లు కైలాసపర్వతంమీద మునిగా ఉన్నాడు- నూరుసంవత్సరాలు విద్యాధరుడుగా ఉన్నాడు- అయిదుయుగాలు దేవేంద్రుడయినాడు-

శ్రీరా॥ మహర్షీ! ఈ అనుభవము ఇతనికి తన హృదయంలో కలిగినదేకదా! ఆ హృదయంలో కైలాస కాననంమీద అనేది నిర్ణయము అయిదుయుగములనే కాలనియమము అల్పకాలంలో ఎలా జరిగింది? అని అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! చిచ్ఛక్తిసర్వాత్మకము (సర్వవ్యాపిక) అది ఎక్కడెక్కడ ఎలాపుట్టుతుందో అక్కడక్కడ అలా తయారవుతుంది- అనగా బుద్ధికి ఎలాంటి వృత్తిపుటితే చిచ్ఛక్తి అలాతయారవుతుంది- కనుక

చైతన్యము సర్వాత్మకమనీ, సర్వశక్తియుక్తమనీ తెలిసినతరువాత బుద్ధి వృత్తిని అనుసరించి దేశకాలములయొక్క విస్తారకల్పనము విభిన్నము కాదు- కనుక వీతహవ్యుడు హృదయమందలి చిదాకాశంలో వాసనా రహితుడైనే నానావిధలోకములనుచూచాడు- ఇలా ఒక్క కల్ప కాలం గాణపత్యమును వహించి చంద్రమౌళీశ్వరస్వామివారిని దర్శనం చేసికొన్నాడు- మనస్సు ఎలాంటి సంస్కారములతో గట్టిగా ఉన్నదో జీవన్ముక్తుడుగా ఉండినా దానినంతా అనుభవించాడు.

శ్రీరా॥ స్వామీ! ఇలాగయితే జీవన్ముక్తులకుకూడ బంధ మోక్షదృష్టిలున్నట్లేకదా! వీతహవ్యుడు జీవన్ముక్తుడుగా ఉంటూనే సంసారబంధమును అనుభవించాడుకదా! అని అడిగాడు-

వసి॥ రామా! జీవన్ముక్తులు ప్రపంచమంతా నిర్మలమయిన బ్రహ్మస్వరూపంగానే చూస్తారు. వీళ్ళకు బంధము, మోక్షము, అనే దృష్టి ఉండదు- వారికి చిదాకాశము ఎలాభాసిస్తుందో దానినివారు అనుభవిస్తూ ఉంటారు- కనుక లోగడ అనుభవించినదే మరల బాధితానువృత్తిచే మరల అనుభవింపబడుచూ ఉంటవి- కాని వాటిని బ్రహ్మస్వరూపంగా చూస్తాడు జీవన్ముక్తుడు- మిగిలినవారు ప్రపంచ రూపంగా చూస్తారు- వీతహవ్యునియొక్క చిదాత్మయందే అసంఖ్యాకములయిన జగత్తులన్నీ ఉన్నాయి- అందులో స్వర్గలోకంకూడా ఉన్నది- దానిలో కనిపించే దేవేంద్రుడే యిప్పుడు ఒక చిన్న దేశంలో రాజుగా ఉన్నాడు- ఈ అడవిలో యుద్ధానికి కూడా తయారుగా ఉన్నాడు- పాద్మకల్పంలో వీతహవ్యుడు గాణాపత్యాధికారంలో ఉన్నప్పుడు కైలాసవనకుంజరంలో ఆడుకొన్న హంసే ఇపుడు నిషాదదేశములకు రాజుగా ఉన్నాడు-

శ్రీరా॥ స్వామీ! వీతహవ్యునకు ఇదిఅంతా మానసికసృష్టి కదా! అందులో ఈ ప్రాణులు భ్రాంతిమాత్రమేకదా! అలాంటి వాళ్లు

దేహాకారులు ఎలా అయ్యారు- (అనగా శుక్రహంసాది దేహాకారము గలవారు సచేతను లెట్లయినారు?) అని అడిగాడు.

వసి॥ రామా! ప్రపంచం అంతా మనఃకార్యమని చెప్పితినికదా! భ్రాంతిమాత్రమంటినికదా! అనేకసారులు- అలాంటి అప్పుడు నీకు ప్రసిద్ధంగా కనుపడుచున్న ఈప్రపంచం సచేతనమని ఎలాతోచింది? నీవు సచేతనమని అనుకొనువస్తువు భ్రాంతిమాత్రమే- (కల్పితమే) అచేతనమని అనుకొనువస్తువూ భ్రమమాత్రమే- వస్తుతః జడమయిన ప్రపంచమూలేదు- నీవనుకొనే చేతనమయిన (నీవు చేతనమని అనుకొనే) వనస్సూలేదు- నీకుకూడా ప్రపంచంలో సత్త (ఉనికి) లేదు- కేవలం బ్రహ్మమాత్రమే ఇలా భాసిస్తోంది- భూతభావివర్తమాన రూపమయిన ఈదృశ్యప్రపంచం అంతా. సంవిన్మాత్రమని (చేతనమని యనుకొనే) మనోమాత్రమే. ఇది ఇలాంటిదని తెలియనంతవరకు వజ్రసారంగా దృఢంగా గోచరిస్తుంది- అజ్ఞానంవల్ల మనస్సే ఇలా విజృంభించింది- సముద్రంలో నీరు పుట్టిపెరిగినట్లు- చిదాకాశస్వభావమయిన మాయయే కొద్దివికారమును చెంది చిత్తమయింది- అదే మాటిమాటికి మననం చేయగా మనస్సు అయినది- దానిచే (మనస్సుచే) విశాలమయిన యీ ప్రపంచం తయారయింది- పరమార్థంలో ఏమీలేదు- అన్నారు వసిష్ఠులు-

౮౫. వీతహవ్యునకు సమాధియోగము నుపదేశించుట.

శ్రీరా॥ మహర్షి! భూగుహాలో ఉన్న తన శరీరాన్ని వీతహవ్యుడు ఎలా ఉద్ధరించుకున్నాడు? (లేవదీసికున్నాడు) అతని ఉత్తరచర్యయేమి?

వసి॥ రామా! వీతహవ్యుని మనస్సు అపరిచ్ఛిన్న బ్రహ్మాకారమయింది- బ్రహ్మసాక్షాత్కారం చేసికొన్నాడు-ప్రమథగణాకారంతో ఉండి అతడు తన జీవాత్మయొక్క ప్రాక్తనస్వరూపాన్ని ధ్యానించాడు-

తనకు లోగడ గడచిన జన్మలన్నిటిని చూడగలిగాడు- నష్టానష్టములయిన తన శరీరాలను అన్నిటినీ చూచాడు- ధరాకోటరంలో పుట్టి కొట్టుకొని వర్షకాలపునీటికి బురదకొట్టుకొనియుండి గుట్టు గడ్డిమొలచియున్న వీతహవ్యుడనే పేరుగల శరీరాన్నికూడా చూచాడు పరమబోధ కలిగింది- మళ్ళీ ఇలా ఆలోచించాడు- నాశరీరం పూర్తిగా పీడింపబడిపోయింది అవయవాలన్నీ విడిపోయాయి- ఇందులో నింక ప్రాణవాయువు సంచరించటం దుర్లభం- ఇక కదలలేదు- ఏమీ పని చేయలేదు- కనుక చల్లగా ఇందులోనుంచి లేచి, పరకాయప్రవేశోపాయం చేత సూర్యుని శరీరం ప్రవేశిస్తాను- తరువాత అతని సేవకుడగు పింగళుడను వాడు నాశరీరాన్ని ఉద్ధరించగలడు.

లేదా నాకీశరీరంతో పనియేమి! ఈ శరీరాన్ని విడిచి విదేహముక్తిని పొందెదను. నిరతిశయానందమయిన నాస్వరూపాన్ని పొందుతాను నేను- ఈ దేహాలతో నాకేమి ప్రయోజనమేమిటి! అని ఆలోచించి మనసా క్షణకాలం ఊరకుండి మళ్ళీ ఆలోచించాడు-

"నాకీ భూలోకంలో స్వీకరించతగినది కాని, విడువతగినది కాని, ఆశ్రయించతగినది కాని లేదు- శరీరం స్వీకరించుటట్లో విడుచుటకూడ నష్టం- కాబట్టి ఈశరీరం మట్టిలో కలియకుండా ఉండేలోపుగానే పింగలునిచే శరీరాన్ని ఉద్ధరింపచేసికొనుటకుగాను నభస్థలంలో అద్దమువలె ప్రకాశించెడి సూర్యుని శరీరమును చేరెదను." అని ఆలోచించి సూర్యునిలో చేరిపోయాడు లింగశరీరరూపుడై- సూర్యభగవానుడును తన హృదయంలో ప్రవేశించియున్న మునినాయకుడగు వీతహవ్యుని చూచి, "ఏమిచేతుమా" అని కార్యక్రమాన్ని ఆలోచిస్తూ వింధ్యభూధర గుహాలో తెలివితప్పి మృతప్రాయమైయున్న వీతహవ్యుని శరీరాన్ని చూచాడు. గగనమధ్యగతుడయిన సూర్యుడు మునియొక్క కోరికను గుర్తించి భూలోకమునుండి అతడిశరీరాన్ని ఉద్ధరించుటకు (పైకితెచ్చుటకు) పింగళుడను పేరుగల గణమును ఆజ్ఞాపించాడు.

పీతహవ్యుని లింగశరీరూపిణియగు సంవిత్తు సూర్యుని నమస్కరించింది- సూర్యునివల్ల బహుమానపూర్వకముగ అనుజ్ఞ తీసికొని వింధ్యాద్రిగుహాకు బయలుదేరిన పింగలుని శరీరం ప్రవేశించింది- పింగలుడు వింధ్యాద్రికేగి ఆగుహాలో గోళ్ళంతో మట్టిని వెళ్ళగించి పీతహవ్యుని శరీరం బయటికి తీయుటకు ప్రారంభించాడు- అపుడు మెదలకుండా పీతహవ్యుని లింగశరీరము పింగలునిశరీరమునుండి ఆతని స్థూలశరీరం ప్రవేశించింది- ఆకాశంమీద తిరిగే పిట్ట గూటిలో చేరినట్లు పిదప పీతహవ్యుడు నభశ్చరుడగు పింగలుడూ ఒకరికొకరు నమస్కరించుకున్నారు- వారిద్దరు ఎవరిపనిని వారు నెరవేర్చుకొనుటకు తయారయినారు- పింగలుడు గగనమండలానికి వెళ్ళాడు- పీతహవ్యుడు స్నానార్థమై సరస్సునకు వెళ్ళాడు- చక్కగా వికసించిన పద్మాలుగల సరస్సులో మునిగాడు పీతహవ్యుడు- స్నానం చేశాడు- జపం చేసికొన్నాడు- సూర్యోపాసన చేశాడు- వెనుకటివలె ప్రకాశమానంగా ఉన్నాడు- మైత్రీ, సమత, శాంతి, ముదిత, కరుణాది గుణములతో కూడినవాడై పీతహవ్యుడు, ఇతర సాంగత్యంలేకుండా ఒక్కపగలు మాత్రమే క్రీడించాడు ఆవింధ్యాద్రి యందలి సరిత్తటమందు-

౮౩. ఇంద్రియవర్గ నిరాకరణోపదేశము.

సాయంకాలమయ్యేసరికి, మరల సమాధికొరకు తనకు లోగడ పరిచితమయిన మరొక వింధ్యాద్రిక దరిమూను (వింధ్యపర్వతపుగుహాను) ప్రవేశించాడు- ప్రపంచంలోని సారాసారములు గుర్తించిన ఆతడు, ఇంద్రియములతోటి మనస్సుతోటి మళ్ళీ వాదం పెట్టుకున్నాడు- (అనగా ఇంద్రియముల గురించి, మనస్సును గురించి ఆలోచన పెట్టుకున్నాడు.) నేను వెనుక ఎంతకాలము క్రిందటనో ఇంద్రియగణమును విడిచిపెట్టాను. ఇపుడు వాటిని గురించిన (చింత) విచారణ నాకు అవసరంలేదు- దృశ్య ప్రపంచాన్ని గురించిన విచారణవదిలి, బద్ధాసనుడనై గిరిశృంగమువలె

నిశ్చలంగాఉన్నాను. చిన్మాత్రైకరసరూపుడనుగా ఉన్నాను- నేను మేలుకొనిఉన్నా నిద్రించినవాడనే- నిద్రించియున్నా మేలుకొన్నవాడనే తురీయస్థితిని పొంది శరీరావసానస్థితిలో ఉన్నాను- సత్త్వ ప్రధానమయిన సర్వసమతాస్థితిలో ఉన్నాను"అని ఆలోచించి ఆరురోజులు ధ్యానంలో ఉన్నాడు- మళ్ళీ ప్రబోధంలోకి వచ్చాడు- అనగా సమాధినుంచి లేచాడు- చాలసారి క్షణకాలం పరుండినట్లు అయింది అతడిపని- తరువాత యోగసిద్ధుడయిన ఆమహాముని జీవన్ముక్తుడుగా చాలకాలం సంచరించాడు- "ఏవస్తువును కోరలేను- దేనిని నిందించలేను- దుఃఖం లేదు- సంతోషంలేదు- నుంచున్నా, వెళ్ళుచున్నా, బాధితానువృత్తమయిన తన మనస్సుతో వినోదంగా ఇలా వాదంచేశాడు.

"ఇంద్రియవర్గమునకు అధిపతివయిన ఓ మనసూ! (మనస్సా!) నీవు శమమనే గుణముకలదానవై ఎంతటి ఆనందసుఖాన్ని పొందావో చూడు- నీవికముందు కూడా ఇలాంటి విరాగదశే అవలంబించు- చాపల్యాన్ని విడిచిపెట్టు-

ఓ ఇంద్రియచోరులారా! పరమదుర్మార్గులు మీరు- మీకు ఆత్మతో సంబంధంలేదు- ఆత్మతో మీకు సంబంధంలేదు- చావు సిద్ధమయిన మీకోరికలన్నీ వ్యర్థములయినాయి- నన్ను ఆక్రమించటానికి మీకింక శక్తిలేదు- లోగడమీకు ఆత్మతాత్మ్యాన్ధ్యాస అనే సంస్కారం ఉన్నది కనుక నన్ను ఆక్రమించ గలిగారు. ఇప్పుడు తత్త్వజ్ఞానంచేత ఆవాసన నశించింది- అది అసలు తత్త్వవిచారం లేకపోవడంచేత కలిగింది- విచారానంతరం నశించింది అది- మీరువేరు- మేమువేరు- బ్రహ్మవేరు- కర్తృత్వమువేరు- భోక్తృత్వమువేరు- భోక్త (చిదాభాసుడు) వేరు- ఇందులో ఎవరిదోషం ఎవరికి సంక్రమిస్తుంది? అడవిలో కొయ్య (కర్ర) పుట్టింది- వెదురుబొంగుల చర్మం (తాట) చేత తాడు పుట్టింది- వాసాలు చెట్లవల్ల తయారయినాయి- మేకులు గడియలు గొళ్ళెములు వగయిరాలు ఇనుమువల్ల తయారయినాయి- వడ్లవాడు

(బస్తుడు) తన పొట్టకూటికొరకు తానువచ్చాడు- కాకతాళీయంగా ఇవన్నీకలిస్తే యిల్లుతయారయింది- ఇందులో నేను యిల్లు తయారు చేశానని విఱ్ఱవీగుటకు ఎవరికధికారంఉంది? అలాగే ఇంద్రియములారా! మీరుకూడా శరీరంలో మీమీశక్తిచే మీమీనియతములయిన పనులు చేస్తున్నారు- కాకతాళీయంగా ఒకచోట కలిశారు- ఇందులో ఎవరికేమి ప్రయోజనంవుంది? ఎవరికేమి బాధవుంది? ఇప్పుడు అవిద్య దూరంగా పోయింది. ఆత్మవిద్య స్ఫుటంగా కలిగింది- దీనిచే సత్ సత్ అయింది- అసత్, అసత్ అయింది- చచ్చేది చచ్చింది- ఉండేది ఉన్నది-" అని రామచంద్రా! ఇలాంటి విచారణతో ఆ మహాతపస్వి అనేక సంవత్సరాలు ఉన్నాడు- పునర్జన్మలేకుండుటకు పూర్ణానంద స్వప్రకాశస్థితిలో ఉన్నాడు చాలకాలం- మూఢత్వము పూర్తిగా పోయింది- అప్పుడప్పుడు విచిత్రపదార్థాలనుచూస్తూ ఉన్నందున భ్రాంతిచే ప్రసక్తించిన అనర్థాలను రూపుమాపుకొనుటకు మాటిమాటికి ధ్యానమార్గాన్ని అవలంబించేవాడు- క్రమంగా అతడికి ప్రారబ్ధక్షయం అయింది- మనస్సు ఇచ్ఛాద్వేషములకు దూరమైపోయింది- జన్మకర్మలకు పొలిమేర అయిన విదేహకైవల్యంలో ప్రవేశించింది- శరీర త్యాగం చేయదలచాడు- అందుకుగాను సహ్యపర్వతంయొక్క బంగారు గుహను ప్రవేశించాడు- అందులో పద్మాసనం వేసుకొని కూర్చుని తనలో తానే తన మనస్సుతో ఇలా చెప్పాడు- "ఓ రాగమా! నీవు నీరాగమగుము- ద్వేషమా! నీవు నిర్ద్వేషమగుము- నేను మీతో చాలకాలం ఆడుకున్నాను- ఓ భోగములారా! మీకు దండము. కోటి జన్మలు మీరునన్ను లాలనచేసి పసిపిల్లలను ఆడించినట్లు ఆడించారు- పరమపావనమయిన నిర్వాణపదవి, (ముక్తిమార్గము) కూడా మరపుకు వచ్చేటట్లుచేసిన విషయసుఖమా! నీకు దండము. నీవుపెట్టిన బాధలు పడలేకనే నేను ఆత్మతత్త్వమును వెదకుచున్నాను- నీవుచూపిన దారియే యిది- కనుక ఈ విషయంలో నీవు నాకు గురువు- నీకు దండము- ఓ దుఃఖమా! నీ అనుగ్రహంచేతనే నాకీచల్లనినీడ దొరకింది- దుఃఖ

మని పేగుబెట్టుకొని దుఃఖముయొక్క శత్రువైయిన సుఖమునిచ్చు దానా నీకు నమస్కారము– ఓ మిత్రమా! దేహమా! నీకు క్షేమమగు గాక– నేను నిన్నువిడిచి నానిజస్థితిని పొందుచున్నాను– మనయిద్దరికి వియోగమునేది అనాదిసిద్ధమైయుంది– ప్రాణులస్వార్థములకు ఇదొక విషమస్థితి– అత్యంతమిత్రులయిన స్వజనమును కూడా విడిచివెళ్ళ మనేది– అలాగే నేనుకూడా అనేకవందల జన్మలు కలిసియున్న శరీరాన్ని విడుస్తున్నాను స్వార్థాన్నికోరి– మిత్రమా! ఇది నాతప్పుకాదు– చిర కాలబంధువయిన నిన్ను విడుస్తున్నాను– నీవేనాకు ఆత్మజ్ఞానానికి సాధనమయినావు– ఆత్మజ్ఞానంవల్ల నీవు నాశనమయినావు. కనుక నీచావునీవే తెచ్చుకున్నావు– అమ్మా తృష్ణా నేను ప్రశాంతుడనైపోతే నీవు ఒంటరివై శుష్కించిపోతూ దీనురాలవై ఏడువకు– నేను పోతు న్నాను. ఓ భగవంతుడా కామమా! నాఅపరాధములను క్షమించు– నేను ఏకాంతస్థానమునకు పోతున్నాను– ఆశీర్వదించు– అమ్మా తృష్ణా దేవీ! చాలకాలానికి మన ఉభయులకు ఈవియోగం తటస్థించినది– ఇది యోగశక్తియొక్క దోషంచేత కలిగింది– ఇదే నీకు చిట్టచివరి నమస్కారము–

ఓ పుణ్యదేవుడా (సుకృతము) నీకు దండము– నీవు పూర్వము నుంచీ నన్నునరకంలో పడకుండా రక్షించి స్వర్గలోకంలో నియోగిం చావు– దుష్కార్యములనే నేలమీదపుట్టి నరకమనే ప్రమానుకట్టి యమ యాతనలనే పూలగుత్తులను ధరించిన పాపమనే వృక్షమునకు దండము– ఏమోహముతో కూడ నేనులోగడ అనేక యోనులను అనుభవించానో అట్టి మోహము యిప్పుడు నాకు అదృశ్యమయింది– అట్టిమోహానికి నమస్కారము– ధ్వనించుచున్న వెదురుబొంగులతో మధురంగా సంభా షించుచూ ఆశలు అనే గుడ్డను కట్టుకొనియున్న గుహ అనే తపస్వినీ (యోగినీ) స్త్రీ కొఱకు నమస్కారము– నాకు చాలకాలం సమాధు లలో స్నేహితురాలవయినావు– సంసారమార్గంలో ఖేదపడుచున్న నన్ను

నీవు ఓదార్చినావు- మిక్కిలి ప్రేమగల స్నేహితురాలవయినావు- నా లోభమును రూపుమాపావు- నేను సర్వసంకటములలోపడి సమాధిభంగ దోషాలతో బాధపడుతుంటె నన్ను ఆదరించావు-

సంసార సంకటములనే పాడు గోతులలో పడియున్న నాకు చేయూతనొసగిన దండకాష్ఠగుణమూ! నీకు నమస్కారము.

ఓ దేహమా! నావద్దనున్న నీసొత్తుయావత్తూ నీవు తీసికొనిపో- అస్థిపంజరమూ, రక్తమాంసాదులూ, నరములూ, అన్నీ తీసికొనిపో-

ఓ దేహమా! నీమీది మలమునుపోగొట్టుకొనుటకు స్నానాలు చేసి కొంత నీకు క్షోభ కలిగించాను- ఆస్నానాలకు నమస్కారము.

నిన్ను ఆధారంగా చేసికొని భోజన, శయన, అభ్యంజన, అలంకరణాది వ్యవహారాలు కొన్ని యీ సంసారంలో జరిపాను- ఆవ్యవహారాలకు నమస్కారము.

ఓ ప్రాణములారా! మీరునాకు సహజమిత్రులు మిమ్మికూడా గొప్పచేస్తున్నాను- మీకు నమస్కారము. నేను పోతున్నాను- మీరు క్షేమంగా ఉండండి. మీతోటి నేను చాలకాలం చాలాయోనులందు విశ్రమించాను- గిరి కుంజములందు శ్రమపడ్డాను- లోకాంతరాలలో క్రీడించాను. సిద్ధక్షేత్రములయినపర్వతములందునివసించాను-ఈలోకంలో మీతోటినేనుచేయనిపనిలేదు- అన్నిపనులు విహితములుచేసికున్నాను- ఓ ప్రియమిత్రులారా! మీరిపుడు దిక్కులను చేరుడు- సంపదలకు విపత్తులు పర్యవసానము- ఔన్నత్యమునకు అధఃపతనము పర్యవసానము- సంయోగమునకు వియోగము పర్యవసానము- ఇది సంసారంలో ఉండే పద్ధతి- కనుక మీకు నాతోకలిగిన సంయోగమునకు వియోగదశ వచ్చింది-

ఇంద్రియములారా! మీరు మీ మీ స్థానములను చేరుడు- నేత్రేంద్రియమా! (తేజస్సునకే యీపేరు) నీవు ఆదిత్యమండలం

చేరుము- ఘ్రాణేంద్రియమా! గంధమాత్రము సారముగాగల పృథివిని చేరు- ప్రాణవాయూ! నీవు మహాభూతవాయువును చేరుము- శ్రోత్రేంద్రియమా! నీవు ఆకాశమహారమును జేరుము- రసనేంద్రియమా! నీవు ఉదకములను చేరుము- మీరు మీ స్థానాలకు పోతే ప్రతిగా భ్రాంతుడనయిన నేనుకూడా నాబింబ చైతన్యంలో లీనమవుతాను- (చేరిపోతాను) కట్టెకాలిన నిప్పువలె చమురులేని దీపమువలె ఓంకారాంతమగు తురీయాత్మ తత్త్వమునందు శాంతిచెందెదను-

## ౮౭. వీతహవ్యనిర్వాణము.

ఇతర సంకల్పాలు మానివేశాడు- అకార, ఉకార, మకార, అర్థమాత్రాత్మకమయిన ప్రణవమును మెల్లగా బిగ్గరగా, దీర్ఘంగా, ఉచ్చరించాడు- అధ్యారోపాపవాదంచేత శుద్ధబ్రహ్మను స్మరించాడు- ప్రాపంచిక పదార్థాలను త్రోసివేశాడు- ఆత్మస్వరూపమునందు నిశ్చలంగా ఉన్నాడు- సంపూర్ణ చంద్రునివలె ఉన్నాడు- విశ్రాంతిమయిన మందరంవలె ఉన్నాడు- ఆగపట్టిన కుమ్మరియింటి చక్రమువలెఉన్నాడు- సంపూర్ణ సముద్రమువలె ఉన్నాడు- తమః ప్రకాశములులేని ఆకాశమువలె ఉన్నాడు- సూర్యచంద్రులులేని గగనమువలె ఉన్నాడు-ధూమము అభ్రములు, రజస్సు(పరాగము) లేని నభస్సువలె స్వచ్ఛంగాఉన్నాడు- తుర్యాత్మయందు నిలచిపోయాడు- ప్రణవోచ్చారణధ్వనిని విడిచిపెట్టాడు- ఇంద్రియతన్మాత్రసమూహమును విడిచాడు- ప్రాజ్ఞుడు కోపమును విడిచినట్లు అజ్ఞానమును పూర్తిగా విడిచాడు- ఒక్క అరనిమిషంలో ఆత్మతేజస్సు ప్రకాశించినది- అంతటిలో తమఃప్రకాశశూన్యమయిన అవస్థనుపొందాడు- కల్పనకు కారణమయిన మనస్సును ఛేదించాడు- అతి నిర్మలమయిన చిత్ప్రకాశలో ఉండిపోయాడు- ఇదే చైతన్యము విషయములను విడిచిపెట్టుదశ- గాలిని చలనస్వభావమును విడిచినట్లయింది- ఇలా సాక్షిమాత్ర స్వరూపంలోఉండి క్రమంగా సుషుప్త దశను పొందాడు- ఆదశస్థిరపడిన తరువాత క్రమంగా తుర్యస్థితిలోకి

వెళ్ళాడు- ఆదశలో విషయానందములు లేకున్నా స్వరూపానందంతో ఉన్నాడు- స్వాతిరిక్తసత్తాశూన్యుడయినా సద్రూపుడయినాడు- అచిన్మయుడయిననూ చిన్మయుడయినాడు- క్రమంగానే తీతివాక్యగోచరమయిన, అవాఙ్మానసగోచరమయిన విదేహకైవల్యదశను పొందాడు. ఈ దశలో ఉండు తత్త్వమే శూన్యవాదులకు శూన్యము- బ్రహ్మవాదులకు బ్రహ్మ- విజ్ఞానవాదులకు విజ్ఞానమాత్రము- సాంఖ్యులకు పురుషుడు- యోగులకు ఈశ్వరుడు- శైవులకు శివుడు- కాలైకవాదులకు కాలము- ఆత్మవేత్తలకు ఆత్మ- సౌత్రాంతిః వైభాషికులకు వైరాత్మ్యము-(క్షణికవిజ్ఞాన సంతానము) మాధ్యమికులకు చిదచిన్మథనము- జీవన్ముక్తులకు నిరవశేషపరిపూర్ణము- ఏది సర్వశాస్త్రములకు సిద్ధాంతమో ఏది సర్వప్రాణిహృదయములను అనుసరించియున్నదో ఏది సర్వవ్యాపకమో ఆతత్త్వమయినాడు వీతహవ్యుడు- ఎయ్యది అత్యంత నిర్వికారమో, సూర్యచంద్రాదులకుకూడా భాసకమో, ఏది అనుభూతిమాత్రమో, ఆతత్త్వం అయ్యాడు- ఏకము, అనేకము, సాంజనము, నిరంజనము, సర్వము, అసర్వము, అగు తత్త్వమును పొందాడు- ఇలా వీతహవ్యుడు ఆకాశముకంటెకూడా నిర్మలుడై, నిష్కలుడై, బద్ధదృష్టిలో ఈశ్వరుడై సకల ప్రపంచరూపుడుగా ఉండిపోయాడు-

## ౮౮. వీతహవ్యుని విశ్రాంతి.

వసి॥ ఇలా ఆత్యంతికమనోనాశం అయ్యేసరికి వీతహవ్యుడు, సంసారసముద్రము యొక్క పొలిమేరదాటాడు- దుఃఖాబ్ధిని తరించాడు- అఖండానందమును చెందాడు- అతడి శరీరము మాత్రము నిశ్చలంగా అలాగే ఉండి వాడిపోయింది- ప్రాణములు శరీరములోని ఆయానాడులందు ఉండుటనుమాని హృదయమనే గూటిని చేరాయి- (ఇక్కడ ప్రాణములు హృదయమనే గూటినివిడిచి బయటికి వచ్చినవని వ్యాఖ్యానించకూడదు- అలా వ్యాఖ్యానిస్తే "న తస్యప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమవనీయంతే" అను శ్రుతికి విరోధము వాటిల్లును.) ప్రాణాది

నామాంత షోడశకలాసహితములయిన భూతములు భూతములలో చేరి పోయాయి- ఎముకలు బొమికలతో కూడిన స్థూలదేహం మాత్రం ఆ అడవిలోనే ఉన్నది- జీవచైతన్యం బింబచైతన్యంలో ఐక్యమయింది- త్వాగసృజ్మాంసాది ధాతువులు ధాతువులలో చేరిపోయాయి-వీతహవ్య మహాముని స్వస్వరూపంలో స్థిరపడేసాకి- రామచంద్రా! అనేకరకము లయిన విచారముతో కూడిన వీతహవ్యుని విశ్రాంతి చరిత్ర చెప్పాను నీకు- నీవుకూడా బుద్ధినివినియోగించి వివేచనచెయ్యి- తత్త్వమును గుర్తించు- లే- తత్సారమును అనుష్ఠించు.

రామచంద్రా! ఇంతవరకు నీకు నేనేమి ఉపదేశించానో ఇక ముందు ఏమి చెప్పబోవుచున్నానో అది అంతా త్రికాలజ్ఞానయిన నేను విచారించి స్వయంగా చూచిచెప్పాను- పరమపావనమగుయిన యీ దృష్టిని అవలంబించి నీవు కూడా జ్ఞానమును సంపాదించు- జ్ఞానము వల్లనే ముక్తిసుమా! జ్ఞానమువల్లనే దుఃఖరాహిత్యము- జ్ఞానమువల్లనే అజ్ఞాననాశము- జ్ఞానమువల్లనే ముక్తి- ఈమూడును మరొకదానివల్ల కలుగవు- వీతహవ్యుడు జ్ఞానమనే ఖడ్గముచేతనే సకలాశలను తెగ కోశాడు- చిత్తమనే కొండను నిశ్శేషంగా పొడిపొడిచేశాడు-

అయితే రామా! వీతహవ్యుడుకూడా తన హృదయంలో సంకల్పమయమయిన ప్రపంచమును నిర్మించుకున్నాడు- అందులో గుణ మును అనుభవించాడు- సూర్యునిప్రవేశించి అచ్చటి పింగలునిద్వారా భూమిమీదఉన్న తనదేహాన్ని ఉద్ధరింపజేసికొన్నాడుకదా! అని నీకు అభిప్రాయం కలుగవచ్చు- అతడు తన హృదయమందు బ్రహ్మయందు అస్మదాదులం చూచే దృశ్యప్రపంచాన్నే అనుభవించాడుకాని అపూర్వమయిన (క్రొత్త) ప్రపంచాన్ని అనుభవించలేదు- ఇంత ఎందుకు? మనం కంటితో చూచెడి వీతహవ్యుడు అస్మదీయమనోమాత్రుడే- మనమనస్సే నీవుగానూ, నేనుగానూ భాసిస్తోంది- సమస్త ప్రపంచము మనోమాత్రము- ఇందులో భేదాభేదాలకు తావులేదు-

కనుక రామా! వీతహవ్యుడు అవిద్యాకామకర్మాదిమలములను రూపుమాపుకున్నాడు- ఇంద్రియవికారములను చంపుకున్నాడు- దేహత్రయోపాధులనుండి బయటపడ్డాడు- తత్రయుక్త ప్రియసంగాదులనుండి విముక్తుడయినాడు-చిత్తశుద్ధ్యుపాయములయిన శ్రవణమనన నిదిధ్యాసాదులను అనుష్ఠించాడు- నిర్మలమయిన మోక్షపదమును పొందాడు-

## ౮౯. సద్విలాస విచారయోగము.

వసి॥ రామచంద్రా! వీతహవ్యుడు విదితవేద్యుడై (తెలుసుకొన తగినవస్తువును తెలిసికొన్నవాడై, వీతరాగభయోద్వేగుడై) ముప్పది వేల సంవత్సరములు జీవన్ముక్తుడుగా సుఖంగాఉన్నాడు- మరి కొంత మంది రాజపుంగవులుకూడ జ్ఞాతజ్ఞేయులై తమతమ రాష్ట్రములందు నివసించారు- నీవుకూడ ఆత్మజ్ఞానంకలిగి అలాగేఉండు- సుఖదుఃఖములు ఎప్పుడు ఆత్మకు అంటవు- అందుకు పరితపింపపనిలేదు- అనేక మందిమహానుభావులు తత్త్వజ్ఞులై భూలోకంలో విహరించుచున్నారు- వారెవరు సుఖదుఃఖములకు లొంగలేదు- నీవుకూడ అలాగే సుఖదుఃఖములకు లొంగకు- స్వస్థుడవగుము- సర్వసముడవగుము- సుఖంపుము- నీవు సర్వవ్యాపకుడవు- సమస్త భూతములకు ఆత్మరూపుడవు- నీకు పునర్జన్మలేదు- మీబోటి జీవన్ముక్తులు హర్షామర్షాది వికారాలకు లొంగరు- లొంగలేదుకూడా- సింహాలు నెమళ్లకు లొంగవు- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ విన్నాడు రాముడు సందేహం కలిగింది- ఇలా అడిగాడు- మహర్షీ! మీ ప్రసంగంతో నాకొకసందేహం కలిగింది- దానిని మీరుపోగొట్టక తప్పదు- అదేమిటంటే- ఆత్మవేత్తలయిన జీవన్ముక్తుల శరీరములకు ఆకాశగమనాదిశక్తులు యెందుకు కనిపించవే? కారణమేమిటి? అన్నాడు.

వసి॥ రామా! ప్రయత్నోపలబ్ధములయిన ఆకాశగమనాదిశక్తులు దేవయోని విశేషులకు సహజములు- ఎక్కడ ఏవిచిత్రమయిన క్రియా

శక్తి కనిపిస్తుందో అది వస్తుస్వభావముకాని ఆత్మవేత్తలకు స్వభావము కాదు- ఆత్మవేత్త కాకున్నా, ముక్తుడు కాకున్నా, ఆకాశగమనాదిశక్తి మణి, ఓషధి మొదలగు ద్రవ్యశక్తివల్లకాని, మంత్రశక్తిచేగాని, యోగాభ్యాసాది క్రియాశక్తిచేగాని, తత్పరిపాక కాలశక్తిచేగాని ఎప్పుడో ఒకప్పుడు కలుగుతుంది- కనుకనే నభోగమనాదిశక్తి దోమలు మొదలగు వానికికూడా కనిపిస్తోంది- నభోగమనాదులు ఆత్మవేత్తలకు అభిలాష విషయములు కావు- ఆత్మజ్ఞుడు అంటే ఆత్మే- వాడు తన స్వరూపంలోనే తాను తృప్తిపడతాడు- అవిద్యాకములయిన తుచ్ఛ ఫలములను అపేక్షించడు- అవిద్యను విడిచి ఆత్మవిద్యను సంపాదించు కున్న జీవన్ముక్తుడు తుచ్ఛఫలములలో మళ్ళీ మునగడు- విషయసుఖ రూపమయిన అవిద్యనే కొందరు యోగాభ్యాసాది శ్రమలచే సాధింప ప్రయత్నిస్తారు- అలాంటివాళ్లు అవిద్యామయులేకాని ఆత్మజ్ఞులు కారు-

అయితే తత్త్వజ్ఞుడు కాని, అతత్త్వజ్ఞుడు కాని, విభూతిసంపాదనమే ముఖ్యముగ పెట్టుకొని శాస్త్రోక్త క్రమంచేత ద్రవ్యకర్మలచే ప్రయత్నిస్తే అలాంటివారికి ఊర్ధ్వగమనాదిశక్తులు తప్పక లభిస్తాయి-

కాని ఆత్మవేత్తలకుకూడ కావాలనుకుంటే వానిని సంపాదించే శక్తి ఉంది- కాని ఆత్మవేత్త సర్వాతీతుడు- ఏషణారహితుడు- ఆత్మ తృప్తుడు- కనుక ఇతడేమీ చేయడు- ఏమీ కోరడు- అతడికి నభోగతితో పని లేదు- ఇతర భోగములతో పని లేదు- మహిమలతో పని లేదు- గౌరవసత్కారాలతో పనిలేదు- మరణజీవితములతో పనిలేదు- అశంకితంగా (తలచకుండా) వచ్చినదైతే సుఖంకాని, దుఃఖంకాని, మరణంకాని, జీవనముకాని, దానితోనే తృప్తిపడతాడు అనాసక్తితో- సముద్రుడు తనలో చేరిన నది ఎలాంటిదయినా దానిని తనలో చేర్చుకొని పరిపూర్ణంగా ఉంటుంటుంది- అలాగే ఆత్మవేత్తకూడ సంప్రాప్తమయిన భోగములు అనుకూలములయినా ప్రతికూలములయినా వికారం చెందడు- అఖండాకార వృత్తితోనే ఉంటాడు- వానికి కృతా

కృతములతో పనిలేదు- భూతకోటిలో ఎవరితోనూ పనిలేదు- ఎవడు ఆత్మజ్ఞానం లేశమాత్రమయినాలేక సిద్ధులనే కోరుతూ ఉంటాడో వాడు ఆసిద్ధులకు సాధకములయిన ద్రవ్యములతో సాధిస్తూనే ఉంటాడు వాటిని- మణి మంత్రాది యోగములచే ఆకాశగమనాది సిద్ధులు సంభవించుననుటది శాస్త్రప్రసిద్ధమయిన నియతిక్రమము- దానిని వ్యర్థపుచ్చడానికి హరిహరాదులకుకూడ సాధ్యంకాదు-

అయితే దేవాదులకు ఖేచరత్వాదిసిద్ధి అనేది వస్తుస్వభావము- కనుకనే అది వాళ్ళకు పుట్టినది మొదలుకొని యావజ్జీవం ఉంటుంది- చంద్రునకు చల్లదనముపోదు- సూర్యునకు వెచ్చదనముపోదు- ఇది స్వభావనియతి- సర్వజ్ఞుడుకాని, బహుజ్ఞుడుకాని, మాధవుడుకాని హరుడుకాని, నియతిని మార్చడానికి శక్తులుకారు- ద్రవ్య, కాల, క్రియా, మంత్ర, ప్రయోగములకు, ఈశక్తులు స్వభావములు నభోగతునాదులు.

విషములు చంపుతాయి- మద్యములు మదమును కలిగిస్తాయి- శక్తములు అనగా తేనెటీగల తేనెలుకాని ఉమ్మెత్తపండ్లుకాని తినినచో మనమును (డోకును) పుట్టిస్తాయి- అలాగే ద్రవ్యకాలక్రియా శక్తులు కూడ నియతంగా తమతమ ఫలములను సాధించితీరుతాయి-

రామా! ఇలాంటి అవిద్యాశక్తులనుండి అతీతుడయిన జ్ఞానికి ఇలాంటి శక్తిసంపాదనలో కర్తృత్వాకర్తృత్వములుండవు- ఈశక్తులు మోక్షపదవికి ఉపకరించవు- ఇచ్ఛకలవాడు శక్తిని సంపాదిస్తాడు- జ్ఞానికి ఇచ్ఛలేదు- అన్ని ఇచ్ఛలు అడుగంటితేకాని ఆత్మలాభోదయం కలగదు- అలాంటి అప్పుడు దానికి విరుద్ధంగా జ్ఞానికి ఇచ్ఛ ఎలాపుట్టుతుంది? జ్ఞానికికాని, అజ్ఞానికిగాని, ఇచ్ఛానిచ్ఛలనుబట్టి ప్రయత్నాప్రయత్నములూ, ఫలాఫలములు కలుగుతూ ఉంటాయి- కనుక వీతహవ్యుడు నభోగమనాది శక్తులు సిద్ధించాలని కోరలేదు- అందుకతడు ప్రయత్నించలేదు- అతనికవి సిద్ధించలేదు- ఆత్మజ్ఞానం కావాలని కోరిక కలిగింది- ఆ ప్రయత్నంకొరకు అడవికి వచ్చాడు- ఏకాంతంగా

వింధ్యాద్రిగుహాలో ప్రవేశించాడు- కనుక ఇచ్ఛానుసారంగా ఫలసిద్ధులు ఉంటాయి అనినేను చెప్పింది సిద్ధాంతం- దానికి మార్పులేదు- ఎవ రెవరు ఏ యే ఫలసిద్ధులను సంపాదించియున్నారో వారందరూ వాటిని కోరి ప్రయత్నించే సంపాదించారు- కనుక మహానుభావులయిన తత్త్వ వేత్తలకు మోక్షము విషయమై అవి ఉపకరించవు- కాన వారు వాటిని కోరరు- ప్రయత్నించరు- వారికవి లభించవు. ఇదీ వాటి పరిస్థితి. అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ మహర్షి! అయితే! వీతహవ్యుని శరీరము రాక్షసులచే ఏల భక్షింపబడలేదు? ఎందువల్ల బురదలో తడిసి కుళ్ళిపోలేదు? సూర్య మండలమునుండి భూమిని ప్రవేశించిన వెంటనే అంత శీఘ్రంగా ఎలా విదేహముక్తి పొందాడు? ఈప్రశ్నలకు సమాధానం సెలవివ్వండి? అన్నాడు రాముడు.

వసి॥ రామచంద్రా! అజ్ఞానికి దేహమునందు అహంభావ (నేనను) వాసన ఉంటుంది- రాగద్వేషాది మలములుకూడ ఉంటాయి- కనుక అతని శరీరం సుఖదుఃఖాది బాధలను అనుభవిస్తుంది- జీవన్ముక్తు నకు దేహముమీద అహంభావన ఉండదు- శుద్ధసంవిన్మాత్రంగా ఉంటాడు అతడు- కనుక సంవిన్మాత్రమును ఛేదించటానికి రాక్షసులకు కూడా శక్తిలేదు- కనుకనే గీతలలో శ్రీకృష్ణుడన్నాడు "అచ్ఛే ద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ" అని ఇంకా చెబుతావిను- యోగి ఏశక్తిచేతను ఛేదాది విలాసలచే (శరీరమును కోయుట మొదలగు పనులచే) ఆక్రమించుకొనబడడో యెన్నివందల సంవత్సరములకయినా- మనస్సు ఏపదార్థంమీద యేభావంతో ప్రస రిస్తుందో తన్మయం అవుతుంది- అనగా ఆవికారమును చెందుతుంది- శత్రువనుభావంతో ఒకపదార్థంమీద ప్రవేశించిన మనస్సు ద్వేషవికా రాన్ని చెందుతుంది- మిత్రుడనుభావంతో ఇంకొకపదార్థముమీద ప్రవేశించిన మనస్సు అనురాగవికారమును చెందుతుంది- ఈ రెండూ

లేని (రాగద్వేషములులేని) ఒకానొక బాటసారిమీదకాని, ఒకచెట్టు మీదకాని, ఒకగుట్టమీదకాని ప్రవేశించిన మనస్సు రాగద్వేషాలు రెండూ లేకుండా ఉంటుంది- ఇలాగే అచేతనపదార్థాలమీదకూడా ఉంటుంది- ఇష్టమయిన (మృష్టమయిన) వస్తువులమీద ఆసక్తమై ఉంటుంది- నీరసమయిన వస్తువుమీద నిస్పృహంగా ఉంటుంది- కటువయిన వస్తువులమీద వైరస్యం చెందుతుంది- కనుక రాగద్వేషాది వైషమ్యములు లేని చిత్తముగల యోగిశరీరముమీద రాక్షసుల చిత్తము (మనస్సు) యెప్పుడు ప్రవేశిస్తుందో అప్పుడు వెంటనే యోగిచిత్తము సామ్యమును పొందినదివలె రాగద్వేషాదిరహితంగా ఉండిపోతుంది- అందుచే రాక్షసాదులవల్ల హింసాప్రసక్తి లేదు యోగులకు- కనుకనే యోగశాస్త్రంలో అహింసాప్రతిష్ఠను ప్రస్తాపించి ఇలా అన్నాడు పతంజలి- "తత్సంన్నిధౌ వైరత్యాగః" యోగుల సాన్నిధ్యంలో క్రూర జంతువులుకూడ విరోధమును విడుచును" అని-

కనుక రామచంద్రా! క్రూరులయిన రాక్షసులుగూడ సమదృష్టిగల యతులతో సాంగత్యంకలిగే సరికి ద్వేషాదిరహితులవుతారు- (రాగద్వేషాలు ఉండవు వాళ్ళకు) అంచేత వాళ్లు యోగులను బాధించరు- దారినబోవు బాటసారి ఊరిదగ్గరనున్న తోటలనుగాని, లతలనుగాని నరకుటకు ప్రవర్తించడు- ఈయోగి శరీరమునకు సమీపమున మరొకజంతువు రాగద్వేషాది దోషయుక్తమయినది ఉండేయెడల ఈ రాక్షసులు దాన్నిమాత్రం బాధిస్తారు. హింసిస్తారు. కనుక ఏది ఎలాంటిదగునో అది దానికనురూపమయిన ఫలాన్ని పొందుతుంది. కనుక వీతహవ్యుని శరీరము క్రూరమృగములయిన వ్యాఘ్ర, సింహ, కీట, సరీసృపాదులచే (సర్పాదులచే)గాని రాక్షసులచేగాని భక్షింపబడలేదు. బాధింపబడలేదు. భూతలంమీద అలాగేఉంది. ఇంతటితో ఒక ప్రశ్నకు సమాధానం వచ్చింది నీకు.

ఇంక రెండవప్రశ్నకు జవాబు చెబుతావిను-

రామచంద్రా! సంవిత్తు (చైతన్యము) కాష్ఠములందూ లోష్టము లందూ రాతియందుకూడ సత్తాసామాన్యరూపంలో అభివ్యక్తంకా కుండా ఉంటుంది- అంతటా మూగసిల్లవానివలె. కాని లింగశరీరంలో మాత్రం చాంచల్యము కలదివలెనూ, అనేక వికారములతో విషమ మయినదిగానూ, పరిచ్ఛిన్నమయినదిగానూ, కనిపిస్తూ ఉంటుంది- అసమాహితచిత్తులకు ప్రతిబింబముగల జలములందువలె- కనుక వీతహ వ్యుని పుర్యష్టకము (లింగశరీరము) తత్త్వజ్ఞానముచేతను, సమాధియో గముచేతను, సామ్యమును చెంది అది విషమస్వభావాన్ని విడిచిపెట్టింది- అనగా భూజలాదులందున్న సంవిత్తుతో (చైతన్యముతో) సామ్యమును చెందినది అనగా సర్వవికారశూన్యమయిన బ్రహ్మభావమును చెంది నది- అందువలన భూజలాదిభూతములుకూడా అతనిశరీరమును విశీర్ణ పరచలేకపోయినది-

రామా! మరోయుక్తికూడా చెబుతాను. స్పందనే (చలనమే) నాశానికి కారణం- అది మనస్సువల్లపుట్టే వికారము- ప్రాణవాయువు వల్లకూడా యీవికారం పుట్టుతుంది- ఇది లోకవ్యవహారంలో ప్రసి ద్ధము- ప్రాణాదివాయువులకు ప్రాణనఆపాననాది వ్యాపారములే స్పందము- అవి లేనపుడు అయ్యవి రాతితో సమానములే- అలాంటి ప్రాణవాయువులు ధారణాయోగంచేత రాతితోసమానంగా దృఢంగా ఉన్నాయి- అంచేత అతని (వీతహవ్యుని) శరీరము నశించలేదు. పడి పోలేదు- బాహ్యాంభ్యంతరములందు ఎవని యింద్రియములకు చిత్తము వలనగాని, వాయువువలనగాని, చలనముండదో వానికి, ఇక వృద్ధిక్షయ ములుండవు- రామా! వీతహవ్యునకు బాహ్యాభ్యంతర స్పందము (చలనము) శాంతించినది- అంచేత అతని ధాతువులు (త్వక్, మాంస, రుధిరాదులు) పూర్వావస్థను వదలవు- చిత్తమయము (మనః ప్రయు క్తము) వాతమయము అను దేహచలనము తగ్గిపోతే పూర్తిగా ఇంక ఆశరీరము మేరుపర్వతం అంతటి స్థిరమవుతుంది-గట్టిదవుతుంది-(ఇక్కడ

బాహ్యస్పందం అంటే చేతులు కాళ్లు మొదలయినవి చలించుట) అభ్యంతర స్పందమంటే ప్రాణాదుల చలనము.) ఇది మనం లోకంలో ప్రసిద్ధంగా చూస్తున్నాం- బాహ్యేంద్రియచలనమూ, ప్రాణవాయు చలనమూ లేకపోతే శవశరీరాలు కట్టెలాగ ఉండటం- కనుక వెయ్యి సంవత్సరములున్నా యోగుల శరీరాలు నీటికి కుళ్ళవు- నిప్పుకు కాలవు. గాలికి కదలవు- కత్తికి తెగవు-

ఇంక వెంటనే వీతహవ్యుడు విదేహముక్తి చెందుటకు కారణ మేమి? అని అడిగావు. అది చిట్టచివరి ప్రశ్న. జవాబు చెబుతా విను దానికి-

రామా! జ్ఞాతజ్ఞేయులూ, వీతరాగులూ, అయిన మహానుభావులు శరీరంలో స్వతంత్రులై ఉంటారు- దైవముకాని, ప్రాక్తనకర్మలు కాని, ఐహికకర్మలుకాని, జన్మాంతరవాసనలుకాని, అతని చిత్తమును (మనస్సును) నియమించలేవు- ఇందుకు ప్రమాణంగా "తస్యహ న దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మాహ్యేషాం సభవతి" అను శ్రుతి ఉన్నది. కనుక తత్త్వవిదగ్రేసరా! కాకతాళీయంగా మనస్సు దేనిని భావిస్తుందో దానిని వెంటనే చేసితీరుతుంది- కనుక కాకతాళీయ యోగంచేత వీతహవ్యుని జీవచైతన్యము వివేకమునొందినది. ఆత్మ సాక్షాత్కారమును పొందినది- అందులో స్థైర్యం చెందింది- అదే ప్రతిభ విదేహముక్తిదశకు వచ్చింది- వెంటనే విదేహముక్తుడయినాడు- అతనికి అలాంటి స్వాతంత్ర్యంఉంది- రామా! వాసనారహితమయిన మనస్సు, కర్మపాశశూన్యమూ, అవిద్యామలరహితమూ అవుతుంది. అలాంటి మనస్సు ఉపాధిగాగల జీవుడు ఏమి అనుకుంటే అది అవుతాడు- కనుకనే సకలశక్తిమయుడయిన మహేశ్వరుడయినాడు వీతహవ్యుడు- కనుకనే పెద్దలంటారు ఇలా- "తుషేణ బద్ధో వ్రీహి స్స్యాత్ తుషాభావేతు తండులః । పాశబద్ధః సదాజీవః పాశముక్తః సదాశివః ॥" అని గింజమీదపొట్టుఉంటే ధాన్యమంటారు- పొట్టుపోతే బియ్యమం

టారు- అలాగే అవిద్యాపాశబద్ధుడయితే జీవుడు- అదిపోతే పరమేశ్వరుడు- అని దీనియర్థము-

## ౯౦. చిత్తోపదేశవిచారయోగము.

వసి॥ రామచంద్రా! వీతహవ్యునకు మనోనాశమగ్యే పరిస్థితి వచ్చేసరికి తత్త్వవిచారంవల్ల మైత్ర్యాదిగుణములు ఆవిర్భవించాయి అతనిమనస్సులో.

శ్రీరా॥ మహర్షి! తత్త్వవిచారోదయంవల్ల చిత్తస్వరూపం అంతర్హితమయ్యేసరికి మైత్ర్యాదిగుణములు పుట్టాయంటారేమిటారు- మనస్సు బ్రహ్మయందు లీనమయితే మైత్ర్యాదిగుణములు దేనియందు కలిగాయి? ఎక్కడ స్ఫురించాయి? చెప్పండి- అని అడిగాడురాముడు-

వసి॥ రామా! మనోనాశము రెండురకములు- సరూపమనోనాశము- అరూపమనోనాశము అని- జీవన్ముక్తుని మనోనాశము సరూపమనోనాశము- విదేహముక్తుల మనోనాశము అరూపమనోనాశము ఎప్పుడును చిత్తముయొక్క ఉనికి దుఃఖహేతువు. చిత్తనాశము సుఖహేతువు- సుఖపడాలంటే చిత్తనాశమునే సంపాదించాలి- తమోగుణప్రధానమయిన వాసనాజాలంతో కూడిన మనస్సు కేవలదుఃఖహేతువు- ప్రాక్తనకర్మాధీనమయిన దేహేంద్రియ విషయాదులయొక్క గుణసంభారమునందు మమాభిమానముగల చిత్తము దుఃఖహేతువు- తత్త్వజ్ఞానములేని ఇలాంటి చిత్తమే జీవుడనబడతాడు- మనస్సు ఉన్నంతవరకు దుఃఖక్షయమెట్లు? మనస్సు అస్తంగతమయితే సంసారం అస్తమిస్తుంది- అజ్ఞానియందు వాసనాజాలమనే వ్రేళ్ళతో పెనగొనియున్న చిత్తము దుఃఖమనే చెట్టుకు అంకురము-

శ్రీరా॥ స్వామీ! ఎలాంటి జీవుని మనస్సు నశించియుంటుంది? నశించిన మనస్సుకు ఆకారమేమి? దానికి నాశమనేది ఎలాంటిది? నశించిన మనస్సునకు వ్యవహారక్షమత్వం ఎలాంటిది? (అనగా నశించిన) మనస్సు మళ్ళీ పనిచేయుటం ఎలా? చెప్పండి! అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! చిత్తసత్తను (మనస్సుయొక్క ఉనికిని) గురించి లోగడ చెప్పాను నీకు- ఇపుడు దాని నాశమును గురించి చెబుతాను విను- ఏధీరుని బాహ్యాభ్యంతరసుఖావస్థలు సామ్యావస్థనుంచి చలింప చేయలేవో వానిచిత్తము నశించినట్లు- వీడు, వాడు, నీవునేను అను చింత ఎవరిని పరిచ్ఛేదపరచదో వానిచిత్తము నశించినట్లు- ఆపత్తుకాని, కృపణత్వముకాని, ఉత్సాహముకాని, మదముకాని, మాంద్యముకాని మహోత్సవముకాని, ఎవనికి వైరూప్యమును ముఖ (వైవర్ణ్యమును) కలిగించవో, వానిచిత్తము నశించినట్లు- రామా! ఇది మనోనాశము- ఇదే జీవన్ముక్తునియొక్క చిత్తనాశావస్థ-

రామా! మనస్త (దృశ్యప్రపంచం)పరమార్థసత్యమని తలచుట) కేవలమూఢత- ఆభావం నశిస్తే చిత్తనాశ మంటారు- అపుడే శుద్ధ సత్వభావ మబ్బుతుంది-ఆచిత్తనాశముయొక్క సత్వవిలాసమే కొందరు చిత్తసత్త- (చిత్తముండుట) అని అన్నారు- అలాంటి చిత్తమే మైత్ర్యాదిగుణములు కలది అవుతుంది- ఉత్తమవాసనలు ఉంటాయి అలాంటిచిత్తంలో- పునర్జన్మనుమాత్రం ఈయవు ఆవాసనలు- అలాంటి మనస్సుకూడ జీవన్ముక్తులకు ఉంటుంది- వాసనాయుక్తమై పునర్జన్మకు కారణముకాకుండా ఉన్న జీవన్ముక్తుని మనస్సత్తయే సత్త్వమని అంటారు పెద్దలు- వ్యుత్థానకాలంలో ప్రతిభాసిస్తూ ఉంటుంది కనుక సరూపము. దేహాదిపరిచ్ఛేదభావము లేదుకనుక మనోనాశము- కనుక దీనికి సరూపమనోనాశమని పేరువచ్చినది- కనుకనే మైత్ర్యాదిగుణములుకూడ ప్రతిభాసిస్తూ పుటతాయి. జీవన్ముక్తునియొక్క సత్త్వమని పేరుగల మనోనాశమందు-

ఇంక అరూప మనోనాశమని నేను చెప్పినది విదేహముక్తియే- అది కేవలము నిష్కలాత్మకము- పరమపావనమయిన విదేహముక్తి దశలో సమగ్రమయిన గుణసంపదకు ఆధారమయిన శుద్ధసత్త్వముకూడ ప్రలీనమవుతుంది- ఇలాంటి చిత్తనాశదశలో (విదేహముక్తిదశలో)

ఏమీ ఉండదు- గుణములు లేవు. దోషాలు లేవు. ఉదయం లేదు అస్త మయం లేదు. హర్షామర్షములు లేవు. తేజస్తమస్సులు లేవు. సంధ్యా దినరాత్రములు లేవు. దిక్కులు లేవు. ఆకాశము లేదు. ఊర్ధ్వాధో భాగ ములు లేవు. వాసనలు లేవు. రచన లేదు. ఇచ్ఛానిచ్ఛలు లేవు. సత్తా లేదు. అసత్తా లేదు. ఆస్థానం (విదేహముక్తిస్థితి) సాధించడం చాలా కష్టం. ఏ మహానుభావుని బుద్ధి సంసారాడంబరము యొక్క ఆవలి ఒడ్డును చేరు తుందో అలాంటివానికే ఆస్థానము లభిస్తుంది. ఇలాంటి దశలో ఉన్న వారికి ప్రాతిభాసిక చిత్తము లవమాత్రంకూడా ఉండదన్నారు వసిష్ఠులు.

## ౯౧. సంసారలతకు బీజమును నిరూపించుట.

శ్రీరా॥ మహాత్మా! ఈ సంసారమనే లతకు బీజమేమి? దానికి బీజమేమి? దానికిబీజమేమి? దానికి బీజమేమి? టూకీగా చెప్పండి నాకు బోధపడేలాగ అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! లోపల చిత్రవిచిత్రములయిన శరీరములను తయారుచేసే కర్మవాసనలుగల లింగశరీరము (సూక్ష్మశరీరము) సంసార లతకు కారణము-

౨. దానికి బీజము ఆశాపరవశమయ్యే చిత్తము- చిత్తము శరీ రమునకు కారణమనుటలో మీకు స్వప్నావస్థే ఉదాహరణము- స్వప్న దశలో మనస్సు (చిత్తము) వల్లనే ఉన్నవి లేనివి అనేక శరీరాలు తయారగుచున్నాయి- ఆశరీరాలతో కొంత వ్యవహారంకూడా జరుగు తోంది ఆదశలో- లోకంలో తరచుగా మరణింప నున్నవారికి విచిత్ర వస్తువులను చూపించాలని సంకల్పిస్తారు గంధర్వులు- వారిసంకల్పమనే చిత్తమునుండి ఒకపురము (పట్టణము) తయారయి (పుట్టి) ఆము మూర్ఖులకు- (ఆసన్నమృత్యువులకు) కనిపిస్తూ ఉంటుంది- దీనినే గంధర్వ నగరం- అంటున్నారు- అలాగే స్వప్నంలోకూడ చిత్తమునుండి (వలననే) శరీరం పుటుతోంది- సర్వ ప్రపంచమూ హిరణ్యగర్భునియొక్క

మనోవికారమాత్రమే- అని శ్రుతిస్మృతి పురాణముల ప్రసిద్ధికలదు- కనుక మనస్సువల్ల శరీరం పుటుతుందా! అనే సందేహం అక్కరలేదు.

3. తీగలు వేయగలిగిన చిత్తమనే వృక్షమునకు రెండుబీజములు. 1టి ప్రాణపరిస్పందము(ప్రాణవాయుచలనము) 2. దృఢభావన(వాసన) నాడీస్పర్శవల్ల ప్రాణవాయువు లేచి చలిస్తుంది- అప్పుడు వెంటనే చిత్తము (మనస్సు) చిద్వికారమును చెందుతుంది- అనగా చిద్వ్యాప్త మవుతుంది-

ప్రాణవాయువు ఎప్పుడు డెబ్బదిరెండువేల నాడీమార్గముల యొక్క ఛిద్రములందునూ తిరగవో బాహ్యపదార్థములను తెలిసికొను నట్టి సంస్కారము ఉద్బోధము చెందనందున అపుడు చిత్తముపుట్టదు- (అనగా మనస్సునకు ఏవిధమగు సంకల్పమూ ఉండదు.) ప్రాణస్పందన మనునది చిత్తముద్వారానే గుర్తించబడుతుంది- హిరణ్యగర్భునియొక్క చిత్తము ప్రపంచాకారమును చెందుటకూడా సమష్టి ప్రాణస్పందము వల్లనే ఇలాంటి సమష్టిప్రాణస్పందన విషయమై ఉపరతమై చైతన్యము నిష్క్రియంగా శాంతించి ఉండడమే ప్రపంచప్రళయముకాని, మోక్షము కాని చేతితో తట్టితే బంతిఎగిరినట్లు ప్రాణస్పందమువల్లనే సంవిత్తు (చైతన్యము) చలిస్తుంది- శరీరములందు స్ఫురిస్తుంది- (ప్రకాశిస్తుంది) కనుక ప్రాణస్పంద నిరోధమువలననే నిశ్శ్రేయసమను మోక్షము లభిస్తుంది- అదిలేనిచో చిత్తమునకు విక్షోభముకలిగి అనంతములయిన దుఃఖములు సంప్రాప్తములవుతాయి- కనుక రామా! ప్రాణవాయువు యొక్క స్పందములచేతను, కర్మవాసనల ప్రేరణలచేతనూ, సంవిత్తును (చైతన్యమును) పొంగకుండా (చలించకుండా) (సంకల్పసహితంకాకుండా) నీవు చేయగలిగితే అప్పుడు నీవు ముక్తుడవన్నమాటే- రామా! యోగులు చిత్తశాంతికొరకే ప్రాణాయామాద్యుపాయములచేత ప్రాణ నిరోధమును చేస్తున్నారు- చైతన్యము విక్షేపరహితంగా స్వస్థంగా ఉండటమే ప్రాణసంరోధము-

రామా ! చిత్తముయొక్క పుట్టుకకు రెండవకారణం చెబుతా విను. దృఢభావనవల్లకూడా చిత్తము ఉత్పన్నమవుతుంది- భావన అనగా సంస్కారము. పూర్వాపర విచారణలేకుండా దేహేంద్రియాది పదార్థాలను అహంమమాభిమానములచే స్వీకరించినందువలన కలిగెడి సంస్కారమని అర్థము- ఆవాసన దేహాదులందు ఆత్మబుద్ధిని పుట్టించుటే కాక బాహ్యపదార్థములందు సత్యతాబుద్ధిని (సత్యములనుబుద్ధిని)కూడ పుట్టిస్తుంది- ఆవాసనకు పరాధీనుడయినవాడు చూచినవస్తువల్లా నిజమయినదని (సత్యమయినదని) అనుకుంటాడు- వాసనావేగమునకు వివశుడై తనస్వరూపాన్నికూడా విడిచిపెటతాడు- కనుక రామా ! అనాత్మయందు ఆత్మభావనయు అవస్తువునందు వస్తుత్వభావనయు (అనగా అసత్యమయిన దానియందు సత్యమను భావనయు) అను మిథ్యాజ్ఞానమే చిత్తమని గుర్తించు- దృఢాభ్యాసవాసనచే అతిచంచలమై చిత్తము జన్మజరామరణములకు కారణమవుతుంది- ఈవాసన లేకపోతే హేయోపాదేయముల ఆకారమును చెందకపోతే అప్పుడు చిత్తమనేదే పుట్టదు. సంకల్పములే ఉండవు- అమనస్కత్వం సంప్రాప్తమవుతుంది- వస్తుసంబంధమయిన భావనయే ఉండదు. ఇంక శూన్యమయిన చిదాకాశంలో చిత్తమనేది ఎక్కడిది ? కాబట్టి రామా ! వస్తువును నిజమయినదని అనురాగంతో భావించడమే చిత్తమని నే తెలుస్తాను- దృశ్యప్రపంచమంతా మిథ్యఅనుకొనే వానికి చిత్తము పుట్టనేరదు. అయితే జీవన్ముక్తులకు మాత్రం దగ్ధపటాకారంగా ఉంటుంది చిత్తము- జీవన్ముక్తుని వ్యవహారం అంతా కుండ తయారయిన తరువాత తిరిగెడి కులాలచక్రభ్రమణమువలె ఉంటుంది- ఇలాంటి జీవన్ముక్తులు ప్రారబ్ధక్షయం కాగానే చిత్తరహితులై విదేహముక్తులవుతారు-

కనుక రామా ! చిత్తమునకు బీజములు (కారణములు) రెండు- 1టి ప్రాణస్పందము- 2. వాసన- ఈ రెంటిలో ఏయొకటి నశించినా

రెండవది తప్పక నశిస్తుంది- ఎందువల్లనంటే చిత్తోత్పత్తికి (చిత్తము పుట్టుటకు) రెండూ కలిసి కారణములు ఏదీ ఒక్కటి కారణంకాదు- ఘటాకాశంతో నీరు తీసుకోవాలంటే ఘటమూ ఉండాలి- జలాశయమూ ఉండాలి- (నీటిమడుగు ఉండాలి.)

౮. కనుక ఈ ప్రాణస్పంద వాసనలు రెండూ బీజాంకురన్యాయంగా పరస్పరం కారణములు- వాసనావశంవల్ల ప్రాణస్పందము- ప్రాణస్పందంవల్ల వాసన- ఇలా ఈ రెంటికీ బీజాంకురన్యాయం ఉంది- కనుక వాసనాప్రాణస్పందములు రెండూకలిసి చిత్తోత్పత్తికి కారణములయి నందున ఈ రెంటిలో ఏయొకటి నశించినా రెండవదికూడా నశిస్తుంది తప్పక.

౯. ఈ ప్రాణస్పంద వాసనలకు శబ్దస్పర్శాదివిషయములు బీజము- విషయపరిత్యాగంచేస్తే ప్రాణస్పంద వాసనలు రెండూ నశిస్తాయి సమూలంగా- విషయములను సంవిదభిన్నముగ (చిదభిన్నముగ) భావించడమే విషయపరిత్యాగము. దీనినే సంవేద్యత్యాగమంటారు- లోపలకాని, వెలుపలకాని, సంవేద్యములు, సంవిత్తును విడిచి వేరుగ లేవు-

కలలో తనమరణము దేశాంతరగమనము స్థాణునకు పురుషత్వము, చంద్రసూర్యకిరణములకు, దండాకారము, త్రాడు, సర్పముగుట చంద్రుడు రెండుగా కనిపించుట ఇది అంతా సంవిత్తువల్లనే- అనగా ప్రతిభాసమాత్రమే- కనుక ఈజగజ్జాలంకూడా సంవిన్మాత్రమే- కనుక సంవేద్యములన్నీ సంవిద్రూపములని భావిస్తే ఇంక సంవేద్యములయొక్క భావన ఉండదు- పూర్వము చూచినదానినికాని, చూడని దానినికాని, యేది భాసిస్తూ ఉంటుందో దానిని అంతా ప్రయత్నపూర్వకంగా తుడిచి వేసికోవలెను. అలా తుడిచివేసికోనకుండుటయే మహాసంసారము- తుడిచివేసికొనుటయే మోక్షము- కనుక రామా! నీవు అజడుడవై సంవేద్యములను పరిత్యజించి పూర్ణానందుడవగుము-అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ మహర్షీ! జాడ్యమును (జడత్వమును) విడిస్తే, సంవేదనము మిగిలి ఉంటుంది- సంవేదనమును విడిచిపెడితే జాడ్యము (జడత్వము) మిగిలి ఉంటుంది- ఈనియమము తప్పదు- అట్టిచో మీరు "అజడోఽగళితానందః త్యక్తసంవేదనో భవ" జడుడవుకాక, సంవేత్తవుకాక ఉండమంటిరే! ఇది విరుద్ధముకదా! ఒకేవ్యక్తి పరస్పర విరుద్ధములయిన రెండు స్వభావములు కలవాడగుట ఎలా సంభవిస్తుంది. అని అడిగాడు-

వసి॥ రామా! నేను చెప్పినదానిలో పొరపాటులేదు- విరోధమూలేదు- నీవు సరిగా అర్థం గ్రహించక అడిగావు- చెబుతా విను సమాధానం చైతన్యము బాహ్యవస్తువులను సత్యతాబుద్ధితో గ్రహించడమే నేను చెప్పిన "సంవేదన" అనే శబ్దానికి అర్థము- సం+వేదనం= సం=సత్యతాబుద్ధితో, వేదనం=బాహ్యార్థములను గ్రహించుట (తెలిసికొనుట) సంవేదనమని ఆపదమునకు వ్యుత్పత్త్యర్థము- కాబట్టి దృశ్య ప్రపంచం మిథ్య అని దృఢంగా గ్రహించిన జీవన్ముక్తులకు బాహ్య పదార్థములందు సత్యత్వబుద్ధి లేదు- ఆభాసమాత్రంగానే భాసిస్తూ ఉంటవి వానికవి- అతని వ్యవహారంకూడా ఆభాసమాత్రమే- అంచేత ఇతనికి దేనిమీదనూ ఆస్థ ఆదరము లేదు- కనుక దేనినీ ఆదరంగా చూడడు- సత్యంగా చూడడు- కనుక జీవన్ముక్తుడు అసంవేదనుడగును. స్వయముగ స్వప్రకాశచిదేకరస పూర్ణుడు కనుక అజడుడూ అగును. ఎన్ని కార్యములు చేసినాసరే-

ఇలాగంటి జాడ్యవినిర్ముక్తమయిన అచ్ఛవేదనము(నిర్మలమయిన సంవేదనము) అనాగత విషయములందు కూడా ఉంటుంది జీవన్ముక్తుడికి- నిర్వికల్పసమాధివల్ల పరిపూర్ణానందం లభిస్తుంది- అలాంటి యోగులకు బ్రహ్మాకారవృత్తిరూపమయిన సంవేదనము బ్రహ్మజ్యోతిస్సుచే బాధితమై లోపలే లీనమవుతుంది- రామా! నీవుకూడా ఈయోగ దృష్టిని అవలంబించి దుఃఖసాగరమును తరించుము- చిదాత్మయే మిథ్యా

భూతములయిన బంధమోక్షములను కల్పించుకొనుచున్నాడు- చిదాత్మ మాటిమాటికి సంకల్పించి సంకల్పించి, సాంకల్పికమయిన శరీరాన్ని ధరిస్తాడు- ఆశరీరధారణయే జన్మజరామరణములకు బీజమవుతుంది- క్రమంగా బంధమంతా తయారవుతుంది- క్రమంగా సంకల్పములను పరిత్యజించడం ప్రారంభిస్తే మోక్షంపొందుతాడు- కనుక రామా! ప్రపంచం అంతా సంవిన్మాత్రము రెండవవస్తువు లేదనే సమ్యగ్జ్ఞానము చేతనే జీవుడు అద్వితీయుడవుతాడు-

౭. రామా! ఇంక ఇట్టి సంవిత్తునకు సన్మాత్రము (బ్రహ్మ) బీజము- సత్త అనేది రెండురకములు- ఇందులో ఒకటి అనేక రూపములుకలదై యుండును- రెండవది యేకరూపముగనే ఉండును- మొదటిది ఘటసత్త, పటసత్త, కుడ్యసత్త, కుసూలసత్త, అని అనేక ఆకారములతో ఉండును- రెండవదానికి ఇలాంటి ఆకారభేదములు లేవు- సామాన్యరూపముగనుండును- దీనికి విశేషములేవియు నుండవు. కేవలసన్మాత్రము ఇది- నిర్లేపకము- ఏకరూపము- నానారూపములయిన సత్త సత్యమయినదికాదు- ఏకరూపమయిన సత్త నిర్మలమయినది- ఇదెప్పుడూ నశించదు- ఎల్లపుడు చిదేకరసము- కనుక స్ఫురిస్తూ ఉంటుంది-

రామా! ఈసత్తను కాలగతమని కొందరూ అవయవగతమని మరికొందరూ అవయవగతమని మరికొందరునూ కల్పిస్తున్నారు- నీవు మాత్రం ఈభాగాన్ని విడిచిపెట్టి సన్మాత్రైకపరుడవగుము- పై మూడు సత్తలుకూడా కాల, అవయవాది, విభాగములను తీసివేస్తే సన్మాత్రమే కనుక ఉత్తమసత్తలే- కాని ఆవిభాగముతో అవి అవాస్తవములునూ, అనుత్తమములునూ అగుచున్నవి- కనుక రామా! సత్తాసామాన్యము నొక్కదానినే భావిస్తూ పరిపూర్ణ పరానందుడవగుము

సామాన్యమాత్రమునకు పరమావధియయిన సత్తయే ఈప్రపంచమునకూ, ప్రతిబింబచైతన్యమునకును బీజము- (కారణము) సత్తా

అనునది యెచ్చట పరమావధిని చెందునో, ఆ స్థానమును పొందినవారు మరల సంసారమునకు రారు— ఇదియే అన్నిటికీ కారణము— దానికి మరొకటి కారణము లేదు— సారములయిన వస్తువులన్నిటికీ సారమయిన వస్తువిది— దీనికంటె సాగమయిన వస్తువు లేదు— ఈచిద్దర్పణము నందే సమస్త వసువులు ప్రతిబింబిస్తాయి— కమలకు సముద్రము ఈ బ్రహ్మపదార్థము. ఈశని సంబంధమువలననే అన్ని పదార్థములు పుడుస్తాయి— ఆనందరూపమయిన ఈ బ్రహ్మానందిలోనే సకల వస్తుజాతములు పుట్టి పెరిగి నశిస్తున్నాయి— ఈ బ్రహ్మపదార్థము గురువయినవాటికి గురువు— తేలికవాటికి తేలికది— స్థూలములకు ఇంకా స్థూలము— అణువులకు ఇంకా అణువు— దూరస్థములకు ఇంకా దూరస్థము— సమీపస్థములకు ఇంకా సమీపస్థము— చిన్నవాటికంటె చిన్నది— పెద్దవాటికంటె పెద్ద— తేజస్సులకు తేజస్సు— తమస్సులకు తమస్సు— వస్తువులకు వస్తువు— దిక్కులకు దిక్కు. అది ఏదీ కాదు— అన్నీ అవును— అది ఉన్నది— అది లేనిది— అదిదృశ్యము— అదృశ్యము— అది (అస్మి) ప్రత్యగ్రూపము— (నాస్మి) అహంకారరూపంలో పరాగ్రూపము— రామా! సర్వథా పరమ పావనమయిన ఆస్థానంలో స్థైర్యం చిక్కునట్లు ప్రయత్నించు— త్వరగా సంసారభయవిముక్తుడవయ్యేదవు— అన్నారు వసిష్ఠులు—

గమ॥ గురూ! ఏమిటి ఈసర్గలోనిసారం? ఏమిటో కారణం? కారణం, అని చాలసార్లు అన్నారు వసిష్ఠులు— అన్నాడు శిష్యుడు—

శిష్యా! అర్థం ఏమీలేదు— సంసారమునకు కారణము లింగ శరీరమనీ దానికి కారణం చిత్తమనీ, దానికికారణం ప్రాణస్పంద దృఢాభ్యాసములనీ, వానికికారణం సంవేద్యములు, విషయములనీ, వాటికి కారణం సత్తాసామాన్యమనీ, దానికికారణము నిర్గుణబ్రహ్మమనీ, దీనికి కారణము లేదనీ, ఇదే పరమకారణమనీ ఈసర్గలోని సారాంశము— అన్నారు గురువులు—

## ౯౨. సంసారనిరాకరణయోగము.

శ్రీరా॥ మహర్షీ! మీరు సంసారలతకు కారణములను పరంపరగా అనేకం చెప్పారు- అందులో దేనిని నివర్తింపచేసికుంటే తొందరగా సంసారం నశిస్తుంది? ముక్తి లభిస్తుంది-

అథవా! "అథాస్యాః సంవిదో రామ" ఇత్యాది శ్లోకములచే, ప్రతిబింబచైతన్యమునకు, బింబచైతన్యముకారణమని చెప్పుతూ, భూమికాభేదంతో కొన్ని మోక్షబీజాలు (మోక్షకారణాలు) చెప్పారు మీరు- వాటిలో ఏ మోక్షకారణమును ఆశ్రయిస్తే సంసారనివృత్తి కలిగి వెంటనే మోక్షంలభిస్తుందో ఆ ఉపాయం చెప్పండి- అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! నేను చెప్పిన సంసార కారణములలో ఉత్తరోత్తర కారణముల (ఉపాయముల) ఆశ్రయిస్తే శీఘ్రంగా ముక్తి లభిస్తుంది-

లేక శోధిత త్వంపదార్థముయొక్క పరాకాష్ఠయగు అఖండచిదేకరసమను వృత్తిగా ప్రగాఢ ప్రయత్నంచేత చిత్తాన్ని నిలిపి నిశ్చలపరచినట్లయితే క్షణకాలమైనా తత్త్వసాక్షాత్కారం కలిగినట్లయితే ఆక్షణంలోనే ముక్తిని అందుకొంటావు నీవు-

ఇందుకు శక్తి లేకపోతే నీవు సత్సామాన్యరూపమునందయినా చిత్తంనిలిపి ధ్యానంచెయ్యి- అలాగా శోధిత జగత్కారణ తత్త్వమునందయినా చిత్తంనిలిపి ధ్యానించు- ఎక్కువ ప్రయత్నంచేస్తే యిందులో ముక్తి పొందుతావు-

అందుకూ శక్తి చాలకపోతే శోధిత త్వంపదార్థమునందయినా చిత్తంనిలిపి ధ్యానంచేయి- ఎక్కువ ప్రయత్నంతో క్రమంగా ముక్తి పొందుతావు-

ఇంతేకాని కేవల సంవేద్యమునందు (విషయమునందు) మాత్రం ధ్యానం కుదరదు- సంవేద్యము లన్నిటియందూ వాటికంటె ముందే

సంవిత్తు (చైతన్యం) స్ఫురిస్తూ ఉంటుంది- కనుక దానిని (సంవిత్తును) ఆచ్ఛాదించటం (కప్పిపుచ్చటం) సాధ్యం కాదు- కనుక కేవల సంవేద్య మనేదే సంవిత్తు లేకుండా నీకు దొరకదు కనుక దానియందు ధ్యాన మనేది అసంభవం- నీవు చింతించినా (ధ్యానించినా) వెళ్ళినా ఉన్నా ఇంకేమైనా చేసినా అన్నిటా చైతన్యము ఉండేఉంది- కనుక అదిలేని సంవేద్యం అలభ్యం నీకు- సర్వ దేశ, కాల, వస్తు, క్రియలన్నీ సంవిద్రూపములు- కనుక కేవల సంవేద్యము అసంభవము-

మరియు వాసనాసంపరిత్యాగమునందూ, మనోనాశమందూ ప్రయత్నంచేసే యెడల అప్పుడుకూడ సంసారము సడలవచ్చు- ఆధి వ్యాధులు క్షీణించవచ్చు-

కాని, నేను వెనుక జెప్పిన ఉపాయాలన్నిటికంటె ఇది (వాసనా త్యాగమనే ఉపాయం) విషయమయినది- దుస్సాధ్యమయినది- మేరు పర్వతాన్ని పెళ్ళగించవచ్చుకాని వాసనాత్యాగమును సాధించలేము

మనోలయం అయ్యేటంతవరకు వాసనాక్షయం కాదు- వాసనా క్షయంకానిదే చిత్తశాంతి ఉండదు- చిత్తశాంతి లేనంతవరకు తత్త్వ జ్ఞానం అబ్బదు- (కలగదు) తత్త్వజ్ఞానం లేనిదే చిత్తశాంతిలేదు- చిత్తము నశించనిదే తత్త్వజ్ఞానం కలగదు- వాసనాక్షయం కలుగనిదే తత్త్వజ్ఞానం కలుగదు- తత్త్వజ్ఞానం కలగందే వాసనాక్షయం జరగదు- (కలగదు) కనుక తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములు పరస్పర కారణములు. అందుచేత వీటిని సాధించడం కష్టం-

కాబట్టి రామా! వివేకవంతుడవై పురుషప్రయత్నంతో భోగే చ్ఛను దూరంగా విడిచి ఈమూటిని సాధించాలి-

ఈమూటినీ ఏక కాలంలో మాటిమాటికీ అభ్యసించకపోతే ఎన్ని సంవత్సరములకయినా ముక్తి దొరకదు- సమకాలాలలో ఈమూడు అభ్యసిస్తేనే ఫలిస్తాయి- విడదీసి ఒక్కొక్కదానిని ఎంతకాల మభ్యసిం

చినా ఏమీ లాభంలేదు- ఒక్క సైనికుడు శత్రువును ఓడించలేడు- ఒక్క ఉపాయము ముక్తినియ్యలేదు- కాబట్టి నాయనా, వాసనాక్షయ మనోనాశ, తత్త్వజ్ఞానములు మూడూ ఏకకాలంలో అభ్యసించాలి ప్రయత్నపూర్వకంగా- దీనివల్ల హృదయగ్రంథులన్నీ తెగిపోతాయి- అనేక జన్మశతములనుంచీ ఉన్న ఈసంసారస్థితి చిరకాలాభ్యాసయోగం లేనిదే నశించదు- కనుక నీవు వెళ్లుచున్నా, తింటున్నా, ఆఘ్రాణిస్తున్నా, మేలుకున్నా, నిద్రిస్తున్నా, వీటిని అభ్యసిస్తూ ఉండు-

ఈమూటితో పాటు నాల్గవది ప్రాణాయామం- దాన్నికూడా అభ్యసించాలి- వాసనాపరిత్యాగమువల్లనూ చిత్తము అచిత్తమవుతుంది- అనగా నశిస్తుంది- ప్రాణస్పందనిరోధంవల్లనూ, చిత్తనాశము కలుగుతుంది. ఈ రెంటిలో నీకు ఏది యిష్టమయితే దానిని ఆచరించు- పరమార్థవస్తువును తెలిసికొన్నందున వాసనపుట్టదు- అనగా తత్త్వజ్ఞానం వల్ల వాసనాక్షయం కలుగునని భావము- పరమార్థవస్తువనగా, త్రికాలాబాధితమయిన పరమాత్మ (సన్మాత్రము)- ఇదియే సర్వవస్తువులకు ఆద్యంతములందున్నది- దీనిని గుర్తించినవానికి వాసన ప్రవర్తించదు- శరీరము నశ్వరమని దృఢనిశ్చయమున్నను వాసనపుట్టదు- వాసన అనే ఐశ్వర్యం నశిస్తే చిత్తం ప్రవర్తించదు- గాలితగ్గితే ఆకాశానికి దుమ్ము లేవదు- ప్రాణస్పందమే చిత్తస్పందము- కాన ప్రాణస్పంద నిరోధము చేస్తే చిత్తస్పందము కలుగదు- కనుక ప్రాణస్పంద నిరోధము విషయమై ప్రయత్నం చెయ్యాలి బుద్ధిమంతులు క్రమక్రమంగా-

అథవా చిత్తనిరోధంలో ఈహఠయోగాభ్యాసం చేయలేకపోతే రాజయోగమును అభ్యసించాలి- అంకుశంలేనిదే ఏనుగు లొంగదు- యోగములేనిదే మనస్సు జయించబడదు- కనుక చిత్తజయమునకు (మనోనిగ్రహమునకు) 1. అధ్యాత్మవిద్యాధిగమమూ, 2. సజ్జనసాంగత్యమూ, 3. వాసనాసంపరిత్యాగమూ, 4. ప్రాణస్పందనిరోధమూ, పరిపూర్ణమయిన ఉపాయములు- ఈ ఉపాయములుండగా హఠయోగం

చేత మనోనిగ్రహమునకు పాటుపడేవాళ్ళు దీపమును ఆర్పి కాటుకపొడి చల్లి చీకటిని పోగొట్ట ప్రయత్నించే వాళ్ళతో సమానులు- మదపు టేనుగులను తామర కాడలతో కట్టివేయతలచిన వాళ్ళకూ వీళ్ళకూ భేదంలేదు- కనుక పైన తెల్పిన నాల్గువిధములయిన యోగమునువిడిచి ఉపాయాంతరంచేత చిత్తమునుగాని, చిత్తసన్నిహితనుయిన శరీరమును గాని స్థిరపరచ ప్రయత్నించువారు, వృథాప్రయాసకలవారని గట్టిగా అనవచ్చును- వాళ్ళు పొగనుంచి సెగలోకి పోయినట్లు ఇంకా భయ స్థానంలోకి పోయినట్లే- కష్టాలనుండి మరీకష్టాలలో పడినట్లే- పాపుల వలె స్థిరమయిన విశ్రాంతిని పొందరు- భయపడిన లేళ్ళవలె వాళ్ళమతి అతిచంచలమవుతుంది- ఎక్కడా విశ్వాసం చెందదు- విషయాల వెంట పడి యజ్ఞదానతపస్తీర్థదేవార్చనాది భ్రమలతో మారుమారుంగా పోతుంది- మనశ్చింతలతో కాలం వృథా పుచ్చుతూ ఉంటారు- అలాంటివార్లలో కొందరుమాత్రమే దుఃఖదోషదగ్ధులై ఆత్మతత్వాన్ని తెలుసుకుంటారు- కొందరు గుర్తించలేరు- బంతులవలె స్వర్గనరకాలకు ఎగురుతూపడుతూ ఉంటారు- నదిలో తరంగాలవలె ఇటూఅటూ స్వర్గ నరకాలకు తిరుగుతూ ఉంటారు-

కాబట్టి రామా! ఇలాంటి హఠయోగదృష్టిని విడిచి, శుద్ధ మయిన జ్ఞానం సంపాదించి, వీతరాగుడవై విశ్రాంతి చెందు- జ్ఞానియే సుఖి- జ్ఞానియే బ్రతికినవాడు- జ్ఞానియే బలవంతుడు- కనుక జ్ఞాన మయుడవగుము.

## ౯ 3. సమదర్శనము.

రామా! జన్మయెత్తినందుకు కొద్దిగానయినా తత్త్వవిచారం చెయ్యాలి- కొద్దిగానయినా చిత్తనిగ్రహము సంపాదించాలి- హృద యంలో తత్త్వవిచారమనే కణిక ప్రవేశిస్తే అదియెంతకొద్దిదయినా శత శాఖలతో విస్తరిస్తుంది అభ్యాసంక్రమంచేత- అవిచారమే కొంచెము

దృఢపడిన వానికి వైరాగ్యం కలుగుతుంది- దానివెంట శమదమాది గుణములన్నీ సంప్రాప్తమవుతాయి- సమ్యగ్ విచారముగల ప్రాజ్ఞుని (వివేకిని) అవిద్యావిభవములు అంటవు- తత్త్వజ్ఞుని శబ్దాదివిషయాలు ఏంచేస్తాయి? మానసికవృత్తులు ఏంచేస్తాయి? ఆధులేంచేస్తాయి? వ్యాధులేంచేస్తాయి?

ప్రళయకాలమేఘాలను పిల్లలు పిడికెళ్ళతో పట్టలేరు-నభోమధ్యస్థమయిన చంద్రుని ఇందీవరవను (తెల్లకలువయును) శంకతో ఆడుది పట్టలేదు- దోమలు ఏనుగులను బాధించలేవు- లేళ్లు సింహములను చంపలేవు- అజగరములను పిల్లికప్పలు మింగలేవు- అలాగే నాలుగయినను భూమికలను పొందినవివేకిని విషయాలు ఏమీ చెయ్యలేవు. ఇంద్రియాలనే దొంగలు ఏమీచెయ్యలేరు- శబ్దాది విషయములు స్థిరపడని తత్త్వవిచారము కలవానిని హరించగలుగుతాయి- ప్రౌఢమయిన విచారముగలవానిని రాగాదివృత్తులు ఏమీ చేయజాలవు. మేర్వాది శైలములను మందమారుతములు కదల్చలేవు- లేత దశలో ఉన్న విచారశీలుని మాత్రమే మనశ్చింతలు బాధించగలుగుతాయి- నిలుచున్నా, వెళ్లుచున్నా, మేలుకున్నా, పడుకున్నా, మనస్సులో తత్త్వవిచారం లేనివాడు చచ్చినట్లే- కావున రామా! నీవు సత్పురుషులతో కూడ "ఈ ప్రపంచం ఏమిటి? ఈశరీరమేమిటి? అని విచారణ చేయుము- అజ్ఞానాంధకారమును పోగొట్టేది తత్త్వవిచారమనే దీపమే కాని మరొకటికాదుసుమా! సూర్యుడే బాహ్యాచీకట్లను పోగొట్టాలి- తత్త్వజ్ఞానమే సంసారదుఃఖాలను పోగొట్టాలి- జ్ఞానం అభివ్యక్తమయితే జ్ఞేయబుద్ధి నశిస్తుంది- శాస్త్రవిచారముచే బ్రహ్మతత్త్వము సాక్షాత్కారమయితే జ్ఞేయములన్నీ జ్ఞానాభిన్నములవుతాయి- తత్త్వవిచారమువల్ల కలిగే విజ్ఞానమునకే జ్ఞానమనిపేరు- దానిలోపలనే జ్ఞేయము ఉంది- పాలలో మాధుర్యము ఉన్నట్లు. జ్ఞానము కలిగినంతమాత్రముచే అవిద్యాతత్కార్యములతో సంబంధము తొలగును- ఆనందాతిశయము

కలుగును- ఇంకవీడు సంసారపంకంలో [illegible] - ప్రారబ్ధ జీవన్ము
క్తుడు గతాసంగుడై రాజాధిరాజువలె పూర్ణమనోరథుడై ప్రవర్తించు. ఆత్మ
జ్ఞానం కలవాడు వీణావంశధ్వనులందుగాని, సంభోగ[illegible]
కామినీగానములందుగాని, వసంత మదమత్త[illegible]
లందుగాని మేఘగర్జనములందుగాని, [illegible]
వాద్యవిశేషముల యొక్క ధ్వనులందుగాని, [illegible]
వాద్యధ్వనులందుగాని అనురాగం చెందడు. [illegible]
అనురాగం చెందడు. రామచంద్రా! [illegible]
స్పృహణీయములయిన వస్తువులలో దేనియందును అనురాగం చెందడు.
జీవన్ముక్తుడు. నేను వేరొకటి చెప్పపని లేదు.

రమ్యమయిన వస్తువులను చూడడు- సుగంధద్రవ్యాలను ఆఘ్రాణించి దలచడు- మృగేంద్రముల నినాదాలకు క్షోభించడు. [illegible] చాదాలకు చలించడు- అశనిపాతాలకు బెదరడు- [illegible] జంకడు- ఉద్యానవనంలో ఆనందించడు- [illegible] పుష్పశయ్యమీద పడుకున్నా, అంపశయ్యమీద పడుకున్నా అతని భావము సమానంగా నిర్వికారంగా ఉంటుంది- [illegible] సమానములు- ఉత్సవ రణరంగములు సమానములు- ఎందువలనా భయపడడు- ఆనందము లేదు- బరువును దించుకున్నవానివలె విశ్రాంతి సుఖమును అనుభవిస్తూ ఉదాసీనంగా ఉంటాడు- అయోయంత్రాలకు భయపడడు- వశుడు కాడు- దైన్యమునొందడు- స్వస్థమానసుడై కొండవలె సమానంగా స్థిరంగా ఉంటాడు- అపవిత్రపదార్థాన్ని కూడా భుజించగలడు, జీర్ణింప చేసికొనగలడు- అపథ్యవస్తువును, విషముకలిపిన పదార్థమును, గోమయాదులను భుజించి జీర్ణింపచేసికొనగలడు. తెలకుపానకమునూ, నేలవేము కషాయమునూ సమానంగానే చూస్తాడు- వాటిలో తీపి చేదు భేదంలేదు అతనికి- ప్రాణంతీసేవానినీ, ప్రాణంయిచ్చేవానినీ సమానంగా చూస్తాడు-

78)

స్థిరంగాఉండే దేవాది శరీరములందూ అస్థిరములయిన మానవ శరీరములందునూ, సమానమయిన భావమే ఉంటుంది అతడికి-

వీతరాగుడు- విదితవేద్యుడు ప్రపంచస్థితిలో ఆదరశూన్యుడు- కనుక ఇంద్రియములకు విషయములమీద ప్రసరించుటకు అవకాశాన్ని యియ్యడు ఎన్నడూ- తత్త్వము తెలియనివానినీ, చిత్తస్థైర్యములేని వానినీ ఇంద్రియాలులాగి సంసారసముద్రంలో పడవేస్తాయి- విచార శీలునిమాత్రం వికల్పపుంజాలు ఏమీచేయజాలవు- సర్వసంకల్పరహిత మయిన పరమపదంలో విశ్రాంతి చెందినవానికి మేరుపర్వతం గడ్డిపరక మాత్రం- పరిపూర్ణాత్మాకారచిత్తులకు ప్రపంచం ఎండుగడ్డిపరక- విషమూ, అమృతమూ, క్షణమూ, కల్పసహస్రములూ, సమానములు- ముదితబుద్ధులు- (సంతుష్ట చిత్తులు) ప్రపంచమంతా సంవిన్మాత్రమని (చైతన్యమాత్రమని) తలచి లోపల ప్రపంచముగలవారై విహరింతురు. బాహ్యప్రపంచంతో వారికి నిమిత్తంలేదు- ప్రపంచం అంతా సంవిన్మ యమయితే ఇంకాలో హేయోపాదేయములు సున్న అని తత్త్వవేత్తల మతము కనుక రామా! ఇతర భ్రాంతిని విడిచిపెట్టు- దృశ్యమాన ప్రపంచం అంతా సంవిన్మాత్రమని గ్రహించు-

ఆద్యంతములయందులేని యీప్రపంచము మధ్యలో కనిపించి నంత మాత్రంచేత ఉన్నదనుకొనుట భ్రాంతి- ఈభ్రాంతిని విడిచి సంగ రహితంగా ఉండాలి- సంగరహితునకు ఏకర్మా అంటదు- ఏసుఖదుఃఖ ములూ అంటవు. గతసంగుడు కంటితో చూచుచున్నప్పటికీ చూచిన వానిక్రింద లెక్కకురాదు-

ఇది లోకంలో అన్యాసక్తులయిన పిల్లలయెడలకూడ అనుభ వంలో ఉన్నది- కనుక గతసంగునకు ఇంద్రియకార్యము లేవియు అంటవు- ఈపరిస్థితి తాము యింటిలో ఉన్ననూ, మనస్సు ఎక్కడో ఉన్న పామరులకు పిల్లలకుకూడా అనుభవంలోనిదే-

కనుక రామా! అనర్థములకు సంగమే కారణము- సంగమే సంసారమునకు కారణము- సకల ఆశలకు సంగమే కారణము- అన్ని ఆపదలకూ సంగమే కారణము- సంగత్యాగమే మోక్షము- సంగత్యాగమె జన్మరాహిత్యము- నీవుకూడ సంగమును విడిచి జీవన్ముక్తుడవుగ నుండుము-

శ్రీరా॥ మహర్షి! సంగం అంటే ఏమిటో టూకీగా చెప్పండి-

వసి॥ రామా! లేనివస్తువుమీద క్రోధమునూ, ఉన్నవస్తువుమీద సంతోషమునూ, పుట్టించెడి మలినమయిన సంస్కారమే సంగము.

ఈవాసన (సంస్కారము) జీవన్ముక్తులయెడ హర్షామర్షములు లేకుండ శుద్ధంగా ఉంటుంది- ఇలాంటి శుద్ధవాసనను అసంగం అంటారు. శుద్ధవాసనతో చేసెడి పనులు బంధప్రాపకములు కావు.

జీవన్ముక్తులుగాని మూఢులకు మలినవాసన ఉంటుంది- దాని పేరే సంగం అంటారు- దానితో చేసెడి కర్మ బంధమును తప్పక ఇస్తుంది.

కనుక రామా! ఇలాంటి సంగవాసనను విడిచి నిర్వ్యాగ్రంగా ఉంటే ఏమిచేసినా లిప్తుడవు కావు నీవు.

రామచంద్రా! నీవు హర్షామర్షములచే వికారమును చెందుట లేదు. రాగ, భయ, క్రోధములు లేవునీకు- దుఃఖములకు మీాదపడవు- సుఖములకు ఉబ్బవు- ఆశలకు లొంగవు- ఏపనులందు నిమగ్నుడవయినా, సర్వసామ్యమును విడువవు-బ్రహ్మైకరసత్వమును కోలుపోవు- యథాప్రాప్తానువర్తివి- కనుక నీవు అసంగుడవు- స్థిరమయిన జీవన్ముక్తస్థితిని పొంది వీతరాగుడవై ఉండుము- ఇంద్రియనిగ్రహముగల జీవన్ముక్తుడు రాగాదివికారములకు ఏమాత్రము లొంగడు-

రామా! జీవన్ముక్తుడు విక్షేపహేతువయిన భోగపుంజము సమగ్రంఉన్నా సమచిత్తుడుగా ఉంటాడు-యాజ్ఞాదిద్వైన్యమును చూపడు.

